# విశ్వనాథ సాహితీ సమాలోచనం

(ఉపన్యాసవ్యాసమంజరి)

యువభారతి 32వ వార్షికోత్సవం
విశ్వనాథ శతజయంత్యుత్సవం
సందర్భంగా సమర్పించే సాహితీవ్యాసలహరి

సంపాదకులు
ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం
డాక్టర్ బి. జయరాములు




ప్రచురణ :
యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
తిలక్‌రోడ్, హైదరాబాదు - 500 001.

Viswanatha Sahiti Samalochanam- An anthology of literary essays on the works of Kavi Samrat Viswanatha Satyanarayana, on the occasion of his centenary celebrations published by YUVA-BHARATHI, on its 32nd Annual Celebration.

Editors : Prof. G.V. Subrahmanyam and Dr. B. Jayaramulu.



Yuvabharathi Publication No. 160

First Edition : 3rd September, 1995.

Copies : 1000.

Price : Rs. 100

Cover Design : Sri Seela Veerraju

Copies available at :
Yuva Bharathi, Literary & Cultural Organisation,
Andhra Saraswatha Parishath Buildings, Tilak Road,
Hyderabad - 500 001.

Printed at :
Padmavathi Art Printers,
1-1-517/B/1, New Bakaram, Gandhinagar,
Hyderabad - 500 380. Phone : 7611413.

Cover Page Printed at :
Vipla Printers Private Ltd.,
Near Shankar Math, Nallakunta,
Hyderabad - 500 044. Phones : 636242; 667476

జ్ఞానపీఠ పురస్కారగ్రహీత,
పద్మభూషణ్
**డా॥ సి. నారాయణరెడ్డి**

హైదరాబాద్
3.9.95

# అభినందన

విశ్వనాథవారి ప్రతిభావైవిధ్యం అనన్యసాధ్యం. ఆంధ్రసాహిత్య రంగంలో ఎన్నెన్నో ప్రక్రియలను చేపట్టి అత్యంత సమర్థంగా అంచులు ముట్టిన విరాణ్మూర్తి ఆయన.

ప్రపంచ ప్రఖ్యాత నాటకకర్త షేక్స్పియర్ గొప్ప నాటకాలూ, మంచి కవితలూ రాశాడు. మహాకావ్య రచన చేయలేదు. ప్రముఖాంగ్ల మహాకవి మిల్టన్ మహాకావ్యం రచించినా నవలా రచన చేయలేదు. నోబుల్ బహుమతి గ్రహీత, భారతీయ మహారచయిత రవీంద్రనాథ్ టాగూర్ అనేక సాహిత్య ప్రక్రియల్లో రసవద్రచనలు చేశారు - ఒక మహాకావ్యం తప్ప. ఈ దృష్టితో పరిశీలిస్తే విశ్వనాథవారి సాహితీ వ్యక్తిత్వం సర్వంకషం. నవల, కథ, నాటకం, మహాకావ్యం, విమర్శలాంటి వివిధ ప్రక్రియల్లో ఆయన అగ్రస్థాయి కృతులు రచించారు.

విశ్వనాథవారి శతజయంతి సంవత్సర సందర్భంగా యువభారతి ఏడాది పొడుగునా ఏర్పాటు చేసిన సదస్సుల్లో సాహితీవేత్తలు సమర్పించిన ప్రసంగ వ్యాసాల సంకలనం ఈ గ్రంథం. ప్రసంగ వ్యాసాల శీర్షికలను ఎంపిక చేయడంలోనూ సదస్సులను నిర్వహించడంలోనూ యువభారతి ప్రధాన సారథి ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యంగారు అవిశ్రాంత కృషి చేశారు. ఎన్నో విశేషాంశాలను వెలుగులో నిలిపిన ఈ వ్యాసాలు విశ్వనాథ సాహితీ సమాలోచనకు సంబంధించిన సువర్ణ కోశాలు. ఈ వ్యాస సంపుటికి సంపాదకత్వం వహించిన ఆచార్య సుబ్రహ్మణ్యం గారికీ, డా॥ బి. జయరాములుకూ, దీనిని వెలువరించిన 'యువభారతి'కీ నా హార్దికాభినందనలు.

సి.నా.రె.




# యుగకర్తకు యువభారతి నివాళి

కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి శతజయంత్యుత్సవాలను యువభారతి 1994 సెప్టెంబరు 4వ తేదీన ప్రారంభించింది. ప్రతినెలా మొదటి ఆదివారం సాయంకాలం జరిపే 'సమాలోచనం' కార్యక్రమంలో భాగంగా పన్నెండు నెలలపాటు విశ్వనాథ సాహితీ సమాలోచనాన్ని నిర్విఘ్నంగా నిర్వహించింది. ఈనాడు ఆ కార్యక్రమాలలోని ముఖ్యోపన్యాసాలను ఒక గ్రంథంగా ముద్రించి, యువభారతి 32వ వార్షికోత్సవ ప్రచురణగా వెలువరిస్తున్నది. ఇందులో 34 ఉపన్యాస వ్యాసాలు, 14 కవితా నీరాజనాలు సంకలితం చేయటం జరిగింది. విశ్వనాథ శతజయంత్యుత్సవాలను ఆంధ్రప్రదేశ్‌లో మొట్టమొదట మొదలుపెట్టిందీ, అనుకున్న ప్రకారం ప్రతి నెలా నిర్వహించిందీ యువభారతి కావటం మాకెంతో సంతోషంగా ఉంది.

శతజయంతి అనగానే మూడు రకాల కవులు జ్ఞాపకం వస్తారు. 1. నూరేళ్ళలోపలే కాలగర్భంలో కలిసిపోయేవారు, 2. శతజయంతి చేయించుకొని కనుమరుగైపోయేవారు. 3. ప్రతి నూరేళ్ళకు నవనవంగా తమ సాహిత్యాన్ని ప్రజల ఆలోచనల్లో అనుభూతుల్లో ఆవిష్కరిస్తూ అనంతంగా సాగేవారు. వీరిలో విశ్వనాథ మూడో రకానికి చెందుతారు. యువభారతి విశ్వనాథ సాహితిని గురించి 11 సాహితీ సమావేశాలను, రెండు సాహిత్య సదస్సులనూ జరిపింది. అయినా, విశ్వనాథ సాహిత్యంలోని అన్ని అంచులనూ స్పృశించిందని చెప్పలేము. కాని, అపూర్వమైన అంశాల నెన్నింటినో ఈ సమాలోచనంద్వారా ఆవిష్కరించిందని సంతృప్తిపడుతున్నాం. అయితే మరొక అసంతృప్తి కూడా ఉంది. విశ్వనాథ సాహిత్యాన్ని గురించి ఆలోచిస్తున్న, రాస్తున్న, పరిశోధిస్తున్న పెద్దలను, యువతీయువకులను అందరినీ ఈ ఉత్సవాలలో ఆహ్వానించి పాలుపంచుకొనేటట్లు చేయలేకపోయాం. ఈ సాహితీ సమాలోచనను మరో అయిదేళ్ళు ఇలా ఆపకుండా జరిపినా విశ్వనాథ సాహిత్య మహాసాగరాన్ని బుద్ధి బాహువులతో తుదిముట్ట నీదగలుగుతామా - లేదా? అనే అనుమానమే మా అంతరంగాల్లో కొట్టుమిట్టాడుతోంది.

శ్రీశ్రీ అన్నట్లు విశ్వనాథ ధిషణాహంకారంతో తన అభిమానాన్ని, జాతి గౌరవాన్ని, భారతీయ సంస్కృతి మూర్తిమత్వాన్ని తలవంచనీయకుండా

నిలిపిన 'మాటలాడే వెన్నెముక'; మానవుల భౌతిక సమస్యలకు, ఉపరితలంలో భాసించే సాంఘిక సామాజిక, రాజకీయ సమస్యలనే కాకుండా అంతరంగ, ఆధ్యాత్మిక సమస్యలను సైతం తన రచనల్లో ప్రతిఫలింపజేసి మన జాతి జీవితాన్ని "పాటపాడే సుమమ్ము." బ్రదుకు గోదావరిలా విశ్వనాథ రచనల్లో పొంగులువారుతుంది; కృష్ణమ్మలా కళా వీచికలను వెలారుస్తుంది; కొండవీటి మబ్బుల్లా జననాంతర సౌహృదాలను జాగృతం చేస్తుంది; 'తెలుగువాళ్ళ గోల్డ్ నిబ్బు'లా పట్టింది బంగారం చేస్తుంది; దేశీయతను బంగారుపంటగా సాహితీ క్షేత్రంలో పండిస్తుంది. విశ్వనాథ నిజంగా 'తెలుగువాడి ఆస్తి!' ఇరవయ్యో శతాబ్దంలో తెలుగునాట జీవించిన మనజాతి జీవన చైతన్యాన్ని ఏ పాక్షిక దృక్కోణాలతోగాని, ఏ ఇజం రంగద్దాలతోగాని చూడకుండా మానవనైజమే ప్రమాణంగా సమీక్షించిన సాహిత్యం విశ్వనాథది. భావి చరిత్రకారులకు వాస్తవ జీవిత చిత్రణలో సజీవ సాక్ష్యంగా నిలిచే సామగ్రి సమస్తం విశ్వనాథ సాహితి. అది నిజంగా తెలుగువారికి దక్కిన అక్షరమైన, అక్షయమైన, అమరమైన ఆస్తి. అనుమానం లేదు అది, 'అనవరతం తెలుగు ప్రకాస్తి!'

కొందరి సాహిత్యం జాతి శరీరానికి దుస్తులు కావచ్చు; మరి కొందరిది తోలు కావచ్చు; ఇంకొంతమందిది రక్తమాంసాలు కావచ్చు; మరికొంతమందిది హృదయ స్పందన కావచ్చు; కొద్దిమందిది జాతి ఆలోచనా తరంగాలు కావచ్చు; మరికొద్ది మందిది జాతి ఆత్మ చైతన్యం కావచ్చు; దార్శనిక శక్తి కావచ్చు. ఇవన్నీ కలిపి మనకు సాక్షాత్కారం చేయగలిగిన సాహిత్య విశ్వరూపం ఒక తరంలో ఏ ఒక్కరిద్దరి రచనలలో మాత్రమే సాధ్యమౌతుంది. అలాంటి విశ్వ రూపం ప్రదర్శించిన వారు కవి సమ్రాట్ శ్రీ విశ్వనాథ. అయన దేశం పట్టని కవి అన్నా, విశ్వమంతా వ్యాపించిన కవి అన్నా పరమార్థం అదే.

విశ్వనాథవారి సిద్ధాంతాలు అన్నీ అందరికీ నచ్చకపోవచ్చు. అందరికీ నచ్చే సిద్ధాంతాలు అన్నికాలాలలో ఉండటం కూడా అసాధ్యమే. అయితే, ఆయన రచనలోని మానవ స్పందనను కాదనేవారుండరు, ఆయన నిర్మాణ కౌశల్యాన్ని మెచ్చుకోని వారుండరు; ఆయన ఈ శతాబ్దం కడుపారకన్న "జీనియస్" అని ఒప్పుకోనివారుండరు.

విశ్వనాథ ఎంతమంది పాఠకులను సృష్టించుకొన్నాడో, ఎంతమంది అభి మానులను ఆకర్షించుకున్నాడో, అంతమంది వ్యతిరేకులను కూడా కల్పించు కున్నాడు. విశ్వనాథ వ్యతిరేకులలో కొందరు జాతీయవాదాన్ని, జాత్యభిమానాన్ని అంతగా గౌరవించేవారు కారు. వారు భారతీయులు కారనికాదు. కాని, విశ్వనాథ వారిని హిందూధర్మ పునరుద్ధరణ వాదిగా, అన్యమతాలను ధర్మాలను తిరస్కరించే వానిగా, ప్రగతిభావ వ్యతిరేకిగా భావించి, ఆయననుగురించి వ్యతిరేక ప్రచారం

చేసేవారు. వారందరికీ-వేయిపడగలను'సహస్రఫణ్' పేర హిందీలోకి అనువదించిన నేటి మన భారత ప్రధాని మాన్య శ్రీ పి. వి నరసింహారావుగారన్నమాటలు నిజంగా కరదీపికలు కాగలవు—

"శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు ప్రగతికి వ్యతిరేకులు కారు. ప్రాచీన సంస్కృతి మీద వారికి గల శ్రద్ధ అంధశ్రద్ధ కాదు. వారు సంప్రదాయ బద్ధులైన పిడివాదులు కారు. ఓర్వలేనివారు కారు. అక్కడక్కడ ధర్మారావు సంభాషణల్లో వితండవాదం గోచరిస్తుంది. అయితే, దానికి కారణం ఉంది. ప్రతిపక్షాలవారు చేస్తున్న తీవ్రమైన ఆరోపణలకు, ఆక్రమణలకు సమాధానంగా శ్రీ విశ్వనాథ అంతటి వితండవాదాలు చేయించారు. స్వధర్మ రక్షణకు అవి ఉద్దేశింపబడ్డాయి. స్వయంగా దురాక్రమణలు కావించాలనే ఉద్దేశ్యం కొంచెమైనా వారికి లేదు. సహస్రఫణ్ (వేయిపడగలు)లో అనేకచోట్ల ఈ విషయం మనకు గోచరిస్తుంది."

ఒక్క సహస్రఫణ్‌లోనేకాదు-విశ్వనాథ సాహిత్యమంతటా ఇటువంటి చైతన్యానికి తిరుగులేని విజయపతాకలు రెపరెపలాడుతూ ఎగురుతూ ఉంటాయి.

విశ్వనాథవారు తమ జీవితకాలంలో ఎన్నో సంఘర్షణలను ఎదుర్కొన్న సాహిత్యధర్మవీరులు. ఘర్షణలోనుండి పుట్టిన అరణి అగ్నివంటివాడు. అందువల్లనే ఆయన సాహిత్యం ఒక ఆదునిక మహాసత్రయాగం. ''నిజానికి శిల్పము గాని, సాహిత్యముగాని జాతీయమై యుండవలెను. విజాతీయమై యుండరాదు" అన్నది ఆయన ఉద్యమానికి మానిఫెస్టో. ఈ ఉద్యమం మూడుదశల్లో సాగింది.

మొదటి దశ - వీరేశలింగం పంతులుగారు విదేశీయ ప్రక్రియలనే వంగడాలను తెచ్చి తెలుగునేలలో నాటిన నవ్యసాహిత్య చైతన్యం ప్రభవించిన కాలం. పాశ్చాత్య సాహిత్యాలలోని ఎపిక్, లిరిక్, ట్రాజెడీ, నావెల్ అనే ప్రక్రియలు భారతీయ సాహిత్య ప్రక్రియలపై రాజ్యం చేసిన రోజులవి. వాటి మూలాలు పాశ్చాత్య సాహిత్యాలలో ఉండేవి. తెలుగు సాహిత్యం ఆలోచనలోనూ, అనుభూతిలోనూ, ప్రయోగాలలోనూ, ప్రమాణాలలోనూ పాశ్చాత్య సిద్ధాంతాలనే ఆదర్శంగా తీసికొన్న కాలమది. ఆ చైతన్యాన్ని కట్టమంచి, రాళ్ళపల్లి, దువ్వూరి మొదలైన వారు విమర్శలో కూడా ప్రవేశపెట్టారు. భావకవులు కవితారంగంలో లాస్యం చేయించారు. విశ్వనాథవారు ఈ చైతన్యాన్ని ప్రతిఘటించారు. భారతీయ సాహిత్య సిద్ధాంతాలకూ, ప్రయోగాలకూ, ప్రమాణాలకూ పాశ్చాత్యులను లక్ష్యంగా తీసికోవటాన్ని కాదన్నారు. పాశ్చాత్య ప్రక్రియలసారంతో భారతీయ ప్రక్రియను పునర్వ్యవస్థీకరించుకొనే ప్రతిభను దేశీయంగా జాతీయంగా వినిర్మించుకొనే విశిష్టపంథాకు వారు మార్గదర్శకులయ్యారు.

రెండవదశ: ప్రపంచంలో వెలువడిన వివిధ భావజాలాలకు సంబంధించిన సిద్ధాంతాలను కొందరు భారతదేశంలో ప్రచారం చేసి, వాటి ప్రాముఖ్యాన్ని, ప్రాశస్త్యాన్ని భావిస్తూ ఆచరణలో పెట్టటానికి యత్నించారు. పాశ్చాత్య సిద్ధాంతాలను యథాతథంగా భారతీయ జీవితానికి సాహిత్యానికి వర్తింపచేసే పిడివాదానికి విశ్వనాథ వ్యతిరేకి. పాశ్చాత్య సిద్ధాంతాలను భారతీయం చేయాలని ఆయన వాదించారు. మార్క్సిజంకూడా భారతీయం కావాలని ఆకాంక్షించారు. కమ్యూనిజం + మతం + దేవుడు అనేది భారతీయమైన లేదా దేశీయమైన మార్క్సిజమని ఆయన వాదన. ఇది ఉపనిషత్తుల కాలం నుండి ఈ నేలమీద ఆలోచనలో, ఆచరణలో యోగ్యమైన జీవన ధర్మంగా పాటింపబడుతుండేదని నిరూపించారు. గాంధీయిజాన్ని అనుసరించే ఆధునిక భారతీయ తత్త్వ చింతనాపరుల్లో ఈ చైతన్యం పునరుద్ధరింపబడిందని తమ రచనల్లో ప్రపంచించారు.

మూడవదశ : కాల్పనిక కవితాయుగ చైతన్యం నుండి విడివడి నవ్య సంప్రదాయోద్యమం సాగించిన దశ. భావకవిత్వ కాలం నుండి తెలుగు సాహిత్యంలో రెండు రకాల భావజాలాల సంఘర్షణ బలంగా సాగుతూ ఉండేది. అవి - 1. గతంతో విచ్ఛిత్తి (Break with the past), 2 అవిచ్ఛిన్నత (Continuity with the past or confirmity with tradition). Tradition అనే మాటకు తెలుగు రూపం సంప్రదాయమని అంటున్నాం. ఇది టి. యస్. ఎలియట్ సంప్రదాయ భావానికి దగ్గరిది. విశ్వనాథవారి సంప్రదాయం ఎంత అర్షంగా కనపడుతుందో అంత ఆధునికంగా కనపడుతుంది. ఎందువల్లనంటే, ఇంగ్లీషు సాహిత్యంలో ఆధునిక యుగ వైతాళికుడైన టి.యస్. ఎలియట్ భారతీయ ఉపనిషన్మతాన్ని ప్రపంచ శాంతి సూత్రంగా అంగీకరించాడు. అందువల్లనే విశ్వనాథను తెలుగు ఎలియట్ అంటాం - ఎలియట్‌ను ఇంగ్లీషు విశ్వనాథ అని పిలుస్తాం. విశ్వనాథ ఎలియట్ తరువాత వెలువడిన ఆధునిక చైతన్యానికి ప్రతినిధి. దీనిని సంగ్రహంగా చెప్పాలంటే - ప్రపంచాన్నుంచి మనం ఏం తెచ్చుకున్నామో ప్రదర్శించేవి భావకవితాయుగం, అభ్యుదయకవితాయుగం, దాని అనుబంధ చైతన్యాలు. ప్రపంచానికి మన మిచ్చినదేమిటో చెప్పేది, లేదా ప్రపంచాన్ని మనలో కలుపుకున్న దేమిటో చెప్పేది - విశ్వనాథాదుల నవ్యసంప్రదాయోద్యమం-తదనుబంధ సాహిత్య చైతన్యాలు. విశ్వనాథ ఎలియట్‌ను 'మహర్షి' అని పిలిచారు. విశ్వనాథ ఇరవయ్యో శతాబ్దపు 'సాహిత్య మహర్షి.'

విశ్వనాథ ఎదుర్కొన్న మరికొన్ని సంఘర్షణలు ఉన్నాయి. అంతర్జాతీయ వాదానికీ, జాతీయ దృక్పథానికీ ఏర్పడినవి వాటిలో మొదట పేర్కొనదగినవి. ఇందులో దేశభక్తికి, స్వాతంత్ర్యోద్యమానికీ, దేశసమైక్యతకూ సంబంధించిన వాదాన్ని విశ్వనాథ బలపరిచారు. అలాగే-బ్రిటిషు వలసవిధానంలోని దమనవిధానాన్ని ఆయన గర్హించారు. ఇంగ్లీషు చదువులవలన, నాగరకతవలన, దేశీయమైన విలువలు ఎలా నాశనమౌతున్నాయో ఎలుగెత్తి చాటారు. వివాహం, కుటుంబవ్యవస్థ, ప్రకృత్యారాధనం మొదలైనవాటి దృక్పథాలలో జరుగుతున్న పరిణామాల్లో ఏర్పడుతున్న విలువల సంక్షోభం (Value crisis)నీ, శూన్యత (Vacume)ను తమ రచనల ద్వారా జాతికి ఎత్తి చూపించారు. గ్రామీణ జీవితంలోని మానవ సంబంధాలను మహనీయంగా చిత్రించారు. వివిధ వాదాలమీద తన ప్రతిస్పందనను చిత్తశుద్ధితో రికార్డు చేశారు. తాను నివసించిన కాలంలో ఉన్న ప్రపంచ విజ్ఞాన జీవనదిని తెలుగు పొలాలకు పంట కాల్వలుగా పారించిన మహా కృషీవలుడు విశ్వనాథ.

విశ్వనాథ ప్రక్రియకు తగిన అభివ్యక్తినీ, రసభావాలకుఉచితమైనశైలినీ, వ్యావహారికభాషకు బదులు వ్యావహారికతనూ, కావ్యంవలన సామాజికుడు పొందగలిగే సమగ్రానుభవస్ఫూర్తినీ, వెలుగుజిలుగులను మేళవించుకొనే శిల్పకళా రచననూ తెలుగు సాహిత్యానికి ప్రసాదించి కవిసమ్రాట్టు అనిపించుకున్నారు.

తెలుగులో మార్క్సిస్టు విమర్శగాని, మనోవిశ్లేషణాత్మక విమర్శగాని, తదితర విమర్శశాఖలుగాని వెలుగుతో సమగ్రాభివ్యక్తికి నోచుకోలేదని అందరు అంగీకరించిన విషయమే. తెలుగులో నిండుగా నిర్వహింపబడింది నవ్యసంప్రదాయ విమర్శ. విశ్వనాథ ఆ ఉద్యమ చైతన్యానికి నాయకుడు.

నవ్యసంప్రదాయాన్ని గురించి ఒక చిన్న గ్రంథం వెలువడితే బాగుంటుందని సాహితీవేత్తలు చాల రోజులుగా అనుకుంటున్నారు-అవగాహనకు అనువుగా ఉండే పరిమాణంలో. ఆ కొరత నేటి 'విశ్వనాథ నవ్యసంప్రదాయం' గ్రంథం తీరుస్తోంది. దానిని విశ్వనాథ శతజయంతి సమాపనోత్సవంలో ఆవిష్కరిస్తున్నందుకు యువభారతి ఎంతో సంతోషపడుతున్నది.

యువభారతి ప్రచురిస్తున్న 'విశ్వనాథ సాహితీ సమాలోచనం' ఒక యుగపురుషునికి అర్పిస్తున్న సాహితీ నీరాజనం; 'మహతి' తరువాత మరొక మైలురాయిగా పరిగణింపబడే గ్రంథం కాగలదని యువభారతి భావిస్తున్నది.

"చుట్టూరా ఆవరించుకున్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవటంకంటే ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నైనా వెలిగించటం మంచిది" - అనే లక్ష్యంతో

యువభారతి స్వార్థ కాలుష్యాలకు అతీతంగా ఉండగలిగే విశ్వజనీనమైన సాహిత్య స్పృహను సమాజంలో జాగృతం చేసి, తెలుగు సాహిత్యాభిమానాన్ని ఇంటింటా జ్యోతిలా వెలిగించాలనే ప్రయత్నంలో ముప్పై రెండేళ్ళుగా ఉద్యమాన్ని సాగిస్తోంది. ఆలోచనలకు అక్షరాకృతులు యువభారతి ప్రచురణలని లోకంలో మంచిపేరు తెచ్చుకున్నది. ఆ చైతన్యలహరిలో 'విశ్వనాథ సాహితీ సమాలోచనం' మరొక శక్తిమంతమైన తరంగం కాగలదని యువభారతి ఆశిస్తున్నది.

విశ్వనాథ సాహితీ సమాలోచన సభలను దిగ్విజయం చేసిన సాహితీ మూర్తులకు, స్పాన్సర్ చేసి ఆర్థికంగా హార్దికంగా ఆదుకున్న వదాన్యులకు, ఈ గ్రంథానికి వ్యాసాలు సమర్పించి సహకరించిన విద్వాంసులకు, కవితా నీరాజనాలను అందించిన కవివరేణ్యులకు అభిమానంతో అభినందన లందజేసిన జ్ఞానపీఠ పురస్కార గ్రహీత డాక్టర్ సి. నారాయణరెడ్డి గారికి, యువభారతి కార్యక్రమాలను ప్రోత్సహిస్తున్న సహృదయ లోకానికి, పత్రికలకు, ప్రచారమాధ్యమాలకూ మా కృతజ్ఞతలు.

ఈ గ్రంథానికి ముఖచిత్ర రచయితలు శ్రీ శీలా వీర్రాజుగారికి, ముద్రాపకులు శ్రీ పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్, విప్లాప్రింటర్స్ వారికి, ఈ గ్రంథానికి చివరిపేజీపై ప్రకటన ఇచ్చిన శ్రీ బి. సి హెచ్. వి. సుబ్బారావు బి.ఇ, (చైర్మన్ & మేనేజింగ్ డైరెక్టర్, అశ్విని హోమియో & ఆయుర్వేదిక్ ప్రొడక్ట్సు లిమిటెడ్, మూసాపేట్, హైదరాబాదు-18) గారికి, గ్రంథంలో ప్రకటనలిచ్చిన వదాన్యులకూ మా ధన్యవాదాలు.

కార్యక్రమాల్లో పాల్గొన్న వక్తల ఉపన్యాసాలన్నింటినీ సేకరించటానికి చివరిక్షణంవరకూ ప్రయత్నించాం. అయినా, రెండుమూడు ఉపన్యాసవ్యాసాలు సకాలంలో అందకపోవటంచేత ఈ గ్రంథంలో చేర్చలేకపోతున్నాం. ఇందుకు యువభారతిని మన్నించాలని సహృదయలోకాన్ని ప్రార్థిస్తున్నాం. ఈ గ్రంథానికి ప్రచురణపూర్వ విరాళాలిచ్చి ప్రోత్సహించిన సాహితీ బంధువులకు కృతజ్ఞతలు. యువభారతికి సదా తమ అండదండలు, ఆశీస్సులు అందించాలని ఆంధ్రావళిని అర్థిస్తూ—

హైదరాబాదు,
3.9.1995.

జి. వి. సుబ్రహ్మణ్యం
యువభారతి అధ్యక్షుడు.

# కృతజ్ఞతలు

యువభారతి కార్యక్రమాలను స్పాన్సర్ చేసిన ఈ క్రింది వదాన్యులకు మా కృతజ్ఞతాభివందనాలు.

1. 1994 సెప్టెంబరు 4 వ తేదీన జరిగిన విశ్వనాథ సాహితీ సమాలోచనం ప్రారంభోత్సవానికి స్పాన్సర్ దాతలు - శ్రీ పి. వెంకటేశ్వర్లుగారు, మేనేజింగ్ డైరెక్టర్, కాకతీయ సిమెంట్స్ లిమిటెడ్, 1-10-140/1, గురుకృప, అశోక్‌నగర్, హైదరాబాదు.

2. 1994 అక్టోబరు 2 వ తేదీన జరిగిన రెండవ సమావేశానికి స్పాన్సరర్స్ : 1. Bhooratnam & Co., Engineers and Contractors, 7-3-719, రాష్ట్రపతిరోడ్, సికిందరాబాదు - 500 003; 2. DAWN Printers and Publishers (P) Ltd., 4-1-882/33 (సెల్లార్) రెడ్డి కాంప్లెక్స్, తిలక్‌రోడ్, హైదరాబాదు-1.

3. 1994 నవంబరు 6 వ తేదీన జరిగిన మూడవ సమావేశం స్పాన్సరర్— శ్రీ జి. పుల్లారెడ్డిగారు స్వచ్ఛమైన నేతి మిఠాయిలు, స్టేషన్‌రోడ్, హైదరాబాదు - 500 001.

4. 1994 డిసెంబరు 4 వ తేదీనాటి నాల్గవ సమావేశం స్పాన్సరర్— శ్రీ బి. సి. హెచ్ వి. సుబ్బారావుగారు బి.ఇ., ఛైర్మన్ & మేనేజింగ్ డైరెక్టర్, అశ్విని హోమియో & ఆయుర్వేదిక్ ప్రోడక్ట్స్ లిమిటెడ్, మూసాపేట, హైదరాబాదు-18.

5. 1995 జనవరి 1 వ తేదీనాటి అయిదవ సమావేశానికి స్పాన్సరర్— వాస్తుశిల్పి శ్రీ బి.ఎన్. రెడ్డిగారు, M/s Virgo Constructions, Lakdikapool, Hyderabad - 4.

6. 1995 ఫిబ్రవరి 5 వ తేదీనాటి ఆరవ సమావేశానికి స్పాన్సరర్స్— 1. Sri M. Venkateswara Rao, Railway Contractor, Plot

No 301, Gouthamnagar, Malkajgiri, Hyderabad - 500047, 2. Sri K. Narasimha Rao, Managing Partner, M/s K. Narasimha Rao & Co , Railway Contractors 12-5-52/1, South Lallaguda, Secunderabad-500017.

7. 1995 మార్చి 5 వ తేదీనాటి సప్తమ సమావేశానికి స్పాన్సరర్స్— 1. Sri K. Sager Rao, Railway Contractors, 6-3-890, Flat No. 203, Hill Apartments, Somajiguda, Hyderabad - 500 482 2 Sri P Narasimha Rao, Railway Contractors, Flat No 401/A, 1-8-725/A/1/A, Balaji Bhagyanagar Apartments, Nallakunta Hyderabad 44

8. 1995 ఏప్రిల్ 2వ తేదీన జరిగిన ఎనిమిదవ సమావేశం స్పాన్సరర్స్- (1) Sri S Chandraiah, Railway Cnntractor, 12-13-1161, Street No. 11, Tarnaka, Secunderabad - 500017. (2) Sri V. Narsimha, Railway Contractor, Veeraiah Palli, Mahboobnagar.

9. 1995 మే 7వ తేదీన తొమ్మిదవ సమావేశం స్పాన్సరర్ - శ్రీ K. Madhava Rao, Managing Director, M/s Madhava Hyte-ch Engineers Pvt., Ltd , 12-13-245, Street No. 15, Tarnaka, Secunderabad - 500017.

10 1995 జూన్ 4 వ తేదీన పదవ సమావేశం స్పాన్సరర్స్ - 1) M/s KOVEN Building Construction Private Ltd , N - 1/A, Kakateeya Nagar, Jamai Osmania Post, Hyderabad - 500007. 2) Sri N. Venkateswara Rao, Managing Partner, M/s Sri Harsha Constructions, Engineer & Contractors, 3-10-51/C, Gokhale Nagar, Ramanthapur, Hyderabad - 500013.

11. 1995 జూలై 2వ తేదీ పదకొండవ సమావేశం స్పాన్సరర్స్ - 1) Sri Ungarala Venkata Narayana, Managing Partner, Soham Software Services (P) Ltd., 1-2-593/21, Gaganmahal Colony, Hyderabad - 500029; 2) R.R. Hi-Tech Engineering (P) Ltd., Railway Contractors, 20-30/10, M.E S Colony, Venkatapuram, Secunderabad

12. 1995 ఆగస్టు 6 వ తేదీ 12 వ సమావేశం స్పాన్సరర్స్ - 1) Sri J. Bhaskara Rao, Railway Contractor, 6-3-456/22, Dwarakapuri Colony, Hyderabad - 500482. 2) Sri K. Ranga Rao, Railway contractor, 2-5-32/16, Vijayapuri, South Lalaguda, Secunderabad - 500017.

13. 1995 సెప్టెంబరు 3 వ తేదీన జరిగిన యువభారతి 32 వ వార్షిక సమావేశం, 'విశ్వనాథ సాహితీ సమాలోచనం' గ్రంథావిష్కరణోత్సవం స్పాన్సరర్, శ్రీ పి. యస్. మూర్తిగారు, మేనేజింగ్ డైరెక్టర్, మెసర్స్ అలైడ్ అగ్రో కన్సల్టెన్స్ ప్రైవేట్ లిమిటెడ్, A 53, Steels and Mines Complex, Srinagar Colony Hyderabad.

14. 1995 జనవరి 4 వ తేదీన - 'మహాశిల్పి జక్కన' పద్యకావ్యావిష్కరణోత్సవ సభకు స్పాన్సరర్ - Srivani Academic and Industrial Services, 1-8-702/105, Nallakunta, Hyderabad-500044.

15. 1995 జనవరి 8 వ తేదీ 'ప్రశ్నార్థకాలు' - కావ్యావిష్కరణ సభ స్పాన్సరర్ - XEDD TELECOM Ltd, 2-2-135/11 Pan Bazar, Secunderbad-500003.

16. 1995 మార్చి 15 వ తేదీ - 'పాలసముద్రం' నవల ఆవిష్కరణ సభ స్పాన్సరర్స్ - జె.బి. ఆర్ట్స్ ఫిల్మ్స్ & షేక్ అబ్దుల్ రహిమాన్ మెమోరియల్ ట్రస్ట్, హైదరాబాదు-500138.

17. 1995 మార్చి 25 వ తేదీ - 'శ్రీకృష్ణుడు - జ్ఞానసారథి' గ్రంథావిష్కరణోత్సవం స్పాన్సరర్-శ్రీ పి. యస్. మూర్తిగారు, మేనేజింగ్ డైరెక్టర్, మెసర్స్ అలైడ్ అగ్రో కన్సల్టెన్స్ ప్రైవేట్ లిమిటెడ్. A. 53, Steels and Mines Complex, Srinagar Colony. Hyderabad.

18. 1995 ఆగస్టు 17 వ తేదీ - 'రావిశాస్త్రి ధర్మేతిహాసం' గ్రంథావిష్కరణ సభ స్పాన్సరర్ - విప్ల ప్రింటర్స్, శంకరమఠం దగ్గర, నల్లకుంట, హైదరాబాదు - 44.

19. 1995 ఆగస్టు 27 వ తేదీ - 'కాలమానమ్' గ్రంథావిష్కరణ సభ స్పాన్సరర్-శ్రీ ఎస్. కొండల్‌రావుగారు, ఛైర్మన్, LAMCO Group, B-39, Industrial Estate, Sanathnagar, Hyderabad. 500018

కృతజ్ఞతలతో

**యువభారతి**

# ఉపన్యాస వ్యాసతరంగాలు....

## కవితా నీరాజనాలు :

# విశ్వనాథ – మానవత

—శ్రీ విశ్వనాథ పావనిశాస్త్రి

మనువు సంతతివాడు మానవుడు. వాడి లక్షణం మానవత. ఆ లక్షణం ధర్మమార్గాన నడవాలి. అలా నడవనినాడు వాడు మానవుడు కాడు. మానవ ప్రముఖం, పరమోత్తమమైన మానవ లక్షణం కృతజ్ఞత. ఆ గుణం లోపించినవాడు మానవుడు కాడు, వాడొక మూలద్రైత్యుడు. నేనెవడినైనా భరిస్తాను గాని, కృతఘ్నుణ్ణి మాత్రం భరించలేను అంటుందిట భూదేవి - ఈ మాటలు ఎప్పుడూ చెప్పేవారు మా నాయనగారైన విశ్వనాథ సత్యనారాయణగారు. ఆ మహానుభావుడి కొడుకునై పుట్టడం నా జన్మజన్మల తపః ఫలితం.

విశ్వనాథ వారి స్వస్థలం కృష్ణాజిల్లా నందమూరు గ్రామం. ఇది బెజవాడ, గుడివాడ రైల్వే లైనులో ఇందుపల్లి స్టేషను నుంచి రెండు మైళ్ళదూరం. అక్కడ మాది ఎనభై ఎకరాల సుక్షేత్రమైన మాగాణి. మా తాతగారైన శోభనాద్రిగారి నిత్య దాతృతా మహాగుణం చేత మా నాయనగారికి పదహారు పదిహేడేళ్ళ వయస్సు వచ్చేసరికే అదంతా హరించుకుపోయింది. అంటే దరిదాపు 1910 - 1912 ప్రాంతాలకన్నమాట అప్పటినుంచి 1950 - 1952 ల దాకా మా నాన్నగారు ఆర్థికంగా నిలదొక్కుకోలేకపోయినారు. మొదటిరోజుల్లో చదువు సాగాలి. తరువాతి రోజుల్లో జీవితం సాగాలి. పెద్ద సంసారం. సంసారంలో ఎప్పుడూ ఏదో ఒక ఆపద. ఆ పరమ గడ్డు రోజుల్లో కొల్లిపర సూరయ్య చౌదరిగారు, బెల్లంకొండ రాఘవరావు గారు మొదలైన మిత్రులు నిత్యం సాయపడుతూనే ఉండేవారు. విశ్వనాథ సత్యనారాయణగారి చదువుకోసం ఆ రోజుల్లో కొల్లిపర సూరయ్య చౌదరిగారు ఎట్లా సాయం చేశారన్నది వేయిపడగలులోని "సూర్యపతి" - 'ధర్మారావు' చదువుకి చేసిన సాయం చూస్తే కొంత తెలుస్తుంది.

మా నాన్నగారికి జ్ఞానపీఠ బహుమతి వచ్చిన రోజుల్లో ఒకసారి కొల్లిపర సూరయ్యగారి అమ్మాయి ఒకామె మా యింటికి వచ్చి మా నాయనగారితో, ''పెదనాన్నగారూ, అనుకోకుండా ఒక యిబ్బంది వచ్చింది. సాటి వాళ్ళల్లో అడగటానికి అభిమానంగా ఉంది మీరేమి అనుకోకుండా ఉంటే నాకొక ఎనిమిది వేలు (ఆరో, ఎనిమిదో స్పష్టంగా గుర్తులేదు.) అప్పుగా యిప్పిస్తే కృతజ్ఞురాలిని. నా పేర ఉన్న పొలం తాకట్టు పెడతాను'' అంది. ఆ మాటలకి మా నాన్నగారు ముక్కుమీద వేలు వేసుకుని, కళ్ళ నీళ్ళు తిరుగుతూండగా, ''అమ్మా! పొలం నాకు తాకట్టు పెడతావా? నేను నీకు అప్పు యివ్వాలా? అనాడు మీ నాన్న చేసిన సహాయానికి నేనివ్వాళ ఎంత తిరిగి చేస్తే నా ఋణం తీరుతుంది? ఆ కఱువు రోజుల్లో కొల్లిపర సూరయ్యే లేకపోతే, యివ్వాళ విశ్వనాథ సత్యనారాయణ లేడమ్మా! నాకు స్వాహా, పావ (ఈ యిద్దరూ మా అక్కగార్లు - సుమారుగా సూరయ్యగారి అమ్మాయి వయస్సు వాళ్ళు. మా అందర్లో ఆఖరుది మా చెల్లెలు దుర్గ.) ఎల్లాంటివాళ్ళో నువ్వూ అలాంటిదానివికాదా?'' అని, ఆమె అడిగిన డబ్బు తెప్పించి యిచ్చారు.

ఒకసారి సూరయ్యగారూ, మా నాన్నగారూ మాట్లాడుకుంటున్నారు. సూరయ్యగారు ''మీరు మీరు" అని సంబోధిస్తూ మాట్లాడుతున్నారు. మా నాన్నగారు కాస్సేపు ''మీరు'' అని, కాస్సేపు "నువ్వు" అని సంబోధిస్తూ మాట్లాడుతున్నారు. వింటున్న నాకు ఆశ్చర్యం వేసింది. సూరయ్యగారు వెళ్ళిన తరవాత నేను మా నాన్నగారిని అడిగాను, "ఆదేమిటి నాన్నా! ఆయనా, నువ్వూ బాల్య స్నేహితులు కదా? చిన్నతనంలో ఏరా అని, ఏమోయి అని మాట్లాడుకోలేదా?" అని. "ఎందుకు మాట్లాడుకోలేదు? మాట్లాడుకున్నాం'' అన్నారు. నేను, "మరి యిప్పుడు యిదేమిటి- ఆయనేమో 'మీరు మీరు' అంటూ; నువ్వేమో కాసేపు 'నువ్వు' అంటూ, కాస్సేపు 'మీరు' అంటూ యిలా మాట్లాడుకుంటున్నారు?" అని అడిగాను. దానికి మా నాయనగారు విచిత్రంగా చూస్తూ, "ఏం చెప్పను? నా ఖర్మ! నేను రామాయణ కల్పవృక్షం ప్రారంభించిన రోజుల్లో, ఒక రోజున హఠాత్తుగా అతను ఈ 'మీరు, మీరు' అని సంబోధన మొదలుపెట్టాడు. మొదట నేను గమనించలేదు. తరువాత 'యిదేమిటయ్యా ఈ కొత్త సంబోధన?' అని అడిగితే, 'మీరు మహాకవులు. మహా కావ్య రచనకి పుట్టినవారు. అట్లాంటివారిని ఏదో చిన్నతనంలో స్నేహితులం కదా అని ఏకవచనంగా పిలవడం దోషంగా

కనబడుతోంది నాకు' అన్నాడు నేనేం చెయ్యను? 'అట్లా అయితే నేను కూడా నిన్ను 'మీరు' అనే పిలవాల్సివస్తుంది జాగ్రత్త!' అన్నాను. అతనేమీ మాట్లాడ లేదు. ఆనాటి నుంచి అతను అలా పిలుస్తూనే ఉన్నాడు. నేనేమో యిలా అవస్థ పడలేక చస్తూనే ఉన్నాను" అని ముగించాడు. అనాడు నాకనిపించింది-వీళ్ళెవరూ స్వతహాగా మానవులు కారు, మానవతా గుణాలను పునఃస్థాపించడానికి ఏవో దివ్యలోకాల్లోంచి దిగివచ్చినవాళ్ళు - అని.

1969 లో నా వివాహానికి మా నాన్నగారు కవి సమ్మేళనం ఏర్పాటు చేశారు. దానికి విచ్చేసిన దివాకర్ల వేంకటావధానిగారు చెప్పిన ఒక విషయం - దివాకర్ల వేంకటావధానిగారూ, వారి సోదరులైన రామమూర్తిగారూ విశ్వనాథ వారి శిష్యులు. వారి చిన్నతనంలో ఒకసారి పరీక్షలు నాలుగురోజులున్నాయనగా ఆ సోదరుల యిరువురి "హాల్‌టిక్కెట్లు" రాలేదట కారణం ఆ యిరువురి ఫీజుల్లో ఎనభై రూపాయలు కాలేజీకి బాకీ. ఆ విషయం వారు గురువుగారితో దీనంగా మనవి చేసుకుంటే, ఆయన ఆ బాకీ డబ్బుకట్టి వారి హాల్‌టిక్కెట్లు తెప్పించారట. ఆ రోజుల్లో విశ్వనాథవారి జీతం తొంభై రూపాయలట - ఇటువంటి శిష్యులు విశ్వనాథ వారికెందరో! వారి యింట్లో ఉండి, భోజనాలు చేసి, జీతాలు కట్టించు కుని, చదువుకున్న వాళ్ళు!!

బీర్నీడు ప్రసన్న అని వినుకొండ ప్రాంతంలో ఒక హరిజన కవి ఉండే వాడు. ఆయన 1967 ప్రాంతాల్లో "పృథ్వీ భాగవతము" అని ఒక కావ్యం వ్రాసి, ఆ వ్రాతప్రతి తీసుకుని మా నాయనగారి దగ్గరకొచ్చాడు. తాను ''మోషే కవి"గారి కుమారుడనని చెప్పాడు. మోషేకవిగారితో మా నాయనగారికి కొంత స్నేహం ఉండేది సంతోషించాడు. బీర్నీడు ప్రసన్నగారు తన "పృథ్వీ భాగ వతం" చూపించి, అది చదివి విశ్వనాథవారి అభిప్రాయం కావాలని కోరాడు. ''నీకూ పట్టింది ఈ పిచ్చి?'' అన్నాడీయన. ఎప్పటికప్పుడు చదవడం కుదరక నాలుగైదుసార్లు ఆయన్ని మళ్ళీ రమ్మనడం, ఆయన మళ్ళీ రావడం-విసుగెత్తిన మా నాయనగారు "ప్రతివాడూ కవిత్వం వ్రాసేవాడే! వ్రాస్తే వ్రాసుకోండి, ఎవ ద్దొన్నాడు? అభిప్రాయంకోసం నన్ను చంపుతారెందుకు? విశ్వనాథ సత్యనారా యణ చెపితేగాని అది కవిత్వం కాదా? అసలు ఎవడి పుస్తకం అచ్చువెయ్యడాని కైనా ఇంకొకడి అభిప్రాయం ఎందుకు? నేనెప్పుడూ నా గ్రంథాలకి అభిప్రాయం

వ్రాయమని ఎవడినీ దేవిరించలేదే, నాకు చదవడానికి తీరికలేదు. తీసుకుపో" అని కోప్పడ్డాడు.

పాపం, ఆ ప్రసన్నగారు ముఖం యింత చేసుకుని, "అయ్యా! అలాగే తీసుకుపోతాను. తమరు చదవని నా గ్రంథం ఎందుకు? తగలబెట్టేస్తాను, ఇప్పించండి" అన్నాడు దీనంగా. నా కాశ్చర్యం వేసింది. మా నాన్నగారు నిర్ఘాంత పోయాడు. ప్రసన్నగారి ముఖం చూస్తే అన్నంతపనీ చేసేట్టే ఉంది. పరాజితుడి లాగా ఎటో చూస్తూ, ''సరే, రేపు రా! రాత్రికి చదువుతాను'' అన్నాడు మా నాయనగారు. ప్రసన్నగారు బ్రహ్మానందంగా వెళ్ళిపోయాడు. ఆ రాత్రి అర్ధ రాత్రివరకూ అతని కావ్యం చదువుతూ ఉండిపోయాడు. అర్ధరాత్రి రెండు గంటలకి మేడమీది గదిలో పడుకుని ఉన్న మా బాబాయిగారు మల్లాది లక్ష్మీ నారాయణగారిని కేకేసి, ఆ పద్యాలు చదివి వినిపించి ప్రతి పద్యానికీ మెచ్చుకున్నాడు. ఒక స్థాయిలో ఆ మెచ్చుకోలు ఎంత దూరం వెళ్ళిందంటే. ''ఇతనికి మళ్లే పద్యం నేను వ్రాయగలనుటండీ?!" అని కూడా అన్నాడు.

మర్నాడు టీర్నీడు ప్రసన్నగారొస్తే, "ఆ గ్రంథం ఎవరికి అంకితం ఇద్దామనుకుంటున్నారు?" అని మా బాబాయిగారడిగితే, "మానవమాత్రుడికి అంకితం ఇవ్వదలచుకోలేదండి" అన్నాడు ప్రసన్నగారు. దానికి మళ్ళీ మా బాబాయిగారు, ''అల్లాకాదయ్యా, అంకితం ఇస్తే మాస్టరుగారే తీసుకుందామనుకుంటున్నారు'' అని అంటే, ప్రసన్నగారు కళ్ళనీళ్ళపర్యంతమై సాష్టాంగపడిపోయి, "బాబూ! ఆయన మానవమాత్రుడని నేనెప్పుడైనా అనుకుంటేగదా! నాకంత అదృష్టమా?" అని పొంగిపోయాడు. ఆ అంకిత సభ హైదరాబాదులో జరిగింది. ప్రసన్నగారిని వెయ్యిన్నూట పదహార్లూ, శాలువతో సత్కరించి కౌగిలించుకున్నాడు విశ్వనాథ వారు. "విశ్వనాథవారు ఆంధ్ర ప్రభుత్వ ఆస్థాన కవి అయితే, నేను వారి ఆస్థాన కవిని" అని ఆనందంగా చెప్పుకున్నాడు ఆ హరిజన కవి. అటువంటి హరిజన కవులు టి. యస్. జ్ఞానానందం, దాసి బసవయ్య, జోసపు కవి, ఎం.పి. జాన్ కవి వంటి శిష్యులు, అభిమానులు విశ్వనాథవారి మానవతాగుణం చవి చూచిన వారు ఎందరో ఉన్నారు.

ఎదుటి వ్యక్తిలో "స్పార్క్" లేదా "ప్రతిభ" అనేది ఉండాలేగాని, విశ్వనాథవారు మెచ్చుకోనిది ఏనాడూ లేదు. వారిని ప్రోత్సహించకుండా ఉన్నదీ లేదు. ఎవరి దాకానో ఎందుకు? - 1967 ప్రాంతాల్లోనే నేను కాలేజీలో చదివే రోజుల్లో పద్యరచన అభ్యాసం చేస్తూ మొట్టమొదటి సారిగా ఒక మధ్యాక్కఱ వ్రాశాను.

ఆనమ దమరాసుర మకుటాగ్ర రత్నరుచి శోభిత ప్ర
సూనపాదా! మహాదేవ! శూలి! కపాలి! భిక్షూ! హి
మ నగేంద్ర తనయా హృదయ కమల భాస్కరా! నను బ్రోవ
వే! నమో నందమూర్నిలయ! విశ్వేశ్వరా! మహా లింగ!

ఇదెందుకు వ్రాశానంటే- మా నాయనగారి "విశ్వనాథ మధ్యాక్కఱలు" గ్రంథంలో "నందమూర్నిలయ విశ్వేశ్వరా! కులస్వామి!" అనే మకుటంలో ఒక శతకం ఉంది. ఇదే మకుటం తీసుకుని మా అన్నగారు అచ్యుత దేవరాయలు గారు, ''నందమూర్నిలయ విశ్వేశ్వరా! మహాలింగ!'' అని తానొక శతకం మొదలుపెట్టాడు. (అది మా నాయనగారు పోయిన తరువాత పూర్తిచేసి, మా అన్నగారు అచ్చువేశాడు.) వాళ్ళిద్దరూ వ్రాశారు కదా, నేనెందుకు వ్రాయకూడదన్న పైత్యంకొద్దీ మొదలుపెట్టిన పని అది. అది వేరే విషయం.

ఈ పద్యం వ్రాసి మా నాయనగారికి వినిపిద్దామని వెళ్ళాను. ఆయన అప్పుడు స్నానం చేస్తున్నాడు. స్నానాల గదిలో ఎఱ్ఱ తువ్వాల కట్టుకుని, బాషీపట్టు వేసుకుని కూర్చుని, బకెట్టులోంచి చెంబుతో నీళ్ళు పోసుకుంటున్నాడు. "నాన్నా! ఒక పద్యం వ్రాశాను, వినవా?'' అని అడిగాను. ఆయన ఒక చిఱునవ్వు నవ్వి, "ఏదీ? వినిపించు" అన్నాడు. వినిపించాను. ఆయన విని, కనుబొమలు ముడిచి, ''ఆ సమాసం ఎక్కడో విన్నట్టుందే?'' అన్నాడు. నేను వెంటనే, ''ఔను, నన్నయగారి ఉదంకోపాఖ్యానంలో—

అరిది తపోవిభూతి నమరారుల బాధలు వొందకుండగా
సురగులనెల్ల కాచిన మహోరగ నాయకు డానమత్సురా
సుర మకుటాగ్ర రత్నరుచిశోభిత పాదున కద్రినందన—''

అని వినివినిపిస్తూండగానే, ''ఆగాగు'' అని ఆపి, ఒక్క క్షణం ఆగి, ''ది ఫస్ట్ ఎండ్ బెస్ట్ ట్రిక్ యిన్ రైటింగ్ ఎ పొయెమ్ యూ కాట్ ఇట్! పో!" అన్నాడు. నా కర్థంకాక "అదేమిటి నాన్నా!'' అని అడిగాను. దానికాయన కించిత్తుగా నవ్వి, "ఏమిటా? చంపకమాలలోని ఒక సమాసాన్ని తీసుకొచ్చి సరాసరి మధ్యాక్కఱలో యిరికించేశావూ అంటే నీకు ఛందస్సూ, పద్యం నడకా తెలిసినా యన్నమాట. పోను పోను పద్యం బాగానే వ్రాస్తావు. ఇక భావం చూసుకో పో!" అని అన్నాడు. అయ్యో! ''ఆ సమాసం యిక్కడ కాపీ కొడతావా?'' అని తిట్టచ్చుగా కొడుకుని! ఆయన అలా చేయడు. హరిజనుడైనా, స్వజనుడైనా, అవతలివాడి శక్తిని గుర్తించి తగువిధంగా ప్రోత్సహించే మహా మానవుడాయన.

సభలలో ప్రళయకాల రుద్రుడల్లే ఉండే ఆయన ఇంటి వ్యవహారాలలో మా అమ్మగారు ఎప్పుడైనా ''మీకు తెలీదు, ఊరుకోండి'' అని అంటే ఊరుకునే వాడు. 'ఎందుకు ఊరుకోవడం? నాకే తెలీదంటావా?' అని ఉగ్రుడైపోవచ్చుగా. అదే ఆయనలోని మానవత. అవసరమైతే ఇంట్లో కూరలు కూడా తరిగేవాడాయన. ఆయన నవలల్లో స్త్రీ పాత్రలు మహోన్నతంగా ఉంటాయి. ప్రతి పాత్ర "ఇంటెలిజెంట్'' గా ఉంటుంది. చచ్చుగా ఏ పాత్రా ఉండదు. విశ్వనాథ సత్యనారాయణగారు కేవలం మహా మానవుడే కాదు, మానవ మనో విశ్లేషణ సార్వభౌముడు!

*

''అల నన్నయ్యకు లేదు తిక్కనకు లేదా భోగ మస్మాదృశుం
దలఘుస్వాదు రసావతార ధిషణాహంకార సంభార దో
హల బ్రాహ్మీమయమూర్తి శిష్యుఁడయినా డన్నట్టి దా వ్యోమ పే
శలచాంద్రీ మృదుకీర్తి చెళ్ళపిళవంశస్వామి కున్నట్లుగన్ "

—విశ్వనాథ

# మాట్లాడే వెన్నెముక

## —శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు

విశ్వనాథ సత్యనారాయణగారిని—

"మాట్లాడే వెన్నెముక
పాటపాడే సుషుమ్న"

అన్నాడు శ్రీశ్రీ. ధైర్యసాహసాలు లేకుండా జావకారిపోయే మనిషిని 'వీడు వట్టి వెన్నెముకలేని మనిషిరా!' అంటాము తెలుగువారి ధైర్యసాహసాలు మూర్తీభవించిన మహాకవి విశ్వనాథ సత్యనారాయణ. తెలుగుజాతి Hero-worship కి అలవాటుపడిన జాతి ... టంగుటూరి ప్రకాశం పంతులుగారిలో ఏ ధైర్య సాహసాలు చూసి తెలుగుజాతి తన హృదయంలో ఆయనకు ఒక గుడి నిర్మించుకుందో విశ్వనాథలో అలాంటి ధైర్య సాహసాలనే చూసి ఆయనను తెలుగుజాతి ఆరాధించింది.

తాను 'సత్యం' అని నమ్మిన దానిని నిర్భయంగా, నిస్సంకోచంగా సభా వేదికలమీదా, తన గ్రంథాలలోనూ చాటిన ధైర్యశాలి విశ్వనాథ. పరశురాముడు 'ఇదం బ్రాహ్మం, ఇదం క్షాత్రం' అన్నట్లు బ్రాహ్మ్యాన్నీ; క్షాత్రాన్నీ, సత్త్వ గుణాన్ని, రజోగుణాన్ని సమానంగా ప్రదర్శించినవాడు విశ్వనాథ. తన పూర్వ జన్మలో మల్లంపల్లి సోమశేఖర శర్మగారూ, తనూ ఆంధ్ర ప్రశస్తినీ, ఆంధ్ర పౌరుషాన్నీ నిలబెట్టడం కోసం తోడి సైనికులై పోరాడారట! 'ఆంధ్ర ప్రశస్తి'ని 'మల్లంపల్లి'కి అంకితమిస్తూ ఆయన ఇలా అంటారు:

''ఇది నీకై యిడినట్టి నా యుపద, మున్నే నాఁడొ మాసాగ్రముల్
పదునై యాంధ్ర విరోధి కంఠదళన ప్రారంభసంరంభమే
చదివాలనే మఱి తోడి సైనికులమై చూచాడు ప్రేమంబులో
నిది లేశంబనియైనఁ జెప్పుటకు లేవే నాఁటి స్వాతంత్ర్యముల్."

నన్నయ మొదలు నేటివరకు వచ్చిన తెలుగుకవులలో తెలుగు '**ethos**'ను, అంటే తెలుగుజాతి జీవన ముద్రను విశ్వనాథ ప్రకటించినంత స్ఫుటంగా మరే కవి ప్రదర్శించి ఉండలేదు. ఆయన తొలి రచనలు 'తెలుగు ఋతువులు,' '**శశిదూతం,**' బద్దన్న సేనాని,' 'కడిమిచెట్టు' వంటి పలు రచనలలో అడుగడుగునా తెలుగుజాతి జీవనముద్ర మనకు కనిపిస్తుంది. అనాటి తెలుగు సంస్కృతి ప్రస్ఫుటం అవుతుంది.

ఈ 'తెలుగు సంస్కృతి'ను ఆయన తొలి రచనలలోనే కాకుండా మలి రచన అయిన 'శ్రీమద్రామాయణ కల్పవృక్షం'లో కూడా మనం గుర్తించవచ్చును. ఆ కావ్యం చదువుతూ ఉంటే రామాయణ కథ తెలుగుదేశంలోనే జరిగినట్లు, రామాయణంలోని పాత్రలన్నీ తెలుగువారే అయినట్లు మనకు అనిపిస్తుంది. రామాయణంలో దశరథుడు యజ్ఞం చేస్తున్న రోజులలో అయోధ్యా పౌరుల అతిథి సపర్యలను విశ్వనాథ వర్ణించే తీరు గమనించండి:

"చని ఎంత ప్రొద్దువేళను తల్పుతట్టిన
    చిటికెలో వచ్చి తీసెదరు తలుపు
మంచి తీర్థమ్మును కొంచెమిత్తురె అన్న
    తియ్యని మజ్జిగ తెచ్చి ఇత్తు
రరుగుల నిదురింతు మన్నచో తాము ని
    ద్రించు మంచము ప్రక్క తెచ్చి ఇత్తు
రప్పు! పిల్లకు వేళ తప్పు భోజనమున
    కన వండి పెట్టుదు రప్పుడపుడె
ఆ పురంబున పురుషులు నంగనలును
తమ ధరాపతి యజ్ఞ విధానవేళ
తామె గేస్తులై వచ్చునందరును తమకె
అతిథులైనట్లు గౌరవమాచరింత్రు!"

తెలుగువారి ప్రవృత్తిలోని అతిథి సపర్యామాధుర్యాన్నే ఈ పద్యం వర్ణిస్తూంది.

ఇటీవల ఆంధ్ర సారస్వత పరిషత్తులో జరిగిన విశ్వనాథ శతవార్షిక జయంతి సభను ప్రారంభిస్తూ- విశ్వనాథకు రెండు సంవత్సరాలపాటు కాలేజీలో ప్రత్యక్ష శిష్యుడుగా ఉండి, ఆయన వద్ద చదువుకున్న మన ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావుగారు విశ్వనాథ ధైర్యసాహసాలను చాటే ఒక సంఘట నను స్మరించారు. వాళ్ళ కాలేజీకి అప్పుడు ఆంధ్ర విశ్వవిద్యాలయానికి వైస్ చాన్స్‌లర్‌గా ఉన్న కట్టమంచి రామలింగారెడ్డిగారు వచ్చారట. ఆయన గూడకట్టు కట్టుకుని సిల్కు లాల్చి వేసుకుని సభకు రావడం స్వస్థాన వేషభాషాభిమానాలు గల విశ్వనాథకు నచ్చలేదు. వెంటనే "ఇప్పుడే వస్తాను" అని చెప్పి ప్రక్క గదిలోకి వెళ్ళి తాను కూడా పంచెను మడతవేసి గూడకట్టు కట్టుకుని సభకు రావడం' ఆ practical joke కు రామలింగారెడ్డిగారు చిన్నబుచ్చుకోడం, విశ్వనాథ శిష్యులంతా హర్షధ్వానాలు చేయడం జరిగిందట!

ఇలాంటిదే ఆ రోజులలో విశ్వనాథ ధైర్య సాహసాలను చాటే మరొక సంఘటన కూడా నాకు గుర్తువస్తుంది. 1940 - 50 మధ్య ఏలూరులో సాహిత్య మండలి తరపున మేము అఖిలాంధ్ర సాహిత్య సమావేశాలను ఏర్పాటు చేస్తూ ఉండేవాళ్ళం. అటువంటి ఒక సభకు రాజా విక్రమదేవవర్మ గారు, చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రిగారు, విశ్వనాథ, కృష్ణశాస్త్రి మొదలైనవారంతా వచ్చారు. ఆ రోజు లలో విక్రమదేవవర్మగారు కవులను ఆదరిస్తూ, వారి కృతులను అంకితం తీసు కుని రూ. 1,116 లతో వారిని సత్కరిస్తూ ఉండేవారు. జాషువాను ఆయన అలా సత్కారించారు. విశ్వనాథకు ఆయన పరమ స్వతంత్రుడు కావడంవల్లనో ఆశ్రయింపు చేతకాకపోవడం వల్లనో అంతవరకూ ఆయన సత్కారం లభించ లేదు. ఆ రోజులలో విశ్వనాథ దారిద్ర్యంతో బాధపడుతూ ఉండేవాడు. చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రిగారు విశ్వనాథకు సహాయం చేయాలనే సదుద్దేశంతో 'సత్యనారా యణా! రాజావారు నీ సమాసధోరణి వినాలనుకుంటున్నారు. ఏవైనా పద్యాలు చదువు' అని కోరారు. దానికి విశ్వనాథ పెంకెగా 'రాజావారు వెళ్ళిపోతారు గదా! సాయంత్రం నా పద్యాలు చదువుతా లెండి' అన్నారు. గురువుగారికి Prestige issue. వేదిక దిగివచ్చి శిష్యుణ్ణి బుజ్జగించి చివరికి వెంకట శాస్త్రిగారు ఆయన చేత పద్యాలు చదివించారు. 'రెండు నక్షత్రాలు' అనే ఖండకావ్యం విశ్వనాథ చదివారు.

దానిలో 'ఆ రాచబిడ్డ కల్యాణపల్యాణ సజ్జిత పంచకల్యాణి చెలువుగులికె' అనే ఒక్క సమాసం తప్ప వేరే దీర్ఘ సమాసాలేమీ లేవు. మొదటి రెండు పద్యాలలో కవి, రాజకుమారుడు జన్మించడం; తరువాతి రెండు పద్యాలలో ఇద్దరూ పెరిగి పెద్దవాళ్ళు కావడం; చివరి రెండు పద్యాలలో ఆ ఇరువురూ అస్తమించడం వర్ణించబడింది కవి అస్తమిస్తే ఒక నక్షత్రం ఆకాశంమీదికి ఎక్కింది, రాజు అస్తమిస్తే ఒక నక్షత్రం ఆకాశం మీదనుంచి రాలింది. అంత ధైర్యంగా విక్రమ దేవ వర్మగారిని ధిక్కరిస్తూ పద్యాలు చదివిన విశ్వనాథ ధైర్యంచూసి మేమందరం ఆయనకు భక్తులం అయాము. ఆ రోజులలో విశ్వనాథ అంత Idealist, ఆదర్శవాది.

**శ్రీశ్రీ అన్నట్టు నిస్సందేహంగా ఆయన మాట్లాడే వెన్నెముకే!**

ఇక శ్రీశ్రీ అన్న రెండవమాట- "పాట పాడే సుషుమ్న." ఇడా, పింగళా నాడుల మధ్యగా ఉంటుంది ఈ సుషుమ్నా నాడి. దీనిద్వారానే మూలాధార చక్రం నుంచి కుండలినీ శక్తి సహస్రారచక్రం చేరి సమాధిస్థితిని, బ్రహ్మానందాను భూతిని కలిగిస్తుంది. బ్రహ్మానంద సద్ బ్రహ్మచారి అయిన రసానందాను భూతిలో కూడా ఈ సుషుమ్నా నాడి పాత్ర ఉంటుంది. అందుకే విశ్వనాథ "పాట పాడే సుషుమ్న!"

1960-70 వరకు విశ్వనాథ తెలుగుదేశం నలుమూలలనే కాక, రాష్ట్రేతర రాంధ్రులు ఉన్న బొంబాయి, కలకత్తా, ఢిల్లీ, మదరాసు నగరాలలో కూడా దాదాపు గంటసేపు కావ్యపఠనం చేసి, శ్రోతలను రసానంద పారవశ్యంలో ముంచెత్తుతూ వచ్చారు. 'కిన్నెరసాని పాటలు', 'కోకిలమ్మ పెళ్ళి' మాత్రమే కాదు; 'వేగీక్షేత్రం', 'మాధవశర్మ', 'కొండవీటి పొగమబ్బులు', 'అంధ భిక్షువు', 'ఓ ప్రభూ!', 'స్వాగతం', 'మూగనోము' మొదలైన ఖండకావ్యాలూ, చివరి రోజులలో శ్రీమద్రామాయణ కల్పవృక్షంలోని కొన్ని ఘట్టాలూ కూడా ఆ విధంగా ఆయన సభలలో చదివి వినిపిస్తూ ఉండేవారు. గాన ప్రావీణ్యంతో పాటు ఆయనకు అభినయ కౌశలం కూడా ఉండేది. వాచిక, సాత్త్వికాభినయా లతో ఆయా ఖండకావ్యాలలోని రసానుభూతిని ఆయన అద్భుతంగా శ్రోతలకు అందజేసేవారు. చివరి రోజులలో ఆయన శక్తులు ఉడుగ నారంభించిన తరు

వాత రేడియోవారు రికార్డు చేసివుంచిన ఆయన కావ్యగానం విన్నా మనకు ఆయన కవితాగాన ప్రతిభ విదితం అవుతుంది.

చిత్రం ఏమిటంటే - ఆయన విమర్శకులు 'ఆయన పద్యాలు అర్థంకావు' అంటారు. దీర్ఘసమాసాలు వాడతాడనీ, మారుమూలపదాలు ఉపయోగిస్తాడనీ, నిరంకుశంగా లక్షణవిరుద్ధమైన ప్రయోగాలు చేస్తాడనీ ఆయనను విమర్శిస్తూ ఉంటారు. ఆ విమర్శకులు చెప్పిన మాటలలో కొంత నిజం లేకపోలేదు. పుస్తకంలో చదివినప్పుడు ఆయన పద్యాలు అర్థం చేసుకోడం కొంతవరకూ కష్టమే. కాని, సభావేదికమీద ఆయన గానం చేస్తున్నప్పుడు ఆయన వ్రాసిన ప్రతి పద్యం శ్రోతలలో ప్రతి ఒక్కరికీ బోధపడి, వారిని రసానందనిమగ్నులను చేసింది.

దీర్ఘసమాసాలు వాడినా, మారుమూల పదాలు ప్రయోగించినా ఆయన చదువుతున్నప్పుడు ఆయన పద్యాలు అందరికీ అర్థంకావడంలో ఒక రహస్యం ఉంది. ఎంత మారుమూల పదాలు వాడినా ఆయన పద్యాలలోని వాక్యాలన్నీ తెలుగువారి నిత్య వ్యవహారంలో వినిపించే వాక్యాలు

భార్య వీధిలో ఏదైనా వింతదృశ్యం కనిపిస్తే ఇంట్లో ఉన్న భర్తని "ఇదిగో ఏవండోయ్! ఒక్కసారిలా రండి" అంటుంది. గ్రాంథికభాషలో ఇలాంటి వాక్యవిన్యాసం కనిపించదు. ప్రాచీనాంధ్రకవులు కూడా అక్కడక్కడ ఇలాంటి తెలుగు పలుకుబళ్ళను, నుడికారాలను, వ్యావహారిక వాక్యవిన్యాసాలను ప్రయోగించడం ఉన్నా, ఈ తెలుగుపలుకుబళ్ళను విశ్వనాథ అంత ఎక్కువగా వాడిన మరొక తెలుగుకవి కనిపించడు. రామాయణ కల్పవృక్షంలో సీత బంగారు లేడిని చూసి రాముణ్ణి ఇలాగే పిలుస్తుంది:

"ఇదిగో ఓ స్వామి! ఇట్లు రమ్మిట్లు రమ్మ
ఓ మఱది! నీవు కూడా రావోయి రమ్మటంచు." (అరణ్య- పుట. 192.)

"మనమెదో దాని చేయుదుమని భయంబు
భయము లేదులే రావమ్మ! పైడితల్లి! (అరణ్య - పుట. 193.)

విశ్వనాథ కావ్య వాక్యాలలోని ఈ తెలుగు పలుకుబళ్ళను, కాకువులను తెలుసుకుని ఆయనలాగ ఆ పద్యాలను చదువుకోగలిగితే పుస్తకంలో ఆ కావ్యా

లను చదువుకుంటున్నప్పుడు కూడా పాఠకుడు ఆ పద్యాలు సమర్పించే రసానందాన్ని నిస్సంశయంగా ఆస్వాదించగలుగుతాడు.

రామాయణ కల్పవృక్షం బాలకాండలో బ్రహ్మదేవుణ్ణి ముందుంచుకుని దేవతలందరూ విష్ణుమూర్తిని భూమిమీద అవతరించి రాక్షస సంహారం చేయవలసిందిగా అర్థిస్తారు. బ్రహ్మదేవుడు చెప్పవలసిన మాటలు చెప్పిన తరువాత ఇంద్రుడు కలిపించుకుని ఇలా అంటాడు:

"అన తురాషాట్టు కలిపించుకొని తపములు
సేయవచ్చు, వరమ్ములు నీయవచ్చు
ఈ యనద రక్కసులకును నెంతసేప
టికిని స్వర్గముపై చూపటే అనంత!''

'వీడికెంతసేపటికీ తిండిమీదే ధ్యాస' అనే వాడుక వాక్యానికి ప్రతిధ్వని ఈ పద్యంలోని వాక్యం. గ్రాంథిక బాషలో 'ఎంతసేపటికి' అనే ప్రయోగం కనిపించదు. దానికి బదులు 'ఎల్లవేళల' అని వాడుతారు. ఈ పద్యంలో ఇంద్రుడికి పర్యాయ పదమైన 'తురాషాట్టు'ను బహుశః ఏ పూర్వ కవీ ఇంతవరకూ ప్రయోగించి ఉండడు. ''అనిన నింద్రుండు కలిపించుకొని'' అని అందరికీ అర్థమయ్యేట్టు విశ్వనాథ వ్రాయవచ్చును. కాని, ఆయన అలా వ్రాయడు అదే విశ్వనాథ ముద్ర. పాశ్చాత్య రచయితల నుంచి Technique (శిల్పం) అనే నూతన లక్షణాన్ని గ్రహించి విశ్వనాథ తెలుగుకవితా యోషకు ఒక నూతన భూషను అలంకరించాడు. శ్రీ పోలావ్రగడ సత్యనారాయణగారు అన్నట్టు ఆంగ్ల రచయితలలోని Technical perfcetion విశ్వనాథను విశేషంగా ఆకర్షించింది. ఒక రచనను ఎలా మొదలు పెట్టాలి, ఎలా Develop చెయ్యాలి, ఎలా ముగించాలి అనే శిల్పాన్ని పాశ్చాత్య రచయితలనుంచి విశ్వనాథ గ్రహించాడు. 'తురాషాట్టు' (దేవతలకు రాజు) అనే శబ్దానికి గల శబ్దశక్తి ఇంద్రుడు అనే పదానికి లేదు. అందుచేత శిల్పం దృష్ట్యా ఈ మాట అర్థం కాకపోతే పాఠకుడు చచ్చినట్టు నిఘంటువు చూసుకుంటాడులే అనే ధీమాతో ఆయన ఇలాంటి ప్రయోగాలు చేస్తాడు.

ఇంకొక్క పద్యం వినిపించి నేనీ ప్రసంగాన్ని ముగిస్తాను. అహల్యా ఘట్టాన్ని బాలకాండలో విశ్వనాథ బహు రమణీయంగా చిత్రించాడు. ఒక సాయం కాలం పూట ఇంద్రుడు వచ్చి అహల్యను 'అడుగుతాడు'. 'అడుగు' అనే క్రియకు పల్లెటూళ్ళలో ఇటీవలి వరకూ విలక్షణమైన ఈ అర్థం ఉండేది. ఇంద్రుడి అభ్యర్థనకు బదులుగా అహల్య 'ఔ కోడికూసెనె?' అంటుంది. అది ఆమె చేసిన సంకేత సూచన. ఇక ఆ రాత్రి ఇంద్రుడు పడ్డ అవస్థను విశ్వనాథ ఎంత శిల్ప సుందరంగా వర్ణించాడో చూడండి:

"నిశినిశి యెల్ల నింద్రునకు నీల సరోరుహలోచనా వచో
నిశిత మనోహరార్థ విపణీకృత దీకునకున్ వచోనుగా
విశదతనూ సమర్థ్రి వినివేశన దర్శన దీ ధురీసహ
స్రశంకలితాక్షిగోళునకు సాగియు సాగదు, కోడికూయదున్."

ఆ రాత్రి రాత్రంతా ఇంద్రుడు ఆ 'నీల సరోరుహలోచన' నల్లని కలువ పూవులవంటి కన్నులు కల అహల్య అన్న 'ఔ! కోడికూసెనే' అనే మాటకు ఎన్నెన్నో అర్థాలు ఊహించుకుంటూ గడిపాడు. ఆ మాటకు ఆయన చెప్పుకున్న మనోహరమైన అర్థాలతో ఆయన మనస్సు ఒక పెద్ద అంగడిలాగ తయారైం దట. ఆ మాట పలికినప్పటి ఆమె రూపాన్ని తన మనోనయనంముందు చిత్రించు కుని దర్శించాలన్న తీవ్రమైన ఆయన ఆలోచనాధారకు ఆయన కనుగ్రుడ్లు వేయి ముక్కలు అయాయట. ముందు ముందు గౌతమ మహర్షి శాపంవలన ఇంద్రుడు సహస్రాక్షుడు కాబోతున్నాడన్న సూచన ఇది ఇప్పుడు మళ్ళీ ఒకసారి పద్యం చదవండి. ఇంత భావాన్ని ఒక్క పద్యంలో ఇమడ్చడానికి సంస్కృత సమాసాల సహాయం లేకుండా సాధ్యం అవుతుందేమో ఆలోచించండి!

ఈ పద్యంలో మరొక చమత్కారం ఉంది. వాక్యానికి కర్త అయిన 'నిశి'కి 'సాగియు సాగదు' అనే క్రియకూ మధ్య అంత దూరాన్వయాన్ని ఆయన కావాలనే కూర్చాడు ఆ రాత్రి ఇంద్రునికి అంత దీర్ఘంగా గడిచిందని సూచి స్తుంది ఈ దూరాన్వయం. విశ్వనాథ శిల్పదృష్టికి ఇది ఒక నిదర్శనం.

విశ్వనాథ సత్యనారాయణగారు తెలుగువారికి ఇంకా పూర్తిగా అర్థంకాని ఒక అందమైన ప్రశ్న. ఈ ప్రశ్నను విడదీసుకోడానికి ఎన్ని తరాలు మనం తపస్సు చేయాలో!

*

# విశ్వనాథ - భారతీయ దర్శనం

—'ఆంధ్రవ్యాస' శ్రీ ఏలూరిపాటి అనంతరామయ్య

**తాహతు - అర్హత :**

విశ్వనాథ సత్యనారాయణగారి శతజయంతి సంవత్సర ప్రారంభ సమావేశంలో వారి భారతీయ దర్శనం గురించి మాట్లాడగల తాహతు నాకున్నదనడం సాహసమే కాని, అర్హత ఉన్నదనిమాత్రం మనవి చేసుకొనక తప్పదు. ఎపుడో 1950 ప్రాంతాలలో, రాజమహేంద్రవరంలో, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి కళాభివర్ధని పరిషత్తులో 'నన్నయగారి ప్రసన్నకథాకలితార్థయుక్తి'ని గురించి వారు ప్రసంగించిన సందర్భంలో వారిని తొలిసారి దర్శించినది మొదలు, అంతకు ముందే వారి వేయిపడగలు చదివినది మొదలు, అప్పుడు రాజమహేంద్రవర పురవీధులలో వారి ఊరేగింపులో సాహితీవృద్ధులతో పాటు నడిచినది మొదలు, వారి పుస్తకాలూ, పత్రికల్లో పడిన రచనలూ యథాసంభవంగా చదువుతూనే ఉన్నాను. అనేక సభలలో యథావకాశంగా, ప్రత్యేకించి వారి షష్టి-సప్తతి పూర్తి ఉత్సవాలలోనూ, వారు జ్ఞానపీఠ పురస్కారాన్ని గ్రహించినపుడూ, విజయవాడలో జరిగిన సన్మానోత్సవంలోనూ జరిగిన సభలలో నేనున్నాను. ఆంధ్ర విశ్వవిద్యాలయం వారికి కళాప్రపూర్ణ బిరుదమిచ్చిన తరువాత మొదటి సన్మానసభ ప గో. జిల్లా తణుకులో జరిపించిన వారిలో నేనున్నాను గుంటూరు ప్రభుత్వాసుపత్రి మీదుగా వెండికొండకు వారు వెళ్ళినపుడు రాజలాంఛనాలతో విజయవాడలోని వారి గృహానికి వారి పార్థివ శరీరాన్ని తీసుకొని వెళ్ళిన ప్రభుత్వ వాహనంలో కరుణశ్రీ గారితోపాటు నేనుకూడా ఉన్నాను. ఆవేళ ఆ వార్త ఆంధ్రదేశానికి అందజేసిన విజయవాడ ఆకాశవాణిలో కవిసమ్రాట్ వెళ్ళిపోయాడు - కవులు మిగిలారు" అని నేను చెప్పినమాట ఆంధ్ర సాహితీలోకమంతా విన్నది.

## ముఖ్యమంత్రి - ప్రధాన కార్యదర్శి :

మరునాడు వారి శరీరాన్ని కృష్ణమ్మ కప్పగించిన సాయంకాలం, విజయవాడ మెడికల్‌హాల్‌లో జరిగిన సంతాప సభలో, అప్పటి విద్యామంత్రి ఎం. వి. కృష్ణారావుగారు, అఖిలభారత జాతీయ కాంగ్రెసుకు అప్పటి ప్రధాన కార్యదర్శి, ఇప్పటి భారత ప్రధానమంత్రి గౌ॥ శ్రీ॥ పి. వి. నరసింహారావుగారూ, కరుణశ్రీగారూ మాటాడిన తరువాత నేను మాటాడుతూ "నరసింహారావుగారు ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా ఉండి ఉంటే ఈవేళ ఆంధ్రాస్థానకవి కడపటి ప్రయాణంలో పాల్గొన్న గౌరవం ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రికి దక్కి వుండేది. అయితే ఆ గౌరవం అఖిల భారత జాతీయ కాంగ్రెసు ప్రధాన కార్యదర్శికి దక్కడం విశేషం" అన్నప్పుడు సంతాప సభా సంప్రదాయానికి విరుద్ధంగా సకల సభా కరతాళధ్వనులతో మారుమ్రోగిపోయింది

## పి. వి. అపూర్వ ప్రసంగం :

విశ్వనాథ సత్యనారాయణగారి వేయిపడగలు సహస్రఫణ్‌గా హిందీలోనికి అనువదించి పేరు సంపాదించిన పి. వి. నరసింహారావుగారు ఆ సభలో నలభై ఐదు నిమిషములపాటు శ్రీ సత్యనారాయణగారి గురించి చేసిన ప్రసంగం వంటి ప్రసంగం అంతకుపూర్వం కానీ, ఆ తర్వాత కానీ నా యాభై ఏళ్ళ సాహితీ పరివస్యానుభవంలో ఎప్పుడూ వినలేదు.

## ప్రాచీన విషయ సమర్థన దేనికి? :

ఆ ప్రసంగంలో నరసింహారావుగారు చెప్పిన రెండంశాలు ఇప్పటికీ నా చెవులలో విశ్వనాథ వైజయంతి గీతికలుగా ప్రతిధ్వనిస్తున్నాయి. వాటిలో మొదటిది-విశ్వనాథ భారతదేశానికి, భారత ధర్మానికి, భారత సమాజానికి సంబంధించిన ప్రాచీన విషయాలను సమర్థిస్తూ రచనలు ఎందుకు చేశారు? ప్రసంగాలు ఎందుకు చేస్తూవచ్చారు? అన్నదానికి సంబంధించినది. 'సహస్రఫణ్' పీఠికలో సంగ్రహంగా చెప్పిన దానిని అప్పుడు నరసింహారావుగారు విపులంగా విశదీకరించారు. భారతదేశాన్ని దోచుకోవాలనో, తమ పలుకుబడికిందకు తెచ్చుకోవాలనో చరిత్రకు తెలిసిన నాటినుండి అనేక దేశాలవారు, అనేక ధర్మాలవారు, అనేక జాతులవారు ప్రయత్నించారు. వారిలో చివరివారు ఇంగ్లీషువారు. వీరికి పూర్వం

వచ్చిన వారందరికంటె ఈ దేశానికి ఈ ధర్మానికి ఈ జాతికి ఎక్కువ అప కారం చేసినది వీరే. తదితరులు కొందరు దోచుకు వెళ్ళిపోయారు. కొందరు గెలుపో, ఓటమో చవి చూచి వెళ్ళిపోయారు కొందరు ఈ దేశంలోని జన జాతు లలో కలిసిపోయారు. కొందరు క్రొత్త జాతులుగా ఏర్పడ్డారు. వర్తకులుగా వచ్చి పాలకులుగా పరిణమించిన ఇంగ్లీషువారు శాశ్వత బ్రహ్మకల్పంగా ఈ దేశాన్ని ఏలాలనుకొన్నారు. దానికి వారెన్నుకొన్న ప్రధానమైన మార్గం ఈ దేశస్థుల జీవన లక్ష్యాన్నే మార్చివేయడం. దానికి సాధనం విద్యావిధానం. అందులోని అంతఃప్రవాహం - ఈ దేశస్థులకు చెప్పుకొనదగిన ఒక నాగరకత లేదు, ఈ దేశస్థులు ఒక జాతి కాదు, వీరికి ఒక సంస్కృతి లేదు, చరిత్ర లేదు, ఉన్నా అవి ఉత్తమమైనవి కావు, ఒకప్పుడయినా ఇప్పుడు పనికి వచ్చేవి కావు, ఇంగ్లీషువారి జాతి, సంస్కృతి, చరిత్ర, సమాజ సామర్థ్యాలు గొప్పవి, వారి ననుకరించడం శరణ్యం, వారి పరిపాలన సుస్థిరంగా ఉండడం తరణో పాయం - ఈ అభిప్రాయాన్ని కలిగించడం.

కనుక అంతకు పూర్వం ఉన్న విద్యాప్రణాళికను ధ్వంసం చేసి, ప్రాథ మిక పాఠశాల, ఉన్నత పాఠశాల, కళాశాల, విశ్వవిద్యాలయ స్థాయులలో సర్వవిద్యా విధానమూ ఏర్పరచి, అంతా అన్నీ ఆంగ్లం ద్వారా నేర్చుకొన వలసిన స్థితి కల్పించారు, ఈ పద్ధతిలో చదివి ఈ పరీక్షలలో ఉత్తీర్ణులైనవారికే ఉద్యోగాలు తదితరులకు బ్రతుకుతెరువు లేమీ కల్పించారు. పాప భయం తక్క బ్రతుకు భయం లేని జనానికి ఐహిక సుఖమయ జీవనకంటె నిర్భయ ధర్మ ప్రియ జీవనం ప్రధానమనుకొనే జనానికి ఐహికలాలసామయ జీవనం మప్పి, ఈ ఉద్యోగాలు లేకుంటే బ్రతుకే లేదన్న 'బ్రతుకు భయం' కలిగించారు.

దీనివల్ల భారతీయమైన సమస్తాన్నీ ద్వేషించేవాళ్ళు ఈ దేశంలోనే దినదినాభి వృద్ధిచెందుతూవచ్చారు. దానితో పాశ్చాత్యపాలనతప్పనిసరి అయిన వరప్రసాదంగా స్థిరపడిపోయింది. ఇందులో ఉన్న చెడు గ్రహించి ఈ దేశానికి స్వాతంత్ర్యం కావాలనిప్రయత్నిస్తూ కొందరు ఉద్యమాలు లేవదీస్తుంటే, ఆ ఉద్యమాలలో పాలు గొంటూనో, ప్రత్యక్షంగా పాల్గొనకుండానో ఈ దుర్నీతిని ఖండించి- ఈ దేశం అనాగరకం కాదు, ఈ ధర్మం, ఈ జాతి, ఈ సమాజం సర్వోన్నతాదర్శభావ ప్రేరితమైనవి, అలా అనేక సహస్రాబ్దాలు బ్రతికినది, ఈ సంస్కృతికి దీటురాగలి

గిన సంస్కృతి లేదు, వీరి పూర్వ పరిపాలనా విధానం ఆదర్శప్రాయమైనది - అనిన సత్యాన్ని రచనలద్వారా ప్రసంగాలద్వారా కొందరు మహామహులు నిరూపించటానికి పూనుకొన్నారు. అట్టివారిలో లోకమాన్య బాలగంగాధర తిలక్, బంకించంద్ర చటోపాధ్యాయ మొదలైనవారు ఇతర ప్రాంతాలలో ఉన్నారు. తెలుగులో ఈ స్ఫూర్తి అందిపుచ్చుకొని ఈ భావప్రచారం జీవితలక్ష్యంగా పెట్టుకొన్నవారు శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు. ఇది మనిషికి వెన్నెముకవంటిది, శరీరానికి ప్రాణం వంటిది, ఉద్యమాలకు ఊపిరి వంటిది. (మన గతాన్ని ద్వేషించిన వారితర రంగాలలో ఎంత గొప్పవారైనా అగుదురుగాక, బ్రిటిషువారినీ వారిపాలననూ సమర్థించినవారేనంటే సత్యనారాయణగారి దృక్పథ ప్రాధాన్యం మనకు అర్థమవుతుంది.)

## కాలచక్రం వెనక్కి త్రిప్పమనలేదు :

అందరూ అనుకొంటున్నట్లు సత్యనారాయణగారు తన రచనలలో ఎక్కడా కాలచక్రాన్ని వెనక్కి త్రిప్పగలనని కానీ, త్రిప్పాలని కానీ చెప్పలేదు. మన గతమంతా హీనమైనదన్న మాటకు జవాబుగా గతంలో గల మేలిమి ప్రత్యేకించి చూపి, మనం స్వాతంత్ర్యానికి అర్హులం అన్నభావం దేశీయులలోనూ విదేశీయులలోనూ కలిగించాలని ఆయన ప్రయత్నించారు. మంచి సర్వమూ పోతున్నదన్న తపన తప్ప గతాన్ని అంతటినీ సమర్థించాలన్న అభినివేశంకూడా వారికి లేదు. మన సమాజంలోని మంచిని సమర్థించినంత తీవ్రంగానూ చెడును ఆయన ఖండించారు. ధర్మారావు నోట ఈ కొట్టుకపోయే ప్రవాహంలో అందరూ అభివృద్ధి అనుకొని కొట్టుకొనిపోతుంటే తాసటు తిరిగి అయ్యో కొట్టుకొని పోతున్నానంటూ గోలపెడుతూ పోతున్నానంతే అన్న భావం వెలువరించారు - వేయిపడగలలో రెండు పడగలు మాత్రం మిగిలాయనీ, అవి దాంపత్యభావానికి ప్రతీకలనీ వేయిపడగల చివర కంఠోక్తిగా చెప్పారు. ఈ చారిత్రకమైన సత్యాన్ని గమనించకపోవటం మనలను మనమే అవమాన పరుచుకోవటమవుతుంది.

## ఒక్కొక్క రచన ఒక్కొక్క భాషకు శిఖరం :

ఇలా సత్యనారాయణగారి ప్రాచీనతాభిమాన యథార్థ స్వరూపాన్ని వివరించి, నరసింహరావుగారు వారి సాహిత్యంలోని ప్రత్యేకతను ఇలా తెలియ

చేశారు: విశ్వనాథ సత్యనారాయణగారి రచనలలో ప్రతి రచనా విశిష్టమైనదే, ఒక్కొక్క భాషకు ఒక్కొక్క 'జీనియస్సు' ఉంటుంది. ఏ రచన ఏ భాష జీనియస్సుకు ఒదుగుతుందో తెలుసుకొని దానిని ఆ భాషలోనికి అనువదిస్తే ఆయన చేసిన ఆ రచన ఆ భాషలో ప్రథమ గణ్యమవుతుంది. ఉదాహరణకు కడిమిచెట్టు నవల. అది మహారాష్ట్రభాషలోకి అనువదించేసరికి ఆ భాషలోగల గొప్ప నవలలో ఒకటిగా పరిగణింపబడుతున్నది. హిందీ భాషలో సహస్రఫణ్‌కు కూడా మంచి పేరే వచ్చింది. అలా గుర్తించి మన తెలుగువారు వేర్వేరు భాషలు నేర్చి ఆయా భాషలలోకి ఆయా రచనలు అనువదిస్తే విశ్వనాథవారు ప్రపంచ మహారచయితలలో ప్రముఖులుగా పరిగణింపబడతారు.

## విశ్వం పట్టని మహా రచయిత :

నరసింహారావుగారు చెప్పిన ఈ దృష్టితో చూచినపుడు విశ్వనాథ సత్యనారాయణగారు విశ్వం పట్టనంత మహాకవి, మహారచయిత అని మనకు తేలిపోతుంది.

## న భూతో న భవిష్యతి :

విశ్వనాథవారి రచనలన్నీ మహర్షి తపఃపరిపుష్టమైన జ్ఞాన విజ్ఞాన భావనకు వ్యాఖ్యాప్రాయాలే. పందాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారన్నట్లు శంకరాచార్యుల వారి తరువాత, విద్యారణ్యుల వారి అనంతరం భారతీయ తత్త్వాన్ని ఇంతగా దర్శించిన వాడింతవరకూ పుట్టలేదు వీరికి జ్ఞానపీఠ పురస్కారం వచ్చిన క్రొత్తలో ఆ పీఠ నిర్వాహకులలో ఒకరు ఆ పురస్కార గ్రహీతలలో అంతటి వాడు లేడని అందరూ అనుకున్నారని ఢిల్లీలో నాతో చెప్పారు.

వెయ్యి సంవత్సరాల ఆంధ్ర సాహిత్య చరిత్రలో విశ్వనాథ సత్యనారాయణగారి వంటి రచయిత పుట్ట లేదు. పుట్టగలడన్న నమ్మకం నాకు లేదు. ఆయన చేపట్టని ప్రక్రియ లేదు, శభాషనిపించుకొనని ప్రక్రియ లేదని అందరూ చెప్పుకొనే మాటే. ఒక్కొక్క ప్రక్రియలో అనేకులు గొప్పవారుండవచ్చు. కాని, అన్ని ప్రక్రియలలో ఇంత గొప్పవాడు ఒక్కడే ఉండడం చాలా అరుదైన సంగతి.

## అదృష్టాధ్వనీనుడు :

కనుకనే వీరి గురువు చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు వీరి నీ విధంగా ప్రశంసించారు:

నా మార్గంబును గాదు వీని దరయన్ నా తాతముత్తాతలం
దే మార్గంబును గాదు, మార్గమెదియో యింకొక్కఁ దట్లాటచే
సామాన్యం దనరాదు వీని, కవితా స్వామిత్వ మాహేతువై
యీ మచ్ఛిష్యునిఁ దా వరించినది నేనెంతే ముదంబందఁగన్.

## ఊహాశక్తి-స్ఫురణశక్తులు :

సత్యనారాయగారికి భారతీయ విలక్షణమైన అనేక విశిష్ట దృఢాభిప్రాయా లున్నాయి. వాటిలో ఊహాశక్తి, స్ఫురణశక్తి - వీటి గురించిన దొకటి:

అరయఁగ నూహాశక్తి తనయంతన తాను ఘటిల్లునో పురా
భరితమనంత సంస్కృతి భరంబునఁ జేకుఱుఁగాక యట్లు చే
కురిన భరంబుతోడ నొనఁగూడిన పూర్వపుఁ బున్నెమాదుకో
స్ఫురణ ఘటిల్లుఁ బావనవిశుద్ధము తద్గతభావమాత్మభూ

(రా. బాల. అవ. 425)

## ఆశ్చర్యం - అజ్ఞానం :

క్రొత్తొక వింత, ప్రాతొక రోత అన్నది తెలుగు సామెత. అజ్ఞానం వల్ల ఆశ్చర్యం కలుగుతుంది. జ్ఞానికి ఆశ్చర్యం లేదు. కనుకనే—

"ఆశ్చర్యవత్ పశ్యతి కశ్చిదేనం
ఆశ్చర్యవత్ వదతి తథైవ చాన్యః
ఆశ్చర్యవత్ చైవ మన్యశ్శృణోతి
శ్రుత్వాప్యేనం వేద న చైవ కశ్చిత్"

అని భగవద్గీత చెపుతున్నది. ఇది దృష్టిలో పెట్టుకొని కావచ్చు, మైనాకుని చూచిన హనుమకు కూడ ఆశ్చర్యం కలిగినదని ఇలా వ్రాశారు :

ఆర్యులు పండితోత్తము లహంవిదులై చనువారికెందు నా
శ్చర్యమటంచుఁ గల్గదు, రసాతలమందున వారుకూడ నా
శ్చర్యము గాంతు రొక్కపుడు, శైలము టెక్కులతోడఁ జూచి యా
శ్చర్యము పొందె మారుతి ప్రసన్నపురాణ మహర్ష రూపమున్

(రా. సుం. పూర్వ. 55)

## కవితారూప తపస్సు :

ప్రాచీనులు గమనించినంతగా అర్వాచీనులు గమనించడం లేదు కానీ, కవిత్వ లక్ష్యం గురించి సత్యనారాయణగారి అభిప్రాయమే విశిష్టమైనది. దానిని వారిలా చెప్పారు:

కవితారూప తపస్సు చేసెదను శ్రీకంఠా మనస్సంయమా
దివిధానంబులఁ జేతకానితనమైతిన్ మూర్తసంవిత్కళా
యువతీభోగ హరింపఁజేయుటకు మారోద్ధుంఁజామీ యింద్రియా
దివికారంబులు భావనా విమల వాక్తీర్థంబు లేపారఁగన్.

(రా. అరణ్య. శబరి. 450)

## సిద్ధయోగం :

ఈ కవితాతపస్సు కవులకు సిద్ధయోగం. యోగమంటే చిత్తవృత్తి నిరోధం. మహేశ్వరునిమీద మనస్సును నిశ్చలంగా నిల్పటానికి కవిత్వం కవులకు సిద్ధయోగం. కాని, ఈ కవితా సిద్ధయోగానికి ఆ ప్రసిద్ధ యోగానికిలా ప్రాణాయామం బ్రహ్మచర్య నిరాహారాదుల ఖేదంకాని, ఇంద్రియ నిగ్రహంకాని అక్కరలేదు అని శివలీలార్ణవము వివరిస్తున్నది.

అనాయతప్రాణ మసంయతాక్ష
మబ్రహ్మచర్యానశనాదిఖేదమ్।
చిత్తం మహేశే నిభృతం విధాతుం
సిద్ధః కవీనాం కవితైవ యోగః॥

(శివలీలార్ణవం 1.26 అని భారతీనిరుక్తి పుట. 483)

సత్యనారాయణగారి వ్యక్తిత్వంలో రెండు సరళరేఖలు మనకు కనిపిస్తాయి. ఒకటి ఆయన కవిత్వభావన, రెండవది పరమేశ్వరుని పట్ల ఆయనకు గల భక్తి. ఇవి రెండూ ఒకదానికొకటి కలయనివిగా స్థూలదృష్టికి గోచరిస్తాయి. కల్పవృక్ష ఖండాంత కాండాంత పద్యాలలో గడచిన ఖండం గురించో కాండం గురించో చెప్పిన పద్యం ఒకటి, ఇంకొకటి తన మనఃస్థితిని గురించి చెప్పుకొనే పద్యం- అరణ్యకాండ శబరీ ఖండాంత పద్యాలి రెండూ చూడండి:

## కవిత్వ లక్షణోక్తి అవినయం కాదు :

అమృతోక్త్యంచితమున్ గథాకథన శిల్పానేక మార్గాభిరా
మము నిద్దాని సరణ్యకాండము ప్రథా మన్నింపవే దైత్యరా
పము పెంపొందిన వేల్పులన్ మనుచుటప్పా యట్టిదో, మ్లేచ్ఛభా
వము పెంపొందిన విప్రులన్ మనుచుటప్పా యట్టిదా ధూర్జటీ!

ఈ తినుటయుఁ దిరుగుటయును
ప్రీతింబడి వెట్టి మొట్టి విధములఁ జనుటల్
జేతోహరముగ నయ్యె ను
మాతరుణీప్రాణనాథ మన్నింపఁగదే. (రా అరణ్య. కాండ. 448, 449)

ఇలాంటి పద్యాలలో 'ప్రౌఢో సర్వకవిత్వ మర్మవిదుడన్' 'సద్యోనిర్గత మైన సర్వకవితా సంభారమున్' మొదలైన మాటలు చూచినపుడు 'అల నన్నయ్యకు లేదు....' మొదలైన పద్యాలలోలాగానే ఆయన ధిషణాహంకారం వీటిల్లో కనిపిస్తుందనిపించవచ్చు. అనిపించవచ్చునేమిటి? అనిపించి, రామాయణ కవికింకా వినయముండాలని అన్నవారు చాలామంది ఉన్నారు. కవు లిలా చెప్పు కొనడ మహంకారమయితే అహంకారి కాని గొప్ప కవి లేడనవలసివస్తుంది. చెప్ప వలసిన సమయం కనుక ఇది 'వస్తుగుణదీపిక' వంటి వాక్యమనుకోవాలి. అంతే. అదీకాక కేవల సన్న్యాసి వేరు, స్రష్ట వేరు. స్రష్ట రజోగుణమయుడు కావటం సహజం.

వ్యావహారికస్థితిలో ప్రతివారి ముందూ ఆయన వినయం చూపించనిమాట నిజం. దీనికి ఫలంగా వ్యావహారికంగా ఆయన చాలా నష్టపోయారు. కాని, అంతటివాడు ఏమీ కాని ప్రతివాని ముందూ వినయం చూపించి ఉండవలసిందను కోవటం ఆ అనుకొనేవాని అవినయాన్నే సూచిస్తుంది. బెర్నార్డ్‌షా అవినయం గుణం. విశ్వనాథది దోషం. ఇది ఎవరి దోషం?

## భక్తిలో వినయశీలి :

రామాయణంలో వరుసగా ఆయన తనను గురించి చెప్పుకొన్న వాక్యాలు గమనిస్తే భక్తుడుగా ఆయన ఎంత వినయశీలియో తెలుస్తుంది. నేను మనస్పూర్తిగా

నిని (బాల, అవతారిక 47), తెలినిక నూడుబంచు జగతిన్ గలరేకద వారిలోన నుజ్జ్వలతరు దేను (అయోధ్య, మునిశాప 527), నైకోద్రిక్త జనుర్నిమిత్తక మనేనః పుంజమున్, దానయోధ్య కాండమ్మది సాహితీ విమలతీర్థమ్మార్భ్పతన్ (అయోధ్య, అనసూయ 203) - ఇలాంటి వాక్యాలన్నీ దీన్నే చెపుతున్నాయి.

రచనకు సంబంధించని వేర్వేరు కారణాలవల్ల తమ రచనలను మెచ్చక పోగా ఖండనకు పూనుకొన్నవారపట్ల ఆయన ప్రాణం విసిగిపోయింది. ఇవి తాత్కాలికోద్రేక కారణాలు. కాని, ఆ కవితా తపస్వికి కావలసినది వరమేశ్వ రుని హృదయంతో తన ఎడద రాపిడి:

ఇది మెచ్చెదరో మెచ్చరొ,
యిదియును జదివెదరుఁ జదువ రేలా నా క
య్యది? నా యెద నీతో రా
చెద, నద్దానికి ఫలంబుఁ జెందించు శివా! (బాల. కళ్యాణ. 300)

## చదువరి లక్షణాలు :

భారతీయమైన అంతరాత్మను దర్శించి, దానిని అందరికీ అందించాలని తపన పడిన విశ్వనాథవారి రచనలను అర్థం చేసుకొనటానికి పఠిత సమకూర్చు కొనవలసిన సామాగ్రి చాలా ఉన్నది. అందులోనూ ఆయన రచనలలో కవి త్వంలో మేలుబంతి అనదగిన రామాయణ కల్పవృక్షపు అందాలు గమనించా లంటే పఠితకు కావలసిన అర్హత చాలా ఉన్నది. ఒకరు వ్రాసినది చదివేవాడిని మనవారు సహృదయుడన్నారు. సహృదయుడనగా మంచివాడని అర్థంలో వాడకం కనిపిస్తున్నది. నిజమే కాని, సహృదయుడు వట్టి మంచివాడు కాడు. అనేక గ్రంథముల పరిశీలనవల్ల అతని మనోముకురం స్వచ్ఛం కావాలి. రాగ ద్వేషమాలిన్యం దానికంటగూడదు. నిఘంటువులు మొదలయిన సాహిత్య పఠనకు ఉపయోగించే పరికరాలను అతడు పరిశీలించి ఉండాలి. అన్నింటికంటె ముఖ్యం ఆ గ్రంథ రచయితలో సమానమయిన హృదయం కలవాడు కావాలి. అతడు సహృయుడు. ఒక రచయితకుగల లోతునుబట్టి అతని వాక్కులు వెలువడుతూ ఉంటాయి. అతని యెత్తుకు పఠిత యెదిగి అతడు చూసేది చూడాలి గాని తన మరుగుజ్జురూపానికి కనపడకపోవటం రచయిత దోషంగా భావించటం కంటె అయోగ్యత మరొకటి ఉండదు.

విశ్వనాథ సత్యనారాయణగారు తెలుగులో, సంస్కృతంలో, ఆంగ్లంలో, కొంతవరకు హిందీలో వచ్చిన సాహిత్యం తదితర విజ్ఞానం ఆకళించుకొన్నవారు. ప్రతి ఒక్క శాస్త్రంలోనూ ఆయన ప్రత్యేక పరిశ్రమ చేసిన పండితులు అంతటి పండితుడు కాకపోవచ్చు. కాని, తాను గమనించిన ప్రతి శాస్త్రీయ తదితర విషయాన్నీ సందర్భానుగుణంగా ఉపయోగించుకొనగల నిర్మాణశక్తి పుష్కలంగా ఉన్నవాడు కనుకనే తన కవిత్వాన్ని అర్థం చేసుకొని ఆనందించాలంటే మూడు అర్హతలు ప్రధానంగా ఉండాలన్నారు. వాటిలో మొదటిది పూర్వాంధ్ర సంస్కృత కవుల రచనలు చదివినందున కలిగిన తేజస్సు హృదయంలో ఉండాలి రెండవది స్వచ్ఛమైన యోగ్యమైన బుద్ధితో అనేక శాస్త్ర రహస్యాల మంచిచెడ్డలను నిర్ణయించుకొనగల విచక్షణత ఉండాలి. మూడవది మనస్సుకు గొప్ప కల్పనలంటే ఇష్టం ఉండాలి. ఈ మూడు లక్షణాలూ ఉన్న పక్షంలో విశ్వనాథ కవిత్వం - రామాయణం - పఠించాలి. అప్పుడు అది కల్పవృక్షంలా అడిగిన అపేక్షించిన సర్వానందాలనూ కలిగిస్తుంది.

> ఎదకు పురాంధ్ర సంస్కృత కవీశ్వరభారతి దీప్తి కల్గినన్
> సదమల బుద్ధికిన్ సకలశాస్త్ర రహస్యవివేక మబ్బినన్
> మదికి నుదాత్త కల్పనల మక్కువ కల్గిన విశ్వనాథ శా
> రద సకలార్థదాయిని సురద్రుమ రామకథన్ భజింపుమీ.
>
> (రా.బాల. అవ. 36)

## పాండిత్యం - వినియోగం :

సత్యనారాయణగారు ప్రాచీన కాలానికి చెందిన విద్వత్కవుల కోవకు చేర్చవలసినవారు. వారు ఎంత మహాపండితులో తమకు కలిగిన పాండిత్యమంతా అసందర్భంగా తమ రచనలలో ప్రదర్శించరాదు కాని పాండిత్యం పలు విషయాలలో ఉండాలి అన్న రహస్యం తెలిసినవారు. ఈ రహస్యం భవభూతి వాక్కులలో మనకు తెలుస్తుంది.

> యద్వేదాధ్యయనం తథోపనిషదాం సాంఖ్యస్య యోగస్య చ
> జ్ఞానం తత్కథనేన కిం స హి తతః కశ్చిద్గుణో నాటకే
> యత్ప్రౌఢిత్వముదారతా చ వచసాం యచ్చార్థతో గౌరవం
> తచ్చేదస్తి తతస్తదేవ గమకం పాండిత్యవైదగ్ధ్యయోః.

## అర్థం చేసుకొనవలసిన బాధ్యత చదువరిదే :

మహా రచనలు అర్థం చేసుకొని ఆనందించటానికి మనం చేయవలసిన ప్రయత్నం మనము చేయక నాకు అర్థమయేటట్లు వ్రాయలేదని నిరసించటం మనస్థితిని మాత్రమే తెలియజేస్తుంది ఒక రచన మనము చదివామంటే భాషలో మనశక్తి పెరగాలి. రచనాశిల్పంలో మన అవగాహన పదునెక్కాలి. భావాలను తూచటంలో మన వివేకం స్వచ్ఛతరం కావాలి. భావాలను మనం అన్నింటినీ అంగీకరింపకపోయినా ఆ రచయిత తదితర విషయాలలో మనను ఆకట్టుకో గలిగాడంటే అతడు నిస్సందేహంగా గొప్ప రచయిత. భాషమీద ఎంత అధి కారం ఉంది దానిని ఎంత మెలకువతో ఉపయోగించగలిగితే అతడంత గొప్ప.

## విశ్వనాథ సాహిత్యం చదివితే :

పశ్యేయమేకస్య కవేః కృతిం చేత్
సారస్వతం కోశమవైమి రిక్తమ్।
అంతః ప్రవిశ్యాయ మచేష్టితశ్చేత్
కోణే ప్రతిష్ఠా కవికోటిరేషా॥

(శివలీలార్ణవమ్ 1-18 భారతీనిరుక్తి పుట. 483)

ఒక కవి కావ్యం చదివితే సారస్వతకోశం ఇతడు కొల్లగొట్టినందువల్ల ఖాళీ అయిపోయినట్లు కనిపిస్తుంది అనినమాట విశ్వనాథ వారి రచనలకు వర్తి స్తుంది. విశ్వనాథ వారి రచనలన్నీ మాట అటుంచండి. వేయిపడగలూ రామాయణమూ ఈచివరినుంచి ఆ చివరివరకూ చదివి, ఒక పదం మిగలకుండా దాని స్వరూప వివేచనతో సహ అర్థం చేసుకొని, వాటిలోని భావాలు నాకు అర్థ మయాయి అని చెప్పగలిగితే అతనిని పట్టగలవాడు విశ్వనాథ మినహా మరొక డుండడు.

విశ్వనాథ చదివిన సమస్తాంధ్రాంగ్లసారస్వత వివేచనాబలమూ, ఆయనకు గల సమస్తవిషయానుభవ ఫలమూ అతనికి దక్కటమే దానికి హేతువు. ఇది అల్పమైన విషయం కాదు.

## వేయిపడగలు విజ్ఞాన సర్వస్వం :

విశ్వనాథ వారి భారతీయ దర్శనానికి గౌరీశంకర శిఖరతుల్యమైనది వేయిపడగలు. భారతీయమైన సర్వజ్ఞాన విజ్ఞానగరిమకూ అది ఒక సర్వస్వం.

## పాతివ్రత్యం :

పాతివ్రత్యానికి చేసిన ఈ వివరణ పరికించండి: "ఎంత యోగాభ్యాసము నను స్వామి సంపూర్ణమూర్తి సాక్షాత్కరించదు. ఏ యంగమునందును బుద్ధి నిలువదు. ఒకవేళ నిలిచెనా, యంతలో మరలా జెదరిపోవును. రుక్మిణమ్మా రావుగారి పూర్వపుణ్య మెంతయో, ఆమె యింద్రియముల నెంత యదుపులోఁ బెట్టెనో, ఆ తపో మహిమ యెట్టిదో, లీలాశుకునికైనఁ బ్రత్యక్షముగాని స్వామి రాణిగారికి కెక్కువ మనోహరాకారామును గనఁబరచెను, అందులోఁ దాను కృష్ణమనాయనివోలె వచ్చి రుక్మిణమ్మారావు పాతివ్రత్యము భగవంతునియందు ఫలించెనన్నట్లు వ్యాఖ్యానము చేసెను" (పుట. 80)

## దారిద్ర్యం : వ్యావహారిక తాత్త్విక దశలు :

దారిద్ర్యానికి పురాకృత కర్మకూ సంబంధం ఉన్నదనటం పౌరుషవాదు లంగీకరించరు. వ్యావహారికదశలో అంగీకరించగూడదు కూడా. కాని తాత్త్విక దశలో? "దారిద్ర్యముకూడఁ బూర్వజన్మకృత కర్మఫలము. అనుభవించనే వలయును. అనుభూతిచేఁ గాని కర్మ నశించదు. ఏనాఁడో యెవనికో పెట్టలేదు, ఈనాఁడు దొరకలేదు. ఇది తత్త్వము" (పుట 188).

## సంగీతోత్పత్తి:

సంగీతం గురించిన వివరణం చూడండి: మామిడాకులో అన్నీ ఈనెలే. సంగీతంలో అన్నీ శబ్దాలే. సంయోజనచైపుణ్యంవల్ల సంగీతం (పుట 214). ఇదే అభిప్రాయం సకల కళలకూ అన్వయింపజేయవచ్చు, కవిత్వంతో సహా.

## సంగీతానుభూతి :

సంగీతప్రసక్తి వచ్చింది కనుక ఇక్కడే సంగీతానుభవం గురించి చెప్పిన సంగతికూడా చెపితే బాగుంటుంది. అది చాలామంది సందేహానికి దొరకని జవాబు.

"సూర్యపతి: సంగీతము పాడుచుండఁగా మనకెందుకంత యానందము, పాడెడువారు సంగతులు వేయుచుండఁగా నవి మనకును వచ్చినట్లే యుండును మరల నది చేతఁగాదు. నాకిది యెప్పుడును చిత్రముగా నుండును.

"ధర్మారావు : లోకమంతయు నైదు భూతములు. అయిదు తద్గుణములు ఐదింద్రియములు. ఆ యయిదు భూతగుణములు నీ యింద్రియములకు విషయములు. ప్రపంచమంతయు నీ యింద్రియ తద్విషయములలో నిముడియున్నది. ప్రతిమనిషియుఁ బంచభూతములయు తద్గుణములయుఁ బ్రతిబింబించు స్థలము అనగా నితని యందు సూక్ష్మరూపమున నవి యన్నియు నున్నవన్నమాట. కాని, సర్వము తానేనని తెలిసికొనలేదు ఛాయగా నీ సంగతి యతనికి తెలియును. దానినే తెలిసీ తెలియని స్థితి యందుము. ఈ తెలియకపోవుటలో తెలియుటయు కలదు. మనిషి సామాన్యముగ ప్రపంచమునందున్న సర్వభోగ పదార్థములు వాంఛించును అంతయు ననుభవించగల శక్తి అతనియందున్నది. కనుకనే అట్లు వాంఛించును. కాని ఆ శక్తి విజృంభింప చేయవలయును. అచ్చటనే పూర్వజన్మకృతకర్మ మడ్డు వచ్చును. అట్లే ప్రతివ్యక్తి యందును సృష్టిలోనున్న సర్వశబ్దము బీజరూపమున సన్నిహితమై యుండును. తచ్ఛబ్దానుభవ మతని సూక్ష్మశరీరికి కలదు కాని, స్థూలశరీరికి లేదు. సంగీతము వినుచుండ తన్మయత్వ స్థితిలో మనమందఱమా సూక్ష్మశరీరికి దగ్గరగా నుండి అతడెఱిగిన సర్వశబ్దానుభవము పొందుచుందుము అందుకనియే ఆ యానందము పొందుచుందుము. ఆనంద మాసూక్ష్మశరీరి లక్షణములలో నొకటి. ఈ దేహమున కానందము లేదు. దేహగతాత్మకును లేదు. తదతీతమైన యాత్మకు గలదు. తదతీతాత్మకు సన్నిహితముగా నుండుటయే కళ లానందించునవుడు మనముండునట్టి స్థితి. కళలు దైవికములని చెప్పట కూడ నిందుకనియే తెలిసినదా?" (8 వ అధ్యాయం, పుటలు 205, 6 )

## వేయిపడగల పోలిక :

వేయి పడగలకు, స్వామికి, పరిపాలకునికి, పండితునికి ఇచ్చిన వివరణం కూడ తెలిసికొనవలసినవి. ఒక ధర్మముమీద వేయి సంస్థలు వెలసినట్లు స్వామి ఏకశరీరముపై సహస్ర శిరస్సులు ప్రకాశించెను.

## ధర్మము, ఆచరణము, ప్రచారము :

ధర్మము, తదాచరణ, ప్రచారము - మూడును నొకటిగానై యభేద తాదాత్మ్యము పొందునట్లు స్వామియు, ప్రభువును, ధర్మారావును నేక దేశగతులై ప్రకాశించిరి. (2 వ అధ్యాయం, పుట 36 )

## పడగల సంకేత వివరణం:

వేయి మాత్రమే కాకుండా నాలుగు, రెండు, ఒక పడగల వర్ణనం కూడ ఆ నవలలో వస్తుంది. ఆ సంకేత వివరణం కూడ తెలుసుకొనవలసిందే.

"ధర్మారావు స్వామిని మనసా ధ్యానించెను-వేయి పడగలతో నేల తాల్చిన వాడు, నాల్గు పడగలతో పురుషార్థములు సాగించినవాడు, రెండు పడగలతో దంపతులఁ బాలించువాడు, ఒక్క పడగ విప్పి పైరుపచ్చకు గొడుగు పట్టిన వాడు, త్రిమూర్త్యాకృతి, శూలము నాలుకయందు, శంఖచక్రములు ఫణాగ్రములయందుఁ దాల్చిన దేవుడు, ధర్మమయ తనువు, కరుణాతరంగితాంతరంగుడై నన్ను గూడ నా పితరులనువలెనే సంప్రదాయమునకు దూరము కాకుండ కాపాడువాడు నాకుఁ బ్రసన్నుడగుఁ గాక! నన్ను సర్వథా రక్షించుఁ గాక!" (6వ అధ్యాయం, పుట 111).

## రామేశ్వరశాస్త్రి :

'వేయిపడగలు' నవలలో చాలా పాత్రలు వ్యక్తులు కావు. ప్రతీకలు. అది గమనించనందువల్ల రచయితకు లేని అభిప్రాయాలు అంటగట్టడంకూడా జరుగుతుంది. వాటిలో రామేశ్వరశాస్త్రి పాత్ర ఒకటి. 'అయన వర్ణాశ్రమ ధర్మములన్నియు ముద్దకట్టిన మూర్తి. అయన భారతదేశముయొక్క యాత్మ. ఆయన త్రయీవిద్య కొక వ్యాఖ్యానము.' (మూడవ అధ్యాయం, పుట 50.)

భారతీయ జీవనంలో దానానికున్నంత ప్రాధాన్యం అంతా ఇంతా కాదు. అది అనేక సామాజిక - ఆర్థిక - మానసిక - ఆధ్యాత్మిక - ఐహిక - ఆముష్మిక సమస్యలకు సకల సంతృప్తికరమైన, ఎవరికీ బాధాకరం కాని, దాతృగ్రహీత ఉభయులకూ ఆనందదాయకమైన పరిష్కారము. అందులోను గుప్తదానం దాన భావనకే పరాకాష్ఠ. దానిగురించి ధర్మారావు వ్యాఖ్యానం చూడండి. సందర్భం రంగాజమ్మగారు సెట్టిగారిద్వారా చేసిన గుప్తదానం. 'ధర్మారావు:- గుప్తదానము చేసినవారు మహాలోకములనో పొందుదురట, ఆ లోకముల సౌభాగ్యము చెప్పలేము ' (7వ అధ్యాయం, పుట 180.)

## వచ్చిన చోటికిపోక : పంచాగ్ని విద్య :

వేయిపడగలు అందించిన మణిదీపములలో పంచాగ్ని విద్యా వివరణ యొకటి. గిరిక నాడు తరింపనున్నది. ఆమె ఇంటనున్న నంద్యాల వారాంగన ఒక పద్యం పాడింది. అది ఇది :

"మచ్చిక వీరికెల్ల బహుమాత్రము చోద్యము దేహి పుట్టుచున్
జచ్చుచు నుండఁ జూచెదరు చావునకొల్లక డాగవచ్చునే
చచ్చినవారికేడ్చెదరు, చావక మానెడువారిభంగిఁ దా
నెచ్చటఁ బుట్టె నచ్చటికి నేగుట నైజము ప్రాణికోటికిన్."

ఈ పద్యాన్ని విన్న తర్వాత 'హరప్ప ధర్మారావులు తిరిగిపోయిరి. దారిలో హరప్ప ధర్మారావును చూచి ఎచ్చటఁ బుట్టె నచ్చటికి నేగుట నైజము ప్రాణికోటికి ననగా నేమి? అనెను. ధర్మారావు పంచాగ్ని విద్యయని యొక విద్య యున్నది అందులో నైదగ్నులు. ఈ లోకము, పర్జన్యుడు, పృథివి, పురుషుడు, స్త్రీ యను నైదగ్నులు. వాని హోమప్రక్రియ వేఱే యున్నది. కర్మ మయమైన యీ లోకమునుండి జలము పర్జన్యలోకము చేరును. పర్జన్యుడు వర్షించి పృథివిలోఁ జేరును. దానిని పురుషుడు భుజించును. పురుషుని వలన స్త్రీ యందు గర్భోత్పత్తి కలుగును. ఇదీ వరుస. 'స జాతో యావదాయుషం జీవతి. తం ప్రేతం దిష్టమితోగ్నయ ఏవ హరంతి, యత ఏవేతో యతస్సం భూతో భవతి.' ఈ రీతిగాఁ బుట్టిన వాఁడెన్నాళ్ళాయుర్దాయముండునో మాటి మాటికి ఘటీయంత్రము వలె, ననగా ఏతాములోని కుండవలె, బోవుటకు వచ్చు టకు కర్మము చేయుచు కర్మము వలన నెంత యాయువు కలిగెనో యంత వరకు జీవించుచున్నాడు. ఆ క్షీణించిన యాయువు కలవాడు చనిపోగా నతనికై నిర్దేశింపబడిన పరలోకమును గూర్చి బ్రతికియుండి వైదికకర్మ చేసినచో జ్ఞాని యైనచో వాడు చనిపోయినచో వాని నగ్నిని గూర్చి హరించు చున్నారు. పుత్రాదులు గాని కర్మచేయువారు గాని యే యగ్నినుండి యిచ్చటికి వచ్చెనో (శ్రద్ధాద్యాహుతుల వలన వచ్చును) యే యైదగ్నులనుండి పుట్టెనో యా యగ్ని కొఱకే యితనిని హరించుచున్నారు. అనగా వానికర్మచేత నే యోని నిర్ణయింపబడెనో, యా యోనినే, యా యగ్నినే యాపాదించుచున్నారని యర్థము. అనగా స్వస్వ కర్మానురూపమైన యోనియందే జీవుడుత్పన్నమగు చున్నాడని యర్థము. (29 వ అధ్యాయం పుట 737 - 38.)

## చత్వారింశత్సంస్కార వివేచనం :

భారతీయజీవనంలో శ్రుతులతర్వాత ప్రాధాన్యం వహించినవి స్మృతులు- అనగా ధర్మశాస్త్రాలు. గౌతమధర్మసూత్రాలకు ఎనలేని ప్రాధాన్యమున్నది. వేయిపడగలు రాసేనాటికే సత్యనారాయణగారు గౌతమధర్మసూత్రాలు కూడా సవిమర్శకంగా చదివి, మననం చేసి, వివేచించి, అందులోని విషయాలను సందర్భానుగుణంగా ఉపయోగించుకొనేస్థితిలో ఉన్నారు - ఈ వాక్యం చూడండి. "సోమయాజులుగారు (అష్టచత్వారింశత్ - 48 - సంస్కారములలో) ఆత్మగుణములకన్న చత్వారింశత్‌సంస్కారములకే ఎక్కువ ప్రాధాన్యమిచ్చువాడు. దయాదాక్షిణ్యములకు నాయనకు మిక్కిలి దూరము. కర్మ యథావిధిగా జరుగవలయు ననుటలో మొదటివాడు. (2 వ అధ్యాయం పుట 23.)

నేను స్కాందరేవాఖండం అనువదించే సందర్భంలో అందులో ఈ అష్టచత్వారింశత్ సంస్కారాల ప్రస్తావన వస్తే స్ఫురణకు రాక ఎందరో పండితులను అడిగితే షోడశసంస్కారాలే కాని అష్టచత్వారింశత్ సంస్కారాలెక్కడున్నాయన్నారు. తర్వాత నేను తెలుసుకొని ఆ గ్రంథంలో వివరించాను. కావలసినవారు నా రేవాఖండం మొదటి సంపుటం పుటలు 159 నుండి 168 వరకు చూడవచ్చు. దానిని అన్నవరం దేవస్థానం ప్రచురించింది.

## పతాకా ప్రతినాయకుడు :

అష్టచత్వారింశత్సంస్కార విషయంలాగే నాట్యశాస్త్ర విషయంకూడా కథా కథనంలో అలవోకగా చెప్పటానికొక ఉదాహరణ: "కుమారస్వామి.... రామాయణ పతాకాప్రతినాయకునిఁ గొట్టఁబోయెను." ఈ ప్రతినాయకుడు వాలి. అది మంగమ్మ పెంపుడు కోతి. ఈ వాక్యంలోని చమత్కారం పతాకమీద ఆధారపడియున్నది. ప్రధానేతివృత్తం కాక ప్రాసంగికంగా వచ్చిన ఇతివృత్తం రెండు రకాలు. పతాక, ప్రకరి అని. ఒక సందర్భంలో వచ్చి అంతలో ఆగేది ప్రకరి. శబరి వృత్తాంతం. పతాకాప్రధానేతివృత్తంతో పాటు కొనసాగేది పతాక. వాలిసుగ్రీవ కథ. చూ॥ దశరూపకం.

## నాట్యంలో ముద్రలు :

భాషా సాహిత్యాదులకు సంబంధించి సత్యనారాయణగారికి గల గాఢ సునిశిత గంభీర వైదుష్యం అసమాన్యం. నాట్యంలో రకరకాల ముద్రలు వస్తాయి. వాటిని గురించి ఆయన ఇచ్చిన వివరణం చూడండి: "గిరిక-ముద్రలు విద్యాస్వరూప మన్న మాట నిజమే. ఇవి ఎందుకేర్పరిచిరో నాకుఁ దెలియలేదు. ధర్మారావు - మనోభావములను బహువిధములుగాఁ తెలియజేయవచ్చును. ప్రధానమైనది భాష. అట్లే ముఖావయవములు, శరీర విన్యాసము, కర చరణ ములు - వీనితోగూడ భావప్రకటన చేయవచ్చును. ఈ భావ ప్రకటన యంతయు దోష సహితమై యుండును. మాటాడుచుండగా మనము రెండు రకములు దోషములు చేసెదము. ఒకటి అనౌచిత్యము, రెండు అపభ్రంశము. అపభ్రంశము లేకుండ వాక్కును శాసించునది వ్యాకరణ శాస్త్రము. అనుచితము లేకుండ శాసించునది యలంకార శాస్త్రము, అట్లే భరతశాస్త్రము చరణాద్యవయవ విన్యాసమును శాసించును. ముద్రలు హస్తాభినయమును శాసించును. అనగా ముద్రలు దోషరహితమైన కరకృత భావప్రకటన మన్నమాట. (14 వ అధ్యాయం పుట 355.)

సామాన్యంగా భాష ఏదైతేనేం భావం ముఖ్యం కానీ అంటూ ఉంటారు. సామాన్య వ్యవహారానికి చెందినంతవరకు అది నిజం కావచ్చు కానీ, వాస్తవం కాదు. దాని స్వరూపంగురించి విశ్వనాథవారి పక్కణ గమనించండి. "సంఘము మతము రాజకీయవిషయములు మొదలైన మానవజీవితము యొక్క లోతులను తెలియజేయు మనోభావములు చెప్పినది నిజమైన భాష. కొన్ని శబ్దములు కొన్ని వాక్యములు నిస్పష్టములుగా జాతుల భిన్న స్వరూపములను గోచరింపచేయును. అది జాతియొక్క యాయువుపట్టు.'' (17 వ అధ్యాయం పుటలు 506 - 511.) దీనికుదాహరణముగా తన రక్షణలో ఉండి నదిలో కొట్టుకొనిపోయిన బిడ్డలమీది జాలితో తానుకూడా ప్రాణాలు వదిలిన బడిపంతులు కథ చెప్పి, ఒక ఇంగ్లీషు చదివినవాడు ఈ కథ విని "బ్యూటిఫుల్'' అన్నాడనీ, తెలుగువాడు 'అయ్యో పాపం!' అంటాడనీ చెప్పి, అలా అనటానికిగల కారణాలనూ వివరించారు.

## సర్వమత సమాన బుద్ధి :

మతసామరస్యం అవసరమే, తప్పక కావాలి, ఒకరి విశ్వాసాలను మరొకరు ఎంతైనా గౌరవించాలి. కాని, ఇది తన విశ్వాసాన్ని వదులుకొనడంగా పరిణమించకూడదు. ఈ విషయాన్ని విశ్వనాథ ఇలా చెప్తున్నారు : "రంగయ్య గారు - చాల సాధువైన మనిసి దివ్యజ్ఞాన సమాజమునకు చెందినవాడయినను సనాతన మతమునందు నిరాదరణకాని కర్మములు మానివేయుటకాని చేయ లేదు. అన్ని మతములకు నదొకరీతిగ ముడిపెట్టుట, అన్ని మతములందును యాదార్థ్యమున్నదనుట, యెచ్చట నుంచి యున్నదో యచ్చట గ్రహించవలయు ననుట, దేనియందును నిశ్చయజ్ఞానము లేక ఇతో భ్రష్ట స్తతో భ్రష్టః యగుట - బ్రదుకుతెరువునకు ముఖ్యధర్మము. ఈ కాలమున నది యవశ్యాచరణీయము. సామాన్యముగా నున్నతోద్యోగులు, ఉద్యోగరీత్యా యభివృద్ధికి రానిచ్చగించిన వారు చెప్పెడు సిద్ధాంతములివి." (13వ అధ్యాయం, పుట 339)

## ఆంగ్లసాహిత్యంకంటె ఆంధ్రసాహిత్యం తక్కువ కాదు :

ఆంధ్ర సాహిత్యం ఆంగ్ల సాహిత్యముకంటె తక్కువ కాదన్నది సత్య నారాయణగారి తర్కసహమైన అభిప్రాయము. ఆంగ్ల సాహిత్యంలో కల ప్రక్రియలో కొన్ని ఆంధ్రసాహిత్యంలో కాకపోవచ్చుగాక; ఆంధ్ర సాహిత్యంలో ఉన్న అద్భుత ప్రక్రియలు అందులో లేవుకదా? ఆంగ్లం తప్ప ఆంధ్రం చదవని దోషమిది అంటారు.

## భారతీయులు చెప్పినదే వేదార్థం :

అలాగే వేదాలు విద్యారణ్యాదులకంటె 'ఎవనికో ఎక్కువతెలియుననుట' విని సహించలేరు. ఇది కూడా నిష్కారణం కాదు. శబ్దాని కర్థం తెలియటం వేరు. అనేకంగా స్ఫురించే అర్థాలను సంప్రదాయాన్నిబట్టి నిర్ధారించడం వేరు." (30వ అధ్యాయం పుటలు. 768 - 775.)

## కావ్య విమర్శ ఎపుడు? ఎలా? :

అలాగే కావ్యవిమర్శ కావ్యం చదువుతూనే చేసుకొంటూ వెళ్ళాలా? చదివినతర్వాత చెయ్యాలా? అన్న విషయంకూడా సూక్ష్మంగా చర్చిస్తారు.

## ఆముక్తమాల్యదలో వర్ణనలు :

ఆముక్తమాల్యదలో సుదీర్ఘ వర్ణనలుండటం లోపమని కొందరంటారు. అది లోపం కాక పోగా ప్రత్యేకమైన సుగుణమని సత్యనారాయణగారి అభిప్రాయం. అవి తీసేస్తే ఆముక్తమాల్యద ఏముంది? (8 వ అధ్యాయం పుటలు. 200 - 212.)

## కాలవైపరీత్యం :

కాలవైపరీత్యం గురించి ఈ దేశంలో స్థిరమైన అభిప్రాయాలున్నాయి. కృత - త్రేతా - ద్వాపర - కలియుగ దృష్టి కలవారు దీనిని పేర్కొనకుండా ఉండలేరు. 'కాలవైపరీత్యమనగా నిట్టిది. ఏది సదుద్దేశముతో చేయుదువో దానికి కూడ విపరీత వ్యాఖ్యానములు జేయబడును.' (1 వ అధ్యాయం పుట 17.)

## గ్రహచారము :

జీవితంలో జరిగే అనేక సంఘటనలకు గ్రహచారం కారణమని భారతీయుల విశ్వాసం. సత్యనారాయణగారికి ఇది దృఢంగా ఉంది. ఆయనకు జ్ఞానపీఠ పురస్కారం వచ్చినపుడు పత్రికా విలేఖరులు వచ్చి, మీకిది వచ్చిందిగదా, ఏమంటారు? అని అడిగితే, "ఇప్పటికి గ్రహాలు నా కనుకూలంగా ఉన్నాయి. దాని ప్రభావమే అంటాను" అని చెప్పారు. దీన్నే రామాయణంలో మరొక విధంగా చెప్పారు.

తమ్ము డెదురు తిరుగుఁ దన యాలు నిందించు
నేమి చేయఁ బోయి యెదురు వచ్చు
పట్టు తొలఁగి నీళ్ళపై రాళ్ళు తేలును
గ్రహచయంబు చెడ్డగాఁ దిరిగిన.

(కల్పవృక్షం - సుందరకాండ, పూర్వరాత్రి 159.)

## భక్తి జ్ఞానాలు :

భారతీయ జీవనంలో భక్తిజ్ఞానాలు గంగా యమునలవంటివి. వాటి గురించిన విశ్వనాథవారి వివరణ: ఇద్దరు స్త్రీ పురుషుల సంభాషణం: పురుషుడు: భక్తి వేరు, జ్ఞానము వేరు. జ్ఞానమందరికిని గలుగదు. స్త్రీ:శివుడు సేవనీయుడా, విష్ణువు సేవనీయుడా? .... పురుషుడు : అది లీలాశుకులు పాడిరి. సంసారే కిం సారం కంసారేశ్చరణ కమల పరిభజనం జ్యోతిః కిమంధకారే యదంధకారే

రనుస్మరణం॥ భక్తియోగులకుఁ గృష్ణస్వామి సులభుడు. జ్ఞానయోగులకు శివుడు సేవనీయుడు. స్త్రీ : సేవనీయుడందువే, సులభుడు కాదా? పురుషుడు: తల్లీ! జ్ఞానయోగము సులభము కాదు.. స్త్రీ : భక్తి అనగా నేమి? జ్ఞానమనగా నేమి? పురుషుడు: ఆ సర్వము బ్రహ్మము. బ్రహ్మమనగా బ్రహ్మవిష్ణుమహేశ్వరులలో బ్రహ్మ కాదు. ఈ త్రిమూర్తులకు అతీతమైన యొక శక్తి. అది నిర్గుణము, సచ్చిదానంద స్వరూపము....ఇంద్రియములు వాని విషయములు తద్గుణములు, సర్వము నబద్ధము. అబద్ధమన్న జ్ఞానము బహుజన్మ పరిపాకముచేత సహజమైనచో నతడు జ్ఞానియై సంసారబంధము నుండి విముక్తుడగును.' (5 వ అధ్యాయం పుట 84.) ఆ స్త్రీపురుషులు గిరికా ధర్మారావులు.

విశ్వనాథ భారతీయ దర్శనం గురించి సమగ్రంగా సమర్థంగా చెప్పటమనేది నావంటివానికి ఈ పరిధిలో జరిగే పనికాదు. కొన్ని మంచుముక్కలు చూపించి, ఇలాంటి వాటితో భూమిలో చాలాభాగం మీద ఆకాశం అంత ఎత్తున ఉంటుంది హిమాలయం అని చెప్పటంవంటిదే ఈ ప్రయత్నం. ఇద్దరు శ్రీమంతుల కర్పూరపు పలుకులు వెలిగించి ఈ నివాళి పూర్తి చేస్తాను.

ఎవరయ్యా సరి విశ్వనాథులకు బ్రాహ్మీదత్తసాహిత్యసం
స్తవనీయ ప్రతిభాసనాథులకు విశ్వస్తుత్య పాండిత్యవై
భవ సంప్రాప్త యశోధినాథులకు నిర్వ్యాజానురాగంబునన్
కవితాయోగమునన్ ప్రసన్నరసవద్గాథా ప్రయోగంబునన్?

—కరుణశ్రీ.

మాటలాడే వెన్నెముక
పాటపాడే సుషుమ్న
నిన్నటి నన్నయభట్టు
ఈనాటి కవిసమ్రాట్టు
గోదావరి పలుకరింత
కృష్ణానది పులకరింత
కొండవీటి పొగమబ్బు
తెలుగువాళ్ళ గోల్డునిబ్బు

అకారాది క్షకారాంతం
ఆసేతు మహికావంతం
అతగాడు తెలుగువాడి ఆస్తి
అనవరతం తెలుగువాడి ప్రశాస్తి
ఛందస్సులేని ఈ ద్విపద
సత్యానికి నా ఉపద

—శ్రీశ్రీ.

# విశ్వనాథ : జాతీయతాదృష్టి

'సాహిత్య బ్రహ్మ'
డాక్టర్ వి.వి.యల్. నరసింహారావు

విశ్వనాథను, జాతీయదృష్టిని విడదీసి చూడటం అసాధ్యం. ఆయన పలికిన ప్రత్యక్షరం జాతీయతా భావం నుండి ప్రభవించిందే. ఈ దేశానికి స్వాతంత్ర్యం సముపార్జించి పెట్టిన మహాత్మ గాంధీ అంటే విశ్వనాథకు ముత్యాల కలు. ఆ మహాత్ముడు దారుణంగా హత్యచేయబడిన వార్త విశ్వనాథ చెవి సోక గానే ఆయన నిలువునా నిర్విణ్ణుడైనాడు. మహాకవికి మాటలు పెగలలేదు. ఆర్తి నిండిన గొంతునుండి ఆశ్చర్యకరమైన ఓంకారనాదం వెలువడింది.

''ఓయి! ఓయి! ఓయి! ఇదేమి టోయి! అతడు మానవుండా?!"

వాల్మీకి నోటవెడలిన "మా నిషాద! ప్రతిష్ఠాంత్వం అగమశ్శాశ్వతీస్సమాః" అనే శ్లోకానికి తుల్యమైన గీతం వెలువడింది విశ్వనాథ నోట.

విశ్వనాథ శతజయంతి మహాత్మ గాంధి 125వ జయంతితో (2 10.94) కలిసి యువభారతి ఆధ్వర్యంలో కూడా జరగటం ముదావహం. ఈ సందర్భంలో విశ్వనాథ జాతీయతా దృష్టిని గూర్చి ప్రసంగించే అవకాశం నాకు కలిగినందుకు ఎంతో ఆనందిస్తున్నాను.

భారతీయులు బానిసతనంలో మగ్గుతున్ననాళ్ళలో చెలరేగిన జాతీయో ద్యమం చిమ్మచీకటిని చీల్చుకుంటూ వెలువడ్డ ఉషఃకాంతిలా సర్వజీవుల బ్రతుకుల్లోను ప్రాణకళను ప్రతిష్ఠించింది. అంతవరకు ఈ జాతిని పాలిస్తున్న తెల్లవాడు భారతజాతి సంస్కృతిని గూర్చి, చరిత్రను గూర్చి మనకు సత్య విష యాలు తెలియనీయకుండా రాజ్యం పాలించాడు. భారతీయమైన ప్రాచీన సంస్కృతి గ్రీకు సంస్కృతి కంటె ప్రాచీనమైనదని కాని, ప్రపంచంలోని సర్వ

సంస్కృతులలోను గణనీయమైన గొప్ప సంస్కృతి అని కాని సుతరాము మనకు తెలియనీయకుండా తెల్లవాడు ఈ దేశాన్ని పాలించాడు. తన పరిపాల నను సుస్థిరం చేసుకోవటానికి వీలుగానే భారతదేశపు నిజమైన చరిత్రను భారతీ యులకు తెలియనీకుండా చరిత్రను వసివూసి మారేడుకాయ చేశాడు. పాలక జాతి భాష అయిన ఇంగ్లీషును అనివార్యంగా నేర్చుకొని ఆరాధించవలసిన దుఃస్థి తిని ఆనాడే కల్పించాడు. దాని ప్రభావం నేటికి మనం అనుభవిస్తున్నాం ఇంగ్లీషు లేకుండా వరసగా నాలుగు తెలుగుమాటలు మాట్లాడాలంటే అసాధ్యమైపోయింది.

ఈ దుస్థితికి కారణభూతమైన ఆంగ్లేయ పాలనమీద రాజకీయమైన తిరుగు బాటు మాత్రమేకాక, సాంస్కృతికమైన తిరుగుబాటును కూడా కొనసాగించిన మనత భారత జాతీయోద్యమానిదే. ఎన్నెన్ని త్యాగాలో చేసి సాధించుకున్న స్వాతంత్ర్యాన్ని తలచుకొని గర్వపడని భారతీయుడుండడు.

అయితే, ఇంత కష్టపడి సాధించుకున్న స్వాతంత్ర్యాన్ని సుస్థిరం చేసు కోవటం కూడా అంత తేలికైన పనికాదు. స్వేచ్ఛ వచ్చేవరకు ఒక పరిస్థితి; వచ్చిన తరవాత మరొక పరిస్థితి. ఈవేళ - అంటే స్వాతంత్ర్యం వచ్చిన 47 సంవత్సరాల తరవాత - మతకల్లోలాలతో, కులద్వేషాలతో, స్వార్థబుద్ధులతో దేశీయులు పరస్పరం కీచులాడుకొనే పరిస్థితి చూస్తే-"తెల్లవాడు పాలించిన రోజు ల్లోనే ఇంతకంటే సుఖంగా ఉన్నాయురా!" అని అనుకునేవాళ్ళు కూడా లేకపోలేదు. భారతదేశంలో ఇంతకాలం తరువాత వ్యాపించిన ఈ దురదృష్టకర పరిస్థితిని విశ్వనాథ సత్యనారాయణ స్వాతంత్ర్యం వచ్చిన తొలినాళ్ళలోనే పసికట్టారు. జాతిని ఆనాడే తీవ్రంగా హెచ్చరించారాయన. చూడండి.

ధృతి మన్నించి పరాయివాడు తనదారిన్ తానుపోగా సము
న్నతి స్వాతంత్ర్యము వచ్చి పడ్డదనుకొన్నన్ వానిదే పిచ్చి; సం
గతికాండై౯ పౌరపింతలేక కలతల్ కల్లోలముల్‌గా ప్రచం
డ తరంగార్ణవమెల్లఁ జేసికొనకుండన్ చూచుకో గావలెన్.

(1947-త్రిలింగపత్రిక.)

తెల్లవాడు తన దారిన తాను గుట్టుచక్కగా పోవటంవల్ల మాత్రమే స్వాతంత్ర్యం రాలేదు. జాతీయమైన ఒక మహోద్యమం ఉవ్వెత్తుగాసాగి తెల్ల

వాడికి భయోత్పాతం కలిగించటంవల్ల అతడు ఈ దేశాన్ని విడిచివెళ్ళాడు. అంతే. వాడు మనల్ని కరుణించి స్వదేశం వెళ్ళటంవల్ల మనకు స్వాతంత్ర్యం వచ్చిందనుకుంటే అంతకంటే "పిచ్చి" మరొకటి ఉండదన్నారు విశ్వనాథ. అంతేకాదు, దేశీయుల్లో పరస్పరం అన్యోన్యం లేకుండా కలతలు, కల్లోలాలు పెంచుకొని విద్వేష మహాసముద్ర ఘోష వ్యాపించకుండా చూచుకోవాలని విశ్వనాథ హెచ్చరిక! ఎంతటి దూరదృష్టి? ఎంతటి ముందుచూపు? అచ్చమైన జాతీయతా దృష్టికల కవి మాత్రమే ఈ విధమైన హెచ్చరిక చేయగలడు.

ఆ రోజుల్లో రాయప్రోలు సుబ్బారావు, తుమ్మల సీతారామమూర్తి మొదలైన సత్కవులు జాతీయతా ప్రబోధాన్ని దేశీయులకు వేనోళ్ళ వినిపించి కనువిప్పు కలిగించారు. విశ్వనాథ కలిగించిన కనువిప్పు ప్రత్యేకంగా గుర్తు పెట్టుకోదగింది.

కవులకు మహాత్మ గాంధి జీవితం కావ్యవస్తువైంది, జాతీయ మహాకావ్యాలు ఉదయించాయి. నెహ్రూ జీవితం కూడా కావ్యవస్తువై సహృదయుల మన్నన లందుకొంది. కాంగ్రెసు ఉద్యమం, దానికి అధ్యక్షత వహించిన ప్రాజ్ఞుల ప్రజ్ఞ మొదలైనవి కూడా కవులను అమితంగా ఆకర్షించాయి. అన్నట్లు, భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు కాంగ్రెసు అధ్యక్షుడైన సందర్భం విశ్వనాథను విశేషంగా ఆకర్షించింది. ఆ సందర్భాన్ని పురస్కరించుకొని ఆయన పలికిన కవిత ప్రౌఢభావ నిర్భరంగా సోకింది. చూడండి-

జారన్ వానల యొందుపిండలి శరత్ స్వచ్ఛాంబువౌ దక్షిణా
శ్మరాజ న్నదివోలె రావణవధామర్షంబు జారన్ సుఖ
స్ఫారాకారము, శాంతహాసధురమౌ పట్టాభిరామంబు, సీ
తారామాఖ్యము ప్రోచుగావుత సపత్నిప్రౌఢనామున్ నిమన్!

(నాటి త్రిలింగనుండి)

పట్టాభి సీతారామ శబ్దాలు ఆలంబంగా రామాయణ కథా సందర్భాన్ని జోడించాడు కవి. పరాయి ప్రభుత్వాన్ని నిర్జించి కాంగ్రెసు పాలనాధికారం చేపట్టిన సందర్భాన్ని రావణ వధ పిమ్మట రామచంద్రుడు పట్టాభిషిక్తుడు కావటంతో పోల్చటం జరిగింది. భోగరాజువారు దక్షిణదేశంవారు కావటం,

ఆయన కాంగ్రెసు అధ్యక్షుడు కావటం మొదలైన అంశాలు వానకాలపు ఒండు మట్టి అంతా కొట్టుకుపోగా శరత్కాలపు స్వచ్ఛమైన నీటితో ప్రవహించే దక్షిణ దేశపు నదీ శోభను తలపిస్తూ ఉందని కవి ఉదాత్తభావనను ప్రపంచించారు. రాజకీయ పరిణామాలు, తత్కాల నాయకుల పురోగమన విశేషం, విజయ పరంపర మొదలైన జాతీయ జీవన విశేషాలు కవితలో ఒదిగించి, చిరకాలం గుర్తుండేలాగా రచనలు సాగించటం నాటి కవుల లక్ష్యంగా ఉండేది. అటువంటి లక్ష్యం బలంగా కలిగిన విశ్వనాథ ఆయా సందర్భాలలో వ్రాసిన పద్యాలు కవితా దృష్టితో చూచినప్పుడు పరమ ప్రౌఢంగా ఉండటం కూడా ఒక విశేషం.

వ్యక్తులమీద విశ్వనాథ వ్రాసిన పద్యాలు అనేకం. మల్లంపల్లి సోమశేఖర శర్మగారిమీద, సి. ఆర్. రెడ్డిగారిమీద, ఇంకా అనేకుల మీద ఆయన పద్యాలు అల్లారు.

"డిగ్రీలులేని పాండిత్యంబు వన్నెకు
రానట్టి పాడు కాలానపుట్టిన వాడు మల్లంపల్లి—అన్నారు.

ఈ పాడుకాలపు దుర్లక్షణం ఆంగ్లపాలన వల్ల ఈ దేశానికి సంక్రమించిందే ననికూడా విశ్వనాథ భావం ఆంగ్లవిద్య అతిశయంగా ఆర్జించి పదవుల కెక్కిన పెద్దలనుగూర్చికూడా ఆయన ప్రస్తుతించారు. సి. ఆర్. రెడ్డిగారి మీది పద్యం చూడండి:

"రెడ్డీ, నీ కవితా విమర్శన విధాశ్రీలే కథాక్లుప్తివే
రొడ్డెన్ మార్గము పూర్వలాక్షణికు లుద్యోగంబు సద్యోగమై
ఒడ్డారించిన నీ వచోలతికలం దుయ్యాల జంపాలలై
ఉడ్డీనాకృతలైరి సూరన కవిత్వోక్తి ప్రబంధాంగనల్."

రెడ్డిగారికి ఉద్యోగం సద్యోగమై భాసించటంవల్ల ఆయన అనేగ సత్కృతులు వెలయించ గలిగారు. కవిత్వతత్వ విచారం నూతన విమర్శ పద్ధతులను తెనుగునాట ఆవిష్కరించగలిగింది. అయితే ఈ పద్యానికి ఇందులోని భావానికి అనుత్కర్ష కలిగించే పదవిభాగ పద్ధతిని కూడా మనవారు కనిపెట్టారు. "నీ కవితా విమర్శన విధాశ్రీలు ఏకథాక్లుప్తివే రొడ్డెన్? మార్గము పూర్వలాక్షణికులు;

ఉద్యోగంబు సద్యోగమై...." 'ఇట్లా శబ్ద విభాగం చేస్తే అపార్థకల్పనమూ సాధ్యమే.' గొప్పతనం ఉద్యోగానికి మాత్రమే ఆపాదించే విమర్శమార్గం ఇది. తెల్లవాడు చెప్పిన ఇంగ్లీషు చదువులవల్ల సంక్రమించిన ఉద్యోగాలమీద కూడా ఒక విసురు ఇక్కడ కూడా ఉందంటారు ఇందులోని సామంజస్యం విచార ణీయం. ఇంతకంటే దీన్ని పొడిగించనక్కర్లేదు.

ఎవరేం చెప్పినా విశ్వనాథ పదవులతో నిమిత్తం లేకుండా ప్రతిభకు జోహారు లర్పించే విశాలహృదయు డనేది అందరికీ తెలిసిన రహస్యమే.

గుణాన్ని గౌరవించట మనేది భారతీయాత్మకు సహజమైన గుణం. అంత కాలం తెల్లవాడు ఈ దేశాన్ని యథేచ్ఛగా పాలించినా, ఈ దేశపు భాషలకు అనిష్టమైన ఆంగ్లసాంకర్యం పట్టించినా, ఇక్కడి ఆచారవ్యవహారాలు పాశ్చాత్య నాగరికతవల్ల భ్రష్టమైపోతున్నా - వ్యక్తిగతంగా ఆంగ్లేయుణ్ణి ద్వేషించటం మన కభిమతం కాదు అంతేకాదు, ఆంగ్లవ్యక్తుల్లో ప్రతిభాశాలులైన విజ్ఞుల్ని గౌరవించటానికి మనం వెనుకాడలేదు. రాజకీయ శత్రువుల్ని కూడా ప్రతిభా విషయం వచ్చేసరికి - సముచితంగా గౌరవించటం మనముగ్గుబాలతో నేర్చుకున్న విద్య. ఈ హృదయవైశాల్యం విశ్వనాథలోనూ చూస్తాం. కాని, పరపాలనవల్ల భారతీయ భాషాసంస్కృతులకు పట్టిన భ్రష్టత్వాన్ని మాత్రం ఆయన ఉపేక్షించ లేకపోయారు. లోలోపల కుమిలిపోతూ వెళ్ళగక్కుకున్న ఒక మహానిర్వేదం ఆయన పలుకుల్లోను, పద్యాల్లోను ఒక శోకనదిగా, ఒక విషాదగీతిగా ప్రవ హించటం మనం చూస్తాం.

"నా జాతి పూర్వప్రథా జీవరహితమై
శక్తినాడులయందు చచ్చిపోయి
నామాతృభూమి తేజోమహశ్చ్యుతిని బ్ర
హ్మ క్షత్రతేజంబు మంటగలిసి
నా మాతృభాష నానా దుష్టభాషల
ఔద్ధత్యమును తలనవధరించి
నా తల్లినేం వేనాటి అచారములే?
పైమెరుగులు చూచి భ్రమసిపోయి

ఏమి మిగిలిన దీపాటి కిట్లు పొంగు
లొలయు వర్ణానదీగభీరోదకములం
దైన్యగర్భచారిత్రముల్ దక్క, భిన్న
గిరి శిఖర దుర్గ పరిదీన గీతి దక్క?"

విశ్వనాథ జాతీయతాదృష్టి ఇంత గాఢమైనది.

ఈ జాతికి జరిగిన సాంస్కృతికమైన ఇంత మహా నష్టాన్ని పూడ్చుకో వలసిన గురుతర బాధ్యత ఈ జాతిదే. భారతజాతీయులు ఇందుకు బద్ధకంకణులు కావాలి. ఈ భావాన్ని ఆయన సృష్టించిన సర్వగ్రంథాలలోనూ వాచ్యంగాను వ్యంగ్యంగాను మన కందజేశారు.

'ధర్మచక్రం' నవల ఉంది. ఇది చారిత్రికమైన నవల. శాంతిమూల చక్రవర్తి రాజ్యం చేస్తున్నాడు. అతడు శ్రీ పార్వతీయుడు. శాతవాహన సామం తుడు కలియుగం లెక్క ప్రకారం అది 16,274 సం॥ దాటినట్లు. శాలివాహన శకం ప్రకారం 275 సం క్రీస్తుశకమైతే 353వ సంవత్సరమన్నమాట. శాంతి మూలుడు మహావ్యాధిగ్రస్తుడై ఉన్నాడు. వయస్సుచేత కూడ చాల పెద్దవాడు. కొడుకు శ్రీ వీరపురుషదత్తుణ్ణి సింహాసనం మీద కూర్చోబెట్టటం క్షేమమని పించింది చక్రవర్తికి కుమారుడి మీద ఉన్న ప్రత్యయం కూడా ఈ భావాన్ని మరింత బలపరిచింది. కుమారుణ్ణి పిలిపించాడు ప్రభువు తన తప్పులు తాను తెలుసుకున్నవాడు. తాను శాతవాహనులకు సామంతుడై యుండీ వారినుండి ఆ సామ్రాజ్యాన్ని దొంగిలించాడు తన కృతఘ్నత తనకు తెలుసు. అప్పటి రాజకీయ పరిస్థితుల్లో ఆ పని తాను చెయ్యకపోతే మరొక డెవడైనా ఆ పని చేసి ఉండేవాడు. మరొకడికి ఆ అవకాశం ఇవ్వకుండా మనసులో పరమేశ్వరుణ్ణి తలచుకొని సామ్రాజ్యాన్ని ఆక్రమించాడు ఈ సంగతికూడా శాంతిమూలుడు కొడుకుకు వివరించి చెప్పాడు. రాజ్యపాలనంలో ఉన్న కష్టసుఖాలు కొడుక్కి తెలియాలని కూడా తండ్రి ఈ మాట చెప్పాడు. అన్నిటికంటే ముఖ్యమైన మరొక మాట కూడా చెప్పాడు.

"లౌకికము వేఱు; పారలౌకికము వేఱు. లౌకికముగా నేను చేసిన పని మంచిది స్వదేశము శకయవనాదుల దాడులకు జారవదలలేదు. స్వస్థాన వేష

భాషామతములు నిలబెట్టుట స్వర్గముకన్న గొప్పది. లక్ష కృత్రిమ సిద్ధాంతముల కన్న గొప్పది. జీవుడు, జీవలక్షణము, సంసారము బ్రతుకు: ఈ మహా విషయముల సమాహార విచార చర్చచేతగాని స్వస్థాన మర్యాద తెలియదు."

విశ్వనాథ సంభావించిన జాతీయతా దృష్టికి ఇది ఆయువుపట్టైన అంశం.

ఇక్కడ మరొక అంశం కూడా గుర్తుంచుకోవాలి.

శాతవాహన చక్రవర్తులది సనాతన ధర్మం. లౌకికంగా కాకపోయినా పారలౌకికంగా శాంతమూలుడు శాతవాహనులకు విధేయుడు; కృతజ్ఞుడు. ఈ కృతజ్ఞతా భావమునకు ప్రధాన కారణం ఆ చక్రవర్తులు ఆదరించింది, ఆచరించింది సనాతనధర్మం; సనాతనధర్మమంటే వేద ధర్మమే. ఈ అంశాన్ని కూడా శాంతమూలుడు కుమారునికి వివరంగా నొక్కివక్కాణించాడు. ప్రాణాలు విడిచేముందు ప్రధానంగా చెప్పిన అంశం ఇది.

"వేదధర్మము సనాతనము. ఆ ధర్మ మితర ధర్మములచేత భిన్న కాలములయందు నిరాదరింపబడినను మరల మరల తానే ప్రతిష్ఠితమగును. రాజు ధర్మస్వరూపుడైనచో చంద్రశేఖరుని కరుణ సంపూర్ణముగా గడించుకొన్నచో అతని హృదయమునుండి ధర్మము సంపూర్ణముగా విశ్లథముకాదు. ధర్మము ధర్మమని వేయినోళ్ళ విందుము భిన్న కాలములయందు భిన్న విషయములు ధర్మవాచ్యములగును. వేదధర్మమే ధర్మము, అన్యమౌపచారికము."

విశ్వనాథ సంభావించిన జాతీయతా దృష్టికి ఈ వేదధర్మము ప్రాణభూతమైనది. ఈ ధర్మం జాతీయ దృష్టిలో సడలిపోతే అది జాతీయతా దృష్టి అనిపించుకోలేదు. అతి విశాలమైన ఆ సనాతన వేదధర్మానికి శివకేశవ భేదం లేదు. 'శ్రీరామచంద్రుడు నారాయణావతారమే కాని, ఆయన శివభక్తుడు' - శివుడును నారాయణుణ్ణి అట్లాగే సంభావిస్తాడు. ఇంత విశాలమైంది ఆ సనాతన వేదధర్మం

భారతీయమైన జాతీయతా దృష్టికి ప్రాణప్రదమైన సనాతన వైదిక ధర్మానికి విశ్వనాథ తన గ్రంథ కాలమందు అంతటా పట్టాభిషేక మహోత్సవం జరిపారు. *

# విశ్వనాథ సాహిత్యం – గాంధీయవాదం

—శ్రీ పాతూరి నాగరాజు

ఈ శీర్షికను వినగానే చాలమంది మిత్రులు ఆశ్చర్యం వ్యక్తం చేశారు. విశ్వనాథకూ గాంధీయవాదానికీ సంబంధం ఏమిటని. అటువంటి సంబంధం ఏదీ లేదని లోకంలో ఓ అభిప్రాయం కూడా పాతుకుపోయింది. పాతుకుని పోయేలా చేశారు ఆశ్చర్యపడ్డవాళ్ళల్లో కొందరికి అటు విశ్వనాథ వారిని గురించి కానీ ఇటు గాంధీయవాదాన్ని గురించికానీ అట్టే లోతు తెలీదు. ఈ రెండు విషయాలను గురించీ స్థూలంగా తెలిసిన దానినిబట్టి ఈ రెంటికీ సంబంధం లేదనే నిర్ణయానికి వీళ్ళు చేరుకున్నారు విశ్వనాథవారి పేరు వినగానే స్ఫురించే ధిషణాహంకార మూర్తికీ, గాంధీగారి పేరు వినగానే స్ఫురించే ప్రశాంతమైన మృదువైన నిరాడంబరమైన అహింసామూర్తికీ మధ్య సంబంధం లేకపోగా వైరుధ్యం ఉందికదా? వీళ్ళు ఒక నిర్ణయానికి చేరుకోడానికి వీళ్ళకు ఇంతకంటె ఎక్కువ ఆధారాలూ పరిశీలనా ఏవీ అక్కరలేదు. ఈ ఇద్దరి గురించీ బాగా తెలిసినవాళ్ళలో కొందరికి ఈ సంబంధం తెలుసు. తెలియని వాళ్ళలో కొందరికి ఈ విషయాల నాదృష్టితో చూడకపోవడం వల్ల తెలీదు. తెలిసినవాళ్ళలో కొందరు మిగతావాళ్ళకు ఆ విషయం తెలియజేయలేదు. మరి కొందరికి మిగతావాళ్ళకి ఆ విషయాన్ని తెలియజేయడం ఇష్టంలేదు. తెలిస్తే విశ్వనాథ వారిమీద లోకంలో సదభిప్రాయం ఏర్పడవచ్చు, గాంధీగారి మీద ఉన్న సదభిప్రాయం కారణంగా అది వీళ్ళకు ఇష్టంలేదు. ఈ ఇష్టం లేకపోవడానికి సాధారణంగా కారణాలట్టే స్పష్టంగా ఉండవు. కారణాలున్నచోట రాజకీయకారణాలే ప్రధానం. విశ్వనాథవారి మీద సదభిప్రాయం ఏర్పడి, వారి సాహిత్యం ఎక్కువమంది చదివితే తమ సిద్ధాంతాల ప్రచారానికి విఘాతం ఏర్పడుతుంది. విశ్వనాథ వారి సాహిత్యంలో అంతటి ఆకర్షణశక్తి ఉంది. (అది వాళ్ళకు తెలుసు) కనుక తెలియరాదు. ఈ ఇద్దరిని గురించీ లోతుగా ఎరిగున్న వాళ్ళలో కొందరు ఈ ఇద్దరి భావాలకూగల సంబంధాన్ని గురించి తెలియజేస్తూ రచనలు చేశారు ఈ రచనలను ఎక్కువమంది చదివి ఉండకపోవడంవల్ల ఈ ఆశ్చర్యానికి అవకాశం ఏర్పడింది.

ఉదాహరణకు ఆచార్య కోవెల సుప్రసన్నాచార్యులుగారు (ఉదా: చూ. డా॥ కె.వి.యన్. రాఘవన్‌గారి 'విశ్వనాథ: ఆర్థిక వ్యవస్థ' గ్రంథానికి పీఠిక. ఇతరత్రా కొన్ని వ్యాసాలు), ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు (చూ. 'సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు' గ్రంథంలో నవ్యసంప్రదాయవాదం మీద వ్యాసాలు, ఆంధ్రపత్రికలో విశ్వనాథవారి మీద వ్యాసం), డా॥ ముదిగొండ వీరభద్రయ్యగారు (ఉదా: చూ. 'వేయిపడగలు: ఒక పరిశీలన'), డా॥ ముదివేడు ప్రభాకరరావుగారు (చూ. 'విశ్వనాథ బ్రాహ్మీమయమూర్తి') విశ్వనాథ వారి సాహిత్యంలోని భావాలకూ గాంధీగారి భావాలకూ మధ్య ఉన్న పోలికలను ఇది వరకే ప్రస్తావించారు. డా॥ కె.వి.యన్. రాఘవన్‌గారు విశ్వనాథవారి సాహిత్యంలోని గాంధీయ భావాల నావిష్కరించే లక్ష్యంతోనే 'విశ్వనాథ: ఆర్థిక వ్యవస్థ' అనే చిన్న పుస్తకాన్ని రచించారు.

ఈ విద్వాంసులందరరూ విశ్వనాథవారి సాహిత్యంలో గాంధీయ భావాల పోలికలను గమనించింది 'సామాజిక ఆర్థిక వ్యవస్థ' విషయంలోనే. విశ్వనాథ వారు "ఏ గ్రామమున కా గ్రామ మొక వ్యవస్థితమైన ప్రదేశముగా జేసినచో సర్వదేశము వ్యవస్థితమైనట్లే. అన్ని గ్రామముల మీద కలిపి, మరికొన్ని విశాలములైన విషయములు వ్యవస్థితములు కావలసినవి యుండును. గ్రామమునకు గ్రామములో, దేశమునకు దేశములో సర్వవిషయములు వ్యవస్థితములైనపుడు దేశము చక్కగా పాలింపబడుచున్నదని అర్థము" అని భావిస్తే, గాంధీగారు "Independence must begin at the bottom Thus every village will be a reppublic of panchayat having full powers. It follows, therefore that every village has to be self-sustained and capable of managing itsef against the whole world" అని అభిప్రాయపడ్డారు. ఈ గ్రామ కేంద్రక దేశీయ ఆర్థిక వ్యవస్థను మన దేశానికి శ్రేయోదాయకమైన వ్యవస్థగా భావించడంలోనే మౌలికంగా గాంధీగారికీ, విశ్వనాథవారికీ పోలిక ఉంది. (విశ్వనాథవారి మాటలు వారి సముద్రపు దిబ్బ నవలలోవి. పుట. 342. గాంధీగారి మాటలు 'The colleeted works of M K. Gandhi' P. 451లోవి. పై రాఘవన్‌గారి గ్రంథంలో ఉదాహృతాలు.)

విశ్వనాథవారు తమ 'వేయిపడగలు', 'సముద్రపు దిబ్బ', 'దమయంతీ స్వయంవరం,' 'నందిగ్రామరాజ్యం', 'శార్వరినుండి శార్వరిదాకా', 'వీరవల్లడు'

మొదలైన నవలల్లోనూ, 'కుమారాభ్యుదయము' లాంటి లఘుకావ్యాల్లోనూ ఈ గ్రామ కేంద్రక సామాజిక ఆర్థిక పాలనా వ్యవస్థలను ఆదర్శాలుగా చూపిస్తూనే రచన చేశారు. 'వేయిపడగలు'లో ఈ గ్రామ స్వరాజ్యపు సురాజ్యం బ్రిటిష పాలనా దుష్ప్రభావానికి గురి అయి ఏ విధంగా క్రమక్రమంగా నాశనమయిందీ అది విస్తృతంగా అతి వివరంగా అన్ని కోణాలలోంచీ అతి సూక్ష్మమైన అంశాలను కూడా పట్టుకుంటూ వివరిస్తూ పోయారు. 'సుబ్బన్నపేట' అనే గ్రామపు అందమైన ఆనందమయమైన జీవితం ఈ కొత్త పరిస్థితుల్లో ఛిన్నాభిన్నమైపోయి క్షీణించడమే 'వేయి పడగలు'లోని విషయం మచ్చుకి ఈ కథనం చూడండి:

"విద్యుద్దీపములు వచ్చినవి. ఇంజనీయరులు పంపుల కొకడు, దీపముల కొకడు. నెలకైదువందల జీతగాండ్రు. సాలునకు పన్నెండువేలు సుబ్బన్నపేట నిమ్మనుచుండిరి. ఇదివరకు దీపములు వెలిగించు చాకలివాండ్రు పాతికమంది తీసివేయబడిరి. వారికి నెలకు పది రూపాయల జీతము పాతిక పదులు రెండు వందల యేబది. ఇంజనీయరు కీయవలసిన జీతములో సగము సమకూర్చి నట్లయినది ఆ చాకళ్ళు గుడ్డలుతుకుటకు గూడ పనికిరాక పోయిరి. తక్కువ జాతివారికి పేదవారికి సున్నలు చుట్టి, యెక్కువ కులమువారికి ధనవంతులకు నుద్యోగము లిచ్చిరి. ......ధనవంతు లిండ్లలోనికి దీపములు పెట్టించుకొనిరి. ఆ దీపములకెంత రాజఠీవి! నేను పేదవాని యిల్లు తొక్కనన్నది. ఇంటిదాక నెందుకు? వాడున్న సందులోనికే పోనన్నది. పేదవాని యిల్లు టిక్కమొగము వేసికొని దీపములవంక చూచినది. దీపములు వాని వంకనే చూడమన్నట్లు స్తంభములు చాటు పెట్టుకొన్నవి. విద్యుద్దీపములు ధగ ధగ మెఱిసినవి. పేదల కడుపులో భగభగ మండినది. పేదవారలు తిండిలేక మలమల మాడుచుండిరి...."
ఇలా సాగుతుంది 'వేయి పడగలు' లోని కథాకథనం.

మరి గాంధీ గారంటున్న "What I object to is the craze for machinery, not machinary as such The craze is for what they call labour saving machinary. 'Men go on saving labour' till thousands are without work and thrown on the open streets to die of starvation. I want to save time and labour, not for fraction of mankind but for all. I want the concent-

ration of wealth not in the hands of a few, but the hands of all" అనే మాటలు కూడా ఇవేగా. ఒకటి ఉపన్యాసధోరణి మరొకటి కథా కథనం. అంతే తేడా.

విశ్వనాథవారు 'విద్యుద్దీపాలు రాకూడదన్నారు ఇది ప్రగతి నిరోధకమైన ఆలోచన కాదా?' అని ప్రగతి వాదం తమ ఒక్కరి హక్కు, బాధ్యతా, బరువూ అని తెగ బాధించుకునే వాళ్ళ ప్రశ్న. ఏమో మరి - ఈ సిద్ధాంతపక్షం వాళ్ళే ఇటీవల కంప్యూటర్లను కార్యస్థలాల్లో ప్రవేశ పెడుతూ ఉంటే 'కంప్యూటర్లు ప్రవేశ పెట్టి వందల మంది ఉద్యోగాలు పోగొట్టకండి' అంటూ నినాదాలు చేస్తూ గగ్గోలు పెట్టారే- మరి వీళ్ళది ప్రగతి నిరోధమేనా? విశ్వనాథ వారిది విద్యుదీకరణ దశలోని ప్రగతి నిరోధమైతే వీళ్ళది కంప్యూటరీకరణ దశలోని ప్రగతి నిరోధమేమో? కంప్యూటరు విద్యుత్తుకంటె ఎంత గొప్పదో ఈ ప్రగతి నిరోధం ఆ ప్రగతి నిరోధం కంటె అంత గొప్పదన్న మాట! మాటవరస కనవలసి వచ్చింది కానీ ఈ రెండు దశల్లోనూ మానవత్వంతో ఆలోచించిన వాళ్ళు కోరుకుంటున్నది గాంధీగారు పై వాక్యాల్లో చెప్పినట్లు యంత్రాలు నోటిముందు కూడు లాగేసుకోరాదనే కదండీ? ఎవరో కొందరి చేతుల్లోకి సంపదంతా పోగుపడి పోరాదనే కదండీ?

ఇటువంటి ఆలోచనల్లో సామ్యంవల్లనే ఒక దశలో అటు గాంధీగారూ, ఇటు విశ్వనాథవారూ కూడా కమ్యూనిజాన్ని గురించి ఒకేలా మాట్లాడారు. "నేడు రష్యాలో ఏ శాంతి యున్నదో ఆ శాంతి మన దేశమునను వాంఛించెడి వారిలో నేను ప్రథముడను. పదునెనిమిదేండ్ల నుండి నేను అంతరాంతరములలో నేను అటువంటి కమ్యూనిష్టును. ఈ పదునెన్మిది సంవత్సరముల నుండి నా కమ్యూనిష్టు మిత్రులతో నేనిదియే చెప్పుచుందును. ఈనాటి ప్రపంచములో నున్న దేశములలో ఏ రాజ్యాంగమూ నిజానికి ప్రజాసౌఖ్యము సమకూర్చుట లేదు. ఆ రాజ్యాంగ విధానము చేతనే ప్రజా సౌఖ్యము సమకూడునట్లున్నది. కాని నాకు ప్రజాసంహారము గిట్టదు ......... .." అని విశ్వనాథ వారంటే ('నా రాముడు - నా రామాయణము'), గాంధీగారు "Communism of Russian type that is Communuism which is imposed on the People, would be repugnaut to India I believe in nonviolent

Communism........ If Commnism came without any violence it would be welcome" అంటారు (Selected works of Mahatma Gandhi- p. 239).

విశ్వనాథ వారి భావాలకూ గాంధీగారి ఆలోచనలకూ మధ్య మరొక ముఖ్యమైన పోలిక ఇక్కడే ఉంది. ఇద్దరూ అహింసావాదులే. పైన ఉదాహరించ బడిన వాక్యాల్లో 'నాకు ప్రజాసంహారము గిట్టదు' అని మాత్రమే అన్నారు. సముద్రపు దిబ్బ నవలలో ఐతే- హింసాత్మక పద్ధతుల్లో ఉన్న లోపాలను కథ లోని సంఘటనల ద్వారా నిరూపించడమే కాదు. వివరంగా తార్కికంగా సైద్ధాంతికంగా చర్చిస్తారు కూడా. అటు గాంధీగారూ, ఇటు విశ్వనాథవారూ కూడా హింసను కేవలం హింసలో ఉండే గ్లానిని దృష్టిలో ఉంచుకొని మాత్రమే వ్యతిరే కించలేదు. వారిద్దరూ కూడా హింసాత్మక పద్ధతులు ఆచరణ వ్యూహాలుగా దీర్ఘ కాలిక దృష్టితో చూచినపుడు ఏ విధంగా స్వయం సంహారకాలో ఏ విధంగా అంతిమ వైఫల్యాన్ని పొందుతాయో రాజనీతిపరంగా అవగాహన కలిగినవారు. ఇద్దరూ ఈ విషయంలో తమ పక్షాన్ని తర్కసహంగా సైద్ధాంతికంగా ప్రతిపా దించారు.

విశ్వనాథ వారి సాహిత్యంలో జాతీయోద్యమ విషయాలెక్కువగా కన పడక పోవడం, గాంధీగారు జాతీయోద్యమ సారథిగానే ప్రసిద్ధులు కావడంకూడా వీరిద్దరి మధ్య పోలికలు లేవనిపించేందుకు ఓ కారణం గాంధీగారిని గురించి లోతుగా అవగాహన చేసుకున్నవారు వారికి స్వరాజ్య సాధనకంటె సురాజ్య సాధన మీదే దృష్టి ఎక్కువ అని గ్రహించగలుగుతారు. విశ్వనాథవారి సాహి త్యంలో ఈ సురాజ్య సాధన విషయమే ప్రధాన విషయమయింది.

'వేయిపడగలు,' 'శార్వరి నుండి శార్వరి దాకా' నవలల్లో తన ఆదర్శాల దృశ్యం శిథిలమై పోవడాన్ని మాత్రమే చిత్రిస్తే- 'నందిగ్రామరాజ్యం' అనే నవల లోనూ 'శ్రీకుమారాభ్యుదయము' అనే లఘు కావ్యంలోనూ ఈ శైథిల్యంలోంచి తాము కోరుకున్న పద్ధతిలో మార్పువచ్చినట్లు చిత్రించారు ఈ రెండు రచనల్లోనూ పౌరాణికమైన ఇతివృత్తాలను తమ రాజకీయ ఆర్థిక ఆలోచనలను వ్యక్తం చేసేం దుకు విశ్వనాథవారు ఉపయోగించారు. 'నందిగ్రామరాజ్యం' నవలలో 'నందిగ్రామ రాజ్యం' (రాముడు అరణ్యవాసంలో ఉన్నప్పటి రాజ్యం) అనేదాన్ని నేటి దోపిడీ

వ్యవస్థకు పేరుగా ఉపయోగించి రాముడు - దోచుకున్నవాళ్ళ దగ్గరి ధనాన్ని వాళ్ళ దగ్గరనుంచి లాక్కుని పేదలకు పంచిపెట్టినట్లు చిత్రించారు. "ఆ నంది గ్రామ రాజ్యంలో చెప్పటానికి పిల్లేంతమంది తిండిలేనివారున్నారు. రాముడంద రికి సంవత్సర గ్రాసమిచ్చేశాడు. వాళ్ళవాళ్ళ వృత్తులు నిర్ణయించిచెబుతానన్నాడు. ఏ వృత్తివా డావృత్తి చేయాలి. ఇంకో వృత్తి చేస్తే ఆవృత్తివాడే దెబ్బతింటాడు. నేను గొప్ప. నేను పండితుణ్ణి. ఇలాంటి పేచీలు పెట్టుకుంటే దేశంలో చాలా మందికి తిండి కరవై పోతుంది. ఉద్యోగస్థులకు పట్టరానంత జీతాలు ఉండ కూడదు. అవతల పదిమందికి తింటానికి తిండిలేదు. ఆ పదిమంది జీతాలు ఒక్కడి కియ్యటమా? ఛీ! ఛీ! ఇదేం రాజ్యం?' అన్న మాటలు ఈనాటి పరిస్థితుల మీద వ్యాఖ్యానంగా లేవూ? 'శ్రీకుమారాభ్యుదయం'లో కుమారస్వామికి వల్లీ, దేవసేన అనే ఇద్దరు భార్యలున్నారన్న కథనుపయోగించుకుని దేవసేన కుమార స్వామితో వచ్చిన ప్రణయ కలహంతో అలిగి వెళ్ళిన సందర్భంగా చేసిన ప్రణోపయోగ కార్యక్రమాలను వర్ణిస్తూ భూదాన ఉద్యమాన్ని ప్రస్తావిస్తారు, విశ్వనాథవారు:

"మిద్దెలు మేడలున్ బొలము మేమని మేమని గుంపు గూడి తా
మిద్ది యిదంచుఁ దీనికొనుడీయని యిచ్చిరి తత్సమాగతుల్
గద్దియఁ గూరుచుండియ సుఖంబుగ నాయమయున్ శివార్పణం
బిద్దియిదంచు వాక్కులననే గ్రహియించెను సర్వసంపదల్"

అని చేస్తున్న వర్ణన వినోబాభావే నడిపిన భూదాన ఉద్యమాన్ని తలపిం చడంలేదూ? గాంధీయ వాదాన్ని తరువాతి రోజుల్లో మరింత అభివృద్ధి చేసి ఆచరణలో పెట్టిన వినోబా భావే రోజుల స్థితి కూడా విశ్వనాథవారి సాహిత్యంలో కనపడటం ఇక్కడ గమనించదగిన విషయం.

గాంధీయవాద ఉద్యమాలు ఇటీవలి కాలంలో అధికంగా దృష్టి కేంద్రీకరి స్తున్నది పర్యావరణ సంరక్షక ఉద్యమాల మీద. ఈ ఉద్యమాల భావాల బీజాలు గాంధీయ వాఙ్మయంలో సూచనగా ఉన్నట్లు ఈ మార్గపు పర్యావరణ కార్య శీలురు వ్యాఖ్యానిస్తున్నారు. కాని పర్యావరణ వినాశనం జరుగుతున్న రోజుల్లోనే పర్యావరణ వ్యవస్థ గురించిన లోతైన అవగాహనను, అది నాశనమైపోతున్న తీరును

విశ్వనాథవారు తమ సాహిత్యంలో వ్యక్తం చేశారు. ముఖ్యంగా 'వేయిపడగలు' నవలలో ప్రకృతి పర్యావరణానికి ప్రతీకగానే పసరిక అన్న పాత్రను సృష్టించారు. పర్యావరణ వినాశనంలోని ఆవేదన అంతా తెలియాలంటే విశ్వనాథవారి మాటల్లోనే చదవాలి:

"పసరిక యొకనాడు తూర్పుపొలమునకు పోయెను. వాన కురిసిననాడు చెదలు బయలుదేరినట్లు జన మచ్చట మూగియున్నది. అతనికి భయము వేసి యింటికి వచ్చెను. ఇదిగాక తదితర గ్రామస్థుల మెట్ట పొలా లొక యేబది యెకరముల దాక నున్నవి. వానిలో చెట్లున్నవి, చేమలున్నవి, పాములున్నవి, పక్షులున్నవి. చెట్లచాటు చేసికొని పసిరిక తిరుగుచుండెను. పవలెల్ల నింటిలో నుండి రాత్రులందే పొలాల మీదికి పోవును. అప్పుడచ్చట త్రవ్వ జనముండదు. పసిరిక చూచెను. ఈ జనము ముక్కల నెచ్చటి కచ్చట త్రవ్వివేయుచున్నది. వ్రేళ్ళతో కుద్దాలించుచున్నది. కనబడిన పామునెల్ల చావమోదుచున్నది. రోజున కొకటి రెండు పాములు చనిపోవుచున్నవి. పక్షులను కొట్టి వండుకొని తినుచున్నది. పొలము పిచ్చుకల గుంపులు చెల్లా చెదురైనవి. సర్వనాశనముగా నున్నది. పొలములో నాకవేళ పసిరిక పండుకొనిన పాముని తల చిదుక మోదుదురేమో! మునుపటికన్న తాను కొంచెము బలిసెను అంత పామనుకొనరేమో!

"విద్యుద్దీపములకు స్తంభములు వేయబడెను. పేటలో వృక్షము ప్రతిపద ముండెను. ప్రతి వీథియందు వృక్షములే. వేపచెట్లు, రావి, మఱ్ఱి, గానుగ, దిరిసిన, గంగరావి మొదలైన వృక్షములు ప్రాత యూరంత యున్నవి. తీగెలు వేయు సమయము వచ్చినది. ఒక చెట్టు మూలచ్ఛేదమయ్యెను. ఒక వృక్షమునకు చేతులు తెగెను. ఒక తరువు కత్తిపెట్టి సగమునకు తెగవేయబడినట్లయ్యెను. ఒక వనస్పతికి గాఢచ పేటము తగిలెను. మరియొకవానికి శిరచ్ఛేదము చేయబడెను. నానావృక్షములు తతోధావత్పక్షికంధారావములచే కూయి పెట్టెను. మూల్గెను. శరణు వేడెను. నిర్దయమైన విధి 'పొందు, పొందు. గుండేటి యట్ట యడుగున గూళ్ళుకట్టుకొనుడు. మీకింత యున్నతస్థితి యెందు'కనెను పక్షులు తెక్కలాడించెను. నోళ్ళు తెఱచెను నీవు పోయి గ్రుడ్లున్న గూటిని కఱ్ఱతో తాకుము. తల్లిపక్షి వచ్చి నెత్తిమీద ముక్కుతో పొడుచును కిరాతకుడు వచ్చి చెట్టు చెట్టెక్కి ప్రతి పసిపిట్టను తెక్కవిరిచి బుట్టలో వేసికొమ్మనుము తల్లి పక్షులు పిండుకట్టి

యాకాశమున మండల పరిభ్రమణము చేయుగాని వాని నొక్క పక్షి పొడువబోదు. ఆ పక్షులకు తెలియును దగ్గరకు బోతిమా, మన పెదలు కూడ విఱుచునని. స్వాశ్రయము వదలిపోవలసినంత దుర్దశ వచ్చినప్పుడు, పోకయుండుటకు వీలులేనప్పుడు పోయితీరవలయునని తెలియని జంతువేముండును? చెట్లు సగము కొట్టగా మిగిలిన సగములు పక్షులను 'జూచి మా చేతగాదు. మేము కలనాళ్ళలో మీ కాశ్రయమిచ్చితిమి. ఈ దుర్దినములలో మమ్మేల యాశ్రయించెదరు? మరొక తృణజలకాష్ఠ సమృద్ధిగల దేశమునకు పొం'డని చెప్పెను. మరికొన్ని వృక్షములనెను, మేమనగా నున్నచోటినుండి కదలలేము. నిర్దయుడువచ్చి మమ్ము గొడ్డలిపెట్టి తెగవ్రేయును. మేము పాఱిపోజాలము. కాదనజాలము. చేయద్దమైన పెట్టుకొనజాలము. మీకేమి? ఱెక్కలుగల జంతువులు. వీలైన చోటునకు బొండనెను. ఎంత చెప్పినను పోని పక్షులను జూచి యొక ముసలి వృక్షమన్నది, ఇవి యేవో కొత్త చెట్లు వచ్చుచున్నవి. వీనికి శాఖలు లేవు. పండ్లు లేవు. ఫలములు లేవు. తాటిచెట్లకైన పైన మొవ్వులుండును. వీని కవియులేవు. ఈ వృక్షములు పెరిగిన దేశ మేదియో! అచ్చట సూర్యుడుదయించునో, యుదయించడో! అవి యింత పెద్దవైన తరువాత గూడ తెచ్చి పాతవచ్చుకు గాబోలు. మనటదు లా వృక్షములే గ్రామమంతయు వెలసినవి. ఈ వృక్షములకు బోదెలేతక్క నితర వృక్షావయవములు లేవు. వాని స్వభావము మనకు తెలియదు. మీరు నా మాట విని లేచిపొండు. అవి యొకవేళ శాఖలు వేయునేమో! ఆ శాఖ లెట్లుండునో! వాని మీద మీరు గూర్చుండిన జచ్చిపోదురేమో' అని. జంతువులన్నింటికి నొక్కటియే గుణము. వనమంతయు నఱికి వేయుము. సింహము మిగిలిన నాలుగు చెట్లలోననే దాగియుండును. పెద్ద పెంకుటిల్లు తగలబడి పోనిమ్ము. అచ్చటనే మనుష్యుడు చిన్నపాక వేసికొని యుండును. నఱికివేయబడిన చెట్లన్నియు పోయినను పక్షులు మిగిలిన కొమ్మలను వదలలేకపోయెను.

"వేసగి వెడలిపోయెను. వర్షకాలము వచ్చెను. ప్రతి సంవత్సరము నల్లని మేఘ మొకడు పడమటి కనుమలలో, వింధ్యగిరులలో, హిమవత్పర్వతములలో, బ్రహ్మదేశ శైలములలో జాగ్రత్తగా తానే గుట్టకు, నేకొండ యంచునకు, నేశిలా కోణమునకు, నేదృషదుపరిభాగమునకు తగులకుండి తన్నుతా కాపాడుకొనుచు వచ్చి, యన్ని మేఘములును తెలుగుదేశము మీద కురియుచుండగా దాను తన సాహసగాంభీర్యతతో కలిసి సుబ్బన్న పేటకు వచ్చి యచ్చట తన ప్రియమిత్రమైన

యొక మహాన్యగ్రోధ శిఖరమున కూర్చుండి, అతనితో సంభాషించును. ఆ మొగిలు పేరు వృషన్నిధి. ఆ చెట్టు పేరాదివటము. ఆదివటము మహాబలశాలి. వచ్చిన మిత్రమును బుజములమీద చేతులువైచి 'యెన్నాళ్ళకు వచ్చితి' వని కదిలించి వేయును. వృషన్నిధి యానంద బాష్పములు మిత్రుని యొడలి నిండ వర్షించును. వృషన్నిధి వెనుకటి యేడు వచ్చి యాదివటమును కౌగలించుకొని కన్నీరుగార్చి "మిత్రమా! నీవు పుట్టి నాల్గువందల యేడులైనది. ఇచ్చట గ్రామము కట్టకమునుపు నీవిచ్చటనే యున్నావు. సుబ్రహ్మణేశ్వరస్వామి నిన్ను మాత్రము దయగానే చూచెను. నే ననాదినైన మేఘమును. నాల్గువందల యేండ్లనుండి మన మైత్రి యవ్యహితముగా సాగుచున్నది. ముందునాటికి మఱల మనము కలియుదుమో, కలయమో" యన్నది. ఆదివట మప్పుడే భయపడెను. ఇది యేమిరా, అమృత మూర్తియైన మిత్రుని నోటినుండి యశ్లీలములు వచ్చుచున్నవని.

"ఆయేడు వృషన్నిధి వచ్చినది. మనసులో నేమో దిగులుగానే యున్నది. వింధ్య పర్వతములలో నొక వేటకాడు తన తుపాకితో నొక లేడిని గొట్టెను. ఆ గుండు వృషన్నిధిగుండ దూసుకొనిపోయెను. ఆదివటకు వృషన్నిధి తుపాకి దెబ్బతిని యెరుగదు హిమవంతమునందొక కస్తూరి లేడి దానిని కొమ్ముతో గీసెను. బ్రహ్మదేశమున సముద్ర ప్రాంతమున నొక పొగయోద వృషన్నిధిని కంబముతో గీఱెను. ఈ యపశకునములన్నియు వృషన్నిధి యోజించుకొను చునే వచ్చెను. అతడు వచ్చి చివరకు చూచెను. ఆదివటము లేదు. అది సుబ్బన్నపేట యగునో కాదో యని చుట్టుపట్లనున్న పది పదునొకండు గ్రామములు వెదకెను. ఎల్లలన్నియు నీయూరికే సరిపోవుచున్నవి. కోట యిచ్చటనే యున్నది. జగదీశ్వరుల యాలయము లిచ్చటనే కనపడుచున్నవి. అడుగో ధర్మారావు, అదిగో గణాచారి, అదిగో దేవదాసి, అడుగో పసిరిక - నిరుటికన్న లావైనను గుర్తుపట్టవచ్చును. ఇదియే సుబ్బన్నపేట. ఆదివటమేది? ఆదివట మేది? వృషన్నిధి తానంతయు దుఃఖాశ్రుమయమయ్యెను. కాని పట్టుకొని యాదరించు స్నేహితుడు లేడు. ఒక విద్యుద్దీపికా స్తంభముమీద శ్రమ తీర్చు కొనుట కొఱగెను. అది యతనికి తన్ను కొఱత వేసినట్లుండెను. దైవము రక్షించి యొక ఝంఝూ మారుతము జడమైన వృషన్నిధిని తన్నుకొనుచు

టోయెను. వృషన్నిధిపోయి, నీరక్కరలేని యొక గుట్ట పైభాగమున కూల బడెను. అదివటమేమైనదో వృషన్నిధియు నదియేయయ్యెను."

1934 లో ఇంతటి పర్యావరణస్పృహ, ఇంతటి పర్యావరణావగాహనా ఉండడం ఆశ్చర్యంగా లేదూ? 'చెట్లు మేఘాల నాకర్షిస్తాయి. చెట్లు నాటండి. వృక్ష సంపదను పెంచండి వనమహోత్సవాలు చేయండి' అనే నినాదాలు ప్రచారాలు హోరెత్తించడానికి ఎంతోకాలం ముందు చేయబడిన ఈ రచనలో క్రాంతదర్శిత్వం కనపడటం లేదూ?

ఇన్ని విధాలుగా గాంధీయభావాలు విశ్వనాథ వారి సాహిత్యంలో కన పడుతున్నా గుర్తించబడకపోవడానికి మరో ప్రధానమైన కారణం విశ్వనాథ వారు తాను గాంధీయవాదినని ఓ ముద్రవేసుకుని ప్రచారం చేసుకోకపోవడం, గాంధీయవాద బృందాలలో కాని సంస్థలలో కాని చేరి తిరగడం, తిరిగినట్లు పేరు తెచ్చుకోవడం లాంటి పనులేవీ చేయకపోవడం. సాధారణంగా మనదేశంలో ఫలానా ఇస్టు అంటే ఆ ఫలానా వారిని వారి పేరునీ ఆ పారిభాషిక పదాలను మాటి మాటికి వల్లెవేస్తూ ఉండేవాడు అని ఒక దృష్టి వుండడం వల్ల, విశ్వనాథ వారు ఆ విధంగా గాంధీగారి పేరును గానీ, గాంధీయవాద పారిభాషిక పదాలను కానీ వల్లెవేయక పోవడం వల్ల విశ్వనాథవారి సాహిత్యంలో వున్న గాంధీయవాద భావాలు అంతగా జనం దృష్టికి రాలేదు నిజానికి విశ్వనాథ వారికి తాను గాంధీయవాదినన్న అభిప్రాయం తనకే వున్నట్టుగా ఎక్కడ కనబడదు. అసలు వారి ఆలోచనలోనే విస్తృతి విజృంభణ ఏ ఒక్కవాదంలోనూ ఇజంలోనూ ఇమడ గలిగేది కూడ కాదు. విశ్వనాథ వారి భావస్వాతంత్ర్యం ఆయనను ఏదో ఒక మహానుభావుణ్ని ప్రవక్తగా ఏదో ఒక సిద్ధాంతాన్ని మతంగా ఆ మతానికి తనను ప్రచారకుడిగా ఉండనివ్వదు. గాంధీగారి భావాలు గాంధీగారి జీవితంలోంచి వారి అంతర్మథనంలోంచి ఎలా ఆవిర్భవించాయో విశ్వనాథవారి భావాలూ అంతే. అలా స్వతంత్రంగా ఆవిర్భవించిన రెండు ఆలోచనల్లోనూ సమానత్వం కనపడడం అన్న విషయాన్ని మనమిక్కడ పరిశీలిస్తున్నామే తప్ప విశ్వనాథ వారు గాంధీ గారి మాటల్ని ఎంత చక్కగా తన రచనలకు ఉపయోగించుకొన్నారు అన్న దృష్టితో కాదు.

విశ్వనాథ వారి సాహిత్యం అంతటిలోనూ అనుస్యూతంగా కనపడే ఒక లక్షణం ఆయన ఆనాటి విద్యావంతులందరి మీద పని చేస్తున్న పాశ్చాత్య భావ సామ్రాజ్య ఆక్రమణ తన మీద పని చేయకుండా నిరోధించేందుకు చేసిన ప్రయత్నం. దీన్నే De Colonization of thoughts అంటూ వుంటారు. ఆయన తనకు తాను Conscious గా De Colonize చేసుకుంటూ తన పాఠకుల్ని De Colonize చేసే ప్రయత్నం చేశారు. ఆయన Literature ను ఒక Educating medium గా వుపయోగించారు. ఈ విషయాన్ని ఆయనే స్వయంగా అనేక సందర్భాలలో చెప్పుకున్నారు కూడ. గాంధీగారు ఒకవైపు స్వాతంత్ర్యోద్యమాన్ని నడిపిస్తూ ఎన్నో ఆచరణ పూర్వక కార్యక్రమాలను నిర్వహిస్తునే మరొకవైపు తన పత్రికలద్వారా దేశ ప్రజలను educate చేయడానికి కూడ తీవ్రంగా ప్రయత్నించారు. కానీ, విశ్వనాథవారు ఈ పనికి ఉపయోగించిన నవలలు కథానికలు కావ్యాలలాంటి సృజనాత్మక సాహిత్యం పత్రికా వ్యాసాల కంటె బలమైన మాధ్యమం.

గాంధీగారు మొదట పాశ్చాత్య పద్ధతి విద్యాభ్యాసంలో పాశ్చాత్య పద్ధతి ఆలోచనతో పెరిగినవాడు. దక్షిణాఫ్రికానుంచి స్వదేశానికి తిరిగి వచ్చాక దేశ పర్యటనచేసి దేశం నలుమూలలా మూలమూలనా వున్న భారతీయ సమాజపు స్వరూపాన్ని లోతుగా అవగాహనచేసికొని, ఈ అవగాహన ఆధారంగా తన సిద్ధాంతాన్ని, మార్గాన్ని,దర్శనాన్ని నిర్మించుకొన్న వాడు. విశ్వనాథవారికి ఈవిధంగా ఈ దేశపు సంప్రదాయాన్ని సంస్కృతిని లోతుగా అవగాహన చేసుకొనేందుకు చక్కని అవకాశం ఆయన చిన్నప్పటి నుంచి పెరిగిన పల్లెటూరి వాతావరణంలో సాంప్రదాయిక జీవితంలో వుంది. అత్యంత నిశిత పరిశీలనా స్వభావం కల్గిన ఆయనకు ఎంతో లోతుగా ఈ దేశపు సంస్కృతిలోని సూక్ష్మాలన్నింటిని ఆపోశన పట్టేందుకు అవకాశం ఏర్పడింది. విశ్వనాథవారి జీవితంలో తరువాతి దశ తనకు నచ్చని, తాను ఎదిరించదలుచుకున్న పాశ్చాత్య సంస్కృతిని అవగాహన చేసుకోవడంలో గడిచింది. ఈ ప్రయత్నంలో తాను పాశ్చాత్య విజ్ఞానాన్ని, సాహిత్యాన్ని ఎంత లోతుగా అధ్యయనం చేసిందీ ఆయనే స్వయంగా చెప్పుకున్నారు. ఇంగ్లీషు భాష మీద ఆయన సంపాదించిన అధికారాన్ని ఆయన ఇంగ్లీషులో చేసిన కొన్ని

రచనలలో (పుస్తకాల పీఠికలు, అభిప్రాయాలు, కొన్ని ఇంటర్వ్యూలలో) గమనించవచ్చు. ఆ భాష నుడికారంమీద, ఆ భాషలోని వాగ్ధార ప్రతిపత్తిమీద మంచి పట్టుసాధించి ప్రౌఢమైన శైలిలో ఆయన తన ఇంగ్లీషు రచనలు చేశారు.

ఆయన రచించిన అనేక నవలల్లో ఖగోళశాస్త్రం, భూగర్భశాస్త్రం, జంతుశాస్త్రం, భూగోళం, రాజనీతిశాస్త్రం, అర్థశాస్త్రం, చరిత్ర, పురావస్తు శాస్త్రం మొదలైన అనేక పాశ్చాత్య శాస్త్రాల్లోని ఆయన నాటికి లభిస్తున్న విజ్ఞానాన్ని అంతటిని ఏదో ఒక విధంగా చర్చలోకి తీసుకువచ్చారు. ఫ్రెంచి, ఇంగ్లీషు, జర్మన్, గ్రీకు, లాటిన్ సాహిత్యాలలోని "క్లాసిక్స్" అన్నింటిని గాఢంగా అధ్యయనం చేశారు. ఒక ఆధునిక మేధావికి వుండవలసిన ప్రపంచ జ్ఞానాన్ని అంతటినీ సంపాదించారు. "సముద్రపు దిబ్బ''లో రాజకీయ వ్యవస్థను, దమయంతి స్వయంవరంలో బ్యూరోక్రసీని (అధికార యంత్రాంగం నడిచే పద్ధతిని) లోతుగా చర్చించారు. అనేక సందర్భాలలో పాశ్చాత్యుల ఆర్థిక శాస్త్రం, ఆలోచల్ని చర్చలోకి తీసుకువచ్చారు. అడుగడుగునా ఈ శాస్త్రాల అన్నింటి పునాదులను కుదిపివేస్తూ ప్రశ్నించారు. పాశ్చాత్య శాస్త్రాల పునాదుల్ని విమర్శించే ప్రయత్నాలు ఇటీవలే ప్రపంచ దేశాల్లో మొదలయ్యాయి. (ఉదా :- Technology and Human Destiny by Skolimowsky.) భారతీయ తత్వశాస్త్రం దృష్ట్యా పాశ్చాత్య శాస్త్రాల మూలాలను ఇలా విమర్శకు గురిచేసే ప్రయత్నాన్ని కొందరు మేధావులు ఇప్పుడిప్పుడే ఆరంభిస్తున్నారు కూడా. ఇటువంటి ప్రయత్నాన్ని సాహిత్యం ద్వారా చాలా కాలం క్రిందటే శాస్త్రీయమైన పద్ధతిలో నిర్వహించిన రచయిత ఒకరు విశ్వనాథవారు తెలుగు సాహిత్యంలో ఉన్నారని తెలిసి ఆ మేధావులు ఆశ్చర్య ఆనందాలను వ్యక్తం చేస్తున్నారు. ఈ విధంగా గాంధీగారి జీవితంలో పాశ్చాత్య విద్యార్జన, భారతీయ సంస్కృతి అవగాహన అనేవి రెండూ విశ్వనాథవారి జీవితంలో మనకు కనపడుతాయన్న మాట. అటువంటప్పుడు వారి ఆలోచనల్లో సామ్యాలు కనపడడం వాళ్ళిద్దరు తమ తమ నేపథ్యాలను ఒకే పద్ధతిలో మలుచుకోవడం వల్ల జరిగిందన్న మాట.

గాంధీగారు భారతీయ చరిత్రలో నిర్వహించిన పాత్రను గురించి సిద్ధాంతీకరిస్తూ Pudeff and Pudolf అనే రాజనీతి శాస్త్రజ్ఞులు "Modernity in Tradition'' అనే పుస్తకంలో గాంధీగారు భారతీయ సంప్రదాయపు మూలాలను

ఆధునిక రూపంలోకి మార్చి ఆధునిక కాలానికి తగినట్లుగా ఒక కొత్త సిద్ధాంతంగా వాటిని మలిచి తానే సంప్రదాయపు ఒక ఆధునిక రూపమయ్యారని అభిప్రాయపడ్డారు. గాంధీగారికీ, విశ్వనాథ వారికీ మధ్య నిరూపించబడిన సామ్యాలను బట్టి విశ్వనాథ వారు కూడ అటువంటి సంప్రదాయపు ఆధునిక రూపమని గ్రహించవచ్చు. ఈ ఉద్దేశ్యంతోటే విశ్వనాథవారి సాహిత్య మార్గాన్ని నవ్యసంప్రదాయ మార్గంగా భావించాలని ఇటీవల ఆచార్య జి.వి సుబ్రహ్మణంగారూ, ఆచార్య కోవెల సుప్రసన్నగారులాంటి విద్వాంసులు అందరూ ప్రతిపాదించినారు

అయితే విశ్వనాథవా రీ సాహిత్యాన్ని ఈ దృష్టి కోణంతో చూసే పద్ధతి ప్రాచుర్యంలోకి రాకపోవడానికి విశ్వనాథవారి వ్యతిరేక పక్షంవాళ్ళు ఎంత దోహదం చేశారో విశ్వనాథవారి భక్తులు కూడ అంతే దోహదం చేశారని మనము ఇక్కడ గమనించాలి. విశ్వనాథవారు గొప్ప సంప్రదాయ అభినివేశం గలవారు అని చెప్పే అత్యుత్సాహంలో విశ్వనాథవారు సంప్రదాయవాది మాత్రమేనని ఆ విషయంలో ముక్కుసూటిగా దాపరికం లేకుండా మాట్లాడడమే ఆయన గొప్పతనమని, ఆయన చాదస్తమే ఆయన గొప్ప లక్షణమని, ఆయన అహంకారం మొండితనం ఆయన ఆభరణాలని ప్రచారం చేయడమే కాకుండా ఆధునిక సంప్రదాయానికి వ్యతిరేకమనే తప్పుడు సిద్ధాంతం మీద ఆధారపడి విశ్వనాథవారు ఆధునికతా వ్యతిరేకులని కూడా ఈ భక్తులు ప్రచారం చేశారు దీనివల్లనే A.S. రామన్‌కి ఇచ్చిన ఇంటర్వ్యూలో విశ్వనాథ వారే స్వయంగా తాను ఆధునికతకు వ్యతిరేకి కానని ఆధునికతపట్ల తనకు లోతైన అవగాహన ఉందని గొంతు చించుకుని చెప్పుకోవలసి వచ్చింది. (విమర్శిని - విశ్వనాథ ప్రత్యేక సంచిక.) మహతిలో "నేనూ నా పాతికేళ్ళ సాహిత్యం'' అనే వ్యాసంలో కూడా ఇదే విధంగా తనకున్న ఆధునికమైన భూమికను, అవగాహనను ఆయన స్వయంగా వివరించి చెప్పుకోవలసిన అగత్యం ఏర్పడింది. దీనివల్ల విశ్వనాథవారి సాహిత్యపు యధార్థ లక్షణం ఎంత మరుగున పడిందో విశ్వనాథ వారికి ఎంత అన్యాయం జరిగిందో ఈ సజ్జనులు ఇకనైనా గ్రహించడం మంచిది.

విశ్వనాథవారి సాహిత్యాన్ని ఈ తరంవాళ్ళు చదవనే చదవకుండా చేసే ప్రయత్నంలో చేసిన ప్రచారాల్లో ఒకటి ఆయన శైలి కఠినంగా వుంటుంది అనేది. ఈ వ్యాసంలో ఉదాహరించబడిన ఆయన రచనల్లోని భాగాలను చూస్తే అలా అని

పిస్తుందేమో మీరే చెప్పండి. నుడికారం జాలువారే చిన్నచిన్న వాక్యాల్లో సాగే ఆయన శైలి నిజానికి ఆకర్షణీయంగా, సమ్మోహకంగా వుంటుంది కనుకనే దాని దగ్గరికి వెళ్ళనీయకుండా ఆపే ప్రయత్నం జరుగుతోంది. ప్రస్తుత వ్యాసంలో ఉదాహరించబడిన దమయంతీ స్వయంవరం, నందిగ్రామ రాజ్యం మొదలైన రచనలు నిజానికి వ్యావహారిక భాషలోనే వున్నాయి కూడా. ఈ రచనలు అన్నిటిని చదివితే విశ్వనాథవారి సాహిత్యంలోని గాంధీయ భావాలను ఎవరికి వారే గమనించగలుగుతారు. మబ్బులు తొలగే దాకానే సూర్యుడు మరుగున వుండేది మబ్బుల గురించి తెలియడమే తొలగిపోవడం కదూ? *

## చిన్ని మబ్బులు

కన్నెకాటుక కళ్ళు - చిన్నినాథుని చూచి
కదలు లాడినవేళ - కందళించినవేళ
ఆకాశమధ్యాన అటనొక తెలిమబ్బు
మెరపులా మెరిసిందిలే - వెలుగులో వొరిసిందిలే.

తొలిచిన్ని చూలాలు - కొలనిగ్గు ప్రేమతో
విభుని చూచినవేళ - విన్నబోయినవేళ
బయిపు మిన్నులలోన - ఒక నీటితెరమబ్బు
సంజలో తారిందిలే - జాలుగా మారిందిలే.

తొలికాన్పు పసిపాప - సాకనేరని బాల
తెలవోయి పతిజూచి - కళవళించినవేళ
తూరుపు కోనలో - తొంగిలించిన మబ్బు
తెగపరుగు లెత్తిందిలే - సొగసుల్లు పోయిందిలే.

— విశ్వనాథ

# విశ్వనాథ రచనలపై ఇంగ్లీషు ప్రభావం

## —శ్రీ పోలాప్రగడ సత్యనారాయణమూర్తి

నవ్యాంధ్ర సాహితీ ప్రపంచంలో నన్నపార్యుడూ, రసగంగాధర కావ్య కవితాజగతికి నవ జగన్నాథుడూ అయిన శ్రీ విశ్వనాథ సత్యనారాయణ బహుముఖ ప్రజ్ఞాశాలి వాల్మీకిలా తన గాఢమైన అనుభూతిని అక్షరగతం చేయ గల సామర్థ్యం, కాళిదాసులా సౌందర్యమయ లోకాల్ని దర్శించి తిరిగి ప్రదర్శించ గల నైపుణ్యం, షేక్స్పియర్ వలె నిశితంగా లోకాలోకనం గావించి సమకాలీన వస్తువుని సార్వకాలీనం చేయగల చాతుర్యం, ఇబ్సన్ డాంటేలవలె రసాను గుణమైన శబ్దశైలీ సంధాన విధాన వైభవం- ఇలా ఎన్నో అద్భుత రసవద్రచనా మార్గాలకి కూడలి ఆయన.

భావగీతికలు, ఖండకావ్యాలు, నాటికలు,నాటకాలు, వ్యాసాలు, విమర్శలు, కథలు, నవలలు, నవలికలు- ఇలా వివిధ సాహిత్య ప్రక్రియల నెన్నింటిని అతిలోకరమణీయంగా రచించినా, నిత్యవేగి అయిన ఆయన చేతము తృప్తిచెంద లేదు. తన సకలోహసనాథగా శ్రీమద్రామాయణ కల్పవృక్షాన్ని సకలార్థదాయి నిగా రచించాక కొంత శాంతి వహించింది

విశ్వనాథ కృతులన్నీ నిశితంగా పరిశీలిస్తే ఆయన రచనా విధానం, అదంతా ఒక మహాక్రతువుగా కనిపిస్తుంది. ఆ సాహితీ యజ్ఞానికి సమకూర్చు కొన్న సంభారాలు అన్నీ ఇన్నీనా? భగవద్దత్తమైన ప్రతిభ - ఆ పైన గురుకుల క్లిష్టత ద్వారా ఆర్జించిన పాండిత్యగరిమ, ప్రాచీన సంస్కృతాంధ్ర గ్రంథాలతో బాటు పాశ్చాత్య వాఙ్మయ పరిశీలన, సమకాలీన జనజీవన అవగాహన - విశ్వ శ్రేయోభిలాష - నిర్భయంగా నిర్మొహమాటంగా చెప్పే నిజాయితీ - ఆ చెప్పే దాన్ని బలంగా చెప్పగల సామర్థ్యం- చెప్పే విషయాన్ని ఆలోచనల జ్వాలల్లో పుటం పెట్టి అమృతాంతరంగ చంద్రికల్లో రసార్ద్రం చేసి, సర్వాలంకారభూషి తను చేసి మరీ అందించడం - ఇదీ విశ్వనాథ కవితాక్రతు మార్గం.

ఈ మహాయజ్ఞంలో పాశ్చాత్య సాహిత్య పరిశీలన ఒక ముఖ్యమైన సంభారం. ఈ సందర్భంలో 'విశ్వనాథ ఏమిటి? ఆయనపై ఆంగ్ల సాహిత్య ప్రభావం ఏమిటి?' అని ఆగ్రహించే విశ్వనాథ అనుయాయులకు ఒక విన్నపం. ఆయన ఒక్క ఆంగ్ల సాహిత్యాన్నే కాదు- ఆంగ్లభాషద్వారా విశ్వవాఙ్మయాన్ని కూడా పఠించారు. సంస్కృతాంధ్ర ఆంగ్ల మహా గ్రంథ సముచ్చయాన్ని ఔపోశన కట్టిన అగస్త్యు డాయన బహుభాషలందలి బహుగ్రంథాల్ని చదివి అందలి మానవ నిష్ఠములైన భావాలెన్నింటినో తనవిగా చేసుకున్నారు. కూలంకషంగా పరిశీలించారు. ఆయా కవుల రచనా విన్నాణాన్నీ శిల్పకళా నైపుణ్యాన్నీ ఆకళింపు చేసుకొన్నారు. ఏయేటి కాఏడు, నోబెల్ ప్రైజు వచ్చిన గ్రంథాన్ని ఆతురతతో ఇతర దేశాన్నుంచి అయినా తెప్పించుకొని, వైమర్శిక దృష్టితో పరిశీలించి, ఆ గ్రంథానికి నోబెల్ ప్రైజు రావడానికి గల కారణాల్ని అవగతం చేసుకొనేవారు, హెమింగ్వే ఓల్డ్ మేన్ అండ్ ది సీ, టి ఎస్ ఇలియట్ ది వేస్ట్ లాండ్‌లని ఆయన అలా తెప్పించుకొని చదవడం నాకు తెలుసు. వాటిని చదివే వారంటే, వాటిని అనుకరించడం కోసం అని కాదు అర్థం. తత్పఠనా పాటవంతో, తన వ్యక్తీకరణ సామర్థ్యాన్ని మరింత పదును పెట్టుకోవడం కోసం అన్నమాట - అది ఎలాంటి దంటే వాల్మీకి హనుమత్సందేశం చదివిన స్ఫూర్తితో కాళిదాసు మేఘసందేశం వ్రాసినట్లు - అది కేవలం ప్రేరణా, రచనా మార్గానికి ఒక దిక్సూచి - అంతవరకే.

సత్యనారాయణగారు అమితమైన ఆసక్తితో చదివిన ఆంగ్ల గ్రంథాలు అనేకం - మిల్టన్, వర్డ్స్‌వర్త్, షెల్లీ, టి. ఎస్. ఇలియట్ వంటి కవుల కవితా మార్గాల్నీ; షేక్స్పియర్, షా, ఇబ్సన్‌ల నాటక రచనా పద్ధతుల్నీ, వేనిటీఫెర్, ఐవేన్‌హో, ది హంచ్‌బేక్ ఆఫ్ నాటర్‌డామ్, ది పైంటెడ్ వీల్, ఇడియెట్, సైలీస్ మారినర్, మదర్, వార్ అండ్ పీస్, అనాకెర్నినా, డాక్టర్ జివాగో, ఫర్ హూమ్ ది బెల్ టోల్స్, మేడమ్ బావరీ, సన్స్ అండ్ లవర్స్, పిక్చర్ ఆఫ్ డోరియన్ గ్రే, గాన్ విత్ ది విండ్, ఓల్డ్ మేన్ అండ్ ది సీ వంటి ప్రపంచ ప్రసిద్ధమైన నవలల్లోని వస్తు వైవిధ్యాన్నీ, విన్యాస వైభవాన్నీ, కథా కథన సౌరభాన్నీ క్షుణ్ణంగా అధ్యయనం చేసి, పాశ్చాత్య సాహితీ శిల్పకళా నైపుణ్యాన్ని మనసారా మెచ్చుకొనేవారు. ఆ కథలూ, ఆ జీవితాలూ, ఆ జీవిత సూక్తాలు మనకి అక్కరలేదు కాని, ఆ అందాలూ, ఆ నగిషీలూ మనకి అవసరం అనే

వారు. ''తలాపు దిక్కున దీపం పెట్టుకుని తెల్లారి కోడికూసే దాకా అతడు పుస్తకాలు చదివేవాడు. వాటిలో ఎక్కువ భాగం ఇంగ్లీషు నవలలూ, ఆంగ్ల కావ్యాలూను'' అని ఆయన రాసిన పంక్తులు, నిజానికి ఆయనకే అన్వయిస్తాయి.

ఆంగ్ల గ్రంథాలు చదవడం, ఆంగ్ల చిత్రాలు చూడ్డం పరిపాటి. సన్నిహితులకి తెలుసు-సత్యనారాయణగారు, సెకండ్‌షోకి వెళ్ళి సినిమాలు, ముఖ్యంగా ఇంగ్లీషు సినిమాలు చూసేవారన్న సంగతి. దెల్ రైడ్స్ ఆన్ ఎ హార్స్ అనే సినిమాకి నన్ను రెక్కపట్టుకుని మరీ తీసికెళ్ళిపోయారు తనతోబాటు. టార్జాన్ సినిమాలు ఆయన చాలా చూశారనీ వాటిలో గజ్జాలు నడిచిన చిత్రగతులెన్నో చూశాననీ కల్పవృక్షంలో కొన్ని అశ్వగతులు వర్ణించడానికి ఆ అనుభవం ఉపకరించిందనీ ఆయనే అన్నారు.

తాను చదివిన పాశ్చాత్య గ్రంథాలలోని ఇతివృత్తం, నిర్మాణం, శిల్పం, ఆలోచనాసరళి, రచనా ప్రౌఢిమవంటి ఎన్నో అపురూప సాహిత్య విశేషాల్ని హృద్గతం చేసుకుని, మెదడుకి లభించిన ఆ బలంతో, మనస్సుమీదపడిన ఆ వెలుగుతో, తన కవితా శారదని అలంకరించేవారు. ఆ అలంకరణలో మళ్ళీ పాశ్చాత్య రేఖ ఒక్కటీ ఉండడానికి వీల్లేదు - అంతా తన స్వంత గొంతూ - స్వంత బాణీ! ఆయన రచనలపై ఆంగ్ల ప్రభావం త్రివేణిలో సరస్వతిలా సామాన్యదృష్టికి కనిపించదు - నిర్ధారితం చేయలేని అనుభవైకవేద్యం అది. విశ్వనాథ గడుసుదనం ఎలాంటిదంటే, తను చదివిన గ్రంథంలో ఒక అందమైన భావాన్నో, ఒక బలమైన సంఘటననో, ఒక చిత్రమైన పాత్రనో, ఒక అద్భుతమైన శిల్ప విధానాన్నో రేఖామాత్రంగా స్వీకరించి తనదైన భావనాబలంతో తనకి మాత్రమే సాధ్యమైన ఉక్తి చమత్కృతితో సర్వం భారతీయం చేసి అందించడం!

కల్పవృక్షం అరణ్యకాండ గురించి చెబుతూ ఓ సందర్భంలో ఆయనే అన్నారు: "జిమ్‌కార్బెట్, హెండర్‌సన్, సింగ్ గ్రంథాలెన్నో నేను చదివాను. అడవి, వేట, వీటికి సంబంధించిన విషయాలెన్నో నాకు అవగతం అయ్యాయి. అవి అన్నీ నా మనస్సులో పడిన తర్వాత వాటికి కలిగే సంస్కారం వేరు. అవి అన్నీ నా అనుభవ విశేషాలవుతాయి. ఏనాడో ఎక్కడో నేను అలా అడవిలో రాత్రిళ్ళు గడిపి ఉన్నాననే అనిపిస్తుంది. రచించేటప్పుడు, ఆ అనుభవం నాకు ఆలంబనగా నిలుస్తుంది" అని.

షేక్స్పియర్‌లా, స్వీకరించిన దాన్ని స్వీకృతిగా మలిచే, అద్భుతమైన పరసువేది లాంటి శక్తి విశ్వనాథకి ఉంది. అయితే షేక్స్పియర్, సాహితీ సరస్వతికి చేసిన ఆభరణాల్లో, బంగారం ఆయనిది కాదు, పనితనమే ఆయనది. విశ్వనాథ విషయంలో అలా కాదు. బంగారం ఆయనదే - పనితనం మాత్రం ప్రాచ్యవిధానాన్ని పాశ్చాత్యపు భావంతో మెరుగుపెట్టిన ఒక విశిష్టమైన పద్ధతి. కృష్ణశాస్త్రి అన్నట్లు ఆయన గాఢప్రతిభుడు కావడంవల్ల, ఏది స్వీకరించినా, ఏది అనుసరించినా, దాన్ని యథాతథంగా అనుకరించక, రూపురేఖలు మార్చేసి తనదైన ముద్ర ఒకటి వేసేస్తారు. అందువల్ల ఇదిగో ఇక్కడ ఉంది పాశ్చాత్య ప్రభావం అని నిర్ద్వంద్వంగా చెప్పలేం-చెప్పినా, దాన్ని పూర్వపక్షం చెయ్యడానికి అవకాశం ఎప్పుడూ ఉంటూనే ఉంటుంది.

చూడండి - టి. ఎస్. ఇలియట్ వేస్ట్‌లాండ్ ఒక గొప్ప కవిత - నోబెల్ ప్రైజ్ గెలుచుకొన్న కవిత. విశ్వనాథ వేయిపడగలు మహేతిహాససదృశమైన ఒక గొప్ప నవల కాని, రెండింటిలోనూ కొన్ని సమాన లక్షణాలు ఉన్నాయి. నైతిక విలువలు పడిపోయి, నిర్జీవంగా మారిన నవనాగరక జీవితచిత్రణ, పునః ప్రతిష్ఠ అయి ధర్మం నిలబడాలనే ఆకాంక్ష, తన్నిమిత్తమై సంప్రదాయ జీవన ప్రబోధం, అన్నింటికీ ఆర్థికతయే మూలంకాదు; దానికి అతీతమూ శాశ్వతమూ అయిన ద్రవ్యం మరొకటి ఉంది అనే హెచ్చరిక. ఇవి అన్నీ ఆ ఇద్దరి మనస్సుల లోనూ ఉన్న ఆవేదనా స్వరాలే. చెప్పదలచుకొన్న సంగతితోబాటు చెప్పే పద్ధతిలో కూడా ఇద్దరిలోనూ ఒక సారూప్యం ఉంది. ఇద్దరిదీ ధ్వనిమార్గమే. ఇద్దరిదీ రసోచితమైన శైలే. ఇద్దరూ ప్రతీకలు వాడతారు. బాహ్యదృష్టికి ఇద్దరి రచనా క్లిష్టంగా ఉన్నట్లు కనిపిస్తుంది. కాని, పరిశీలిస్తే అన్వయ క్లిష్టత ఇరువురి రచనల్లోనూ లేదు.

కావ్యాల్లో అంతగా కనిపించదు కాని, విశ్వనాథనాటకాలలోనూ, నవలల్లోనూ పాశ్చాత్య ప్రభావం కొద్దో గొప్పో ఏదో రూపంలో పరిమళిస్తుంది. ఒక చోట పాత్రని మలచడంలో, మరో చోట సన్నివేశాన్ని కూర్చడంలో, ఇంకో చోట కథా సంవిధానం ఏర్పరచడంలో - ఇలా రకరకాలుగా దర్శనం ఇస్తుంది ఆ ప్రభావం. ఒక చోట 'పాశ్చాత్య కావ్యాలు శిల్పభూములు' అని సూచన మాత్రంగా అని వదిలేసిన విశ్వనాథ, మరో చోట స్పష్టంగా చెప్పారు - తనపై ఇంగ్లిష ప్రభావం ఎంతో ఉందని.

ఏకవీర గురించి ప్రస్తావిస్తూ "నేనీ నవల కథానిర్మాణంలో సైలీస్ మారినర్‌ని అనుకరించాను'' అన్నారు. అంతేకాదు, కొన్ని సంఘటనలు విధి విలసితాలు అన్నట్లు సమకూర్చారు షేక్స్పియర్ రోమియోజూలియట్‌లో సమకూర్చినట్లు. ప్రేమికుల జీవితాల్ని విషాదమయం చేయడంలోనేకాదు. హార్డీ నవలల్లోని విధి, విన్యాసాన్ని గమనించి తన రచనలో కూడా చిత్రమైన సంఘటనల్ని కల్పించి పాత్రల బ్రతుకుల్లో ఆటుపోట్లు కల్పిస్తుంది విధి అని స్పష్టపరిచారు. ఇంగ్లీషు సాహిత్యంలో ఒక తరాన్ని సమ్మోహనపరచిన అమలిన శృంగార భావనకి (Platonic love) ఏకవీర నవలలో ప్రత్యేకస్థానం కల్పించి, దానిచుట్టూ రచయిత కథని అల్లడం గమనార్హం.

''ఏకవీరగురించే ప్రస్తావిస్తూ విశ్వనాథ మరోసందర్భంలో ఇలా అన్నారు: ''సైలాస్ మారినర్‌లోని కథా నిర్మాణం కాళిదాస భవభూతులలోని శిల్పం, ఠాగూర్ నౌకాడూబీలోని శరీరవాంఛా దూరమైన ప్రేమధర్మం, నా తెలుగు రచనాశక్తి - ఈ నాల్గింటినీ కలిపి ఏకవీరగా చేశాను'' అని.

ఇతివృత్త స్వీకరణా, తుది సందేశం అనే ఈ రెండింటికి సంబంధించీ, చలం మైదానానికి ప్రతిద్వంద్విగా చెలియలికట్ట అవతరించిందన్న విమర్శకుల అభిప్రాయాన్ని మనం మన్నించినా, మన్నించకపోయినా, కథా నిర్మాణం పాత్రచిత్రణా, సన్నివేశకల్పనా వంటి రచనారహస్యాల సందర్భంలో, పాశ్చాత్య, పోకడలని ఆయన అనుసరించారనేది నిర్వివాదాంశం. తనకంటె తక్కువ లోకజ్ఞానంఉన్న వ్యక్తిని, తన ఉక్తిచమత్కృతితో ఒప్పించి, తనమార్గానికి మళ్ళించి, చివరికి ఆ వ్యక్తి జీవితం సర్వభ్రష్టం అయ్యాక నిస్సహాయుడిగా మాట్లాడం, పిక్చర్ అఫ్ డోరియన్‌గ్రేలో కనిపించే ఒక దయనీయ పరిస్థితి. చెలియలికట్టలో రంగడు రత్నావళిని అలాగే ప్రభావితంచేసి సర్వభ్రష్టత కల్పించి తర్వాత తన నిస్సహాయతని ప్రకటిస్తాడు. ఈడిపస్ నాటకంలో మాతృసంగమానంతరం ప్రకృతి ప్రళయరూపం ధరించడం, వాతావరణం అంతా బీభత్స భయానకంగా మారడం, నీచకృత్యానికి ఫలితంగా ఈడిపస్ నికృష్టమైన చావు చావడం- ఇదంతా చెలియలికట్ట చివరి ఘట్టాల్ని చిత్రించడానికి విశ్వనాథకి స్ఫూర్తినిచ్చి ఉండాలి. అంతేకాదు, ఆ నవలలో రంగడిచేత మేరీస్టోప్స్ వ్రాసిన స్త్రీ పురుష సంబంధ గ్రంథాల ప్రస్తావన చేయించడం చూస్తే, వాటిని విశ్వనాథ చదివారనీ,

అందలి విషయాల్ని పూర్వపక్షం చేయడానికి పూనుకొన్నారనీ మనకి విదితం అవుతుంది. ఎమిలీ బ్రాంటీ, విధరింగ్ హైట్స్‌లోని వజ్రకాఠిన్యమైన స్త్రీ పురుష సంబంధం (Sterne sex) విశ్వనాథ బద్ధన్న సేనానికి సాక్షాత్కరించదంసరే. డి. హెచ్. లారెన్స్, హెవలక్ ఎల్లీస్, మేరీ స్టోప్స్‌లో కనిపించే విపరీత,వికృత, విలోమ, అవిలోమ, వయోభేదాదివ్యామోహాలూ, స్త్రీ పురుష ఆకర్షణలూ ఆయన అన్ని నవలల్లోనూ (ఏకవీరలో తప్ప) కనిపిస్తాయి. మిల్టన్ పేరడైజ్‌లాస్ట్‌లోని ప్రసిద్ధ వాక్యం "It is the mind that makes a hell of heaven and a heaven of hell" ని రంగడి పాత్ర ద్వారా 'మనసే స్వర్గాన్ని నరకం, నరకాన్ని స్వర్గం చేస్తుంది' అంటూ అనిపించి ఆ భావం తనని ఎంతగా ప్రభావితం చేసిందీ తెలియపరుస్తారు విశ్వనాథ.

చూసిన వారి మనసుల్ని ఝల్లుమనిపించి, వారిలో అలజడి రేపే విరూపమైన వామదేవుని పాత్రని 'స్వర్గానికి నిచ్చెనలు'లో విశ్వనాథ సృష్టించారంటే, అంతకుముందు ఆయన నిస్సందేహంగా 'హంచ్ బేక్ ఆఫ్ నాటర్ డామ్' నవల చదివి-గుండెల్లోంచి వణుకు పుట్టించే, అందలి కురూపి పాత్రని జ్ఞాపకం పెట్టుకున్నారన్నది సుస్పష్టం

జేబుదొంగలు నవలలో ముఖ్యమైన ఘట్టం ఒకటి ఉంది. జడ్జి అయ్యాక అవధాని అప్పడిని ఆదుకోకపోవడం, Disown చెయ్యడం అన్నమాట. షేక్స్పియర్ నాటకంలో ప్రిన్స్ హాల్ అలాగే ఫాల్‌స్టాఫ్‌ని ఆదుకోడు. చిన్నప్పుడు ఇద్దరూ కలసి అల్లరిచిల్లరిగా తిరిగారు. దొంగతనాలు చేశారు. కాని, తర్వాత ఒకడు మర్యాదస్తుడుగా మారాడు. మరొకడు జులాయిలా అలాగే ఉండిపోయాడు పదవిలోకి వచ్చాక చిన్ననాటి మిత్రుడిని బహిరంగంగా ఆదుకోడానికి హోదా అడ్డువస్తుంది. అక్కడ ఫాల్‌స్టాఫ్, ఇక్కడ అప్పడూ ఇద్దరూ దయనీయమైన పాత్రలు. ఆ సన్నివేశాన్ని విశ్వనాథ, షేక్స్పియర్ మార్గంలోనే నడిపించారు. రిజెక్షన్ ఆఫ్ ఫాల్‌స్టాఫ్ అనే అంశం, ఎంత విస్తృతంగా చర్చల్లో చోటు చేసుకుందో ఆంగ్ల భాషాపండితుల కందరికీ తెలిసిందే. మరో సంగతి-అవధాని 'నాకు ఆ అమ్మాయి దిక్కుతుందా - ఆ మహద్భాగ్యం నాకు కలుగుతుందా' అని దోలాయమానసుడై జేషన్ అండ్ ది గోల్డెన్ ఫ్లీస్ ప్రస్తావన పదే పదే తెస్తాడు. అంటే - విశ్వనాథని ఆ గోల్డెన్ ఫ్లీస్ వృత్తాంతం బాగా ఆకర్షించిందన్నమాట.

"బహు భాషల్లోని బహు గ్రంథాల్ని చదివి స్వీయప్రతిభతో మేళవించి ఆయన తయారుచేసే ఆ శిల్పప్రక్రియ మహోన్నతమైంది. ఇంగ్లీషు తెలుగు సంస్కృత కవులు తమ రచనల్లో చొప్పించిన కళారహస్యాలు ఏవో, ఎలాంటివో విడమర్చి చెప్పేవారు మేష్టారు" అని శ్రీ పొట్లపల్లి సీతారామారావు గారు అన్నమాటలు అక్షరసత్యాలు.

జొనాథన్ స్విఫ్టి 'గలివర్స్ ట్రావెల్స్' చదివి, ఆ తర్వాత విశ్వనాథ 'హాహా హూహూ' చదివితే స్విఫ్ట్ విశ్వనాథని ఎలా ఆకర్షించాడో తెలుస్తుంది. రెండు గ్రంథాలూ సమకాలీన సమాజంలోని అవకతవకల్ని అపహాస్యం చేయ డానికి ఉద్భవించినవే! మనలో చాలామందిమి గలివర్స్ ట్రావెల్స్‌లో మొదటి రెండు ప్రకరణాలూ, అంటే లిల్లీపుట్, బ్రాబ్డింగ్‌నాగ్ చదివి ఊరుకుంటాం. నాలుగోది హూయూహమ్స్ అని ఇంకో ప్రకరణం ఉంది. స్విఫ్ట్ అందులో గుఱ్ఱాల రాజ్యాన్ని వర్ణిస్తాడు. అక్కడ నాగరికమూ సంస్కారవంతమూ అయిన జీవులు గుఱ్ఱాలు. ఆ రాజ్యంలో అతి నీచంగా ప్రవర్తించే జీవులు మనుష్యులు. అది చదివారు విశ్వనాథ. దీనికితోడు హయగ్రీవాది దేవతలూ, గంధర్వులూ మనకి ఉండనే ఉన్నారు. ఇంకేం? సారవంతమైన సత్యనారాయణగారి హృదయ క్షేత్రంలో హాహాహూహూ కథ రూపుకట్టింది స్విఫ్ట్ వర్ణించిన గుఱ్ఱం ఔన్నత్యం, మనిషి నైచ్యం, ఆసక్తిదాయకంగానూ, సందేశాన్ని అందించడానికి సమర్థం గానూ తోచింది దాంతో ఆ మార్గంలో వ్రాశారు విశ్వనాథ. తాళ్ళతో హాహాహూహూ గంధర్వుణ్ణి కట్టె య్యడం, పెద్ద చక్రాల బండి మీద తీసి కెళ్ళడం, బంధించడం, అతనిపట్ల అందరూ ఆసక్తి కనపరచడం, విరోధిలా కాకుండా మిత్రునిలా చూడ్డం ఇవన్నీ లిల్లీపుట్ కథలోనూ. హాహా హూహూ కథలోనూ కనిపించే సమాన విషయాలు. ఇంక కథలో - బాస్‌వాయిస్ ప్రస్తావన మినిటార్ అనే మొద్దు ముఖం ఉన్న జంతువుని గ్రీస్‌హీరో థీసియస్ చంపడం, ఫోనిటిక్స్ గురించీ, మాక్స్‌ముల్లర్ గురించీ సందర్భానుసారం ప్రస్తావించడం, విశ్వనాథకిగల పాశ్చాత్య విజ్ఞానాన్ని చెప్పక చెప్తాయి. విష్ణుశర్మ ఇంగ్లీషు చదువు, పులుల సత్యాగ్రహంవంటి నవలలు వ్రాయడానికి ఇంగ్లీషులో వచ్చిన వ్యంగ్య అపహాస్య నవలలూ (Setirical Novels) చారిత్రక నవలలు వ్రాయ డానికి సర్ వాల్టర్ స్కాట్ నవలలూ దోహదం చేసి ఉంటాయి నిస్సారంగా

ఉండే చారిత్రకాంశాలకి నవలలో కళాత్మకరూపం ఇచ్చే నేర్పు స్కాట్‌కి ఉంది. విశ్వనాథ నవలల్లో ఆ నేర్పరితనం ప్రస్ఫుటం.

నవలల్లో ఏమిటి, నాటకాలలో ఏమిటి, చివరికి కల్పవృక్షంలో ఏమిటి, విశ్వనాథ కన్నరచే శిల్ప విశేషాలూ, ప్రతీకలూ, స్వప్న విశేషాలూ ముఖ్యమైనవి విశ్వనాథ త్రిశూలం, వేనరాజు, అనార్కలివంటి నాటకాలలోనూ కల్పవృక్షంలోనూ ఆయన వర్ణించిన చిత్ర విచిత్రమైన కలల్ని పరిశీలిస్తే, ఫ్రాయిడ్ Psycho-analysis రెండో భాగాన్ని ఆయన క్షుణ్ణంగా చదివినట్లు తెలుస్తుంది. వ్యక్తావ్యక్తంగా మనస్సులో ఉండిపోయిన ఆలోచనల ప్రతిఫలంగా, అంతశ్చేతన సంబంధిగా, నిద్రాణమై ఉన్న కోరికల ప్రచ్ఛన్నరూపంగా, భావి కథా సూచకంగా- ఇలా ఎన్నో రకాలుగా ఉండే కలలు ఆయన రచనల్లో కనిపిస్తాయి. అవి అన్నీ ఫ్రాయిడ్ విజ్ఞానాన్ని జీర్ణించుకొని, దానికి తన ప్రతిభా విశేషాల్ని చేర్చి రూపకల్పనచేసినవే. విశ్వనాథ దాదాపు 25 కలలు తన రచనల్లో చొప్పించారు. వ్యక్తి అంతశ్చేతనయందు సుప్తములై ఉన్న అనుభూతుల, ఆశల, ఆశయాల విచిత్రమగు బహిర్గమన సమ్మేళనమే స్వప్నం. స్వప్నాలు ఆ వ్యక్తి వ్యక్తిత్వానికి ప్రతీకలు అన్న ఫ్రాయిడ్ పలుకులకి, విశ్వనాథ వర్ణించిన కలలన్నీ బలమైన ఉదాహరణలు.

'నిత్యవేగి నా చేతము' అన్న విశ్వనాథ పలుకులు పరిశీలనార్హములు.

ఆయన రోమియో జూలియట్ చదివారు.

మనస్సులో అనార్కలి నాటకానికి రూపకల్పన జరిగింది.

షేక్స్పియర్ కరుణ రసాత్మక నాటకాలు పరిశీలించేసరికి వాటి ప్రభావం ఆయన మీద పడింది, విషాదాంత నాయక చిత్రణ నచ్చింది. వేనరాజు, నర్తనశాల అవతరించాయి.

నర్తనశాలలోని మనోభావ ప్రక్షాళణ (Purgatory) నిస్సందేహంగా పాశ్చాత్యదినుసే!

అనార్కలీలో మత్తుపానీయం కథని విషాదాంతం చెయ్యడానికి ఉపకరించడం, రోమియో అండ్ జూలియట్‌లో మత్తుమందు వల్ల నాటకం విషాదాంతం కావడం, ప్రేమికుల మధ్య ఇక్కడ మౌల్వీ, అక్కడ మఠాధిపతీ ఉండి వారి ప్రేమని సఫలం చెయ్యడానికి ప్రయత్నించడం- ఇవన్నీ సారూప్యాలు. హేమ్లెట్‌లో పిశాచం మాటలు హేమ్లెట్‌కి మాత్రమే వినిపించినట్లు, స్వర్గానికి నిచ్చెనలులో భర్త పిశాచం మాటలు వసుంధరకి మాత్రమే వినిపిస్తాయి. స్వర్గానికి నిచ్చెనలులో డార్విన్స్ థీరీ ఆఫ్ ఎవల్యూషన్ చర్చ విస్తృతంగా సాగుతుంది-

మేక్‌బెత్‌లోని అతిలోక శక్తులు త్రిశూలంలోని అతిలోక శక్తులకీ, హేమ్లెట్ మానసిక సంఘర్షణ వేనరాజులోని మానసిక సంక్షోభానికీ, హేమ్లెట్‌లో భూతం వేనరాజులోని పిశాచాలకీ, హేమ్లెట్‌లో grave diggers, అనార్కలిలో కాటికాపర్లకీ, వారి సంభాషణాధోరణి, వీరి మాటలతీరుకీ మాతృకలు. సంస్కృత నాటకాలలోకంటే ఆంగ్ల నాటకాలలో భావికథా సూచి అయిన మాట (Dramatic irony)ని ఉపయోగించడం పరిపాటి, నర్తనశాలలో కీచకుడు. 'ఇదియే నా కడసారి చూపు' అన్నమాట ఇందుకు ఉదాహరణ.

షేక్స్పియర్ నాటకాల్లో పురుషులే స్త్రీ పాత్రలు వెయ్యడం, ఆ సంగతి ప్రేక్షకులకి తెలియడం, అందుకే 'I am not what I am' వంటి మాటలు ఆ పాత్రలు అన్నప్పుడు సామాజికులు తలలూచడం జరిగేది వేనరాజు నాటకంలో పృథువేత ఆ మార్గంలోనే అనిపించారు విశ్వనాథ - 'నేను పురుషుడనైనచో నీకు రాజ్యం లేదు' అని.

జడప్రకృతిలోని చిరుగాలి (Ariel) లతలు, పుష్పాలు వంటి జడ పదార్థాలకి సజీవరూపకల్పన చేసి వాటిని పాత్రలుగా షేక్స్పియర్ Mid Summer Nights Dream, Tempest వంటి నాటకాల్లో వాడుకొన్నారు. అలాగే బ్లూబర్ అనే నాటకంలో మీటర్‌లింక్ జంతువుల చేత, చెట్ల చేత మాట్లాడించాడు. అనార్కలి నాటకంలో విశ్వనాథ అదే పని చేశాడు. నాటక కర్త భావాలకీ, ఆశయాలకీ, సిద్ధాంతాలకీ నాటకమందలి కొన్ని పాత్రలు ప్రాతినిధ్యం వహించడం, అలాంటి నాటకాల్ని Dramas of ideas అని విమర్శకులు పిలవడం, బెర్నార్డ్‌షా వంటివారు అలాంటి నాటకాలు వ్రాయడం ఆంగ్లంలో ఉంది.

అందులో కొన్ని పాత్రలు సిద్ధాంత చర్చ సాగిస్తాయి. ఈ విధానం త్రిశూలం, వేనరాజు వంటి నాటకాలలో మనకి కనిపిస్తుంది. నాటకం మధ్యలో సందర్భాన్ని బట్టి పరిస్థితిని విశ్లేషించేందుకో, రసాన్ని పరిపుష్టం చేసేటందుకో ఓ భావగీతాన్నో కవితా ఖండికనో చొప్పించే విధానం, సంస్కృత నాటకాలలో కంటే 16 వ శతాబ్దం ఇంగ్లీషు నాటకాలలోనూ, టి.ఎస్. ఇలియట్ వంటి 20 వ శతాబ్దపు ఆంగ్ల రచయితలు చేపట్టిన కవితా రూపకాల్లోనూ ఎక్కువ సంగీత రసపోషణ కోసం పూర్తిగా ఒక పాత్రనే కేటాయించడం షేక్స్పియర్ పద్ధతి. ఈ పద్ధతి విశ్వనాథ నాటకాల్లో కూడా కనిపిస్తుంది. షెల్లీ Loves Philosophy లోని 'The mountains mingle with the river. And the rivers with the ocean! Why not I with thine అనే పంక్తుల' ప్రతిధ్వనే అనార్కలి రుసీతో అన్నమాట 'సెలయేఱు! ఏటికే చేసెదు గానమ్ము?' అని. కొన్ని ప్రసిద్ధమైన Man proposes God disposes, Love is God వంటి ఆంగ్లసూక్తుల్ని అనువదించి, త్రిశూలంలోనూ, అంతా నాటకమే లోనూ చొప్పించారు విశ్వనాథ.

Milton's driving force వంటిదే విశ్వనాథ అనే జీవుని వేదన కూడా అని మనం అన్నా,

విశ్వనాథ నాటకాలు, ప్రాచ్య పాశ్చాత్య సిద్ధాంతాలకి కూడలి అని విమర్శకులు అన్నా.

ఇబ్సెన్, షా, మిల్టన్‌లు మహాకవులని సత్యనారాయణగారే పొగిడినా,

ప్రాగ్విపశ్చిన్మతంబున రసము వేయిరెట్లు గొప్పది అని ఆయన పదే పదే ఉద్ఘాటించినా,

ఇవన్నీ ఆంగ్లేయ ప్రభావం విశ్వనాథ ఆలోచనల మీదా, ఆయన రచనల మీదా ఎంత ఉందో చెప్పేవే!

వేయి పడగల నవలలో ఆద్యంతాలకి సమన్వయం లేదన్న విమర్శకులకి ఆయన ఇచ్చిన సమాధానం విందాం -

''సమన్వయం లేకపోవడమేమిటి? ఉంది. ఊ - లేదు . లేకపోతే ఏమిటి? దోస్తవిస్కీ నవలలు మీరు చదివారా? వాటిలో అద్వ్యంతాలు కనిపిస్తాయా? అవి గొప్ప నవలలు కావా? అయినా నవల జీవితానికి సన్నిహితంగా ఉండేది. జీవితంలో కనిపించని సమన్వయాన్ని, నవలలో బలవంతంగా చొప్పిస్తే ఏమవుతుంది? కృతకం అవుతుంది...." ఇలా సాగింది ఆయన సమాధానం. దీన్నిబట్టి కూడా మనకి అర్థం అవుతుంది - ఆయన రచనా మార్గానికి కొన్ని పాశ్చాత్య గ్రంథాలు దిక్సూచులు అని.

సంస్కృత గ్రంథాల్లో కంటే ఆంగ్ల గ్రంథాల్లో వాక్యగర్భ వాక్యనిర్మాణం (Paranthetical Construction) కోకొల్లలు. అలా వ్రాయడం వల్ల, మనం మాట్లాడుకుంటున్నట్లే ఉంటుంది రచన - ఉదాహరణకి కల్పవృక్షంలో మైనాకునితో హనుమంతుడంటూన్న ఘట్టం—

చేనదిమి నాకా గంగ—
నీవే కనుంగొను—
వీలంచును గల్గునే?

వాల్మీకంలో లేని ఒక విశేషాన్ని విశ్వనాథ తన కల్పవృక్షంలో చేర్చారు- అదేమిటంటే, రావణుని పదితలల్లోనూ, నవ్వేతల ఒకటే - అదే నిజమైన తల. ఇలా రాయాలని ఆయనకి ఎందుకు తోచింది? ఎలా తోచింది? దీనికి ఆధారం ఏదైనా ఉందా? జంతుశాస్త్రం, జీవశాస్త్రం వంటి వాటిల్లో విచిత్ర జీవుల గురించి ఏమైనా చదివారా? అన్న ప్రశ్నకి సమాధానం దొరుకుతుంది. J. Fenibio వ్రాసిన 'ప్రోటాసైటా' చదివితే. అంటే విశ్వనాథవారు ఫెనిబియో గ్రంథాన్ని చదవడమో, దానిలోని సంగతుల్ని వినడమో జరిగిందన్నది అర్థం అవుతుంది కదా?

ఇలా పరిశీలించుకుంటూ పోతే, విశ్వనాథ రచనలపై ఆంగ్ల సాహిత్య ప్రభావం తాలూకు విశేషాలు ఇంకా ఎన్నో దొరుకుతాయనే నా నమ్మకం. అసలు, ఈ శీర్షికతో చురుకైన విద్యార్థులు ఎవరైనా M. Phil, Ph D.

పట్టాలకై పరిశోధన సాగించడం మంచిది. అలా చేస్తే ఇంకా లోతుగా పరిశీలించి మరెన్నో విశేషాలు కనుక్కోవచ్చు.

ఈ పరామర్శకి ముగింపు వాక్యాలు వ్రాసే ముందు ఒక్క విషయం:

ఇంగ్లీషు సాహిత్య ప్రభావం ఆయన రచనలమీద గణనీయంగానే ఉంది. అందుకు సందేహం లేదు. కాని, ఆ సంగతిని సోపపత్తికంగా ఇదమిద్ధం అని నిర్ణయించడం కష్టం. ఏమంటే, దేనినీ ఆయన యథాతథంగా అనుకరించరు - అనుసరించరు. తనకి నచ్చిన శిల్పరీతినో, రచనావైదుష్యాన్నో, ఊహారేఖనో రేఖా మాత్రంగా స్వీకరించి హృద్గతం చేసుకుని, తనదైన మార్గంలో దానికి నూతనరూపాన్ని కల్పించి వినూత్నంగా ఉపయోగిస్తారు. మిత్రులు ఒకసూత్రం చెప్పినట్లు, "ఎన్ని మహా ప్రవాహాల్ని ఆయన తనలో జీర్ణించుకున్నా, చివరకి ఆయన రచనల ద్వారా మనకి లభించేది విశ్వనాథ తీర్థమే! వినిపించేది ఆయన స్వంత గొంతే! కనిపించేది ఆ విద్యుత్ రేఖే! అందుకు కారణం - ఆయన ప్రతిభ ఆకాశం అంత ఉన్నతం - ఆయన శిల్ప గాంభీర్యం జలనిధి అంతటి నిమ్నం - ఆయన రచనా వైవిధ్యం పృథివి అంతటి విశాలం కావడమే. ఆయన పాండిత్యం బహుముఖం - ప్రజ్ఞా పాటవాలు సర్వతోముఖం - ఈ, నా, వాదం సిద్ధాంతం అని నేను అనను. ఎవరైనా పూర్వపక్షం చేస్తే చెయ్యవచ్చు - ఇది ఒక దృక్కోణం మాత్రమే - కానైతే ఇది సరి అయిన దృక్కోణం అని మాత్రం చెప్పగలను

*

గోదావరీ పావనోదారవాః పూర
　　మఖిల భారతము మాదన్ననాఁడు
తుంగభద్రా సముత్తుంగ రావముతోడ
　　కవుల గానము శ్రుతిఁ గలుపునాఁడు
పెన్నానదీ సముత్పన్న కైరవ దళ
　　శ్రేణిలో తెన్గు వాసించునాఁడు
కృష్ణా తరంగ నిర్ణిద్ర గానముతోడ
　　శిల్పమ్ము తొలి పూజ సేయునాఁడు
అక్షరజ్ఞాన మెఱుగదో యాంధ్ర జాతి?
విమల కృష్ణానదీ సైకతములయందు
కోకిలపుఁబాట పిచ్చుకగూళ్ళుకట్టి
నేర్చుకొన్నది పూర్ణిమా నిశలయందు.

— విశ్వనాథ.

# భావకవిగా విశ్వనాథ

—డాక్టర్ నాయని కృష్ణకుమారి

రామాయణకల్పవృక్ష రచయితా, వందలుగా వ్రాసిన రచనల్లో పదులుగా గుప్పించిన ప్రక్రియలకు కర్త అయిన విశ్వనాథను భావకవిగా ఇప్పుడు జ్ఞాపకం చేసుకోవడం చిత్రమే ఇప్పుడాయనే గనక ఉండి నేనీ వ్యాసం వ్రాయడం చూస్తే నీ మొహం.

"గత విభావరీ సుఖదుఃఖ ఘటనలెల్ల
స్వాప్నికములని సత్ప్రభాతమున నింక
పోదునని పులుగడిగిన ముత్తెమట్లు"

ఆ మార్గాన్ని ఒదులుకొని ఎంతో దూరం వచ్చేశానే, అని

''ఇవి మహా మోహంపు భూము లిచటనుండి
వివిధ కష్టంబుల ననుభవించినాడ
అచట ముక్తి పొలాల నందెచట జూచి
నను సుఖాలె పరిమళించినవి భృశమ్ము''

అని చెప్పేవారు. మధ్యాక్కరల మీదో కల్పవృక్షంమీదో వ్రాయక ఏమిటీ పిల్ల చేష్ట అనేవారేమో కూడా! ప్రశమిత యౌవన స్థితిలో ప్రణయ భావనకు చులకన కాక మరేమిటి? ఆయన ఏమన్నా మనం ఆలోచింపక విడవవలసినది కాదు భావ కవిత్వం.

భావ కవిత్వమనే మాట తమాషాగా రంగ ప్రవేశం చేసింది తెలుగు నవ్య కవిత్వంలోకి. ఈ మాటను ప్రకాస్తిలోకి తెచ్చినవారు గాడిచర్ల హరిసర్వోత్తమ రావుగారని చెప్పుకుంటారు. అయితే ఆయన 20 వ శతాబ్దం ప్రారంభంలో రూపుదిద్దుకుంటున్న నవ్యకవిత్వానికి లేదా, ఆంగ్లేయుల రొమాంటిసిజానికి సరిగా

అనువదించుకొన్న కాల్పనిక కవిత్వానికి ఈ మాటను అన్వయించారు. భావ కవిత్వం అన్న పదంలో భావాన్ని దృష్టిలో ఉంచుకుని నిర్వచనాలిచ్చిన కొందరి అభిప్రాయాలను పరిశీలిస్తే, ఈ భావకవిత్వమనే పేరు ఏ కవిత్వానికి వాడవచ్చునో, ఏ కవిత్వానికి వాడకూడదో స్పష్టం అవుతుంది. ఆ నిర్వచనా లివి:

1. విశ్వనాథ, "కవియొక్క అంతర్నిగూఢ తాపము అవిస్పష్ట వాంఛాంకురము ఒక చిన్న కావ్యమునందూదబడినచో అది భావకవిత్వము" అన్నారు. ఈయనే మరో సందర్భంలో భావకవిత్వాన్ని గూర్చి, "నీ హృదయంలో ఏదో తారాడుతుంది. అది బాధగా ఉంటుంది. ఆ బాధలో ఒక సుఖముంటుంది. అది జీవుణ్ణి కదిలిస్తుంది. ఇదమిత్థమని చెప్పలేనిది అదే భావకవిత్వం" అన్నారు.

ఈ నిర్వచనాల్లో భావకవిత్వానికి రూపురేఖలు దిద్దడానికి కొన్ని స్థిరాంశాలు కనిపిస్తున్నాయి. అవి (1) కావ్యంలో ఊదబడేది కవికి సంబంధించిన నిగూఢ తాపమూ, అవిస్పష్టమైన వాంఛ. (2) కవియొక్క ఈ తాపమూ, వాంఛా రెండూ అతని హృదయంలో తారాడేవే. (3) వాటివల్ల అతనికి బాధ కలుగుతుంది. (4) ఆ బాధలోనుండి కవి సుఖాన్ని కూడ పొందుతాడు. (5) అది కవికి సంబంధించిన జీవుణ్ణి, పఠితకు సంబంధించిన జీవుణ్ణీ కదిలిస్తుంది. (6) ఈ సుఖాన్నీ బాధనూ, వాంఛనూ, తాపాన్నీ కవి చిన్న కావ్యంలో తీర్చిదిద్దుతాడు.

ఈ అభిప్రాయాలను విశ్వనాథ 1939 లో తాను వ్రాసిన 'లిరికల్ పోయట్రీ' అనే వ్యాసంలో ప్రకటించారు. అయితే ఇంగ్లీషు 'లిరికల్' పోయట్రీ లక్షణాలు ఇలా ఉంటాయి:

"The Lyric has the function of revealing in terms of pure art, the secrets of inner life, its hupes, its fantastic joys its sorrows in delirium" ఇందులో ఆశా, అంతర్నిగూఢతాపమూ మాత్రమే కాక, సుఖాలు, విచారాలూ కూడా ఉన్నాయి. అయితే ఇవన్నీ కవికి సంబంధించినవేనన్న స్పష్టీకరణ విశ్వనాథ చేసినట్లుగా ఇక్కడ చేయబడలేదు. తెలుగు భావ కవిత్వానికి సంబంధించినంత వరకు కవి యొక్క అనుభవ మహితాలైన భావాలకే పెద్దపీట. అవి లేనిచోట, అనగా, కవి తాను వెల్లడించే భావాలపరంగా

తాను పాత్రగా మారక, కేవలం, ఎవరివో, ఎక్కడివో అయిన వాటికి తాను వ్యాఖ్యాతగా వ్యవహరించినచోట ఆవిష్కరింపబడిన కవిత్వం భావకవిత్వంగా పర్యవసించదు.

భావము అంటే, 'కవి అనుభవము' అని చెప్పుకున్నప్పుడే భావకవిత్వం యొక్క తత్త్వం స్పష్టంగా అవగతమవుతుంది. దీనివల్ల-

1. ''భానము యొక్క కవితా స్వభావమే భావకవిత
(కవి కొండల)
2. "కవి భావం కవిత. కవిత భావ ప్రధానంగా ఉంటే భావకవిత"
(ఇంద్రగంటి)
3. ''కేవలం భావమే ప్రధానంగా గ్రహించేది భావకవిత్వం"
(వెల్చేరు)
4. "ఏదో ఒక భావాన్ని ఆధారంగా చేసుకుని అల్పావకాశంలో పూర్ణ రస సిద్ధిని చేకూర్చితే అది భావకవిత" (పంచాగ్నుల) వంటి ఉటంకింపులు భావకవితకు సరైన నిర్వచనాలు కాలేకపోతున్నాయి. "భావం" అన్న పదంలో "కవి యొక్క అనుభవం" అన్న అర్థం స్పష్టంగా కనిపించాలి. అటువంటి స్పష్టత, పైన చెప్పిన విశ్వనాథ నిర్వచనంలో కనిపిస్తుంది.

అదే విధంగా కృష్ణశాస్త్రి భావకవిత్వాన్ని గురించి కొంత వ్యాఖ్యానం లాంటిది చేశారు.

''ఉత్తమమైన ఆత్మాశ్రయ కావ్యంలో ఉన్నంత కవిత్వ లావణ్యం మరొక కావ్యంలో ఉండదు ఊపినచోట అది ఊపినంత మరొకటి ఊపదు. అంతేకాక అది పఠించిన వారి మనస్సు శాశితమై పదువై పక్వమౌతుందనుకుంటాను" అంటూ, 'ఆత్మపరమైన కావ్యంలో భాషా, భావమూ (Expression & the expressed) ఒకటే అట్టి కావ్యాలు మనల్ని ఒక మనస్థితిలో పడేస్తాయి. ఒక ఆవేశం కలిగిస్తాయి. ఒక అనుభవాన్ని స్ఫురింపజేస్తాయి'' అని వివరించారు. ఈ వివరణ సరియైన వివరణ కూడా అంటే ఏ భావాన్నయినా కవి ఊహించి, తటస్థుడుగా ఉండి, చిత్రించడం వేరు. అది భావకవిత కాదు. అట్లాకాక

ఆ భావాన్ని కవి కంఠదఘ్నంగా అనుభవించి, ఆ అనుభవాన్ని కవితారూపంలో రూపు కట్టించడం వేరు ఆ కవిత్వమే భావకవిత్వం. ఇట్లా 1) ఆత్మాశ్రయ లక్షణాన్ని కలిగి ఉండడం, 2) తన అనుభవానికి లోనైన భావంతో సదృశమైన భావాన్ని పఠితలో జాగృతం చేయడం అనేవి భావకవిత్వానికుండే ప్రధాన లక్షణాలు.

ఈ రెండు లక్షణాలూ పుష్కలంగా, విశ్వనాథ వారి భావకావ్యమైన "గిరి కుమారుని" ప్రేమ గీతాల్లో దొరుకుతాయి. ఆ కావ్యాన్ని ఆధారంగా చేసుకుని విశ్వనాథను భావకవిగా ఎన్నవచ్చు. ఆయన వరలక్ష్మి త్రిశతి కూడా అనుభవ మహితమైన స్మృతి కావ్యం

గిరి కుమారుని ప్రేమ గీతాలలో గిరి కుమారుడు విశ్వనాథ. ఆయన తండ్రి పేరు శేషగిరి. అందువలన ఆయన గిరికుమారుడుగా వ్యంజింపబడ్డాడు. గిరికుమారుడంటే చిన్నకొండ. శిఖరస్థమై క్రిందికి జాలువారే నదివంటిది ఆయన ప్రేయసి. సాగరాభి ముఖయై ప్రసరించే నదివంటి ప్రేయసి తనకు దక్కుతుందో లేదో అన్న సందిగ్ధ భావం కవిలో వియోగ భావాన్ని సృష్టిస్తుంది. తననుతాను ఆవిష్కరించుకుంటూ కవి చెప్పుకుంటున్న మాటలలో కవి అంతరంగం మనకు స్పష్టమౌతుంది. ''ఈ జనంలో కలిసి నా శరీరం కదులుతూ ఉంది. కాని నా మనస్సు తృష్ణచేత అలసమై ఒంగిపోయి, భూమి నుండి స్వర్గానికి మెట్లు కడుతూ ఉంది. జన్మాంతరాల నుండే నేను పొందిన సంస్కార లేశం, ప్రాణాల నంటి, ఆశగా పరిణమించింది. నాభావం నిలకడలేకుండా అడవి చివరవరకూ పారే సెలయేరులా ఉంది. అది రాళ్ళదారిలో జలజలా సాగి, చివరకు ఒక బొట్టయినా మిగలకుండా ఇంకిపోతుందేమో!" - కవి, పారే సెలయేరులా ఉన్నా, అతనిలో ఆశ నిండి ఉన్నా, ఆ ఆశ ఫలించే ప్రయత్నాలలో అతడు నిమగ్నుడై ఉన్నా, ఏదో తెలియరాని విషాదం, సుఖ పర్యవసానంమీద నమ్మకం లేని స్థితి, అతనిని లొంగదీసుకుంటూ ఉంది.

అనంతమైన ఈ హృదయ శల్య బాధ నెరుగ వప్పుడు కవి చిన్నవాడు. స్రవంతికల్లో తిరుగుతున్నంత ఆనందం, మొయిళ్ళగుంపులో పొరలుతున్నంత ఉత్సాహం కలిగిన గాయకుడు. చక్కలధాకా మనస్సును ప్రసరింపజేసి

ఆ 'చుక్కల ఆవతల ఏముంది' అని పాటలో అడిగే పరమ ముగ్ధహృదయుడు. ఆ ప్రశ్నకు నక్షత్రాలు నవ్వేవి. తూర్పున ఆకాశంనుండి వ్రేలే మబ్బులగుంపుతో సమానంగా, కవి హృదయం ఆసమయంలో వికాసంతో నిమీలనంతో, రహించేది. కవి చిన్నవాడుగా ఉన్నప్పుడు, అతణ్ణి బులిపించడానికి, తల్లి ఒక గులాబి మొక్కను చూపించి, నాయనా, ఇది నీది అని ఏడుపు మానిపించింది. అప్పటి నుండి కవిలో స్వత్వ కాంక్ష ఆరంభమైంది. ఆ మొక్క తనదే అన్న భావన బల పడి, దానికి దిగంతాలలో పారాడే మరుదంకురాలను పిలుచుకుని వచ్చి వింజామరలు వేయించాలన్న కాంక్ష ప్రబలింది. ఆ మొక్క అతని అవ్యక్త వాంఛకు ప్రతీక. హృదయ గత ప్రేయసీ రూపానికి ప్రతిరూప. ప్రేయసి ఒక పువ్వు కూడా. దానికి సమభాగినిగా కవి తనను తాను సమీర బాలకునిగా భావించుకుంటాడు. స్పర్శమాత్రం చేత ఇద్దరూ పులకిత బ్రహ్మపథం వరకూ పోగలరు. అనంత పథాలలో ఎంత దూరం పయనిస్తారో వారికే తెలియదు. తలపులందుకో లేని దిక్కుల చివళ్ళనున్న సంధ్యారుణ రోచిస్సులలోనే వాళ్ళ విహారం. తూర్పున ఉదయించే చంద్రబింబం మీద కొత్త మేఘపు తునక, మీగడ తరకలా అతుక్కుని, వాళ్ళను రమ్మంటూ మాటి మాటికీ పిలుస్తుంటుంది. వాళ్ళక్కడికే ప్రయాణం కడతారు. ప్రేయసి నిజమైనా, ఆమెతో తన సంయోగదశను కవి ఊహించుకుంటున్నాడు. ఆ ఊహకు ఉద్దీపనంగా విశ్వరూపియైన ప్రకృతే కని పిస్తూ ఉంది.

తల్లి మొక్కను చూపి నీదే నంటే, తోట, కవికో అమృత సమానమైన ప్రసవాన్నిచ్చి దాన్ని రక్షించుకోమన్నది. కాని కవిది సందిగ్ధ హృదయం. పువ్వును స్వీకరించడమా, లేదా అన్న సంశయాగ్నిలో కాలిపోసాగాడు. ఆ పువ్వు వాడివత్తలై పోసాగింది. వసరమ, ''ఏంచేశావు పువ్వు''ను అని అడిగితే ఏంచెప్పాలో తెలీని దీనస్థితి కవిది. ఇటువంటి సంశయ దశలో కవి మనస్సు నిండా బాధ! అప్రాప్త ప్రేయసిని గూర్చి అంతులేని చింత!

ఆమె నది. తను నీరు. ఇద్దరు కలిసే ఉన్నా పోయి పోయి సముద్రంలో కలిసి సముద్రపరమై పోతారు. కవి కలలో కూడా, 'ఆమె' అతనికి మిగలలేదు. అది ప్రళయకాలపు రాత్రి. సముద్రాలు పొంగి, భూమి ఆ వెల్లువ నురుగులో మునిగిపోయింది. ఆ నురుగులో నుండి నాలుగు దిబ్బలు పైకి లేచాయి. అందులో

ఒకటి కవి. రెండు అతని ప్రేయసి. మిగిలిన రెండు కవి తండ్రి, మిత్రుడూ. ఇంతలో రెండు దివ్వెలు మాయమై, కవీ, అతని ప్రేయసీ మిగిలిపోయారు. మరింతలో ప్రళయకాల మేఘకాంతిలో ప్రేయసికూడా మరుగునపడి కవి ఏకాకిగా నిర్వేదంలో నిలిచిపోయాడు. ఆవిడ అప్రాప్త మనోహరి.

కవి మహానదిగా ఉద్ధృతంగా ప్రవహిస్తూ ఉంటే, ప్రేయసి ఉపనది రూపాన కలుసుకుంటుంది ప్రవాహ వేగమంతా కవిదే. ప్రేయసి కవి ఆంతర్యంలో ఒక భాగమై తన అస్తిత్వాన్ని అతనిలో కలిపేసుకుంది. అందుకే ప్రేయసికోసం విశ్వవస్త్వంతరాలలో వెదకి వెదకి కవి, చివరకు, తన హృదయ కోటరంలోనే సూక్ష్మాకృతిలో ఉన్న ఆమెను గుర్తించగలుగుతాడు.

ఆమె కవి మనస్సులో తొలుత ఒక ఆనంద శకలాన్ని వెలిగించింది. అది పెరిగి పెరిగి రోదసిని ఆక్రమించి తారాపథ మంతటా నిండిపోయింది. కాని కవి ఆ అనంత వృద్ధికి విసుగుచెంది, కుంచించి కుంచించి దాన్ని తిరిగి అంతరాత్మలో ప్రవేశించేట్లు చేసుకున్నాడు. అది చివరకక్కడే గూఢంగా చిన్న శకలంగానే ఉండిపోయింది.

నిస్తరంగ ప్రణయ పయస్సుధారాశి లోపల కవి యొక్క ఉజ్జ్వల ప్రేమ నౌక ఉన్నచోటనే ఉండిపోయింది అది కదలదు. దాన్ని కదిలించాలన్న ప్రయత్నంలో కవి తెరచాపలూది ఊది చిన్న గాలి పొరను సృష్టించాడు. కాని ఫలితం శూన్యం.

కవి కొక వీణ లభించింది. అందులో అమృతముంది. అది మోగుతే అతని దేహం అమృతపు ముక్క. మోగకపోతే నేల మీద దుమ్ము. కాని కవి ఎంత ఆర్తితో మోగించినా, అది పలకడం లేదు. దాని మీద పట్టలేనంత కోపం వచ్చి 'ఇది పాడైపోనీ' అని అతడు నేలమీద విసిరిపారేశాడు. అప్పుడా తీవ్ర మాతం అతని ఆత్మలోనే ప్రతిధ్వనించడం అతడు గ్రహించాడు. తా ననుభవిస్తున్న విధుర ప్రేమ చిత్రణ యిది. అంతేకాదు. ఫలించని ప్రేమ. అందని ప్రేయసి, కవిని రాహుగ్రస్త చంద్రబింబంలాగా చేసి నిలువబెడుతున్నాయి. ఒక పక్క శరత్కాల పూర్ణిమ నాటి వెన్నెల ముసుగు, మరొక పక్క దట్టమైన చీకటికప్పు. కవి అటు సగమూ, ఇటు సగమూ అయి నిలిచిపోయాడు. వెన్నెల సగం కవికి కనిపించదు. అందుకే అతడు తన స్థితిని రాహువు గ్రసించిన చంద్రబింబంలాటి స్థితిగా భావించాడు. అంటే ప్రేయసి అందే స్థితిలో ఉన్నా అందుకోవడానికి సంశయించే మనః ప్రకారం అతని జీవితంలో వెలుతురు ఉన్నా

దాన్ని చూడలేని చీకటి అనుభవాలు కలుగుతున్నాయి అందుకే కవికి మహా గ్రీష్మంలో తపిస్తున్న అనుభవం! శరీరం ఉడికిపోతూ, నాలుక పిడచకట్టుకు పోతూ ఉంది. ప్రేయసి అమృతాన్ని పొంగించి కవి మీదికి ప్రసరింపజేస్తూ ఉంది. ఆవిడ కృప జీవవాహిని. ఆవిడను పొందడంవలన గ్రీష్మం వసంతంగా మారిందని కవి చెప్పడంలేదు. తమ మీద ఆ కృప, తన ఘటం కాలశిఖరానికి కొట్టుకుని భిన్నమైపోయేదాకా ప్రసరిస్తూనే ఉంటుందని నమ్మకంగా ఆశపడు తున్నాడు. ఒకవేళ ఆ ప్రవాహం అదృశ్యమైతే అక్కడ భావికాలమనే నాగలి తగిలి ఈ ఘట విభిన్న శకలాలు కృషీవల హృదయాల్లో ఎటువంటి భావాలను సంకులంగా కలిగిస్తాయో అని ఆశ్చర్యపడుతున్నాడు. ప్రణయశీలి అయిన కవి ప్రేయసీ పరమైన అప్రాప్తస్థితివలన ఎట్లా తాత్త్వికుడుగా మారుతున్నాడో మనం గ్రహించవచ్చు. అట్లాగే కవి శరత్కాలపు నదిలా శాంత ప్రవాహంతో ముందుకు పోతున్నాడు. అతని ప్రేయసి అట్ట అడుగున చిక్కని శ్యామ జంబాలమూర్తియై నిలిచిపోయింది. సముద్రంలో కలిసిపోయే కవికి ఇరుప్రక్కలా రూపుకట్టిన బంగారు పచ్చ కంకెల రాజనాల పైరులో మాత్రం ఆమె మూర్తి ప్రకాశిస్తూ ఉంది. ఇక్కడ కూడా కవికీ ప్రేయసికీ మధ్యనున్న దూరం కవిని బాధిస్తూనే ఉంది.

ఈ వియోగానికి కవి వ్యక్తిత్వం చాలావరకూ కారణం అతని హృదయం కూకటు లెదగని ఏడెనిమిదేండ్ల కుఱ్ఱ హృదయం. అతి ముగ్ధమైనది. ఇతర జనుల సంఘర్షణకు లొంగిపోయే దశలో అది అముగ్ధంగా కరుకుగా మారిపోతుంది అటువంటి సమయాల్లో కుసుమ సదృశ అయిన ప్రేయసి చెలువు రెక్కల విడదీసి బాధించగలదు. అప్పుడే సన్నివేశమంతా విలయవాత వర్షపాత భయంకరమై కవికీ ప్రేయసికీ, జీవితాల్లో సందియాలను కల్పిస్తుంది. అప్పుడే పురాతనమైన వాళ్ళ ప్రణయ సౌధం క్రక్కదలి భూమిమీద పడిపోతుందన్న భయం కలుగుతుంది. ఇదే ప్రేమదక్కదన్న భయం. ఇటువంటి భయం పేరుకు పోయిన కవి వసంతాన్ని ప్రేమించడు. ఆషాఢ జలదాన్ని ప్రేమిస్తాడు. అతడు ఆకాశానికి, ఈ కవి భూమికీ, హృదయ దుఃఖాలు పాడుకోవడానికి పుట్టిన కవులు. ఆషాఢ మేఘం ప్రపంచాన్ని చీకటిలో ముంచితే, కవి దుప్పటిముసుగులో కళ్ళుమూసుకుని, కమ్ముకున్న చీకటిలో, లేని శాంతిని వెతుక్కుంటుంటాడు - అశాంతిపరుడైన ఈ కవి నడిసముద్రంలో ఇల్లుకట్టుకున్నవాడితో సమానం. అతడు తుఫానులకు భయపడడమెందుకు? ఆ సముద్రం పొంగి ముంచుతుందన్న భయమా? ఇది అతణ్ణేం చేస్తుంది, చల్లని కెరటాలమీద ఊగించడం తప్ప?

ప్రేమ గాఢతవల్లా ప్రేయసీ ప్రాప్త వైఫల్యంవల్లా వచ్చిన నిరాశ! అందులో నుండి జనించిన తెగింపు ఇది.

ఇంత వంతను గుండెలో కుదించుకుని ఈ గిరికుమారుడు తన గొంతులో నుండి వచ్చిన ప్రేమ గీతాలను వచ్చినట్లుగానే పాడాడు. ఈ ప్రేమ గీతాలన్నీ ప్రేయసి కడగంటి చూపుల రేఖలలో చలించేవి. ఆమె మందహాస తరంగాలు కవి గుండెను కదిలించగా పాడినవి.

కవి ఆ భయంకర, ప్రేమ నిర్లాభ స్థితిని అధిగమించాడు. ప్రేయసి ప్రశాంత మూర్తిని, తన మూర్తిని రెంటినీ, కృష్ణానదిలో విడివిడిగా కదలాడే జమిలి నావలుగా భావించాడు. తననే తన హృదయంలో ప్రతిష్ఠించుకుని స్నిగ్ధ దేవతామూర్తిగా మారిన తననే, వరలక్ష్మి భర్తను, తానే పూజించుకోసాగాడు. ప్రేయసి ఆయనలో కరిగిపోయింది. కేవలం వరలక్ష్మికి భర్తగా మారిన ఆయనలా తానూ మారిపోయింది. ఇక ప్రేయసి అస్తిత్వం కవి పాటలలో కనిపించదు. ఆ స్థానాన్ని ఆయన భార్య ఒడిసి పుచ్చుకోవడాన్ని కవి స్పష్టంగా వెల్లడించుకున్నాడు.

ఈ దృశమైన పలుకరాని జ్యోతిస్సు కవి ప్రణయం. దీన్ని కావ్యంలో కరగబోసి, ప్రళయకాల నిగూఢ గర్భంలో ఇది పొందగల ఆకృతి కోసం కవి చింతించాడు. తనకూ ప్రేయసికీ మధ్య అద్వైత భావన కుదిరినా, అతనికి హృదయశాంతి కుదరలేదు. తన అనుభవంతో కూర్చబడిన కావ్యాన్ని దివ్య జ్యోతిగా సముద్ధింపచూస్తాడు. కాని ప్రపంచంలో నెలకొన్న ఉన్న మహాతృష్ణ అన్నది, తృష్ణ లేక నిరీహుడు కావాలనుకున్న కవిని వెక్కిరిస్తూనే ఉంటుంది ఎప్పుడూ.

కవికి మిత్రుడైన సౌభద్రుడు ప్రేమమయజీవి అతడూ, వత్సలా ప్రణయ వారి రాశిని పుక్కిట పట్టినవారు. కవి మనస్సులో నిండిన ప్రణయ తేజం ఆ పుణ్యదంపతులపట్ల అభిలాష కలిగినదై, అమృతమయాలు, స్నిగ్ధభావాల పాలు అయిన వాక్ప్రవాహాలను ప్రసారించింది. కవి అతి పవిత్రమైన ఆ ప్రణయంపట్ల సుస్నిగ్ధుడు. అట్టి స్నిగ్ధమూర్తిని తన మధుర కటాక్షాలచేత దివ్యణ్ణి చేస్తున్న ప్రేయసి కవిలో కరిగిపోయింది. ఆవిణ్ణి తన తేనెపాలుగా కరగబోసి, తిరిగి ఆ పాటను ఆవిడ పదార్పితంగా ధారపోసినవాడు కవి.

భార్య అయిన వరలక్ష్మిని గూర్చి కవి పోగు పోసుకున్న భావనలు వేరు. అవి నడచిన తెన్ను వేరు. అందులోనూ ఆత్మాశ్రయ లక్షణం పుష్కలంగా ఉంది. దాన్ని గూర్చి మరొకమారు.

*

# విశ్వనాథ-దేవులపల్లి

—డా॥ ఎస్. నిర్మలాదేవి

ఆధునిక తెలుగు సాహితీ జగత్తుకు శివకేశవుల్లాంటి వారుగా సంభావితులు విశ్వనాథ-దేవులపల్లి దార్శనికులు హరిహరతత్త్వాన్ని గ్రహించగలిగినట్లే ఈ కవిశేఖరుల సాహితీ విరాణ్మూర్తిత్వాన్ని దర్శింపగలరు. ఒకరు కవిసమ్రాట్టులు గాను, మరొకరు భావకవి సమ్రాట్టులుగాను రసజ్ఞలోకంలో వినుతికెక్కారు.

ఇద్దరూ బహుముఖ ప్రజ్ఞాశాలురు. ప్రతిభాపాటవాలు పుష్కలంగా కలిగిన వారే! విశ్వనాథ తన సకలశాస్త్ర విజ్ఞాన కిరణసహస్రాళితో దేదీప్యమానంగా ఆధునికాంధ్ర సాహిత్యాకాశంలో రవితేజుడై ప్రకాశిస్తే, మృదుమధుర మనోజ్ఞ కవితామృతాంశుడై దేవులపల్లి కవిచంద్రుడు మనోమోహనంగా విరాజిల్లు తున్నాడు. సంస్కృతాంధ్రాంగ్ల భాషలలో ఇద్దరికీ మంచి అభిరుచి అభినివేశా లున్నాయి. తెలుగులో విభిన్న సాహిత్య ప్రక్రియ లెన్నింటినో చేబట్టి వాటి అన్నిటిలోనూ తమదైన ఒక ప్రత్యేక ముద్రను వేసినవారే! తమ రచనలతో తెలుగు సాహితీ సరస్వతి నలంకరించినవారే!

విశ్వనాథ సంస్కృత భాషలోనూ రచనలు చేశారు. మృతశర్మిష్ఠము, గుప్త పాశుపతమనే నాటకాలు; దేవీత్రిశతి, శివసహస్రాది శ్లోకాలు వేయికిపైగా రచించారు. ఇంకా అనేక అముద్రిత సంస్కృత కావ్యాలున్నాయట! ఇంకా తెలుగులో ప్రాచీనాధునిక సాహిత్య ప్రక్రియల్లో ఒక వచన కవితను తప్ప మిగిలిన వాటినన్నిటినీ చేబట్టారు పుంఖానుపుంఖాలుగా రచించిన వాటన్నిటిలోనూ వారిదైన ఒక విశిష్ట వ్యక్తిత్వం, సాహితీ మూర్తిమత్వం భాసిస్తుంది. భాషలోనూ, భావంలోనూ సమాసఘటనా చాతురిలోనూ, అలంకార ప్రయోగంలోనూ, వర్ణనా వైదుష్యంలోనూ ఆలోచనా సరళిలోనూ, విమర్శనా పద్ధతిలోనూ, దార్శనికత లోనూ ఒక విలక్షణత దృగ్గోచర మవుతుంది. దీనినే మహాకవి కాటూరి వెంకటేశ్వరరావుగారు.

కిన్నెరసాని ఆటలకు కిన్నెరమీటి పురాతనాంధ్ర శౌ
ర్యోన్నతి నూది కాహళము నూదితి, నర్తనశాల పీఠపై
మిన్నక మెట్టు లొత్తితివి మేటి పణమ్ములు వేయుగల్గునా
గన్నుకు బుట్టి పట్టితివిరా! యిటువంటివిరా భవత్కృతుల్.

అంటూ-

"కథలు సెప్పికొన్న, కావ్యమ్ములు పఠించు
కొన్న, నవల చదివికొన్న, నాటక
కముల నాడికొన్న గతివేఱలేమి మా
తలల నీదుకృతులె తాల్పవలసె''నంటూ విశ్వనాథకు సాటి విశ్వనాథేనని ప్రశంసించారు.

దేవులపల్లివారు మహాకావ్యం, నవల, కథానికా ప్రక్రియలను తప్ప మిగిలిన సాహిత్య ప్రక్రియల నన్నిటినీ చేబట్టారు. పరుసవేదివంటి వారి చేయి ఏ సాహిత్య ప్రక్రియనంటినా బంగారవ్వంటనే పండించింది. ఖండకావ్యాలు, భావ గీతాలు, బ్రహ్మగీతాలు, భక్తి - దేశభక్తి - మధురభక్తి గేయాలు, గ్రామిక గేయాలు, సినీ గేయాలు, శ్రవ్య - గేయ నాటికలు, యక్షగానాలు, వచన రచనలు, సాహిత్య విమర్శన వ్యాసాలు, భూమికలు, పీఠికలు - ఇత్యాది అనంత వైవిధ్యంతో కూడినది వారి మనోజ్ఞ సాహితీమూర్తి. సంగీతపు మధురిమలతోను, సాహిత్యపు చతురిమలతోను, అత్మానుభూతి ప్రగాఢతలను కలనేసి విలక్షణమైన వాణితోనూ, బాణితోనూ శోభిల్లుతుంది వారి సుమధుర కవితామూర్తి.

విశ్వనాథ - దేవులపల్లి ఇద్దరూ సాహిత్య స్రష్టలేకాక ద్రష్టలు కూడాను. అందులోనూ వారు తమ తమ వైశిష్ట్యాన్ని వైలక్షణ్యాన్ని చూపుతారు.

ఆధునిక యుగంలో బయలుదేరిన రెండు ఉద్యమాలలో ఒకటి మానవోద్యమమనీ, దాని ప్రవర్తకుడు రామ్మోహనరాయలనీ రెండవది హిందూధర్మ పునరుద్ధరణోద్యమమనీ చెప్తూ - తాను మానవోద్యమానికి చెందినవాడనీ, ''నేను హృదయవాదిని. నాకు వేదాంతం, తర్కం తలకెక్కవు'' అంటారు కృష్ణశాస్త్రి. ఈ మాటల్లో కృష్ణశాస్త్రిపైని బ్రహ్మ సమాజోద్యమప్రభావ మెంతగా పడిందో ద్యోతకమవుతుంది ఆ కారణంగానే వారు హరిజనోద్ధరణ వేశ్యా వివాహాది

సంఘ సంస్కరణ కార్యకలాపాలలో పాల్గొని నాటి ఛాందసులచేత వెలిగావింప బడ్డారు. మొదట్లో కొద్దికాలం భావకవిత్వాన్ని రచించినా విశ్వనాథ జాతీయ పునరుజ్జీవనోద్యమం వైపు మళ్ళి, హిందూధర్మ పునరుద్ధరణకై ప్రాచీన సంప్ర దాయానుగుణంగా ఛందోబద్ధమైన రచనలు చేశారు. భ్రష్టయోగిని "కవిజన్మ బడసినాడని'' అంటారు. తమ సర్వశక్తులూ వెచ్చించి కొన్ని దశాబ్దాలపాటు రామాయణ కల్పవృక్ష రచనను అనితరసాధ్యమైన రీతిలో రచించి జ్ఞానపీఠాన్ని అధిష్ఠించారు. వేదమతానుసరణ తప్పదని అదివినా ప్రపంచశాంతి ఉండదనీ ఏ ఇజమూ గట్టెక్కించదు వేదిజం ఒక్కటే శరణ్యమని వారి ప్రగాఢ విశ్వాసం. తానేమి వ్రాసినా తెలుసుకుని వ్రాస్తాననీ, అనాదిగా ఈ దేశంలో జ్ఞానమనిపించు కుంటూ వచ్చేదొకటుందనీ, దానిని తన పాఠకుల్లో కల్పించి తాను సఫలుడు కావడమే కాక వాళ్ళని జ్ఞానవంతులుగా చేస్తున్నాననే భావం తనకుందంటారు. ఆత్మప్రత్యయంతో పద్యరచనా సామ్రాజ్య పట్టభద్రులు, కథాకథన శిల్పసూత్రా చార్యులు, వేదవేదాంగాది మహాగ్రంథస్థులు, మహావిషయ నిర్ణేతలు, బహువిషయ వ్యాఖ్యాతలు, కావ్యకథా శిల్పరహస్యవేత్తలు అనే దృష్టితో నన్నయ, తిక్కన, ఎఱ్ఱన, నాచన, శ్రీనాథ, పోతన, పెద్దన, తెనాలి రామకృష్ణులను నిలబెట్టు కుంటే తానూ నిలుస్తాననీ, తాను చేసిన పని అటువంటిదంటారు. ఈ విధంగా పైన చెప్పిన కవుల విశిష్ట కవితా గుణాలన్నీ తన కావ్యాల్లోనూ ఉన్నవంటూ కంఠోక్తిగా విస్తారు.

తనను ఆధునికుడు కాడు పూర్వాచార పరాయణుడనీ ప్రవాహానికి ఎదు రీదుతాడనీ కొందరంటారని చెప్తూ, కానీ అది సరియైనది కాదంటారు. తాను ఏది చదివినా కూలంకషంగా దాని లోతుపాతులన్నీ తెలిసి మనస్సుకు తృప్తి కలిగేటట్లు చదువుతాననీ అదే విధంగా సంస్కృతాంధ్రాంగ్ల భాషలు మూడింటినీ చదివానంటారు. ఆ మూడు భాషల్లోని అక్షరాల పుట్టుక, వర్ణ సమామ్నాయం, వాటి శక్తియుక్తులు, వాల్మీకి వ్యాసాదుల, నన్నయ తిక్కనాదుల, హోమర్, వర్జిల్, షేక్స్పియర్ రిత్యాదుల రచనలను తన శక్తి మేరకు తరచి తరచి చూచి ఇంగ్లీషు మనకు పనికిరాదనీ అది అత్యంత అసంస్కృతమైన భాషగా తేలుస్తారు. వారి విష్ణుశర్మ ఇంగ్లీషు చదువు పైవిషయాన్ని సుస్పష్టంగా విస్తుంది.

విశ్వనాథ దృష్టిలో ఛందస్సులో వ్రాసేదే కవిత్వమవుతుంది. ఛందస్సులో సంగీతలయ లుంటాయనీ, పాడబడి జీవునియొక్క మాయను కప్పుతున్న వేదానికి ఛందస్సనే పేరు వచ్చిందంటాను. ప్రబంధ, ఆశు, బంధ, చాటువులనబడే నాలుగురకాల కవిత్వాల్లో ప్రబంధ కవిత్వానికే మన దేశంలో మొదటినుంచీ విలువ ఎక్కువంటారు. ఇంగ్లీషు చదువువల్ల మైనర్ పొయెట్రీ వృద్ధిపొందినదనీ, ఖండికలు కవిత్వం కావడమారంభమైన దంటారు. దానితో కావ్య శిల్పము, మహాపద్య రచనా శిల్పము, పాత్ర పోషణం, అనంత విజ్ఞానము, ఒక జ్ఞాన భాండాగారముగా అగుచున్న మహాకావ్యము కవియొక్క అనంతశక్తి - ఇవన్నీ ఉప్పునీళ్ళు చల్లుకుని పోయినవంటారు.

"కవిప్రతిభలోన నుండును కావ్యగత శ
తాంశములయందు దొంబదియైన పాళ్ళు
ప్రాగ్విపశ్చిన్మతంబున రసము
వేయిరెట్లు గొప్పది నవకథాదృతినిమించి." నిష్కర్షగా "రసయోగి విశ్వనాథ సర్వశబ్ద ప్రపంచాన్నీ రసోన్ముఖంగా నడిపించడంలో అందెవేసిన చేయి" అంటారు ప్రముఖ విమర్శకాగ్రేసరులు జి.వి. సుబ్రహ్మణ్యంగారు. విశ్వనాథవారి కావ్యాలన్నీ దీనికి పరమ ప్రామాణికంగా నిలుస్తాయి. శిల్పంగానీ, సాహిత్యంగానీ జాతీయమై ఉండాలనీ, విజాతీయమై ఉండరాదనీ, అప్పుడే రచించినవారికి ముక్తీ, చదివినవారికి రక్తిముక్తి నంటూ "ఎంత సముద్రంమీద ఎగిరినా పక్షి రాత్రికి గూటికి చేరును. ఇది జాతీయత. ఇది సంప్రదాయము" అంటారు. ఈ అభిప్రాయాని కనుగుణంగానే తమకు పాతికేళ్ళు పైబడిననాటి నుంచీ వారి సాహిత్యరచనా వ్యాసంగం సంప్రదాయబద్ధంగా సాగింది. కావ్య, ప్రబంధ, శతక, నాటక, నవల, కథానిక, విమర్శ గ్రంథాలుగా ఎంతో వైవిధ్యంతో వెలువడ్డాయి రచనలు. విశ్వనాథ భావకవి దశనుండి నవ్యసంప్రదాయ కవిగా రూపొంది ఆ కోవకు చెందిన వారందరికీ మార్గదర్శకుడయ్యాడు. వారి రామాయణ కల్పవృక్ష రచనారంభమే నవ్యసంప్రదాయ యుగారంభమని విమర్శకుల అభిప్రాయం.

విశ్వనాథ కృ శా. ని అచ్చమైన భావకవిగా పేర్కొంటూ కృశాలాగా వ్రాయాలని ఎందరో యత్నిస్తారు కానీ ఎవ్వరూ ఆయనను చేరుకోలేరనీ,

అతనికొంతే ఈ సౌధమంతా అంటారు తెలుగులతాగురు, ఆంధ్రా షెల్లీగా సంబా విస్తారు. ఆరుద్ర కొంతమందిది యువత, మరికొంత మందిది నవత, కృష్ణశాస్త్రిది కవిత అంటే, తిలక్ కవిత్వముక ఆల్కెమీ. దాని రహస్యం నన్నయకు తెలుసు, పెద్దనకు తెలుసు, కృష్ణశాస్త్రికి తెలుసు, శ్రీశ్రీకి తెలుసు నంటాడు - ఇవన్నీ కృష్ణశాస్త్రి రచనలు ఏవిధంగా మూడుతరాలవారికి ఆకర్షణీయమూ, అనుసరణీయమూ అయ్యాయో స్పష్టపరుస్తాయి.

విశ్వనాథ, కృష్ణశాస్త్రి - ఈ ఇద్దరిలోనూ నిసర్గ మనోహరమైన పల్లె ప్రకృతిలోని సౌందర్య మమతానురాగాలపట్ల ప్రీతి కనపడుతుంది. క్రొత్త నాగరకత ప్రబలి పల్లెపట్టు అందాలను నశింపచేస్తోందనీ, పాత సంస్కృతి, విలువలూ దానివలన అడుగంటుతున్నాయనే బాధ ఇద్దరి రచనల్లోనూ కనిపిస్తుంది. కృశా గారి 'మా ఊరు పోయింది', 'మా ఊళ్ళో వీధి అరుగు' 'మన ఆటలు- పాటలు' 'అప్పుడు పుట్టి ఉంటే' మొదలైనవి, విశ్వనాథవారి 'భ్రష్టయోగి' ఖండకావ్య సంపుటిలోని "అ - ఈ", మంటిపాము, కాలపురుషుడు, అంభోధి మొదలైన ఖండికలూ ఈ దీనికి సాక్ష్యంగా నిలుస్తాయి. 'విశ్వనాథ కేవలం బాధపడి ఊరుకోక సంప్రదాయం తనకిచ్చిన శక్తితో ప్రతిఘటించబూనాడు. విశ్వనాథ కావ్యాలన్నిటిలోనూ ఈ ప్రతిఘటన ధోరణి కనిపిస్తున్నప్పటికీ వేయిపడగలు, చెలియలికట్ట మొదలైన నవలల్లో మరింత స్పష్టంగా గోచరిస్తుంది. కిన్నెరసాని పాటల్లోని కిన్నెరసానిని పతివ్రతగా చిత్రించడం, గిరికుమారుని ప్రేమగీతాల్లోని ఊహా ప్రేయసి వరలక్ష్మీదయితుడైన తనతో కరిగిపోయినట్లు భావించడం, మూగనోములో పతి కోసం నోములునోచే పడతి నడయాడే త్రోవలు పునీతములైన వనడం మొదలైనవన్నీ విశ్వనాథలోని ఈ సంప్రదాయానురక్తిని వ్యంజింప చేసేవే!

దాంపత్యధర్మాతీతమైన ప్రణయాన్ని విశ్వనాథ అంగీకరించి ఆదరించలేదనే విషయం కూడా పై వాటివల్ల విదితమవుతుంది. దేశభక్తి జాతీయతా భావాలు విశ్వనాథ - దేవులపల్లి ఇద్దరిలోనూ ఓతప్రోతంగానుండి, అవి వారి రచనల్లోనూ ప్రస్ఫుటమవుతాయి దేవులపల్లివారి మాతృదేశ స్తుతి రూపమైన జయ జయ భారత అన్న గీతం జాతీయ గీతాల స్థానాన నిలబడడమేకాదు, భావ సౌందర్యంలోనూ శబ్దలాలిత్యంలోనూ వాటిని మించినదానిగా పలువురి ప్రశంసల

నందుకుంది "జయమదీయ మధుర గేయ చుంబిత సుందరచరణా - జయ మదీయ హృదయాశయ లాక్షారుణ పదయుగళా" అన్నప్పుడు కృ. శా. లోని ఆత్మ ప్రత్యయం తళుక్కుమంటుంది. పరమ రమణీయమైన శబ్ద చిత్రం సాక్షాత్కరిస్తుంది. పూర్తిగా సంస్కృత పదాల కూర్పుతో గీత రచన సాగినప్పటికీ భావం ప్రసన్నంగానేవుంటుంది నన్నయ పద్యంలాగా. తెలుగునాడుపైని - తెలుగుప్రజ వారి జీవనాదికాలపైన, తెలుగు కవులపైగల భక్తి ప్రపత్తులను మమతానురాగాలను ఆవిష్కరించే కవితలు, గేయాలు, వచన రచనలు, విమర్శనా వ్యాసాలు కృశా కలం నుండి ఎన్నో వెలువడ్డాయి.

ఆదే కోవకు చెందినవి విశ్వనాథవారి 'ఆంధ్ర పశస్తి' అన్న ఖండకావ్యం, ఝూన్సీరాణి మొదలైన చారిత్రక లఘుకావ్యాలు, వారి మధ్యాక్కఱ శతకాలు పదింటిలోనూ తెలుగునాట నెలకొని ఉన్న దైవాలు మున్నంగి - నంద మూర్లలోని వేణుగోపాలస్వామి - సంతానవేణుగోపాల స్వామివార్ల, నరసారావు పేట వద్దనున్న నెకరుక గ్రామశివుని, శ్రీశైల, కాళహస్తి, భద్రాద్రి, తిరుపతి వేంకటేశ్వరస్వామి, శ్రీవిశ్వేశ్వరస్వామి, ద్రాక్షారామభీమేశ్వరులు నుతులందు కుంటారు. భక్తి మధురభక్తి భావాల నావిష్కరించే రచనలు విశ్వనాథ, దేవులపల్లి ఇద్దరి సాహిత్యంలోనూ బహుళంగానే ఉన్నాయి. వీటి రచనా శైలిలో ఎవరికి వారే సాటి అన్నట్టుగా పరమోదాత్తంగా వాటిని రాయడం జరిగింది. దేవుల పల్లి వారివి ధనుర్దాసు, సాయుజ్యం, గుహుడు, శివక్షేత్రయాత్ర, మొదలైన నాటికలు. బ్రహ్మగీతాలసంపుటి, మహతి, సుగంధ ద్రవ్యాలు, కోవెల-కొలను వంటి వచన రచనలు - భక్తి రసాత్మకమైనవి. కృష్ణపక్షంలోని 'అన్వేషణము' మధురభక్తి తత్త్వానికి పరాకాష్ఠగా భావింపబడుతోంది. యమునా విహారి, కృష్ణాష్టమి వంటి శ్రవ్యనాటికలు, మ్రోయింపకోయి మురళీ. 'మరుజన్మమె తెదద మాధవుడనై' వంటి గీతాలు మధురభక్తి భావవిలసితమైనవే. సూఫీమత సాంప్రదాయానుగుణంగా వ్రాసిన 'హాఫీజ్' అనేదీ ఈ కోవకు చెందినదే. అయితే ప్రేయసిగా భగవంతుడినీ, ప్రియుడిగా భక్తుణ్ణీ భావిస్తూ ప్రేమ అనే మధుపానంతో వారిద్దరి మధ్యనున్న మాయతెర మేలిముసుగు తొలగిపోయి ప్రేయసి ముఖ సందర్శనం సిద్ధిస్తుందనేది ప్రతిపాదింపబడుతూ విశ్వనాథవారి గోపికా గీతాలు, భ్రమర గీతాలు, శ్రీకృష్ణుని సంగీతమనే తేటగీతుల్లో వ్రాసిన విలక్షణ కావ్యము,

శృంగారవీథి మొదలైనవన్నీ మధురభక్తి తత్త్వానికెత్తిన పతాకాలు. శ్రీకృష్ణ సంగీతంలోని తేట గీతులన్నీ నిజంగా తేటగీతులే! సంస్కృత సమాసాలు లేకుండా దేశీయ శబ్దాలలో పదబంధాలతో, జానపదుల పలుకుబళ్ళతో, సామెతల ఆమెతలతో, నుడికారపు సొంపులతో విరాజిల్లుతోంది విశ్వనాథవారి ప్రౌఢశైలికి (ఎక్స్ప్రెషన్‌గా) అతీతంగా. స్మృతి - సంస్తుతి కావ్యాలను విశ్వనాథ - కృష్ణశాస్త్రు లిద్దరూ రచించారు.

నాటి సంఘ సంస్కరణోద్యమ ప్రభావం ఇద్దరిమీదా పడిందనడానికి వారి రచనలే కొన్ని ప్రమాణంగా నిలుస్తాయి. విశ్వనాథవారి వీరవల్లడు అనే చిన్న నవల హరిజనోద్ధరణోద్యమానికి ప్రతీకగా నిలుస్తుంది. హరిజనుడైన వల్లడు అనే పాలేరును ప్రాణదాతగా భావించి కులదేవతగా సంభావించి తమ సంతానానికి పేరు పెట్టుకోవడంతో జాతి కులాతీతమైన పల్లెపట్టులోని ఆత్మీయతా భావ మభివ్యంజితమవుతుంది. ఇందులో సామాజిక ప్రయోజన సంక్షేమాలతో పాటు కృతజ్ఞతాభావం కూడా ప్రబోధింపబడింది. కృష్ణశాస్త్రిగారు స్వయంగా సంఘసంస్కరణ కార్యకలాపాలలో పాల్గొని, పదిమంది హరిజన బాలుర బాధ్యతని వహించడంవలన ఛాందసులచే వెలివేయబడినట్టివారు. 'శిథిలాలయ మ్ములో శివుడు లేడోయి'', మాలలమేమో పనికిమాలినవారమొయేమో శ్రీ లలితేశ్వర గళ నవసుమ మాలలమేమో'' అన్న గీతాలు, బూట్ పాలిష్, రిక్షావాలా మొదలైనవి హరిజనోద్ధరణ ప్రభావంతో వ్రాసినవే. గాంధీగారి ప్రభావమూ ఈ ఇద్దరిమీదా బాగా పడినట్టు కనిపిస్తుంది వారి రచనల వలన. కృ. శా. గారి గాంధీపైని వ్రాసిన ఎలిజీ (స్మృతి కావ్యం) "ఏమి మిగిలెనన్న'' అన్నదీ, రాజ ఘట్టమన్న శ్రవ్యనాటిక, కొత్త కోవెల మొదలైనవన్నీ గాంధీ సిద్ధాంతాలపైనగల శ్రద్ధాభక్తులను వెల్లడిస్తాయి.

గాంధీగారి ధర్మకర్తృత్వ సిద్ధాంతమే విశ్వనాథవారి శ్రీ కుమారాభ్యు దయమనే కావ్యంలో దేవసేన ధనికులవద్దనుండి భూములను ఆస్తులను గ్రహించి 'శివార్పణ'మంటూ పేదవారికి పంచిపెట్టడంగా మలచబడింది. వాణిజ్య పంటల వల్ల ఏర్పడే తిండిగింజలకొరతను 'వేయిపడగలు' నవలలోనూ, భారీ పరిశ్రమలు

నెలకొల్పడంవలన కుటీర పరిశ్రమలు దెబ్బతిని నిరుద్యోగం ప్రబల రాదనేది కుమారాభ్యుదయంలోనూ, పరిపాలన వికేంద్రీకరణ వాంఛితమనే విషయాన్ని సముద్రపు దిబ్బ నవలలోనూ, పారిశ్రామిక నాగరికతలోని దోపిడీదారీ విధానాన్ని 'దమయంతీ స్వయంవరం వేయిపడగలు' నవలల్లోనూ చిత్రిస్తారు.

ధనికులు పేదవారి నణగద్రొక్కుతున్నారనీ, వారి శ్రమను దోచుకుంటూ వారిపైనే అధికారాన్ని చలాయిస్తున్నారనే విషయాన్ని దేవులపల్లివారు 'హాలి కుడు' అనే ఖండికలో ఉటంకించి తీవ్రంగా నిరసిస్తారు. శ్రమజీవుల హైన్య దైన్య స్థితికి ఈ సమాజమే కారణమంటారు. మరొక అడుగు ముందుకు వేసి 'ఆకలి' అనే ఖండికలో అన్నార్తులకే కనుక మానం కలిగి రోషం వచ్చి ద్వేషం హెచ్చితే మఘవ కోటీరమే మంటి కౌగిలి నంటుతుంది, మందాకినీ ఝురులు మరుగర్భమం దింకుతాయి, మందారతరులు హేమంతమసనాన్మోందుతాయని ధనికవర్గంవారిని హెచ్చరిస్తారు. 'సుప్రియ - బుద్ధ భగవానుడు' ఖండికలో సామ్యవాద ధోరణితో ఉన్న సంపదను అందరూ సమానంగా పంచుకుని అనుభ విస్తే లోకంలో కరువుకాటకా లుండవంటారు.

'స్వేదబిందు' వనే గేయనాటికలో శ్రమజీవియొక్క చెమటబొట్టు విలువ లోకంలోని అన్ని విలువలకన్న అమూల్యమైనదంటూ శ్రామిక జీవిని అగ్ర స్థానాన్నధివసింపచేస్తారు. సమసమాజ నిర్మాణాన్ని వాంఛిస్తారు.

కమ్యూనిజాన్ని దేవులపల్లి కోరుకున్నట్లే విశ్వనాథా వాంఛిస్తారు-"రష్యాలో ఏ శాంతి ఉందో ఆ శాంతి మన దేశమునకూ రావాలని వాంఛించెడి వారిలో నేను ప్రథముడను" అంటారు. తాను కోరుకున్న వ్యవస్థను వివరిస్తూ నా రాముడు - నా రామాయణమనే వ్యాసంలో ఆధ్యాత్మిక ప్రవృత్తి స్త్రీపురుష మధ్యగత నీతీ, దైవభక్తి కలిగిన కమ్యూనిజాన్ని వారు కోరుకుంటున్నానంటారు. మార్క్స్ సిద్ధాంతాలను క్షుణ్ణంగా చదివి ఆకళించుకున్నారు విశ్వనాథ. అయితే కమ్యూనిస్టు దేశాల్లో లాగా స్టేటు వ్యక్తి స్వేచ్ఛను, అతని ఆలోచనలను, జీవన విధానాలను శాసించడాన్ని మాత్రం ఆయన ఒప్పుకోరు

కృష్ణశాస్త్రి పీడించేవాళ్ళూ పీడింపబడేవాళ్ళూ ఉన్న ఈ సమాజం పోవాలనుకోవడమే అభ్యుదయమనీ, ఆ లక్ష్యంతో వ్రాసినదే అభ్యుదయ కవిత్వమంటారు "ఎగుడు దిగుడులు లేని సొగసైన వీథిగా మూడుకోట్ల మన్నునాడు చేతునంటూ, విద్వేష వైతరణి కడ్డుగా గాఢ సౌహార్ద్రసేతను నిర్మిస్తా"నంటూ అభ్యుదయ కావ్యగానం చేస్తారు "మనది కృతమహాయుగం, యువమహాయుగమన్నదీ యువగీతం, ఆత్మ, రాత్రి" మొదలైనవన్నీ ఈ దోరణికి చెందినవే. విశ్వనాథ పంచశతి, కృ.శా వేమన శతక పద్యాలు వ్యంగ్య విమర్శనాత్మకమైన హాస్యరస మిళితాలైనవి.

స్త్రీ ఉదాత్త చిత్రణను కవులిద్దరూ తమ తమ రచనల్లో మహోన్నతంగా గావించారు. కృ.శా. ఊహా ప్రేయసి ఊర్వశిని మహోదాత్తంగా హరజటా పారిజాత లతాంత మధువుగాను, శ్రీలలిత వైతీయంతీ పరిమళంగాను చిత్రించడమేగాక సామాన్య స్త్రీని కూడా అత్యుదాత్తంగా అభివర్ణించారు భిక్షు బాలిక సుప్రియ దీనికొక ప్రతినిధిగా నిలుస్తుంది. స్త్రీ జపము - తపము - జలధిలోతూ కూడానంటారు. విశ్వనాథవారి స్త్రీ పాత్రలు మహోన్నతాదర్శాలకు ప్రతినిధులు- శ్రీ కుమారాభ్యుదయ దేవసేన, ఆనార్కలి మొదలైన విట్టివి.

ఈవిధంగా విశ్వనాథ, దేవులపల్లి కృష్ణశాస్త్రిగారల సాహిత్యమూర్తులలోని భేద సాదృశ్యాలు సహృదయ హృదయంగమంగా దీపిస్తాయి. తరచి చూచినకొద్దీ వాటిలోని సౌందర్యం, వైశిష్ట్య వైదగ్ధ్యాలు వెల్లడవుతాయి. సమయాభావం కొద్దీ దిఙ్మాత్రంగానే చెప్పడం జరిగింది. కవితాసౌందర్య మనంతమైనది. తద్దర్శనాని కారంభమే గాని అంతముండదు కదా! *

"తనలోతు నెఱుఁగని జనులపూజకుఁ దిర
స్కృతిఁజూపు మత్సరస్వతి సుభద్ర
తనలోతు నెఱిఁగిన జనుల పూజకు నవా
దృతిఁజూపు మత్సరస్వతి సమార్ద్ర."

"మత్సరస్వతి భావసామ్రాజ్యలక్ష్మి
భక్తి యున్నట్టిచో మెత్తబడెడు దేవి."

—విశ్వనాథ

# విశ్వనాథ కవితలో "నేను"

—డా॥ వై. కామేశ్వరి

ఆధునిక కవిత్వ సముద్రాన్ని "నేను" అనే అంశంతో పరిశోధిస్తూ ఉండగా, ఏ ఒక్క కవిని కవిత్వాన్ని ప్రత్యేక దృష్టితోకాక, కాలక్రమానుసార దృష్టితో, నిష్పక్షపాత దృష్టితో వింగడించి, శిల్ప దృష్టితో విలువకట్టి, ఏ వర్గానికి ఆ వర్గాన్ని నిలబెట్టిచూస్తే ముందు వరసలో నిలచిన వాటిలో, ఎక్కువ శాతం విశ్వనాథవే కావడం నన్ను చాలా ఆశ్చర్యపరచింది. ఇది ఎలాంటిదంటే, పరీక్షా పత్రాలను కోడ్ నెంబరుతో దిద్దడం లాంటిది అందుచేత ఈ వ్యాసంలో ప్రస్తావింపబడే అంశాలన్నీ ఆయన సాహిత్యాభిమాన దృష్టితో చేసిన వ్యాఖ్యానంగా కాక, శాస్త్రీయ పరిశోధనా ఫలితాలుగా గ్రహించవలసి ఉంది.

ఆధునిక కవిత్వంలో 'నేను' మొత్తం ముప్పైరెండు రకాలుగా ప్రయోగింపబడింది. (ఇప్పటిదాకా) అయితే అందులో విశ్వనాథవారు తొమ్మిది వర్గాలను ప్రయోగించారు. చెప్పుకోదగ్గ విశేషం ఏమంటే, అందులో ఏడింటిని ఆయనే ప్రారంభించారు. వాటికి ఆపైన ఎంతో అనుసరణ ఉంది. ఇంతా చేసి ఈ పరిశోధనలో చేరిన ఆయన కవితా సంకలనాలు మూడే. గిరి కుమారుని ప్రేమగీతాలు, భ్రష్టయోగి, శృంగార వీధి.అందులోనే ఆయన తన అనంతమైన ప్రతిభని ఇమిడ్చి ''ఇందులోనూ నేనే'' అంటూ నిరూపించుకున్నారు. ఈ సంఖ్యాపరమైన అంచనాలనుండి విషయ పరిశీలనలోకి లోతుగా దిగే ముందుగా ఆధునిక కవిత్వంలో 'నేను' అనే అంశం గురించి కొంత చర్చించుకోవలసి ఉంది. ఎందుచేతనంటే, ఎన్నో ఇతర విషయాల లాగా ఇది అంతగా ప్రచారం పొందిన విషయం కాదు.

కవిత్వంలో 'నేను' పాత్ర చాలా చిత్రమైనది. 'నేను', అనే సర్వనామానికి ఒక రూపం లేదు. కవి ప్రతీకలుగా స్వీకరించే ఇతర వస్తువుల్లాగా 'నేను' ఒక నియత స్వభావానికి ఒదిగేది కాదు. మంచినీరు ఏ మూసలో పోస్తే ఆ రూపం,

ఏ రంగును ఇస్తే ఆ రంగు సంతరించుకున్నట్లు - కవిత్వంలో 'నేను' కవి ప్రతిభను అనుసరించి తన స్వభావాన్ని, కవి నియోగించినట్లు తన పాత్రను మలచుకొని తన ధర్మాన్ని నిర్వర్తిస్తుంది. కవికి అలా మలచుకొనే ప్రతిభ లేనప్పుడు ఆ 'నేను' ఏ రంగు రుచి వాసనలేని నిర్జీవ అసమర్థ పాత్ర అయి ఊరుకుంటుంది సమర్థుడైన కవిచేతిలో తన సర్వశక్తులను సామర్థ్యాలను చూపు తుంది. అందుచేత 'నేను' కు తగినంత పని ఇచ్చిన పద్యంలో అది ప్రతీకగా నిలుస్తుంది - 'నేను' ప్రతీకగా నిల్చిన పద్యశిల్పం దాన్ని ప్రతీకగా నిల్పటానికి తగినట్టు విశిష్టంగా ఉంటుంది. ఈ సందర్భంలో మరొక విషయం ప్రస్తావించ వలసి ఉంది. ఉత్తమమైన 'నేను' ప్రయోగం సాధారణంగా ప్రతీకాత్మక శిల్పం ఉన్న కవితలోనే సాధ్యపడుతుందని ఎన్నో కవితల పరిశీలనలో వెల్లడైంది.

కవి 'నేను'ను ఎంత సమర్థవంతంగా ఉపయోగించాడో విశ్లేషించి చూస్తే ఆ కవి పనితనం బయటపడుతుంది. ఇది ఒక విధంగా కవి శిల్పచాతుర్యానికి పెట్టే పరీక్ష. వృక్షశాస్త్ర అధ్యయనంలో 'అడ్డుకోత' (Transverse section cutting) పరీక్ష ద్వారా వృక్ష నిర్మాణాన్ని ఎలా అంచనా వేయగలమో ఆ విధంగా కవిత్వాధ్యయనంలో 'నేను' వినియోగాన్ని పరిశీలిస్తే పద్యనిర్మాణాన్ని అంచనా వెయ్యగలం. మరో రకంగా చెప్పాలంటే 'నేను' మిషతో కవిత్వ వస్తు శిల్పాల అధ్యయనం జరుగుతుందన్నమాట.

'నేను' వివిధ కళారూపాల్లో అభివ్యక్తమవడమే ఆధునిక కవిత స్వభావం అనుకుంటే ఈ 'నేను' వస్తురూప శిల్పాల్లో ఏయే రకాలుగా రూపుదిద్దుకుంటోందో పరిశీలించడం అవసరం. ఒక్కోసారి ఒక్కోదానికి ప్రాముఖ్యత వస్తున్నట్లు కనిపిస్తుంది. అందులోను వస్తుశిల్పాలు ఒకదానితో మరొకటి పోటీపడి కవిత్వంలో 'నేను'ను రూపొందిస్తాయి. సాధారణంగా వస్తువును ఆశ్రయించుకొని 'నేను' రూపొందుతుంది. కాల్పనిక విషయమో, వాస్తవిక అంశమో కవి చిత్రించ దలచుకొన్నపుడు ఆ 'నేను' కాల్పనిక 'నేను'గా, వాస్తవిక 'నేను'గా రూపొందు తుంది.

ఒక ప్రయోగం చెయ్యదల్చుకొన్న కవి ఆ ప్రయోగం వస్తువుకు సంబంధించినదైతే, ఆ కవితలోని 'నేను'ను వస్తువుకు అనుగుణంగా మలుస్తాడు. ఒక్కోసారి వస్తువుకు అనుగుణంగా మలచిన 'నేను' శిల్పంపై తన ప్రభావాన్ని

చూపుతుంది. (ఉదా: మార్మిక, అధివాస్తవిక) మరొకసారి శిల్పానుగుణంగా రూపొందించే 'నేను' వస్తువును Modify చేస్తుంది. ఒకానొక వస్తువును వ్యక్తం చేయడానికి కవులు తరచు ఒకే శిల్పాన్ని ఎన్నుకోవడం యాదృచ్ఛికం కాదు. వస్తుశిల్పాలు ఒకదాన్ని మరొకటి ప్రభావితం చేసుకోవడమే దీనికి మూలకారణం. ఈ వస్తు శిల్పాల సారాన్ని సమర్థవంతంగా అందించే వాహిక రూపం.

ఆధునిక కవిత్వంలో కనిపిస్తున్న 'నేను'ను వస్తుగతంగా, కాల్పనిక, వాస్తవిక, కాలాతీత, ఆధ్యాత్మిక కవిత తాత్త్వికమైన 'నేను'లుగా విభజించవచ్చు. అదేవిధంగా శిల్పాన్ని ఆశ్రయించి గుప్తకర్తృక, ఆరోపక, పరిణామాత్మక, వ్యంగ్యాత్మక, ప్రతీకాత్మక, ప్రతినిధి 'నేను' లుగా విభజించవచ్చు. ఇదికాక వస్తువు కవి, కవిత అయితే దానికి నేను కవితగా 'నేను' అని ఒక అధ్యాయంలో పరిశీలించాను. వస్తువు వాస్తవికం, శిల్పం వ్యంగ్యాత్మకం అయితే ఆ కవితలోని 'నేను'ను వాస్తవిక వ్యంగ్యాత్మక వర్గానికి చెందినదిగా చెప్పవచ్చు.

ఆధునిక కవిత్వం అంతటిలోను ప్రతీకాత్మక 'నేను', ప్రతినిధి 'నేను' అనే విభజన సహజ సిద్ధమైనదిగా కనిపిస్తోంది. అందుచేత పైన చెప్పిన వాస్తవిక వ్యంగ్యాత్మక వర్గపు 'నేను' దేనికో ప్రతినిధో, లేక ప్రతీకో అయి ఉంటుంది. అపుడు మనం ఆ 'నేను'ను వాస్తవిక వ్యంగ్యాత్మక ప్రతినిధి, లేక వాస్తవిక వ్యంగ్యాత్మక ప్రతీక అని పేర్కొంటాం.

ఒకానొక ఆధ్యాత్మిక సాధన భ్రష్టత్వం చెందిన అనుభవాన్ని వ్యాజంగా తీసుకొని కవితా తత్త్వాన్ని గడుసుగా చెప్పిన విలక్షణమైన కవిత 'భ్రష్టయోగి.' ఈ కవితలోని 'నేను' తన కవితా తత్త్వానికి గత జన్మకు గల ఆధ్యాత్మిక బంధాన్ని గుర్తించిన కవికి ప్రతీక. ముందు ఒక విధంగా, వెనుక ఒక విధంగా చెక్కిన 'Mephispophelsand Margaretta' శిల్పం వంటిది ఈ కవితా శిల్పం. ముందర చెక్కిన పురుష శిల్పం ధీరత్వంతో రొమ్ము విరిచి నుంచుంటే, అదే భంగిమ వెనుక ఉన్న లలిత సుకుమార స్త్రీమూర్తి మనోహర భంగిమకు ఆధారంగా రూపొందింది. శిల్పకళలోని అదే శిల్పాన్ని విశ్వనాథ ఈ కవితలో ఉపయోగించారు. ఈ కవితలోని 'నేను' పూర్వజన్మలో యోగి, ఈ జన్మలో కవి. యోగిగా చెందిన భ్రష్టత్వమే కవిగా పొందిన విశిష్టతకు ఆలంబనం. ఒక్కొక్క పద్యంలో ఒక్కొక్క కారణంచేత భ్రష్టత్వం పొందినట్లుగా చెప్పే

కవి - అది తన కవిత్వ విశిష్టతకు ఎలా దోహదం చేసిందో వివరించడు. అది మన ఊహకు వదిలేశాడు. ఏది పాఠకుడి ఊహకు వదలాలో తెలుసుకోవడమే ఉత్తమ కవి లక్షణం.

'వాగతీతమ్మయగు పరబ్రహ్మహూతి
మృదుగిరాం సౌకుమార్య మూహించుకొనుచు'—

వాగతీతమైన దానిని వాక్కులో భావించుకోవటం యోగ భ్రష్టతకు కారణం. కవి భాషా సౌందర్య పిపాస కవిత్వంలో వ్యక్తం కావడం కవి విశిష్టత.

విక్రియా పేత బ్రహ్మ భావించువేళ
పట్టరాని సౌందర్య పిపాస తగిలి

సృష్టిలోని సమస్త సౌందర్యాలపట్ల కవికిగల పిపాస ఇలా వ్యక్తం అయింది.

బ్రహ్మ బదులుగ వాక్స్వరూపంబు నెంచి
బ్రహ్మకును వాక్కున కభిన్న భావమెంచి

కవికి ఉన్న వాక్శుద్ధి, భాషాగౌరవం భక్తి వ్యక్తం అయ్యాయి.

బ్రహ్మ జగదతీతమ్మను భావంబులేక

ఈ జగత్తత్త్వమున బ్రహ్మయోజన చేసి - ఇక్కడ కవికి సమాజం పట్ల గల బాధ్యత, జగత్తులోని అంశాలతో కవికి ఉండే involvement ను తెలుపుతున్నారు.

కావ్యసృష్టిని యోగసాధనగా, పవిత్ర కార్యంగా చిత్తశుద్ధి శ్రద్ధాభక్తులతో సమాజంపట్ల బాధ్యతతో నిర్వహించే ఉత్తమకవి ఈ కవితలోని నేను తన కవితా తత్త్వాన్నే కాక, కవిత్వ బాధ్యతను కూడా తెలుపుతున్న ఈ 'నేను' విలక్షణమైనది. పైన పేర్కొన్న మార్గరెట్టా శిల్పంలో వినయశీలిగా కనిపించే స్త్రీ మూర్తిని చూసేవారికి వెనుకవైపు ధీరంగా నిలబడిన పురుషుడు కనపడడు. ఆ శిల్పాన్ని అన్ని కోణాల నుంచి పరిశీలించినప్పుడే శిల్పి ప్రతిభ తెలిసినట్లు ఈ కవితను సమగ్రంగా భావిస్తే కాని కవి ప్రతిభ ద్యోతకం కాదు. యోగ భ్రష్టత్వం గూర్చి మాట్లాడే 'నేను'నే చూస్తే ధీరోదాత్తుడైన కవి గోచరించడు. ఇంతటి శిల్పమూ శిల్పదృష్టితో పరిశోధించినప్పుడు కానీ శిల్పం ఇదీ అని నిర్ధా

రించినప్పుడు గానీ తన ఉనికిని బహిర్గతం చేయదు. కవిత్వాస్వాదనకు భంగం రానీయదు. కవి ఎంతటి శిల్పనైపుణ్యాన్ని చూపినా అది పారదర్శకం కావడం మరో గొప్ప లక్షణం. ఈ కవిత మరో గొప్పదనం ఏమిటంటే - "కవి(త)గా ప్రతీకాత్మక నేను" వర్గంలో ఇదే మొట్టమొదటిది కావటం.

కొండల నడుమ భగ్గున సుళ్ళు తిరుగుదా
కసము ముట్టెడు కొండగాలి కాదు
కొండ లంచుల రాళ్ల ఘూర్ణిలంబడిపోయి
పడబోసికొని సెలవాగునౌదు
దేని గనుపించరాని యొకడవిలో పూవునౌదు
పెనుగాలి విరుగద్రోసిన వెదుళ్ళ
లోయలలో వింత చాయనౌదు"

అనే ఈ పద్యం శీర్షిక 'భావకవి' అని ఉండటం ఈ కవితలోని "నేను"ను కవి(త)గా 'ఆరోపక ప్రతినిధిగా' మిగిల్చింది. క్రమక్రమంగా ఆరోపకాల భౌతికత్వాన్ని తగ్గిస్తూ చివరకు భావమే తానైన స్థితికి అద్దం పట్టే ఈ కవితకు శీర్షికలోని వాచ్యతే వన్నె తెచ్చింది. అది లేకుంటే ఇది ఒక భావోద్వేగావస్థ వర్ణనగా మిగిలిపోయేది. కవి వివిధ తత్త్వాలను ప్రతిబింబించేది కాదు. అంతేకాదు, ఇది కూడా ఈ వర్గంలో, అంటే కవి(త)గా ఆరోపక ప్రతినిధి వర్గంలో మొట్టమొదటిది కావడం మరో విశేషం.

కాల్పనిక ఆరోపక ప్రతీకాత్మక "నేను" కూడా విశ్వనాథ రచనతోనే ప్రారంభమౌతోంది. శాఖానది అంతర్భవించిన ఒక జీవనది "నేను"కు ఆరోపక ధ్వని కలిగించి భర్త జీవితంలో అంతర్భవించిన భార్యను తలపిస్తూ చేసిన విశ్వనాథవారి గిరికుమారుని ప్రేమగీతాలులో - 33 వ కవిత ఇది.

"ఈ సుధార్ద్రి శాఖానది యేను గలసి
కొన్న యీయెడ గుఱుతిడికొనఁగాని
ఈ పయిన నేను ప్రవహింతు నధికమూర్తి
నామె యేమాయనో తెలియంగరాదు"

ఇందులో కవి క్లుప్తతను, స్పష్టతను, పారదర్శకతను కూడా పొందిగాడు. ఈ శిల్పంద్వారానే 'నేను'ను జీవితకాలంలో ప్రయాణం చేసే పురుషునిగా ధ్వనింపచేయడం సాధ్యమైంది.

విశ్వనాథ శ్రీకారం చుట్టిన మరొక వర్గం ఆధ్యాత్మిక ప్రతీకాత్మక "నేను." భ్రష్టయోగి కవితా సంకలనంలోని "దయాంబుధి"లోని "నేను" సర్వార్పణ బుద్ధిగల ఆస్తికుడు జీవనబంధ విముక్తి కోసం తపించే జీవికి, భవబంధాలను ఒకొక్కటిగా తొలగించే భగవంతుడు దయాంబుధే.

"....నా కనుల యెట్ట యెదుటన నా జనకుని
జనని కుత్తుకలను కోసి నను నడిగె న
తండు నేదయాంబుధిని కాదా? యటంచు
ఓ ప్రభూ! యగు నంటి నౌదిగియుండి"

అంటూ వ్యాజస్తుతి వర్గంలో ఈ కవితా శిల్పం చేరుతుంది.

"ఈ మనోహర వీణ వాయించలేక
చేతమున నెంతనే నశిక్షితుడనంచు
నా లతాంగి విలోల నేత్రాంచలమున
గదలుచున్నది దాని రాగాల మెఱుపు" (గిరికుమారుని ప్రేమగీతాలు- 2)

విపంచికను మోగించడమే సాధన. జ్ఞానం పొందే మార్గంలో మానవుని సాధన. సాధన చేస్తూ తనకు చేతకాదు అనుకుంటాడు "నేను" కానీ విపంచిక రాగాల మెఱుపులు తన లతాంగి విలోల నేత్రాంచలాల్లో కదలుతున్నవి. అతని సాధన ఆమెలో ప్రతిఫలిస్తోంది - జ్ఞాన మార్గ పరమావధి అయిన అద్వైత భావనకు తొలిమెట్టు దాంపత్యధర్మం.

మాయాగ్రహణం విడినవేళ ఉండే ఆనందం మాయావృత జీవితంలోని దుఃఖ భాజకత్వం- రెంటినీ అనుభవించిన కర్మవశుడైన జీవుడు గిరికుమారుని ప్రేమగీతాలు - 12 లోని "నేను."

ఈ శరత్పూర్ణిమా చంద్రికా సుధా మ
రీచిలో నున్న ''నేను'' స్ఫారితవన్న
వీన శంపాలతాకృతి పూనియుంటి
ఈ సగము నాకునాకె కన్పించబోదు
ఉగ్ర రాహు చంద్రార్థ బింబ గ్రసనము
బోలెనున్నది నా స్థితి.''

గిరికుమారుని ప్రేమగీతాలు-13లో ఆధ్యాత్మిక ప్రతీకాత్మక ''నేను'' మరో విధంగా దర్శనం ఇస్తోంది.

''స్నేహపూరితమైన నా చిన్నిప్రమిద
లోన కెంత యత్నించి వెలుంగలేదు
వర్తి యతి 'పునీతమ్మైన పైడిప్రత్తి
అస్మదీయ మహాశక్తి యపరిమితము."

ప్రమిదను సాధనకు, వత్తిని 'అహం'భావానికి, తైలాన్ని శక్తికి ప్రతీక లుగా గ్రహించిన చక్కని ప్రతీకాత్మక శిల్పం ఇది. 'నేను' సాధకుడే 'అహం' భావం జ్ఞానజ్యోతికి ఆటంకం కల్పిస్తోందనేది తాత్పర్యం.

"ఇది ప్రసవ జన్మమెత్తిన దిదియ దాలు
నన్ను నవహైమ నిగళబంధములచేత
దనయెడకు లాగికోఁబట్టు ద్రాళ్ళఁగూడ
నేటికో నన్ను బంధించ నింత తివురు
ఇది యొకడె బంధమని మదినెంచికొంటి
గాని యీ రెమ్మ, యీ కొమ్మ వీని చివర
పొలుచు చివురులు పిందెలు పో యివెల్ల
నన్ను లాగజూచెడిని బంధములువేసి
నిక్కముగ ననతిక్రమణీయమైన
దైవమను నూర్ణనాభికృతమగు చెట్టి
వాగురఁ దగుల్కొని కృతమహాగసుఁడగు
వెలికి లోనికిఁ గాక తపించుచుంటి"

—గిరికుమారుని ప్రేమగీతాలు-56.

భగవన్నిర్మితమైన మాయ, సమస్త ప్రపంచాన్ని ఆవరించిన మాయ తననూ ఆవరించిందని తలచే ఆస్తికులకు ఈ గీతంలోని 'నేను' ప్రతీక. ''నేను''ను పూవుగా ఆరోపించి, ఆ పూవును జీవనబంధ విముక్తికి తపించే జీవాత్మకు ప్రతీకగా తీర్చిదిద్దిన పరోక్షశిల్పం ఇది. జన్మించిన జీవి అనుబంధ బంధితుడై భగవంతునికి దూరం కావడం ఇందులో ప్రతీకాత్మకంగా తీర్చిదిద్దబడింది. అయితే చివరలో జీవాత్మ "నేను" అనే అంశం ఆరోపకపు తెరను చీల్చుకొని బయటకు వచ్చినట్లు అనిపిస్తుంది. భావనాతీవ్రత శిల్పవ్యూహాన్ని ఛేదించుకొని వాచ్యతకు చోటిచ్చింది. అయితే ఇది ఆరోపక శిల్పం కావడంవల్ల, పూవే 'నేన'నీ 'నేనే' జీవాత్మ అనీ, సూటిగా, స్పష్టంగా ఎక్కడా వ్యక్తం కాకపోవడంవల్ల 'నేను' ప్రతీకగానే నిల్చింది. పరోక్షశిల్పం ఈ 'నేను'ను ప్రతినిధిగా కాక ప్రతీకగా నిల్పడంలో దోహదం చేసింది.

గిరికుమారుని ప్రేమగీతాలు 75 లో, తరచుగా ఆధ్యాత్మికానుభవాలను పొందుతున్న సాధకునిగా ఆధ్యాత్మికానుభవాలను బేరీజువేసే మానవునిగా 'నేను'ను ప్రతీకగా వినియోగించారు విశ్వనాథ.

"....అది మహాపర్వతము వోలె నమితభార
మైనవేళ నాకు భయంబు లేదు
గాలిలోఁ బువురేకును బోలె నెగురు
వేళనాయాత్మ యిది భయావిష్టమగును."

శరీరానికి ఆత్మకు తేడా తెలుసుకుని పరమాత్మతో సంధానం అందే స్థితి చేరినపుడు 'నేను'కు మేను భారంగా తోస్తుంది, దీనికి కారణం పరమాత్మతో సంధానానికి శరీరం అడ్డంకి కావడమే. లౌకిక తపనలు చుట్టుముట్టిన స్థితిలో జీవితంపట్ల వ్యామోహం, ఐహిక సుఖాల లౌల్యంవల్ల శరీరం పూరేకంత తేలికగా తోస్తుంది. అప్పుడు పరమాత్మకు దూరం అవుతున్నానన్న స్పృహ జీవుని భయావిష్టుడిని చేస్తుంది. ఈ తాత్త్విక రహస్యమే ఈ కవితను అత్యంత కుతూహల స్ఫోరకం చేసింది.

మార్మిక ప్రతీకాత్మక ''నేను''ను కూడా మొదటిసారిగా సృష్టించిన ఘనత విశ్వనాథకే దక్కింది. ఒకానొక గూఢమైన అనుభవాన్ని చిత్రిస్తూ

'నా ప్రవృత్తి' అనే ఖండికను రచించిన మార్మిక కవితలో మొట్టమొదటిసారిగా మార్మిక 'నేను' దర్శనం ఇస్తోంది.

''ఒక మనోహరమైన యూహ హఠాత్తుగా
చింతనొందు మనస్సు చివర తగిలి
ఒక మంచు బిందు పోలిక చల్లనైన భా
వంబంతరాత్మ లోపలను దోచి
కనిపించు చున్న వస్తునికాయమునకొక్క
సుందరాకృతి మనస్సునను జొచ్చి
ఒక్కొక్క మాట యెందొ వినంబడి గూఢ
మొక యర్థమది యెంతయో ధ్వనించి....'' (భ్రష్టయోగి-పే. 58.)

ఆధునిక తెలుగు కవిత్వంలో పరిణామాత్మక ''నేను''ను అన్ని కవితోద్యమాలకు చెందిన కవులు ప్రయోగించారు. సాధారణంగా వస్తువులో, కవి భావనలో వస్తున్న పరిణామం ''నేను'' పరిణామాత్మకం అవడానికి దోహదం చేస్తుంది. కొన్ని కవితలలో వస్తువు స్థిరంగా ఉన్నప్పటికి విలక్షణ వ్యక్తీకరణ కోసం ''నేను'' శిల్పంలో పరిణామాన్ని కలగచేయడం కూడా లేకపోలేదు. ఆరోపకం పరోక్ష ప్రతీకగా ఉండటం మామూలే. కాని ప్రతినిధిగానో, ప్రతీకగానో ఉన్న ''నేను'' ఆరోపకంగా పరిణమిస్తూ ఉండడం కూడా కనిపిస్తోంది.

ఈ పరిణామాత్మక "నేను''ను కూడా మొదటిసారిగా ఉపయోగించినది విశ్వనాథవారే. ''శబ్ద బ్రహ్మస్తుతి''లో కవిభావం ఆరాధన నుండి అద్వైతానికి పరిణమించింది. భావగతమైన ఉదాత్త పరిణామం శిల్పగతంగా ప్రతిబింబించి కవితాత్మక 'నేను' సాధకుని నుండి పరిణతునిగా పరిణమించింది. సాధకునికి ప్రతీకగా ఉన్న 'నేను' శబ్ద బ్రహ్మగా ఆరోపకంగా పరిణమించింది.

''...........................
మానుగ నాకాశంబున
ప్రాణములన్ మలచి తన్మయత్వము పొందన్
నేనే శబ్ద బ్రహ్మం
బై నాలో నాకె వందనాదికమయ్యెన్'' (భ్రష్టయోగి పేజి 110-111)

ఒకే కవి ఒకే వర్గపు ''నేను''ను పలుసార్లు ప్రయోగిస్తే వాటిని అన్నింటినీ గ్రహించినా ఏదో ప్రత్యేకత ఉంటేగానీ ఒకటి కంటే ఎక్కువ ప్రయోగాలను పరిశోధనా వ్యాసంలో చేర్చలేదు. పునరుక్తివల్ల ప్రయోజనం ఉండదని భావించడం జరిగింది. కానీ విశ్వనాథవారి రచనలు ఆధ్యాత్మిక ప్రతీకాత్మక వర్గంలో ఎన్నో అనివార్యంగా చోటుచేసుకున్నాయి ఆయన చాలా కవితల్లో వైవిధ్యాన్ని చూపటమే అందుకు ప్రధాన కారణం. ఆధ్యాత్మిక ప్రతినిధి 'నేను' వర్గాన్ని కూడా విశ్వనాథవారే ప్రారంభించారు. "భ్రష్టయోగి"లోని "ఒక యనుభూతి'' అనే కవితలో కామక్రోధాది భావాలకు రంగస్థలమైన మనసు వేరు- తాను వేరు అన్న జ్ఞానం కలిగిన సాధకునికి ''నేను'' ప్రతినిధి.

విశ్వనాథ కవితలో ''నేను" సమర్థవంతంగా తరవాత తరాల కవులకు మార్గదర్శకంగా ప్రయోగింపబడిన మాట వాస్తవం. 'నేను' అనే సర్వనామం ఇతర ప్రతీకల వంటిది కాదు. దానికి ఎంతో సౌలభ్యం ఉంది. అది ఏ వాతావరణంలో ఉంచితే ఆ వాతావరణంలో ఒదిగిపోయి కవి చేతిలో మైనపుముద్దలా ఉపకరిస్తుంది తన తరం కవులలో మైనపుముద్దను అద్భుత శిల్పంగా మలచి చూపి, 'నేను' పాత్రకు గల సౌలభ్యాన్ని సంపూర్ణంగా వినియోగించిన కవి విశ్వనాథ సత్యనారాయణగారు ఈ వడపోతలో రత్నంవలె తేలి తనకు అందరూ అందిస్తున్న ప్రథమ తాంబూల గౌరవాన్ని నిలుపుకున్నారు. *

# రాశిపోసిన రాష్ట్రాభిమానం–ఆంధ్రప్రశస్తి

—శ్రీ కోయి కోటేశ్వరరావు

ఆధునిక తెలుగు సాహిత్యంలో ''దేశము పట్టనంతకవిగా'' ప్రసిద్ధికెక్కిన మహా మనీషి విశ్వనాథ సత్యనారాయణ. పాశ్చాత్య నాగరికతా ప్రభంజనంతో కొడిగట్టిపోతున్న 'దేశీయతను' అరచేతినడ్డుపెట్టి కాపాడిన మహాకవి విశ్వనాథ. అస్వతంత్రతా నియతమైన జాతి జీవనాడులలో స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను ప్రవహింపజేసిన జాతీయకవి ఆయన. కొత్త కొత్త అభిరుచులతో పొరుగింటి పుల్లగూర కోసం పరుగులు తీస్తున్న కాలాన్ని నిలదీసి విశ్వనాథ పాలమీగడల కమ్మందనాన్ని రుచి చూపించాడు ఈ మహా ప్రయత్నానికి శుభోదయంలా 'ఆంధ్రప్రశస్తి' కావ్యం అవతరించింది.

గతాన్ని అవగతం చేసుకోకుండా సంస్కృతీ సంప్రదాయాలను తిట్టుకుంటూ నిరాశల నిశీథిలో కొట్టిమిట్టాడుతున్న ఆంధ్రుల గుండెల్లో విశ్వనాథ ఆశా జ్యోతిని వెలిగించి ఆత్మవిశ్వాసాన్ని కలిగించాడు. ఆంధ్రప్రశస్తి కావ్యం రాశిపోసిన రాష్ట్రాభిమానంలా కనబడుతుంది. ఆనాటి చారిత్రక పరిస్థితులను గమనించకుండా ఈ కావ్యాన్ని అర్థం చేసుకోలేం.

## నేపథ్యం :

భారత స్వాతంత్ర్యోద్యమంలో భాగంగా ఆంధ్రుల్లో ఒక ఉపజాతీయ భావం ప్రారంభమవుతున్న కాలమది. ఆంధ్రులు ఒకవైపు స్వాతంత్ర్యోద్యమానికి ఊపిరిపోస్తూనే ఈ ఆంధ్రోద్యమానికి పునాదులు నిర్మించుకుంటున్నారు. 1913, 1915 సంవత్సరాలలో బాపట్ల, కాకినాడలలో జరిగిన ఆంధ్రమహాసభలో ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర తీర్మానాన్ని ఆమోదించారు. ప్రజాప్రతినిధుల అంగీకారంతో భాషా ప్రయుక్త రాష్ట్ర నిర్మాణం చేయవచ్చునని 1919 లో రాజ్యాంగ చట్టంలో నిర్ణయింపబడింది. సరిగ్గా ఈ కాలంలోనే విశ్వనాథ ఆంధ్రప్రశస్తి రచించారు.

స్వాతంత్ర్యోద్యమ స్ఫూర్తితో ఆంధ్రజాతి చైతన్యవంతమై గత చరిత్రను సింహావలోకనం చేసుకోవడం ప్రారంభించింది. ఈ ప్రయత్నంలో భాగంగా ఆంధ్రజాతి, ఆంధ్ర సంస్కృతి, నాగరకత, ఆంధ్రుల పరాక్రమం, ఆంధ్రుల పౌరుషం, వారి సాంస్కృతిక సంపద, ఆంధ్రుల ఖండాంతర వ్యాపార పారీణత, ఆంధ్ర సామ్రాజ్య స్థాపన, ఆంధ్రభాషా సౌందర్యం మొదలైన విషయాల పట్ల చారిత్రక పరిశోధన మొదలయింది. మల్లంపల్లి సోమశేఖరశర్మ, ఆదిరాజు వీరభద్రరావు, భోగరాజు పట్టాభి సీతారామయ్య, కోపల్లె హనుమంతరావు మొదలగువారు రాగి రేకులపైన, రాతిపలకలపైన రూపుమాసి పోతున్న ఆంధ్ర చరిత్రకు గ్రంథరూపం కలిగించి తెలుగు బిడ్డలకు ప్రాచీనాంధ్ర పౌరుషాన్ని రుచి చూపిస్తుంటే; మరొకవైపు గాడిచర్ల హరిసర్వోత్తమరావు, కొండా వెంకటప్పయ్య పంతులు కృష్ణా, దేశబంధు మొదలగు పత్రికల్లో వ్యాసాల రూపంలో ఆంధ్రాభిమానాన్ని రగుల్కొలుపుతున్నారు. ఇదే సందర్భంలో ఆంధ్రకవులు 'దివ్య ధాత్రియైన ప్రియభారత జనయిత్రి'కి జయజయ ధ్వానాలు పలికి, కన్నతల్లియైన తెలుగు తల్లికి మల్లెపూదండలు వేసి మంగళహారతులు పాడుతున్నారు.

మంగిపూడి వెంకటశర్మ, గడ్డం కొండారెడ్డి, పిప్పర సోదరకవులు, మంత్రపాక పార్వతీశ్వరశాస్త్రి గాదె జగన్నాథస్వామి మొదలగువారు ఆంధ్రదేశంలోని నదీ, క్షేత్ర ప్రశంసలతో ఆంధ్రరాజులను ప్రస్తుతించి జాత్యాభిమానాన్ని అణువణువులో ప్రవహింపజేస్తున్నారు.

''నాదు జాతి నా దేశము నాదు భాష

అను అహంకార దర్శనం"తో రాయప్రోలు తెలుగుతల్లి, తెలుగుమాన్యం, తెలుగుభూమి, తెలుగువాణి, తెలుగు గొప్పతనాన్ని కీర్తించి 'ఆంధ్రావళి'లో ఆంధ్రాభిమాన కవిత్వానికి అంకురార్పణ గావించాడు. 1. గతవైభవ స్మరణం, 2 వర్తమాన స్థితిపట్ల విచారం, 3. భవిష్యత్ కర్తవ్య ప్రబోధం అన్న త్రివేణీ సంగమంతో ఆంధ్రాభిమానాన్ని రంగరించి రాయప్రోలు ప్రజలను ఉద్రూతలూగిస్తున్నాడు.

ఈ ప్రబోధ ప్రభాత కిరణాల్లో విశ్వనాథ ఆంధ్ర చరిత్రను దర్శించాడు. ప్రాచీనాంధ్ర వైభవ ప్రాభవాలు, వర్తమాన దైన్యస్థితిగతులు ఆ యువకవి గుండె

గొంతుల్లో కొట్లాడాయి. "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ" అన్న వాల్మీకవాణి ఆయన రక్తనాడులలో ప్రతిధ్వనించింది. ఆంధ్రచరిత్రలోని ఎన్నో మహోజ్జ్వలమైన మధురఘట్టాలు ఆయన కళ్ళముందు కదలాడాయి. గత చరిత్రకు ప్రాణప్రతిష్ఠచేసి సజీవకావ్యంగా తీర్చిదిద్దాలనుకొన్నాడు. నూనూగు మీసాల నూత్నయౌవనంలో ఉరకలువేస్తున్న విశ్వనాథ ఆంధ్ర పౌరుషాన్ని కీర్తించి తెలుగుతల్లికి తొలి పూజ చేశాడు. అయినా ఇంకా విశ్వనాథ గుండెల్లో రగులుతున్న ఆంధ్రాగ్ని చల్లారలేదు. ఆ అగ్నితరంగాలపైనే "ఆంధ్రప్రశస్తి" కావ్యం పురుడు పోసుకుంది.

ఆంధ్రజాతి జీవరహితమై శక్తి నాడులయందు చచ్చిపోతున్నప్పుడు, మాతృభాష నానా దుష్టభాషల యౌద్ధత్యమును తలనవధరించినపుడు కొడిగట్టి పోతున్న ఆంధ్రత్వాన్ని దర్శించినపుడు విశ్వనాథ విడిచిన వేడినిట్టూర్పు ఆంధ్ర ప్రశస్తి కావ్యంగా రూపుదిద్దుకుంది. శౌర్యాగమవేత్తలైన ఆంధ్రరాజుల కీర్తిని తలచుకొని వర్తమాన హీనదీన స్థితికి కంపించి విశ్వనాథ నయనాలు రాల్చిన రక్తకన్నీరే ఆంధ్రప్రశస్తి కావ్యంగా ఘనీభవించింది.

**1919-20** మధ్య విశ్వనాథ ఈ కావ్యాన్ని రచించినట్లుగా తెలుస్తుంది. అప్పటికే ఆంధ్రోద్యమంలో భాగంగా వెలువడిన రాయప్రోలు కవిత్వం తనకు మార్గదర్శకం అయిందని స్వయంగా విశ్వనాథవారు ఒక సందర్భంలో చెప్పుకున్నారు. "ఆంధ్ర ప్రశస్తి నేను వ్రాశానంటే ఆ ఉద్వేగం రాయప్రోలు వలన కలిగినదే 'నేను వచ్చానమ్మా వచ్చాను' అనే రాయప్రోలు రచన చూచిన తరువాత నేను వ్రాశాను. రాయప్రోలు నాకొకవిధంగా లక్ష్యభూతుడు. ఈనాడు వారి ముద్ర భావకవులలో అనేకుల్లో ఉంది" అని విశ్వనాథ చెప్పుకున్నాడు. ఆంధ్రోద్యమం, రాయప్రోలు కవిత్వం- ఇవి రెండూ ఆంధ్రప్రశస్తి రచనకు బాహ్య కారణాలు మాత్రమే. నిజానికి ఈ నేలతో ఈ గాలితో ఈ చరిత్రతో విశ్వనాథ జీవచైతన్యానికి గల అవినాభావ సంబంధమే ఆంధ్ర ప్రశస్తి రచనకు అసలు కారణమని చెప్పవచ్చు.

ఆంధ్ర చరిత్రలోని దేశ కాల ఖండములను ఆధారంగా చేసుకొని విశ్వనాథ చరిత్రకందని దేశ కాల వైభవములను శాశ్వతంగా మన కన్నుల ముందు నిలిపాడు. విశ్వనాథ చరిత్రను కాల్పనిక సాహిత్య ధర్మంతో మేళవించి

సామాజిక స్పృహతో సాంఘిక ప్రబోధం గావించాడు. ప్రత్యేక రాష్ట్రం కోసం పరితపిస్తున్న ఆంధ్రులకు మహాసామ్రాజ్య నిర్మాణ దక్షత, రాజ్య పరిరక్షణా పటిమ, మహాకావ్య సాధన, కర్తవ్యదీక్ష, ధర్మనిరతి, యుద్ధనీతి, కళాకౌశలం, సారస్వత ప్రీతి మొదలగు లక్షణాలు అవసరం. ఈ మహా లక్షణాలను మనిషి మనిషిలో ప్రోదిచేయడానికే ఆనాడు ఆంధ్ర ప్రశస్తి ఆవిర్భవించింది. పన్నెండు ఖండికలుగా రచించబడిన ఈ కావ్యంలో ఆంధ్ర సామ్రాజ్య నిర్మాత అయిన ఆంధ్ర విష్ణువు. శాతవాహన రాజులు శాతవాహనుడు, గౌతమీపుత్ర శాతకర్ణి; మాధవవర్మ, వేగిక్షేత్రం, ముఖలింగం, నన్నయభట్టు, ప్రోలరాజు, ప్రోలరాజు కథ, చంద్రవంక యుద్ధము, కొండవీటి పొగమబ్బులు, యమదంష్ట్రిక మొదలగునవి వర్ణింపబడ్డాయి. ఈ ఘట్టాలన్నీ ఆంధ్ర చరిత్రలో ప్రధానమైనవి కావు కొన్ని పురాణాలనుండి గ్రహించినవి కాగా, కొన్ని శాసనాల ఆధారంగా తీసుకున్నవి.

భీమేశ్వరం, కాళేశ్వరం, శ్రీశైలం- ఈ మూడు క్షేత్రముల చుట్టూ పెద్ద గోడ కట్టించి ఈ దేశానికి త్రిలింగ దేశమని నామకరణం చేసిన పుణ్యమూర్తి ఆంధ్ర మహావిష్ణువు. ఇతడు నిశంభుడను రాజును వధించి ఆంధ్ర సామ్రాజ్యాన్ని స్థాపించిన విధమును ''ఆంధ్ర మహావిష్ణువు'' అనే ఖండంలో విశ్వనాథవారు రమణీయంగా చిత్రించారు ఆంధ్ర రాజ్యమును పాలించిన మొట్టమొదటి రాజ వంశం శాతవాహన వంశం ఈ వంశకర్తయైన శాతవాహనుని పుట్టుకకు సంబంధించిన విషయాన్ని, దీపకర్ణి పుత్రవాత్సల్యాన్ని రెండవ ఖండికలో కవి చిత్రించాడు. ఆంధ్ర రాజుల ధైర్య సాహసాలను, పరాక్రమ విక్రమాన్ని ''గౌతమీపుత్ర శాతకర్ణి'' అనే ఖండికలో విశ్వనాథవారు అద్భుతంగా కొనియాడారు. ధర్మరక్షణ కోసం వంశోద్ధారకుడైన ఒక్కగా నొక్క పుత్రునికి మరణశిక్ష విధించిన ''మాధవవర్మ'' కథ చరిత్ర ప్రసిద్ధం కాకపోయినా ఆంధ్రుల ధర్మ నిరతిని, త్యాగశీలాన్ని చాటి చెప్పడానికి ఈ కథను స్వీకరించి అనల్ప శిల్ప చాతుర్యంతో రక్తి కట్టించాడు. అదేవిధంగా ఆంధ్రుల సారస్వతాభిలాషను 'నన్నయభట్టు' ఖండిక ద్వారా విశ్వనాథ తెలియజేశాడు. వేగిక్షేత్రము, ముఖలింగం, కొండవీటి పొగమబ్బులు మొదలగు ఖండికల్లో ఆనాటి ఆంధ్రదేశ దైన్యస్థితిని కవి హృదయవిదారకంగా చిత్రించాడు.

## కవితా వైభవం :

ఆంధ్ర పౌరుషంతో చిగురించిన విశ్వనాథ కవిత 'ఆంధ్రప్రశస్తి'లో పరిమళభరితంగా పుష్పించింది. అనంతరం కల్పవృక్షమై దేశము పట్టనంతగా ఎదిగి ఆంధ్ర సాహితీలోకానికి ఆలోచనామృత ఫలాలను అందించింది. విశ్వనాథ కవితా వ్యక్తిత్వం తొలిసారిగా ''ఆంధ్రప్రశస్తి''లోనే స్థిరధర్మాన్ని ఏర్పరచుకుంది. శాబ్దిక మహేంద్రజాలంలో, సమాస గ్రథనంలో, పలుకుబడిలో, సంభాషణా చాతుర్యంలో, వర్ణనావైదుష్యంలో, ఊహావైభవంలో విశ్వనాథ కవిత్వ పటుత్వం సర్వత్రా వ్యక్తమవుతుంది. ఆ దశాబ్ది ధర్మమైన కాల్పనిక సౌందర్యం ఆంధ్రప్రశస్తి కావ్యం నిండా పరుచుకొన్నట్లు కనిపిస్తుంది.

మా పూర్వాంధ్ర ధరాధినాయక కథా మంజూషికా రత్నగా
థా పద్యావలి పేరిహారి సుమనోదామంబు మాధ్వీకభా
షా వ్యక్తంబు మహాప్రబంధరచనా సౌందర్యపున్ వాసనల్
తీపై క్రమ్మగ నాంధ్ర సోదరుల కందిత్తున్ గళాంకమ్ముగన్.

నిశితంగా పరిశీలిస్తే ఈ పద్యం నాలుగు పాదాల్లో నాలుగు అంశాలు మనకు కనబడతాయి. 1. కావ్యవస్తువు, 2 కవితాధర్మం, 3. కావ్యప్రయోజనం 4. కవి వ్యక్తిత్వం. పూర్వాంధ్ర రాజుల కథాభరితమైన మంజూష నుండి రత్న గాథలను వెలికితీసి, పద్యావలితో ఒక మనోజ్ఞమైన దామమును తీర్చి మాధ్వీకం వంటి భాషతో మహాప్రబంధ రచనా సౌందర్యం తొణికిసలాడగా ఆంధ్రప్రశస్తిని రచిస్తున్నానని కవి సగర్వంగా చెబుతున్నాడు. అంటే, ఇక్కడ కావ్యవస్తువును కవి స్పష్టపరుస్తున్నాడు. విశ్వనాథ చరిత్ర అనే మంజూషను తెరిచి అందులోని రత్నాల వంటి కథలను ఎన్నుకొని వాటితో ఒక మహాకావ్యాన్ని నిర్మించాడు. చరిత్రను కావ్యంగా మలిచే విధానాన్ని ఇక్కడ కవి చెప్పకచెబుతున్నాడు. తన కావ్యంలో కనబడే కవితాధర్మాన్ని "మహాప్రబంధ రచనా సౌందర్యపున్ వాసనల్" అనే పద్యభాగం ద్వారా ధ్వనింపజేశాడు. సాధారణంగా ప్రబంధ రచనా సౌందర్యం అనగానే వర్ణనా బాహుళ్యం, రీతిప్రాధాన్యం గుర్తుకువస్తాయి. ఈ రెండు లక్షణాలు తలపునకు వచ్చే విధంగా తన కవిత సాగుతుందని కవి ముందుగానే చెబుతున్నాడు. "మాధ్వీకభాషా వ్యక్తంబు" అనడం ద్వారా తెలుగు భాషా 'మాధుర్యం', వ్యక్తమవుతుంది. దండలో దారంలాగా ఈ పద్యంలో విశ్వనాథవారి రాష్ట్రాభిమానం వ్యక్తమవుతుంది.

జో! సామీ మము గన్న యేలిక! యిదో జోహారు! జోహారు! మా
శ్రీశైలంబున బెద్దకొండదరి గర్వీభూత చేతస్కుడై
యీ శారాధనబద్ధదోర్బలుడు దైత్యేంద్రుండు లేడా! బుభు
క్షా సంపూర్తికి నోచుకోముగద! కక్కా! వాని దుశ్చేష్టలన్.

ఇది 'ఆంధ్ర మహావిష్ణువు' అనే మొదటి ఖండికలోని మొదటి పద్యం. నిశంభుదన్ రాక్షసుని బాధలు భరించలేక కోయజాతి వారు రాజుతో మొర పెట్టుకునే సందర్భంలోనిదీ పద్యం. ఇష్టదేవతా ప్రార్థనతో ఏ కావ్యమైనా మొదలు కావడం ఒక సంప్రదాయం. ఈ కావ్య మర్యాదను కథా సందర్భంతో మేళవించి విశ్వనాథవారు వినూతన శిల్పాన్ని ఆవిష్కరించారు. "జో! సామి!" అంటూ ఆంధ్రుల ఇష్టదైవమైన ఆంధ్ర విష్ణువును స్తుతిస్తున్నాడు కవి. అంతే కాకుండా ఈ పద్యంలో కోయల సహజ సంభాషణా విధానం, చక్కగా వ్యక్త మయింది "బుభుక్షా సంపూర్తికి" నోచుకోని కోయలు పారతంత్ర్యపాలనలో చిక్కుకున్న భారతీయులుగా, గర్వీభూత చేతస్కుడైన దైత్యేంద్రుడు బ్రిటిష్ సామ్రాజ్యనేతగా మనకు స్ఫురిస్తారు.

'మాధవవర్మ' అనే ఖండికలో విశ్వనాథ కవితా విశ్వరూపం కనబడు తుంది. కథా గమనంలో, పద్యక్రమంలో విశ్వనాథ అపురూపమైన శిల్పాన్ని పాటించాడు. మాధవవర్మ కుమారుని రథం క్రింద పడి ఒక వ్యక్తి మరణిస్తాడు. అతని తల్లి రాజసభకు వచ్చి దుఃఖంతో వస్థితిని వివరించగా న్యాయాధికారుల సలహామేరకు కన్న కొడుకుకు మరణశిక్ష విధిస్తాడు. పుత్రుని ప్రాణం కంటే ధర్మం వేయిరెట్లు గొప్పదనే సందేశాన్ని కవి ఈ ఖండిక ద్వారా చాటిచెప్పాడు.

విజయవాటిక కోట వీధిలో మాధవ వర్మ కుమారుడు రథమెక్కి వాహ్యాళి పోయిన సందర్భంలోని పద్యం విశ్వనాథ కవితా వైభవానికి నిదర్శనంగా కన బడుతుంది.

''గ్రీష్మవేళానిరాకృతి మేఘ గర్భఘూ
ర్ణితవై భరీ నేమిని స్వనములు
చలితశైలాగ్ర నిర్ఝరిణీ విధా భద్ర
జాత్యత్వ దివ్య హేషాస్వనములు
కుద్దాల శాతోగ్ర ఖురవిఘట్టిత ధరా
చటులోద్ధత పరాగ సంచయములు
.... ..............................................''

ఈ పద్యంలో రథం వచ్చే సందర్భంలో వీధుల్లో కనపడే అల్లకల్లోల దృశ్యాన్ని, వినపడే వివిధ శబ్దధ్వనులను అత్యంత ఔచితీవంతంగా విశ్వనాథ వర్ణించాడు. వర్ణన ప్రాధాన్యం గల ఈ పద్యం ప్రబంధ శైలిలో ఉంటుంది. ఒక ఉపద్రవం జరగబోయే ముందు ఉండే కోలాహలం వాతావరణాన్ని కవి ఇక్కడ అద్భుతంగా సృష్టించాడు. రథచక్రాల కిందపడి ఒక మనిషి మరణించాడు. అందరు ఎవరిదారిన వారు వెళ్ళిపోయారు రక్తపుమడుగులో తడిసిపోయిన శవం దీనంగా రోడ్డుమీద పడి ఉంది. ఈ సందర్భంలో విశ్వనాథ చేసిన సూర్యాస్తమయ వర్ణన మిక్కిలి రమణీయంగా ఉంది. ఇక్కడ కథా సందర్భం, కవితా ధర్మం- ఇవి రెండూ పడుగు పేకల్లా కలిసిపోయాయి.

"అంతలో లోకబాంధవు డస్తమించె
అస్తగిరి గహ్వరాంత నిత్య స్థితాంధ
కారకృష్ణ వర్ణాహి సంచార భయద
మై కకుప్పులు శ్యామలమ్మైతనర్చె."

అప్పుడే సూర్యుడస్తమించగా పడమటి కొండగుహల్లో అంధకారం నల్లని పాములా సంచరిస్తుందని ఇక్కడ భావన. జరిగిన ఘోరవిపత్తు చూడలేక సూర్యుడు అస్తమించినట్లు స్ఫురిస్తుంది. నల్లని పాము మృత్యువుని ధ్వనింపజేస్తుండగా, అస్తమిస్తున్న సూర్యుడు రక్తపుమడుగులో పడి ఉన్న మనిషిలాగా ఉన్నాడు. దిక్కులన్నీ విషాద నిశీధితో అలముతున్నాయి. ఈ సూర్యాస్తమయ వర్ణన విశ్వనాథ ప్రతిభకు మణి దర్పణంగా భాసిస్తుంది. వస్తుతః సుందరంగా ప్రధానకథ ప్రాణ చైతన్యానికి ప్రతిస్పందించేట్లుగా కనబడుతున్న ఈ వర్ణన సందర్భ శుద్ధిని కూడా కలిగియుండి ప్రకరణ వక్రతను తెలియజేస్తుంది. ''ప్రోలరాజు వధ'' అనే ఖండికలో ''అరద్దేశ్వర తాండవ భ్రమణ'' అనే సూర్యాస్తమయ వర్ణన, 'యమదంష్ట్రిక'లోని చంద్రోదయ వర్ణనలు కూడ మరింత ఔచిత్యవంతంగా సాగాయి.

విశ్వనాథ కవితలో ఊహా చమత్కారం, భావనాశక్తి ఒకదానికొకటి పోటీపడుతుంటాయి. కవితలోని వర్ణనాంశం ప్రతీకద్వారా కాని, పదచిత్రం ద్వారా కాని, అలంకారంద్వారా కాని పఠితచేత అనుభవింపజేయడానికి అనుగుణమైన అభివ్యక్తి ఆయన కవితలో కనబడుతుంది. వేగీ రాజ్యపు బాలురు

బాల్య క్రీడాభ్యాసంద్వారానే యుద్ధంలోని మెళకువలను నేర్చుకుంటున్నారన్న భావాన్ని విశ్వనాథ అద్భుతమైన భావనాశక్తిద్వారా తెలియజేస్తున్నాడు:

"వేగి రాజ్యపు పల్లె వీథులఁ జెడుగుళ్ళ
    రిపులఁ గవ్వించు నేరుపులు తెలిసి
ఎగురు గోడీబిళ్ళ సొగసులో రిపుశిర
    స్సులు బంతులాడు శిక్షలకు దాని
చెట్టాణి యుప్పు తెచ్చిననాడే శాత్రవ
    వ్యూహముల్ పగిలించు నొరపు గఱచి
కోతికొమ్మచ్చిలోఁ గోటగోడల కెగ
    బాకి లంఘించు చంక్రమణ మెఱిగి
.... .... .... .... .... "

ఈ పద్యంలో విశ్వనాథ భావనాపటిమ వేయిరేకుల పద్మంలా పరిమళిస్తుంది. వేగిదేశపు బాలురు గ్రామీణ బాల్య క్రీడలలోని లక్షణాల ద్వారా యుద్ధక్రీడా నైపుణ్యాన్ని నేర్చుకుంటున్నారన్న భావాన్ని ఇక్కడ చక్కగా పొందుపరిచాడు. చెడుగుడు ఆటలో ఆటగాడికి ప్రత్యర్థులను కవ్వించే నేర్పు ఎంతో అవసరం. ఈ ఆటద్వారా శత్రువులను కవ్వించే విధానాన్ని బాలురు నేర్చుకుంటూన్నారని కవి చెబుతున్నాడు. అదేవిధంగా 'బిళ్ళంగోడు' ఆటలో కర్రతో బిళ్ళను కొట్టినట్లుగా భవిష్యత్తులో కత్తితో శత్రువుల తలలను ఎగురగొట్టాలని బాలురు ముందే గ్రహిస్తున్నట్లుగా కవి వర్ణించాడు. బాలురు యుద్ధమెళకువలను ఏవిధంగా నేర్చుకుంటున్నారో చెప్పడానికి కవి ఇక్కడ బాల్య క్రీడలను చాకచక్యంగా ఉపయోగించుకున్నాడు.

నిమగ్నత, తీక్ష్ణత, విశ్వనాథ కవిత్వంలో ఎక్కువగా కనిపిస్తాయి. భావానికి కవికి అభేదం ఏర్పడితే కవితకు పరిణతి ఏర్పడుతుంది. అప్పుడే కవి మిక్కిలి ఆవేశానికి గురియై అపరిచితమైన ఆవేదనను కవితా రూపంలో వ్యక్తం చేస్తాడు. అప్పుడే పాఠకులు కళా జగత్తులో నిమగ్నులవుతారు. చారిత్రక వాతావరణంతో విశ్వనాథ ఏవిధంగా అద్వైతస్థితిని అనుభవించాడో 'ఆంధ్రప్రశస్తి' కావ్యంలో స్పష్టంగా తెలుస్తుంది.

''నా ప్రాణములకును నీ పొగమబ్బుల
కేమి సంబంధమో! యేను గూడ
పొగమబ్బునై కొండచిగురు కోనలపైన
బురుజులపైని కొమ్మలకు పైని
వ్రాలిపోనో మధ్య వ్రీలిపోనో నేల
రాలిపోనో గాలి తేలిపోనో
.... .... .... .... .... ''

ఈ పద్యంలో విశ్వనాథ అచ్చమైన భావకవిగా కనబడతాడు. ప్రకృతిలో అణువణువులో కలసిపోయి జన్మభూమితో తనకు ఉన్న జన్మజన్మల అనుబంధాన్ని మననం చేసుకొని ఒక్కొక్కసారి విశ్వనాథ మౌనంగా రోదిస్తాడు.

భావానికి ఉచితమైన భాషను జోడించి మహాకవి కావ్యానికి ఉత్కృష్టతను సాధిస్తాడు. ఉత్తమ కవికి భావంపై ఎంత గౌరవమో భాషపై కూడా అంతే గౌరవముంటుంది. పరమోత్కృష్టమైన భావాన్ని ఆవిష్కరించడానికి కవి దానికి అనుగుణమైన భాషను ప్రయోగిస్తాడు. ఈ లక్షణం ఆంధ్రప్రశస్తి కావ్యంలో అక్కడక్కడా కనబడుతుంది.

ఆ రబ్ధేశ్వర తాండవభ్రమణ పాదాంభోరుహాస్రస్తమం
జీరంబో గగనేందిరా కరపత్రచ్ఛి కందుకంబో, పున
స్స్వారాజ్యచ్యుత భుక్తపుణ్యమగు నక్షత్రంబొనాఁ బశ్చిమా
శారత్నాకరమందుఁ గ్రుంకెను వివస్వద్బింబ మల్లంతలో.

'ప్రోలరాజు' అనే ఖండికలో ప్రతాపరుద్రుడు శివధ్యాన నిమగ్నుడై యున్నపుడు అస్తమిస్తున్న సూర్యుడు తాండవం చేస్తున్న శివునిపాద మంజీరంలా ఉన్నాడని, పడమటిదిక్కు అనే సముద్రంలో సూర్యబింబం పడిపోయిందని చెప్పడం విశ్వనాథ వర్ణనావైదుష్యానికి ప్రబల తార్కాణం.

ఈ కావ్యంలో అక్కడక్కడ దీర్ఘ సమాసములు, సంప్రదాయ సిద్ధమైన అన్వయ కాఠిన్యం కనబడతాయి. "గర్భంబందునన.... ......" "కృతాప్ల కాశపు పాలవెల్లి...........'' మొదలగు పద్యాలలో విశ్వనాథ క్లిష్టమైన ప్రాస విన్యాసాలను అతి సులువుగా చిత్రించాడు. ఒక వస్తువును గాని, ఒక దృశ్యమును గాని విశ్వనాథ చాలా తీవ్రంగా దర్శిస్తాడు. ఒక్కొక్కసారి ఆ దర్శనం

సౌందర్యపు మేరలు దాటిపోతుంది. ఒకదానిని వర్ణిస్తే పాఠకుడు జీవితంలో మరచిపోలేనివిధంగా, వర్ణించాలనే తపన విశ్వనాథ కవిత్వంనిండా కనబడు తుంది. ఆంధ్ర ప్రశస్తిలో ఎన్నుకున్న ప్రతి అంశాన్ని ఆత్మీయభావంతో, కాల్పనిక కవితాచైతన్యంతో చిత్రించాడు.

## విశ్వనాథ వ్యక్తిత్వం :

ఆంధ్రప్రశస్తి కావ్యంలోనే విశ్వనాథ వ్యక్తిత్వం పరిపూర్ణంగా వికసించి నట్లు కనబడుతుంది. ఈ దేశ సంప్రదాయమన్నా, సంస్కృతి అన్నా, ఈ దేశ చరిత్ర అన్నా విశ్వనాథ హృదయం వెన్నముద్దలా నిలువెల్లా కరిగి నీరవుతుంది. ఆంధ్ర చరిత్రకు అక్షర దర్పణమైన 'ఆంధ్రప్రశస్తి' కావ్యాన్ని చారిత్రక పరి శోధనకు ధారపోసిన సన్మిత్రుడు మల్లంపల్లి సోమశేఖర శర్మకు అంకితమివ్వడం ఆయన స్నేహశీలానికి నిలువెత్తు నిదర్శనం. 'నతి' పద్యాలలో విశ్వనాథ గురు భక్తి, వినయశీలం కనబడతాయి. 'మాధవ వర్మ' ఖండిక పద్యాలలో విశ్వనాథ ధర్మనిరతి తెలుస్తుంది.

ఇమ్మగఁ గాకుళమ్ము మొదలీ వటకుంగల యాంధ్ర పూర్వ రా
జ్యమ్ముల పేరు చెప్పిన హృదంతర మేలొ చలించిపోవు. నా
ర్ద్రమ్మగు చిత్తవృత్తుల పురాభవ నిర్ణయమేని నెన్నిజ
న్మమ్ములుగాగ నీ తనువునన్ ప్రవహించునొ యాంధ్ర రక్తముల్—

ఈ పద్యంలో విశ్వనాథవారు దేశభక్తి కట్టలు తెంచుకొని ప్రవహిస్తు న్నట్లుగా కనబడుతుంది. ''ఆంధ్ర రక్తముల్'' అనే ప్రయోగం ఉదాత్తమైనది. కవి శరీరం నిండా జన్మజన్మల నుండి ఆంధ్ర రక్తమే ప్రవహిస్తుంది. ''శిల వోలెన్ గదలంగలేక....'', ''నా హృదయ సీమలో....'' ''పాడిన గీతమే మరల బాడెద ...'' మొదలగు పద్యాలల్లో మహాకవిలో దాగుండే సున్నితత్వం (సెన్సి టివ్‌టి) కనబడుతుంది.

''ఈ పొంగెత్తిన వంశధార మఱి యిట్లే పొంగులై పొంగులై
నా ప్రాణములు దేహమీ జలములోనన్ ముంచుకోనిమ్ము....''

ఈ పద్యంలో విశ్వనాథ అపూర్వ రసావేశిలా దర్శనమిస్తాడు. అసలు ఇంత సున్నితమైన హృదయం కలవాడు ఈ ప్రపంచంలో ఎలా బతుకుతున్నా డని అనుమానం వస్తుంది.

''తెలుగు నదులెల్ల పొంగెత్తి ప్రళయ వారి
కెరలిపడి తెన్గునేల ముగించనిమ్ము
నేటితో నస్వతంత్రతా నియతమైన
యా బ్రతుకు తెన్గువారు భరించలేరు''

బ్రిటిష్ పాలనలో తెలుగు ప్రజల్లో కలుగుతున్న ఈ స్పృహను, చైతన్యాన్ని గుర్తించి, దాన్ని పెంపొందించాలని విశ్వనాథ ఆంధ్ర ప్రశస్తిని రచించారు.

ప్రతి వ్యక్తికి తన కుటుంబం, తన ప్రాంతం, తన భాషపట్ల అపారమైన అభిమానం ఉంటుంది. దీని ఈ అభిమానంనుండి స్ఫూర్తిపొందే లక్షణం లేకపోతే ఎవరూ ఏమీ సాధించలేరు. దేశాన్ని, చరిత్రను సంస్కృతిని తిట్టుకుంటూ చీకట్లో రాళ్ళువేసుకుంటూ కూర్చుంటే ఏమీ ప్రయోజనంలేదు. ఆత్మవిశ్వాసంతో చరిత్రను అర్థం చేసుకొని దేశ గౌరవాన్ని కాపాడే ప్రయత్నంలో ప్రతి ఒక్కరూ పాలు పంచుకోవాలనే మహత్తర సందేశాన్ని 'ఆంధ్ర ప్రశస్తి' కావ్యం ద్వారా విశ్వనాథ మనకందించారు.

ఆంధ్ర ప్రశస్తి కావ్యం చూడటానికి ఆంధ్రోద్యమంలో భాగమైనా నిజానికి ఇది జాతీయోద్యమంలో అంతర్భాగమే. జాతీయభావం నిలదొక్కుకొని స్థిరపడటానికి ఆరోగ్యకరమైన ప్రాంతీయభావం కూడా ఎంతగానో అవసరం. ఈ అవసరాన్ని గుర్తించే విశ్వనాథ ఈ కావ్యరచన చేశాడు. "నిజానికి శిల్పం కాని, సాహిత్యం కాని జాతీయమై యుండవలయును. విజాతీయమై యుండరాదు వ్రాసినవానికి ముక్తి, చదివినవానికి రక్తి ముక్తి. ఎంత సముద్రముపై ఎగిరినను పక్షి రాత్రికి గూటికి చేరును. ఇది జాతీయత. ఇది సంప్రదాయం" అని చెప్పిన విశ్వనాథ తన ఆలోచనలను ఆంధ్రప్రశస్తిలోనే ఆచరించి చూపించాడు. ఉత్తమ జాతీయతకు ఉజ్జ్వలరూపమైన 'ఆంధ్రప్రశస్తి' ఆధునిక తెలుగు సాహిత్యంలో ఆచంద్రతారార్కం అలరారుతూ తెలుగు బిడ్డల గొంతులో అనునిత్యం ప్రతిధ్వనిస్తూనే ఉంటుంది. *

# తెలుగు ఋతువులు

—డా॥ మసన చెన్నప్ప

ఋతువు కాలప్రమాణాన్ని సూచించే పదం. ఇది మనస్సును మేధను ప్రేరేపిస్తుంది. జీవుని అంతఃకరణంలో దాగుకొని ఉన్న భావాలను ఉద్బుద్ధం చేస్తుంది. ప్రకృతికి జీవునికిగల సంబంధాన్ని నిర్ణయిస్తుంది. ప్రత్యక్షంగాను, పరోక్షంగాను, మానవ జీవితాన్ని ప్రభావితం చేస్తుంది. చేతనాచేతనమైన ప్రకృతిలో జరిగే మార్పులకు ఋతువే మూలకారణం.

ఋతు వర్ణనలనగానే కాళిదాసు జ్ఞాపకం వస్తాడు. అతని 'ఋతు సంహారం' జ్ఞాపకం వస్తుంది. తెలుగులో నన్నయ వసంతాన్ని గూర్చి 'కమ్మని లతాంతములకు మ్రొకసివచ్చు మధుపమ్ముల సంగీత నినదంబులెసగెన్' అని చెప్పిన పద్యమూ శరత్తును గూర్చి 'శారదరాత్రులు జ్జ్వల లసత్తర తారక హార పంక్తులన్' అని చెప్పిన పద్యమూ ఆణిముత్యాలు.

**కవి-ఋషి :**

కాళిదాసు విశ్వనాథకు ఋతు కావ్యరచనకు మార్గదర్శకుడైనప్పటికీ వర్ణనల విషయంలో మాత్రం ఎవరి మార్గం వారిదే. విశ్వనాథ రచించిన 'ఋతు సంహార' నామాంతరంగల 'తెలుగు ఋతువులు' కావ్యాన్ని చదువుతూవుంటే ఒక తెలుగు నేలమీద మాత్రమే ఆరు ఋతువులు చక్కగా అవతరిస్తాయన్న భావన కలుగుతుంది. కాళిదాసు గ్రీష్మారంభంతో కావ్యారంభంచేయగా విశ్వనాథ 'వసంతం'తో కావ్యారంభం చేశాడు. వసంతం అందరికీ అత్యంత ప్రీతిపాత్ర మైనది కావడమే దానికి కారణం. ప్రకృతిని గూర్చి తెలియనివారికి కృతిని రచించే అధికారంలేదన్న విషయం ఈ కావ్య పఠనంవల్ల ఏర్పడుతుంది.

విశ్వనాథ ఆయా ఋతువుల్లో ప్రజల జీవనవిధానాన్ని, ఆచార వ్యవహా రాలను కళ్ళకు కట్టినట్లుగా చిత్రించాడు. వర్షాది ఋతువుల్లో గృహస్థుల కష్టా

లను, రైతుల కడగండ్లను, జంతువుల ఇబ్బందులను వర్ణిస్తూనే మన పండుగలను గూర్చి, పెళ్ళి ఆచారాలను గూర్చి, ధార్మిక జీవన విధానాన్ని గూర్చి ఎన్నో విశేషాలను తెలియజేశాడు.

తెలుగు నేలమీది పల్లె ప్రకృతిని సర్వాంగ సుందరంగా వర్ణించే కావ్యం ఋతు సంహారం విశ్వనాథవారే ప్రస్తావించినట్లు "నా చిన్ననాటి మా యూరిలోని ప్రకృతిశోభ నా గ్రంథములనిండ వ్రాసితి''ననుట సత్యము. తెలుగువారి జీవన విధానంతో, ప్రకృతితో తాదాత్మ్యం చెంది రచించినట్లుగా 'ఋతు సంహారం' కనిపిస్తుంది. అడుగడుగున అలంకారాలతో, చక్కని జాతీయాలతో, సామెతలతో ఈ కావ్యం మనలను ఎంతైనా అలరిస్తుంది. కాని ప్రతిభతో పాటు గొప్ప పాండిత్యం కలిగిన విశ్వనాథ ఋతుసంహార కావ్యాన్ని చదివి అర్థం చేసుకోవడానికి మనకున్న శక్తి సరిపోదు. ఋతుసంహారం కథారహితమైన వస్తువు గల ఒక ప్రౌఢ కావ్యం. ఒక్కొక్క ఋతువు వర్ణింపబడిన తీరు చూస్తే కవికి గల పరిజ్ఞానంతో పాటు ప్రకృతి పరిశీలనా పాటవం అర్థమవుతుంది. అజాగ్రత్తగా చదివితే ''ఋతుసంహారం'' ఋతుసంహారమే అవుతుంది. ఒక్కో పద్యాన్ని పలుమార్లు చదివితేనే అందలి అందచందాలు మనకు అందుతాయి.

ఈ కావ్యం సంస్కృత పదభూయిష్ఠమైనప్పటికీ, తెలుగు పలుకుబడులకు, లోకోక్తులకు కొదవలేదు. పరశురామ ప్రీతి, గుండియలు జారు, చెటమటించు, ఉదకబెట్టు మొదలైన పలుకుబడులు, "వెన్నగొట్టిన వారి వెసరాలగొట్టు" లాంటి సామెతలు మననెంతగానో మురిపిస్తాయి. ప్రకృతి వర్ణనలలో వందలాది సంవత్సరాలనుండి వస్తున్న కవి సమయాల నుండి బయటపడి, ఆయా ఋతువుల ప్రభావంతో భాసిల్లే పల్లెజీవితాన్ని కేవలం అరవై సీసపద్యాలలో ఒక స్వతంత్ర కావ్యంగా అల్లిన విశ్వనాథ ఋతుకావ్యరచనా విషయంలో ఎందరో నవ్యకవులకు మార్గదర్శకుడైనాడు. ఋతుప్రబంధం (పైడిపాటి సుబ్బరామశాస్త్రి), ఋతుచక్రం (సి.నా రె.), ఋతుఘోష (శేషేంద్రశర్మ), ఋతువిలాసము (అద్దేపల్లి లక్ష్మణస్వామి), ఋతుపవనము (బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి), ఋతురాగం (జి బాపురెడ్డి) మొదలైన తెలుగు ఋతుకావ్యాల అవతరణకు స్ఫూర్తినిచ్చినది విశ్వనాథవారే. ఆధునికుల్లో విశేషంగా ఋతువర్ణనలు చేసినవారిలో వారే అగ్రగణ్యులు.

## వసంతర్తువు :

విశ్వనాథ కావ్యాన్ని వసంతోదయంతో ఆరంభించాడు. ప్రియురాలి ఎద చెమర్చడం, బాలికల వాలుజడల్లో మల్లె మొగ్గలు కనిపించడం, వేప కొమ్మ చిగురించడం, కోకిల కుహూ కుహూ రావాలు వినిపించడం మొదలైన వాటివల్ల వసంతం వస్తున్న ఊహ విశ్వనాథకు కలిగింది.

కొత్తగా జతకట్టిన కోకిల పెంటి కోసం వసంత వనాంత వీధిలో యౌవ నోద్వేగంతో కనిపించిన మామిడిచిగుళ్ళను ముక్కుతో చిదిమింది తియ్యమామిడి విరుగగాచిన పండ్ల బరువుతో వంగి నిండు చూలాలుగా కనిపించింది. కోకిల భార్యా ప్రవాసివోలె గొంతెత్తి విరహగీతం పాడింది. తుమ్మెద లోభివానిలాగ ఇతరుల కోసం ప్రతి పువ్వు దగ్గరికీ వెళ్ళి తేనెబొట్లు సేకరించింది. ఉడుత కొబ్బరి మొవ్వు గెలను తొలిచి కలాలిలాగ అందులోని కల్లు రుచికి మరిగింది - అంటూ కవి చేసిన వర్ణన అలంకార సమన్వితంగా ఉండి మన మనస్సుల నల రిస్తుంది. కవి మల్లెలను తెలుగు రసిక లోకాన్ని మురిపించే కావ్యాలతో పోల్చిన తీరు హృద్యమైంది. ''సుధాంశు భాస్వన్ మనోహర విలాసమ్ములుగా, విచిత్ర కేళీ ప్రశస్తి రహః కళాపూర్ణోదయమ్ములుగా, కృష్ణ పదాగ్రభక్తి సుగృహీ తాముక్తమాల్యదాచ్ఛ ప్రౌఢ మధువులుగా, వర్ణనాత్త శయ్యా హేతు పాండురంగ మహత్తులుగా, ప్రియలు, ప్రియులు కూడు మనుచరిత్రలుగా మల్లెలను అభివర్ణించ డంలో కవికి గల శ్లేషాలంకార నైపుణ్యంతో పాటు ఆయా తెలుగు కావ్యాలమీద గల ప్రత్యేకమైన గౌరవం తేటతెల్లమవుతుంది.

## గ్రీష్మర్తువు :

గ్రీష్ముడు జగాన్ని ఉదకబెట్టి ఏలుబడి సాధిస్తాడని, దారిలో దప్పిగొన్న వారిని రొప్పిస్తూ, ఎండమావిలో నీళ్ళున్నాయన్న భ్రమను కలిగిస్తూ, ఆశతో ఈడ్చుకొని వెళ్ళి నీళ్ళు లభించని కారణంగా నాలుకను పిడుచ కట్టిస్తాడని విశ్వ నాథ చేసిన గ్రీష్మ వర్ణన చాలా సహజమైనది. ఎండవేడిమికి చిన్న చిన్న ప్రాణులు పొందే అవస్థలను కవి కళ్ళకు కట్టినట్లు వర్ణించాడు. కాకి గొంతుక్రిందగల ఉండ గుడగుడలాడగా సగం నోరు తెరుచుకొని పారడం; ప్రక్కనుంచే పోతున్న చీమల బారును చూడకుండ తొండ తలవాల్చుకొని వెళ్ళడం; పందిరి కింద కావలా కాసే కుక్క మాటిమాటికి లేస్తూ, పడుకుంటూ, నాలుక చాస్తూ, రొప్పుతూ, చొంగ కార్చడం; తనముందే ఉన్న గడ్డి పరకల్ని తినక ఒకచోట నిలువలేక దూడ అడలిపోవడం మొదలైన అంశాలు విశ్వనాథ సహజ పరిశీల నకు అద్దం పట్టాయి. వేసవిలో విపరీతమైన వేడిమివల్ల ఎన్నో వస్తువులు తగుల బడిపోతాయి. దీన్ని కవి ఎలా వర్ణించాడో గమనించండి:

"దణ్ణెమ్ము పైని వస్త్రము కొంగుజారి క్రిం
దను నంటు కొన్నది దాలి సెగకు
దొడ్డిలో పొయ్యార్పి, తొలగ, నెక్కడ రవ్వ
మిగిలి, పెన్గాలికి రగిలి యెగిరె
దూలమ్మునకు త్రాట వ్రేలనైన పఱపు
కట్టునులక - దివ్వె ముట్టుకొనియె
చిదుకుల మంటబోసిన దృష్టిలీని, మి
ల్మిల్ల పేలి చూరెక్కె మిరప తొడిమ
పురము, పేట, పల్లె పరశురామప్రీతి
కాదిహేతువులుగ నాడుకొనిరి
నిందలేక యుంద బొందెపోదన్నట్లు
యముని వోని గ్రీష్మునరయలేక— పుట. 11.

ఆకాశం, భూమి అగ్నిపత్రం రాసుకొన్నట్లుగా సుడిగాలిమన్ను రేగిం దనీ, అప్పులతో మొదట ఆడి ఆ తర్వాత చలికిలబడినట్లుగా కాల్వలూ, చెరువులూ క్రమంగా ఉండి పోయాయనీ చెబుతూ - ఉదయం మన ఒడలు చితచితలాడినట్లుంటే మధ్యాహ్నం సూర్యుడు చేతులతో తాకినట్లుంటుందనీ, ఇక సాయంత్రం ఎదురెండవల్ల కొట్టిన వడ 'గూబగుయ్యి'మని పిస్తుందని విశ్వనాథ జీవితానుభవాన్ని తెలియజేశాడు ఎండ మావులు నాల్కలెండి చచ్చే ప్రాణుల నేత్రాలకు నీరాజనం పట్టినట్లున్నాయనీ, తాపం అనుభవించడానికి ఐదు ప్రాణాలు చాలవన్నట్లు ఆరవ ప్రాణంగా వడగాలి దాపురించిందని కవి తన అసహనాన్ని ప్రకటించినాడు. ఎండకాలంలో మబ్బు కనిపించదు. ఒకవేళ కనిపించినా మబ్బు చాటు ఎండ 'అత్తెసరు పెట్టినట్లు'oదని కవి చమత్కరించాడు.

## వర్షర్తువు :

గ్రీష్మతప్తులైన ప్రజల తాప నివారణార్థం ఆకాశంలో మేఘాలు ముసురుకొని వచ్చి తెలుగు నేలను ముట్టడించాయని కవి వర్షారంభాన్ని సూచించాడు. ఇంద్రధనుస్సు పులితోక లాగా ఉందనీ, కుక్కగొడుగులు భూమాత కాన్పుకు తాంబూలం కోసం కాచుగా ఉద్భవించాయనీ, పొట్ల, చిక్కుడు, బీర తీగల అకుంరలో ఆరుద్ర పురుగులు పారాడాయనీ, అంతకంతకు చేతికందినట్లు బావిలో

నీళ్ళు పెల్లుబికి పైకివచ్చాయనీ, బాలల హృదయాలకు ఆనందం హెచ్చిందనీ, తెలుగు బాలలు వానలోకాల నుండి వచ్చిన దేవతల్లాగా ప్రకాశిస్తున్నారనీ, బాల బాలికలు ఎండ, వాన కలిసి రావడం చూసి 'వానవల్లప్పలో' అంటూ కుక్క నక్కల పెళ్ళిళ్ళు చేస్తారని కవి అభివర్ణించాడు.

వర్షఋతువులో తరుచుగా ఆకాశం మేఘావృతం అవుతుంది. దీన్ని కవి వెన్నగొట్టినవారిని రాళ్ళతో గొట్టినట్లు మేఘం సూర్యునికి అడ్డం వచ్చిందని అన్నారు. నిజానికి సూర్యుడు భూమిలోని జలాన్ని ఆవిరి రూపంలో గ్రహించి తిరిగి మేఘాల రూపంలో మనకే ఆ నీటిని అందిస్తాడు. అలాంటి సూర్యునికే అడ్డంగా మేఘాలు రావడంతో కవి బాధపడ్డాడు. ఇట్లే ముందు వచ్చిన చెవుల కంటె వెనుక వచ్చిన కొమ్ములు వాడి అన్నట్లు వరికి కలుపు అధికమైందని లోకోక్తితో చమత్కరించాడు. ఒక్కొక్కసారి మేఘం గర్జిస్తుంది కాని కురవదు. దీన్ని కవి మొఱిగే కుక్క కరవదు కదా! అంటాడు. వర్షాకాలంలో సూర్యుడు కాంతపుట్టినింటి సిరెల్ల త్రాగి ముగుదతమ్మికి కన్పడడానికే ముఖం వాచాడని చెప్పడం విశ్వనాథ కవితా ప్రౌఢికి ఒక ఉదాహరణ.

వర్షానికి తాటితోపులు మొగలుల రాతిబొమ్మలవలె తల లెగదువ్వుకొన్నట్లున్నాయనీ, ముఖం మీద కొరడా ఝుళిపించినట్లుగా మెఱుపులున్నాయనీ, మాధుర్యదేవత మరణ వేదనతో మూల్గినట్లు బావురుకప్ప లఱుస్తున్నాయనీ, మేఘాలలో బరువెక్కిన మిన్ను ఉఱుములతో, పిడుగులతో నేల కూలిందనీ, సూర్యబింబం బాగా పండిన తాడిపండులా ప్రొద్దుటివూట కనిపిస్తుందని చేసిన వర్ణన కవి ప్రతిభను తెలుపుతుంది

## శరదృతువు :

శరదృతువు తెలుగు నేలమీదికి రెక్కలు చాచి, గాలిలో తేలిపోయే హంసలాగా వచ్చిందట. ఇంకా తెల్లని దూదిలాంటి వస్త్రాలు ధరించి నృత్యంచేసే టర్కీ నర్తకిలాగా వచ్చిందట. ఈ ఋతువులో కొల్లేటినుండి కొంగలు వేల సంఖ్యలో వచ్చి కృష్ణాతీరప్రాంతపుమళ్ళలో విడిచిన దృశ్యాన్ని కవి మనోజ్ఞంగా వర్ణించినాడు - మిన్ననే పాముల చిన్నదాని మెడలోని నత్తగుల్లల పేరులాగా, అప్సర స్త్రీల చీరల చెంగులలాగా, నేలపైకి దిగిన ఆకాశాంబుధిలోని తరంగా

ల్లాగా రెక్కలాడిస్తూ కొల్లేటి కొంగలు కొబ్బరితోపుల్లో మాలలు గట్టి దిగాయని కవి చేసిన వర్ణన అద్భుతమైంది.

ఈ ఋతువులో రేగుపండ్లకు కొదువ ఉండదు. లంబాడి పడుచులు వడ్లకు సరికి సరి రేగుపండ్లు అమ్మడాన్ని గంగిరెద్దుల దాసరి సీతాదేవి పెండ్లి అని కేకలు వేయడాన్ని కవి ప్రస్తావించాడు. ఇంకా సాయంకాలాల్లో గాలులు తాలికోసం కొతిమేర చేలమీదికి రావడం, కోసిన జొన్న చేలల్లో దోసకాయలింకా తొడిమ దగ్గర చేదుగానే ఉండడం, అప్పటికి కోయని మిరపపండ్లు పెండ్లి కూతుళ్ళలాగా సకుంకుమ శోభతో కులుకులాడడం, మొక్కజొన్న చేలల్లో మంచెల మీదినుంచి వచ్చే వడిసెల రాళ్లు తగలకుండా ఎలా తప్పించుకోవాలో తల్లి పిట్ట తన పిల్లలకు నేర్పడం మిరపతోటల మధ్య తలగిల్లిన పొగాకు మొక్కలూ, బంతిపూలచెట్లూ శోభించడం వర్ణించి మనకు తెలుగు నేలమీది మెట్ట పొలాలను దృశ్యమానం చేశాడు కవి.

ప్రొద్దుటింతల వాయువులు తాలికై మెల్ల
  కొతిమెర చేలపై కొసరులాడె
చిఱుచేదువలచె కోసిన జొన్నచేనిలో
  తొడిమ దగ్గర వచ్చి దోసపండు
పండికోయని మిరపలు పెండ్లి కూతుండ్ర
  వలె సకుంకుమ శోభ కులుకులాడె.
వడిసెలకా, తప్పు నొదువు నేర్పెను తల్లి
  చిన్నిపిట్టకు మొక్కజొన్నచేల
చెలగె తలగిల్లిన పొగాకు సెనగతంప
టలును బంతిపూల్ మిరపతోటలకుమధ్య
శరదృతు సమస్తమును ప్రదర్శనముచేసె
గూడి మెట్టపొలాల వికుంఠలక్ష్మి. —పుట. 25.

ఊళ్ళలో కాపుపిల్లలు పసులవెంట పొలాలకు పోతారు. అలా పోయే టప్పుడు బురద అంటకుండా దున్నపోతుమీద ఎక్కి స్వారీ చేయడం వారికి అలవాటు. ఈ విషయాన్ని కవి "బురద త్రొక్కడు కాపు బుడతడు మహి

షంబుపై స్వారిపోవును బాల యముడు'' అని వర్ణించాడు. జన్మస్థలమైన నంద మూరిలోని విశ్వనాథ శివున్ని శరదృతు వర్ణనలో చేర్చడం కవి అభిజనాభి మానాన్ని అభివ్యక్తం చేస్తుంది.

## హేమంతం :

రాబోయే శిశిరానికి భయపడి ప్రకృతికాంత జమిలి దుప్పటిని కప్పు కొన్నట్లు తెలుగునేల నలుదిక్కుల మంచు ఆవరించిందని విశ్వనాథ హేమంతాన్ని వర్ణించాడు. ఈ మంచు బిందువులనుగూర్చి కవి చేసిన వర్ణనలో తెలుగువారి పెళ్ళి ఆచారాలు ప్రస్తావింపబడ్డాయి.

''తట్టలో కూర్చుండబెట్టిన వధువునా
గుమ్మడి పూవులో కులికెనొకటి'' —పుట. 30.

శిశిరంలో చెట్లు ఆకులు రాల్చడం సహజం. దాన్ని దృష్టిలో పెట్టుకొని కవి పాతచీరలనే ఆకులు రాల్చడానికి ముందు మంచులో స్నానం చేసినట్లు చెట్లున్నాయని చెప్పడంలో ప్రకృతి లక్షణం గోచరిస్తుంది.

''తానమాడె హిమాన తరుపాళి యాకు రా
ల్చుటను ప్రాజీర యూడ్చుటకు మున్న'' —పుట. 30.

ఈ ఋతువులో వచ్చే ముఖ్యమైన పండుగ సంక్రాంతి. సంక్రాంతిముగ్గుల ప్రత్యేకత గంగిరెద్దుల ఆటలు మనకు తెలియనివి కావు. ముగ్గులు వేసే కన్నె ముత్తైదువ పార్వతికాగా పసులను తోలుకొని వెళ్ళే రైతు ఆదిరాజు పాలికాపు కాగా, కాడికలవని గిత్త ఇల్లటమున్న నందీశుడు కాగా, హిమవంతుడు సపరి వారంగా తెలుగునేలకు తరలివచ్చినట్లుగా ఎక్కడ చూసినా మంచే కనిపిస్తుందని కవి చేసిన వర్ణన లోకోత్తరమైంది. లోకోత్తర వర్ణనా నిపుణుడైనవాడే కవి. విశ్వనాథ మహాకవి!

## శిశిరం :

"ఆజ్యధారా లేపనాభిరామ నవాధరములతో
మృదుశిశిరమ్ము వచ్చె ఏతెంచె శిశిరమ్ము
సాతంకపాణి పాదాంగుళీ కర్షనాసాంత ములకు''

అని శిశిరర్తు ప్రారంభాన్ని కవి ఉల్లేఖించినాడు. చలిబాధ తట్టుకోలేని దూడలు నాలుకలు చాచి కుడితిలో మూతులు పెట్టలేకపోయ యని. పక్కకేసిన దుప్పటిని పిల్లవాడు నిదురలోనే తీసుకొని పైనకప్పుకొన్నాడనీ చెప్పిన మాటలు స్వభావసిద్ధమైనవి.

ఇట్లే చలి కారణంగా పల్లకి బొంగుతోపాటు కమ్మవారి కొత్త పెళ్ళి కూతురు తల వంగిందనీ, ప్రత్తిని ఏరే కూలిపడుచు పగిలిన ప్రత్తికాయలాంటి పెదవితో ప్రకాశించిందనీ, ఆకురాల్చి చిగురించే చిన్నచిన్న చెట్లలాగా ఈడొచ్చిన అమ్మాయిలు పరికిణీలు వదిలిపెట్టి చీరలు కట్టారని చేసిన వర్ణన ఎంతో సుందరమైంది.

చిన్నలు పెద్దలు ఈ శిశిరర్తువులో పొందిన బాధలు ఎన్నో ఉన్నాయి. కవి ఈ బాధలను ఎంత సహజంగా వర్ణించినాడో గమనించండి :

చల్లపోసికొనంగ చలివేసె జిహ్వాకు
మంచి నీళ్ళుద్రావ మణగెనాల్క
కందాల చేతులు కడిగిరి పిల్లలు
కడుగక కాళ్లలు తుడుచుకొనిరి
చల్లారకయ మున్న చప్పరించిరి పాల
బెల్లముంచిన వేడి వేడి జున్ను
తలుపింత యోరవాకిలి తీయనీయరు
నుహూహంచు గొంతు గూర్చుండి తింద్రు
తిని యలుకకుండ పసపు చిందెదరు నీళ్ళు
చిలికెదరు తడిచేత రాచెదరు పైని
చిరు చలికి కూడ పెనుబీతు చెందెజనము
తడి పరిహరించుటకె మేలుపడియె బ్రతుకు.

ఋతు వర్ణనలను సంపూర్ణంగా తెలుగుదనంతో నింపి ప్రత్యేకంగా 'తెలుగు ఋతువులు' అన్న పేరును కావ్యానికి సార్థకం చేసిన విశ్వనాథ పదహారణాలా తెలుగు మహాకవి. *

# "కిన్నెరసాని తెలుగింటి దొరసాని"

—డా॥ కె. రుక్నుద్దీన్

వేయి వెలుగుల సూర్యుడు విశ్వనాథ.

సాహిత్య సహస్ర కిరణుడు విశ్వనాథ.

ఒక్కొక్క కిరణం తెలుగు సాహిత్యంలోని ఒక వైవిధ్యాన్ని స్పృశించి, సుసంపన్నమూ, పునీతమూ చేసింది. వచన ప్రక్రియ చేపడితే ధర్మగ్లానిపైన వేయి పడగలు పూత్కరిస్తాయి సంప్రదాయ కల్పవృక్షాలు నాటితే, అవి జ్ఞానపీఠాధిష్ఠితాలౌతాయి. కడిమిచెట్లు మొలకలు వేస్తే, అవి పెరిగి వీరగంధాలను ప్రసరిస్తాయి. ఆంధ్ర పౌరుషాన్ని ధర్మనిష్ఠను ఆవిష్కరిస్తే విజయవాటికలో కనక వర్షాలు కురుస్తాయి. చెలరేగిన కాంక్షలు చెలియలి కట్టలను దాటవు. వెలిగిన నేపాళ దీపకళికలు దిండుకింద పోకచెక్కలను సృజిస్తాయి! చిట్లీచిట్లని గాజులను చిత్రిస్తాయి. గుండె గాయాన్ని గేయం తాకితే, రసహృదయుల హృత్తంత్రులు మ్రోగి కిన్నెరనాదం వినిపిస్తుంది. సరస హృదయులను ఆనందడోలల ముంచి తేలుస్తుంది.

విశ్వనాథ బహుముఖ ప్రజ్ఞకు తార్కాణాలవి. పట్టిందానిని బంగారం చేసే పరుసవేది విద్య, ఆయన అరచేతికి అంకితమయింది. ఆయన యేది రాసినా మనలను బాగా ఆకర్షించేది - ఆయన భావనాశక్తి. ఒక దృశ్యాన్ని వర్ణించినా, పాత్రను చిత్రించినా, కథను నడిపించినా, ఉత్తమ భావుకుడూ, ప్రజ్ఞావంతుడూ, ధీశాలీ, రసపిపాసీ, సంప్రదాయవాదీ కనిపిస్తాడు.

వ్యుత్పత్తి ఆధారంగా ఆదినుండీ సాగుతూ వచ్చిన ఆంధ్ర కవిత దిశమారి, దశమారి, ప్రతిభకు పట్టంకట్టి, గేయం పుట్టుకు వచ్చింది. ఆ దశలో

వచ్చినవే యెంకిపాటలు. యెంకిపాటలు నండూరి సుబ్బారావుగారు సభలలో కమ్మగా పాడుతూ వుంటే, వారికి లభించిన జనాదరణను ప్రత్యక్షంగా చూచిన విశ్వనాథ, కిన్నెరసానిని సృష్టించారంటారు.1

భద్రాచలానికి దిగువన గోదావరిలో దక్షిణపు వైపు నుండి కలిసే ఒక వాగు కిన్నెరసాని. పేరు రమ్యంగా, ఆకర్షకంగా వుంది. విశ్వనాథవారు ఈ పేరునుబట్టే కథను దొంతరలుగా పేరుస్తూ పోయారు.

ప్రతిభా శాలియగు కవి జడ ప్రకృతికి సైతం సంపూర్ణ మానవత్వము నాపాదిస్తాడు. శిలలను పలికిస్తాడు ఙాలను గరిగిస్తాడు. నదులను నటింపిస్తాడు. వృక్షముల నడిపిస్తాడు నెమళ్ళచేత ఆడిస్తాడు, కోయిలలచేత పాడిస్తాడు. సర్వ కాల సార్వజనీనమై, నిర్మలానంద రసోదయమున కాస్పదమగు కావ్య శిల్ప సృష్టి గావిస్తాడు. లోకమున కొక సందేశము నిచ్చి తానూ సంతోషపడతాడు.

విశ్వనాథవారు చేసిందదే.

సుమారు 1923 ప్రాంతంలో విశ్వనాథవారు భద్రాచలాన్ని సందర్శించారు. అపుడు దగ్గరలోనే ఒక కొండ, ఆ కొండను చుట్టుకొని ప్రవహిస్తున్న నదీ ఆయన దృష్టిని బాగా ఆకర్షించాయి. ఆ నదిపేరు వాకబుచేసి పులకించి పోయాడు. అదే కిన్నెరసాని. అందమైన పేరు! అంతే!! ఆయనలోని భావ తీవ్రత ఆయనను నిలువనీయలేదు. ఒక మనోహర దృశ్యం, అందమైన పేరు, అమిత భావుకుడు, భావతీవ్రత నాపుకోలేని రసలోలుపత; ఊహ రగిలి గుండె కదిలింది. కరుణరసాత్మక సందేశఘట్టం హృదయ ఫలకంపై తళుక్కు మన్నది. ఒక జీవిత కథకు ప్రతీకాత్మక సందేశ దృశ్యం ఆయనముందు సాక్షాత్కరించింది. సాక్షాత్కరించినదానినే చిత్రించాడు విశ్వనాథ. అదే కిన్నెరసాని అయింది.

అత్తలేని కోడలుత్తమురాలు; కోడలులేని అత్త గుణవంతురాలు; అనే కాకుస్వర వ్యంగ్య వాక్యాలు వింటూనే వుంటాం. అత్తా కోడళ్ళు అనంగానే గొడవలు వినబడుతుంటాయి, కనబడుతుంటాయి. అట్లాంటిదే యీ కథ. చిన్న సంఘటన చుట్టూ చిత్రంగా కథనల్లి ప్రతీకాత్మక సందేశాన్నివ్వడంలోనే కన బడుతుంది విశ్వనాథ ప్రతిభ.

అత్త ఆరళ్ళు, కోడలి కోపతాపాలు మామూలే అయినా ఆ ఆరళ్ళు మితి మీరి, భరించలేక, ఆవేశపడి, ఇల్లువదలింది కోడలు కిన్నెరసాని. ఆలోచనలేని ఆవేశంతో అడవుల వెంటబడి పరుగెత్తింది.అజల, ఆవేశం తోడయింది అనర్థం కలుగుతుందేమోనని ఆమె భర్త ఆమె నోదార్చడానికి పరుగెత్తి ప్రయత్నించాడు. ఇంతవరకు విశ్వనాథ ఉపోద్ఘాతంలా వచనంలో చెప్పి, కిన్నెరను వెంటనంటి పరుగెత్తి ఆమె నోదార్చ యత్నించిన ఆమె భర్త యత్నాలతో గేయం ప్రారంభిస్తాడు:

తనయెడ తప్పేయున్నది
అనుకోవే నాథుని దెస
వనితలు నీవలె కఠినలు
కనిపించరువే యెందును
ఓహో! కిన్నెరసానీ
ఓహో! కిన్నెరసానీ!

అని, ఆమెను అపయత్నిస్తాడు.

కావ్యాలకు ఈ రీతిగ ముందు కథను జెప్పి, తర్వాత కథను ప్రారంభించడం ఖండ కావ్యాలకు నిండు రూపం రాక, కావ్యం ఖండమైపోతుందనే అభిప్రాయమూ వుంది.[2]

కిన్నెరసాని పాటలు కేవల కల్పిత కథను మాత్రమే చిత్రిస్తే, ఇంతగా వాని చర్చ చేయాల్సిన అవసరమే ఉండేది కాదు. కిన్నెరసాని పాటలు పాతవైనా, ఆధునిక గృహిణి జీవిత చిత్రణకు ప్రతీకలు.

కిన్నెర నీరై ప్రవహించినప్పటినుండి భర్త పొందిన వేదననంతా కిన్నెర పుట్టుక, అనీ; పతిరాయివలెమారి పడియున్నచోటునే విడలేక తిరిగి జలదేవతల వెంట కిన్నెర సాగిపోవుటను కిన్నెర సంగీతమనీ; తగని మోహముతో కదలి రాజు పొంగుటను కిన్నెర దుఃఖమనీ; ఇంకా, కిన్నెర నడకలు, కిన్నెర నృత్యము, కదలి పొంగు, గోదావరీ సంగమము; కిన్నెర వైభవము; అని ఎనిమిది శీర్షికలతో కిన్నెరసాని పాటలు సాగినవి.

అత్త ఆరడి, భర్త మౌనం - ఈ రెండూ భరించరానివై, ఆలోచనలేని ఆవేశం కలిగించి, కిన్నెరను అడవులవెంట పరుగెత్తింప జేసినవి. ప్రమాదాన్ని పసిగట్టిన భర్త ఆమె వెంట పరుగెత్తి, ఆగమని ప్రార్థించాడు. అడుక్కున్నాడు, ప్రాధేయపడ్డాడు. కౌగిట్లోకి తీసుకుని బుజ్జగించాడు. అవివేకం ఆమె ఆవేశాన్ని తగ్గనివ్వలేదు. కౌగిట్లోనే ఆమె కరిగినీరై ప్రవహించింది. ఆమె నీరైపోవడాన్ని గమనించిన భర్త-

నీవు మహాపతిశీలవు
కావని నేనంటి నటే!
అటులంటిన నా కంఠము
కటారి తెంచక పోతిన!
ఓహో కిన్నెరసానీ!

అనీ-

నీ జఘనము నిసుక తిన్నె
గా జూచిన నా కన్నులు
ఊడిపడవు నేలపైన
ఉరినీపోవు లోనె లోనె
ఓహో కిన్నెరసానీ!

అనీ, బాధపడి, నిన్ను పోగొట్టుకున్న నా జీవిత మెందుకు; నా కనులు పోనీ; నాకీ దృష్టి యెందుకని, యని అమె మీద తనకున్న గాఢమైన ప్రేమను చాటుకున్నాడు. అంతేకాదు, ప్రియురాలిని పోగొట్టుకొని నిశ్చేష్టుడైనాడు. చైతన్యహీనుడై నాడు:

నీకై యేడిచి యేడిచి నా కంఠము సన్నవడియె
నా కన్నులు మందగించె నా కాయము కొయ్యబారె
ఈ యేడుపు రొదలోపల నా యొడలే నేనెరుగను

అటూ ఆమెక్కై విలపిస్తూనే తాను శిలై పోయాడు భర్త. తానవివేకి, కఠినయై చేసిన పనికి, తన ప్రియుడు శిలయైపోయాడు. అపుడు కిన్నెరకు తన స్థితి—

తొడిమ యూడిన పూవు వడతిలా తోచింది
బెడుగుపోయిన రత్న పేటిలా తోచింది.

అందుకే—

పతి రాయివలె మారి పడియున్నచోటునే
పడతి కిన్నెరసాని విడలేక తిరిగింది,
ముగుద కిన్నెరసాని వగచెంది తిరిగింది
వెలది కిన్నెరసాని గలగలా తిరిగింది.

తప్పు తెలిసింది; వియోగమనుభవించింది. ఎట్లాగైనా తిరిగి తాను మనిషైతే, తన భర్త కూడా పాషాణత్వంనుండి తిరిగి మనిషై తన నేలుకుంటాడేమోననే ఆశకు లోనైంది కిన్నెర. అంతర్గతంగా తన తప్పు తెలిసి పశ్చాత్తాప పడడం కనబడుతుంది.

ఏ ఉపాయముచేతనైన మళ్ళీ తాను
మనిషి కిన్నెరసాని నగుదామ యనిపించి
ఆపలేనంత కోరికచేత విలపించి
ముగుద కిన్నెరసాని మొరసింది మొరసింది.

ఆమె ఆవేదనంతా గతజలసేతుబంధనమే అయింది. చేతులు కాలిం తర్వాత ఆకులు పట్టుకున్నట్లే అయింది. ఇదంతా చేజేతులా తాను చేసికొన్నదేనని వాపోయింది కిన్నెర.

అటువంటి పతితోడ అటువంటి కాపురం
బిటు చేసికొంటినం చెక్కడా లేనంత
వగచెంది వగచెంది వనిత కిన్నెరసాని
వనరింది వనరింది వనిత కిన్నెరసాని.

ఆలోచన లోపించి, కేవలం ఆవేశపరులైన మనుషుల మనస్తత్వాలకు, ప్రత్యేకించి స్త్రీల మనస్తత్వాలకు ఉదాహరణగా నిలిచింది కిన్నెర.

పతి రాయిగా మారి పడియున్న గుట్టపై
అతివ తన కెరటాల హస్తాలతో చుట్టి
వెతపొంది వెతపొంది బిట్టు ఘోషించింది-
తన నీటుకాణ్ణి చేతుల కౌగిలిస్తుంది
పలకవా! యని ప్రమోతపడి పల్కరిస్తుంది.
ఓ నాథ! ఓ నాథ! ఓ నాథ! ఓ నాథ!

నాకుమల్లే నీవు నదివోలె పారరా!
జలముగా యిద్దరము కలసి పోదామురా!
కెరటాలు కెరటాలు కౌగిలిద్దామురా!
ఓ నాథ! ఓ నాథ! ఓ నాథ! ఓ నాథ!

నీయందు తప్పింక నేను చెయ్యను లేర!
ఆనపెట్టితివేని అడుగుదాటను లేర!
ఇక జన్మలో కోపమింతి పొందనులేర!
రార! ఓహో నాథ! రార ఓహో నాథ!

అంటూ ప్రాధేయపడింది. పశ్చాత్తాపపడింది; యేడ్చింది. ఆమె యేడుపంతా అరణ్య రోదనమే అయింది.

ఆధారంలేని ఆధేయం స్థిరంగా నిలువలేదు దానికి వ్యక్తిత్వముండదు. వాలునుబట్టి కొట్టుకుపోవలసిందే. మన కిన్నెరగతి అంతే అయింది:

ముద్దు ముద్దుగ నడచి పోరవోలిక నాడి
మురిపమ్ముగా పాడి ముగుద కిన్నెరసాని
యెదదలో యెదురైన బెదదలో కష్టాల
కదలియే కలగాంచెనో కన్నీటి
కదవలే ప్రవహించెనో!
కన్నీటి కదవలు కాలువలు కడుతూంటే, సముద్రంవై పుసాగింది కిన్నెర.

కిన్నెర తనవైపు వస్తుందని విని సముద్రుడు పొంగినాడు, ఉప్పొంగినాడు.

తగని కోరికచేత తనలో కదలిరాజు
సొగసు కిన్నెరసాని చూడాలెననిపించి
ఉద్రట్టు లూగెనూ - మిర్రెక్కి చూచెనూ—

సముద్రుడు కిన్నెరవైపు తగనికోరికచేత చూడడానికి కారణం కిన్నెర ప్రస్తుతం భర్తృవిహీన కావడమే. ఇన్నాళ్లూ భర్తచాటున వున్నది. ఇపుడు ఇల్లు వదలి సంసారాన్ని పోగొట్టుకొని, ఏకాకియై వచ్చిన దురదృష్టవంతురాలు. ఆమె తలపై నీడ లేకపోవడమే, సముద్రునిలాంటివారికి ఆమెపై తగని కోరిక కలగడానికి కారణం. నాడేకాదు, నేడు కూడా ఇట్లాంటి పరిస్థితులే యెదుర్కోవాల్సి వస్తుంది - కిన్నెరలా, అనాలోచితమైన ఆవేశంతో ప్రవర్తించిన వారు.

తత్కాలికంగా, క్షణికోద్రేకానికి లోనైనా, సంభాళించుకున్నాడు సముద్రుడు.

ఏనాటి ముసలి యీ కదలీ
ఏనాటి పెద్ద యీ కదలీ
తిరిగి నలుగురిలోన తిరుగనేర్చిన వాడు
పరగ కామమునకై అదలిపోయెనటన్న
తనకేమి పరువూ - కదలిరాజునకూ—

అనుకున్నారు జనం. అనుకుంటారని ఆత్మ విమర్శ చేసుకున్నాడు కదలి రాజు.

కదలి పొంగిన దంతె గానీ
కదలి ఉబికిన దంతె గానీ
కదలి తా చెలియలికట్ట దాటునె యంచు
కదలి మాత్రము బద్దె గడచిపోవునె యంచు
కదగి యనుకొనిరి బుదుత మానిసులూ-

లోక వర్తాలకు లోకులు కాకులై చిలువలు పలువలుగా పలుకడం మామూలే. ఇక్కడా అట్లే జరిగింది.

సముద్రుడు తనను కలువ నుంకిస్తున్నాడని తెలిసిన కిన్నెర కృంగి పోయింది. తానిల్లు వెదలి చేసిన పొరపాటుకు పదేపదే తనను తానే నిందించు కున్నది. ఓర్పు అవగాహన లేకుండ చేసిన పని తనను ఒంటరిదానిని చేస్తే, ఆ ఒంటరితనం సమాజంలో యిట్లాంటి కష్టాలను కలిగించిందని కుమిలి పోయింది. పశ్చాత్తాపపడింది

ఓ నాథ నిను వీడివచ్చి
ఓ రాజ నిను వదలి వచ్చి
నాయొదల్పయితమ్మి
నానాజనులు కోర
యీయేవపుం బ్రతుకు యేల పొందితిరా
అంచు వగసినదీ
అంచు లురిలినదీ.
తనపై తనకే అసహ్యం కలిగింది కిన్నెరకు. ఏడ్చింది.

హా యని కిన్నెర యేడ్చెన్
తన తొందరయును తన పతి ప్రేమయు
తాను చేసినా తెలివి తక్కువయు
తన పతి చూపిన త్యాగ గౌరవము
తలచుకు తలచుకు బోరున బోరున
హా యని కిన్నెర యేడ్చెన్!

తాను చేసిన తొందరపాటు పనికి తనకిది తగినశిక్ష అనుకున్నది కిన్నెర. కుమిలి కుమిలి యేడ్చింది. అనాథయైన కిన్నెరకు సముద్రుడాశపడడం గోదావరికి తెలిసింది. స్త్రీ హృదయం మాతృహృదయం తల్లడిల్లింది. ఎదురుగా పరుగెత్తింది. సందిట్లో అదుముకున్నది కిన్నెరను. ఓదార్చింది. ఎవరివల్లా నీకింత ఆపదరాదని అభయమిచ్చింది.

గోదావరి జాలిగుండె గూడులు కదలి
సాధు కిన్నెర కెదురుపోయీ.... ఆమె
లో దిగులు తరగ చేదోయీ.... వారించి

ఆదరముచే నామె నడిమి కౌగిట బూని
ఏది నీ మొగము నా తల్లీ.... అన్నదీ
నీ దిగులు నికమాను చెల్లీ....
అన్నదీ....

తన కూతురు దుడుకుతనంతో తన కాపురాన్ని తానే పాడు చేసుకొని వచ్చినా, తల్లిమనసు ఆమెను ఓదారుస్తుంది ఆదరిస్తుంది. అక్కున జేర్చు కుంటుంది. గోదావరిది తల్లిమనసేమరి. కిన్నెర గోదావరిలో లీనమయింది. సముద్రుని వలన గండం తప్పింది.

వ్యక్తిగత జీవితానికి నోచుకోని ఉత్తములు, తమను సమాజానికే అంకితం చేస్తారు. పరోపకారార్థ మిదం శరీరమంటారు. తమ సర్వస్వం సమాజం కొరకే వెచ్చిస్తారు. సమాజ సంక్షేమంలోనే వారి ఆనందం వుంటుంది. వసుధైక కుటుంబకు లౌతారు. జీవితం అశాశ్వతమైతే, మృత్యువు శాశ్వతం. ఎలాగూ మృత్యువు తప్పనప్పుడు, పరుల మేలుకొరకు చస్తే మంచిదనేది త్యాగధనుల అభిప్రాయం. కాలి కరిగిపోయే క్రొవ్వొత్తి ఇతరులకు వెలుగునిచ్చి, మరీ నిష్క్రమిస్తుంది.

కిన్నెర జీవితం అంతే అయింది.
ఎడనీరు కాల్వలై యేరులైపోవు కై
వడి, మృగమ్ములు దప్పికలు తీర్చుకొను రీతి
సాగింది కిన్నెరా............బూది రం
గూదింది కిన్నెరా.

పంటలకూ, పశువుల దప్పి తీర్చటానికీ, ప్రాంతాన్ని సస్య శ్యామలం చేయడానికీ, తనను తానర్పించుకొని, పరోపకారాయ వహంతి నద్యః, పరోప కారార్థమిదం శరీర మని చాటి ధన్యయైంది కిన్నెర.

సంసారంలో ఎదురయ్యే ఒడుదుడుకులను సౌమనస్యంతో సర్దుకుపోయే మనస్తత్వం అలవర్చుకోకపోతే జరిగే చేటు తన జీవిత సాదృశ్యం ద్వారా

చెప్పింది కిన్నెర. లోకవృత్త పరిశీలనాశక్తితో, అద్వితీయమైన భావనాబలంతో యథార్థ మానవ జీవనచిత్ర ప్రతీకలు నిర్మించారు విశ్వనాథవారు.

నదిని రక్తమాంస శరీరయైన నాయికగా భావించి పాడిన పాటలు మాత్రమే కావు కిన్నెర పాటలు; సంపూర్ణ జీవన విధానానికి ప్రతీకల నెత్తిన ప్రతిభా పతాకలవి. వివేకభ్రష్ట సంపాతముల్ పెక్కు భంగులన్నట్లు, కిన్నెర ఆవేశంతో యిల్లు వెడలడం ఆమెకూ, ఆమె భర్తకూ తీరని నష్టాన్ని కలిగించింది. కనీసం జీవితం కూడా లేకుండా చేసింది. కోడలి సంగతలా వుంచితే, ప్రియమైన కుమారుని పోగొట్టుకున్నది ఆ తల్లి. ఆమె అవివేకంవల్లనే సముద్రునిచేత చులకనగా చూడబడింది కిన్నెర. నెత్తిమీద నీడలేని స్త్రీ సమాజంలో చులకనగా చూడబడుతుంది. ఆపదలో ఆదుకునేదే ఆప్తహృదయం. ఉన్నఇంటిని కాదని వెళ్ళి గోదావరి యింటిలో, అంటే పరుల పంచలో తలదాచుకోవలసి వచ్చింది కిన్నెరకు. కారణం? తన ఆవేశమే. ఇందరిని ఇన్నివిధాలా చలింపజేసింది. ప్రతీకాత్మకమైన సందేశాన్నిచ్చింది. తనవంటి తప్పిదాన్నిమరింకెవరూ చేయొద్దనీ, చేజేతులా బంగారంలాంటి జీవితాన్ని పాడు చేసుకోవద్దనీ సందేశాన్ని ఇవ్వకే ఇచ్చింది. అందుకే కలికి కిన్నెరసాని తెలుగింటి దొరసాని. *

# కిన్నెరసాని పాటలు : వాక్యాలయ

—డా॥ జి. యస్. లక్ష్మి

పట్టిన ప్రక్రియను బంగారం చేసే ప్రతిభావంతుడుగా విశ్వనాథవారు ప్రశస్తిపొందారు. తెలుగు గేయ కావ్య కథా రచయితగా వీరు రచించిన గేయ కావ్యాలు మూడు స్త్రీల పాటలలో ప్రసిద్ధిచెంది జానపద వాఙ్మయ బాణీకి వన్నె తెచ్చిన 'పాము పాట'ను గేయరూపక ప్రక్రియగా మార్చి నాలుగైదు పాత్రలతో అపూర్వ ప్రయోగంగా చిత్రించిన గేయకృతి పాము పాట ఒకటైతే, ముత్యాల సరాన్ని ఎన్నుకొని దానిలోని నడకల వైవిధ్యాన్ని చూపిస్తూ శిల్పమయంగా వ్రాసిన మరో గేయకావ్యం కోకిలమ్మ పెండ్లి. అలాగే ఒక్కొక్క పాటకు ఒక్కొక్క గతిని ఎన్నుకొని గేయ కావ్య రచనకే ఒజ్జబంతిలాగా తీర్చిదిద్దిన గేయకావ్యం కిన్నెరసాని పాటలు కన్నెవాగుగా కరిగి పారడం అన్న కాల్పనిక భావనంలోని రామణీయకం ఈ కథకు ప్రాణం. అత్తా కోడళ్ళ సంబంధం కుటుంబ జీవితంలో అనుభవాలకు సన్నిహితం అందువల్ల ఆరళ్లుపెట్టే అత్త, మారుమాటాడలేని బొమ్మలాంటి మొగుడు, ఉద్విగ్న హృదయంతో ఉరకలెత్తే పడచు, నవవిలాసం కోసం విటుడైన భర్త యొక్క అనుచితాన్ని నిపుణంగా వారింపగలిగే ప్రౌఢ గృహిణీ ఈ కావ్యంలో ప్రతీకలై భాసిస్తారు. అందువలన కాల్పనిక సత్యం కళ్ళకు కట్టిన వాస్తవంలా ఈ గేయ కావ్యంలో జాలువారుతుంది. కిన్నెరసాని పాటలలో ఒక్కొక్క పాట తీరు ఆ పాటలలోని రసభావాల తీరు అనువుగా అమరడం ఈ రచనకు అబ్బిన అపూర్వ లక్షణం. ఈ లక్షణాలన్నీ ప్రజాదరణ పొందడానికి అనువైనవిగా ఉన్నాయి. కథ తెలుగువారి పుణ్యనదిని గురించి, కథా కల్పన జీవిత సత్యంలోనుండి పుట్టిన కాల్పనిక భావన. ఈ పాటలు, రసభావ వ్యంజక వాక్య విన్యాస తరంగాలు వైవిధ్యంతో కూడుకున్న గతి విశేషాలు ఈ పాటలకు వైభవాన్ని చేకూర్చాయి. నిజానికి, కిన్నెరసాని పాటలు సంగీతంతో పాడుకోదగినవి అయినా, సాహిత్యపు విలువలనుకూడా కలిగి ఉండటంచేత సాహిత్య ప్రధాన కావ్యంగా చెప్పడం జరుగుతోంది.

'Poetry is the rythmic rceation of beauty'' అన్న Allen Poe మాటలు విశ్వనాథవారి కావ్యానికి అబ్బుతాయని చెప్పవచ్చు. కిన్నెరసాని పాటలలో కవితా పరమైన విషయాలు, వాక్యనిర్మాణంలో పదక్రమం, పునరుక్తి మొదలైనవి బహిరంగాలైతే, వాక్యలయ వాక్యానికి అంతరంగం. మానవుడు తన మనోగత భావానికి సంబంధించిన హృదయ స్పందనాన్ని వ్యక్తీకరించ డానికి తోడ్పడే అర్థవంతమైన పదసముదాయం వాక్యం. అంటే, వక్తయొక్క హృదయ స్పందనానికి శబ్దమయమైన అభివ్యక్తి అన్నమాట. మనిషి మాట్లాడే ప్రతి వాక్యంలోనూ అతని హృదయంలోని భావస్పందన ప్రవహించినపుడు దాని గతిని 'లయ' అని పేర్కొనవచ్చు. వాక్యాల్లో భావానికీ, దాన్ని మోసుకొని వచ్చే శబ్దగతికీ మధ్య ఉన్న సంబంధమే 'భావలయ' అనీ, 'వాక్యలయ' అని విమర్శకులు పిలుస్తుంటారు. పాఠకునిలో అనుభూతిని రేకెత్తించడానికి కవిత్వపు భౌతికాకృతికి, అంతరంగానికి అప్రయత్నంగాగానీ, సప్రయత్నంగాగానీ కవి సాధించే పరిపూర్ణమైన సమన్వయమే వాక్యలయ. సాధారణమైన వాక్యగతికి, కవిత్వంలోని వాక్యగతికి లయాత్మకతలో కొంత తరతమ భావం కనిపిస్తుంది. విలక్షణమైన వాక్యగతినే వాక్యలయ అని చెప్పవచ్చు.

కవి ఒక్కొక్కసారి పనికట్టుకొని వాక్యంలోని లయను నాట్యాయమానం చేసి భావానుగుణమైన లాస్యం చేయించవచ్చు.

లయపెంచుతూ మధ్య
లయదించుతూ పాట
రయమెంచుతూ కిన్నె
రటుసోలి యిటుసోలి
తెలినీటి మేనితో - తలిరాకు మేనితో
ఒయ్యారములు పోయెనే - కిన్నెరా
అయ్యారె యనిపించెనే.

కిన్నెరనృత్యం వర్ణించే పాటలోని ఈ చరణాలను చూస్తే నృత్యంలో కనిపించే తూగు, ఒయ్యారం, చిందు ఈ గీతంలో విశ్వనాథవారు సహృదయుల హృదయాల కెక్కేటట్లు రచించారు. ఇది సప్రయత్నంగా కవి సాధించిన లయవిన్యాసం.

వాక్యలయను ప్రధానంగా మూడు రకాలుగా పరిశోధకులు నిర్ణయించారు. ఒకటి సహజ వాక్యలయగా, రెండువది అలంకృత వాక్యలయగా, మూడవది ఉద్దీప్తవాక్యలయగా పేర్కొన్నారు. వ్యవహార వాక్యాలకు దగ్గరగా ఉండి కవితామయమైన అభివ్యక్తితో రాణించే వాక్యాలతో సహజ వాక్యలయ ఉంటుందనీ, శబ్దాలంకారాలను భావపోషకంగా నిర్వహించి వాక్యాలకు శోభాతిశయాన్ని కల్పించినచోట అలంకృత వాక్యాలయ శోభిస్తుందనీ గ్రహించవచ్చు. అయితే, గేయకావ్యాల్లో తాళానికి అనుగుణంగా వాక్యగతి సాగడం సహజ లక్షణం కాబట్టి, దీనిని ఉద్దీప్తలయకు లక్షణంగా గ్రహించడం వచనకవిత్వంలో లాగా ఈ గేయకావ్యాల్లో సాధ్యపడదు కానీ—

పాదాల విరుపులతో సహజ పాదగతికి వికృతినిగానీ, విలక్షణత్వాన్నిగానీ, కల్పించి కిన్నెర నృత్యంలో లాగా రచనలో నాట్యాయమాన స్థితిని హెచ్చుగా పోషించినట్లైతే దానిని ఉద్దీప్త వాక్యలయగా గుర్తించవచ్చు.

కిన్నెరసాని పాటలలో మొట్టమొదటి పాట 'కిన్నెర పుట్టుక.' విశ్వనాథ వారు వ్యవహార వాక్యాలను వాటికి సన్నిహితమైన కవితా వాక్యాలను ఈ పాటలలో పుష్కలంగా పోషించి చూపించారు. పాత్రలకు అనుగుణంగా రసభావ పోషకంగా సహజ వాక్యలయను ఈ పాటలో ప్రయోగించడం చూస్తే మరిన్ని విషయాలు గోచరమవుతాయి.

కిన్నెర పుట్టుక పాట కిన్నెర భర్త పాడిన పాట అందువలన ఆ పాత్ర స్వభావం ఆ పాటలో, ఆ పాటల్లోని వాక్యాల్లో, ఆ వాక్యాల్లోని 'లయ'లో ప్రతిఫలింపక తప్పదు. కిన్నెరభర్తను విశ్వనాథవారు పరిచయం చేస్తూ 'కిన్నెరభర్త ఏం చేస్తాడు? తల్లిని కాదనలేడు, భార్యను ఓదార్చుకోనూ లేడూ' అని ఒక అమాయకునిగా చిత్రించారు. అందువలన అతనినోట వ్యవహార వాక్యాలకు సున్నితమైన కవితా వాక్యాలు వ్రాయడం సహజం. అలంకృత వాక్యలయ అతని వాక్కుకు అసహజం అని నిర్ణయించినట్లు అయ్యింది.

'ఇంత కోప మేమిటికే; ఇంత పంత మేమిటికే
ఇంతులు జగమున పతులకు; నింతలు సేయుదురటలే'

కిన్నెర భర్తలోను సూటితనం, బేలతనం సహజ గుణాలుగా గోచరిస్తాయి. బేలతనం దుఃఖాన్ని బావురుమనిపిస్తుంది. సూటిదనం నిరలంకృత వాక్యాలను మాట్లాడే ప్రవృత్తిని ప్రకటిస్తుంది. ఈ రెండూ కలసి గేయంగా జాలువారవలసి వచ్చినప్పుడు గేయోచితమైన పదవిన్యాసాలు వాక్యాల్లో కనబడుతున్నా అవి సహజ వాక్యలయను సంపాదించుకుంటూనే సాగాయని చెప్పవచ్చు.

కిన్నెరసాని పాటలను చదవడానికి, వినడానికి, పూనుకునే సహృదయులకు సారళ్యాన్ని, స్వభావోక్తి సౌందర్యాన్ని అందించినట్లుగా సహజవాక్యలయను విశ్వనాథవారు మొదటి పాటలో పోషించారు.

కిన్నెరసాని ఉద్విగ్న హృదయ; ఆవేశపరురాలు దానికి విరుద్ధంగా భర్త పాత్రను చిత్రించారు విశ్వనాథ. కిన్నెర నడకలు, కిన్నెర దుఃఖము, కిన్నెర నృత్యములను అలంకృత వాక్యలయలో ప్రధానంగా చిత్రింపదలచుకున్న విశ్వనాథ - పతి దుఃఖాన్ని సహజవాక్య లయలో రచించడమే ఉచితంగా ఉన్నది.

కిన్నెర పుట్టుకంతా ఏకపాత్ర సంభాషణంగా సాగడం వల్ల వాక్య విన్యాసాల్లో భావోచిత రచనాపద్ధతులు గోచరిస్తాయి. విశ్వనాథవారు పాటల్లో గ్రాంథిక భాషనే సాధారణంగా వాడుతున్నా అప్పుడప్పుడూ సందర్భోచితంగా వ్యావహారిక పదాలనూ వాడడం జరిగింది.

'అంతపణీ పూనితిలో 'నీవేనే ప్రియురాలా' 'నీవే' అన్న ప్రయోగాలు, నీదే నీదే తప్పని మొదలైనవి ఇందుకు తార్కాణాలు.

'ఇంతీ నను శిక్షింపగ, నింకొక మార్గము లేదటె'
'ఇంతులు జగమున పతులకు; నింతలు సేయుదురటవే'

మొదలైనచోట సున్నితమైన 'కాకువు' కూడా స్ఫురిస్తుంది. 'ఓహో కిన్నెరసాని' అన్న పల్లవి పునరావృత్తిలో తూగు స్ఫురిస్తుంది.

నీ పాదమ్ములు మోచిన, నా ఫాలమ్మున చెమ్మట

'నీ' 'నా' పద ఉచ్చారణలో 'ఇంత కోపమేమిటికే' అన్న చరణాలు ఉచ్చరిస్తున్నప్పుడు కలిగించే వైవిధ్యం తూగు సహజ వాక్యలయకు సహజ సౌందర్యం సంతరించి పెడుతున్నాయి.

ఈ విధంగా కిన్నెర పుట్టుక పాట సహజ వాక్యలయకు చక్కటి ఉదాహరణంగా చెప్పవచ్చు.

కిన్నెర పుట్టుక సహజ వాక్యలయతో నడిస్తే కిన్నెర నడకలు అలంకృత వాక్యలయకు అచ్చమైన ఉదాహరణంగా చెప్పవచ్చు. అలంకరణం శబ్దంతో అర్థంతో రచనలు చేయడం పరిపాటి. అయితే గేయ సాహిత్యంలో నిర్మాణాలంకరణం కూడా ఒక శిల్పంగా భాసిస్తుంది.

కిన్నెర నడకలు రచించిన పద్ధతిని సమీక్షిస్తే దానిని ఆఖ్యాన పద్ధతి, సంభాషణ పద్ధతి, వ్యాఖ్యాన పద్ధతి అని మూడు రకాలుగా వింగడించవచ్చు. ఆఖ్యాన పద్ధతి అంటే కిన్నెర నడకలను వర్ణించిన పద్ధతి.

సంభాషణ పద్ధతి అంటే కిన్నెర భర్తను ఉద్దేశించి ఎలుగెత్తి ఆక్రందిస్తు స్వయంగా కిన్నెరసాని పాడినట్లు రచించిన చరణాల పద్ధతి. వ్యాఖ్యాన పద్ధతి అంటే కిన్నెర మనోగత భావాలను కవి సందర్భోచితంగా, వ్యక్తీకరిస్తూ, కళా ధర్మాన్ని అనుసరించి వ్యాఖ్యానిస్తున్న పద్ధతి.

కరిగింది కరిగింది
కరిగింది కరిగింది
కరిగింది కిన్నెరసాని వరదలై పారింది.

కిన్నెర నడకలోని మొదటి ఆరు చరణాలు ఒక ఖండంగా తీసుకుంటే దానిని వస్తురచనా ప్రణాళికలో మొదటి మూడు చరణాల్లో కిన్నెరసాని'కరగడం' 'కదలడం' నడవడం. క్రమంగా 4, 5 చరణాలో కరుగగా నడవగా ఎలా కన బడిందో కవి వర్ణించారు. మొదట ఆకృతి వర్ణనానికి ప్రాముఖ్యతనిచ్చి తరువాత మూడు చరణాల్లో అవస్థావర్ణనకు ప్రాముఖ్యత నిచ్చారు. నడకల వైఖరిని విశ్లేషించి చెప్పడం ఈ పాటలోని ప్రత్యేకత. తరుణి, పడతి, సుదతి, ముదిత విశేషణాలను ప్రయోగించడం జరిగింది. ఈ చరణాల్లోని ఉత్తరార్ధాలు క్రియలతో ముగుస్తుంటాయి. నిజానికి అర్థవంతమైన బలమైన పాద భాగాలవే. వాటివలన భావసౌందర్యమే కాకుండా నదియొక్క ఆకృతి సౌందర్యం కూడా లయాత్మకంగా వ్యక్తమవుతోంది. వీటిలో శబ్దాలంకార ప్రయోగమే ఎక్కువగా కనిపిస్తోంది. 'తరగల్లు పెట్టింది' 'వరుగుల్లు పెట్టింది' అన్న అంత్యప్రాసలు కూడా అందాన్ని అతిశయింపజేశాయి

కరుగగా కరుగగా కిన్నెరసానికి ఏర్పడిన అవస్థలను వర్ణించేటప్పుడు రెండవ ఖండంలోని మూడు పాదాల్లోనూ, శబ్దానుకరణ రూపాలను 'తళతళ' 'ఝరఝరా' 'బుసబుస' అనువాటిని వాడి కిన్నెరసాని మెరిసిన పద్ధతిని, నడచిన పద్ధతిని, పొంగిన పద్ధతిని అవస్థలుగా చిత్రించి పఠితచేత అనుభవింపజేశారు. కరగడంవలన కలిగిన అవస్థలను ఈ విధమైన అలంకృతలయతో పోషించడం జరిగింది.

సంభాషణా పద్ధతికి సంబంధించినంతవరకూ చూస్తే పతినుండి దూర మవుతున్నప్పుడు చేసిన ఆక్రందనలు, వియోగం వలన కలిగే అనుతాపాలను, అసౌఖ్యాలను వితర్కిస్తున్నట్లు గోచరిస్తాయి.

"రారా! ఓహో నాథ
రార! ఓహోనాథ
వెలది నీ కిన్నెరా కరిగిపోయిందిరా
నాతి నీ కిన్నెరా నలిగిపోయిందిరా
పడతి నీ కిన్నెరా బడలిపోయిందిరా"

కిన్నెర కరగడాన్ని కదలడాన్ని కవి స్వయంగా అఖ్యాన పద్ధతిలో వర్ణించవలసి వచ్చినప్పుడు ఏవిధమైన అలంకృతలయను పాటించారో సంభాషణ పద్ధతిలో కూడా అటువంటి వాక్యలయనే పాటించడం కవి తాదాత్మ్య భావాన్ని వ్యక్తం చేస్తోంది.

సహజవాక్యలయకంటే, అలంకృతవాక్యలయకంటే ఒక ఉద్దీప్తలక్షణం అధికంగా ఉన్న చరణాలు కూడా విశ్వనాథవారు పోషించారు.

కెరటాలలో నుర్వు
తెరబాలులో నీటి
పొరజాలులో కిన్నె
రటు కదలి యిటు కదలి
చిటితరంగాలతో - పొటితరంగాలతో
నటనాలు మొదలెట్టెనే - క్రొన్నీటి
తుడుములా కదలాడనే.

పై నాలుగు చరణాలు క్రమంగా సహజ వాక్యలయకు, శబ్దాలంకృత వాక్యలయకు, అర్థాలంకృతవాక్యలయకు, ఉద్దీప్తవాక్యలయకు ఉదాహరణలుగా చెప్పవచ్చు. శబ్దాలంకార వాక్యలయను శ్రవణానందాన్ని ఎక్కువగా కలిగిస్తు "క్రొన్నీటి తుడుములా కదలాడనే" అన్నచోట కలిగించిన ఉద్వృత్తియే ఉద్దీప్తిగా భాసించి చరణాన్ని లాస్యమాఁంగా చేస్తుంది. ఇలా కిన్నెరనృత్యంలో ఉద్దీప్త వాక్యలయను ఎక్కువగా పోషించారు. అలాగే గోదావరి సంగమంలో కూడా ఇటువంటి లయనే పోషించడమయింది.

సహజాలంకృత వాక్యలయను, కదలిపొంగులోనూ కిన్నెరసాని దుఃఖము పోషించడం జరిగింది.

అలంకృత ఉద్దీప్తవాక్యలయ - కిన్నెరసాని సంగీతం, కిన్నెర వైభవం.

ఇలా కావ్యమంతా గమనిస్తే విశ్వనాథవారు సహజ వాక్యలయకంటే అలంకృత ఉద్దీప్తవాక్యలయనే ఎక్కువగా పోషించినట్లు స్పష్టమవుతోంది. *

# విశ్వనాథ నవలలు : సామాజిక దృక్పథం

—డా॥ కోవెల సంపత్కుమారాచార్య

ఒక కవి, లేదా ఒక రచయితయొక్క సామాజిక దృక్పథమేమిటి? అనే విచారణలోకి వచ్చామంటే, ప్రధానంగా రెండంశాలు మనముందున్నాయన్న మాట. ఒకటి : మనం ఉద్దేశిస్తున్నకవి, లేదా రచయిత ఒకానొక అసాధారణ సాహిత్య వ్యక్తిత్వం కలవాడయి ఉంటాడు. తన అద్భుతమయిన రచనా శక్తి చేత ఒక వినూతన విధానంలో రచనలద్వారా సామాజికులను తీవ్రంగా ప్రభావితం చేసేవాడయి ఉంటాడు. సాధారణ రచయితల విషయంలో, గతానుగతికుల విషయంలో ఈ విచారణకు దాదాపుగా ప్రసక్తి ఉండదు. కాగా, మొదటి అంశం కవి లేక రచయితయొక్క అసాధారణత్వం. రెండు: సాహిత్యరంగంలో గానీ, మరేరంగంలో నయినాగానీ ఏర్పడే సామాజిక దృక్పథానికి ఏదో ఒక భూమిక, లేదా ఏదో ఒక ప్రాతిపదిక తప్పనిసరిగా ఉంటుంది. నిజానికి ఒకేఒక ప్రాతిపదిక అందరికీ నిరూఢమయి ఉండి ఉన్నప్పుడు ఈ విధమయిన విచారణకుగానీ, చర్చకుగానీ ఆస్కారం ఉండదు. కాగా, వివిధ భూమికలపై వివిధమయిన అంశాలు ప్రాతిపదికలుగా సామాజికమయిన విభిన్న దృక్పథాలు ఏర్పడిన, ఏర్పడుతున్నదశలో మన యీ విచారణ సాగుతున్నదన్నమాట. సమాజాన్ని వేరు వేరు కోణాలనుంచి నిజాయితీగా పరిశీలిస్తున్నప్పుడు, దర్శిస్తున్నప్పుడు ఆయా కోణాంశాలు భిన్న భిన్న దృక్పథాలకు ప్రాతిపదికలు కావటం సహజమేకాదు, అనివార్యం కూడా. ఈ కోణం భౌతికం కావచ్చు, ఆధ్యాత్మికం కావచ్చు; ఆర్థికం కావచ్చు, రాజకీయం కావచ్చు; మతం కావచ్చు, సిద్ధాంతం కావచ్చు .... ఇట్లా జీవితంలో అత్యంత శక్తిమంతమయిన దేదయినా కావచ్చు. మరేదయినా కావచ్చు. మరి, ఈ కోణాంశాలన్నింటిలో ఔచిత్యమయిన సమన్వయం సాధించే దేశీయత కావచ్చు. కాగా, రెండవ అంశం దృక్పథ ప్రాతిపదిక. ఈ ప్రస్తావనదృష్ట్యా విశ్వనాథ సత్యనారాయణగారి ప్రాతిపదికనూ, దాన్నిబట్టి ఆయన సామాజిక దృక్పథాన్నీ అనుశీలించవలసి ఉంటుంది.

'స్వాతంత్ర్యం నా జన్మహక్కు' అంటూ జాతీయోద్యమాన్ని సముద్దీప్తం చేస్తూండిన బాలగంగాధర తిలక్ నుంచి గాంధీగారికి ఉద్యమ సారథ్యం సంక్రమించిన సందర్భంగా 'అవతార పరివర్తనం' అనే నాటకం రచించి సహయోధుడయిన కొడాలి ఆంజనేయులుగారితో కలిసి సత్యనారాయణగారు దాన్ని అనేక చోట్ల ప్రదర్శింపజేశారు. దాన్ని ఆనాటి బ్రిటిష ప్రభుత్వం నిషేధించింది. రచయితమీద అరెస్టు వారెంటు విడుదల చేసింది. అప్పుడు నేరుగా ఉద్యమంలోకి క్రియాశీల కార్యకర్తగా ప్రవేశించ సిద్ధపడిన సత్యనారాయణగారు—

ఇది నా హక్కేపడేని కాదనిన నా యీ ప్రాణముల్ ధారవో
సెద; రక్తమ్మును నోడు; భారతజగత్ శ్రీ లక్ష్మికిన్ బిడ్డ న
య్యేద; కాదం చెవడా వచించునది; నాయీ గుండెలో దూరి చూ
చెదుపో, యచ్చట వ్రాసియున్నవి జనాశీర్విశ్వకల్యాణముల్.

అంటూ ఆవేశపడిపోతున్నప్పుడు అప్పటి ఇతరేతర పరిస్థితులను బట్టి ఆంజనేయులు గారు ఆయనను నివారించి ఆ నాటక కర్తృత్వం తన మీద వేసుకొని జైలుకు వెళ్ళారు. అందుకు మనస్సులో విపరీతంగా గగ్గోలు పడ్డ సత్యనారాయణగారు 'ఆంధ్రప్రశస్తి' కావ్యాన్ని మల్లంపల్లి సోమశేఖర శర్మ గారికి అంకితం చేస్తూ - 'హృదయంబులు నీకు నాకు మాతృదేశావిల దుఃఖ దారితములై శృతిగల్పె విషాద గీతికని .... తోడి సైనికులమై చూరాడు ప్రేమంబులో నిది లేశం బనియైన జెప్పుటకు లేవే నాటి స్వాతంత్ర్యముల్' అని వాపోయారు. కాగా, తాను అప్పట్లో నేరుగా ఉద్యమంలో చేరే విషయంలో ఉత్పన్నమయిన సమస్యను భూమికగా చేసుకొని అనంతరకాలాన 'శకుంతలవిధి కెవరు కర్తలు?' తెలంగాణా విముక్తి పోరాటం సందర్భంగా రచించారు. తీవ్రోద్యమ బద్ధులయి, వివిధోద్యమాలలో పడిపోయేవారు సరె;వారు స్వాతంత్ర్యయోధులుగా, వీరులుగా, మృతవీరులుగా పేరుకెక్కవచ్చు, కీర్తింపబడవచ్చు. కాని, సామాన్య కుటుంబాలలో ఆ ఉద్యమోపజీవులపయి ఆధారపడిన అమాయకులు, వేరే గతి లేని వారయిన భార్యాపిల్లల సంగతేమిటి? ఈ సమస్యనే మరొకవిధంగా 'వేయి పడగలు' నవలలో రాఘవరావు పాత్రలో సత్యనారాయణగారు చిత్రించారు. నిజానికి సామాజికమయిన ఈ సమస్యను మరెవరూ పట్టించుకొన్నట్టు గానీ, చిత్రించి ఆలోచింప జేసినట్టుగానీ కన్పించదు. మొత్తానికి ఈ సమస్య ఆయనను

చివరిదాకా వేధించినట్టు కన్పిస్తుంది. 'సముద్రపు దిబ్బ' నవలలో నీలకంఠము, పినాకి పంటి వారి చిత్రణలో గూడ ఈ అంశం మిళితమయింది. కాగా, దీన్నే మరొక విధంగా 'స్వర్గానికి నిచ్చెనలు' నవలలో ప్రస్తావించి - 'ఆ కుటుంబమున కన్నదాతయయినవాని చెరలోనుంచి నిర్బంధించుట - వాడు దోషియగుట చేతనే యనుకొనుడు - రాచరికమువారికి తెలియును. దాని పేరు స్మృతిశాస్త్రము. వాని సంపాదనమీద నాధారపడియున్న నాలుగయిదు ప్రాణముల మాట యేమి కావల యును? 'శిక్షించుట మా వంతు, రక్షించుట మా వంతు కాదనట్లున్నది' (పు. 529).

ఈ విధంగా సామాజికంగానూ, రాజకీయంగానూ ఈ సమస్యను పరిష్కరించ వలసిన అవసరాన్ని సత్యనారాయణగారు పాఠకుల ముందుంచారు. ఈ విధంగా ఆయన నవలల్లో, కథల్లో ఎన్నెన్నో విధాలయిన సామాజిక రాజకీయార్థికాది సమస్యలు పాఠకులను నిలువరించి ఆలోచింపజేస్తాయి. కొడాలి ఆంజనేయులు గారు - ఒకప్పుడు తన 'జంటకవియున్, ప్రియమిత్రము' నయిన వారు 'మహాత్ముని అనిలేని సేన బడిపో'గా సత్యనారాయణగారు సాహిత్య రంగంలో వాగాయుధుడై 'అనిలేని సేన' నిర్వహించి సాంస్కృతిక పోరాటాన్ని స్వాతంత్ర్యోద్యమ స్థాయిలో నడిపించారు.

ఇంచుమించుగా గాంధీగారు దేశీయోద్యమం రంగంమీదికి వచ్చిన కాలం లోనే సత్యనారాయణగారు కూడా సాహిత్యరంగానికి వచ్చారు. ఉద్యమాన్ని తన చేతుల్లోకి తీసుకొని నడిపించటానికి ముందు గాంధిగారు దేశమంతా తిరిగి పరిస్థితుల్ని అవగతం చేసుకొన్నారు. మరి సత్యనారాయణగారు గూడా సాహిత్య రంగాన ఆనాడు ఒంటరి యోధుడుగా అనవరతంగా సాంస్కృతిక యుద్ధాన్ని నిర్వహించటానికి ముందు దేశ చరిత్రనూ, సమాజ స్వరూపాన్నీ, స్వభావాన్నీ ఆర్థిక సామాజికాది వివిధ శాస్త్రాలనూ దేశీయంగానూ, విదేశీయంగానూ గాఢంగా అధ్యయనం చేశారు. దేశీయ విజ్ఞాన నికషంపై దేశీయేతర విజ్ఞాన విషయాలను నిగ్గు తేల్చుకొని-తానేమిటో; సమాజంపట్లా, మనిషిపట్లా దేశంపట్లా తన బాధ్యత ఏమిటో, కర్తవ్యమేమిటో కచ్చితంగా నిర్ణయించుకొని ఆరంభించిన ఉద్య మాన్ని జీవితంలో చివరి నిముషందాకా ఎత్తిన కలం దింపకుండా సాగించారు. గాంధీగారు సహాయ నిరాకరణోద్యమం ఆరంభించిన రెండేళ్ళలోనే సత్య

నారాయణగారు 'వేయి పడగలు' రచన ద్వారా సాంస్కృతికోద్యమాన్ని తీవ్ర పరిచారు. అంతకుముందే 'అంతరాత్మ చెలియలికట్ట' నవలలు నాందీ ప్రస్తావనల వంటివి. 'వేయి పడగలు' గూర్చి చెబుతూ సత్యనారాయణగారు ఒక సందర్భంలో - 'తెలుగుదేశంలోని జన జీవితాన్ని ఒక బెత్తెడు ఎడంకూడా వదిలిపెట్టకుండా వేయి పడగలులో పట్టాను' అన్నారు వేయి పడగలు చదివిన వారందరికీ ఇది యథార్థమని స్పష్టపడుతూనే ఉంది. 'తెలుగుదేశ' మనటం నవలలోని కథాస్థానం దృష్ట్యా అన్నమాట మాత్రమే. నిజానికి 'వేయిపడగలు అంతరార్థము' ప్రసంగంలో ఆయనే స్పష్టపరచినట్టు ఆ నవలలోని 'సుబ్బన్న పేట ఈ దేశానికంతకీ లక్ష్యభూతమయిన గ్రామంగా చెప్పబడింది.' ఆనాడు మొత్తం భారతదేశం 'రూపం' 'సుబ్బన్న పేట'గా చిత్రించబడింది. అంతేకాదు; ప్రాంతం, దేశంనుండి విశ్వానికి వ్యాపించిన తీరు వేయిపడగలులో చిత్రించబడింది. ఆ తీరుకి 'మనిషి' ప్రాతిపదిక, మనిషి జీవితం ప్రాతిపదిక.

సత్యనారాయణగారు జీవితాన్ని పుస్తకాలలో చదవలేదు. సిద్ధాంతాల ద్వారా పరిశీలించలేదు. ఏవో కొన్ని సూత్రాలలో ఇరికించి పరికించలేదు. మధ్య దళారీలు ఎవరూ లేకుండా ఆయన 'జీవితా'న్ని చేరుకొన్నారు. జీవితంలోని ఇంచుమించు అన్ని ఒడుదుడుకులనూ అనుభవించారు. అనుభవపూర్వకంగా వివిధ కోణాలనుంచి మనిషికి సంబంధించి అన్ని స్థాయుల జీవితాన్ని పరిశీలించారు, విశ్లేషించారు. జీవితంలోని - దుఃఖాన్ని దాని మూలాలనూ, స్వరూప స్వభావాలనూ లోతుగానూ, గాఢంగానూ అవగాహన చేసుకొన్నారు. అదంతా తన నవలల్లో వాస్తవంగా చిత్రీకరించారు.

'ఊహ లేదు, కల్పన లేదు; వట్టి జాగ్రత్ స్వప్నానుభూతి నా కవిత్వము' అన్నారాయన ఒక సందర్భంలో. కవిత్వం మాత్రమేకాదు, ఇది ఆయన సృష్టించిన సాహిత్యం మొత్తానికి అన్వయిస్తుంది. అన్వయిస్తుంది కాబట్టే ఆయన నవలలన్నీ వాస్తవిక చిత్రణకు పతాకాప్రాయంగా, ప్రమాణభూతంగా దర్శనమిస్తాయి. ఆయనను తీవ్రంగా 'విమర్శించే' వారుగూడా అంగీకరించక తప్పని సరయిన అంశమిది. ఆయనకు ఈ సమాజంమీదా, మనుషులమీదా, లోకంమీదా ఉన్న అపారమయిన ప్రేమ, మమతానురాగాలే ఆయన రచనల్లో ఇంతటి వాస్తవికతకు, దాని చిత్రణకు మూలం. ఆయన మమత ఎంతటిదంటే—

సీతాదేవిని అపహరించుకొని వెళ్ళిన రావణుడు ఆమెను అశోకవనంలో నిర్బంధించాడు. ఆమెను అన్వేషిస్తూ ఆంజనేయుడు అక్కడికి చేరుకొన్నాడు. అక్కడ రావణ నియుక్తలయిన రాక్షసస్త్రీలవల్లా, రావణునివల్లా ఆమె పొందు తున్న దుఃఖమూ ప్రత్యక్షంగా చూచాడు. సమయం చూసుకొని పరమ దుఃఖ మూర్తిగా ఉన్న ఆమెముందుకు నేరుగా వెళ్ళాడు. పరస్పర పరిచయ సంభాష ణలు, ఓదార్పుల వంటివి అయింతరువాత, తనపట్ల రామదూత అన్న విశ్వాసం కుదిరాక రామచంద్రుని ఉంగరాన్ని ఆమెకిచ్చాడు. ఆమె ఆ ముద్రికను చేతిలో ఉంచుకొని "చాలసేపు ధ్యాననిమగ్నయై - ఓయి! స్వామి బ్రతికియున్నాడ! ఉండిన, చండవారి ముఖరజలధి రశన ధరణి మండలంబు తగులంగబెట్టడా? ప్రళయకాల వహ్ని పగిదిలేచి' అనిన హనుమ భీతుడవుచు వినీతుడై కనుల యందు జాలి కందళింప క్ష్మాతనూజజేరి కైమోడ్పుమైజోడుగాగ నిట్టులనియె కరుణతోడ.' ఉపసంహరింపు మింతటి కృపమాలిన యట్టి కోప, మెవడో తులువ తానపమార్గగామి యయినను విపులసుపర్వమున నిప్పు నెట్టెదరటవే!.... వట్టి పిచ్చిజగము పట్టి పాలార్చుకు, దంబ! కొంటి మీ పదాంబుజములు' అనిన, జానకీదేవి 'జగత్తుపై నింత మక్కువ గల యిత డెవడో సృష్టికర్త యనుకొని ప్రసన్నురా''లయింది

ఇది సత్యనారాయణగారి రామాయణ కల్పవృక్షం (సుందర. ఉషః. 206-213) లోని సన్నివేశం సత్యనారాయణగారికి జగత్తుపైగల మక్కువ అంతటిది. 'వట్టి పిచ్చిజగము' అనటంలోనే మక్కువ యొక్క స్వరూపం, మమతానురాగాలలోని గాఢత్వం, కరుణ వ్యక్తమవుతున్నాయి. జగత్తు అమా యక మయింది. తనబతుకేదో తాను సుఖంగా, శాంతంగా బతుకుదామను కొంటుంది. ఆ బతుకు బతుకతూ ఉంటుంది. కాని, కొందరు తులువల వల్ల, తులువదనం వల్ల ఆ సుఖశాంతులను విచ్ఛిన్నపరిచే సంక్షోభం కలుగుతూ ఉంటుంది. అప్పుడా తులువలనూ, తులువదనాన్నీ తొలగించవలసిందే తప్ప జగత్తు మొత్తానికి వినాశం కలిగించేందుకు ఉద్యమించటం సరయిన విధానం కాదు. 'ధరణి మండలా'న్ని తగులంగ బెట్టాలన్న 'క్ష్మాతనూజను' ఆంజనేయుడు ఆ విధంగా ఉద్బోధించాడు కాగా ఈ చిత్రణ జగత్తుపట్ల సత్యనారాయణగారికి గల మమతానురాగాలకు; తులువల పట్ల తులువదనం పట్ల అయనకుగల తీవ్ర వ్యతిరేకతకూ; ఆ విధంగా జగద్విషయంలో అయన గుర్తించి స్వీకరించిన

బాధ్యతకూ కర్తవ్యానికి ఒక ఉదాహరణ. ఆయన సాధారణ రచయిత కాదన టానికి ఈ విషయం చాలు. ఆయన ఈ శతాబ్దపు భారతీయ జీవన మౌలిక చైతన్యం సృష్టించుకొన్న అద్భుత ప్రతిభావంతులలో, మేధావులలో అగ్రశ్రేణికి చెందిన మహానుభావుడు కావటాన వ్యక్తి, సమాజం, దేశం, జగత్తుపట్ల తన బాధ్యతనూ, కర్తవ్యాన్ని గుర్తించిన సత్యనారాయణగారు వాటిని నిర్వహించే మార్గంగా అత్యంత విస్తృతమయిన సాహిత్య సృష్టికర్త. ఆయన దృక్పథం ఆయన సర్వ సాహిత్యంలోనూ వ్యక్తమవుతుంది.

వందమంది పేదవారి నెత్తురు గడ్డ
కట్ట నీవు మేడ కట్టినావు;
వారి యుసురు తీవ్రవాయువు వీవగా
తూలి మేడ నేలగూలిపోవు

అని శ్రీ కుమారాభ్యుదయ కావ్యంలో దేవసేన మాటలలో తులువల తులువదనాన్ని నిరసిస్తారు. వేయి పడగలులో ఒకచోట-

'మరబియ్యముతో ప్రాణము పోవుచున్నది. తిన్నవారికి నాయుర్దాయము క్షీణించుచున్నది. పేదలకు దంచిన కూలినూకలు వచ్చుటలేదు బస్తావడ్లు నలుగురు పేదవాండ్రు దంచెదరు. నలుగురకు నారోజు తిండికి బియ్యము దొరుకును. పెట్టుబడి పెట్టి మిల్లులు పెట్టిన సాహుకారిట్టి వందనలుగురి నోళ్ళలో దుమ్ము కొట్టి తాను ధనవంతుడగు చుండెను. వానికి తిండి చాలకయా? అమిత ధనాభిలాష! అయ్యో; జనుడు ధనముతో నేమిచేయును? దుర్వ్యవసాయములు పెంపొందించుకొనును నూటిలో తొంబది తొమ్మిది మందికి తిన తిండి లేకుండ జేసి ఒక్కడే ధనమంతయు ప్రోగుచేసి మేడలు కట్టును. మోటారులు కొనును. దుష్టవస్తువులను కొనుటకు ఉపయోగించును. భోగముదానికిచ్చిన డబ్బు మోటారులు కొన్నదానికన్న చెడిపోయినదా? ఇది యేదో యొక పేదజీవి బ్రతుకుట కుపయోగపడినది. మోటారు కొన్న డబ్బు అమెరికాలోని కోటీశ్వరులు పోర్డు, రాక్ఫెల్లర్లను బాగు చేయుచున్నది.' (పు.443) అని ధర్మారావుద్వారా అంటారు. ఇక్కడ పెట్టుబడిదారి వ్యవస్థను, మనుష్యులను పేదలుగా చేసి, వారిమీద క్రూరంగా వేటువేయటాన్ని ఆయన వ్యతిరేకించటం స్పష్టంగానే తెలుస్తున్నది.

'సముద్రపు దిబ్బ' నవలలో నేతవృత్తివారి విషయంగా ఒక ఊరిలోని విషయం వివరిస్తూ—

'(నేతగాండ్రు) అందరును పేదవారు దిక్కుమాలినవారు. ఒడలిమీద నంగికూడ లేనివారు. యంత్రపునూలు కావలయును. ఆ నూలు దొరుకదు. దానిమీద బోలెడంత పన్ను. రంగులు దొరకవు. దేశీయములయిన రంగులు వండుటయే మరచిపోయిరి........నెలకు నాలుగు చీరలు నేసినచో వానికి వచ్చెడు లాభము నాలుగు రూకలు. వాని మాసవ్యయము పది రూకలకుమించి యుండును. వీని వద్ద చీరెను మూడు రూకలు పెట్టి అమ్మెడువాడు కొనును. వాడు దాని నారు రూకల కమ్మును. బాగుపడెడువాడు వీడుకాడు. వీనిని పాలించెడువాడు లేడు. కొనెడివాడు వానివద్ద కొనునుగాని వీనివద్ద కొనడు. వీడసలు వానికమ్మడు. ఆ యమ్మెడివాడు వీడు నేసిన ప్రతి గుడ్డను నిస్సందేహముగా కొనును. నడుమ వీడమ్ముకొన్నచో రేపు వాడు కొనడు. సరికదా, సంఘాధ్యక్షుడు వీనిని వెలివేయును. ఆ రీతిగా నేతగాడు బాధపడుచుండెను. ప్రతి పదమునందు నెవనికో దబ్బుచేసి పెట్టుటయే కాని, తాను పడ్డ శ్రమ తాను ఫలింపజేసుకోలేకున్నాడు' (పు. 392) అంటూ నేతగాండ్ర శ్రమ దోపిడీని బట్టబయలుచేశారు. ఈ విధంగా రకరకాల వృత్తులవారు, పనులవారూ దోచుకోబడుతున్న తీరును, దానికి మూలమయిన వర్తమాన క్రూరవ్యవస్థను వ్యతిరేకించారు సత్యనారాయణగారు. ఈ ఉటంకింపులు తొలినాళ్ళ రచనల నుండి చివరి నాళ్ళ రచనలదాకా ఉండటం గుర్తిస్తే సత్యనారాయణగారు ఇంత సుదీర్ఘకాలం మీద సాగించిన పోరాటం క్రమం స్పష్టపడుతుంది.

'ఆయువు సరిగా నున్నచో ప్రతి వ్యాధియు దానియంతట నది సర్దుకొనును. పుష్టియు బలువును నుండవు. మనుష్యులట్లే బ్రతుకుచుందురు. లేనిచో తిండికిలేని యీ దేశమున నిన్నికోట్లమంది ఎట్లు బ్రదుకుచున్నారు?' అని 'స్వర్గానికి నిచ్చెనలు' నవల (పు. 150) లో వ్యంగ్యం మనుషుల నికృష్టజీవితంపై ఆయన పడే వేదనకు సాక్ష్యమిస్తుంది.

'ప్రజల యొక్క సుఖం ప్రజల యొక్క బ్రతకటం ఈ రాచరికం వాళ్ళకు ఏమీ పట్టదు. వాళ్ళకు పట్టేది ఒకటే- పన్నులు ఎలా వసూలు చేయాలి? లాకి వ్యతిరేకంగా ప్రవర్తిస్తే ఎలా తన్నాలి? మూడో విషయం వాళ్ళకి అక్కర

లేదనుకో.... ఈ రాజ్యంలో మానవునియొక్క నీతినియమాలు పాలించే లక్షణాలు లేవన్నమాట? బాబూ! ఈ దేశంలో మనమందరమూ మనుషులమేనా?'

(దమయంతీ స్వయంవరం, పు. 45, 72)

ఈ చివరి ప్రశ్న ఈనాటి పాలనా వ్యవస్థ సాగే తీరుపై సత్యనారాయణ గారి తీవ్ర వ్యతిరేకతను, ప్రతిఘటన లక్షణాన్ని వ్యక్తీకరించటంతోబాటు తీవ్ర వేదనను గూడా గుండెను పట్టుకుంటుంది.

మరి, ఈనాటి ఈ పరిస్థితులకు మూలమేమిటి? 'దమయంతీ స్వయం వరం'లోనే ఒకచోట—

'మనకు స్వరాజ్యం వచ్చిన తరువాత మన దేశంలో పది మంది ఎట్లా సుఖంగా బతుకుతారన్న విచారణ మనం చేసుకోవాలిగాని, (స్వరాజ్యం రావటానికి ముందున్న బ్రిటిష) వాడి సూత్రాల ప్రకారమే చేస్తే, ఇంకా స్వరాజ్యమేమిటి?' (పు. 27).

అంటారు సత్యనారాయణగారు. అంటే, మన దేశంలోని ప్రజల జీవితంలో సుఖశాంతుల కోసం మన దేశాని కనుగుణమయిన స్వతంత్రాలోచనాపూర్వక మయిన విధానం రూపొందించుకోవలసి ఉంటుంది. అప్పుడే సరయిన వ్యవస్థ మనకు ఏర్పడుతుంది తప్ప ఇతర దేశాల పద్ధతులను బలవంతంగా అన్వ యించటంవల్ల సంక్షోభం మాత్రమే కలుగుతుంది. ఈ దేశంలో 'స్వాతంత్ర్యం' 'స్వరాజ్యం' వచ్చిన్నాటినుంచి రాజ్యాంగాన్ని రూపొందించుకోవటం దగ్గర మొదలుపెడితే, ఇంచుమించు ప్రతిదీ పరాయి దేశాలనుంచి ఎరువు తెచ్చుకొని మురిసిపోవటమే కన్పిస్తుంది. అందుకే ప్రజల జీవితాన్ని సుఖమయంగా, శాంతి మయంగా చేయవలసిన ప్రతిరంగంలోనూ వైఫల్యాలనే ఈ దేశం అనుభవిస్తూ ఉంది. వివిధ రంగాల్లో అభివృద్ధి సాధించామంటూ రాచరికంవారు చేసే ఆర్భా టాలూ, ప్రదర్శనలూ వట్టి నేతిబీరకాయలుగానే మిగిలిపోతున్నాయి. సామాన్య ప్రజానీకానికి నెయ్యి తేనే లేదు సరికదా, కనీసం నీళ్ళయినా దొరక్కుండా పోతున్న దశ అందరూ అనుభవిస్తున్నదే కాగా, సమాజంలో జనుల యొక్క సుఖశాంతులకు, వాటిని కలిగించే విధానాలకు సంబంధించిన విచారణ దేశం ప్రాతిపదికగా సాగవలసి ఉంటుంది. అందుకనే, సత్యనారాయణగారి సామాజిక దృక్పథానికి ప్రాతిపదిక దేశీయత.

ఒక దేశం, ఆ దేశంలో జీవితాన్ని అనుభవిస్తున్న జాతి జీవితాన్ని గూర్చి, జీవిత పరమార్థాన్ని గురించీ ఆ జాతి చేసిన విచారణా, వేసుకున్న ప్రశ్నలూ, అనుభవాలద్వారా స్పష్టపరచుకొంటున్న ఆలోచనా, దాని నుంచి పొందిన సమాధానాలూ, వాటినుంచి ఎప్పటికప్పుడు రూపుదిద్దుకొనే ఆచరణ విధానమూ ఒక ప్రత్యేకమయిన తరహాలో ఉంటుంది. అందరూ మనుష్యులే, కాని ప్రతి మనిషి ఇతరులతో విభేదించే ఒకానొక ప్రత్యేక లక్షణంతో ఉంటాడు. ఆ ప్రత్యేక లక్షణమే - మంచో, చెడ్డో - ఆయా వ్యక్తులకు గుర్తింపుగా ఉంటుంది. ఆ లక్షణం లేకపోతే గుర్తింపు ఉండదు. కాని, ఉంటున్నది. ఉండటం సహజమూ, వాస్తవమూ. సరిగ్గా ఇదే తీరు దేశాల విషయంలోనూ వర్తిస్తుంది. అన్ని దేశాల్లోనూ మట్టి ఉంటుంది; గాలీ, నీరూ, చెట్లూ, చేమలూ వగైరాలన్నీ ఉంటాయి; మనుషులూ ఉంటారు; పశువులూ, పక్షులూ, జంతువులూ, అడవులూ, కొండలూ, వాగులూ, వరదలూ, పాడీపంటా ఆయా దేశాల భౌగోళికతను బట్టి ఉండనే ఉంటాయి. కాని, దేశ దేశానికీ కొన్ని కొన్ని ప్రత్యేక లక్షణాలుంటాయి. ఆ దేశీయమయిన జాతి తన అవసరాలూ, అనుభవాలూ, ఆలోచనా నైశిత్యాన్నిబట్టి, విచారణాదక్షతనుబట్టి సంపాదించుకొన్న, రూపొందించుకొన్న జ్ఞాన - విజ్ఞానాదులూ మొదలయిన వాటినిబట్టి జీవితానికి సంబంధించి ఒక ప్రత్యేకమయిన దృక్పథాన్ని ఏర్పరచుకొంటుంది. అది దానికి సహజమయింది, అభ్యుదయకరమయింది. మరి, దానిమీద మరొక విధమయిన ఆలోచనా - జీవన విధానాలు బలవంతంగా రుద్దబడ్డప్పుడు అనివార్యంగా సంఘర్షణ మొదలవుతుంది. ఈ సంఘర్షణలో శక్తిహీనమయిన జాతి - ఈ శక్తి సంస్కృతికీ, వ్యవస్థకూ, ఆలోచనకూ, నిష్ఠకూ.... ఇట్లా దేనికి సంబంధించిందయినా, వేటికి సంబంధించిందయినా కావచ్చు, అది హీనమయినప్పుడు- తన అస్తిత్వాన్ని కోల్పోతుంది. పరాయిదానిలో లీనమయి, క్రమంగా అదే తానయి పోతుంది. కాని, శక్తిమంతమయిన జాతి తనను రక్షించుకొంటూ, ఉపరితలంలో కొన్ని మార్పులు పొందినా గూడా తన మౌలిక లక్షణాలను, పరమార్థాభిముఖ ప్రవృత్తి లక్షణాన్ని కోల్పోకుండా ఆక్రామక శక్తిని ఎదిరించి నిలద్రొక్కుకొంటుంది. ఘర్షణ ద్వారా పొందిన అనుభవాలతో, ఉపజ్ఞతో మరింత పటిష్ఠమవుతుంది. ఇందుకు మన దేశమే ఒక ప్రత్యక్షమయిన ఉదాహరణ.

ఈ దేశం మీద ఎన్నెన్ని రకాలుగా పరాయిదాడులు సాగాయో మరి! అన్నింటికన్నా క్రూరంగా దేశీయమూలాలనే విచ్ఛిన్నపరిచే విధంగా, నశింపజేసే విధంగా సాగింది బ్రిటీషువారు చేసిన దాడి కాని, దాన్నిగూడా తట్టుకొని నిలువ గలుగుతున్నది ఈ దేశం మరుపున వేయబడిన మూలాలను మరలా గుర్తించు కొని నిలువరించుకొన్నది. అట్లాంటి ఈ దేశం గూర్చి, ఇక్కడి మనుషులనూ, సమాజాన్నిగూర్చి ఆలోచించేప్పుడు దేశీయ మౌలిక జీనన ప్రవృత్తిని భూమికగా చేసుకోవలసి ఉంటుంది. సత్యనారాయణగారి ఆలోచనకూ, దాని ద్వారా రూపొందిన దృక్పథానికి అదే భూమిక అయింది. ఆధునికతను సంతరించుకొంది. అయితే—

ఇటీవలి శతాబ్దాల్లోని బ్రిటీషు పరిపాలనవల్ల ఈ దేశానికి 'ఆధునికత' సంభవించిందనే అపోహ ఒకటి వ్యాప్తిలో ఉంది. నిజానికి ఆధునికత ఒకరి ద్వారా వచ్చేది కాదు. ఒక దేశం తన ప్రాచీనత, సంస్కృతుల పునాదిమీద పెంపొందిన స్వతంత్రమయిన ఆలోచనా విధానంతో, అనుభవాల విశ్లేషణతో ఇతరేతరమయిన ఆటుపోటుల నుండి నిలువరించుకొని సాగించిన ఆచరణ విధానంతో 'ఆధునికత'ను ఎప్పటికప్పుడు సంపాదించుకొంటూ ఉంటుంది. నిజానికి, అదే ఆ దేశానికి సహజమయిన ఆరోగ్యకరమయిన ఆధునికత. అయితే, ఈ దేశాన్ని తన కుట్రలతో, కుహకాలతో దౌర్జన్యంతో తనగుప్పిట్లో చిక్కించు కొన్న బ్రిటిషు కుటిల రాజనీతి ప్రభుత్వం ఈ దేశాన్ని ఒక వలస దేశంగా మార్చింది. ఉపభోగ్యవస్తువుగా మార్చింది. బానిస విద్యావిధానాన్ని బలవంతంగా ఈ దేశం నెత్తినరుద్ది స్వతంత్రమయిన ఆలోచనను చంపింది. దేశాన్ని ఏనాడూ ఏకంకానీయని విధంగా ద్విజాతి, బహుళజాతి సిద్ధాంతాలు తలకెక్కించి, జాతి-కుల-వర్గ విభేదాలను సృష్టించి, రకరకాలుగా పరస్పర విదేషాలను రెచ్చగొట్టింది. అనువుగాని విధంగా పారిశ్రామిక విధానాలను సంక్రమింపజేసింది. వృత్తులను నాశనం చేసింది అంతకుముందులేని భూస్వామ్యదోపిడీ వర్గాన్ని సృష్టించింది. ప్రవృత్తులను కలుషితం చేసింది. ఈ దేశాన్ని అన్ని విధాలా దోపిడీ చేసింది. అట్లాంటి బ్రిటీషపాలన ఈ దేశపు 'విద్యాధిక' జనానికి నేర్పిన ప్రధానాంశం ఈ దేశపు సామాజిక ప్రవృత్తిమీదా, నిర్మాణం మీదా, సంప్రదాయాలమీదా, మౌలిక విషయాలమీదా నిరసన, ద్వేషం, దుర్వ్యాఖ్యానీకరించటం. ఈ విధ మయిన వాటివల్ల అభిభూతమయిన ఆలోచనా విధానాన్ని, ఆచరణ ప్రవృత్తినీ,

జీవన మార్గాన్ని 'ఆధునికం'గా, అదే 'ఆధునికత'గా భావిస్తూండటం, ఆ తీరును వ్యతిరేకించటాన్ని ఆధునికతా విరోధమని అప్రతిష్ఠ పాలు చేయటం ఒక దౌర్జన్యంగా సాధారణమయిపోయింది. నిజానికి, ఈ దేశానికి ఆధునికమయిన ఆలోచననూ, జీవన ప్రవృత్తిని సంపాదించి పెట్టింది బ్రిటీషు ప్రభుత్వం గానీ, ఆ ప్రభుత్వపు ఆలోచనా విధానానికి ఎత్తుగడలకూ కట్టుబడి, దానికి అనుకూలమయిన భూమికమీద 'సంస్కరణ' సాగించిన వారుగానీ కాదు. అట్లాంటి తీరును ప్రతిఘటించి దేశీయత భూమికగా ఆధునిక విచారధారనూ, ప్రవృత్తినీ దేశానికి అందించినవారు శ్రీ రామకృష్ణపరమహంస, శ్రీ వివేకానందుడు, శ్రీ అరవిందుడు, గాంధీమహాత్ముడు, జిడ్డు కృష్ణమూర్తి, రమణ మహర్షి మొదలయినవారు. ఈ మహానుభావులందరూ దేశీయత ప్రాతిపదికగా రాజకీయార్థిక సామాజిక, విద్యా వైజ్ఞానికాదులయిన అన్ని విషయాలలోనూ, సామాజిక సంబంధాలు, సమాజ నిర్మాణం విషయంలోనూ ఆధునిక దృక్పథాన్ని పటిష్ఠంగా ప్రసరింపజేశారు. అయితే, వీరందరినీ, దేశీయమయిన ఆధునికతనూ వక్రీకరిస్తూ నాడేకాదు, ఈనాడు గూడా ఒకవర్గం పరాయి పెత్తందారీతనాన్ని మోసుకు తిరుగుతూనే ఉంది. పరాయీకరణ పొందిన ఈ వర్గాన్ని ఉద్దేశించి—

'India must be governed on the basis of Indian feelings, Indian traditions, Indian thoughts and Indian ideals.'

అంటూ అనీ బిసెంట్ హెచ్చరించింది. అయినా, దేశీయమయిన ప్రతిదాన్నీ నిరసించటం, ద్వేషించటం, దుర్వ్యాఖ్యానించటం నేర్చిపోయిన వారికి భావదాస్యం చేస్తూండటం నేటికీ కొన్ని వర్గాలలో సాగుతూనే ఉంది. అదే విధంగా ఈ దేశానికి, సమాజానికి ఇముడని దేశీయేతర భావజాల-సిద్ధాంత వ్యామోహం ముమ్మరమవుతూనే ఉంది. కాగా, ఈనాడు దేశీయ - దేశీయేతర భావజాల - ప్రవృత్తుల మధ్య సాగుతున్న సంఘర్షణలో సంప్రదాయం, సమాజం మొదలయిన పదాలేకాదు, మొత్తం సమాజమే సతమతమయి నలిగిపోతున్నది.

'సంప్రదాయం' అనేది గూడా అప్రతిష్ఠపాలు చేయబడుతున్నది. కరుడు గట్టిన మూర్ఖత్వంగా, హేతురహితమయిన అంధవిశ్వాసంగా, ప్రగతినిరోధకంగా ప్రచారం చేయబడుతున్నది. నిజానికి ఈ లక్షణాలు కలది 'సంప్రదాయం'

కాదనీ, సృజనాత్మక ప్రగతిశీలవ యిందనీ దేశీయత నిరూపిస్తున్నది. అందుకే- Tradition is not mere mechanical reproduction, It is creative transformation' అని సర్వేపల్లి రాధాకృష్ణ (Recovery of faith : P. 8) అన్నారు. సంప్రదాయానికి సంబంధించి దేశీయమయిన ఈ అవగాహన సమాజ విషయంలోనూ అవసరం.

'సమాజ' మనేది ఒకానొక సువ్యవస్థితమయిన మానవ సమూహమే తప్ప వట్టి మనుషుల గుంపుకాదు. మనుషులూ గుంపుగా ఉండవచ్చు. పశువులు గూడా గుంపుగా ఉంటాయి. పశువుల గుంపును 'సమజం' అంటారు. ఈ 'గుంపు' స్థాయిని అధిగమించి ఒక సువ్యవస్థతో, సమన్వయభావంతో, పరస్పర సహకార విధానంతో, పరస్పర ప్రేమ భూమికగా త్యాగలక్షణంతో ఒకటిగా ఏర్పడ్డ మానవుల సమూహాన్ని మాత్రమే 'సమాజం' అంటారు. 'సమజ - సమాజా'లకు నడుమ దీర్ఘమే తేడా. ఇది వ్యాప్తికి సూచకం. అదట్లా ఉంచి; మనిషిని ఆర్థిక జంతువుగానో, సామాజిక జంతువుగానో 'జంతు భావన'తో పరిగణించటం ఈ దేశపు ఆలోచనా విధానం కాదు. జంతు దశను అధిగమించినప్పుడే మానవుడు. అతనితో ఏర్పడిందే సమాజం. వ్యక్తియొక్క విస్తృతరూపమే సమాజం. వ్యక్తికి బహువచనం సమాజం. అందువల్లనే సమాజంలో ఏకాత్మత భావించబడుతున్నది. సమాజంలోని వ్యక్తులు వ్యక్తులుగా- వ్యష్టిగా ఉంటూనే 'సామాజిక వ్యక్తులు'గా - సమష్టిగా వ్యవహరిస్తూ ఉంటారు. ఈ రెండు ప్రవృత్తులూ నైరుధ్య విరహితంగా సమన్వితమయి ఏకీ భావ లక్షణాన్ని సంపాదించుకొంటాయి. వ్యక్తులకు కేవలం భౌతిక జీవనం మాత్రమే కాదు, మానసిక జీవనం గూడా ఉంటుంది; అధ్యాత్మిక జీవనం గూడా ఉంటుంది. ఈ మూడింటి సమన్వయాన్ని ఏక మొత్తంగా సమాజం పరిరక్షించుకొంటూ ఉంటుంది; ఎదిగించుకొంటూ ఉంటుంది. కాగా, ఈ విధమయిన సమన్వయాలకు ప్రాతిపదిక 'ధర్మం' అని ఈ దేశం తన స్వతంత్రాలోచనానుభవ దర్శన పూర్వకంగా నిర్ధారించుకొంది. ఈ ధర్మం మీద ఆధార పెట్టి మిగిలిన మానవ ప్రవృత్తులను సమాజం వ్యవస్థీకరించింది. అర్థ - కామ - మోక్షాలను ధర్మబద్ధం చేస్తూ ధర్మార్థ కామ మోక్షాలను మానవ జీవన లక్ష్యాలుగా నిర్ధారించింది. అర్థకామాల ప్రవృత్తి ప్రధానంగా భౌతిక - మానసిక స్థాయులకు చెందింది కాగా, మోక్షం ఆధ్యాత్మికమయింది. చివరిది ఆయా వ్యక్తుల వైయక్తికమయిన ఆధ్యాత్మిక ప్రవృత్తియొక్క ఎదుగు

దలకు సంబంధించింది. అందుకని, జీవితానికి చరమ లక్ష్యం మోక్షమే అయినా దాన్ని కొంత విడిగా చేసి, ధర్మార్థ కామాలను 'త్రివర్గం'గా నిరూపించింది. కాగా, భారతీయ సమాజ నిర్మాణం ధర్మమూలమయింది.

వివిధ కోణాలనుంచి విశ్లేషించి ప్రవర్తింపజేయబడిన ఈ ధర్మం భూమికగా, అవసరానికనుగుణంగా వర్ణవ్యవస్థ ఏర్పాటయింది. రోజువారీ నిత్య జీవితంలో పోటీకి ఆస్కారం కలక్కుండా పరస్పర సహకార పద్ధతిపై పనుల పంపకంగా ఏర్పడ్డ ఈ వ్యవస్థ ఉపరితల నిర్మాణానికి సంబంధించింది. అందువల్ల, అవసరాన్నిబట్టి దీని విస్తృతికి అవకాశం ఉండింది. అందుకే తొలుతటి త్రివర్గ వ్యవస్థ చతుర్వర్ణ వ్యవస్థగా విస్తరించింది. మరి, జీవిత లక్ష్యాలలో అర్థ - కామాలను చేర్చటంద్వారా సమాజంలోని ఆర్థిక ప్రవృత్తికి - అర్థ విధానానికీ స్త్రీ పురుష సంబంధాలకూ, ప్రధానంగా 'కామ'విషయాలకూ ప్రాధాన్యం కలిగించబడిందని సులభంగానే అవగతమవుతున్నది. ఇక్కడ కుటుంబ వ్యవస్థకు అవకాశం ఏర్పడింది. కుటుంబంయొక్క విస్తృత రూపం సమాజంగా, సమాజంయొక్క క్లుప్తరూపం కుటుంబంగా నిరూపించబడడం ద్వారా సమన్వయం సాధ్యమయింది. అర్థ - కామాలు సమాజ నిత్య జీవితంలో వహిస్తున్న ప్రాధాన్యాన్నిబట్టి, కుటుంబ - సమాజాలకు ఉన్న అవినాభావ సంబంధాన్నిబట్టి ఘర్షణలకు అవకాశం ఉండటాన దాని నివారణకూ, వ్యవస్థా రక్షణకూ, ధర్మ నివారణకూ రాజ్య వ్యవస్థ రూపొందించబడింది పూర్వపు గ్రామాల్లోని పంచాయతీ వ్యవస్థ ఈ అంశాన్నే సూచిస్తుంది. ఉత్పత్తులకు మూలమయిన భూమి ఏ ఒక్కరి 'స్వంతం' కాకుండా శ్రమించేవాడికి క్రయ విక్రయాద్యధికారాలు లేకుండా సంక్రమింపజేయబడింది. దీన్ని అనుసరించి సమాజావసరాలనుబట్టి వృత్తివ్యవస్థ రూపుదిద్దుకుంది. ఈ విధమయిన ఉపవ్యవస్థలతో సమాజం అనేకానేక వ్యవస్థల సమన్విత సంగమంగా రూపొందింది.

ధర్మమొక్కటే సర్వనిర్వాహకంగా ఉండిన దశనుండి ధర్మం ప్రాతిపదికగా వర్ణ, కుటుంబ, రాజ్య, వృత్తి మొదలయిన వివిధ వ్యవస్థలూ, ఉపవ్యవస్థలుగా ఆయా అవసరాలు సంఘటించినతీరులో సుదీర్ఘకాలం మీద సమాజం విస్తరించింది. కొన్ని వ్యవస్థలు శిథిలమయితే, లేదా వాటి అవసరం తీరితే మరొక విధంగా విస్తరించటమో, కొత్తవి రూపొందటమో సహజమయిపోయింది. 'వేయి

పడగలులోని అంతరార్థము' వివరిస్తూ సత్యనారాయణగారు - 'క్షత్రియులనగా రాజ్యమును పాలించెడివారు. వారు కులముచేత క్షత్రియులు కానక్కరలేదు' అనటంలో ఈ విస్తరించిన లక్షణం స్పష్టపడుతుంది. చరిత్రలో ఇందుకు సాక్ష్యాలు కోకొల్లలు కాగా, వర్ణవ్యవస్థ శిథిలంకాగా వృత్తివ్యవస్థ కులవ్యవస్థ పరిణమించింది. ఈ విధంగా రకరకాల పరిణామాలు ఏవయినా, ఏవిధంగా సాగినా వీటన్నిటికి మూలసూత్రం 'ధర్మం' కావటం భారతీయ సమాజంలో గుర్తింపదగిన ప్రధానాంశం. అందువల్లనే, ఇంతటి విశాలదేశమయినా, ఛప్పన్న రాజ్యాలుగా వేరువేరు 'రాజ్యాలు' కన్పించినా ఈ దేశం ధర్మపరంగా, సంస్కృతిపరంగా ఏకంగానే ఉండింది. బ్రిటిషువారు వచ్చిన తరువాతనే దేశానికి 'ఏకత' - రాజకీయమయిన, పరిపాలనా పరమయిన 'ఏకత'గా భావించటం మొదలయింది. నిజానికి రాజకీయమయిన ఏకత కన్నా, ధార్మికమయిన, సాంస్కృతికమయిన, భావనాత్మకమయిన ఏకత మాత్రమే యథార్థమయిన స్థిరాంశం. ఇది ఈ దేశానికి అనాదిగా ఉంది. అందుకే.

'If India has no unity, no unity could be given to her. The unity which undoubtedly belonged to India was self - born and had its own destiny, its own function and its own power; it was the gift of no one.'

అంది సోదరి నివేదిత. కేవలం రాజకీయంగా మాత్రమే 'ఏకత'ను 'సాధించిన' వివిధ దేశాల్లో ఈనాడు కలుగుతున్న సంక్షోభాలు ఈ అంశంలోని యాథార్థ్యాన్ని ప్రమాణీకరిస్తున్నవి.

భారతీయ సామాజిక వ్యవస్థలో ఆర్థిక రాజ్యవ్యవస్థలు గ్రామ ప్రాతిపదిక మీద ఏర్పడ్డవి. ఆర్థిక విధానం ప్రధానంగా వ్యావసాయికం. గ్రామీణవ్యవస్థ ఈ విధానం ద్వారా స్వయంపోషకంగా, స్వయసమృద్ధంగా వృద్ధిపొందింది. ఇది నాగరికతకూ, సంస్కృతికీ, కళాశాస్త్రాదుల వికాసానికి విస్తృతికి దోహదకరమయింది. భూమి మీద ఎవరి గుత్తాధిపత్యమూ లేకపోవటంవల్ల ఈ సంస్థలు పరస్పర సహకారంతో సమాజానికి శాంతిమయ జీవితాన్ని సంపాదించి పెట్టినయి. ఇక్కడే గుర్తింపవలసిన మరొక అంశం సామాజికంగా ప్రకృతి పరమయిన దృక్పథం. ఈ ప్రకృతి ఒక ఉపభోగ్య వస్తువుగా కాక జీవితానికి, ఉద్దీప్తికి అత్యంతోపకారకమయిందిగా భారతీయ సమాజం భావించింది.

'మా మతమున దేవుడున్నాడని కాదు; ఆ దేవుడుండనిమ్ము, చావనిమ్ము. సర్వమయిన సృష్టియందును ప్రాణము, జీవము, ఆత్మ కలకల లాడుచున్నదని మా పూర్వ ఋషులు చూచిరి. సర్వవస్తుగత ప్రాణమును సమారాధించిరి. అంతకన్న భూతదయలేదు' అన్నారు సత్యనారాయణగారు.

కాగా, ఈ విధంగా ప్రకృతితో ఇక్కడ వైయక్తిక - సామాజిక ప్రవృత్తికి ఆత్మీయతా భావం ఏర్పడింది. ఈ భావం వల్లనే ప్రకృతిలో సమతౌల్యం పరిరక్షించబడింది. అంతేకాదు, దివ్య భావంగా ఎదిగింది. ఇట్లా ఎదిగిన ఆత్మీయతా భావం భోగ లక్షణంగా కాక త్యాగ లక్షణంగా నిత్యజీవితంలో భాగమయిపోయింది. ఈ భాగం కావటం అన్న సంప్రదాయం నిర్లక్ష్యం చేయబడటం వల్ల, వ్యక్తుల, సంస్థల దురాశా దురాగ్రహాదులవల్ల ఈనాడు పర్యావరణ సంక్షోభం తారాస్థాయికి చేరుకొంది. ఈ విషయాన్ని అరవయ్యేళ్ళ పూర్వమే 'వేయి పడగలు'లో ఆదివటము-వృషసన్నిధి (మబ్బు) సన్నివేశచిత్రణద్వారా హెచ్చరించారు.

సమాజంలో మానవుడి ఆధ్యాత్మిక జీవనానికి సంబంధించింది మతం. మానవుడి సామాజిక ప్రవృత్తిని పరమార్థాభిముఖంగా తీర్చిదిద్దటం ద్వారా నిత్యజీవితంలో శాంత ప్రవృత్తిని, ఏకాత్మ భావుకతను పెంపొందించటంలో మతం శక్తిమంతమయిన పాత్ర నిర్వహిస్తుంది. మతం ఒక ఉపాసనా మార్గం. మానవులలోని స్థాయీ వైవిధ్యాన్నిబట్టి ఉపాసనామార్గాల్లోనూ వైవిధ్యం సహజంగానే ఏర్పడుతుంది. అయితే, వీటి మధ్య వైరుధ్యం కలుగనీయని విధంగా 'ఏకం సత్ విప్రా బహుధా వదంతి' అన్న భావన ఏకత్వాన్ని సాధించింది అందువల్ల సమాజాన్ని పటిష్ఠ పరచేందుకే ఇవి ఉపయోగించినయి తప్ప విశ్లథ పరచేందుకు కాదు. రాజ్య వ్యవస్థ గానీ, పాలనా వ్యవస్థగానీ ఏనాడూ మతం ప్రాతిపదిక మీద సాగకపోవటం ఈ దేశపు విశిష్ట లక్షణం. మత స్వేచ్ఛ ఈ దేశం సాధించిన ఒక అద్భుతం. అయితే, కుత్సితులు కొందరు దీన్ని తమ స్వార్థాదులకు ఉపయోగించుకోవటం ద్వారా సంక్షోభం సృష్టిస్తారు. ఈ విషయాన్నే -

'లోకములోని కుత్సితులు పరమ స్వచ్ఛమయిన వేదాంత భావమును నిగ్రహించి యేమి దుర్ వ్యాఖ్యానములు చేయుదురు! తల్లియయిన లలితకు వామాచార దుష్టులు దొరకిరి. పరమ రహస్య భూతమయిన రాసక్రీడకు సచేతనులు

దొరకిరి. మతముతో, తత్త్వముతో, యథార్థ్యముతో నచ్చుమయిన బ్రహ్మపదార్థ ముతో నింద్రియ కాలుష్యమును జోడించి దుష్టులు దుష్టమార్గములు తీయు చున్నారు' అన్నారు. సత్యనారాయణగారు 'స్వర్గానికి నిచ్చెనలు' (పు. 472) నవలలో. మతాన్ని రాజ్యవిస్తరణకోసం ఉపయోగించుకోవటం వలన కలిగిన సంక్షోభాన్ని 'త్రిశూలం' నాటకంలో సత్యనారాయణగారు చిత్రించారు. మతానికి జరిగిన, జరుగుతున్న ద్రోహం సత్యనారాయణగారి నవలలు చాలావాటిలో ప్రధానంగానో, గౌణంగానో చిత్రిస్తూనే ఉన్నారు. 'స్వర్గానికి నిచ్చెనలు' ప్రధానంగా దీనికి సంబంధించిందే.

సమన్వయ భావానికీ, వ్యక్తి వికాసానికీ, సామాజిక ప్రగతికీ మూలమయిన విద్యా విధానం దేశీయంగా ఉండింది. నియత - అనియత రూపంగా అది సమాజాన్ని విజ్ఞానవంతం చేస్తూ ఉండేది. అది బ్రిటిషువారు బలవంతంగా ఈ దేశం మీద రుద్దిన బానిస విధానంతో ఛిన్నాభిన్నమయిపోయింది. వేయి పడగలు నాటినుండి ఈ విషయాన్ని అనేక సందర్భాల్లో వివరిస్తూ దేశీయ విద్యా విధానంయొక్క అవశ్యకతను, దానివలన ప్రయోజనాన్ని ప్రతిబింబిస్తూనే ఉన్నారు. విద్యా విధానంలో అంతర్భాగంగా ఉన్న పరీక్షా విధానాన్ని ప్రతిఘటిస్తూ 'పరీక్ష' అన్న నవల ప్రత్యేకంగా రాశారు. ఇదంతా ఇట్లా ఉంచి–

ఈ దేశంలో సర్వశాస్త్రాలూ-అవి ప్రకృతి శాస్త్రాలు కావచ్చు, విజ్ఞాపన శాస్త్రాలు కావచ్చు, మరేవిధమయిన శాస్త్రాలూ కావచ్చు, అవన్నీ, సర్వ కళలూ, సర్వ సాహిత్యమూ ఈ సమాజ సుస్థితికోసమే ప్రవర్తించినవి, వృద్ధి పొందినవి, విస్తరించినవి, శిఖరాగ్రదశకు చేరుకున్నవి సమాజ సుస్థితికి భంగం కలిగించే, వినాశకరమయ్యే 'శాస్త్ర' ప్రవృత్తి సర్వథా నిషేధింపబడింది, నిరోధింపబడింది. ఈనాటివలె లోక వినాశకరమయిన అణ్వాయుధాదుల విజృంభణనుగానీ, పోటీనిగానీ భారతీయ సమాజం ఏనాడూ అంగీకరించలేదు.

ఈ విధమయిన దేశీయ సామాజిక వారసత్వంగల సత్యనారాయణగారి సామాజిక దృక్పథం తననాడు ఈ దేశంలో నెలకొని ఉన్న దేశీయతా భావ విరహితమయిన వాతావరణంలో, సామాన్య జను నిత్య జీవితంలో కడగండ్ల

పాలవుతున్న పరిస్థితులలో జనుల సుఖజీవనం లక్ష్యంగా ప్రవర్తించింది. అందులకే—

'అన్ని జాతులలో అందరు వ్యక్తులూ ఆర్థికంగా సమానం నిస్సందేహంగా చేయబడవలయునే కదా! అందరికి అన్నోదకములు ఉండవలసిందే. సర్వ జనులకు అన్నోదకాలు లేకుండా చేసే రాజు నాకు విరోధి.' అని (విశ్వనాథ కవితా వైభవం- పు. 47) సత్యనారాయణగారు నిర్ ద్వంద్వంగా ప్రకటించారు. ఇక్కడి 'సర్వజనులు' సామాన్యజనులు. ఇక్కడి రాజు పాలక వ్యవస్థను నిర్వహించే వ్యక్తి, లేదా వ్యక్తుల సమూహం. సమాజ సుస్థితికోసమయిన రాజ్య వ్యవస్థ నిర్వహించవలసిన కనీస ధర్మమిది. దీన్ని గూడా సరిగా నిర్వహించలేని రాజ్య వ్యవస్థకూ, దానికి సంబంధించి ఇతరేతరాంశాలకూ వ్యతిరేకంగా పోరాటం సాగిస్తూ ఆయన పుంఖానుపుంఖంగా నవలలు రచించారు. ఒక్క నవలలోనేకాదు, శ్రీ కుమారాభ్యుదయం వంటి కావ్యాలను ఇందుకే అంకితం చేశారు.

సత్యనారాయణగారి నవలల్లో వేయిపడగలు నవలేతిహాసం. ఒక విధంగా చెబితే అది ఆధునిక మహాభారతం. అందులో భౌతిక-మానసిక-ఆధ్యాత్మికతామయమయిన సమాజంయొక్క ఆధునిక పార్శ్వాలన్నీ చిత్రించారు, చర్చించారు. ఆయన సామాజిక, ఆర్థిక, రాజకీయాది విషయాలన్నింటికీ సంబంధించిన అభిప్రాయాలు ఆయన దృక్పథాన్ని వ్యక్తీకరిస్తాయి. ఎక్కడ ఏది చర్చించినా సామాన్య మానవుడే వస్తువు. ఉదాహరణకు మునిసిపాలిటీ విషయంగా—

'పురపాలక సంఘమనగా పురములోనుండి పన్నియగలవారిని పాలించు సంఘము. ఆస్తి గలవారిని పాలించుట యనగా వారియొద్ద పన్నులు వసూలు చేసి, అందులో ననేక దేవతలకు నైవేద్యముతీసి తక్కినవారి కిదుగోయని సుఖముకానిది సుఖమని చూపించుట.' (పు. 651)

తక్కిన వారంటే సామాన్య ప్రజలు.

'విద్యుద్దీపములు వచ్చినవి. ఇంజనీయరులు, పంపులకొకడు, దీపముల కొకడు, నెలకైదువందల జీతగాండ్రు ... ఇదివరకు దీపములు వెలిగించు దాకలి వాండ్రు పాతికమంది తీసివేయబడిరి. వారికి నెలకు పదిరూపాయలు జీతము. పాతికపదులు రెండు వందల యేబది.... పేదవారికి సున్నలు చుట్టి యెక్కువ కులము వారికి ధనవంతులకు నుద్యోగము లిచ్చిరి.... విద్యుద్దీపములు ధగధగ మెరసినవి. పేదవారు తిండిలేక మలమల మాడుచుండిరి.' (పు. 640.1)

ఈ విధమయిన విచారణ చూసి సత్యనారాయణగారు ఆధునికమయిన మునిసిపాలిటీ విధానానికీ, చివరకు విద్యుద్దీపాలను గూడా వ్యతిరేకించారని దుర్ వ్యాఖ్యానం చేయటం సాధారణమయి పోయింది. నిజానికి ఇక్కడ గమనించ వలసింది మునిసిపాలిటీగానీ, విద్యుద్దీపాలుగానీ కాదు. అవి కారణంగా మోసగింప బడుతున్న, ఉపాధి కోల్పోతున్న పేదవారి విషయం. పేదవారి వృత్తిపోవటం, ఉన్నవారికి పెద్దపెద్ద జీతాలివ్వటం గూడా ఇక్కడ గమనించవలసిన అంశం. ఒక సందర్భంలో శ్రీవివేకానందుడు-

'So long as millions live in hunger and ignorance I hold every man a traitor, who having been educated at their expe-nce pays not the least head to them.'

అన్న మాటలు గుర్తు చేసుకొంటే సత్యనారాయణగారి ఆవేదన అర్థమవు తుంది. అదట్లా ఉంచి,

'నేనుద్యోగము లేక తిరిగినన్నాళ్ళు నన్ను పోషించినవాడెవడు లేడు. నేను సంపాదించుకొనుచుండగా మీకు వృత్తి పన్నెందుకీయవలెను? ....నావద్ద వృత్తిపన్ను పుచ్చుకొనుట మీకెంత విధియో వృత్తిలేని వారికి వృత్తి చూపించుట మీ విధి. మీ యార్థిక శాస్త్రములో నిదియుండదు.... జగత్కల్యాణమని వ్రాయుదు రిదియేనా? ధనవంతులందరికిని కల్యాణము జగత్కల్యాణము.... ఈ పద్ధతిలో నున్న కృతకత్వ మిది. తిండిలేనివారికి తిండి చూపించరు. తిన్నవానివద్ద వడ్డీవేసి లాగుచున్నారు.' (పు. 877).

అంటాడు చాలా కాలంగా నిరుద్యోగిగా ఉండి అప్పుడే ఏదో ఒక చిన్న ఉద్యోగం దొరికిన కుమారస్వామి. వేయిపడగలు దేశానికి 'స్వాతంత్ర్యం' రావ

టానికి పూర్వపు రచన. వచ్చిన తరువాత మాత్రమేమయింది? అంతకు పూర్వపు లోపాలను సరిదిద్దటానికి బదులు వాటితోపాటు మరికొన్ని పెంచటమయింది. ఎందుకయింది?

'స్వాతంత్ర్యము వచ్చిన తరువాత దేశములో పరల మార్పులు తేవలసిన వారు రాజ్యాంగవేత్తలు. సంస్కర్తలునైన రాజ్యాంగదక్షులు. వారు కూడ ఆంగ్లరాజు పన్నిన నీతివలలో చిక్కుకొన్న పిట్టలే.... అతడు తెచ్చిన మార్పులను తొలగించి మరల జాతీయములయిన సంస్కారములు ప్రవేశపెట్టుటకు నేటి రాజ్యాంగదక్షులకు కావలసిన సాహసము లేదు. పరమ జాతీయాభిమానము లేదు. తొలుత సంప్రదాయసులందే వారికి విశ్వాసము లేదు.'

అని 'వల్లభమంత్రి' నవల (పు. 66) లో సత్యనారాయణగారన్నారు. ఈ నవల 'స్వాతంత్ర్యం' దేశానికి వచ్చిన తరువాతి రచన.

ఈ విధంగా మన రాజకీయ నాయకుల, రాజ్యాంగ నిర్మాతల పరాయి వ్యామోహం, అసమర్థత, దేశీయతా రాహిత్యం మొదలయినవన్నీ సామాజికంగా, ఆర్థికంగా దేశంలో అనేక సంక్షోభాలను సృష్టించినాయి. వాటిని, వాటి ఫలితాలను దేశం ఈనాటికీ అనుభవిస్తూనే ఉంది. ప్రస్తుతపు 'నాగరకత పట్టరానంత డబ్బుగలవాడిది. మోటారుకారున్నవాడిది. రైళ్ళలో ఫస్టు క్లాసుల్లో వెళ్ళేవాడిది. తక్కినవారికి ఈ నాగరకతవల్ల దమ్మిడీ ప్రయోజనంలేదు సరిగదా, ఈ నాగరకత వచ్చి వాడి నెత్తిన కూర్చున్నది' అంటారు 'దమయంతీ స్వయంవరం' (పు 63) నవలలో. ఇది ఇప్పటి నాగరకత స్వరూపం. ఆ స్వరూపాన్ని ఇట్ట బయలు చేసిన సత్యనారాయణగారిని ఆధునిక నాగరకతా విరోధిగా వక్రీకరించే వర్గం కుత్సితంగా ప్రవర్తిస్తున్నదనే చెప్పవలసివుంటుంది. అదే విధంగా ఆయన జమీందారీ వ్యవస్థను సమర్థిస్తున్నాడనీ, పూర్వపు వర్ణవ్యవస్థ తిరిగి రావాలంటున్నాడనీ....ఇట్లా వక్రీకరించటం గూడా ఉంది. ఈ వక్రీకరణ కొందరి స్వార్థ ప్రయోజనాలకొరకయితే, కొందరి అవగాహనారాహిత్యానికీ, అనాలోచనకూ సంబంధించింది.

వేయి పడగలులో ఆయన చిత్రించిన జమీందారు 'జమీందారీ వ్యవస్థ'కు చెందినవాడుకాడు. అందులో ఇద్దరు జమీందారులున్నారు. ఒకరిది-కృష్ణమనాయుడిది- ప్రజల సుఖశాంతులకోసమయిన పరిపాలన కాగా, మరొకరిది-రంగారావుది-స్వార్థపరమయిన, ప్రజలను పట్టించుకోని పరిపాలన. 'విజాతీయమయిన భావాలకు లొంగిపోయి సంప్రదాయము, స్వజాతిలక్షణమును మరిచిపోయిన పాలక వర్గము ఇక్కడ (రెండవ) జమీందారుచేత ఉద్దేశింపబడింది' అన్నారు సత్యనారాయణగారు 'వేయి పడగల అంతరార్థము' (వ్యాసం)లో. కాగా, పరిపాలనలో ప్రజల దృష్ట్యా రెండు ప్రవృత్తులను చిత్రించి, వ్యతిరేకమైనదాన్ని నిరసించారు అట్లాగే దేవదాసీచిత్రణ ఆ వ్యవస్థ కావాలనటానికికాక ఒక వృత్తిని మనుష్యుల యొక్క కామక్రోధాలు ఎలా పాడుచేస్తాయో ఆ పాత్రచేత సూచితమయింది. కాగా, ఆయన నవలలోని అంశాలను వక్రీకరించకుండా అవగతం చేసుకుంటే ప్రచారం చేయబడ్డ అనేకమైన అపోహలు తొలగిపోతాయి వివేకానందుడు, గాంధీజీ, జయప్రకాశ్ నారాయణ, రామమనోహర లోహియా, దీన్‌దయాళ్ ఉపాధ్యాయ వంటి దేశీయ మేధావుల అభిప్రాయాలను అవగతం చేసుకుంటే, సత్యనారాయణగారి అభిప్రాయాలు స్పష్టపడుతాయి అదట్లా ఉంచి—

సత్యనారాయణగారు ప్రస్తుతం ప్రచారంలో ఉన్న పెట్టుబడిదారీ వ్యవస్థ, ప్రజాస్వామిక వ్యవస్థ, సామ్యవాద వ్యవస్థలను సముద్రపుదిబ్బ నవలలో విస్తృతంగా చర్చించి, వాటిలోని గుణదోషాలను నిరూపించి, ఒక వ్యవస్థ తరువాత మరొక వ్యవస్థ రావటాన్ని గుర్తిస్తూ, ఏ వ్యవస్థ కూడా లోపరహితం కాదనీ, శాశ్వతమూ కాదనీ, ఒకదాని తరువాత ఒకటిగా నిరంతరం వ్యవస్థలు మారుతూనే ఉంటాయనీ, సామ్యవాదము తరువాత "మరల రాజు, మరల ప్రజాస్వామికము, అందులో మరల నిన్నిభేదములు మరల సామ్యవాదము, చక్రనేమిక్రమేణ?" అని నవలను సమాప్తం చేశారు. మరయితే కావలసిందేమిటి?

'నా రాముడు - నా రామాయణము' అన్న వ్యాస పరంపరలో ఒకచోట సత్యనారాయణగారు—

'నేడు రష్యాలో ఏ శాంతియున్నదో ఆ శాంతి మన దేశమునందును వాంఛించెడివారిలో నేను ప్రధానుడను. పదునెనిమిదేండ్లనుండి నేను అంతరాంతర

ములలో అటువంటి కమ్యూనిస్టును. ఈ పదునెన్మిది సంవత్సరములనుండి ఆ నా కమ్యూనిస్టు మిత్రులతో నే నిదియే చెప్పుచుందును. ఈనాటి ప్రపంచములోనున్న దేశములలో ఏ రాజ్యాంగమూ నిజానికి ప్రజా సౌఖ్యము సమకూర్చుటలేదు. ఆ రాజ్యాంగ విధానముచేతనే ప్రజా సౌఖ్యము సమకూడునట్లున్నది. కాని, నాకు ప్రజా సంహారము గిట్టదు మన దేశము ఆధ్యాత్మిక దేశము. దైవమును విశ్వసించెడి దేశము మన దేశము నిజముగా మానవ జాతికి సుఖము సమకూర్చదలచినచో ఆధ్యాత్మిక ప్రవృత్తియు, స్త్రీ పురుష మధ్యగత నీతియు, దైవ భక్తియు గలిగిన కమ్యూనిజం రావలయును. ఈ రెండు నొకచోట ఇముడవనుటకు వీలు లేదు. ఇమిడి తీరును. భారతదేశము సర్వ ప్రపంచమునకు చేసెడు మహోపకారమే మనగా - అట్టి కమ్యూనిజమును భారతదేశములో స్థాపింపవలయును.

నేను చెప్పేది ఈ కమ్యూనిజంవంటిదే తొలినాటి మన దేశములోని రాజ్యాంగము సాంఘిక వ్యవస్థ. దాని లక్షణములే మాయూరిని గురించి చేసిన వర్ణనలో చూడనగును' (జాగృతి వారపత్రిక) అన్నారు.

ఈ వ్యాసాలు 1970 లో రాసినవి. అంటే 1952 ప్రాంతాలనుంచి సత్యనారాయణగారు ఈ విషయాన్ని గురించి ఆలోచిస్తూనే ఉన్నారన్న మాట అంటే ఇంచుమించు ప్రస్తుత రాజ్యాంగం అమలులోకి వచ్చిన కొత్త రోజులనుంచి. అదట్లా ఉంచి. సత్యనారాయణగారు చెప్పిన కమ్యూనిజం కమ్యూనిస్టులు అంగీకరించే కమ్యూనిజంకాదు. కమ్యూనిజం అనటంలో అందులోని శాంతికరమయిన ఆర్థిక సమానత్వాంశాన్నే తీసుకున్నారనిపిస్తుంది. మిగతా అంశాలను వదలివేసి ఆధ్యాత్మికాద్యంశాలను జోడించారు. అందుకని అది అచ్చంగా కమ్యూనిజం కాదు. దాని పేర జరిగిన మారణహోమం ఆయనకు అభిమతంకాదు కాగా, ఆధ్యాత్మికత పునాదిగా, స్త్రీ పురుష మధ్యగత నీతి, ఆర్థిక సమానత్వంగల సామాజిక వ్యవస్థ సత్యనారాయణగారు ప్రతిపాదిస్తున్నారు. అంటే, ఇది దేశీయమయిన సామాజిక వ్యవస్థ. దానికి ఆయన పేరేదీ పెట్టలేదు గాని. తొలినాటి మన దేశములోని రాజ్యాంగము, సాంఘిక వ్యవస్థ అనటంవల్ల అది 'దేశీయ సామాజిక వ్యవస్థ' అవుతున్నది. ఈ విధమయిన వ్యవస్థను ఉద్దేశించే—

''అహింస, దయ, తితిక్ష, శమము, దమము మొదలయిన సత్వధర్మము నందలి అంతర్భూతములయిన విషయములు, తద్విషయములను పురస్కరించు కొని చేయబడిన సంఘ వ్యవస్థ యొకటి పురాతనముగా నా దేశమునందు కలదు'' అని 'సముద్రపు దిబ్బ' (పు 315) లో అన్నారు. ఈ రకమయిన వ్యవస్థను ఆయన 'శార్వరినుండి శార్వరిదాక' వంటి నవలలో చిత్రించారు. అది ఆయన చవిచూచిన వ్యవస్థ. వేయిపడగలునాటినుండి నందిగ్రామరాజ్యం నవలదాకా (ఇది ఆయన రచించిన చివరి నవల) ఈ విధమయిన వ్యవస్థనూ, ఆ విధమయిన అహింసాది అంశాలు లేని వ్యవస్థలోని లోపాలనూ, ప్రజాసౌఖ్య శాంతివ్యతిరేకలక్షణాలనూ ఎంతో శక్తిమంతంగా చిత్రిస్తూ వచ్చారు.

తాను భావించిన వ్యవస్థ ఆధ్యాత్మికత, ప్రజాసౌఖ్యం పునాదిగా కలది కావటంవల్ల ఉపరితల నిర్మాణంలోని ఇతరేతరాంశాలన్నీ దానికి అనుగుణంగానే రూపొందుతాయి. తద్విరుద్ధమయినవన్నీ నిరాకరించబడుతాయి. అది ఈ దేశపు సామాజిక వ్యవస్థాలక్షణం. అది సత్యనారాయణగారి నవలల్లోనేకాదు, ఆయన సమస్త సాహిత్యంలోనూ వ్యక్తమయ్యే సామాజిక దృక్పథం.

నిజానికి ఒక పరిశోధన గ్రంథంగా రూపుదిద్దవలసిన ఈ విషయానికి ఈ వ్యాసం కేవలం స్థూలమయిన రేఖాచిత్రం మాత్రమే. *

వేదముల్ సంస్కృతవాదముల్ చేసిన
తెలుఁగువాఁడే చేయవలయుననఁగ
సంస్కృత చ్ఛందస్సు చక్కఁగా సాగింప
తెలుఁగులోనే సాగవలయుననఁగ
ఋతువుల పద్ధతి ఋజువుగా నుండఁగా
నొక తెల్గునాటనే యుండుననఁగ
నిఖిల సస్యములు పండింపఁగా ఁదగినట్టి
ధాత్రి లక్షణ మిందె తనరుననఁగ

సర్వవేదాంతములకును జన్మభూమి
తూచి మనుజుఁడు తాల్చు దుస్తులకుఁ దగిన
దను ప్రమాణమ్ము చూపించినట్టి నేల
తెలుఁగు ధాత్రికి ధాత్రిలో దీటుగలదె?

# వేయిపడగలు – ధర్మదృష్టి

—డా॥ ముదిగొండ వీరభద్రయ్య

ఒక నవలలో ఈ ధర్మదృష్టి ఏమిటి? అన్న ప్రశ్న కొందరికి పుట్ట వచ్చును. కాని పరమార్థ మొకదాన్ని పెట్టుకొని రాసే రచయితలు ధర్మాన్నే ప్రధాన అర్థంగా పెట్టుకొంటారు. లౌకికత, భౌతికత వంటివాటితో విసుగెత్తిన ఆధునిక నాగరికతా సమాజాలు మతం, ధర్మం, నీతి అన్న ఆధ్యాత్మిక అంశాల వైపుకి తిరిగి చూస్తున్నవి.

"....Or a general dissatisfaction with the materialism of the modern world. For these reasons more Amenicans are embarking on a search for the sacred in their lives....Some are returning to the religions of their childhoods, finding new meaning in old rituals. Others work for wisdom outside their own cultures, mixing different traditions in an individualistic stem "[1]

అన్నమాట ఈవిషయాన్ని నిరూపించేదే. '30 లలో మన సమాజమూ భౌతిక దృష్టిలోకి జారిపోతున్న దశలో విశ్వనాథ వేయిపడగలు ద్వారా ధర్మ దృష్టితో, ఆధ్యాత్మిక లక్ష్యానికి మళ్ళించడానికి ప్రయత్నించారు. రంగారావు, మంగమ్మలు ఈ నవలలోని పాత్రలుగా అట్లాంటి సాఫల్యాన్ని పొందడం పాఠకులకు ఒక స్ఫూర్తి. పాపపుణ్యాలు, న్యాయాన్యాయాలు, ధర్మాధర్మాలు లాంటి విషయాలు ఈ నవలలోని అనేక చర్చల్లో, అభిప్రాయాల్లో కన్పిస్తాయి. ఇవన్నీ నవల పరమార్థానికి దోహదపడేట్లుగానే విశ్వనాథ రచించారు.

---

1. Newsweek - Nov. 28, 1994 P. 39.

"ఇంద్రియ నిగ్రహము, మనో నిగ్రహము, తద్వారా భక్తియో, జ్ఞానమో కలుగుటకు వీలుండెనేని మీరు తెచ్చిన మార్పు శిరోగ్రాహ్యము" (583 పు) అని ధర్మారావంటాడు. మార్పుకోసమే మార్పు ఉండకూడదు. ప్రతి మార్పు సమాజ ఉపరితలాన్ని మార్చినట్లుంటుంది. కాని, దాని వల్ల సమాజ మూలానికి భంగం కల్గుతోందా? పుష్టి కలుగుతోందా? అన్నదానినిబట్టి మార్పుని అంగీకరించడం, అంగీకరించకపోవడం అన్నదాన్ని మేధావి చేస్తాడు. వేయి పడగలులోని ఈ క్రింది మాటలు విశ్వనాథవారి మౌలికచింతనను తెల్పుతాయి:

"మా మతము దేవుఁడున్నాడనికాదు. ఆ దేవుడుండనిమ్ము, చావనిమ్ము-సర్వమైన సృష్టియందును ప్రాణము, జీవము, ఆత్మ కలకలలాడుతున్నదని మా పూర్వర్షులు చూచిరి, సర్వవస్తుగత ప్రాణమును సమారాధించిరి. అంతకన్న భూతదయ లేదు." (687 పు.)

సమాజంలో పైకి కన్పించే విభజనలు సౌకర్యార్థమే. కాని, అసలు దృష్టిలో ఈ ఏకతే ఉన్నది ఏకతకు వెనుకన ఉన్న ఫిలాసఫీ ఏకాత్మభావం. దీనికి సాధనా మార్గం ధర్మప్రవృత్తి - మోక్షలక్ష్యం. ఈ రెండింటి నడిమివే అర్థ కామాలు. విశ్వనాథ మాటల్లో—

"వారును (సుబ్బన్నపేట ప్రజలు) ధర్మమోక్షముల మధ్య నూఁగుచున్న యర్థ కామములను నుయ్యేలలో సుఖనిద్ర గాంచుచుండిరి" (9 పు.) అట్లా ఉండగలిగినప్పుడు నాగేశ్వరస్వామి సుబ్బన్నపేట మీద తన సహస్ర ఫణా మండలి ఛత్రంగా చాచి ఆ తన చల్లని నీడలో ఆ ఊరి ప్రజలను జోకొట్టినాడట!

కాని ఎప్పుడైతే ప్రజలు ధర్మమోక్షములను విడిచారో అప్పుడా నీడ లోపించింది. దానిక్కారణం పడగలు మునుపటి అన్ని లేకపోవడమే. స్వామి తన పడగలను చాలా వరకు లోపింపజేసికోవడమే.

"ఈ గ్రంథంలో ప్రతిచోటా ధర్మమును గురించే చెప్పబడుతూవచ్చింది. పుస్తకము పేరే వేయిపడగలు సుబ్రహ్మణేశ్వరస్వామి యాదేవత.....భూమిని సుబ్రహ్మణ్యేశ్వరుడు మోస్తున్నాడన్న మాట పౌరాణికమైన మాట గాని, ఖగోళ విషయం కాదు. అనగా సహస్రముఖంగా ధర్మం ఉంటుంది. ఆ ధర్మము చేత

భూమి పాలించబడుతుంది అన్న యర్థమే. సర్వత్రా ధర్మమే ఉంటే అది సహస్ర ముఖంగా ఉన్నదని చెబుతాం, అది వేయిపడగలు.''

(పు ii, వే ప. అంతరార్థము)

విశ్వనాథ వారి దృష్టిలో సర్వత్రా ధర్మం లేదు. అది నశించి కేవలం దాంపత్య ధర్మమే మిగిలిందంటా రాయన. అందుచేత ఈ తెచ్చిన మార్పులు ధర్మనాశనాన్ని కల్గించేవి. అందువల్ల వాటిని ఖండించడమో, నిరసించడమో వారి నవలలో చేసిన పని. ధర్మభ్రష్టత, ధర్మచ్యుతి, ధర్మనాశం అన్న వాటికి కారకులైన వాళ్ళు పాపం చేసిన వాళ్ళవుతారు. ఈ పాపం చేయడం రెండురకాల భూమికల నుంచి జరుగుతుంది- వ్యక్తి పాపం ఒకటైతే, వ్యవస్థా చోదకులు చేసే పాపం మరొకటి.

వ్యక్తి తానుగా తన సుఖం కోసమనో, తన అజ్ఞానం చేతనో చేసే పాపం ఒక రకమైంది. సంస్థలని (అంటే వ్యవస్థని) నడిపేవాళ్ళు సుష్ఠుగా ఉన్నవాటిని ఊడబెరికి కొత్తవాటిని తెచ్చి సమాజ రంగంలో ప్రయోగాలు చేయబోయి వినాశానికి కారకులు కావడం మరొక రకపు పాపం. అసలు మార్పేవద్దని విశ్వనాథ అనడడం లేదు. ఆయన మాటల్లో—

"సర్వము దోషమైనప్పుడు బహు దోషమైన దానిని బరిత్యజించి, యల్ప దోషమైన దానిని బర్రిగహించి, దాని యందలి యల్పదోషములను నివారించుటకుఁ బ్రయత్నించవలయును." (పు. 863) ప్రయత్న రాహిత్యాన్నో లేక నిశ్చైతన్య స్థితినో విశ్వనాథ ప్రబోధించడం లేదు. మరోచోట ఇదే నవలలో మంగమ్మ నోట ఇట్లా అనిపిస్తారు విశ్వనాథ—

"ఎక్కడ నైన దోషములున్నచో నా దోషములు పరిహరింపవలయును గాని మూలచ్ఛేదము చేయరాదు " (పు. 579) ఈ మూలచ్ఛేదానికి పూనుకోవడం మహా పాపం. విశ్వనాథవారు ఈ వేయి పడగలు నవల ద్వారా ఎదుర్కొన్నది అంశాన్నే, ప్రజలను ఏలే రాజే మూలచ్ఛేదానికి కారకుడవుతున్నప్పుడు దాన్ని ధర్మారావూ అతని పరివారమూ ఎదుర్కొన్నారు దీన్ని సంకేతిస్తూ—

''వేయి పడగల పాము విప్పారుకొని వచ్చి

కాటందు కొన్నది కలలోన రాజును " (పు. 1, 11) అని రాస్తారు విశ్వనాథ. ఈ సర్వవినాశానికి హేతువు ఆంగ్ల మానస పుత్రుడైన రంగారావు-అతని సంప్రదాయ నిరసనం.

అంటే- రెండు ముఖాలుగా ప్రవర్తిల్లే పాపంలో రాజుపాత్ర అధికం ధర్మానికి ప్రతినిధిగా సంకేతించిన ధర్మారావుని నవలలో రచయిత రంగారావుకి వ్యతిరేకంగా నిల్పడమే కాక, హరప్పను చేరదీయడం కూడా అందుకే చేస్తాడు. హరప్పను మామూలు సంసారిగా దిగజార్చనీయలేదు రచయిత. తండ్రి అయిన రంగారావు మూడు పెళ్ళిళ్ళు చేసుకోగా అతని కుమారుడు అయిన హరప్ప అసలు వివాహమే చేసికోడు అతడు ప్రాణాయామ యోగంతో తన ప్రాణాలను త్యజిస్తున్నప్పుడన్న మాటలు—

"....చేతనైనంతవరకును వేయిపడగలాడించితిని. ఆ యాడించుట యేకదేశమైపోయెను. నా యందున్న దోషము దానికి సంక్రమించినది." (పు. 834).

ఏదో ఒక్క ఊరిలో ఒక్కచోట ఒకరెవ్వరో ఈ లక్ష్యాన్ని సాధిస్తే లాభంలేదు. ఒకప్పుడు దేశమంతా స్వామి వేయిపడగల ఛత్రచ్ఛాయ ఉండేది. రంగారావు వంటి వాళ్ళ వల్ల ఈ స్థితి నాశనమయిపోయింది. కాలం అటువంటి వాళ్ళ వశం అయింది. కుమారస్వామి యొక్క సంప్రదాయబద్ధతకు ఆశ్చర్యపడి వామనరావు అన్న మాటల్ని చూస్తే కాలం యొక్క శక్తి తెలుస్తుంది:

"ఆయన చాల మంచివాఁడు, కాని ప్రవాహమున కెదురీదుచున్నాడు. కాలము ప్రవాహము వంటిది, ఎదురీదిన వానిని సముద్రమునకే తీసికొనిపోవును. ఆ యీదుచున్న వాడెట్టి వాడని విచారించదు." (పు 775) (538 లో కూడా ఈ అర్థం ఉన్నది) అందువల్లే ఈ నవలలో మార్పుకి, కొత్త సంస్థలకు వ్యతిరేకంగా పోరాటం ఉండదు, కేవలం వాటిలోని అప్రయోజకత్వాన్ని మాత్రమే ఎత్తిచూపడం ఉంటుంది. భక్తి జ్ఞానాలు కల్గడానికి ఇంద్రియ, మనోనిగ్రహాలు కల్గడమే లక్ష్యంగా మార్పులు తెస్తే శిరోధార్యమని కదా ఈ నవలలో ప్రధాన సూత్రం. స్వాతంత్ర్యం స్వాతంత్ర్యం కోసం కాదు, జీవితానికి ఈ దేశంలో ఒక నికరమైన లక్ష్యం ఉన్నది. దాన్ని కాదన్న స్వాతంత్ర్యవాంఛ వ్యర్థం. భార్య

భర్తను దేవునిగా ఆరాధిస్తుండటాన్ని నాగేశ్వరరావు ప్రభావంతో హేళనచేస్తూ రంగారావు—

"...దేశములోని సర్వసంస్థలును స్వాతంత్ర్య భావరహితములై పోయెను, ప్రధానమైన దాంపత్యమే యిట్లుండగాఁ దక్కిన వాని విషయము చెప్పవలెనా?" (పు. 231)

ఇక్కడ రంగారావు దృక్కోణం తప్పు. అప్రయోజకమైన స్వాతంత్ర్యాన్ని కాదు కోరుకోవలసింది. కోరవలసింది ప్రయోజకమైన స్వాతంత్ర్యాన్ని. వివాహమన్న సంస్థ కూడా మోక్షార్థమే ఉన్నదన్న సత్యాన్ని రంగారావు గుర్తించకుండా తన రాణి అయిన సరోజినీదేవితో అమానుషంగా ప్రవర్తించి దుఃఖం కల్గించాడు. దీనికి విరుద్ధంగా ధర్మారావుతో చనిపోయిన అరుంధతి—

"నేను నిన్ను వదలి యుండలేను. ఈ దేశములో పతివ్రత చావదు. స్వామి రెండవ పడగ యిచ్చట నశించదు. కారణాంతరములచేత మరుగుపడ వచ్చును. నేనెవ్వరను? పతివ్రతను. అల్పకారణముల వలన భయము లేదు. నేను నీ వలెనే సనాతనిని." (పు. 898.)

అని అంటుంది. నవల చివరలో ధర్మారావు 'ఇంక నేమి మిగిలినది?' (పు. 900) అని ప్రశ్నించుకొన్నప్పుడు—

"అరుంధతి యతని కన్నులలోఁ గన్నులుంచి 'నేను మిగిలితిని' అనెను. ధర్మారావు - 'అవును. నీవు మిగిలితివి. ఇది నా జాతిశక్తి. నా యదృష్టము. నీవు మిగిలితివి." అని అంటాడు.

స్వామివి 998 పడగలు నశించి, చివరకు మిగిలినవి కేవలం ఈ రెండు పడగలే. ఐతే వీటికిన్ని రంగారావు వ్యతిరేకత చూపాడు. ఇది వ్యవస్థాపరంగా చేస్తున్న మహా పాపం.

రంగారావు తెచ్చిన ప్రభుత్వపరమైన సంస్కరణలు ఆధునిక బుద్ధికి ఇవేళ తిరస్కారం కల్గించవు. కాని, అవి ఈ దేశపు మౌలిక విశ్వాసంమీద చింతనమీద దెబ్బ కొట్టినవి

"అన్ని భూతముల యందును సమానత కలుగుటయే మోక్షము. ఆది ఇంద్రియములను నియమించి చేయుమన్నారు మన పూర్వులు. ఇంద్రియములకు ప్రవృత్తి కల్పించి చేయుమనుచున్నారీ నూతనులు. నియమించుట నిశ్చయమైన మార్గము. బహుధా ప్రవృత్తి కలిగించుకొనుట యెచ్చటనో ఫలవంతమగును.'' (పు. 615 )

ఇక్కడ కుమారస్వామి మాటల్లో ఇక్కడి మౌలిక సిద్ధాంతాన్ని విశ్వనాథ ఎత్తి చూపారు. సర్వభూతములపీద సమానత కల్గడాన్ని దాన్ని నివృత్తి మార్గం ద్వారా సాధించడమన్నది మరిచి ఈ నవలను చదివితే పైపైన చదవడమే అవుతుంది తప్ప లోనారాని చూపినట్లు కాదు. విద్యుత్తుకి వ్యతిరేకమనుకొంటున్నారు కాని, పర్యావరణలోని సంతులనాన్ని దాని వ్యాజంతో ఎట్లా చెడగొట్టినారో మరచిపోతున్నారు. కొత్త విద్యావిధానంలోని మేళ్ళని పైపైన లెక్కిస్తున్నారు కాని, అది వారి మాటల్లో "శిక్షా పద్ధతి పేర నిర్దయ పంచి పెట్టబడుచున్నది." (పు. 683.) యంత్రానికి వ్యతిరేకమన్నారు కాని, దాని ప్రభావంలో మానవీయ దైవీయ గుణాలను వదలి రాక్షసత్వాన్ని పొందడాన్ని గమనించలేక పోతున్నారు పట్టాభిషేకోత్సవానికి రైలుదిగి వచ్చిన రంగారావు లక్ష్మణస్వామి అన్న వారి ఏనుగునెక్కక మోటారులో సుబ్బన్న పేటకు వచ్చినప్పుడు ఆ గజరాజు మహాబాధతో ప్రాణాలు వదలినప్పుడు కాని, సరోజినీదేవి మరణమప్పుడు కాని, రత్నగిరిని అవమానించినప్పుడు కాని ఈ రాక్షసత్వాన్ని మనం గమనించగల్గుతాము. రంగారావు తర్వాత మారినాడు. అట్లా మారిన తర్వాత అతనికి "హరప్ప రామచంద్రుడు, ధర్మారావు వశిష్ఠుడుగా గనిపించిరి" (పు. 641) కాని ఏమి లాభం? అప్పటికే దేశంలో అన్ని సంస్థలు నశించినవి. దీనంతటికీ వ్యవస్థాచోదకుడైన రాజు భ్రష్టుడు కావడమే హేతువు. దీనికితోడు జాతి చేసికొన్న పాపం కూడానని విశ్వనాథ విశ్వాసం

"ఆహా! ఏమి కాలము, ఏమి మార్పు! ఎన్నెన్ని ప్రాతవి నశించిపోయినవి! ఎన్నెన్ని కొత్తవి తలచూపినవి! లోకమంతయు నూత్నత్వము శక్తియనుకొనుచున్నది. నూత్నత్వము నూత్నత్వమే కాని శక్తియెట్లగును? కొత్తలో గాడిదపిల్ల గూడ కోమలముగానే యుండును. ఆహా! ఎంత నశించిపోయినది! నశించిపోయిన దానిని చూచినచో కడుపు తరుగుక పోవుచున్నది. ఈ నశించి

పోయినదంతయు వ్యర్థమై తేజోరహితమైనదైనచో దుఃఖము లేదు నా జాతి యింత దైవోపహతమైన దేలకో? ఈ జాతి చేసిన పాపమునకంతులేదు కాబోలు!" (పు. 899)

జాతి చేసిన పాపం ఏదో విశ్వనాథ ఊహించి తేల్చలేదు కాని, ఈ జాతికి సంస్థా నాశనమే పెద్ద శిక్షగా తెల్పినారు కాని, మరల వైభవప్రాప్తికి మిగిలివున్న దాంపత్యం ఒక్కటి చాలన్న విశ్వాసం వారిది. వైయక్తిక ప్రవర్తనలో ఈ దాంపత్య ధర్మాన్ని చెడగొట్టి పాపం చేయవద్దని కూడా ఈ నవలలో వారు ప్రబోధించారు.

మంగమ్మ జోస్యులికి చేసిన ద్రోహం, రామేశ్వరంతో, తర్వాత మరి కొందరితో చెడిపోవడం అన్నవి ఈ విషయాన్ని తెల్పడానికి విశ్వనాథ ఆలంబన ఘట్టాలుగా చేశారు. ధర్మనాశనంతో ఆయుఃక్షీణం జరుగుతున్నదనీ, ధర్మ శబ్దార్థం మహావిస్తారమైనదనీ, ధర్మమనడంచేత జనుల ఆరోగ్యానికీ, మన శ్శాంతికీ కావల్సిన పరిస్థితుల్ని కూడా తాను సంభావిస్తున్నాననీ ధర్మారావు నోట అనిపిస్తారు విశ్వనాథ. (చూ. పు. 863). ధనాశతో మంగమ్మ జోస్యుల మనశ్శాంతి చెడగొట్టింది. అదే ఆశతో ధర్మారావు అత్తమామలు ధర్మారావు అరుంధతుల మనశ్శాంతిని చెడగొడ్తారు. హోదా లేదన్న కారణంగా కిరీటి మామ కూడా కిరీటికి ఇట్లాగే చేస్తాడు కులం కారణంగా గిరికని రామేశ్వరం అవమా నిస్తాడు. తన విశ్వాసాల కనుగుణంగా లేదన్న హేతువువల్ల రంగారావు సరోజినితో రాక్షసంగా ప్రవర్తిస్తాడు.

ఏ పాపమైనా పాపమే. తెలిసి చేసినా తెలియక చేసినా పాప ఫలాన్ని అనుభవించక తప్పదనే విశ్వనాథ భావించారు. ఒకచోట మంగమ్మ కుమార స్వాముల సంభాషణలో—

మంగమ్మ:- నాయనా, తెలియక పాపము చేయుదుమనుకొనుము. మన మనుభవించనే వలయునా?

కుమా:- తెలియక పసిపిల్లవాడు నిప్పు ముట్టుకొనెను. అది కాలకుండ మానునా? (పు. 616)

అన్న విశ్వనాథ ఊహ గమనించదగింది. విశ్వనాథకు చాలా తర్వాతి కాలంలో రావిశాస్త్రిగారు తమ 'మూడు కథల బంగారం' అన్న నవలలోనూ ఇట్లాంటి అభిప్రాయాన్నే వెలిబుచ్చారు:

"....మనం చేసిన పాపాలవల్ల పైవాళ్ళకి కలిగిన ఫలితాలు మాత్రం ఎన్నటికీ పోవు. నేను నీ చెయ్యి నరికేసి ఆ తరువాత భద్రాచలం పోయి భగవంతుడి పాదాలమీద నా తల ఆన్చి, నీ చేయి నరికేసిన పాపాన్ని నేను దించేసుకోవచ్చు. కాని, అంతమాత్రంచేత నీ ఒంటికి మరో కొత్త చెయ్యి చిగురించదు కదా!" (మూ. క. బం. - 262)

చేసిన పాపం పోదనే రావిశాస్త్రిగారి అభిప్రాయం. విశ్వనాథ కుమారస్వామి నోట ఇట్లాంటి అభిప్రాయాన్నే పై విధంగా చెప్పించారు. ఈ కుమారస్వామియే ఈట్సన్‌చేత ఉద్యోగంలోంచి తొలగింపబడి, మూడు నెలల జీతం ఆయన పంపుతానన్నప్పుడు అతడు ఆత్మవంచన చేసికొనే కపటుల డబ్బు తనకక్కర్లేదంటూ, ''నేనీ పాపపుఁ గూడెట్లుతిందు?'' (622) నని అంటాడు! ఒక కార్యం చేయడం చేతనేకాదు - మనస్సులోని ఊహలవల్లకూడా పాప పుణ్యాలను లెక్కిస్తాడతను.

విశ్వనాథ ఈ విషయంలో రాజీలేని రీతిలో ఆలోచించారు. జోస్యులన్న భర్తకు ద్రోహంచేసి మంగమ్మ పాపం చేసింది కాని, తర్వాత ధర్మారావు ప్రభావంతో పుణ్యాత్మురాలుగా మారుతుంది. ఆ పాత్రను అట్లా పరిణమించిందని విడువవచ్చును. కాని, అట్లా విడువకుండా ఆమెను చెంగల్రావు హత్యచేసినట్లుగా చిత్రిస్తారు విశ్వనాథ! అప్పుడు కూడా కుమారస్వామీ, అతని భార్య శ్యామల మంగమ్మ దేహంమీదపడి ఏడుస్తూ—

''నీ మేలాజన్మము తీర్చుకొనలే మనిరి. ఎప్పుడో పాపము చేసితివి. పాపమునకుఁ బ్రాయశ్చిత్తము లేదు కాబోలు. దేనికదియే. పుణ్యముచేసినచోఁ బాపము పోదు, దేనికది యనుభవించవలయును గాఁబోలు'' (796) అని అన్నారంటాడు.

వ్యక్తి తన స్వార్థానికి పాపంచేసినా, వ్యవస్థా చోదకుడు వేరే ప్రలోభాల చేతనో మరే ఇతర కారణంచేతనో పాపంచేసినా - ఆ పాప ఫలం ఊరకేపోదు.

వ్యవస్థా చోదకుడు చేసే పాపం ఎక్కువ విష ఫలితాల నిస్తుంది. కాబట్టే విశ్వనాథ ఈ నవలలో వ్యవస్థకు సంబంధించిన చిత్రణే ఎక్కువగా చేశారు. నవల పేరే తత్సూచనగా ఉంచారు రచయిత. రాజు కాని, బ్రాహ్మడు కాని కింద భూమి మీద భగవంతుని శాసనాన్ని నడపాల్సినవాళ్ళు. ఆపై భగవంతునికి కింద నున్న వీళ్ళకి అంటే "ఈ రెండు మహా సంస్థలకు మధ్య గణాచారి తెంచరాని లంకె" (చూ. 9). ఏది ఈశ్వరునికిష్టమైనదో, ఆయన నియమానికి అనుకూలమో దాన్ని ఒక రకంగానూ, అనిష్టమైన దానిని మరొక రకంగానూ ఆమె తెలియ బరుస్తుంది.

ఈ నవలలో గణాచారి దేహత్యాగం తర్వాత అట్లాంటి లంకె ఇక లోకంలో లేదని విశ్వనాథ సూచన. అంటే, ఇప్పుడున్న వ్యవస్థ మొత్తంగా ఈశ్వరాభీష్టానికి వ్యతిరేకమైందని ఆయన తాత్పర్యం అందుచేత ఇదంతా ప్రవృత్తి పరమైన లోకం - పాపం, అధర్మం వ్యాపించడానికి అవకాశం ఉన్న లోకం. వ్యక్తికి మోక్షం సిద్ధించడానికి వీలులేని వ్యవస్థలివి.

అయితే ఇప్పుడివన్నీ హఠాత్తుగా పునరుద్ధరింపబడతవని విశ్వనాథ నమ్మ లేదు. గతవైభవాన్ని తెలిపే మ్యూజియంలాంటిది వేయి పడగలు. అందుచేతనే ఆయన స్వామి యొక్క వేయి పడగలు నశించడాన్ని గురించి చెప్తూ—

"వేయి పడగలు రూపముచేత నశించినను పరిశోధన చేసినప్పుడైనఁ దెలియక మానదు" (356) అంటారు.

విశ్వనాథ వేయిపడగలులో కనీసం కొన్నింటినైనా చూశారు. మనం మాత్రం పరిశోధనచేసి ఆవేవో, అవి ఎందుకుండినవో తెలిసికోవాల్సి ఉన్నది. అవి ధర్మంకోసం - మోక్షంకోసం ఉండినవి అని కాస్త శ్రమపడితే మనకు తేలుతుంది.

"ఒక సంప్రదాయము చచ్చిపోవుచుఁ జావులో కూడ దాని లక్ష్యమేమైన మహౌదార్యశ్రీనే ప్రకటించును. మరియొక సంప్రదాయము తాను నూత్నాభ్యుదయము పొందుచు నభ్యుదయములోఁ గూడ దాని లక్షణమైన వెలవెలపోవుటయే ప్రకటించును" (277).

మన మీ వెలవెలలో ఉన్నాము. రెండు రకాలైన పాప ఆచరణ నుంచి తొలగి ఆత్మవిశ్వాసంతో ధర్మంవైపుకి సౌముఖ్యం చూపడానికి వేయిపడగలు ప్రేరణ కలిగిస్తోంది.

"ఇది మన సంప్రదాయములోని యుత్కృష్టత. దానిని నీ వెంతయైన బెల్లగించివేయుము. అది మరల జివుర్చుచునేయుండును. అల్పశక్తిమంతమైన సృష్టి చనిపోయినట్లు శక్తిమంతమైన సృష్టి చనిపోదు" (879) అని విశ్వనాథ మళ్ళీ వేయిపడగలు - ధర్మము నిలబడ్తాయేమో అన్న ఆశ నిట్లా వెలిబుచ్చాడు. ధర్మచ్యుతి కల్గనీయవద్దన్నది విశ్వనాథ ఆశయం. నీతిధర్మాలను సాధిస్తే బ్రతకటానికి ఇంత శ్రమపడాల్సిన అవసరంలేదని పులులసత్యాగ్రహం నవలలో (90 పు.) విశ్వనాథ అంటారు.

విశ్వనాథ వారి సర్వరచనల్లోనూ ఈ ధర్మ దృష్టే ప్రధాన దృష్టి. దీనికి మతాన్ని పరలోకాన్ని ఆయన ఆలంబనగా తీసికొంటాడు. Emory University లో ఆన్త్రోపాలజిస్ట్ అయిన Charles Nuckolls ఇట్లా అంటాడు: "గత అర్ధ శతాబ్ది కాలంలో చాలా మార్పు వచ్చింది. కుటుంబము, మతముల ప్రాధాన్యాన్ని-మన ప్రాచీను లవసరం అనుకొన్న వీటిని-మనం ఊడబీకేశాము. ప్రజలేమో వాళ్ళు కోల్పోయిందాన్ని కావాలనుకొంటున్నారు. కాని వాళ్ళకేమో, తామేం కోల్పోయారో జ్ఞాపకంలేదు. చివరకు పూడికలేని ఒక కంత ఏర్పడింది "[1] మన దేశంలోనూ ఈ కంత ఏర్పడకుండా సంధియుగంలోని ధర్మదృష్టితో ఈ నవలలోని చర్చలూ, అభిప్రాయాలు రచించారు విశ్వనాథ. *

---

1. Newsweek - Nov 28, 1994, P. 41.

# విశ్వనాథ ప్రతినిధి కుమారస్వామి

## —శ్రీ ఖమిడిపాటి కృష్ణమూర్తి

''ఈ కాలపు బ్రాహ్మణులనే చెప్పవలయు. దేశములో బ్రాహ్మణేతరోద్యమమునకు నీ బ్రాహ్మణుల దుర్వృత్తియే సగము హేతువు. ధర్మశాస్త్రములు పోవునది యొక మార్గమున. ఈ బ్రాహ్మణులు పోవునది మరియొక మార్గమున. బైబులులో చెప్పినట్లు వీరు 'మేమను' అనగా ధనాధిదేవతను బూజింతురు.'' ఇది ధర్మారావు స్వయంగా చెప్పిన మాట. అదీ తన భార్య అరుంధతితో.

సమాజాన్ని క్రమ బద్ధీకరణ చెయ్యటానికి ఆదిమ విజ్ఞానులు చేసిన సాహిత్య సృష్టిలో వేదము, పురాణము, కావ్యము అనేవి మూడు శాఖలు. వీటిలో వేదం రాజువలె శాసిస్తే, కావ్యం సౌమ్యంగా చెప్తుంది. కావ్యాంతర్గతమే ఈ రచనలన్నీ. వచనం, పద్యం, నాటకం, ఇత్యాది అన్నీను. అందుకే ''వాక్యం రసాత్మకం కావ్యం'' అన్నది. సమాజ లక్ష్యం ధర్మార్థ కామ మోక్షాలు. వాటిని సాధించటం కోసం సమాజం ఆ మార్గం ప్రకారమే క్రమ బద్ధీకరణ చెయ్య బడింది. అందుకే వర్ణాశ్రమ ధర్మాల నియమం ఏర్పాటు చేయబడింది. ''సమాజం ఏదైనా కానీ, ధర్మం ఏదైనా సరే, ఏ యుగమైనప్పటికి వర్ణ వ్యవస్థ ఒక్కటే సరైన మార్గంలో నడిపించగలదు'' అని ప్రేమ్‌కుమార శర్మ నిర్ద్వంద్వంగా చెప్పారు. (శివా అపరాధ పత్రికా ఏప్రిల్ 95 సంచిక.) చతుర్విధ పురుషార్థాలు ఉన్నత శిఖరం మీద ఉన్నాయి. వాటిని చేరటానికే చతుర్వర్ణాలు, చతురాశ్రమాలు మెట్లు. ఇదీ ప్రాచీన భారతీయ సామాజిక వ్యవస్థ. ఈ వ్యవస్థనే విశ్వనాథ ప్రచారం చేసింది. ఈ ప్రచారంలో భాగమే, అదుపు తప్పుతున్నప్పుడల్లా ఆత్మ విమర్శ. ఈ ఆత్మ విమర్శకు ఉదాహరణ ధర్మారావు, అరుంధతితో పైన చెప్పిన మాటలు.

రచయిత కొన్ని పాత్రలను సృష్టిస్తాడు. ఆ పాత్రలు ఆ రచయిత ఆశయాలను, ఆదర్శాలను ప్రతిబింబిస్తాయి. ఆ పాత్రలు సజీవపాత్రలైతే సమాజానికే ప్రతిబింబాలవుతాయి. అందుకే హిందీ సాహిత్యకారుడు రామచంద్ర శుక్ల ''సాహిత్య సమాజ్ కా దర్పణ్'' అన్నాడు. రచయిత తన ఆదర్శాలు, ఆశయాల ననుసరించి మండన, ఖండనలకు గురవుతాడు. అలా విమర్శలకే ఎక్కువ కేంద్రమైన వ్యక్తి విశ్వనాథ.

ఆయన పూర్వాచార పరాయణుడు. ఆధునికతకు వ్యతిరేకి. ప్రవాహమున కెదురీదును. (ఈ మాటలు "నేనూ - సాహిత్య రచనలు" - మహతిలో ఆయనే స్వయంగా చెప్పుకున్నారు కూడా.) విశ్వనాథ సృష్టి సజీవసృష్టి. అందుకే అవి ఆయనలోని జీవుని వేదనను అర్థం చేసుకుని, ఆయనపై వచ్చిన విమర్శలకు సహేతుకమైన సమాధానాలు చెప్తాయి. విశ్వనాథవారి కుమారస్వామి విశ్వనాథకే ప్రతినిధి. ధర్మారావు తర్వాత ఎక్కువ ప్రాధాన్యంగల పాత్ర కుమారస్వామి. కుమారస్వామి ధర్మారావుతో స్వయంగా సంభాషిస్తూనో, తన మిత్రమండలి సమావేశాలను ఏర్పాటు చేసి వాటిలో ధర్మారావు మాట్లాడునట్లు చేసి ఆయా సంభాషణద్వారా - ''సమాధానాలు చెప్పటం'' విశ్వనాథ తననితాను డిఫెండ్ చేసుకున్నట్లు అనిపిస్తుంది. చక్రవర్తి ''మీవన్నియు బి సి. నాటి యూహలు'' అని విమర్శిస్తాడు ధర్మారావును. ఈ విమర్శ ''నేను పూర్వాచార పరాయణుడను" అని అన్నమాటకు మరోరూపం. చక్రవర్తి కంటే నేటి విమర్శకులు చాలా దయ గలవారు. ఎందుకంటే చక్రవర్తి ధర్మారావును బి సి. నాటికి విసిరికొడితే, వీళ్ళు మాత్రం "రెండు వందల ఏళ్ళు ముందు పుట్టవలసిన వాడు'' అని దయ చూపించారు.

అసలు విశ్వనాథే ధర్మారావు అని విమర్శకులు. ఆ విషయం అంగీకరించినా, అంగీకరించకపోయినా ధర్మారావు, విశ్వనాథ ఆశయాలకు రూపం. "నాకు విరోధు లెక్కువమంది. ఎందుకో నా కర్థము కాదు. నన్నెరుగనివాండ్రు నేను దుర్జనుడు నందురు. ఎరిగినవారు చాలా మంచి వాడందురు. (మహతి-నేనూ, నా సాహిత్య రచనలు). సరిగ్గా ఇదే పరిస్థితి ధర్మారావుది. ''ధర్మారావు రాజుగారి కాలేజీలో నాంధ్ర పండిత పదవికై యభ్యర్థి యయ్యెను. నారాయణరావు దొరకొక ఉత్తరం వ్రాయును....ధర్మారావు తోడి యుధాప్యాయులతో పోరాడును.

శిక్షా పద్ధతికి లొంగడు. విద్యార్థులతో చనువుగా నుండును.'' ఇది ధర్మారావుని గురించిన వైషమ్యభావం. అందుకని - కుమారస్వామి మాటల్లో చెప్పాలంటే - ''ధర్మారావుగారు కళాశాలలో నాంధ్రోపన్యాసకునిగా పనికిరారు'' అని. దీనికి సమాధానం చెప్పేముందు కుమారస్వామి తానెవరో చెప్తాడు. '''ఛాయాపటమే పనికిరానప్పుడు మాతృక అసలు పనికిరాదు'' అని, తనని తాను ధర్మారావు యొక్క ఛాయా పటంగా చెప్పుకుంటాడు. ధర్మారావు, కుమారస్వామి ఒకే నాణేనికి రెండువైపులు. (ఈ విషయాన్ని డా. ముదిగొండ వీరభద్రయ్యగారు సోదాహరణంగా చర్చించారు.)

తనవి "బి సి. నాటి యూహలు" అన్నదానికి ధర్మారావు సమాధానం— "అది మీ కొలతబద్దలోని దోషం. మీరు బి.సి. యనుటతోడనే మీ మనస్సునందు పాశ్చాత్య లోకాభిప్రాయములు ప్రమాణమైనట్లు తెలియుచున్నది." ఏక ప్రమాణత లేకుండా పరిష్కారం సాధ్యం కాదు. దీనిని మరికొంత విపులీకరించాల్సివుంది కుమారస్వామి యొక్క గ్రంథము పాఠము చెప్పుచుండెను. ఆ పుస్తకము నందౌచిత్యము లేదు. గుణములు లేవు. శబ్దగతార్థగత వాక్యగత దోషములు సమృద్ధిగానున్నవి. అతడు విసుగుబుట్టి పుస్తకమచటబెట్టి విద్యార్థులకుపదేశించెను. (ఇంగ్లీషువాడు నేర్పెడి వాని చరిత్ర మన చరిత్రలో పాఠ్య గ్రంథములుగా చదివినప్పటినుండి Hindu Period అను పాఠ్యగ్రంథాలలో చెప్పబడే పరిమిత పుటల గల చరిత్ర చదివినప్పటి నుండి .... ఎన్నో అబద్ధములు చరిత్రలో చదివి చదివి నాకు విసువు వెట్టినది) ఈ రెండు విసుగులు ఒకటే. దానికి కుమారస్వామి ఇచ్చిన వివరణలు ఇప్పటికీ మన పాఠశాలల్లో మనం గమనిస్తూనే వున్నాం. "విశ్వవిద్యాలయములోని యాంధ్రభాష బోధనము బాగుండవలయునన్నచో హైస్కూళ్ళలో దెలుగు పద్ధతి యంతయు మారవలయును.'' ఈ పరిస్థితి ఇప్పటికీ అలాగే వుంది. అందువల్ల కుమారస్వామి యున్నత భావములకు వ్యతిరేకి, అభివృద్ధికి ప్రత్యర్థి. మనోవికాసమునకు బరిపంథి.''

ఇవన్నీ విశ్వనాథపై వచ్చిన విమర్శలే. సరే .... దానికి కుమారస్వామి సమాధానము : ''అవునవును. మీ కళాశాలలో మీకు దగినవారుండవలయును. సంస్కృతాంధ్రములు నశించుట యెట్లా యని మీ ప్రయత్నము. దాని కనువైన పండితులనే మీరు దెచ్చెదరు. అట్టివారినే మీ విశ్వవిద్యాలయపు గార్ధాన

లలో దయారుచేయుచున్నారు. .... ఇంగ్లీషు చదువారంభించిన తరువాత నిప్పటికి వెలుగు పూర్తిగా చచ్చినది. దేశభాషలు నశించినవి. మరియొక్క పదియేండ్లలో భాష్యాంత వైయ్యాకరుణుడుగాని, బాలాంత తార్కికుడు గాని, మీమాంసకులు గాని కనిపించినచో చెవి తెగగోయించుకొందును. మిల్టను వ్రాసిన 'ఏరియా పెజెటిగా' మీరు చదివితిరిగదా! పుస్తకములను, విద్యలను జంపుట ప్రాణహత్య కన్న మహా ఘోరమైనది.''

దీనిని కాదనగలరా.... విశ్వనాథను విమర్శిస్తున్నవారు!

"మనస్సులోనున్న భావములన్నియు జెప్పరాదు. దానివలన మీ పురోభి వృద్ధికి భంగము కలుగును'' అన్న ఈట్సనుదొర మాటకు, "ఈ యాత్మవంచన చేత దేశము ప్రళయాభిముఖమై పోవుచున్నది. నావంటివాడు బ్రతికియుండరాదు" అని కుమారస్వామి సమాధానము.

''నేను ఎవరినైనా ఏదైనా అంటే వాళ్ళు నాకు చాలా అపకారము చేస్తే అంటాను. నేను అనటం మాటుగా వుంటుంది. మాటుగా ఉంటుంది కనుకనే తరువాత దానిని గురించి నాకు జ్ఞాపకముండదు....'' (నేనూ-నా సాహిత్య రచనలు-మహతి.)

"లోకము యదార్థ్యమునైనను దీక్షణముగా జెప్పిన నంగీకరించదు సుమా!'' అని ధర్మారావు, కుమారస్వామికి బోధిస్తాడు. కబీరు, వేమనలవలె - మతములందలి మౌఢ్యమును ఖండించారు విశ్వనాథ. అయినా విశ్వనాథకు హిందూ పక్షపాతి అన్న పేరు వచ్చింది.

''హిందువులైననుసరే, మహమ్మదీయులైననుసరే, క్రైస్తవులైననుసరే- లోకములో దౌష్ట్య మాచరించుచు దేవుడు, దేవుడని దొంగ వేషములు వేయువాని కెప్పుడును నాత్మచ్యుతి యున్నది. వాని మతము వారికి దుర్వ్యవయసాయము లెక్కువజేయుటకు పనికి వచ్చును." ఇదేకదా ఈనాడు జరుగుచున్నది!

కుమారస్వామికి ధర్మారావుగారి గాలి కొట్టినది. అయితే, అందులో అగ్నిహోత్రము కూడా జోడింపబడింది. అసలు చిక్కంతా ఈ అగ్నిహోత్రము జోడించటంవలన ఏర్పడింది.

విశ్వనాథ పేరు చెప్పగానే ముందుగా తలంపుకు వచ్చేది రామాయణ కల్పవృక్షం. రామాయణాన్ని జీవుని వేదన నాధారంగా, రసనిష్ఠంగా రాశానని తానే చెప్పుకున్నారు. అంతేకాకుండా, వ్యాఖ్యానం చేశానని కూడా చెప్పారు. రామాయణాన్ని, రామాయణంతోపాటు ఆయన అభిప్రాయాల్ని ఈసడించిన వారున్నారు.

"మంగమ్మగారూ! రామచంద్రుడు ధనుస్సు విరిచినాడా? కథ యంతటి తోడనే ఆగిపోయినదేమి? రామాయణ కథ యంతటితో యాగిపోయినదేమి?" అని కుమారస్వామి దారిలో ఏడవడం ప్రారంభించాడు. ఆ దుఃఖానికి కుమారస్వామి సమాధానం.... "ఏమియులేదు. మహాభక్తురాలైన గిరిక సీతారాముల సంయోగమున కొక మహా వ్యాఖ్యానము చేసినది. ప్రభువు శివధనుర్భంగము చేసిన వేళనే సీతారాముల యాత్మలైక్యము నొందినవి. తరువాత వానికి వియోగము లేదు. సాత్త్వికాది భావోదయములు లేవు. రసమచ్చట నీయమాన స్వాదుత్వము గాదు. అది యనుభావ విభావాదుల చేత గలిగినది కాదు. వారి ఇద్దరి ప్రేమయందు రస స్వరూపము నిత్యమై, యవికారమై, కూటస్థమై యున్నది. తర్వాత వచ్చిన వియోగమువలన వారి ప్రేమభావమేమియు జెడలేదు. వారి రసాత్మకత కొంచెవడలేదు. నిత్యమైన, వినిర్మలమైన సీతారాముల ప్రేమతత్త్వమిది. అణువులుగా జీలిపోని మహాభూత ప్రకృతి. గిరిక ఈ వ్యాఖ్యానము చేసెను."

ఇదీ రామాయణములోని పరమమైన రహస్యము. కొంచెం స్వతంత్ర భావమున్నవాని నీ సంస్థలు చేరనీయవు. కేవలం బానిసతత్వమున్నచో గాని ఈ సంస్థలు చేర్చుకోవు. కాబట్టి మిగిలినది పత్రికారంగము. కుమారస్వామి వామన రావు పత్రికా కార్యాలయంలో చేరాడు. ఇక వామనరావుకు మన చరిత్ర, మన పురాణేతిహాసాలపట్లగల అభిప్రాయాలు కొన్ని. "మనకిష్టములేనివానిని మనము పట్టుకుని వాడెంతవాడైనను మహారాక్షసుడుగా గనిపింపజేయమా?" అన్న ప్రశ్నకు వామనరావు సమాధానము: "అవును. అది ధర్మము. శివుడు మాత్రము త్రిపురాసురుల నెందుకు వధించెను? వారు కంచుకోటలు కట్టిరి. వారెంత నాగరకులో? శివుడార్యుడు. వారు ద్రావిడులు. ఆర్యులు ద్రావిడులను జంపి, వారి నాగరకతను భస్మము చేసిరి. రావణాసురుడు, హిరణ్యకశిపుడు మొదలైన వారందరు

ద్రావిడులు. వారిని రాముదులైన యార్యులు తమ యభిప్రాయములకు వ్యతిరేకముగా నున్నవారనియేకదా వధించినది?" "నేనిలా చదువుకోలేదు అన్న కుమారస్వామికి వామనరావు అన్నట్లు మీకు ధర్మారావుగారు కాదా గురువు? మీరెట్టు చదువుకున్నారు?'' అని తిరిగి ప్రశ్నిస్తాడు.

"మన చరిత్రలను, మన పురాణములను పాశ్చాత్య చరిత్రకారులు వాళ్ళ ఇష్టము వచ్చినట్లు మార్చివేసిరి." అన్న విశ్వనాథవారి అభిప్రాయాన్ని ఛాందసమని కొట్టివేశారు చాలమంది. అయితే అది సహేతుకమైందికాదు. దానికి కుమారస్వామి, వామనరావుగారి కిచ్చిన సమాధానంలో వుంది: ''మీరందరును గలిసి యొక సిద్ధాంతము లేవదీసిరి. నేను గాదని ఏమి ప్రయోజనము ... సరె.... రాక్షసులు చాలామంది బ్రాహ్మణులు. వారు నిత్యాగ్నిహోత్రులు. ఆంజనేయులు లంకలో దిరుగుచు దెల్లవారు వేళల రాక్షసులు వేదములు పఠించుచుండగా విన్నాడు. వారు ద్రావిడు లగుట యెట్లు పొసగునో తెలియదు.... ఈ సిద్ధాంతములు, ఈ లెక్కలు పారిస్ నగరములోని గణిత శాస్త్రజ్ఞులు ఒప్పుకొన్న తర్వాతగాని మన మంగీకరించలేదు. ఈ లెక్కలప్రకారము మన పురాణములలో నున్న రాజవంశములయొక్క కులములు సరిపోవుచున్నవి." ఇక ''పత్రికల స్థాయి పడిపోయిన"దని విశ్వనాథ ఒకసారి విమర్శించారు. దానికి చాలా పత్రికలు ఆయనపై విరుచుకుపడ్డాయి. (రామాయణ కల్పవృక్షములోని ''తప్పులను" భారతిలో వరుసగా ప్రచురించినప్పటి మాట.)

వామనరావు పత్రికలలో తాననుసరిస్తున్న విధానమును ఇంతకుముందే వివరించారు. అదే తన ధర్మముగా చెప్పుకున్నారు. ఇంక పత్రికల వారి ద్వంద్వ నీతి గురించి వామనరావు గారిచ్చిన వ్యాఖ్యానము - " లోకములో నున్న యభిప్రాయములను కావనుటకు మన మెవ్వరము? 'రాజానుమతోధర్మః' అన్నారు పూర్వం. ఇప్పుడు 'లోకానుమతోధర్మః' అనవలయును .... 'లోకమునకు మించిన ధర్మము లేదు మీ వేదములు, మీ శాస్త్రములు, తీసి యట్టె పెట్టుడు. ప్రజాశక్తి వృద్ధియగుచున్నది....భాష, సంఘము, మతము - కొంతమంది ప్రత్యేక వ్యక్తులు చేరి మేము వీనికి నధికారులమని చెప్పుటకు వీలులేదు.... భాషలో గూడా మీ సమానములు గిమానములు పనికిరావు...." ఇలా సాగుతుంది వామనరావు విమర్శ. పొద్దుటి యుపన్యాసమునకు సాయంకాల మిచ్చిన అభిప్రాయం పూర్తిగా

విరుద్ధం. ''సామాన్య ప్రజకేమి తెలియును? వారెప్పుడును మనము చెప్పినట్లు నడువవలసినదే. మనము ప్రజాభిప్రాయము ప్రకారము నడుచుచున్నట్లు చూపించవలయును లేకపోయినచో మన బండి నడవదు.'' ఇలా సాగుతుంది వామనరావు వ్యాఖ్యానము. ఈ ద్వైదీ భావన కారణంగానే పత్రికలస్థాయి పడిపోయినదని విశ్వనాథ బాధను వ్యక్తం చేశారు.

వామనరావు ''క్యాపిటలిజం" గురించి పెద్ద సంపాదకీయము వ్రాసెను. అందులో అంతనా పొంతనా లేని భావాలు, భాషా ఉపయోగించారు. ఆయన. ''మూడు తలలు - గొడ్డలి. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు - ట్రినిటీ" - ట్రినిటీకి సత్వరజస్తమో గుణములకును సంబంధము లేదు. ఇలా రాయటంవలన దేశమునందు భావసంకర మేర్పడును. దీనిని వామనరావు అంగీకరించరు.

రామచంద్రరావు తెలుగు పరిశోధన శాఖలో డాక్టరు పరీక్ష చదవటానికి ఇంగ్లండునకు పోతాడు దానిమీద కొంత తర్జనభర్జన జరిగింది. ఆర్థికవిధానం స్థూలంగా స్పృశింపబడింది.

"పూర్వము మన దేశీయులు వ్యక్తిగత వేదాంతమునే వృద్ధి చేసిరి. జాతీయత, సర్వసమత్వము మొదలైన విశాల భావములు పెంపొందించలేదనిరి. మీరు చూడుడు - ఎంతసేపటికి వ్యక్తి సంపద వృద్ధికోసమే చూచుచున్నారుగాని, జాతి సంపన్నాశనము కొరకే చూచుచున్నారు."

రెండువందల ఏండ్ల కిందట పుట్టవలసిన వారి భావన ఇది. నిజమే రెండువందల ఏండ్ల కిందట పుట్టి వుంటే ఇప్పటి ప్రజ ఇంత తెలివి తక్కువగా వుండెదికాదేమో, బోఫోర్స్, స్కామ్, ఇప్పటి ఎన్రాన్ .. ఇవన్ని జాతిసంపదను నాశనం చేయలేదా? వ్యక్తి సంపద వృద్ధి పొందటం లేదా?

వామనరావు శారదాబిల్లును గురించి వ్రాస్తూ - ''ప్రాత హిందూ మతాచారము లన్నింటిని దూషించిరి. బ్రాహ్మణులను యదేచ్ఛముగా నిందించిరి. దానికి కుమారస్వామి "ఏమండీ, దోషములన్నియు బ్రాహ్మణులే చేసిరా? ఇంక నెవరూ జేయలేదా?'' అని కొంచెం తీవ్రంగా ప్రశ్నించాడు. దానికి వామనరావు సమాధానం ఎంత అసంబద్ధంగా వుందో చూడండి. ''అది యొక పాలసీ! అనగా

లౌక్యపు టెత్తు. ఈ కాలములో నీవు బాగుపడవలయుననినచో బ్రాహ్మణులను దిట్టవలయును. అప్పుడు నీ పత్రికనందరును గొందురు.'' ఇదండి పత్రికల వరస. అంతేకాదు - పత్రికాధిపతులు ఒకరిమీద ఒకరు వ్రాయరు. ఒక పత్రికకు వ్యతిరేకముగా మరో పత్రికలో వ్రాయరు. ఈ పత్రికలు కాకావట్టిన వానిని ఆకాశమునకు ఎత్తేస్తారు. ''తెలుగు కవిని బైకి రానీయరు."

విశ్వనాథకు ఆధునిక దృక్పథము లేదు. సామాజిక స్పృహ అసలే లేదు అని మరో విమర్శ. పురపాలక సంఘ సేవకుడు వృత్తి పన్ను అడగటానికి వస్తాడు. దానికి కుమారస్వామి సమాధానం చూడండి:

''నేనుద్యోగము లేక తిరిగినన్నాళ్ళు నన్ను బోషించినవాడెవడును లేడు. నేను సంపాదించుకొనుచుండగా మీకు వృత్తి పన్నెందుకు?'' అని బాధపడతాడు కుమారస్వామి. "నావద్ద వృత్తి పన్ను పుచ్చుకొనుట మీకెంత విధియో, వృత్తి లేనివారికి వృత్తి జూపించుట యంత విధి. మీ ఆర్థిక శాస్త్రములలో నిది యుండదు."

దీని కేమందురు విశ్వనాథను విమర్శించినవారు? ఇక వేదార్థములు మన కన్న పాశ్చాత్యులే బాగుగా నెరుగుదురు- అని అభిప్రాయము. "అంత బాగుగా దెలిసినచో మన మతములో గలియలేదేమి?" అన్న కుమారస్వామికి "వారు పరిశోధన చేసిరి. పూర్వులకన్న విషయము పరిశీలించుటకు పాశ్చాత్యుల కెక్కువ మార్గములున్నవి" అని వామనరావు సమాధానము.

"విద్యారణ్యునకు వేదము కొన్నిచోట్ల నర్థము కాలేదు. ఇప్పుడున్నంత పరిశోధన యప్పుడు జరుగలేదు గనుక నాయనకు దెలియలేదు." ఇది మన వేదములమీద మనవారికున్న అభిప్రాయమునకు పరాకాష్ఠ. దీనికి కుమారస్వామి సమాధానమూ అదే పరిమాణంలో వుంది. కుమారస్వామి పత్రికలో తన వుద్యోగానికి రాజీనామా చేస్తాడు. ఆ రాజీనామా పత్రంలోనే కొన్ని భాగాలు.... "పూర్వ పద్ధతులయందు గొన్ని దోషములు కనిపించుచున్నవి. ఆధునిక పద్ధతుల యందు వానికన్న నెక్కువ దోషములు కనుపించుచున్నవి. ఇది దోష బహుళముగా నున్నది.... శ్రీ విద్యారణ్యులకన్న మన వేదార్థము నెవనికో యెక్కువ తెలియుననుట నేను విని సహించలేకపోతిని. అట్టి మాటలు కూడ వినవలసిన

స్థితి యీ దేశమునకు వచ్చినదికదా! యని మాత్రమే దిగులు." ఈ సహించ లేకపోవుట - ఈ దిగులు ఎవరివో తెలుస్తోంది

చివరగా సంప్రదాయమును గూర్చిన చర్చను పరిశీలించాల్సి వుంది.

"వేదార్థము భారతమున బుట్టినవానికి దెలియవలయును సంప్రదాయ మైన యర్థము పరులకెట్లు తెలియును? ఉపజ్ఞ వేరు. సంప్రదాయం వేరు." అని చెప్తూ ఒక కథ చెప్తాడు కుమారస్వామి. ఇప్పటికిని వేదాంత పాఠము చదువు కొనుచున్నప్పుడు పండితులు వస్త్రములతో బాదములదాక గప్పుకొని చదువు దురు. "అది సంప్రదాయమైనది. ఒక మహా నాగరకతకు మూలసూత్రములైన భావములెంత ప్రధానమైనవో సంప్రదాయము కూడా నంత ప్రధానమైనది.... మీరు సనాతన మత సంప్రదాయములను ఛేదింపనెంచుచున్నప్పుడు.... మీయల్ప సంస్థల సంప్రదాయమునకు వ్యతిరేకముగా నడిచినచో, మీరు మనిషి జీవితము నాశనము చేయుచున్నవారే! ఒక మహాసంప్రదాయమును మహార్థవంతమైన దానిని లోకక్షేమకరమైన దానిని మీరు చంపుట కెట్లు ప్రయత్నించుచున్నారు? ఇదివరకే చాల చంపివేసితిరి.''

ఇది నిజం కాదంటారా?

పూర్వ ఆలంకారికులు కావ్యత్వం మీద ఇంతటి బాధ్యత మోపకపోయి ఉంటే, పూర్వ ఋషుల కావ్యాలు ఈ దేశంలో లేకపోయివుంటే, మానవసమాజ సంస్కారం ఏ విధంగా ఉండేదో ఉదాహరణకు కూడా అందని విషయం. అరాజ కంగా పాశవిక దశలో ఉన్న మానవసమాజంలో ప్రేమ, కరుణ, స్నేహం, సత్యనిష్ఠ, ధర్మచింతనా మొదలైన సంస్కారబీజాలను చల్లారు మహర్షులైన కవులు తమతమ కావ్యాల ద్వారా. సమాజంలో బతికి బట్టకట్టిన సంస్కృతీ నాగర కతలు - ఈ కవులు మనిషికి చేసిన అమూల్యమైన ఈవి. కాలక్రమంలో కొన్ని విలువలు మార్పులు చెందుతాయి. కొన్ని లుప్తమైపోతాయి. మరికొన్ని కొత్తవి ఉద్భవిస్తాయి. కానీ ఈ సభ్యత, ఈ నాగరకత, మానవవిలువలు పారంపరిక ప్రవాహంలో అవిచ్ఛిన్నంగా వస్తూనే వుంటాయి. ఈ ప్రవాహరూపమే కవిత్వం.

సంప్రదాయవాదంతో ఆధునికతను సంతరించుకొన్న మహా మనీషి విశ్వనాథ.

విశ్వనాథ "హృదయం'' అయిన కుమారస్వామి విశ్వనాథకు అండగా నిలిచాడు జాగ్రత్తగా పరిశీలిస్తే.

*

# విశ్వనాథ నవలల్లో 'కథకుడు'

—డా॥ సి. మృణాళిని

నవలా శిల్ప పరామర్శలో 'కథాకథనం' అనే ప్రయోగం సర్వసామాన్యం. ఈ 'కథాకథనం' అంటే ఏమిటి? అందులో నవలకు సంబంధించిన ఏయే అంశాలు ఇమిడి వుంటాయి? కథాకథన వైశిష్ట్యాన్ని అంచనా వేయడానికి కొలబద్దలేవి? అన్నవి పరిశీలించాల్సిన విషయాలు.

కథాకథనమంటే 'కథను చెప్పడం.' మళ్ళీ ఇక్కడ 'కథను ఎవరు చెప్తున్నారు? ఎవరికి చెప్తున్నారు?' అని ప్రశ్నించుకుంటే లభించే సమాధానం 'రచయిత పాఠకుడికి చెప్తున్నాడు' అని. కానీ నవలా రచన అంత సులువుగా తేల్చిపారేసేది కాదు. 'రచయిత, పాఠకుడు' అన్న పరిగణన బాహ్య ప్రపంచానికి సంబంధించింది. నవలా ప్రపంచం వేరు; బాహ్య ప్రపంచం వేరు. నవలా ప్రపంచంలోకి మనల్ని తీసుకు వెళ్ళడానికి రచయిత అనేక సాధనాలుపయోగిస్తాడు. వాటిలో ముఖ్యమైంది - 'కథనం' ఎవరి ద్వారా జరుగుతున్నది? అంటే 'కథకుడు ఎవరు?' అన్న అంశం. నవలా ప్రపంచంలో కథలోని పాత్రలు కూడా ఒక్కోసారి పాఠకులౌతారు. కథలోని పాత్రలే ఎక్కువగా కథకులౌతారు. కనక, నవలలో కథాకథనం గురించి చర్చించవలసి వచ్చినపుడు 'నలుగురి'ని దృష్టిలో పెట్టుకోవాలి: రచయిత, కథకుడు, పాత్రలు, పాఠకులు. ఈ నలుగురి మధ్య సంబంధాన్ని, సాన్నిహిత్యాన్ని పరిశీలించినపుడు ఆ రచనా సంవిధానం మనమే స్పష్టమౌతుంది.

నవలా రచనలో మొదటి ఘట్టం వస్తువును (theme) ఎంపిక చేసుకోవడం. ఆ తర్వాత రచయిత కథాప్రణాళిక (plot)ను ఏర్పాటు చేసుకుంటాడు. ఈ దశలోనే కథను ఎవరి దృష్టినుంచి లేదా ఎవరి ద్వారా చెప్పించాలన్న విషయాన్ని రచయిత నిర్ణయించుకుంటాడు. రచయిత ఏ ఒక్కపాత్రకు ప్రాధాన్యం ఇవ్వక, తనే స్వయంగా కథ చెప్పడం ఒక పద్ధతి. ఒక పాత్రను కథ

కుడిగా ఎన్నుకుని అతని ద్వారా (ప్రథమ పురుషలోనే) కథ చెప్పడం రెండవ పద్ధతి. ఒక పాత్రచేత ఉత్తమ పురుషలో కథ చెప్పించడం మూడవ పద్ధతి. ఇద్దరు లేక ముగ్గురిచేత కథ చెప్పించడం నాల్గవ పద్ధతి (మళ్ళీ ఉత్తమ పురుష కథనంలో అంతర్విభాగాలున్నాయి.)

రచయిత కథకుడిని ఎన్నుకోవడంలో ఎలాంటి ప్రయోజనాల నపేక్షిస్తాడు? అన్నది ఆలోచించవలసిన విషయం. ఒక సిద్ధాంత ప్రచారంకోసం నవల రాసినపుడు రచయిత తనకు ప్రతిబింబం వంటి పాత్రను కల్పించి, ఇతర పాత్రలను అతనికంటె అల్పులుగా చిత్రిస్తూ, అతని దృక్కోణం నుంచి ప్రథమ పురుషలో కథను నడిపిస్తాడు. (ఉదా: 'వేయిపడగలు'లో ధర్మారావు) నమ్మ శక్యం కానిదీ, ఆధునిక విజ్ఞానశాస్త్రం అంగీకరించనిదీ అయిన విషయాన్ని చెప్పదలుచుకున్నప్పుడు తను స్వయంగా చూసిన భ్రాంతి కల్పించడంకోసం ఉత్తమ పురుష కథనాన్ని ఎన్నుకుంటాడు. (ఉదా॥ బాణావతి.) 'అతను చూశాడు' అనేకంటే 'నేను చూశాను' అనడం మరింత విశ్వసనీయత కలిగి ఉంటుందనేది అందరెరిగిన సత్యం.

సాధారణంగా నవలలో కథకుడికీ, నవలా రచయితకూ దగ్గర పోలిక లుంటాయి. రచయిత జీవిత దృక్పథం కథకుడి ద్వారా వెల్లడౌతుంది. ఒక్కోసారి రచయిత కథకుడిని తనకంటే ఉన్నతంగా, ఆదర్శంగా చిత్రించవచ్చు. (సోమ ర్సెట్ మామ్‌లా.) లేదా తనకంటె పరిమిత పరిజ్ఞానం కలవాడిగా తీర్చవచ్చు. కథ అవసరాన్ని బట్టి కథకుడికీ, రచయితకూ మధ్య దూరం పెరగనూవచ్చు, తగ్గనూవచ్చు.

ఇక, రచయితకు, పాఠకుడికి మధ్య సాన్నిహిత్యం ఎటువంటిది? అనే విషయాన్ని పరామర్శించవలసి వుంది. రచయితకు పాఠకుడే లక్ష్యం. కానీ అతన్ని నేరుగా సంబోధిస్తే- అది వ్యాసమో, కవిత్వమో అవుతుంది గానీ నవల కాదు. అందువల్ల, నవలా రచయిత పాత్రల ద్వారా పాఠకుడిని చేరుకుంటాడు. ఒక్కోసారి, కథల పాత్రలకు తెలియకూడని విషయాలను మాత్రం రచయితగా తనే రంగంలోకి దిగి పాఠకులకు చెప్పవచ్చు. తన పాత్రలపై తనే తీర్పుచెప్పిన సందర్భంలో కూడా, రచయిత పాఠకుడితో నేరుగా సంభాషిస్తాడు.

రచయిత, కథకుడు, పాత్ర, పాఠకుడు- ఈ నలుగురి గురించి స్థూలంగా చర్చించిన తర్వాత, విశ్వనాథ సత్యనారాయణగారి నవలల్లో కథకుడు ఎన్ని విధాలుగా దర్శనమిస్తారో తెలుసుకోవలసి వుంది.

మొదట పేర్కొన్న నాలుగురకాల కథకులూ విశ్వనాథ నవలల్లో కనిపిస్తారు. ఆయన కథాకథనాన్ని శాసించిన లక్షణం, ఆయనలో వున్న అధ్యాపక ప్రవృత్తి. మంచి ఉపాధ్యాయుడు తనకున్న జ్ఞానాన్ని నిరవధికంగా, నిజాయితీగా విద్యార్థులకు పంచిపెట్టాలని కోరుకున్నట్లే, విశ్వనాథ కూడా తనకు తెలిసిందంతా పాఠకులకు తెలపాలని ఆశించారు. అపారమైన జ్ఞానసంపదను, పుస్తక పరిజ్ఞానాన్ని పాఠకుడికి అందించడానికి ఆయనకు నవల ఒక అవరోధం కాక పోగా, తక్కిన అన్ని ప్రక్రియల కంటె నవలలోనే ఆయన లక్ష్యం సులువుగా నెరవేరింది. నవలా నిర్మాణంలోని అంతర్భూతమైన వ్యాకోచగుణం వల్ల, తను స్వీకరించిన వస్తువుకు సంబంధించిన సకల విషయాలనూ కథనంలో భాగంగానే విశ్వనాథ చెప్పగలిగారు. కథకుడి ద్వారానే తన దృక్పథాన్ని ఆవిష్కరించ డానికి ప్రయత్నించినప్పటికీ, సమయాన్నీ, సందర్భాన్నీ, అవసరాన్నీ బట్టి రచయిత హోదాలో తను ప్రవేశించడానికి విశ్వనాథ వెనకాడరు.

కథనంలో, కథకుల రూపకల్పనలో విశ్వనాథ చూపిన వైవిధ్యానికి నిదర్శనాలుగా మూడు నవలలు ప్రస్తావిస్తున్నాను. అవి తెఱచిరాజు, మా బాబు, బాణావతి.

## తెఱచిరాజు :

విశ్వనాథ అత్యధికంగా ఉపయోగించిన 'సార్వత్రికదృక్కోణ' పద్ధతికి ఈ నవన మచ్చుతునక.

పాత్ర చిత్రణలో నాటకీయపద్ధతి (dramatic method) వర్ణనాత్మక పద్ధతి (descriptive method) అనే రెండు విధానాలున్న విషయం అందరికీ తెలిసిందే. కథకుడు తెరవెనక వుండి, సన్నివేశాలు, సంభాషణల ద్వారా పాత్ర వ్యక్తిత్వాన్ని ఆవిష్కరించటం నాటకీయ పద్ధతి. తన మాటల్లో పాత్ర వ్యక్తిత్వాన్ని వర్ణించడం, వ్యాఖ్యానించడం వర్ణనాత్మక పద్ధతి. నాటకీయ పద్ధతిని అవలంబిస్తూనే, కథకుడి హోదాలో పాత్రలపై వ్యాఖ్యలు చేసే అధికారాన్ని

పూర్తిగా వినియోగించుకునే రచయిత విశ్వనాథ. కథకుడిగా మూడు దశల్లో ఆయన పాత్ర చిత్రణ చేస్తారు.

1. మొదట సన్నివేశ కల్పనలో పాత్ర ప్రవర్తన తానంతట అదే వ్యక్తమౌతుంది. ఇక్కడ విశ్వనాథ తెరవెనక వున్న రచయిత మాత్రమే. కథకుడు కాదు.

2. సన్నివేశానంతరం, దాని ఆధారంగా ఆ పాత్రపై వ్యాఖ్యానం చేసినపుడు విశ్వనాథ కథకుడు. తన పాత్రను ఎలా అర్థం చేసుకోవాలో, అతని ప్రవర్తనకు కారణాలేమిటో విశ్లేషించే కథకుడు.

3 విశ్లేషణ జరిపిన తర్వాత, ఆ ప్రత్యేక సన్నివేశంనుంచి సార్వజనీనమైన ఒక సత్యాన్ని ప్రతిపాదించినపుడు విశ్వనాథ తెరపైకి వచ్చిన రచయిత.

'తెఱచిరాజు' నవలలో ఒక సన్నివేశాన్ని ఇందుకు ఉదాహరణగా చెప్పవచ్చు. సారథి, వాసంతి మొదటిసారి శృంగార సన్నివేశాన్ని నాటకరంగంపై అభినయించడం అత్యంత కీలకమైన, నవలా వస్తువుకు బీజప్రాయమైన సన్నివేశం. ఆ సమయంలో వాళ్ళిద్దరూ పొందిన భావోద్వేగాన్ని ఆ పాత్రల ప్రవర్తనాపరంగానే నాటకీయంగా రచించారు. 'వాసంతి గురించి సారథి ఆలోచిస్తున్నాడు' అనడంతో ఆ సన్నివేశం ముగుస్తుంది. ఇంతవరకూ తెరమీద వున్న విశ్వనాథ ఇప్పుడు కథకుడి హోదాలో రంగ ప్రవేశం చేసి వ్యాఖ్యానిస్తారు: 'సారథి ప్రౌఢుడు. అవివాహితుడు అతని శీలమును గూర్చి యెవ్వరికిని మంచి అభిప్రాయము లేదు. ఉండవలసిన అవసరములేదని అతడే చెప్పుచుండును.' ఆ తర్వాతి వాక్యం-'లోకమునందు శీలము ద్విధాభూతము. ఆ రెంటిని రెండుగా చూచుట లోకము నేర్చుకొనవలయును. ఒకటి స్త్రీ సంబంధమైన శీలము. రెండవది తదితర సర్వవిషయములకు సంబంధించినది.' అంటే, ఇంతలో కథకుడు కూడా అదృశ్యమై రచయిత నేరుగా రంగంపైకి వచ్చేశాడు. కథకుడిగా పాత్రను విశ్లేషించి, రచయితగా దాన్ని సార్వజనీకరించిన తర్వాత 'సారథి అట్టి నీతిమంతుడు' అంటూ మళ్ళీ కథకుడిగా ప్రస్తుతాంశంలోకి ప్రవేశించడం, విశ్వనాథ రచనలోని వైచిత్రి.

'తెఱచిరాజు' నవలలో ప్రధానమైన అంశం స్త్రీ పురుషుల స్పర్శకు సంబంధించింది. స్పర్శలోని లౌకికతను, అలౌకికతను, ఇద్దరు వ్యక్తుల మధ్య స్పర్శవల్ల పెరిగే సాన్నిహిత్యాన్ని, దూరాన్ని కూడా ప్రతిభావంతంగా చెప్పిన నవల ఇది. ఒక కొత్త సిద్ధాంతాన్ని చెప్పదలుచుకున్నపుడు కథను గుప్పిట్లో వుంచుకునే సార్వజ్ఞిక దృక్కోణమే అనుకూలంగా ఉంటుంది. రచయిత తన సర్వజ్ఞతను సారథికి గానీ, వాసంతికి గానీ పరిమితం చేసివుంటే, స్పర్శ సిద్ధాంత ప్రతిపాదన ఇంత సాకల్యంగా, సమర్థంగా జరిగివుండేది గాదు. వీరిద్దరిలోనూ పరస్పర స్పర్శ వల్ల కలిగిన అలజడి, వారి జీవిత వైఖరినీ, ఇతరులతో వారి అనుబంధాన్ని శాసిస్తుంది. చివరకు స్పర్శకు సంబంధించిన సాన్నిహిత్యంవల్లే వాళ్ళు ప్రాణాలు కోల్పోతారు. వస్తువులోని నవ్యతవల్ల, క్లిష్టతవల్ల సర్వజ్ఞ దృక్కోణం ద్వారా చెప్పడమే సముచితమని గ్రహించడం నవలా ప్రక్రియ స్వభావంపై విశ్వనాథకున్న అవగాహనకు నిదర్శనం.

## మా బాబు :

తెలుగు సాహిత్యంలోని ఉత్తమ పురుష కథకుల్లో విలక్షణమైన వ్యక్తి 'మా బాబు' కథకుడు. విశ్వనాథ కల్పించిన కథకుల్లో, ఇంత సహజమైన, స్వచ్ఛమైన, రచయిత నుంచి పూర్తిగా విడివడిన కథకుడు మరొకడు కనిపించడు. ఈ కథకుడిలోని మరో గొప్ప లక్షణం అతని వినమ్రత. తనకు బాల్యంలో ఆశ్రయమిచ్చిన కాపుకులస్థుడు ('మా బాబు') మరణించిన తర్వాత, అతని సంతానం కోసం తన యావచ్ఛక్తినీ, జీవితాన్ని, చివరకు ప్రేమను కూడా త్యాగం చేసిన ఉన్నతుడు ఈ నవలా కథకుడు. కానీ తన చర్యలను అతను ఎక్కడా ఘనకార్యాలుగా చెప్పుకోడు. స్వోత్కర్షకు అనుకూలమైన ఉత్తమపురుష కథనంలో, ఎక్కడా దాని ఛాయలు కూడా కనిపించవు.

ప్రతి విషయంలోనూ ఖచ్చితమైన అభిప్రాయాలున్న విశ్వనాథ తన అభిప్రాయ ప్రకటనకోసం కథాగమనాన్నీ, సందర్భాన్నీ పట్టించుకోకపోవడం పాఠకులందరికీ అనుభవమే. కథను ఆపేసిగానీ, అప్పటికప్పుడు సందర్భాన్ని సృష్టించుకొనిగానీ తను చెప్పదలచుకొన్నది చెప్పడం ఆయన అలవాటు. కానీ 'మా బాబు' నవల ఈ లక్షణాలన్నిటికీ అపవాదం. ఉత్తమ పురుష కథనంలో వుండే పరిమితులు ఇందులోనూ వున్నాయి. ఈ నవలలో కథకుడి పరిసరాలు,

జీవిత విధానం, అతనికి తారసపడే వ్యక్తులు, రచయితకు పూర్తిగా విభిన్న మైన జీవితానికి చెందినవి. అయినా, రచయిత ఆ జీవితాలను గురించి తెలుసు కొని, కథకుడి పరిమిత అవగాహనా పరిధి ద్వారానే వాటిని చెప్పారు. సాధార ణంగా తన నవలల్లో సర్వాంతర్యామిగా ఉండే విశ్వనాథ ఈ నవలలో మాత్రం ఎక్కడా కనిపించడు.

ఆత్మాశ్రయ కథనం వున్న నవలలన్నిటిలోనూ ఉండే అసౌకర్యం ఇందులోనూ వుంది. కథకుడి దృక్కోణమే తప్ప, తక్కిన పాత్రల ప్రవర్తన గానీ, ఆలోచనలు, ప్రేరణలు గానీ మనకు తెలిసే అవకాశం లేదు. కథకుడితో మైత్రి పెంచుకునే పాములవాడు, కథకుడి ప్రేమను భగ్నం చేసిన మరదలు, అతనిపై అవ్యాజమైన వాత్సల్యం వున్న 'మా బాబు', అతని కుటుంబం - వీరందరి ప్రవర్తన వెనక కారణాలు, ప్రేరణలు మనకు తెలీవు. కథకుడి ద్వారానే సాధారణంగా ఇతర పాత్రల స్వభావాలు కూడా తెలుస్తుంటాయి. కానీ ఈ నవలా నాయకుడి వినమ్రతవల్ల, అతను ఏ ఇతర పాత్రనూ వ్యాఖ్యానించే సాహసం చేయడు. వారి ప్రవర్తనను యథాతథంగా వర్ణిస్తాడే తప్ప, 'జడ్జి' చెయ్యడు. ఇలాంటి కథకుడి ద్వారా కథ చెప్తూ కూడా, అతని ఔన్నత్యాన్ని, తక్కినవారి లోపాలను ఎప్పటికప్పుడు అర్థమయ్యేలా చిత్రించడంలో విశ్వనాథ అసాధారణమైన నేర్పు ప్రదర్శించారు.

**బాణావతి :**

అసహజం, అసంభవం అని పాఠకులు తలచే విషయాన్నే నవలా వస్తువుగా స్వీకరించినప్పుడు, పాఠకుడిని నమ్మించడానికి రచయిత చాలా నైపుణ్యం చూపాల్సి వస్తుంది. ఆ నేర్పులో భాగంగానే, విశ్వనాథ 'బాణావతి'లో ముగ్గురు ప్రధాన కథకులను మనముందుంచారు. కథకు శ్రీకారం చుట్టిన 'నేను', ప్రధాన కథను చెప్పే శర్మ, ఉపకథలు చెప్పే రావు - వీరు ముగ్గురు ఇందులో కథకులే. బాణావతి అనే దెయ్యం ఒక పురుషుడిని ఆవహించడం, అతని జీవితాన్ని అతలాకుతలం చేయడం, చివరికి ఇద్దరి మధ్య స్నేహభావం కూడా ఉదయించడం ఇందులో ప్రధానమైన కథ. ఆధునికులకు ఇలాంటి కథ చెప్పాల్సివచ్చినపుడు, శీర్షిక కింద 'ఒక యధార్థ గాథ' అని రాస్తే చాలదు. దానికి ఒక ప్రత్యక్షసాక్షి కథనం అవసరం. కథనం మరింత బలంగా సాగడంకోసం,

ఒకే ఇతివృత్తంగల మూడు కథలను ముగ్గురిద్వారా ప్రవేశపెట్టారు విశ్వనాథ. ఒక వ్యక్తి విచిత్రమైన స్వీయానుభవాన్ని చెప్తున్నప్పుడు, శ్రోతలు కూడా తాము విన్నవీ, కన్నవీ అలాంటి కథలు చెప్పడం నిత్యజీవితంలో ఎదురయ్యే సన్నివేశమే. ఈ సహజమైన సంఘటనను ఆధారం చేసుకుని రావు, శర్మ, నేను అనే పాత్రల ద్వారా రచయిత కథను చెప్పించారు. అందరి కథావస్తువు 'కామినీ పిశాచమే'.

వీరిలో 'నేను' పాత్ర ఎంత? అంటే, 'నేను' రచయిత కాడు. కానీ రచయిత లక్షణాలను, నమ్మకాలను, కొంతవరకు ఆయన పరిజ్ఞానాన్ని పుణికి పుచ్చుకున్నవాడు. ప్రధానమైన కథ చెప్పేది శర్మ అయినా, అతడికి ఎప్పటి కప్పుడు ప్రోత్సహిస్తూ, కబుర్ల సందడిలో కథ విస్మృతమౌతున్నప్పుడు, మళ్ళీ తోవలోకి తీసుకువచ్చేవ్యక్తి ఈ 'నేను.' ఈ నవలలో ఒక్కొక్క కథకుడి బాధ్యత, కర్తవ్యం ఎంతవరకు, అతని పరిమితు లేమిటి, అతని ద్వారా ఎంత మేరకు కథ నడిపించాలి. కథను అంచెలంచెలుగా, ఉత్కంఠభరితంగా కొన సాగించడంలో అతను ఎలాంటి పాత్ర నిర్వహించాలి అన్న విషయాల్లో రచయిత చాలా శ్రద్ధ వహించారు. 'నేను' అన్న పాత్ర కథకుడిగానే కాక, శ్రోతగా, ప్రేక్షకుడిగా కూడా దర్శనమిస్తుంది. కథలో ఉత్సుకత పెంచడం కోసం కథకులను ఎన్ని రకాలుగా వాడుకోవచ్చునో ఈ నవల అందంగా చెబుతుంది.

కథకూ, కథకుడికీ వున్న సంబంధాన్ని లోతుగా అర్థం చేసుకున్న రచయిత విశ్వనాథ. రచయితకూ, పాఠకుడికీ మధ్య వారధిలాంటి కథకుడిని ఎన్ని రూపాల్లో చూపడానికి అవకాశం వుందో అన్ని రూపాల్లోనూ ఆయన చూపారు. విశ్వనాథ తాత్త్వికదృక్పథంతో, ఆయన ఎంచుకున్న వస్తువుతో విభేదించేవారు సైతం నవలాశిల్పమర్మ మెరిగిన ఆయన కళాకౌశలాన్ని మాత్రం ప్రశంసించకుండా ఉండలేరు.

*

# పురాణవైర గ్రంథమాల - చంద్రగుప్తుని స్వప్నము

**—డా॥ లావణ్యసరస్వతి**

భారతీయులకు అనేక విషయాలకు పురాణాలు ప్రమాణాలు. ''పురాణం పంచలక్షణమ్'' - పురాణాలకున్న పంచలక్షణాలలో చరిత్ర కూడా ఒకటి. కాని వాటిలోని చారిత్రికాంశాలను గ్రహించటానికి సంస్కృత భాషా పాండిత్యం, ఖగోళశాస్త్ర పరిజ్ఞానం అవసరం. భారతీయుల వారాల పేర్లు, నెలల పేర్లు కూడా ఖగోళ శాస్త్రం పైన ఆధారపడ్డాయి. రవి, సోమ, మంగళ, బుధవారాల పేర్లు ఆ రోజు సూర్యోదయం ఆ గ్రహాల హోరతో ప్రారంభం అవుతుంది. కాబట్టి ఆ గ్రహ నామమే ఆ దినానికి పేరుగా ఏర్పడింది. అదే విధంగా చంద్రుడు పౌర్ణమినాడు ఏ నక్షత్రంలో ఉంటాడో ఆ నక్షత్ర నామమే మాసనామం అవుతుంది. చిత్తలో పౌర్ణమినాడు చంద్రుడున్న నెల చైత్రమాసం. విశాఖలో ఉన్నది వైశాఖమాసం కాబట్టి ఇవి నిర్ణిత గతిలో నడిచే గ్రహాల నడకపై ఆధారపడి ఉన్నాయి. ఇలాంటి ఖగోళ శాస్త్రం వల్ల తెలియదగిన రీతిలో పురాణాలలో చారిత్రికాంశాలున్నాయి.

నేడు ప్రచారంలో ఉన్న భారతదేశ చరిత్ర రచనకు విదేశీపండితులే కారకులు. వారి దృష్టిలో మానవసృష్టికాలము క్రీ.పూ. 4000 సం. క్రీ.పూ. 6000 సంవత్సరాలకు పూర్వం భూమి మీద సృష్టే లేదని వారి నమ్మకం. భారతదేశ చరిత్ర రచనా సందర్భంలో పురాణాలు చెప్పే విషయాలు వారిని ఆశ్చర్య పరచాయి. నమ్మదగినవిగా కనపడలేదు. సందేహాస్పదమైన చోట్ల, వారికి విశ్వసించదగిన ఆధారాలు దొరకని సందర్భాలలో మార్పులు చేయవలసి వచ్చింది. ఈ మార్పులలో కొందరు ప్రసిద్ధ వ్యక్తుల చరిత్రలు తారుమారయినవి. శాలివాహన, విక్రమార్కుల వంటి వారు చరిత్రలో పూర్తిగా స్థానాన్నే కోల్పో

యారు. అటువంటి తల్లక్రిందులయిన చరిత్ర ప్రసిద్ధ వ్యక్తులలో ఒకడు మౌర్య చంద్రగుప్తుడు.

మౌర్య, గుప్త చంద్రగుప్తులు ఇద్దరున్నట్లు; మౌర్యులు ప్రాచీనులని అందరు చారిత్రకులు అంగీకరించారు. అయితే అలెగ్జాండరు దండయాత్ర ఏ చంద్రగుప్తుని కాలంలో జరిగిందన్నది మాత్రం వివాదాస్పదం అయింది. పాశ్చాత్యచరిత్రకారులు అలెగ్జాండర్ సమకాలికుడు మౌర్యచంద్రగుప్తుడేనని తేల్చారు. అసలు అలెగ్జాండరు సింధునదిని దాటి భారతదేశంలో ప్రవేశించనే లేదని Rookes వంటి వారి అభిప్రాయం. "The crossing of the Indus by Alexander, his defeating of Porus, the establishment of Greek Kingdom in Punjab were all the pure concoctions of these Greek writers who followed Alexander as part of his retinue and were bent upon pleasing him by agreable flattery or they might have been satirical compositions."[1]

V. A. Smith చంద్రగుప్తునికి అతని కుమారునికి సంబంధించినవే అని ఖచ్చితంగా చెప్పదగిన శాసనాలేవి లభించకపోవడం వల్ల చరిత్రకారుడు గ్రీకు రచయితలు చెప్పిన విషయాలు నిరూపించడంలో కృతకృత్యుడు కాలేక పోయాడన్నాడు[2] వీటినిబట్టి పాశ్చాత్య చరిత్రకారులు అలెగ్జాండరు సమకాలికుడు 'మౌర్య చంద్రగుప్త'డనడానికి బలమైన గట్టి ఆధారాలు తక్కువని విస్తున్నది. అప్పుడున్నది 'గుప్తచంద్రగుప్తుడే' అనడానికి భారతీయ చరిత్ర కారులు చూపిన ఆధారాలలో కొన్ని ఇలా ఉన్నాయి:

## నామసామ్య ఆధారం :

గ్రీకు రచయితలు ముగ్గురు రాజులను పేర్కొన్నారు. 1. Xandramas అను రాజును చంపి 2. Sandrocottus రాజ్యానికి వచ్చాడని, అతని కుమారుడు 3. Sandrocyptus తరువాత రాజ్యం చేశాడని చెప్పారు. ఈ ముగ్గురు

---

1. Translation of Arrian's "History of Alexander's expedition." 1814. preface by Rookes.
2. 'Early History of India' by V.A. Smith

రాజులెవరో నిర్ణయించటానికి ముందుగా పూనుకొనిన వ్యక్తి William Jones అని Max Muller చెప్పాడు. మొదటి పేరుతో నిర్ణయానికి పూనుకోవడం సహజమైన పద్ధతి కాని Jones రెండవ పేరుతో ప్రారంభించి Sandrocottus చంద్రగుప్తునిగా నిర్ణయించాడు. దీనిలో 'భాగవతమిత్ర' గ్రంథాన్ని కూడా పరిశీలనలోకి గ్రహించాడు. మిగిలిన పురాణాలన్నీ చెప్పినట్లే భాగవతమిత్రగ్రంథం కూడా ఆంధ్ర శాతవాహన రాజులను చెప్పి వారిలో చివరివాడిగా 'చంద్రశ్రీ'ని చెప్పింది. ఆ రాజును చంపి గుప్తచంద్రగుప్తుడు రాజ్యానికి వచ్చాడని, అక్కడి నించి మగధ సామ్రాజ్యం చిన్న చిన్న రాజ్యాలుగా (సామంతులు కొందరు స్వాతంత్ర్యం ప్రకటించడంవల్ల) విడిపోయిందని, గుప్తచంద్రగుప్తుడు పాటలీపుత్రాన్ని రాజధానిగా చేసుకున్నాడని చెప్పింది. భాగవతమిత్రం మౌర్యచంద్రగుప్తుని కాలాన్ని క్రీ పూ 1502 దగ్గర నిర్ణయిస్తోంది జోన్స్ పండితుడు ఒకచోట దీనినే అంగీకరించి మౌర్యచంద్రగుప్తుని కాలం క్రీ. పూ. 1502 అనే నిర్ణయించాడు. మళ్ళీ తానే అలెగ్జాండరు నాటికి ఉన్నది మౌర్యచంద్రగుప్తుడే అన్నాడు. ఒకే వ్యక్తికి రెండు కాలాలు నిర్ణయించడం జరిగింది.

Sandrocottus అన్న పేరు చంద్రగుప్తుడు అని అనుకున్నపుడు తానే నిర్ణయించిన కాలాలలో వ్యత్యాసం వస్తున్నపుడు అలాటి పేరున్న వ్యక్తి ఇంకొకరు ఉన్నారేమో అని చూస్తే జోన్స్ పండితునికి తాను పరిశీలించిన 'భాగవత మిత్ర' మే వేరొక చంద్రగుప్తుని గూర్చి చెప్పడం సులభంగా కనబడేది. అతడు చంపిన Xandramas చంద్రశ్రీగా అతని కుమారుడు Sandrocyptus సముద్రగుప్తునిగా ఊహించడం ఆ పేర్లుకూడా ఆ ధ్వనులకు దగ్గరగా ఉండడం చాలా తేలికగా అమరివుండేది ఈ విధంగాకాక జోన్స్ పండితుడు నిర్ణయించినట్లు Sandrocottus మౌర్య చంద్రగుప్తుడయేసరికి Xandramas మహాపద్మనందునిగా Sandrocyptus ని బిందుసారునిగా నిర్ణయించాల్సి వచ్చింది. ఈ పేర్లలో నామసామ్యం అంతగా కనబడదు. అయితే 1859 లో పాశ్చాత్య చరిత్రకారుల దృష్టిలోకి గుప్తచంద్రగుప్తుని Prof. Troyer తెచ్చినట్లు తెలుస్తోంది.[3] అప్పుడయినా వారి దృష్టిలో మార్పు రాకపోవడం విచారకరం. దీనివల్ల పురాణాలలో చరిత్ర అంతా తప్పని తేల్చవలసి వచ్చింది.

3. Vide P. 3.8 Ibid Max Muller's History (1859 A.D.) and P. 135 of Allahabad Edition.

## గిరివ్రజ రాజధాని ఆధారం :

మగధరాజ్య స్థాపననుంచి 6000 సం॥ల వరకు మగధకు గిరివ్రజం రాజధానిగా ఉండేది. పురాణాలన్నీ ఆంధ్ర రాజుల పతనంవరకు గిరివ్రజాన్నే రాజధానిగా చెప్తున్నాయి. ఆంధ్ర రాజులలో చివరివాడైన చంద్రశ్రీ పుత్రుడు పులోముడు సమర్థవంతుడుకాడు. గుప్తచంద్రగుప్తుడు చంద్రశ్రీకి రాజోద్యోగి మాత్రమే. చంద్రశ్రీని చంపి పులోముడిని పేరుకు రాజును చేసి సర్వాధికారాలు హస్తగతం చేసుకున్నాడు గుప్తచంద్రగుప్తుడు. రాజ్యం చిక్కు సమస్యల్లో ఉన్న సందర్భంలో చంద్రగుప్తుడు పులోముని చంపి తననుతానే చక్రవర్తిగా ప్రకటించుకుని రాజధానిని పాటలీపుత్రానికి మార్చి అక్కడ పట్టాభిషేకం చేసుకున్నాడు. కొందరు సామంతులు తమ ప్రాంతాలలో రాజులుగా స్వాతంత్ర్యం ప్రకటించుకున్నారు. మగధ చిన్నచిన్న స్వతంత్ర రాజ్యాలుగా విడిపోయింది. ఈ కారణం వల్ల పురాణాలు ఆంధ్ర రాజులవరకు మగధనేలిన రాజవంశాలు చెప్పి తరువాత సమకాలీన రాజ్యాలయిన అన్ని రాజ్యాల చరిత్రను చెప్పాయి. వాటిలో ఒకటిగా గుప్త రాజవంశ చరిత్రను కూడా చెప్పాయి.

మెగస్తనీసు వంటి గ్రీకు రాయబారులు పాటలీ పుత్రంలో ఉన్నట్లు చెప్పుకున్నారు. దీనినిబట్టి వారు గుప్త రాజాస్థానంలో ఉండి ఉంటారని భావించవచ్చు. మౌర్యవంశ రాజయిన అశోకుని సారనాథ్ శాసనం పాటలీ పుత్రంలో ప్రధాన బౌద్ధ సంఘం ఉన్నట్లు చెప్తున్నది. కాని, ఆ పాటలీ పుత్రాన్ని రాజధానిగా చెప్పలేదు.

## అర్థశాస్త్ర ఆధారం :

మౌర్య చంద్రగుప్తుడు చాణక్యుని సహాయంతో రాజ్యానికి వచ్చాడు. చాణక్యుడు అర్థ శాస్త్రాన్ని రచించాడు. మెగస్తనీసు తను చూసిన భారతదేశ సాంఘిక రాజకీయ పరిస్థితులను వివరిస్తూ యాత్రా చరిత్ర రచించాడు.

మెగస్తనీసు పట్టణాలలో ప్రజలచే ఎన్నుకోబడిన ప్రతినిధుల సంఘాలు ఉండేవని వ్రాశాడు. ఈ సంస్థల కార్యకలాపాలు, ప్రజల సుఖశాంతులకై వాటి కృషి, పరిపాలనా యంత్రాంగంలో వాటి పాత్ర గురించి వివరించాడు.

కాని, చాణక్యుని అర్థశాస్త్రంలో దీనికి భిన్నంగా ఒక్కొక్క పట్టణంలో రాజోద్యోగి ఒకడు అధికారిగా ఉండేవాడని, నగర పరిపాలనలో ఇతడే సర్వాధికారి అని, ఇతడిని 'నాగరికుడు' అని పిలిచేవారని వ్రాశాడు. పట్టణ పరిపాలన ఇతడి ఆధీనంలోనే జరిగేదని అర్థశాస్త్రం 54 వ విభాగం చెప్తోంది. కాని, ఎక్కడా ప్రజలచే ఎన్నుకోబడిన ప్రతినిధుల సంఘాల ప్రస్తావన లేదు [1]

ఇక బానిసత్వాన్ని గూర్చి చూస్తే మెగస్తనీసు భారతీయులు విశాలహృదయులనీ ఏ పరిస్థితుల్లోనూ ఎవరినీ బానిసలుగా గ్రహించరని చెప్పాడు. యుద్ధ బంధితులను సహితం బానిసలుగా పరిగణించని మహోన్నత సంస్కృతి భారతీయుల దని పేర్కొన్నాడు.[2] చాణక్యుని అర్థశాస్త్రంలో దశకల్పం 65 వ విభాగం అంతా బానిసలను గూర్చి వ్రాయబడింది. బానిసల స్థితిగతులు, ఎటువంటి వారిని బానిసలుగా గ్రహించాలి, ఏ పరిస్థితులలో బానిసలను స్వీకరించాలో ఈ విభాగంలో విపులంగా చర్చించబడింది.

ఈ విధమైన పరస్పర విరుద్ధమైన అభిప్రాయాలు చాణక్యుడు మెగస్తనీసు వేరు వేరు కాలాలకు చెందినవారని స్పష్టం చేస్తున్నాయి. కాబట్టి ఒకే చంద్రగుప్తుని కాలంలో వారిద్దరూ ఉండలేదని స్పష్టం అవుతుంది.

ఇంతేకాక గ్రీకులు చెప్పిన ప్రతిభా విశేషాలు మౌర్య చంద్రగుప్తునిలో కనబడవు. అతడు చాణక్యుని చేతిలో కీలుబొమ్మ. స్వయంప్రతిభతో ప్రకాశించిన వాడుకాడు. గ్రీకులు అలెగ్జాండరు నెదిరించిన రాజకుమారుడికి ఉన్నాయని చెప్పిన పరాక్రమాది లక్షణాలు సముద్రగుప్తునిలో ఉన్నాయి.

E. J. Rapson Xandramas కు అనంత సేనావాహిని ఉందని చెప్పాడు. మౌర్య చంద్రగుప్తుని వెనుక చాణుక్యుని రాజనీతి ఉన్నంతగా సేనావాహిని లేదు. అతడి గూర్చి ఎన్నో వివరాలు చెప్పిన పురాణాలు, నాణాలు, శాసనాలు అతడికి అంత పెద్ద సేన ఉన్నట్లు చెప్పలేదు. ఈ విధమైన ఆధారాల వల్ల అలెగ్జాండరు కాలంలో గుప్త చంద్రగుప్త; సముద్రగుప్తులే ఉండి ఉంటారని తెలుస్తోంది. ఈ చంద్రగుప్తుని స్థానంలో మౌర్య చంద్రగుప్తుని ప్రవేశపెట్టడంతో భారతదేశ చరిత్రకు అవాంతరం ఏర్పడింది. శ్రీ విశ్వనాథవారు ఇలా అన్నారు:

1,2. "Plot in Indian Chronology" By Kota Venkata Chalam P. 105 - 106.

"మన పురాణములును రాజతరంగిణియు కలియుగ రాజ వృత్తాంతము నేపాళరాజ చరిత్రము చెప్పిన సంగతులన్నియు మహాభారత యుద్ధము 5101 సం॥లకు పూర్వము జరిగిదని యొప్పుకున్నచో సరిపోవుచున్నవి. ఒప్పుకోనిచో సరిపోవుటలేదు. సరిపోవు లెక్కయుండగా సరిపోని లెక్కపట్టుకుని ఆ వ్రాసిన వారందరు తప్పువ్రాసి రనుటలో నేమి న్యాయమున్నది?''

ఇటువంటి అభిప్రాయంగల విశ్వనాథవారు భారతీయ చరిత్రను చూప డానికే 'పురాణవైర గ్రంథమాల' నవలలు రచించారు. వాటిలో 5వ నవల 'చంద్రగుప్తుని స్వప్నము.' దీనిలో మురాదేవికి మహాపద్మనందునికి పుత్రుడైన చంద్రగుప్తుడు మాతృభక్తితో తాను ఇకనుండి మౌర్యచంద్రగుప్తునిగా వ్యవహ రింపబడతానని ప్రకటించుకున్నాడు. నవనందులను చంపి నందవంశపాలన తరువాత మౌర్యవంశం మగధసామ్రాజ్యాన్ని ఏలడానికి మూలపురుషుడయ్యాడు. చాణక్యుడు తనను అవమానించిన నందులను సంహరించడానికి దీక్షవూని చంద్రగుప్తుని అడ్డం పెట్టుకుని కార్యసాధకుడవుతాడు. రాక్షసుని (మహాపద్మ నందుని మంత్రి) వ్యూహాలు రాజుకు అందేలోపలే చాణక్యుని కుటిలనీతి ఫలి స్తుంది. విశ్వగాథవారు తానే చాణక్యుని పాత్రలో లీనమై ఎత్తులకు పై ఎత్తులు వేస్తూ నవలా రచన చేశారు,

ఈ నవల పీఠికలో "పాశ్చాత్య చరిత్రలయందు గ్రీకుదేశపు రాజైన అలెగ్జాండరు మౌర్య చంద్రగుప్తుడు రాజ్యము చేయుచుండగా భారతదేశము మీదికి దండెత్తి వచ్చెనని వ్రాయబడినది. అది యభూతకల్పన. అలెగ్జాండరు భారతదేశము మీదికి దండెత్తివచ్చినది క్రీ.పూ. 327 సం.ర ప్రాంతములందు. మౌర్య చంద్రగుప్తుడు మగధ రాజ్యమును పాలించినది క్రీ పూ. 1534 నుండి 1500 వరకు. అతని కొడుకు బిందుసారుడు. ఈ బిందుసారునకు శిశునాగ వంశములోని బింబిసారునకు సంబంధము లేదు. పాశ్చాత్య చరిత్రకారులు చేసెడి యనేకములైన యపభ్రంశములలో నొకని పేరుండగా ఆ పేరునుబట్టి వారెరిగియున్న ఈ పేరుగల వాడింకొకడుండగా వారిద్దరొకటేయనుట........ వారి చరిత్రలలో నొక శాసనములో నొక రాజు పేరు కనిపించగా ఈ పేరు ఇంకొక శాసనములో కూడ కనిపించగా ఇద్దరు రాజులొకటేనందురు. అట్లనరు. కావచ్చునందురు. వ్రాయుటలో గావచ్చుసందురు,చెప్పుటలో నిద్దరొకటేయందురు· ఈ కాలము వ్రాయబడిన దానిలోనున్న సంశయము వదలిపెట్టి మాటలలోని

రూఢినే గ్రహించును.... ఈ చంద్రగుప్తుడు ఆ చంద్రగుప్తుడు కాడు. చంద్రగుప్తుడన్న పేరు చూచి పాశ్చాత్యులు చేసిన కల్పన. ఈ సంగతి స్ఫురింపజేయుటకు ఈ నవల చివర మౌర్యచంద్రగుప్తుడు తన తరువాత 1300 ఏండ్లకు జరగబోవు నలెగ్జాండరు దండయాత్రను స్వప్నమునందు చూచెనని కల్పించబడినది.'' విశ్వనాథవారు ఈ పీఠికలో తమ దృఢాభిప్రాయములను చెప్పిరి. నవలలోని కథా శిల్పము యొక్క విశిష్టత కంటె చారిత్రక సత్యములు నిలుపవలెనని ఈ నవల వ్రాయబడినది.

చంద్రగుప్తుడు స్వప్నమును చూచి దాని ఫలము తెలుసుకొనుటకు సిద్ధాంతితో నిట్లు పలుకును: "మహా పండితుడా, నేను భారతదేశ చక్రవర్తినట. నాకు పది లక్షల సైన్యమున్నదట ఎవడో మహా విజేత, మ్లేచ్ఛుడు. వాని నామము విచిత్రముగానున్నది. అలక్షంధరుడు. వాడార్యావర్తము మీదికి దండెత్తి వచ్చెనట... నాకు ఈ స్వప్న మెందుకు వచ్చినట్లు?''

''నీ పేరుగలవాడు కొన్ని వందల యేండ్లు గడిచిన తరువాత నా యలక్ష్యంధరుని దండయాత్రను నాశనము చేయును. అది నీకు కల వచ్చెను."

"నాకు సంబంధములేని కల నాకెందుకు వచ్చెను?"

సిద్ధాంతి ఇట్లనెను: "నీకు సంబంధమున్నది. ఆ మ్లేచ్ఛదండయాత్రను వెనుకకు మరలించినది నీవని మూడు వేల యేండ్లు గడచిన తరువాత నను కొందురు. అట్లు కొందరు పురాణవైరమును సాగింతురు."

ఈ విధముగా ఒక స్వప్నము కల్పించి మౌర్యచంద్రగుప్తుడు, గుప్తచంద్రగుప్తుడు వేరుకాలములవారని, మధ్య 1300 సం॥ కాలము వ్యవధానమున్నదని, అలెగ్జాండరు కాలమున ఉన్నది గుప్తచంద్రగుప్తుడని శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు ఈ నవలలో తెలియజేశారు. *

"నన్నయ్యయు తిక్కన్నయు
నన్నావేశించిరి పరిణాహ మనస్సం
ఛన్నత వారలు పోయిన
తెన్నున మెఱుఁగులను దీర్చి దిద్దుచు పోదున్.

—విశ్వనాథ

# విశ్వనాథ కాశ్మీర రాజవంశ నవలలు

—శ్రీమతి కె. బి. లక్ష్మి

అఖండ యశోవిరాజితులు విశ్వనాథ సత్యనారాయణగారు. ఆయన సంపూర్ణ నవలా ప్రణాళికవైపు కన్నుసారిస్తే ఓ పట్టాన ఆశ్చర్యం నుండి తేరు కోవడం కష్టం.

'వేయిపడగల' నుండి 'కుక్క-గొడుగుల'దాకా వివిధ అంశాల మీద, ఇతివృత్తాల మీద ముప్పయినాలుగు నవలలు, పురాణవైర గ్రంథమాల పేర భగవంతుడి మీద పగ, నాస్తిక ధూమము మొదలయిన పన్నెండు నవలలు, చారిత్రకాంశాలను ఆధారంగా చేసుకుని రాసిన ఓ అరడజను నేపాళ రాజవంశ నవలలు, మరో అరడజను కాశ్మీర రాజవంశ నవలలు రాసిన ఘనుడు విశ్వనాథ. ఏ గ్రంథానికి ఆ గ్రంథం ఓ సమగ్రసమాచార దర్శినిలా భాసిస్తుంది. మల్లెల పరిమళ మధురోహల దగ్గర్నించి మంత్రతంత్ర జంతర్ మంతర్ విద్యలదాకా ఆయన స్పృశించని అంశం లేదు.

కాశ్మీర రాజవంశ నవలలు ఆరు. అవి యశోవతి, పాతిపెట్టిన నాణెములు, మిహిరకులుడు, సంజీవకరణి, భ్రమరవాసిని, కవలలు.

కవలలులోని కథా భాగం కాశ్మీర చరిత్రలోనిది. కాశ్మీర రాజుల చరిత్రను కల్హణుడన్న పండితుడు సంస్కృతంలో రాజతరంగిణి అన్న పేరుతో ఒక శ్లోకమయ కావ్యాన్ని రచించాడు. కవలలు కథ రాజతరంగిణిలోని నాల్గవ తరంగంలో వుంది. విశ్వనాథవారు వ్రాసిన ఆరు కాశ్మీర రాజవంశ నవలలూ రాజతరంగిణిలోని వివిధ తరంగాలలోనివే.

చారిత్రకాంశాలతోటి, ఆనాటి కాశ్మీర దేశ రాజకీయ, సాంఘిక, సామాజిక స్థితిగతులతో కూడిన ఈ నవలలు నవలలుగా వ్రాయడం కోసమే గాక పూర్వరాజుల చరిత్ర నుండి జన సామాన్యం కొంత కాకపోయినా కొంతయినా తెలుసుకుంటారన్న ఊహతో రాశారాయన. "మన పూర్వ చరిత్ర ఎలాంటిదో

తెలుసుకోవాలనే బుద్ధి చాలామందికి వుండదు. ఈ నవలద్వారా ఆయా విష యాల్ని బహు పాఠకులకు అందించాలని నా ప్రయత్నం" అని విశ్వనాథ స్వయంగా చెప్పుకున్నారు.

నవలంటే ఎంతో కల్పనతో కూడినది. దాంట్లో చరిత్ర విషయం కొంచెం, తదితర విషయాలు బహుళంగా వుంటాయన్నది సర్వజన విదితం.

కవలలు నవలలో కథానాయకుడు ప్రతాపాదిత్యుడు. క్రీస్తుశకం 252 మొదలు 852 వరకూ. అంటే ఆరువందల సంవత్సరాలు కాశ్మీరదేశాన్ని కర్కోటక వంశపు రాజులు పదిహేడుమంది పాలించారు. వారిలో ప్రతాపాదిత్యుడు రెండవ వాడు. ఇతడు క్రీ.శ. 288 మొదలు 338 వరకు కాశ్మీరాన్ని పరిపాలించాడు. అసలు ఈ క్రీస్తుశకాలు పక్కనబెట్టి ఆనాడు కాశ్మీరదేశంలో వ్యవహారంలో వున్న లౌకికాబ్దము, కాశ్మీరాబ్దము ప్రకారం చూస్తే 3364 మొదలు 3414 వరకు ప్రతాపాదిత్యుడు కాశ్మీరదేశాన్ని పాలించాడు. రాజతరంగిణిని కల్హణుడు భారతయుద్ధం నాటినుండి క్రీ.శ. 1148 వరకు ఎంతమంది రాజులు పాలించారో, ఎన్నెన్ని ఏళ్ళు పాలించారో నెలలు, దినాలతోసహా లెక్కగట్టి చెప్పాడు. దానికి మించిన కాలప్రమాణం మరొకటి లేదంటారు విశ్వనాథ.

అనివార్య పరిస్థితుల్లో ఓ వర్తక మిత్రుని భార్యను చూసి, మోహించి, కామోద్దీపనతో మంచం పడతాడు ప్రతాపాదిత్య మహారాజు. రాజుకి కావాలంటే భార్యనయినా ఇస్తానంటాడు మిత్రుడు. అది ధర్మం కాదంటాడు రాజు. 'ఆమెను దేవదాసిని చేస్తాను. దేవదాసిపై రాజుకు హక్కు వుంటుంది, స్వీకరించండి' అంటాడు మిత్రుడు. 'అందులో దోషం లేదు, అలాచేస్తే బావుంటుందని ఒత్తిడి' చేస్తారు మంత్రులు. రాజు ధర్మబుద్ధి గలవాడు. తన భార్యను బుద్ధిపూర్వకంగా రాజుకి ఎవరిస్తారు? మిత్రుడు సహజంగా మహాదాత. అందుకే ఇస్తానన్నాడు. ఇదంతా ఒక రఘుమహారాజు కథలా వుంది. అయితే రాజతరంగిణిలోని ఈ కథని విశ్వనాథ ఔచిత్యభంగం లేకుండా ఎంత చమత్కారంగా మార్పుచేశారో చూడండి:

మిత్రుని భార్య దేవదాసిగా ఇవ్వబడింది అంటే ఆమె తప్పక నాట్యంలో ప్రవీణురాలు కావాలి కదా! అవతలివాడు రాజయినా అతని కంటే వందరెట్లు గొప్పవాడయిన భర్తను వదిలి రాజును ప్రేమించడం న్యాయం కాదు. అంటే, ఆమె పతివ్రత కావాలి. ఈ కథ జరగాలి. దీన్ని ఆధారంగా చేసుకుని విశ్వనాథ కల్పన సాగింది.

బాలా త్రిపురసుందరీదేవి ఆలయంలో శ్రేష్ఠి జలౌకసుని భార్యపద్దనిమిదేళ్ళ రూపలత నాట్యం చేసే ఘట్టంతో నవల ప్రథమాధ్యాయం ప్రారంభం. పదిహేను అధ్యాయాలతో కూడిన ఈ నవలలు నవలలో నాట్యం, సంగీతం, దేవీపూజ, క్షుద్రవిద్యలు, మంత్రాంగం, యంత్రాంగం, టక్కుటమారీ విద్యలు, మాయలు, ప్రేమ, విరహం, భక్తి, రాజకీయం, రాచమర్యాదలు, వాస్తు, గృహనిర్మాణం, నూనె- ఒత్తిలేని మణిదీపాలు మొదలయిన అనేకానేక విషయాలమీద కూలంకష చర్చలు, విశ్లేషణలు వున్నాయి. ఇక ఉపమానాలు, అలంకారాలు, వర్ణనా చమత్కారాలు, సంభాషణా చాతుర్యాలు, పదబంధాల గురించి వేరే చెప్పాలా?!

అమ్మవారికి, నర్తకి రూపలతకి అణువణువునా పోలికలు చెప్తారు. ఆ సందర్భంలోనే అమ్మవారు మందహాస సుందర వదనారవింద అని చెబుతూ "ఈ ప్రపంచ మింత వ్యామోహంలో పడి ఎందుకు వృధాగా గురుసుళ్ళుపడుతోందో అనో, నేనీ లోకాన్ని ఎంత మోహింపజేస్తున్నాననో ఎపుడూ నవ్వుతూనే వుంటుంది అమ్మవారు" అంటారు. అదే సాధారణ భక్తుడయితే దేవి తన కోసమే నవ్వులు చిందిస్తోందనుకుంటారు.

ప్రధాన కథ చెబుతూనే మధ్య మధ్య సందర్భానుసారం పురాణాల్లోని ఉదాహరణలను ఉటంకించడం విశ్వనాథవారి ప్రత్యేకత.

నర్తకి దేవికి నాట్యార్చన చేయడం గురించి చెబుతూ "శృంగార రసాన్ని ఆశ్రయించి భక్తి మార్గాన్ని అవలంబించినపుడు సిద్ధి శీఘ్రంగా కలిగినచో తదితర భావముల నాశ్రయించి ఉపసదనము చేసినపుడు మరికొంత జాగైనచో కావచ్చును అసలే కాదనుటకు వీలులేదు కదా! అయితే, భగవత్తత్వాన్ని పురుషుడుగా భావించినపుడు భక్తుడు తాను స్త్రీగా భావించుకోవచ్చు. ఆ దేవి స్త్రీగా భావింపబడినపుడు దేవి అవుతుంది. ఇక్కడ శృంగార రసం పనికిరాదు. అది అపచారం. అపుడు భక్తునికి నిశుంభునికి పట్టిన గతి పట్టును" అని చెబుతారు.

అలాగే మరోచోట "ఒక్కొక్కప్పుడు భగవదర్పణ బుద్ధి ప్రచండంగా ఉంటే రాజసిక, తామసిక క్రియలు కూడా భగవదర్పితాలు అవుతాయి. ధర్మ వ్యాధుడు మాంస విక్రేత. కానీ మహాజ్ఞాని. ఉత్తర హరివంశములో శ్రీకృష్ణ దేవునిముందు రెండు పిశాచాలు మాంసమును తినుచూ, రక్తమును త్రావుచూ నాట్యమును చేయగా, వానిలో నొక పిశాచానికి ఇంద్రదవదవి నిచ్చెను" అని వ్రాశారు.

నాల్గవ అధ్యాయంలో రామాయణ ప్రస్తావన వుంది. రూపలతను మోహించిన ప్రతాపాదిత్యుడు మంచంపడితే అతనిని పరామర్శించడానికి వెళ్ళిన రూపలత భర్త జలౌకసునితో రాజు ''కామం చాలా చెడ్డది దశరథుడు కైకేయి మీది మోహంతో శ్రీరాముణ్ణి అడవిపాలు చేశాడు" అంటాడు. దానికి సమాధానంగా జలౌకసుడు "అది జీవగతలక్షణము. దాని నెవ్వడు చంపలేడు అక్కడ అన్నింటికన్నా ముఖ్యం సత్యవాక్య పరిపాలన సత్యవాక్య పరిపాలన అనంత కాలికమైన ధర్మం. తండ్రి కొడుకులతనం తాత్కాలికంగా ఇద్దరు వ్యక్తుల మధ్య భాసించే ధర్మం" అని తర్కిస్తాడు. అదే సందర్భంలో రాజనేవాడు ధర్మాచరణంకోసం కష్టపడాల్సిందే అని చెబుతూ- రాముడు, నలమహారాజు, హరిశ్చంద్రుడు, యుధిష్ఠిరుల పేర్లను ప్రతిపాదిస్తాడు జలౌకసుడు

ఆరవ అధ్యాయంలో జలౌకసుడు రాజుకు తన భార్యను ఇచ్చేస్తానంటే రాజపురోహితుడు పరాశరుడు "ప్రాణాలు ఇవ్వడం తేలిక, కానీ ప్రాణ సమానమైన దానిని ఇవ్వడం బాధ" అని చెబుతాడు. మహాభారతంలోని ఏకచక్రపురం, బకాసురుని వృత్తాంతం ప్రస్తావిస్తాడు. అక్కడివారంతా "బకాసురునికి 'మేము ఆహారమౌతాం, మా వాళ్ళని వదిలెయ్' అంటారు. అంటే తమ ప్రాణంకంటే తమవాళ్ళదే ముఖ్యం అని అర్థమే కదా!" అని పరాశరుడు ప్రశ్నిస్తాడు. అందుకే భార్యని చంపడానికి సిద్ధపడతాడా లేదా? అని విశ్వామిత్రుడు హరిశ్చంద్రుడికి పరీక్ష పెడతాడు అని చెబుతూనే మళ్ళీ రామాయణంలోకి వెళతాడు. ఓసారి రాముడు వశిష్ఠుడిని అడుగుతాడు 'నేను విష్ణ్వంశంతో జన్మించాను. నా రాజ్యానికి రామరాజ్యం అని పేరు వచ్చింది. కాని నా వంశాన్ని రఘువంశం అనే ఎందుకంటారు?' అని - 'ఓ బీద బ్రాహ్మణుడు భిక్ష వేయడానికి వచ్చిన మహారాణిని చూసి మనసు పారేసుకున్నాడు. ఆవిడ రఘు మహారాజుగారి భార్య. మరణానికి సిద్ధంగావున్న బ్రాహ్మణుని వార్త తెలిసి రాజు తన భార్యను బ్రాహ్మణుడికి ఇచ్చాడు. ఇది మనిషిలోని మమకారమును తెగగోయడానికి పరమావధి భూతమైన విషయము. కానీ నువ్వేంచేశావు? నీ భార్యను ఎత్తుకుపోయాడని లంక లంకంతా తగలబెట్టావు అక్కడ దైత్యభావమన్న పురుగన్నది లేకుండా చేశావు. అది అహంతో కూడిన చర్య. కాబట్టి నీది రఘువంశమే అవుతుంది' అంటాడు వసిష్ఠుడు.

నవలలలోని దుష్టపాత్రల్లో ప్రధానమైనవాడు అఘోరఘంటుడు, తర్వాత బందురాలత, బర్బరులను చెప్పుకోవచ్చు. ఈ అఘోరఘంటుడిని ఒక్కనితోగాక హిరణ్యకశిపుడు, రావణుడు, కంసుడు అనే ముగ్గురు రాక్షసులతో పోలుస్తాడు రచయిత. ఆ ముగ్గురుచేసే ఘోరమైన పనులన్నీ అఘోరుడు ఒక్కడే చేస్తాడు.

రూపలత రాజు దగ్గరికి వెళితే రాజు భార్యగా అంగీకరించకపోతే, పోనీ అని వెనుతిరిగి వచ్చాక జలౌకసుడు ఆదరించకపోతే తన గతేంకాను! అని ఆలోచించే ఘట్టంలో భీష్ముడు తన తమ్ముళ్ళకోసం అంబ, అంబిక, అంబాలికలను తెచ్చిన సందర్భాన్ని వివరిస్తారు.

ఇలా ఇవికొన్నే, ఉన్నని కోకొల్లలు. చిట్టచివరిదాకా ఉత్కంఠ భరితంగా చిత్రించి, తుది అధ్యాయాల్లో కవలలు ఇద్దరూ అక్కచెల్లెళ్ళు అని తేల్చారు. చెల్లెలు దుష్టుల చేతుల్లో ఆడమాయల ఫకీరులా తయారయితే, అక్క శ్రేష్ఠిని పెళ్ళాడి కుల స్త్రీగా వుంటుంది. ఒక్క కుడి కంట్లో రెప్ప కింద పుట్టుమచ్చ తప్ప ఇతర రూప లావణ్యాలలో తేడాలేని ఆ కవలల మానసిక, శారీరక సారూప్యాలను అద్భుతంగా చిత్రించారు విశ్వనాథ. ప్రతి పాత్ర మనో విశ్లేషణ మహాద్భుతం.

తన దృష్టికి వచ్చిన ఏ చిన్న అంశమైనా పాఠకులకు సవివరంగా చెప్పక వదలరు విశ్వనాథ, ఆఖరికి అది ద్రాక్షారసమయినాసరే! రాజ భోజనంలో ద్రాక్షా రసం పాతిక విధాలుగా సిద్ధం చేస్తారు. ఒకటి పునుగుద్రాక్ష, కస్తూరిద్రాక్ష, మల్లికింజల్కద్రాక్ష. కాశ్మీర పర్వతాలమీద ఒక విలక్షణమైన ఫలం లభిస్తుంది. దాన్లో ఒక సువాసన, కారం రెండూ వుంటాయి. తత్ఫల రసాన్ని తీసి ద్రాక్షా రసంలో కలిపి దానిని ఒక పానీయంగా చేశారు. అది వుప్పగా, పుల్లగా, తియ్యగా, కారంగా, చల్లగా, సువాసన భరితంగా వుంటుంది. అది ధాతు వృద్ధి కరము, వాజీకరణము. పూర్వం రాజులు దానిని మిక్కిలిగా సేవించేవారు, కానీ మంచం పట్టిన ప్రతాపాదిత్య మహారాజు దాన్ని దరిచేరనీయడం లేదు అని వ్రాస్తారు.

సాత్త్వికప్రకృతికి, తామసిక ప్రకృతికి కవల లిద్దరూ ప్రతిరూపాలుగా వుంటారు. మొదట్లో అలా వుండడానికి వారున్న పరిసరాలే కారణమని తర్క,

వితర్కాలతో నిరూపించారు. యంత్రాలు వేసి, మంత్రాలు ప్రయోగించి వ్యక్తులు క్షణాల్లో ఒకచోట నుండి ఇంకో చోటుకి వెళ్ళడం; సాధువులు, సన్యాసులు చేసే మోసాలు, దుర్మార్గాలను విశదీకరించారు.

కథ ఆద్యంతాల నడుమనున్న నాటకీయత ప్రత్యక్షర దృశ్యంగా కనుల ముందు బొమ్మ కడుతుంది.

## యశోవతి :

విశ్వనాథ సత్యనారాయణగారు చెబుతుంటే జువ్వాడి గౌతమరావుగారు లిపిబద్ధం చేసిన నవల ఇది. యశోవతి కాశ్మీరదేశపు రాణి. కథాంశం ద్వాపరాంతమున వున్న శ్రీకృష్ణునికి సమకాలికమైనది. కృష్ణుడు జరాసంధుడిని చంపి మధురా నగరానికి ఉగ్రసేనుడిని రాజును చేస్తాడు. కాశ్మీరరాజు గోనందుడు జరాసంధునికి దూరపు చుట్టం. కాశ్మీర రాజులు కొంత శైవులు, కొంత శాక్తేయులు. అందుకు కాశ్మీరదేశ చరిత్రే కారణం. కాశ్మీరదేశం పార్వతీదేవిది గనక వారు శాక్తేయులు.

గోనందుడు జరాసంధుని పక్షంవాడు, శాక్తేయుడు అయినా ఉపనిషత్ విద్యకు విరోధికాడు కృష్ణభక్తితో కృష్ణలీలల్ని వర్ణించే యశోవతి ముద్దు మాటలకు మురిసి 11 ఏళ్ళ పిల్లని తన కొడుకు దామోదరుడి కిచ్చి పెళ్ళి చేస్తాడు. ఆ తర్వాత ఆమె వ్యక్తురాలవడం, పేరంటాలు, ముచ్చటలు జరిపించడం అంతా కూడా మధ్యతరగతి వారి లౌకిక వ్యవహారాలను రాజమర్యాదలను మిళితం చేసి వర్ణించారు విశ్వనాథ.

అప్పటిదాకావున్న మహారాణి పెత్తనాన్ని మెత్తగా ఉల్లంఘించి తన భర్త యువరాజుకి అధికారాలు ఇప్పించడం దగ్గర్నించి, అందర్నీ పోగొట్టుకున్నా, పెద్దగా రాజకీయాలు తెలీకపోయినా వృద్ధురాలై గోనందరాజ్యాన్ని సంరక్షించేదాకా యశోవతి ప్రదర్శించిన నేర్పు ఓర్పు,సమయస్ఫూర్తి ఎంతోఅదర్శవంతంగా చిత్రించారు రచయిత. ఒకటిన్నరసంవత్సరాల పిల్లవాడికి పట్టాభిషేకం చేసి చక్రం తిప్పిన రాజనీతి అనుపమానం. మామగారిని, భర్తనుకూడా కృష్ణుడే చంపడం, ఆపదకాలంలో ఆయనే అండగా నిలబడ్డం యశోవతితోబాటు పాఠకుల్నీ ఆశ్చర్యపరిచినా విరోధి రాజులందరినీ కురుక్షేత్ర యుద్ధంలో కలవమని కృష్ణుడు స్వయంగా చెప్పడం కథకి ఎంతో బలాన్నిస్తుంది. గోనందుడు కృష్ణ

భక్తుడు. కానీ కృష్ణుడిని వ్యక్తిగా మన్నించలేదు. ఆ సందర్భంలో రచయిత కల్పించుకుని "లోకంలో ఒక మహాపురుషుని ప్రతిభను మన్నిస్తారు. వ్యక్తిని మన్నించరు. వ్యక్తికి అపకారం చేస్తారు" అంటారు. ఇలాంటివి నవలలో కోకొల్లలు.

కాలానుగుణంగా వ్యక్తుల జీవితాల్లో వచ్చే మార్పుకి ఉదాహరణగా అప్పటి దాకా ఏకపత్నీ వ్రతులయిన గోనందవంశంలో యశోపతి కొడుకు ఏడుగురు భార్యలని పెళ్ళాడ్డం, వారంతా రాజ్యక్షేమాన్ని, ప్రజాక్షేమాన్ని గాలికి వదిలి ఆస్తుల కోసం స్వార్థంతో కొట్టుమిట్టాడడం అద్భుత నాటకీయతతో సన్నివేశ కల్పనలతో సమర్థిస్తారు విశ్వనాథ.

## పాతిపెట్టిన నాణెములు :

విశ్వనాథవారు చెబుతుంటే పేరాల భరతశర్మగారు లిపిబద్ధం చేసిన నవల ఇది. నవలంతా రాశాక చివరికి కావాలని ఒక సన్నివేశాన్ని ఆధారంగా తీసుకొని పేరు పెట్టారా? అనిపిస్తుంది. నవల పేరే పాఠకుడిని కథవెంట పరుగులు పెట్టిస్తుంది.

కథాకాలం నాటికి కాశ్మీర రాజ్యాన్ని పాలిస్తున్న రాజుయొక్క తండ్రి శ్రేష్ఠసేనుడు ఇతనికి హిరణ్యకుడు, తోరమాణుడు అని ఇద్దరు కొడుకులు. ఇద్దరూ కవలలు. ఒకరికి బాధ కలిగితే రెండవవారూ బాధపడి తీరాల్సిందే. ఇద్దరికీ ఒకేసారి మరణం - అయినా దుర్మార్గుడైన హిరణ్యకుడు సనార్గుడయిన తోరమాణుడిని గుహాంతర్భాగంలో బంధిస్తాడు. దానికి దారి వారిద్దరికీ తప్ప మూడో కంటికి తెలీదు. తోరమాణుడి భార్య యూకాదేవి అనే గ్రామంలో కుమ్మరి ఇంట్లో కొడుకుని కనడం, పులి మనిషిని తినే విధానం, శత్రువులు, మిత్రులు, శత్రుమిత్రులు రాజశాసనాల పట్ల వ్యవహరించే తీరు, రాజవంశరక్షణ ఎంతో ఆసక్తిగా వర్ణిస్తారు విశ్వనాథ. ప్రతి పుటా ఉత్కంఠభరితంగా సాగుతుంది.

'కాంబవ'మనే దేశంలో శూరపురమనే పట్టణంలో ఒక దుర్గం. అక్కడ శత్రువులు వస్తే ఢక్కా మోగిస్తారు. ఆ శబ్దం అంచెలంచెలగా శ్రీనగరం చేరుతుంది. శంఖాలను ఊదుతారు. మన హైదరాబాదు గోల్కొండకోటలో కింద చప్పట్లు మోగిస్తే కోటమీది సైనికులకు వినిపించే విధానాన్ని తలపించే ఆనాటి సాంకేతిక పరిజ్ఞానానికి ఒక మచ్చుతునక. 'కంబు' అంటే శంఖం.

అందుకే అది కాంబవం అని పదానికి అర్థం వివరిస్తారు రచయిత. దాదాపుగా ప్రతిచోటా ఇలాంటి వివరణ వుంటుంది, పాఠకుడు కష్టపడకుండా. ఆయన ఉపాధ్యాయుడు గనక కథ చెప్పినా విద్యార్థికి పాఠం చెప్పినట్లే వుంటుంది. క్లిష్టసమాసాలు ఇబ్బంది పెట్టవు.

తోరమాణుడు ఒక్కనాడు రాజ్యం చేయకపోయినా ఆయనను కన్నబిడ్డలా చూసిన ప్రవరేశుడు తోచిన చోటల్లా తోరమాణుడి బొమ్మలున్న నాణాలను భూమిలో పాతిపెడుతుంటాడు. అది చూసి తోరమాణుడి కొడుకు ప్రవరసేనుడు "తాతా! ఇలా ఎందుకు పాతి పెడుతున్నా"వని అడిగితే "భవిష్యత్తులో ప్రజలకు తోరమాణుడే రాజ్యం చేశాడని తెలియడం కోసం" అంటాడు. ఇదే పాఠకులచేత 'నిజమే సుమా!' అనిపించే విశ్వనాథ వారి కల్పనా చమత్కారం.

## మిహిరకులుడు :

ఈ నవల కూడా పేరాల భరతశర్మగారు లిపిబద్ధం చేసినదే. ఈ నవల 'ఆంధ్రప్రదేశ్' అనే రాష్ట్ర ప్రభుత్వ మాసపత్రికలో 1964 డిశంబరు నుండి 1965 అక్టోబర్ వరకు ధారావాహికంగా వెలువడింది.

ఈ నవల రెండు పాత్రలతో ఒక నాటకంలా ప్రారంభమౌతుంది. యముని అంశతో పుట్టానని, తాను సాక్షాత్తూ యమధర్మరాజునే అని నమ్మి, తాను ఉత్తరదిశకు యముడనని చాటుకొనే రాజు మిహిరకులుడు ఇందులో కథానాయకుడు, హింసాప్రవృత్తి, శాడిజం, అసహనం, స్వార్థం అన్నీ కలగలసిన కంటకుడు మిహిరకులుడు. అతని నిరంతర మృత్యుచింతన, హింస, క్రూరత్వం వెనక అంతరాంతరాల్లో దాగివున్న మెత్తని మనసును వెలికితీసిన ఏకైక వ్యక్తి అతని భార్య కల్యాణవతి- గాంధార రాజు కూతురు, అసమాన ఖడ్గ విద్యాధురీణ.

నవలంతా ఓ సినిమా చూస్తున్నట్లుగా వుంటుంది. కొన్నికొన్ని సన్నివేశాల కల్పన విశ్వనాథకే సాధ్యమనిపిస్తాయి. ఉదాహరణకు నీళ్ళ కాలువకు అడ్డం వచ్చిన పెద్ద బండ పతివ్రత ముట్టుకుంటేనే గాని కదలదంటారు విజ్ఞులు. రాజుగారి భార్యతోసహా లక్షలాది మంది స్త్రీలు ప్రయత్నించి విఫలులౌతారు. ఓ చాకిత ముట్టుకోగానే కదుల్తుంది. మిహిరకులుని హింసా ప్రవృత్తి వెర్రితలలు వేసి లక్షలాది మంది స్త్రీలను ఊచకోత కోయిస్తుంది. అలాగే అర్ధరాత్రివేళ గిరిప్రదేశాన్ని రక్షించే మావటివారు, సైనికులు రాజు శయ్యాగృహం పక్కనున్న

కొండనెక్కి కొన్ని వేల అడుగుల లోతున్న అఖాతంలోకి ఇనప గొలుసుకు కట్టిన అగ్నిగోళాన్ని వదుల్తారు ఆ వేడికి శత్రువులు చెంతనుంటే మరణిస్తారు, లేదా కనబడతారు. కాని ఓ రోజు ఆ మదపుటేనుగు రక్షకభటులు, మావటి వారితో సహా అన్ని వేల అడుగుల లోయలోకి జారి పడిపోతుంది. అపుడు అది చేసిన ఘీంకారానికి మిహిరకులుడి మృత్యు చింతనా హృదయం 'హా!' అని సేద దీరుతుంది. ఇది వాడి హింసా చిత్తానికి పరాకాష్ఠ. ఆ తర్వాత వాడు అదే హాయి కోసం నూటయాభై ఏనుగుల్ని, మనుషుల్ని అదే రీతిగా చంపిస్తాడు. ఇలాంటి సంఘటనలు ఇంకా ఎన్నో వున్నాయి.

చివరికి క్షత్రియుద్ధంలో భార్యని జయించలేక కాలిన ఇనప ఖడ్గాలు, బల్లాల మీదకి దూకి అంత దారుణంగానూ ఆత్మహత్య చేసుకుంటాడు. కల్యాణ వతి కత్తితో పొడుచుకుని ఆత్మహత్యచేసుకుంటుంది. నవలంతా మిహిరకులుని పెళ్ళి, దండయాత్రలు, హింసా ప్రవృత్తి చిత్ర క్రూరత్వాలమయం. అయినా పాఠకుడిని ఎక్కడా ఆపదు యాంటీ క్లైమాక్స్. నెగటివ్ హీరోలతో పాఠకుల్ని మెప్పించి ఒప్పించిన ఘనుడు విశ్వనాథ. ఇందులోనే మొదట్లో మిహిరకులుని తండ్రి నిరాహారదీక్ష చేసే సందర్భంలో ప్రజలు, పనివారు సానుభూతిగా తామూ చేస్తామంటారు. అపుడు రాజు పనివాడికి రాజులకుండే సంబంధం ఎలాంటిదో వివరిస్తూ "సాలెవాడు బట్ట నేస్తాడు. ఆ వస్త్రం మనం ధరిస్తాం. అంత మాత్రంచేత సాలెవాడు మరణిస్తే బట్టలు ధరించినవారంతా మైలపట్టరుగదా?" అంటాడు. ఇలాంటి చమక్కులు ఎన్నో విశ్వనాథ రచనలో!

## సంజీవకరణి :

రాజతరంగిణి ఎనిమిది తరంగాలలో ఈ కథ రెండవ తరంగంలోనిది. ఈ కథలో కొంత ఆధ్యాత్మికమైన విషయం వుంది. ఈ ఆధ్యాత్మిక విషయాల్లో కూడా తేడాలున్నాయి. "ఆధ్యాత్మికలోకంలో కొంతభాగం మంత్ర యంత్ర తంత్రములచేత సాధ్యమౌతుంటుంది. అవి వేరే విద్యలు. పాశ్చాత్య నాగరకత వానిని నిరాకరించుచున్నది. వానిని మానవలోకమునుండి బహిష్కరించుట ఎవరికీ సాధ్యంకాదు. ఈ సంజీవకరణి యన్న నవలలో అట్టి విషయమున్నది. దానిని ఆధునికులు చరిత్రగా అంగీకరించరు. పంచాంగములు చింపివేస్తే నక్షత్రాలు చెరిగిపోవు" అన్నారు విశ్వనాథ నవల పీఠికలో.

జవహర్‌లాల్ నెహ్రూ సోదరి విజయలక్ష్మి పండిట్ భర్త శ్రీపండిట్. ఆయన కల్హణుని రాజతరంగిణిని ఇంగ్లీషు భాషలోకి అనువదించారు. ఆ పుస్తకానికి నెహ్రూ ముందుమాట రాశారు విశ్వనాథవారు సంస్కృత గ్రంథం, ఆంగ్ల గ్రంథం రెండూ చదివారు.

కథలో జయేంద్రుడు రాజు. అతని మంత్రిపేరు సంధిమంతుడు. "సంస్కృత రాజతరంగిణిలో సంధిమచ్ఛబ్దము నిస్సంశయముగా పుంలింగంగానే వుంది. ఆంగ్లేయ భాషాంతరీకరణములో 'సంధిమతి' అన్న స్త్రీలింగ మొకచోట 'సంధిమాన్' అన్న పుంలింగం వాడబడి కల్హణుని కథలో పండిట్ కథ కొంత మార్పు తెచ్చింది. మరియు రాజు సంధి మంతుని వధించాడు. కొందరు సిద్ధులతనిని బతికించారు. ఈ విషయంలో నేను వ్రాసిన సంజీవకరణిలో అనేక మార్పులు చేశాను. తక్కిన విషయాలు రాజతరంగిణిలోనివే" అని కూడా స్పష్టం చేశారు విశ్వనాథ.

చారిత్రాత్మక నవలలో సాంఘిక అంశాలు, దయ్యాలు, పిశాచాలు, మంత్రాలు, సిద్ధులు, యక్షుల ప్రస్తావన ఇవన్నీ పొరపాటున పాఠకులని కలవరపెడుతాయేమోనన్న ముందుచూపుతో "నవల కూడా కావ్యమే. కాబట్టి రససంధాయిగాను, కల్పనా చాతుర్యం కలదిగానూ వుండాలి. ఏది కథ కాదు? ఏది కథావస్తువు కాదు? కావ్య కవి యొక్క ప్రతిభాధీనము. మంచి పాఠకుడనగా తత్ప్రతిభాపరిజ్ఞానశీలుడు. దయ్యాలు, యోగులు, చనిపోయినవారిని బతికించడం, దానికి కావల్సిన తంత్రాలు కథావస్తువు కాకపోవడం అనేది లేదు. ఇలాంటి గ్రంథాలు ప్రాశ్చాత్యుల్లోనూ వున్నాయి. ఉదాహరణకు విక్టర్ హ్యూగో వ్రాసిన 'వెర్వుల్ఫ్' గొప్ప సాక్ష్యం" అంటారు విశ్వనాథ.

ఇది చాలు. ఈ విషయం తెలుసుకున్న పాఠకుడు ఇక పుస్తకం పూర్తి చేసేదాకా వదలడు. చనిపోయిన వారిని బతికించడం విషయంలో కథలోని సంఘటనలను సమర్థించేందుకు విశ్వనాథ పురాణ గ్రంథాల్లోని ఉదాహరణలను ఉటంకిస్తారు. ఈ నవలలో చచ్చిపోయిన సంధిమంతుణ్ణి బతికించడం విషయంలో 1. కచుడిని రాక్షసులు చంపి, తగలబెట్టి బూడిదచేసి కల్లులో కలిపి

శుక్రాచార్యునిచేత తాగించారు. శుక్రుడు సంజీవనీ విద్యచేత బతికించాడు. 2. ఉత్తర గర్భంలో పరీక్షిత్తు ద్రౌణి యొక్క బ్రహ్మ శిరోనామకాస్త్రం చేత చిటికెడు పొడి అయ్యాడు. శ్రీకృష్ణుడు దానికి ప్రాణప్రతిష్ఠ చేశాడు. 3 అన్నింటి కంటె ఆశ్చర్యం- శివుడు మన్మధుణ్ణి భస్మం చేశాడు. శరీరం లేకుండా ప్రాణ ప్రతిష్ఠ చేశాడు- అని మూడు ఉదాహణలిచ్చారు, శరీరం వుంటే ప్రాణప్రతిష్ఠ, శరీరం లేకుండా ప్రాణప్రతిష్ఠ, అస్థికలు గంగలో కలపడం ఇవన్నీ మనసు కతీతమైన విషయాలని సమర్థించారు. ఈ నవలలోనే కాదు- ఈ కాశ్మీర రాజ వంశ నవలలు అన్నింటిలోనూ రామాయణ, భారతాది గ్రంథాల్లోని ఉదాహరణ లను సందర్భానుసారం ఇవ్వడం గమనార్హం.

ఈ నవలలో మరొక అద్భుత విషయమేమంటే- ఏనాటి కాశ్మీరరాజులు, ఏనాటి విశ్వనాథకాలం! అయినా విశ్వనాథవారు మరి రాజతరంగిణిలోనే వుందో, ఆయన కల్పనోకాని ఆధునిక విజ్ఞాన పరిధులను దాటిన శస్త్రచికిత్సలు, అవ యవాల మార్పిడి గురించి రాశారు. సంధిమంతుడిని శూలారోపణ పేరిట కొరత వేయిస్తారు. ఆశిక్షలో గుండె, మెదడు, ఆసనం నుండి గొంతువరకు వున్న రంధ్రంచుట్టూ వున్న మాంసం కుళ్ళిపోతుంది, వాడు నపుంసకుడు. ఇక్కడ విశ్వనాథ గుండెమార్పిడి, మెదడు మార్పిడి, కుళ్ళిపోయిన మాంసం తీసి కొత్త మాంసం పెట్టడం, ఆఖరికి నపుంసకుడయిన వాడికి మర్మాంగం అమర్చడం అన్నీ సిద్ధులచేత చేయిస్తారు. నిజానికి ఇంత ఎడ్వాన్స్‌డ్‌గా ఆధునిక వైద్య శాస్త్రం వుందా?! అన్న ఆశ్చర్యం నుండి పాఠకుడు ఓ పట్టాన తేరుకోవడం కష్టం

## భ్రమరవాసిని :

పేరాల భరతశర్మగారు లిపిబద్ధం చేసినది.

పార్వతీదేవి ప్రతిరూపమైన భ్రమరవాసిని రణరంభ పేరుతో దక్షిణ భారతంలోని ఓ రాజుకి దొరకడం, ఆయన ఆమెను కాశ్మీర రాజ్యానికి స్వతంత్ర ప్రభువయిన రణాదిత్యుడి కిచ్చి పెళ్ళి చేయడం ఒక ఎత్తు. దేవతామూర్తి అయిన ఆమె మానవుడిని దరిచేరనీయకుండా శోభనం రాత్రినుండి నవల చివరి దాకా రాజువెంట వుంటూనే ఆయనకి సాయపడ్డం, రెండో పెళ్ళి చేయడం

వగైరాలు అత్యంత మనోజ్ఞ కల్పనా చాతుర్యంతో వర్ణింపబడ్డాయి. నవలనిండా రణాదిత్యుని కలలే! అన్నీ ఫ్లాష్‌బాక్‌లా అతన్ని వెంటాడుతూ ప్రస్తుత వాస్తవ జీవితానికి, కలలకీ వున్న సారూప్యాన్ని తెలియజేస్తుంటాయి. నవల పట్టుకుంటే పేజీలవెంట పరుగులు పెట్టాలనిపించేంత రీడబిలిటీ వుంది.

మధ్యమధ్య కథలో లీనమైన పాఠకుడిని తనతోబాటు తీసుకెళ్ళిపోతాడు రచయిత. అనూహ్య వర్ణనలు చేస్తారు. సన్నివేశ కల్పనా చమత్కృతిలో ఆయనకి ఆయనే సాటి. ఉదాహరణకి శోభనం గదిలో రణాదిత్యుడు రణరంభ కోసం ఎదురు చూస్తుంటాడు. మంచంమీద విలాసంగా పడుకుని వుంటాడు. పెళ్ళికూతురు రావడంలేదు. దీర్ఘ నిరీక్షణ దుర్భరంగా వుంది అతని చూపులు గడపకు అతుక్కుపోయి వుంటాయి ఇంతలో మంచి జాతివన్నె తాచుపాము పడగఎత్తి గడపమీద ఆడినట్లాడి తలవాల్చి పడగను గడపలోపలి దేశమునకు హత్తింది. పడగమీద మణులు ధగధగ లాడుతున్నాయి. అంతేకాదు, ఆ పడగకు రెండువైపులా ఎర్రని రేఖలున్నాయి పడగ ఎత్తినపుడు లోపల శంఖచక్రాలు విస్పష్టంగా కనబడ్డాయి. ఉత్తమ జాతి సర్పం, ఇందరు కాపలావారి కళ్ళుగప్పి ఎలా వచ్చిందా అనుకుంటాడు. ఇంతలో పడగజారి లోపలికి వచ్చింది. గడప మీద ఇంకో పడగ!.... చంపడానికి సిద్ధంగా ఉంటాడు మంచంమీద కూర్చుని. కానీ అవి పాము పడగలు కావు, భ్రమరవాసిని పాదాలు- అంటాడు రచయిత! అప్పటిదాకా రణాదిత్యుని స్థానంలోఉన్న పాఠకులు ఊపిరి పీల్చడం మర్చిపోతా రంటే అతిశయోక్తికాదు.

శ్వేతద్వీప ప్రస్తావన, భ్రమరవాసిని దేవతగా వింధ్యపర్వత గుహాంత రాళాల్లో వుండడం, శ్రీనగరి, జమ్మూలో శివాలయాల నిర్మాణం, జనజీవితం, సాంఘిక స్థితిగతుల వర్ణనలు నవలంతా చోటు చేసుకున్నాయి. ఈ భ్రమరవాసిని అమ్మవారి ప్రస్తావన 'యశోవతి' నవలలో కూడా వుంది.

కాశ్మీర రాజవంశ నవలలు ఆరింటినీ ఒకేసారి ఎందుకు తీసుకున్నానంటే- రాజులచరిత్ర, ఆనాటి సాంఘిక సామాజిక రాజకీయ ఆర్థిక, ఆధ్యాత్మిక స్థితి గతులు పాఠకులు సుస్పష్టంగా తెలుసుకొనే అవకాశం వుందని చెప్పడానికి. ఒక్క నవల చదివి వదిలేస్తే భోజనంలో పప్పు అన్నం ఒక్కటే తిని లేచి

పోయినట్లుంటుంది. అదిగాక విశ్వనాథవారి నవలలు అనగానే 'ఏకవీర', 'వేయిపడగలు' జాటి మిగతావాటి గురించి సాధారణంగా పాఠకులకు తెలీక పోవడం, కథాంశాలు, ఇతివృత్తాలు ఏమిటో బొత్తిగా అవగాహనకు రాకపోవడం వాస్తవం. కనీసం ఇలాంటి పరిచయాల వల్లనయినా విశ్వనాథవారన్నట్లు నాకు తెలిసిన విషయాన్ని పాఠకులకు రేఖా మాత్రంగానయినా రుచిచూపించగలిగితే ఇక వారి అభిరుచిమేరకు సాహిత్యాన్ని అందుకోగలుగుతారన్న ఆశ.

ఈ ఆరు నవలల్లో చరిత్ర వాస్తవాంశాల మధ్య సమన్వయం, పాత్రల ఉదాత్తత, ప్రకృతి పరిశీలన, ప్రపంచ పరిశీలన, సమాజంలోని అంతర్గత అంశాలు, లౌకిక విషయాల్ని అలౌకిక విషయాలతో జోడించడం, మధ్యతరగతి ఆచారాలను, సంప్రదాయాలను రాజకుటుంబాలకు కూడా ఆపాదించడం, అద్భుత నాటకీయత, సన్నివేశ కల్పనా చమత్కృతి, నిఘంటువు వెతుక్కోవాల్సిన అవసరం లేకుండా కఠిన పదాలకు అక్కడికక్కడే అర్థాలు చెప్పే ఉపాధ్యాయ ప్రవృత్తి, అన్నింటినీ మించి ఏ నవల కానవల, ఆరు నవలలూ కూడా ఒక సమగ్ర సమాచార దర్శినిలా భావించడం నాకు నచ్చిన అంశాలు. వీటన్నింటినీ ఇలా పాఠకుల ముందుంచడం వల్ల విశ్వనాథ సాహిత్యం వారికి మరింత చేరువౌ తుందన్న భావన నా ఈ వ్యాస రచనకు ప్రేరణ. *

అంతగా నోటితో నందుము వ్రాయుదు
మంతగా నం తందమైన భాష
భాషించువారి యుచ్ఛ్వాస నిశ్వాసముల్
వెలయించి యాయువు పెంచు భాష
పలు మాటలయు సవ్వడిచేత జనముల
శీలమ్ము సవరించు మేలి భాష
చెట్ట యెంతగఁ బాడు చేయ నెంచిన నైన
నావంత మొక్కవోనట్టి భాష
అణువు మొదలు బ్రహ్మాండ పర్యంత మొప్పు
బ్రదుకు, బాసయు నంతపర్యంత ముందు
అంత వ్యాపించి వెలిగెడునట్టి భాష
దివ్యమై ధావులేనిది తెలుఁగు భాష.

—విశ్వనాథ

# విశ్వనాథ చిన్నకథలు

**—డా॥ ముక్తేవి భారతి**

విశ్వనాథ అంటే వేయిపడగలనీ, ఆంధ్రప్రశస్తి అనీ, రామాయణ కల్పవృక్షమనీ విశ్వసించే సాహితీప్రియుల మనో నేత్రంముందు విశ్వనాథ చిన్న కథలు వీటన్నిటి సమాహార స్వరూపంగా సాక్షాత్కరిస్తాయి.

విశ్వనాథ ఛాందసుడు, కేవల సంప్రదాయవాది, పురోగమన వ్యతిరేకి అనే విభిన్నమైన అభిప్రాయాలు సాహిత్యలోకంలో ఎంతో ప్రచారంలో వున్నాయి. ఉండవచ్చు. అయినా విశ్వనాథ సంప్రదాయవాదుల్లో నవ్యసంప్రదాయవాది, ఆధునికుల్లో అత్యాధునికుడు, సంస్కర్తలలో గొప్ప సంస్కర్త, భవిష్యద్దర్శనం చేయగల క్రాంతదర్శి, మహర్షి - ఈ అభిప్రాయాలకు విశ్వనాథ చిన్న కథలే ఒక నిలువుటద్దం.

ఒక వ్యక్తి యొక్క వ్యక్తిత్వాన్ని విభిన్న కోణాలనుంచి దర్శించగలిగితే ఆ వ్యక్తి మహోన్నత్యం విశదమౌతుంది. కానీ, ఆ వ్యక్తిత్వాన్ని పాక్షికంగా అంచనావేసే ప్రయత్నం జరిగితే, అది ఎప్పుడూ సత్ఫలితాల నీయదు.

అభ్యుదయవాదిగా, విప్లవ రచయితగా, సంస్కర్తగా, పాతకొత్తల మేలు కలయికగా ఆ మహాకవిని పాఠకుడిముందు నిలబెట్టేవి ఆ చిన్నకథలే. ఆనందంతో పాటు, ఆశ్చర్యంలో మనని ముంచెత్తేవి ఆ చిన్నకథలే. రామాయణ కల్పవృక్ష మహా కావ్య నిర్మాత, కవిసమ్రాట్ దృష్టి చిన్నకథలవైపు ప్రసరించటమే విశేషం. చిన్నకథలు రచించటం దేనికోమరి?!-"తనదైన అనుభూతి తనదికాన" అనేదే సమాధానమేమో?!

చిన్నకథ అత్యంత ఆధునిక సాహిత్య ప్రక్రియగా బాగా ప్రచారంలోకి వచ్చేసింది. విశ్వనాథ చిన్నకథల్లో ఎంతో వస్తు వైవిధ్యముంది. శైలి ఏ కథకి ఆ కథకే మారిపోయింది. చిన్న చిన్న వాక్యాలు ఈ చిన్న కథలలో ఆకర్షణ. అత్యాధునికమైన ఎన్నో సిద్ధాంతాలు చోటుచేసుకున్నాయి ఈ కథల్లో. సార్వజనీనతకి, సార్వకాలికతకి ప్రతిరూపాలు ఈ కథలు.

ఒక వితంతువుకు వివాహం జరిపించటం, ఒక గుడ్డిపిల్లను విద్యావంతుడు ధనవంతుడు వివాహమాడటం, ఒక యువకుడు ఒక వేశ్యని ప్రేమించి వివాహమాడాలనుకోవటం, ఆ వేశ్య ఒక పాశ్చాత్యునికి ఉంపుడుగత్తె అయి, ఒక కొడుకుని కని మరణిస్తే, ఆ పిల్లవాడికి 'రొనాల్డ్' అనే పేరుపెట్టి పెంచటం, ఇలాటివి ఎన్నో అంశాలు ఆ కథల్లో చోటుచేసుకున్నాయని తెలిశాక, విశ్వనాథ మరో వీరేశలింగం అంటే కొంచెం సాహసంగా అనిపించినా అది వాస్తవం. సంస్కరణ మహాకవిలో అంతర్వాహినిలా ప్రవహిస్తోనే వుంది ఎప్పుడూ.

హానిసత్వ నిర్మూలనకై పాటుపడిన మహనీయులలో మహనీయుడు, భారతదేశ స్వాతంత్ర్యోద్యమ స్ఫురణతో, సామాజిక స్పృహతో కథా రచన చేపట్టిన గొప్ప కథకుడు విశ్వనాథ. అందుకే, ఆ చిన్న కథలు చదువుతుంటే, ''అపారే కావ్య సంసారే కవిరేవ ప్రజాపతిః'' అనేది విశ్వనాథ చిన్న కథల సృష్టి విషయంలో అక్షరసత్యంగా భాసించింది.

చిన్నకథల సంపుటంలో ఇరవై రెండు కథలున్నాయి. తెలుగు తనానికి, తెలుగు జీవిత విధానానికి అద్దం పట్టిన కథలెన్నో వున్నాయి. ఈ సంపుటిలో పేరుకి చిన్నకథలే కానీ ఒక్కొక్కటి ఒక్కొక్క మహాకావ్యం అంటే అతిశయోక్తికాదు.

'ఉరిశిలా నీగ్రోనాయకుడు' అనే వాక్యంతో ఈ సంపుటిలోని మొదటి కథ ''య్యో-ర్హిషీఖెయ్'' ప్రారంభమయింది. స్వాతంత్ర్యం కోల్పోయిన ఏ జాతి అయినా తన మనోవేదనని ఏదో ఒక రూపంలో వ్యక్తం చేయక తప్పదు. భారత స్వాతంత్ర్య సముపార్జనా సందర్భంగా ఎన్నో దేశభక్తి కవితలు, ఉద్యమగీతాలు మనకి చాలా వెలువడ్డాయి. ''మాకొద్దీ తెల్లదొరతనము'' వంటి గేయాలు ఎంతో ప్రచారాన్ని పొందాయి. తన జాతి యావత్తు పాడుకొనే చైతన్య గీతం రాసిన నీగ్రోకవిని గురించి కథ రాశారు విశ్వనాథ. కాంగో ప్రజలు స్వాతంత్ర్య సముపార్జనకోసం పడినపాట్లు మరొక స్నేహితుని ద్వారా వింటాడు కథకుడు ఈ కథలో ఒక మలుపు పెట్టాడు కవి. నీటిగుర్రం హిప్పోపొటమస్‌ను పందమంది నీగ్రోలు బయటకి లాగి, దాని కాళ్ళుకట్టి బంధించారు అని కథ ముగించారు. తమ జాతీయతని, సంస్కృతిని నాశనం చేసే పాశ్చాత్యులే ఆ భయంకరమైన నీటి గుర్రంగా ఉపమించారు. ఇది కాంగో స్వాతంత్ర్య కథ అయినా, హానిస

దేశాల అన్నిటి కథా అదే. భారతదేశ స్వాతంత్ర్య కథ విశ్వనాథ గుండెపట్లు కదిలించి ఈ కథ రాయించింది విశ్వనాథ చేత.

''కుక్కపిల్లా, అగ్గిపుల్ల, సబ్బుబిళ్ళ కావేవీకవిత కనర్హం'' అనే మహాకవి గేయాన్ని అందరం ఏదో సందర్భంగా తల్చుకుని కవితా వస్తువుని ఎన్నుకుంటున్నాము. అగ్గిపుల్ల, సబ్బుబిళ్ళల కథలు ఎక్కువ ప్రచారంలోకి వచ్చాయో లేదో కాని కుక్కపిల్లను కథావస్తువుగా స్వీకరించని కథకుడు లేడంటే ఆశ్చర్యపోనక్కరలేదు. ''మాక్లీ దుర్గంలో కుక్క''కి వచ్చిన ప్రచారం, ప్రజాదరణ గమనిస్తే, ఇది మనల్ని మళ్ళీ మళ్ళీ ఆలోచింపచేసే గొప్ప కథ అని చెప్పక తప్పదు. ఎన్నో భాషల్లోకి అనువదింపబడిన 'మాక్లీ దుర్గంలో కుక్క' కథ కథా సాహిత్యంలో ఎంతో ప్రత్యేకతని పొందింది. కుక్కని విశ్వాసానికి ఉదాహరిస్తాము 'కుక్క బుద్ధి, కుక్కతోక వంకర' అంటూ కుక్క నీచత్వాన్ని చాటడానికి అంటుంటాము కానీ విశ్వనాథ వారు రచించిన కుక్క కథమాత్రం కేవలం కుక్క విశ్వాసాన్ని చాటేది మాత్రమే కాదు- ఆధునిక సిద్ధాంతాల పట్ల ఆయనకున్న అవగాహనకి, నిశిత పరిశీలనాశక్తికి ప్రతీకగా నిలుస్తుంది ఈ కథ. మనుష్యులలో స్వార్థం, అహంకారం, ఆత్మవంచన ఎన్నెన్ని దారులు తొక్కాయో చూపించటమే ఈ కథ వుద్దేశం. సంప్రదాయంలో వున్న మూఢత్వాన్ని నిరసించటం, ఆధునికతలో వున్న వైరీతలను వెక్కిరించటం అనేదే విశ్వనాథ వ్యక్తిత్వంలోని విశేషం. అదే ఈ కథలో ప్రధానాంశం. సీమకుక్కని తెచ్చిన పెద్దమనిషి మాక్లీదుర్గంలో వున్న ఊరకుక్కని అసహ్యించుకుంటాడు. ఆ పెద్దమనిషే సంఘంలో వర్ణవ్యవస్థ ఉండకూడదంటూ చర్చిస్తాడు. అక్కడ విశ్వనాథ స్టేషన్ మాస్టర్ గొంతులోంచి ఒక మాట అంటాడు :

"సర్వభూతముల యందు సమత్వం ఉండాలి. పైకి కనబడే భేదాలు మనసా లేకుండా చేసుకోవాలి. మన పూర్వులు కూడా అదే చెప్పారని నా ఉద్దేశం" అంటాడు. విశ్వనాథవారి ప్రచారభేరి యిదే- సర్వమానవ సమానత్వం, మానవతావాదం - వీటికి మించిన అభ్యుదయం మరేముందీ? ఎవరు ఏ విధంగా చెప్పినా కావలసింది అదే!

ఆ స్టేషన్‌లో ఇద్దరు విద్యార్థులు మిఠాయి కొనుక్కున్నారు వచ్చి. వాళ్ళ దగ్గరి మాటలు కుక్క వింటోంది. ఒకడు అంటున్నాడు :

''మన దేశంలో భూతదయ అన్నది లేదుకదా.... పేదవాళ్ళు మలమల మాడిపోతున్నారు."

''మన వాళ్ళందరూ స్వార్థపరులే. పిడికెడు బిచ్చం పెట్టరు. చివరకు కుక్కకు వేసినట్లయినా పేదవాళ్ళకు యింత వెయ్యరు" - రెండోవాడి మాటలు వింటూ, వాళ్ళ చేతిలోవున్న మిఠాయి పొట్లం వంక చూసింది కుక్క. బూటు కాలితో ఆ కుక్క డొక్కలో తన్నాడు ఆ విద్యార్థి.

ఆ కథ చివరలో ఆ కుక్కకి ఒక పిల్ల పుట్టిందని, ఆ పిల్లకుక్క ఆ స్టేషన్‌లోనే తిరుగుతోందని చెప్పాడు కథకుడు అయితే, అది దాని తండ్రికి జరిగిన అవమానం మరిచిపోలేదట. దుకాణదారుడు చద్దిమిఠాయి దానికి పెడితే, అది తినకుండా మోసం గ్రహించి వాడి కాలు కొరికింది!

''దానికి మనుష్యుల్ని చూస్తే వెగటు వేసింది కాబోలు, కొన్నాళ్ళకి జన సమ్మర్దమైన స్థలాన్ని వదిలి అడవుల్లోనే వుండటం మొదలుపెట్టింది" అంటారు. అంటే, ఒక కుక్కకి మనుషుల్ని చూస్తే అసహ్యమేయటమా! - సంఘంలో ఒట్టి గొప్పలు చెప్పేవాళ్ళకి, భూతదయ అని, వర్ణవ్యవస్థకి వ్యతిరేకత అనే మాటలు వల్లిస్తూ, చేతల్లో ఎంతో వ్యత్యాసం చూపేవారికి గట్టి చురక వేశారు ఈ కథ ద్వారా. సామాజిక వ్యవస్థపై ఇదొక నిశితవిమర్శకు ఉదాహరణప్రాయమైన కథ.

"పరిపూర్తి" అనే కథ ఒక గుడ్డిపిల్ల కథ. ధనవంతుడు విద్యావంతుడు అయిన చంద్రశేఖరరావు ఒక గుడ్డిపిల్లను, నల్లనిదానిని వివాహమాడాడు. ఈ కథ మానవత్వానికి ప్రతీకగా నిలుస్తుంది. ఇంట బయట ప్రతిఘటన నెదురు కొని రాధను వివాహమాడటమే ఇందులో కథాంశం. చంద్రశేఖరం చాలా అంద మైనవాడని రాధ వింది. తను అందమైనదికాదని రాధ మనసు చెప్తోంది. చంద్ర శేఖరుడు చాలా అందమైనవాడని అందరు అంటున్నారు. ఆ గుడ్డిపిల్ల ఎప్పుడూ భర్తను అడుగుతూ వుంటుంది - "నేను అందంగా వుంటానా" అని. "నాకన్నా నువ్వే అందగత్తెవు" అంటాడు భర్త.

ఆ గుడ్డిపిల్ల ఒక కొడుకుని కంది. ఆమె మనసునిండా ఎన్నో సందేహాలు. పిల్లవాడు నల్లగా వున్నాడా అని అడిగింది. "నీలమేఘచ్ఛాయ" అంటాడు భర్త. "నీకు కళ్ళు వచ్చినట్టున్నాడు పిల్లాడు" అంటాడు. ఈ కథలో చంద్రశేఖర రావులో ఎంతో సంస్కారాన్ని, ఔన్నత్యాన్ని పోషించారు కవి. నల్లగా ఉండటం

గాని, గుడ్డితనం కాని సౌందర్యానికి లోపాన్ని ఆపాదించవని చెపుతూ ఆ గుడ్డి పిల్లకి ఆత్మస్థయిర్యాన్ని కలిగిస్తాడు ఈ కథకి ఆయువుపట్టు మానవత్వ చిత్రీకరణే

విధవా వివాహాన్ని సమర్థిస్తూ రచించిన కథ మహాశ్వేత కథ. ఈ కథ పేరు తిరోధానము, మహాశ్వేత సౌందర్యరాశి, సంస్కృతాంధ్రములు బాగా చదువుకున్న పిల్ల. ఆమె భర్త నీలలోచనుడు. అతనికి, ఆమెకు అభిరుచులు కలియలేదు. 'ద్విధాస్రుతింబులగువారి జీవనవాహినులు పాపము, కలియలేదు" అన్నారు విశ్వనాథ. రెండేళ్ళ కాపురము పూర్తికాకమును పే నీలలోచనుడు మరణించినాడు. కానీ మహాశ్వేత కనులు మూసినా, తెరచినా నీలలోచనుడే కనిపిస్తున్నాడు

రాధారాముడు శ్వేత అన్న అయిన మధుకాంతుని స్నేహితుడు. ఆ రాధారాంతో పరిచయం స్నేహమై, ప్రణయమై, పరిణయమునకు దారి తీసింది మహాశ్వేత జీవిత గమనంలో. ఇక్కడ కవి కథను ఎంతో చమత్కారంగా తీర్చిదిద్దారు. పాఠకునికి వరవశం కలిగిస్తుంది ముగింపు.

"శ్వేత కొంచెము లజ్జావనత వదనయైనది రాధారామున కాలజ్జావదనము వలన ఆనందమై ఆమెను కౌగిలించుకొని యామె చుబుకము నెత్తి యా యెఱ్ఱని పెదవులపై నొక చుంబనము చేసినాడు. అప్పటి యానంద పారవశ్యమున నప్రయత్నముగా శ్వేత కన్నులు మూతపడినవి. శ్వేతకు చప్పున తెలివి వచ్చినది. నీలలోచనుడు కనబడలేదు ఆమె కాశ్చర్యమైనది అది నిజమో, అబద్ధమో అని తరువాత పది నిమేషములలో నామె యొక వందసార్లు కనులు మూసికొన్నది. నీలలోచనుని చిహ్నముకూడ లేదు. అదిమొదలామె జీవితాంతామువరకు మఱల నామెకు నీలలోచనుని రూపము కనిపించలేదు-'' ఒక విధంగా మనస్తత్వ శాస్త్రజ్ఞునిలా కనిపిస్తారు విశ్వనాథ ఇక్కడ.

నవీన ఉద్యమాల ప్రభావం, నవీన సంస్కారాల ప్రభావం విశ్వనాథమీద ఎంత ఎక్కువగా ప్రసరించాయో అనటానికి ఈ కథ ఉదాహరణప్రాయంగా నిలుస్తుంది.

గుడ్డిపిల్లకు పెళ్ళిచేసిన కథ ఒకటయితే, వితంతు వివాహం చేసిన కథ మరొకటయితే - ఈ రెండూ సమాజంలో అత్యాధునికమైన సిద్ధాంతాలతో అన్వ

యిస్తుంటే కథకుడు విశ్వనాథను కేవలం ఒక వర్గానికి కట్టిపడేసి సంప్రదాయ వాది అనే ముద్రవేసి తోసేయటంకంటె, కాల ప్రవాహంలో కొట్టుకొచ్చిన ఆధునిక సిద్ధాంతాలన్నిటినీ అంగీకరించిన మహా మనీషిగా విశ్వనాథని అర్థం చేసుకోవలసిన అవసరం ఎంతైనా వుంది.

విశ్వనాథ చిన్న కథల్లో చాలా పెద్ద కథ, చాలా గొప్ప కథ, సామాజిక వ్యవస్థ స్వరూపాన్ని చూపిస్తూనే, పరిపాలనా యంత్రాంగాన్ని కూడా సవిమర్శ నాత్మకంగా, తాత్త్విక భూమికతో రాసిన కథ "ముగ్గురు బిచ్చగాళ్ళు." ఇందులో కథానాయకుడు ఇంగ్లీషు చదువుకున్న యువకుడు. ముగ్గురు బిచ్చగాళ్ళు అవిటి వాళ్ళే. బిచ్చగాళ్ళ రహస్యాలు కనుక్కొందామని వాళ్ళచుట్టూ తిరుగుతుంటాడు యువకుడు.

''బిచ్చగాళ్ళంటే నాకేం ద్వేషంలేదు. పైగా మిమ్మల్ని గురించి కథలూ అవీ వ్రాసి కృణమో, పణమో సంపాదించుకుంటున్నాను. అంటాడు. సంభాషణ సాగుతూవుండగా ''బిచ్చమెత్తడంలో సుఖముంది'' అంటాడు బిచ్చగాడు. అంతేకాక, "ఓట్లకోసం తిరిగే మీ నాయకులందరూ ఏంచేస్తున్నారు? దానికి దీనికి ఏమైనా భేదం వుందా ఆలోచించండి" అంటాడు బిచ్చగాడు. అంతేకాదు, మానవజాతి అంతా రెండు రకాలు. ఒకరకం సంసారులు రెండోరకం బిచ్చ గాళ్ళు. అధికారులు, సన్యాసులు, మత గురువులు, రాజకీయవేత్తలు, కవులు, గాయకులు - వీళ్ళకు కొట్టుకుతినటం ప్రధానం పెళ్ళాం బిడ్డలుంటే జంతు ధర్మం. ఆత్మధర్మం బిచ్చగానితనమే - ఈ రకంగా బిచ్చగాడు రకరకాల విషయాలమీద, సిద్ధాంతాలమీద, పోలీసు యంత్రాంగంమీద, ఆర్థిక వ్యవస్థమీద ఉపన్యసిస్తుంటే, ఆ యువకుడు తన పాండిత్యమేమీ ఈ బిచ్చగానిముందు పనికిరాదని నిర్ణయించేసుకున్నాడు.

"ఆ రోజుల్లో నా కనుమానంగా వుండేది. ఇంతమంది పోలీసులుంటే ఎంతమంది దొంగలున్నారో అని. పెద్దయైన తర్వాత తెలిసింది. లోకమంతా దొంగతనమేనని...." "రాజ్యంచేసేవాడంటే మొదట బిచ్చగాడు తర్వాత దొంగ." ఈ విధంగా మానవ జీవితంలోని మౌలికమైన అంశాల, పరమార్థాల విశ్లేషణలు జరిగింది ముగ్గురు బిచ్చగాళ్ళ కథలో. ఇది ధ్వనిరూపమైన కథ.

'కపర్ది' కథలో స్వాతంత్ర్యోద్యమ ప్రభావం, సంస్కరణోద్యమ ప్రభావం బాగా కనబడతాయి కపర్ది ఆదర్శ యువకుడు. సంగీతం, నాట్యం అంటే

అభిమానమున్నవాడు. విద్యావంతుడు, ఆస్తిపరుడు. ఒక పెళ్ళిలో భోగం మేళంలో చూసిన మృణాళిని అనే వేశ్యను ప్రేమించాడు. ఆమెను వివాహం చేసుకుందుకు ఇష్టపడ్డాడు కానీ ఆ వేశ్య తల్లి మృణాళిని వివాహం చేసుకోవ టానికి అంగీకరించలేదు. కపర్ది న్యాయవాద విద్యకోసం మద్రాసు వెళ్ళాడు. మృణాళిని సత్యాగ్రహ కార్యక్రమాల్లో పాల్గొంటూ వుంటుంది. ఒక పాశ్చాత్యుడు ఆమెను ఉంచుకున్నాడు. మృణాళినికి ఒక కొడుకు పుట్టాడు. సత్యాగ్రహ సమయంలోనే తుపాకిగుండుకి బలి అయిపోయింది మృణాళిని. అయితే, మృణా ళినికి పుట్టిన పిల్లవాణ్ణి తెచ్చి, వాడికి 'రొనాల్డ్' అని పేరుపెట్టి, వాడికి సంగీతం, నృత్యం నేర్పించాడు కపర్ది.... ఈ కథలో ఇతివృత్తం ఎంతో ఉదాత్తమైంది. కపర్దిలాటి వ్యక్తులు సంస్కరణోద్యమ కాలంలో ఎందరో వుండివుంటారు. విశ్వ నాథవారి మనసులో గొప్ప స్థానం సంపాదించుకొని వుంటారు. సంస్కరణోద్యమ ప్రభావ స్ఫూర్తి 'కపర్ది' కథ. కపర్ది కథ రాయగలిగిన విశ్వనాథ పురోగామి కాదని ఎవరనగలరు?

పైన చెప్పిన కథలన్నిటికన్నా చిన్నకథగా, కేవలం నాలుగు పేరాలు రాసిన కథ ఒకటుంది. ఈ ఒక్క కథ పాఠకుణ్ణి మళ్ళీ మళ్ళీ చదివిస్తుంది. ఇంకా ఇంకా ఆలోచింపచేస్తుంది. విశ్వనాథ మూర్తిమత్వం ఎలా అంచనా వేయాలో తెలియక తికమకపరుస్తుంది. 'నిజంగా ఇది విశ్వనాథ రాసిన కథేనా' అని మళ్ళీ మళ్ళీ ప్రశ్నింప చేస్తుంది. ఒక మహాకవికి ఒక ముద్ర వేసేసి చెలామణీ చేయటం ఎంత పొరబాటోనని పశ్చాత్తాప పరుస్తుంది. విశ్వనాథ విశ్వసాహి త్యంలో వస్తున్న అన్ని సిద్ధాంతాలను, అన్ని ధోరణులను ఎలా అవగాహన చేసుకో గలిగాడో అని ఆలోచింపచేసి ఆశ్చర్యపరుస్తుంది పాఠకుణ్ణి. ఆ చిన్న కథ పేరు "ఇంకొక విధము" ఇందులో గోపినాథుడు ముప్పయి ఏళ్ళవాడు. మలయగిరి పదిహేనేళ్ళవాడు.

"గోపీనాథుడును మలయగిరియును నెప్పుడును గలిసియే తిరుగు చుందురు. మలయగిరి కుడిచేయి గోపీనాథుని భుజమున కెదముగా నున్న నిముసము మనము చూడలేము. మలయగిరి గోపీనాథుని 'ఏమండీ' అని పిలుచును''— ఇది ఆ పురుషులిరువురి పరిచయము.

"ఎవరితోనైన గోపీనాథుడు మాటలాడుచు పోవుచున్న మలయగిరి యతని మోచేతిని తన మోచేయి తగుల్చును. ఒక్కొక్కప్పుడు మాటలాడుచునే

తల్లిని బిల్లవలె మలయగిరి గోపీనాథుని ఎదురుఱొమ్ముపై తలమోపును ''
ఇది వారి అనురాగము.

గోపీనాథుడు గొప్ప నటుడు. పారిజాతాపహరణ నాటకమునందు మలయగిరిని సత్యభామ పాత్ర నటించుటకు సిద్ధము చేసినాడు. నాటకము అయిపోయిన తర్వాత జనులంతా ఒకే విధంగా అనుకొన్నారంటారు విశ్వనాథ. "ఇంత చిన్న వయస్సులో నింతనటుడెట్లయినాడు? భార్యాభర్తల యనురాగమువలె నున్నదే వారి నాటకము!" - ఈ కథ శ్రద్ధగా చదివితే అర్థమయ్యేది 'ఇంకొక విధమే' ఇది హోమోసెక్సుయాలిటీని దృష్టిలో పెట్టుకు రాసిన కథే.

దీని విషయమై ప్రపంచం మొత్తంగా కొన్ని దేశాలలో ఆందోళన, మరి కొన్ని దేశాలలో ఆలోచన రేకెత్తుతోంది బ్రిటన్‌లో దీన్ని శాసన సమ్మతం చేశారు. వివాహానికి అంగీకారాన్ని కూడా ఆమోదించారు. చాలా దేశాలు హోమోసెక్స్యుయాలిటీని నేరుగా గుర్తించటం లేదు అయితే, విశ్వనాథ క్రాంతదర్శిలాగ సామాజిక వ్యవస్థలో రాబోతున్న పరిణామాల్ని ముందుగా కథలో చొప్పించ గలిగారా? ఈ కథ ఎప్పటిది?- 1955 నాటిది!?- 'నా నృషిః కురుతే కావ్యం' అన్న మాటను సార్థకం చేశారా?!

విశ్వనాథ సమాజంలో వస్తున్న అన్నిరకాల ఉద్యమాల, భావాల ప్రభావాలకి మహాకవులందరిలాగానే లోనయ్యారు, స్పందించారు. ఏ కొత్త సిద్ధాంతాన్నయినా అవగాహన చేసుకొనే సహృదయత్వంతోనే సాహిత్యలోకంలో జీవించారు.

సర్వకాలీన సత్యాలను కథా వస్తువుగా ఎన్నుకున్నారు విశ్వనాథ. "సప్తాశ్వము" అనే కథ కథకానికథలాగ కనిపిస్తుంది. గూఢార్థసమన్వితం ఈ కథ. హత్య చేయబడిన నాయకుడి పేరు డామట్. ఈ హత్యకు కారకులైన ఏడుగురినీ ఒకరి తర్వాత ఒకరిని ఉరి తీశారు ఏడు మాసాల పేర్లు ఇందులో వున్నాయి. అందరూ కూడా డామట్‌ను హత్యచేయటం విషయం సమర్థించుకుంటారు.

ఇలాటి కథ ప్రపంచంలో చాలాచోట్ల జరుగుతుంది. దేశభక్తులు నాయకుల్ని చంపటం, ఆ దేశభక్తులు దోషులుగా ప్రకటించబడటం, ఉరి వేయాలనటం హంతకులు గౌరవింపబడటం. ఇవన్నీ మామూలే అయితే,విశ్వనాథ అంటారు.

"మానవుల చరిత్ర విప్లవముల సమాహారమే." ఈ కథ సార్వకాలీనతను సంతరించుకుంది.

విశ్వనాథవారి మరో గొప్ప కథ 'ఉరి.' అయితే, ఇది చిన్న కథల సంపుటిలో చోటు చేసుకోలేదు (ఆంధ్రపత్రిక - సెప్టెంబరు సంచికలో వచ్చింది)

"నాకు మీరు ఉరిశిక్ష వేశారు. నన్ను చెప్పుకొనేది చెప్పుకోమన్నారు. శిక్ష వేయకముందు చెప్పుకోమంటే అర్థం ఉండేది'' అంటూ మొదలైంది కథ.

మనిషిని చంపాడని ఉరిశిక్ష వేశారు అయితే చంపాడో లేదో తనకి తెలియదు. సాక్ష్యం చెప్పినతనికీ తెలియదు - కానీ ''నాకు తల్లి పెళ్ళాం బిడ్డలున్నారు. మీ దయవలన రెండు నెలలనుండి ఖైదులో కూచుని అన్నం మాత్రం తిన్నాను. - ఈ పాటికి వాళ్ళు చచ్చేవుంటారు."

చేయని నేరానికి శిక్షపడాలని కోరుకుంటున్న ఆకలి కథ ఇది.

అందరికీ బియ్యం ఇస్తున్నారని విని క్యూలో నిలబడ్డాడు. ఏదో అలజడి. ఎవరో రాయి విసిరారు - మరెవరో మరణించారు. అయితే, 'కళ్ళులేని దేవుడు ఆ రాయినేనే విసిరానన్నాడు' అంటూ కథ చెప్పిన ఆ నిర్దోషి, చివరగా అంటాడు: 'మీ కడుపులు చల్లగా ఉండాలి - కానీ నా యింటిదీ పిల్లలు ఏమైనారో? నా పిల్లలు కొంచెం పెద్దవాళ్ళయితే వాళ్ళకి కూడా నాకు పట్టిన యోగం పడుతుందా అని ఆలోచన' వెదికించి ఈ ఉపకారం చేస్తే మీ కడుపున పుడుతా. ఉరిశిక్షకు వెదుతూ అతనన్న మాటలు!

గుండెల్ని మండించే కథ 'ఉరి', బండల్ని కరిగించే కథ 'ఉరి,' ఏ అభ్యుదయ కవికీ అందని కథ 'ఉరి.' 'ఉరి' కథ చదివాక, విన్నాక ఇంకా ఎవరైనా విశ్వనాథ ఛాందసుడా, అభ్యుదయవాదా, విప్లవ రచయితా, దళిత కథకుడా - మరోటా, మరోటా అని ప్రశ్నిస్తే, సమాధానం చెప్పాల్సిన పనే లేదనుకుంటాను.

ఏ రచయితనీ కూడా ముద్రవేసి గుర్తించాల్సిన అవసరం సాహిత్య లోకంలో అనవసరం!

విశ్వనాథ చిన్నకథలు పెద్దమనసుతో చూస్తే మహాకావ్యాలే!! *

# ఈ శతాబ్దపు తెలుగు జీనియస్ విశ్వనాథా ఆయన కథలూ

—శ్రీ వాకాటి పాండురంగరావు

"సమాజం స్థిరంగా వుండాలి; గతిశీలమూ అయి వుండాలి. అంటే దానికి కొన్ని అచలమైన మూలాలుండాలి. అదే సమయంలో అది ప్రగతికి స్వాగతం చెప్పే దృక్పథం కలదై వుండాలి. ఈ రెండూ అవసరమైనవే. పరిమాణ క్రమానికి తలుపులు మూసిన సమాజం కుళ్ళి పాడవుతుంది. స్థిరమైన పునాదులు లేని సమాజం పరిణామ ప్రభంజనం ధాటికి ఛిన్నాభిన్నం అవుతుంది" అంటాడు జవహర్లాల్ నెహ్రూ 'స్టెబిలిటీ వెర్సస్ డైనమిజం' అన్న వ్యాసంలో.

ఈ ఇలాతలం మీద మొట్టమొదట విరిసిన నాగరకత భారతీయులది. ఆరేడు వేల సంవత్సరాల అవిచ్ఛిన్న సంస్కృతి కల్గిన ఏకైక మానవ నాగరకత ఈ గడ్డమీదే వుంది, ఇంకెక్కడా లేదు. అయితే సుమారు వేయి సంవత్సరాల క్రింద మొదలయిన సైనికపరమైన దాడి పరాయిదేశస్థులు, అన్యమతస్థులు ఇక్కడ రాజులయి కూర్చునే స్థితికి దారితీసింది. అతర్వాత ఇస్లాము, క్రైస్తవం అన్న రెండు విభిన్న సంస్కృతుల ప్రభావాలు - ప్రభుత్వం వాటిదయినప్పటి అనుకూల పరిస్థితుల ప్రోత్సాహంతో - ఈ దేశ సంస్కృతిని నిద్రపోనీయకుండా జాగరితం చేశాయి. తత్ఫలితంగా ఆలోచనలో, దైనందిన జీవితంలో, సాహిత్య శిల్ప కళాది రూపాలలో మార్పులు సంతరించుకున్న భారతీయ సంస్కృతి అపూర్వమైన రీతిలో తన్నుతాను పునరావిష్కరించుకుంటూ వచ్చింది. ఇస్లామిక్ రాజ్యాధికారం సమసి, ఆంగ్లేయుల కుటిల వ్యాపార నీతికి, రాజకీయ దౌష్ట్యానికి భారతదేశం గురి అవుతున్న సమయంలోనే - భారతదేశం నుండి ఆంగ్లేయులు ప్లాసీ యుద్ధానంతరం కొల్లగొట్టుకుపోయిన బంగారం మదుపుగా - నాటివరకు ప్రయోగశాలలకు కాగితాలకు పరిమితమైన ఆంగ్ల వైజ్ఞానికుల ఆవిష్కరణలు - నూతన ఉత్పత్తి సాధనాలుగా రూపాంతరం చెందాయి.

1757 లో ప్లాసీ యుద్ధం జరిగింది. సుమారు వందకోట్ల పౌండ్ల విలువ గల బంగారాన్ని ఆంగ్లేయులు ఇక్కడనుండి తరలించారు. 1760 లో ఫ్లయింగ్ షటిల్. 1764 లో స్పిన్నింగ్ జెన్నీ, 1768 లో ఆవిరియంజను - ఇట్లా సైన్సు టెక్నాలజీగా, టెక్నాలజీ సుదూర దేశాల ఆర్థిక వాణిజ్య సాంస్కృతిక పునాదుల మీద దాడిగా మారింది. (ఈ విషయంమీద వివరాలు కావాలనినవారు తారాచంద్ గ్రంథం "హిస్టరీ ఆఫ్ ఫ్రీడమ్ మూవ్‌మెంట్ ఇన్ ఇండియా"- ప్రథమసంపుటం చూడాలి.)

ఇరవయ్యవ శతాబ్దం మొదలయ్యేనాటికి ఇట్లా ఒక్కుమ్మడిగా రాజకీయ ఆర్థిక, వాణిజ్య, సాంస్కృతిక దాడులకు భారతదేశం గురి అవుతున్న సమయం లోనే ప్రపంచాన్నే కుదిపివేసి మానవజాతి చరిత్రలో పెనుమార్పులను తేనున్న బోల్షివిక్ విప్లవం, మొదటి ప్రపంచయుద్ధం జరిగాయి.

—ఇవీ ఈ శతాబ్దారంభంలో ఈ దేశపు మూలాలను కదలించి, పెక లించి తుఫానుకు గురిచేసిన పరిణామాలు. ఇవి అలాంటిలాంటి సంస్కృతినయితే ముక్కచెక్కలు చేసి నామరూపాలు లేకుండా చేసి పారేసేవి. కాని అన్నిరంగాల లోనూ, సర్వ ప్రపంచానికి ఆదిభిక్షలు పెట్టిన ఈ జ్ఞానాన్నపూర్ణ - ఈ ఆపత్సమ యంలో తన ఆత్మశక్తిని ఆవాహనం చేసింది.

ఈ విరాట్‌శక్తి ఆధునాతన ఆవిర్భావాల జాబితాను, ఆ కాలక్రమాన్ని గమనించండి:

త్యాగరాజు — (1767 - 1847)
రామమోహనరాయ్ (1772 - 1833)
దాదాభాయ్ నౌరోజి (1825 - 1917)
రామకృష్ణ పరమహంస (1836 - 1886)
బాలగంగాధరతిలక్ (1856 - 1920)
మోక్షగుండం విశ్వేశ్వరయ్య (1861 - 1962)
రవీంద్రనాథ్‌టాగూర్ (1861 - 1941)
స్వామి వివేకానంద (1863 - 1902)
మోహన్‌దాస్ కరంచంద్‌గాంధి (1869 - 1948)
అరవింద ఘోష్ (1872 - 1917)
రమణమహర్షి (1879 - 1950)
సర్వేపల్లి రాధాకృష్ణ (1888 - 1975)
జిడ్డు కృష్ణమూర్తి (1895 - 1986)

వీరందరూ ఈ మట్టివాసన ఊపిరిగా బ్రతికినవారు; ప్రాచీనమైన ప్రాణ వాయువుల జీవశక్తి నరనరానవారు. అదే సమయంలో శతాబ్దాల ప్రయాణంలో సంస్కృతీ సంపుటిలోకి చేరిన అక్కర్లని చెత్తను, హానికరమయిన హైన్యాలను మొహమాటం లేకుండా విసిరిపారేసినవారు. కొడిగట్టిన భారతీయ జ్యోతి శిఖను చిదిపి, కాలంప్రమిదలో ప్రాణతైలం నింపి, తమ జీవితాలలో ఆ వత్తిని నేటి చీకట్లను పారద్రోలే దీపస్తంభంగా వెల్గించినవారు!

భారతీయమైన మూల్యాలను ఆధునాతన యుగానికి అవసరమైన రీతిలో ఆవిష్కరించిన కులపతి కె ఎం. మున్షీ— "కళ, మతము, సాహిత్యము, సామాజిక వ్యవస్థ, ప్రవర్తనలు, ఉమ్మడి లక్ష్యాల వలన ప్రేరేపితులయిన జనానీకము - వాటి సమాహారమే సంస్కృతి. అవిచ్ఛిన్నంగా సాగుతుండడం, అందరూ గర్వంతో గుర్తు చేసుకొనే గత చరిత్ర, ఆ స్ఫూర్తిలో నేడు ఉద్యోక్తులయ్యే గుణం - ఇవి సంస్కృతీ లక్షణాలు. అయితే కాలక్రమేణ పరిస్థితులు మారుతాయి. నాగరకత స్వరూప స్వభావాలు మారుతాయి. విచ్ఛిన్నకర ధోరణులు తలెత్తుతాయి ఇవి బలపడినప్పుడు కొత్త యుగం, కొత్త సమాజం ఏర్పడి కొత్త సమస్యను ఎదుర్కొంటాయి. అటువంటి సంకట పరిస్థితి ఏర్పడినప్పుడు సంఖ్యాపరంగా అల్పులే అయినా, సంస్కృతీ శక్తిపరంగా అకల్పులయిన వారి (Dominant minority) కి పెద్దసవాలు ఎదురవుతుంది. దానిని వారు స్వీకరించాలి. తమ దృక్పథాన్ని తదనుగుణంగా సవరించుకోవాలి; తమ ప్రవర్తనావళిలో, ప్రాథమికమైన వ్యవస్థలలో తగిన మార్పులు తీసుకొచ్చుకోవాలి. అయితే ఈ మార్పులన్నీ కూడా వారి సజీవ సంస్కృతీ విలువల వెలుగుల్లోనే, ఆ విలువలకు ప్రాణభూతమైన కేంద్రపు ప్రేరణలోనే జరగాలి." అంటారు.

పైన ఉదాహరించిన పుణ్యపురుషులు అలాటి (Dominant minority)కి చెందినవారు. అంతా కలిపితే అరవై మంది కూడా వుండరేమో కాని, వారే ఈ జాతికి ఈ శతాబ్దానికి అవసరమైన మానసిక చైతన్యాన్ని, మార్గదర్శనాన్ని అందించినవారు; ఈ జాతి చచ్చిపోకుండా సంజీవనుల నందించిన సదసద్వివేచనాసంపన్నులు.

తెలుగు నేలమీద సాహితీపరంగా ఈ కోవకు చెందిన అనన్య ప్రతిభాశాలి, అజేయ సాహిత్యమూర్తి శ్రీ విశ్వనాథ సత్యనారాయణ.

"మదరాసు నగరపు వీథుల్లో ఆకలితో మాడుతూ తిరుగుతున్న రోజులలో నా ప్రాణాన్ని నిలబెట్టినవి రెండే - కార్పరేషన్ కుళాయి వాళ్ళు, విశ్వనాథ సత్య సత్యనారాయణ కవితా" అన్నాడు యుగకవి శ్రీరంగం శ్రీనివాసరావు.

"సామాన్యుండనరాదు వాని" నన్నారు వారి గురువైన చెళ్ళపిళ్ళ.

"మన సంస్కృతి లోతుపాతులను తెలిసికొనకయే దానిని క్షుద్రబుద్ధితో విమర్శించుట నేడొక ఫ్యాషన్‌గా పరిణమించుటవలన అట్టి ప్రవృత్తులను తెగ నరుకుటయందు ఆయన కలము పరుగెత్తినది" అన్నారు బహుభాషావేత్త, ప్రస్తుతపు భారతదేశపు ప్రధాని పి. వి. నరసింహారావు.

"ఆయన ప్రతిభ భావనాత్మకమేకాదు. ఆలోచనాత్మకం కూడా. అపైన అలౌకిక దర్శనాశక్తి (Capacity for spiritul insight) ఆయన భావనకు - సామాన్యంగా కాల్పనిక రచయితల భావనకులేని తత్వపరిపూర్ణతను ఇచ్చినది. 'వేయిపడగలు' ఒక చిన్నసైజు విజ్ఞాన సర్వస్వం. దానిని చదవడం ఒక అపూర్వమైన అనుభవం 'ఏకవీర' కావ్యమైన నవల రవీంద్రనాథ టాగూర్ వంటి ప్రతిభావంతుడు విశ్వనాథ" - అన్నారు సుప్రసిద్ధ విమర్శక రచయిత ఆర్. ఎస్. సుదర్శనం

ఒక యుగంలో లెక్కలేనన్ని మార్పులు ఉప్పెనలవలె, ఉల్కలవలె ఉరికివచ్చి జాతి ఊపిరిని ఉక్కిరిబిక్కిరి చేసినప్పుడు - వాటిలోని మంచిని స్వీకరించి, వినాశకరమైనవాటిని తిరస్కరించే నిమిత్తం తన యావత్ సాహిత్య శక్తినీ అడ్డుపెట్టిన అగ్రేసర సాహితీ ఫల్గుణుడు విశ్వనాథ. జవహర్‌లాల్ నెహ్రూ వివరించినట్లు మార్పులేక కుళ్ళిపోవడం మరణమే, అట్లాగని మార్పుల దెబ్బకు తట్టుకోలేక ఊపిరి కోల్పోవడమూ మరణమే! అట్లా అవసరమైనచోట ఆకులను రాల్చి, కొమ్మలను నరికి - అయినా ఎట్టి పరిస్థితిలోనూ వేళ్ళకు తెగులు రాకుండా కాపాడిన దొడ్డ సాహితీ కృషీవలుడు విశ్వనాథ.

"పెద్ద విషయములలో జెబుపు రారాదు. స్వల్ప విషయములందు జాతి తత్త్వముండును. మన రాజ్యము శత్రువులు హరింతురు. కష్టము లేదు. మరల కెప్పుడో వారిని మనము జయించవచ్చును. కాని మనలోనున్న స్వాతంత్ర్యేచ్ఛ, శౌర్యము - ఈ గుణములు చచ్చిపోవుననుకొనుము, జాతి చచ్చిపోయినట్లే" అని

విశ్వనాథ స్వయంగా సెలవిచ్చినట్లు - ఆ చావును నివారించిన ఎమర్జెన్సీ సర్జన్ విశ్వనాథ.

ఇట్లా తన యుగపు స్వరూపాన్ని దాని వెలుగు చీకట్లను ఆకళించుకుని వాటిని తనదైన రీతిలో కథ, నవల, కావ్యం, నాటకం, విమర్శలవంటి వివిధ ప్రక్రియలద్వారా ప్రతిబింబించిన విశ్వనాథ సత్యనారాయణను జీనియస్ అన డానికి ఇంకా చాలా కారణాలున్నాయి.

అందులో మొదటిది : ఆయన క్రాంత దర్శిత్వం. సుమారు మూడు దశాబ్దాల క్రింద అప్పుడు 'ఇలస్ట్రేటెడ్ వీక్లీ ఆఫిండియా'కు సంపాదకుడుగా వుండిన డా॥ ఎ.ఎస్ రామన్‌తో 'ముఖాముఖీ' మాట్లాడుతూ విశ్వనాథ - "సోష లిజం + భగవంతుడు + మతం — మూడు ముక్కల్లో చెప్పాలంటే 'ఇదీ నా ఆదర్శం" అన్నారు. 1990 లో - కమ్యూనిజం రష్యాలోను యూరపియన్ దేశాల లోను హుష్‌కాకి అయిన అయిదేళ్ళ తర్వాత, 1995లో మార్క్సిస్టు మేధావి నాయకుడు ఇ. ఎం. ఎస్. నంబూద్రిపాద్ - "మతం మత్తుమందు అన్న కార్ల్ మార్క్స్ వాక్యాన్ని సందర్భంనుంచి విడగొట్టి, దానిని విపరీతంగా పెంచి అతిశయోక్తులతో ప్రచారం చేశారు. దానివలన చాల నష్టం కల్గింది. ఇకనుంచి కమ్యూనిస్టు నాయకులు మత గురువులతో చేతులు కలిపి పని చేయాలి" అన్నాడు. అదే సత్యాన్ని - మూడు దశాబ్దాల క్రింద స్పష్టం చేసిన విశ్వనాథ జీనియస్సే! సందేహం లేదు.

రెండవది : "ఒక రచయితకు విస్తృతంగా పఠనం, లోతుగా అధ్యయనం వుంటే అవి అతడి సృజనాత్మకతకు దోహదం చేస్తాయి. అవి లేని సీరియస్ రచయిత అతి త్వరలోనే నీరసించిపోతాడు" అన్న విశ్వనాథ సత్యనారాయణ - హెచ్.జి. వెల్స్, హక్స్లీ, సింక్లేర్‌లూయిస్, అప్టన్‌సిన్‌క్లెయిర్, మపాసా, ఓ హెన్రీ, థామస్‌హార్డీ, గార్డినర్, మిల్‌నీ, ఫార్‌స్టర్, రాబర్ట్ లిండ్, బ్లావస్కీ, బెర్‌ట్రాండ్ రసెల్, ప్రీస్ట్లీ, గైల్స్ గొగోల్, దాస్టావిస్కీ, మేక్సింగోర్కీ, సామర్సెట్ మామ్, ఇబ్సన్, నోయెల్‌కవార్డ్‌లవంటివారి కాల్పనిక రచనలనూ, ప్లేటో షొపెనీర్, స్పినోజా, బెర్గ్సన్, శాంటాయన, క్రొస్నే, డ్యూయీవంటి వారి తాత్విక రచనలనూ, సైన్సు చరిత్రను, ఐన్‌స్టీన్, రూథర్‌ఫోర్డ్‌వంటి సైంటిస్టుల జీవితాలను, డార్విన్ జీవ పరిణామ సిద్ధాంతాల్ని, భూగర్భశాస్త్రాన్ని, బౌద్ధ జొరాస్ట్రియన్ మత గ్రంథాలను, విమర్శనా గ్రంథాలనూ, చైనీయుల

నవలలను, హేడ్లీబేస్, యర్ల్ స్టాన్లీ గార్డ్‌నర్‌వంటి వారి డిటెక్టివ్ రచనలను, గణిత శాస్త్రం, రసాయన శాస్త్రం, భౌతిక శాస్త్రం, ఆర్థిక శాస్త్రాలను చదివాడు. నాట్యం సంగీతం చిత్రలేఖనాలల్లో ప్రవేశం వుంది. ఉపనిషత్తులూ, కావ్యాలూ, బ్రాహ్మణాలూ, భాష్యాలు, కావ్యాలు, నాటకాలూ, శాస్త్రాలూ సరేసరి... ఈ జాబితా చాలు ఆయన అపార వైదుష్యం అనే జీనియస్ లక్షణాన్ని ఎలుగెత్తి చాటటానికి!

యుగ ధర్మాన్ని అర్థం చేసుకుని, జాతీయతా దృక్పథంలో విశ్లేషించి పరిష్కారం చూపించిన సర్వతోముఖ ప్రతిభాశాలి విశ్వనాథ పరిపూర్ణ పురుషుడా అంతేకాదు; ఆయన రచనలలో దోషాలు లేవా అంటే వున్నాయి; ఆయన భావాలు అన్నీ సమర్థనీయములేనా అంటే కాక పోవచ్చు. కాని ఆయనది అంతా ఛాందసమే అంటే అది అసత్యం ఆయన ఆధునికతకు, విజ్ఞానానికి బద్ధవిరోధి అన్నది సాహిత్య వీధులలో అరుపుల మూకలు ప్రచారం చేసిన పదహారణాల అబద్ధం!

"విజ్ఞాన శాస్త్రం అందించిన రైలు, ఫోన్, విమానం, రేడియో లాంటి వాటి ప్రయోజనాన్ని నేను కాదనడం లేదు. అయితే కొత్తగా ఏం వచ్చినా కొందరు ఆధునికులు దానివెంట గంగవెర్రులెత్తినట్లు పరుగెడుతున్నారు. కాని వారు కొంత నిదానించాలి పరీక్షించాలి అంతేకాని పశ్చిమ దేశాలను గుడ్డిగా అనుకరించకూడదు. కొన్ని రంగాలలో మన పూర్వులు ఎంతో ఉన్నతంగా ఆలోచించి గరిష్ఠ ఫలితాలను సాధించారు. వాటి గురించి ఆలోచించండి. పాశ్చాత్య దేశాల ఆవిష్కరణలలో మానవతా విలువలకు, మనిషి సుఖానికి దోహదం చేసే వాటిని ఎన్నుకుని, మనదానిలో జోడించండి-'' అన్నవాడు సమగ్ర వైజ్ఞానిక దృష్టి కలవాడే కాని - వెనక్కు నడిచేవాడు కాదు. ఈ విశ్వనాథ మాటల ప్రక్కనే-

''పురాతన క్రెమ్లిన్ భవనంలోని మూడు గదులలో కాపురం వున్నాడొక మానవుడు. అతని పేరు జోసెఫ్ స్టాలిన్. ఎంత రాత్రయినా అతని గదిలో దీపం వెల్గుతూనే వుంటుంది.

స్వాతంత్ర్యం సాధించిన వీరులు చాలామంది ఉన్నారు. చరిత్రలో అంతకుమించి స్టాలిన్ ఆ స్వాతంత్ర్య స్వభావాన్ని నిర్వచించి, నిర్మించి, నిర్వహించి పరిరక్షించాడు. (1953) - అన్న కవితా నీరాజనాన్ని నిలబెట్టండి!

ఏది హ్రస్వదృష్టో, ఏది దూరదృష్టో, రచయితల నిబద్ధత ఎటువంటి సత్యాలపట్ల వుండాలో సుస్పష్టం అవుతోంది. నాలుగు దశాబ్దాల క్రింద లభించిన

ఈ కవితా పంక్తులను ఇవాళ రష్యాలో చదివితే ఎవరూ వినరు విన్నా నవ్వు తారు లేదా - (ఎందుకులెండి)....! అందుకనే అన్నాడొక పాశ్చాత్య మేధావి- "రచయితా! సమకాలీన రాజకీయ సిద్ధాంతాలను మంగళసూత్రంలా ధరించావో, తాడు తెగుతుంది. వితంతువు అవుతావు'' అని!! - ఇదే భావాన్ని విశ్వనాథ— ''సిద్ధాంతములకేమి, సర్వకాలములందు సర్వసిద్ధాంతములు స్థిరములుగా లేవు. ఈ కాలమునందలి సిద్ధాంతములు మరియొక కాలమునం దపసిద్ధాంతనులు కావచ్చును కాని కవి మాత్రం నిత్యుడు" - అని ఢంకా బజాయించి మరీ చెప్పాడు.

అట్లా ఆరిపోని వెలుగు విశ్వనాథ రచనలది! ఇప్పుడీ దృష్టితో ఆయన కథలు కొన్నింటిని పరికించుదాము.

* * *

'నవల - వీథిలో నడుస్తున్న అద్దంలాంటిది' అన్నాడొక పాశ్చాత్య భాష్యకారుడు. అదే సామ్యాన్ని పొడిగించితే- 'కథ' కిటికీలో వుంచిన కెమెరా వంటిది అని చెప్పవచ్చు వెడల్పాటి తారు రోడ్‌మీద వెళ్ళే కారు నవలయితే - రెండు గడ కర్రలమధ్య కట్టిన తీగెమీద నడకలాటిది కథ - అనుకోవచ్చు. కాని ఎన్ని నిర్వచనాలు చెప్పినా అందుకు భిన్నమైన కథను సృష్టించి ఒప్పించ గల కథనశిల్పు లున్నారు. అయినాసరే కథ అనగానే ఒక సూక్ష్మము, సరళము, సుందరము సమగ్రము అయిన స్వరూపం మనసుకు గోచరిస్తుంది. ఆ చిన్న పరిధిలోనే సంఘటన, పాత్ర చిత్రణ, సన్నివేశ పరిణామం వుంటుంది. ముగించాక మనసులో అగరు ధూపమో, అగ్నితాపమో రేఖామాత్రంగా మెదు లుతూ వుంటుంది. ఇదీ కథంటే!

విశ్వనాథ సత్యనారాయణగారి కథలు అందరి కథల్లా వుండవు- ఆయన అందరు రచయితల్లాటివాడుకాడు కదా! ... కొన్ని కథల్లో సంభాషణలే వుంటాయి. 'ఆయన చెప్పదలచుకొన్న విషయాన్ని చెప్పడమే మా కర్తవ్యం- అంతేతప్ప నిర్వచనాలు, స్వరూపాలు మాకు తెలియవు.' అంటున్నట్లుంటాయి వారి కథలు. 'కాళిదాసు అపకీర్తి' 'ఆద్యంతములు' అలాటివి.

ఆయన అపార పఠనా వైశాల్యానికి ప్రతీకలాటి ''య్యో-హ్లా-షికెయ్'లో — ''కాంగోనదికి ఉపనది అడులిమి దీనికింకో పేరు ఇటురా. ఆ సరస్సు దగ్గర సన్నని గొంతుతో పాడే పిట్టపేరు కిస్వాలికా" లాటి వివరాలు మనల్ని

అచ్చెరువొందించినంతగా ఆ కథ మనల్ని వెంటాడదు ఈ ధోరణితోదే ఇంకో కథ 'చామరగ్రాహిణి.'

ఒక జాతి కుక్కను తక్కువ జాతి కుక్కతో జత కట్టనివ్వరే, సంకరం అవుతుంది అని జంపుతారే— మనుషుల విషయంలో ఈ ఆలోచన రాదా అని వాచ్యంగా కాకపోయినా సూచ్యంగాచెప్పే కథ—''మాక్లి దుర్గంలో కుక్క''లో తర్కం అద్భుతమే కాని, జీవితం అన్ని వేళలా తర్కం ప్రకారం నడవదు. పాశ్చాత్య దేశాలలో సమాజాలలో - వైజ్ఞానిక, సాహిత్య రంగాలలో వెల్లివిరిసిన విజయపరంపర ముందు - ఈ తర్కం నిలబడలేదు ఇదే విషయం మీద విశ్వనాథ కథ 'రాజు' సైతం వర్ణవ్యవస్థ పట్ల ఆయన నిష్ఠను సూచిస్తుందే తప్ప— పరిణామశీలమైన సమాజం అంగీకరించేది కాదు. కేవలం పుట్టుక వల్లనే కాక ప్రవృత్తి వలన ప్రవర్తన వలన మాత్రమే మనుషులకు తేడాలుంటాయి అన్న ప్రాచీన భారత సంప్రదాయంసైతం ఈ దృక్పథంమీద ఆమోదముద్ర వేయదు.

కులాలమీద ఇంత ఖచ్చితమైన అభిప్రాయం కల్గిన విశ్వనాథ - 'కపర్ది' అన్న కథలో తాను ప్రేమించిన వేశ్యకన్య మృణాళిని ఒక పాశ్చాత్యుని సంపర్కంతో 'రోనాల్డు' అన్న అబ్బాయిని కని చనిపోతే - ఆ అబ్బాయిని 'కొడుకు' వలె పెంచుతాడు. వాడొక చక్కని నర్తకుడవుతాడు. అపుడు "కపర్దిని ఓదార్చవలయునో, సానుభూతి తెలుపవలయునో, మహాపురుషుడవని ప్రశంసించవలయునో, కులభ్రష్టుడవని నిందింపవలయునో నాకేమియు తెలియలేదు. అతడన్నచో మనస్సులో మహాగౌరవము ఏర్పడినది—" అన్న 'నేను' (అంటే విశ్వనాథ) మీద మనకు గౌరవం ఏర్పడుతుంది. 'రాజు'లో వర్ణ వ్యవస్థమీద యథాతథస్థితిని ప్రతిపాదించిన రచయిత, ''మేక్లి దుర్గంలో కుక్క''లో ఈ విషయం మీద ప్రశ్న లేవనెత్తుతాడు. 'కపర్ది'లో ఈ యుగం అంగీకరించే సమాధానాన్ని ప్రతిపాదిస్తాడు. ఇది మహారచయితల లక్షణం. ఇట్లా మార్పును గుర్తించి, ఇష్టంవున్నా లేకపోయినా దానిలోని మేలును ప్రశ్నార్థంకగా నయినా అంగీకరించే గుణం వున్నా - అదే ఈ జాతి ఒకవైపు స్థిరంగా వుంటూనే ఇంకొకవైపు మార్పులను ఇముడ్చుకుని సజీవంగా ముందుకుసాగేలా చేసింది.

మానవ జన్మ అంటే జంతుతత్వానికి, దైవత్వానికి మధ్య ప్రకృతి వేసిన నిచ్చెన. నిచ్చెన ఎక్కి మనిషి దేవుడవవచ్చు; లేదా దిగి జంతువు కావచ్చు. ఆ నిర్ణయం, ఆరోహణం, అవరోహణం - వ్యక్తిని బట్టి వుంటుంది. మనిషి

శరీరం కొన్ని ప్రకృతి ధర్మాలకు లోబడినట్టిది. ఈ శరీరం అతనికి నిచ్చెన దింపే ప్రయత్నంలో వుంటుంది. కాని ఈ శరీరంలోని మనసేమో "జాగ్రత్త సుమా, దిగడం మొదలుపెడితే చివరంటా వెళ్ళి అఘోరిస్తావు" అని హెచ్చరిస్తూనే వుంటుంది. కాని ఇటు ఇంద్రియాలు ఐదు, అటు మనస్సు ఒంటరిది. అంచేత ఈ యుద్ధంలో మనసుని బలపరిస్తే మనిషి జయిస్తాడు; ఇంద్రియాలను బలపరిస్తే ఓడిపోతాడు భారతీయ సంప్రదాయం ఇంద్రియాలను చీత్కరించ లేదు; వాటి అవసరాలను తోసిరాజనలేదు. శరీరాన్ని శరీరంతో జయించమంది. నాలుగు పురుషార్థాలలో అర్థము, కామము - అనే రెండు పార్శ్యాంశాలను మనిషి శరీరాన్ని పంచేంద్రియాలను గుర్తుంచుకునే నిర్దేశించింది. దానికోసం గృహస్థా శ్రమం అనే పాతిక నుండి యాభైసంవత్సరాల 'పీరియడ్'ని కేటాయించింది. ఈ గృహస్థాశ్రమానికి ప్రవేశ ద్వారం వివాహం; దాని ప్రయాణ మార్గం దాంపత్యం. శరీరాన్ని తృప్తిపరుస్తూనే మనిషి భౌతిక స్థాయికి అతీతమైన స్నేహభావాన్ని, ప్రేమ సాంద్రతను అందుకోవడం కోసం వివాహం, దాంపత్యం కన్నా ఆదర్శప్రాయమైన మార్పు ఇంకోటి లేదు సుస్థిర దాంపత్యం అంటే సురక్షితకుటుంబం. సురక్షితకుటుంబం అంటే సుస్థిర సమాజం.

ఈ సుస్థిరమైన పునాది అనే వేళ్ళు ఆధారంగా మొలకెత్తే తరం తర్వాతి తరం అనే శాఖలు ఎంత దూరమైనా విస్తరించవచ్చు, లేదా వాటిని కత్తిరించి అంటుకట్టవచ్చు- ఆ మార్పులు జరుగుతునే వుంటాయి; వేళ్ళు స్థిరంగా వుంటాయి. సుస్థిరత - పరిణామం - ఈ పరస్పరం విరుద్ధం అన్పించే శక్తుల సమన్వయాన్ని స్త్రీ పురుష సంబంధాల మధ్య సుసాధ్యం చేసేదే వివాహ వ్యవస్థ. వ్యక్తికి, సమాజానికి, శరీరానికి, మనసుకు మధ్య.సమన్వయకర్త కూడా ఈ వ్యవస్థే— కాని జీవితం అంటే సిద్ధాంతం కాదుకనుక వైరుధ్యాలు, సంఘర్షణలు తలెత్తుతూనే వుంటాయి ఈ అతికీలకమైన విషయంమీద విశ్వనాథ రాసిన "దొరగారు- దివాన్జీ", "ఏమి సంబంధము", "తిరోధానము" కథలలో వైరుధ్యం ప్రధానం గాను, "పరిపూర్తి", "నా ఋణం తీర్చుకున్నా", "పుణ్యప్రేమము", "కపర్ది" కథల్లో సమన్వయమూ కనపడతాయి.

ఈ సందర్భంగా ఆయన "వివాహం అను సంస్థ స్త్రీ పురుషసుఖ వ్యవహారములందు.రాజ్యాంగ విషయములలో ప్రజాస్వామ్యమెట్టిదో అట్టిది" అని న్నమాట ఎంత తరచి ఆలోచిస్తే అంత గొప్పగా అన్పిస్తుంది!

కొన్ని ఫిరంగిగుండ్లలాంటి వాక్యాల ద్వారా మహాసత్యాలను ఆవిష్కరించడం విశిష్ట రచయితల లక్షణం.

"మా జాతిలో తెలివికి, ధైర్యానికి ఎక్కువ భేదం లేదు. మా న్యాయమే తెలివి. తెలివే ధైర్యం" అన్న అన్వయమూ, తాత్పర్యమూ, అత్యున్నత స్థాయి నందుకున్న నాగరకతలోనే సాధ్యమూ, సత్యమూ అవుతాయి. న్యాయమనేది మార్గం; తెలివి అనేది వాహనం; ధైర్యం సారథి!! అయితే ఆ నాగరకతా శిఖరాల నధిరోహించనివారి పాలపడ్డపుడు ఇది మనజాలదు. భారతదేశ చరిత్ర దీనిని ఋజువు చేసింది.

"భారతీయుల నైతిక సూత్రాలు అతి ఉన్నతమైనవి" అంటాడు మెకింటాష్ అన్న చరిత్రకారుడు. రెయినాల్డ్ ఫార్స్టటల్ అన్న మరొక పాశ్చాత్యుడు "హాయిగా, ప్రశాంతంగా బ్రతుకుతున్న భారతజాతిని దుఃఖాల పాలు చేసింది ఆ దేశంపై దాడి చేసిన ముస్లిము రాజులే. ఈ విధంగా ముస్లిములు ప్రారంభించిన విధ్వంసాన్ని-అన్ని దేశాలనుండి అధమాధములయినవారిని సైనికులుగా చేరదీసి భారతదేశంపై దాడి చేసిన యూరపియనులు పూర్తి చేశారు" అన్నాడు.

ఆ విధంగా బలి అయిన జాతి విలువలను హృదయంగమంగా చిత్రించే పౌరుషవంతమైన కథ "జీవుడి ఇష్టము." ఆ ధోరణిదే "అల్లాహ్‌కే ఫకీర్"అన్న కథ కూడా.

"(దొంగతనం) చేయకపోతే రాజ్యం చేయడం ఎట్లా బాబూ? రాజ్యం చేసేవాడంటే మొదట బిచ్చగాడు, తరువాత దొంగ" అని 'ముగ్గురు బిచ్చగాళ్ళు' కథలో ఒక బిచ్చగాడన్న వాక్యంలోని "మొదట బిచ్చగాడు'' - అంటే నక్కవినయములతో దొంగనమస్కారాలు చేసే నేటి ఎన్నికల అభ్యర్థి!! ''తరువాత దొంగ'' కనుకనే మంత్రిఅయి దేశంలో 'బాగు'పడినవాడేతప్ప చెడిన వాడెవడూ లేడు!! ఔరా సత్యనారాయణా, ఎంతటి సత్యం చెప్పావయ్యా!!

'' 'రెవల్యూషన్'కు ఎప్పుడూ ముగింపు అంటూ వుండదు. రెవల్యూషన్, కౌంటర్ రెవల్యూషన్ - ఇట్లా ఇది సాగుతూనే వుంటుంది—'' అంటూ అరుణపతాకం క్రింద వారెవరో అయ్యవారు చెప్పారు - ఓహోహో! ఏమి డిస్కవరీ, ఏమి అవగాహన,'' అని మూర్ఛలుపోయే వారు ఈ వాక్యాలను గమనించండి ;

''అసలు మానవుని చరిత్ర అంతే. విప్లవములయొక్క సమాహారమే.... విప్లవం ఎప్పుడూ తరంగాలు తరంగాలుగా వస్తుంది. మూడు నాలుగు తరంగాలు కలిసి ఒక విప్లవం అవుతుంది... ఒక విప్లవ తరంగం లేస్తుంది. (దేశం బాగా లేకపోవటానికి హేతువులుగా కన్పించిన) అధికారులను నాశనం చేస్తుంది. విప్లవ తరంగం అంటే వాళ్ళూ కొందఱు మనుష్యులే వెంటనే మఱియొక విప్లవ తరంగం లేచి మొదటి తరంగాన్ని హతమారుస్తుంది''-అన్న ''సింధూరారుణ'' కథాశిల్పి విశ్వనాథకు 'రెడ్ సెల్యూట్' అందామా.... అన్నట్లు ఈ నిర్వచనం వున్న కథ పేరు 'సప్తాశ్వం'.

ఆర్ద్రతతో కదిలించే కథలు కొన్ని, ఆలోచనతో మనసుకు రెక్కలు తొడిగే కథలు మరిన్ని రాసిన విశ్వనాథకు నవలాకారుడిగా, కావ్యకర్తగా, కవిగా వచ్చినంత పేరూ ప్రతిష్ఠా కథకుడుగా రాలేదు అందుకు కొంత కారణం ఆయన కథలు కావచ్చు. అంతకన్న బలవత్తరమైన కారణం ఆయనకు బేరీజు వేసిన బేహారుల దృష్టిలో ఒక ప్రక్రియగా కథకుడిగా అనకపోవడమూ కావచ్చు!

అయితేనేమి బంగారం బంగారమే! కాకపోతే మన్నికకోసం రాగి కల పాల్సి వస్తుందంతే!

* * *

బ్రిటీషు వనిత కేథలీన్ రెయిన్ విద్వాంసురాలు, కవి, విమర్శకురాలు. "క్వీన్స్ గోల్డ్ మెడల్ ఫర్ పొయెట్రీ'' ఆమెకు 1992 లో ఇచ్చారు. 'ట్రిమెనోస్' అన్న విమర్శ పత్రికకు ఆమె సంపాదకురాలు.

ఆమె 1993 లో మన దేశానికి వచ్చినప్పుడు చెప్పిన ఈ మాటలు విందామా?

"భారతదేశం అంటే రాజకీయవాదుల భారతదేశం కాదు, ఆర్థికవేత్తల దేశం కాదు, టెలివిషన్ కెమెరాలు చూపించే దేశం కాదు - కవికి, విద్వాంసుడికి, సత్యాన్వేషికి భారతదేశం అంటే ఈ గడ్డమీద తరం తర్వాత తరంద్వారా 6000 సంవత్సరాలుగా సాగిన స్రవంతి! ఇక్కడి కళలను, పాండిత్యాన్ని, మతాలను, కౌశల్యాలను, జీవితపు మర్యాదలను అనవరతము అభిషేకిస్తూ వచ్చిన జీవధార! నేటికీ ఈ యావత్ సమాజపు నరనరాల్లో ప్రవహిస్తున్న సంస్కృతి! అదీ భారతదేశం అంటే!

—"సోక్రటీసుకు పూర్వపు గ్రీసుకి, ప్లేటో కాలపు అలెగ్జాండ్రియాకు బౌద్ధమత వ్యాప్తి ద్వారాను ఇటీవలి కాలంలో థియోసాఫికల్ ఉద్యమంద్వారా ఇట్లా మళ్ళీ మళ్ళీ ప్రపంచానికి జ్ఞానభిక్ష పెట్టింరి మీ దేశం.......నాడు శక్తి వంతమైన సామ్రాజ్య వాదానికి, నేడు బహుళజాతీయ కంపెనీల దాడికి గురి అవుతున్న భారతదేశం చాల గాయపడి వుంది. ఇక్కడి పేదరికం కండ్లకు మా సాంకేతిక నాగరకత సాక్షాత్తు మోహినిలా ఆకర్షణీయంగా వుండవచ్చు. కేన్సర్ వ్యాధి కణాలవలె యంత్రాలు 'ఆత్మ'లేని వస్తువులను ఉత్పత్తిచేస్తున్నాయి. మానవ మేధస్థానాన్ని కంప్యూటర్ ఆక్రమిస్తుంది. నైతిక విలువల ఆనకట్టలు లేని ఐహిక ఐశ్వర్యాభివృద్ధి తప్పనిసరిగా నిరుద్యోగానికి, మానవ జీవనస్థాయి పతనానికి దారితీస్తాయి. రామాయణ, మహాభారతాలను సృష్టించిన భారతదేశం మా పాశ్చాత్యదేశాల ధన సంస్కృతి అలవాటు చొప్పున లాభాలకోసం తయారు చేసి పారేసే టెలివిషన్ చెత్తతో సంతృప్తి చెందాలా? భారతదేశమా, మా పడమటి దేశాలు చేసిన ఘోరమైన తప్పిదాలన్నీ నువ్వు కూడా చేయాలా?" అని ఆవేదనతో అడిగింది ఆ విదుషీమణి!!

ఔరా కలికాలామా! ఈ 1995లో - అందులోనూ మనం శతవిధాల ప్రశంసించే ఇంగ్లీషు దేశాలలో ఇటువంటి 'పరమ ఛాందసమైన" - 'మతతత్త్వ వాద సంస్కృతీభరితమైన' - 'ఫ్యూడల్ భావజాలమున్న' - 'ప్రగతి నిరోధకు' లున్నారా? ఇలాటివాళ్ళుండబట్టేకదా ఈ విశ్వనాథ సత్యనారాయణ శిష్యులు ఇట్లా పేట్రేగిపోతున్నారూ! హయ్యో హయ్యో!! *

స్వాంతంబున్ మృదుశయ్యపైఁ బఱచితిన్ భక్తిప్రథావస్త్ర మ
త్యంతంబున్ బయిచల్లితిన్ మృదుల భావాఖ్య ప్రసూనాళినా
యంతర్గేహము బాగుచేసితిని నీకై కంటిదారిన్ బ్రతీ
క్షింతున్ వాసకసజ్జికన్‌బలె నుమాచిత్తేశ! విశ్వేశ్వరా!

నీవే రాజువు నేను సత్కవిని తండ్రీ! నిన్ను వర్ణించెదన్
నీవే దైవము నేను భక్తుడను తండ్రీ! నిన్ను ధ్యానించెదన్
నీవే భూమివి నేను కర్షకుడ తండ్రీ! నిన్ను పండించెదన్
నా వైదగ్ధ్యము నీవ చూతు, కృపసంధానింతు విశ్వేశ్వరా!

—విశ్వనాథ

# జీవుని వేదన

—డా॥ తుమ్మపూడి కోటేశ్వరరావు

విశ్వనాథ కవిసమ్రాట్టు కల్పవృక్షావతారికలో అన్న ఈ మాటను సశాస్త్రీయంగా వ్యాఖ్యానించినవారు కీ॥శే॥ దూళిపాళ శ్రీరామమూర్తి గారు. తర్వాత తర్వాత ఈ మాట చాలా వ్యాప్తి పొందింది.

ఈయనిలాధ్యమెల్ల నినదించెడు మువ్వల మ్రోత దూరమై
పోయిన గోతతిం బిలుచుపోలిక ఏదొ విని స్వనించెడున్
రాయిడి పొందుచున్ తెలియరాక వగర్చి పురానుభూతముల్
తీయని భావముల్ స్మృతికి తెచ్చుకొనన్ వలవంతకుందెదన్.

ఇది శృంగార వీథిలోది. కల్పవృక్షం, వేయిపడగల కంటె ముందు రచన.

వినిస్వస్తున్నదేదో దానిస్వరూపం తెలియక బాధపడుతూ స్మృతికి తెచ్చుకోవటానికి ప్రయత్నిస్తూ వుంటే - కలిగిన అనుభూతికి ఒక పోలిక దొరికింది. "దూరమై పోయిన గోతతింబిలుచు''పోలిక—కృష్ణుడు మన స్మృతికి దూరమై పోయిన గో = జ్ఞానకిరణం, (బోధకు సాధనమైన) శబ్దం - వంటి ఆవులను పిలుస్తున్నట్లుగావుంది —ఆ 'ఏదో'

కనుక ఈ విషయం భౌతికవేదనకాదు, హృదయసంవేదన. మనోభాష కందనిది, ఆలోచన కందనిది కావటంవల్లనే పోలిక చెప్పవలసి వచ్చింది. అంటే Feeling తప్ప thinking కాదని తాత్పర్యం.

ఇలా చెబితే భావకవితా విషయం వావచ్చు. నిజానికి శృంగారవీథి ఆ రోజుల్లో పుట్టిందే కాని, విశ్వనాథ కేవల భావకవి కాడు. తెలుచిరాజులో కవి ''కవిత్వం ఊహలనుండి పుట్టదు, జీవితంలోనుండి పుడుతుం''దన్నాడు.

ఇది భావకవిత్వంపై చేసిన వ్యాఖ్య.

కనుక ఈ జీవుని వేదన - సామాజిక వేదన - తాత్త్విక దర్శనానికి మధ్యనున్నది Self - అని మనస్తత్వశాస్త్రం, Psychic Being - అని శ్రీ అరవిందుల మాటలు.

కల్పవృక్షం, వేయిపడగలు ఒకసారి పుట్టాయి. రెండోదానితోపాటుగా మొదటిదీ ప్రారంభింపబడినది రెండూ కవి జీవునికి - జీవబీజంలో రెండు దశాలు. మొదటిదానిలో వైయక్తిత ఆధ్యాత్మిక సంవేదన ప్రధానమైతే, రెండో దానిలో సామాజిక సంవేదన ప్రధానం. అసలు భారతీయ దృష్టిలో ఇంతవరకు వ్యక్తి - ఇందాక - సమాజం - ఇందాక శరీరం, తర్వాత ఆత్మ - ఇలా విభాగం లేదు. మానవ జీవితమన్న గంగానదిలో పాయలనేకం మున్నా - చతుర్విధ పురుషార్థ సమన్వయ ముందితప్ప దేనికది లేదు. కనుక జీవుని వేదనలో బహిర్ముఖంగా సమాజవేదన వుంది. అంతర్ముఖంగా ఆధ్యాత్మిక సంవేదనముంది. కల్పవృక్ష ఖండాంతాల్లో పద్యాలన్నీ ఈ జీవుని ఆక్రందనలే. ఒక్కొక్క చోట కవి పొందిన ఆధ్యాత్మిక అనుభవవిశేషా లున్నాయి.

''కలదొక కొన్ని వేళలు నికామ భవత్పదచింతనానలోజ్జ్వలితశిఖా సనాధములు''

''కన్నుల మధ్య దీపశిఖగా కనుగొందును'' ఇలాంటి వన్నీ జీవుని వేదనకు ఫలితంగా వచ్చిన ఊర్ధ్వభూమికలోని వెల్గులు.

ఈ ఆధ్యాత్మిక సమాజం కేవల భౌతికయాంత్రిక సమాజంగా పరిణామం పొందిన సమాజవైఖరి వేయిపడగల ఇతివృత్తం కనుక చతుర్విధ పురుషార్థ పూర్ణమానవుడు ఆ పురుషార్థమైన కేవల కామ, కేవల అర్థ మానవుడుగా పొందిన పరిణామానికి కవిపడ్డ దుఃఖమే - ధర్మారావుగా రూపొందింది.

కాబట్టి ఈ జీవునివేదన కి రెండంచు లున్నాయి. వారి సాహిత్యమంతా ఈ విధంగా సమన్వయించుకోవాలి. కల్పవృక్షంలో వర్ణింపబడ్డ దివ్య ద్వంద్వ వియోగమే మహాజీవునివేదన. ఎందుకంటే, సకల యుగాల్లో సకల జీవద్వంద్వ వియోగబీజ మది.

ప్రతిపాత్రా మరణసమయంలో ఆవేదన పొందినట్లు వర్ణింపబడటం దీని కోసమే. ప్రతి జీవునిలోనూ ఈ ఆధ్యాత్మిక వియోగ దుఃఖముంటుంది కనక తెలిసినా-తెలియకపోయినా, అదే పరిణామశీలం. అది లేకపోతే మానవావిర్భావం జరిగేదే కాదు సృష్టిలో. అమీబా - అలాగే వుండిపోయేదే.

దీన్నే కరుణరసమన్నాడు భవభూతి పాశ్చాత్యులు spiritual pathos అన్నారు. పదకవితలో భక్తులనుభవించిన భగవద్వియోగమే ఈ కరుణరసం. అద్దే కవితా బీజమని విశ్వనాథ కరుణ రస వ్యాఖ్యానంలో అన్నారు.

కళ ఆధ్యాత్మిక భయనివృత్తి కోసం పుట్టినదన్న వాదాన్ని జర్మన్ తత్త్వశాస్త్రవేత్త వోరింగర్ అన్నాడు. బృహదారణ్యకంలోవున్న విషయమే ఇది. ప్రళయార్ణవంలో ఏకాకిగా వున్న హిరణ్యగర్భుడు భీతుడై తోడుకోసం శత రూపను సృష్టించుకున్నాడు. ఈమే మూల ప్రకృతి సర్వజీవ మహాగర్భం, అనేక రూపాలు కలది శతరూప ఆదే సృష్టి శబ్దాన్ని వేదం సహస్రాక్షరావాక్కుగా చెప్తుంది. పురుషసూక్తం సహస్రశీర్ష పురుషునిగా విరాట్పురుషుని వర్ణిస్తుంది. కనుక శత - సహస్ర - ఇవన్నీ నానా రూపాలుగా వున్న సృష్టి ప్రతీకలు గర్భంలో లీనమైవున్న దాన్నే తిరిగి సృష్టించుకుని భయాన్ని పోగొట్టుకొన్నాడు హిరణ్యగర్భుడు. విశ్వనాథ - అరణ్యకాండలో లక్ష్మణుడు హా లక్ష్మణా! యన్న అపశ్రుతి విని సీత విలపించి నిందించి మరదిని రామ రక్షణార్థం పంపించి— తర్వాత ఒంటరితనానికి భయపడినదని చెబుతూ—

'ఒంటరియై ప్రజాపతియు నూరక భీతివహించి తోడు వాల్గంటిని సృష్టి చేసెనట-' అన్న పద్యంలో అశతరూపా వృత్తాంతాన్ని తెచ్చి ఎందుకతికినట్లు?— కాబట్టి జీవగతంగావున్న భాలుని అపనయించుకోవటానికి—శతరూప-శబ్దాన్ని-కళను-స్త్రీని సృష్టించుకొని - ఆ తాత్త్వికభయాన్ని పోగొట్టుకొంటున్నాడు నాటి నుండి మనిషి. ఇదే వోరింగర్ చెప్పింది.

16వ శతంలో ఎల్ గ్రెకో - The Burial of Count orgag - అన్ని బొమ్మ గీశాడు. దాన్ని వివరిస్తూ రీడ్ - అంటాడు 'షేక్స్పియర్ కింగ్ లియర్‌లో సృష్టించలేని ఆధ్యాత్మిక కరుణను ఈ బొమ్మలో చిత్రీకరించాడు చిత్రకారుడు!' అన్నాడు. Religious Pathos అని ఆయన మాట. ఇదే భవభూతి కరుణరసం. అది నవరసాల్లోని కరుణ కాదు. ఆధ్యాత్మిక సంవేదన.

కాళిదాసు రమ్యాణి వీక్ష్య - అన్న జగత్ప్రసిద్ధ శ్లోకంలో కళా దర్శనంతో ప్రేక్షకుడు పర్యుత్సుకుడౌతున్నాడు. ఎందుకంటే "తచ్చేతసా స్మరతి నూన మబోధ పూర్వం। భావస్థిరాణి జననాంతర సౌహృదాని" - అన్నాడు కళాదర్శనంతో జీవగతమైన (మానవుని లోలోపలి చేతన - Phyche) పూర్వ జన్మ పరంపరాగత సంస్కారాలు కదలి - వాటిని గుర్తుతెచ్చుకోవటానికి ప్రయత్నిస్తూ - గుర్తురాక - తెలిసీ తెలియక సుడిలో చిక్కి పర్యుత్సుకు డౌతున్నాడన్నాడు. ఈ శ్లోకంలో స్మరతి-ని వ్యాఖ్యానిస్తూ అది స్థాయి భావ స్మరణమని గుప్తశ్రీపాదులు రససిద్ధాంతాని కిదే భూమికగా వ్యాఖ్యానించారు.

గీతా బోధాంతంలో శ్రోత అర్జునుడు.

''స్మృతిః లబ్ధ్వా - నష్టో మోహః'' అన్నాడు ఈ స్మృతి - పైశ్లోకంలో స్మరణగా వచ్చింది.

స్మృతిముపాస్వ - అన్నది ఉపనిషత్తుల్లోని మాట. స్మృతి నుపాసించు అంటే జన్మ పరంపరలు దాటి మనిషి భగవంతుని నాభీకమలంగుండా స్వస్థానాన్ని పొందటం తన యదార్థ స్వరూపం original face - జెన్ బౌద్ధంలోని మాట - పొందటం. దాన్ని స్మరించటం.

ఇలా జీవునివేదన ఒక ఆధ్యాత్మికస్మరణ. దాని బాహ్యరూపం సర్వ మానవ సుఖదుఃఖాలతో తాదాత్మ్యం పొందే లక్షణం

తెలుగురాజులో వాసంతి నట బ్రహ్మ సారథిని ప్రశ్నిస్తుంది. ''నీకీ విద్య ఎలా వచ్చింది" అంటే అతడు ''నీ చుట్టూ వున్న వారి సుఖదుఃఖాలలో సమైక్యం పొందితే వస్తుంది. దుఃఖం హృదయ దఘ్నంగా అనుభవించగలగాలి. ఇది అందరికీ చేతకాదు" అంటాడు. కాబట్టి మామూలు సానుభూతి కాదు. బుద్ధదేవుడు పొందిన Psychic Compassion తప్ప భౌతికమైన జాలి కాదు. చచ్చిన పిట్ట కోసం దుఃఖించే పిట్టతో తాదాత్మ్యం పొందిన వాల్మీకి నోటినుండి కవిత్వం పుట్టింది. కనుకనే—

"ఒక్క వాల్మీకి గాక వేఱొక్క డెవడు
సుకవిశబ్ద వాచ్యుండు" - అన్నాడు విశ్వనాథ.
జీవ సంవేదన - ''కరుణ రసం - అనేకరసాలుగా
వివర్తం పొందుతున్నది సముద్రంలో నీరు - తరంగాలుగా
తుంపుర్లుగా - నురుగుగా - వివర్తం పొందినట్లు''

అన్నాడు భవభూతి. ఈయన మండనమిశ్రుడంటారు. శ్రీ శంకరుల శిష్యుడు. కనుకనే అద్వైత సిద్ధాంతంలోని వివర్తశబ్దం ప్రయోగించాడు. అది చాలా శాస్త్రీయమైనది. విశ్వనాథ కూడా అద్వైతే కదా?

ఇందుకని - కరుణరసాత్మక మహాకావ్యాన్ని వ్రాయవలసి వచ్చింది విశ్వనాథ. వారు శాంతంగా పరిష్కరించినా దానికీ ఆధ్యాత్మికమైన జీవుని వేదనే మూలకారణం.

కాబట్టి సామాజిక - వైయక్తిక - ఆధ్యాత్మిక భూమికల్లో అన్వయించేది ఈ జీవుని వేదన.

*

# విశ్వనాథ భావుకత

## —అవధాన సరస్వతి శ్రీ పేరాల భరతశర్మ

'భావావేశం కపి లక్షణం మనస్సే కపి. అది ఎగిరి గంతులు వేసి నప్పుడల్లా కలిగేది మత్తే! ఆ మత్తే ఆనందం అనుకునేవాడు కపి. అది ఆనందం కాదు; ఆవేశం. దాన్ని అదుపులో పెట్టుకోవాలన్న మనసుపై అదుపు కలవాడు కపీశ్వరుడు. మనస్సే కపి. దానిపై ఈశ్వరుడే కపీశ్వరుడు. కపియైనవాడు కపీశ్వరుడెలా అయినాడో నిరూపించిన కాండ కంటె సుందరమైనకాండ మరింకే ముంటుంది? అందుకే సుందరకాండ సుందరకాండ!'' ఒకప్పుడు సుందరకాండ గురించి నాకలా అనిపించి వ్రాశాను. (నా సుందర కల్పవృక్షం-పే. 39) విశ్వనాథ భావుకతలోని రహస్యమిదే అనిపిస్తుంది.

గిరికుమారుని ప్రేమ గీతాలలోనైనా రామయణ కల్పవృక్షంలోనైనా ''అకృత్రిమ భావనా నిశ్చితాత్మ''తో ఆయన కనిపిస్తాడు.

''నీ వనంత భావాలయవై విశాల
భావ సామ్రాజ్య మేలుచున్నావు దేవి!
నీ కృప నదెంత భావమేనియును సుపరి
చితమ యట్టుల దోచు నా చిత్తవీథి-''
....  ....  ....  ...  ....

''నీ వియోగమ్మంటంచునే నిక్కువముగ
నెఱుగనే యెఱుంగను నాదు హృదయసీమ
నీవ కృత్రిమ భావనా నిశ్చితాత్మ
వెల్లపుడు మూర్తి కట్టితివేయటనుము''—

''నీవకృత్రిమ భావనానిశ్చితాత్మవు'' - సత్యమైన, సహజమైన అనాదియైన అనంతమైన భావనచే ఆమె నిత్యమైనదే. యధార్థమైనది. ఆ యధార్థ భారతి తనకు నిత్య ప్రత్యక్షమైన రతీదేవి. ''యం బ్రహ్మాణం వాగ్వైశ్యైవాన్వవర్తత'' అని భవభూతి చెప్పుకొన్న సరస్వతి యిట్టిదే!

మహాకవులకు సరస్వతీ ప్రసన్నత యన్నది ఎలా వుంటుందో సామాన్యులకు అనుభవంలో ఉండే విషయం కాదు. అది మహాకవికే తెలియాలి. తెలిస్తే ఆ మహాకవే చెప్పాలి ఆ చెప్పడానికి ''అకృత్రిమ భావనా నిశ్చితాత్మ'' ఉండాలి. అట్టి యాత్మతో సరస్వతితో అద్వైతమును సిద్ధింపజేసికొనిన మహాకవి విశ్వనాథ. ఆయన కవితా జీవితారంభమే యిట్టి భావనా బలంతో ప్రారంభమయింది.

ఇట్టి భావనాబలంతోనే ప్రకృతిలోని "అనిర్వాచ్య మనోజ్ఞతా మధురిమలు" చవి చూచాడు.

తన భావానికి అంచులు కట్టి ఒక పరినిష్ఠితమైన రూపంలో దానిని మాటలలో మూర్తి కట్టించిన వాడాయన. దానికి వైశ్వనాథీయమైన ముద్ర వుంటుంది. "బాణోచ్ఛిష్టం జగత్సర్వం" అన్నది విశ్వనాథ పర్వంలో అంతగా వర్తించదు.

''నాసకలోహ వైభవ సనాథము సాథకథన్ రచించెదన్'' అన్న విశ్వనాథలో ఏ అనంత విశ్వకవితా ప్రపంచమున్నదో మన మూహించలేము ఆయన భావనలో కవిమాత్రుడు కాడు - భావుక పరమేశ్వరుడు.

"సూర్యుడను నేను - ప్రాగ్దిశా సుందరీ ము
ఖారవింద సుందర తిలకాకృతినయి
యుదయమందితి నాకోస మెదురుచూచె
విడిలురేకలు నీ ప్రొద్దుపొడుపు పూవు.

"ఓ దయాస్త నగంబు స్వీయోజ్జ్వలిత పి
శంగ వర్ణ సుందర దశచ్ఛవులచేత
నామెయును ముగ్ధ శిశిర కరాలి నేను
ఒకరి నొక్కరు మనుసరించికొనినాము.

మా పరస్పరాలోచన మధుర దీర్ఘ
రమ్యసుందరాపాంగ సూత్రములచేత
ననిల పథములఁ దేజోమయమ్ములైన
ముఖ్నపడెఁ బృథివ్యాకాశములకు నేడు."

తన కవితా యాత్ర ప్రారంభములో ప్రథమ దశలో "గిరికుమారుడు"గా విశ్వనాథ స్వరూపమది. విశ్వనాథ సీతారాముల స్వరూపము కూడ ఇదే.

జీవితమంతా ఒకే లక్ష్యంతో ఒకే పథకంతో ఒకే జవంతో ఉద్దీప్తమైన హృదయమది కాలానుగుణమైన తన విశాల దృష్టికి భూమ్యాకాశములు పట్టవు.

విశ్వనాథ సాహిత్యమంతా ఆయన హృదయావిష్కారము.

"అందఱవలె మాటాడడు
అందఱవలెఁ జేయఁదేదియైననుఁ దన యా
త్మం దెచ్చి యొలుకఁ బోసిన
చందమ్మున పలుకుఁజేయు సర్వము తానై".

కల్పవృక్షములోని రాముని లక్షణము విశ్వనాథ ఆత్మీయమే. చిన్ననాటి గిరికుమారుడు, పెద్దయైన కవి సమ్రాట్టూ మొక్కలోనుండి ఎదిగిన మహా వృక్షమే. ఈ మహావృక్షమంతా ఆ తొలిపాదులోనిదే. తాను పుట్టిననాటి లక్షణమే కాదు - ఆ నేల ''ఎంత పౌరాతన్యమేదికొనినదో'' దాని నుండి తాను ఎదిగిన లక్షణములో నుండి ''భావిసంపన్న కవుల''కు తాను అందించిన ఫలములలో ఏ బీజములు కావలెనో వానిని మరి కొన్ని వేల సంవత్సరములకు సరిపడునంతగా ఫలింపజేసికొన్న కవి ఆయన.

తాను పుట్టిన కాలమే కాలమన్న భావన కాదు. తన ముందు కాలమున్నది. ఆ మధ్యనున్న తాను వెనుకకు చూచి ముందుకు ఎలా విస్తరించవలెనో అలా విస్తరించిన కవి ఆయన కాలములో పుట్టి కాలముతో పెరిగి కాలముతో కలిసి ప్రవహించినవాడే కలకాలము నిలువగలవాడు. కనుక ఏ కవియైనా తాను కాలముతో నిలబడవలెనంటే కాలమునకు దాసుడు కాక తప్పదు. అటువంటి కాలదాసులు - కాళిదాసులు - ద్విత్రా పంచషావా. ఏ ఇద్దరో ముగ్గురో! మహా అయితే ఐదారుగురు.

''నేనీ సర్వనదీ గుహల్ తిరిగితిన్ నీకై మహాదేవికై''

"ఇదియెల్ల జనస్థానము
నదీగిరిగుహా సమూహ నానాక్లేశా
స్పదమైన శిలదేశము
వెదుకవలయు నంగుళంబు విడువక స్వామీ''— అరణ్య-శబరి-153.

ఇవి ఏదో కథాగత సందర్భోచిత విశ్లేషణలే కావు వీటిలో విశ్వనాథ హృదయగత లక్షణము మనము గమనించవలె The poet speaks through his books.

ఆయన కవితలో భావన అంతా అనంతకాలమును గూర్చి, విశాల విశ్వమును గూర్చి. సంకుచిత పరిధిలోనిది కాదు ఆయన సనాతనత్వము. అది సదాతనత్వము. కొన్ని విలువలు సదా నిలిచి ఉండేవి. కొన్ని తాత్కాలికములు - మానవ సమాజము కవి కాలమునకే పరిమితమైనది కాదు - సమాజ శ్రేయస్సు కొఱకే కావ్యమన్నది - అనాదిగా ఉన్నదే- విశ్వశ్రేయః కావ్యమ్ అన్నది. దీనిని గురించిన భావనలో సమగ్రత ఉన్నది మానవుణ్ణి పీడిస్తున్నవి ఆకలి సమస్యలు, ఆవరణ సమస్యలే కావు - దయాదాక్షిణ్యాలు, శాంతి సౌఖ్యాలు, దుఃఖాలు, వేదనలు - ఇవన్నీ మానవుడి మనః ప్రవృత్తిని తీర్చిదిద్దేవి.

వీటి విషయంలో విశ్వనాథకు అఖండమైన కాలానికి సమన్వయించే భావన ఉంది.

ఆయన కలియుగ ప్రారంభం నుండి ఈనాటివరకూ పరిణతి చెందిన సమాజాన్ని దర్శించిన లక్షణం పురాణవైర గ్రంథ పరంపరలో వ్యక్తమౌతుంది. ఆధునిక సమాజానికి కూడా రామకథ అవసరమేనన్న భావనలో నుండే కల్పవృక్షం ఆవిర్భవించింది. ఆయన కల్పవృక్షంలో కవితారూపమైన తపస్సుతో పొందిన దర్శనాన్ని విశ్లేషించాడు.

హడ్సన్ చెప్పిన సాహిత్య లక్షణం యథాతథంగా విశ్వనాథలో మనం గ్రహించగలం.

"It is the utterance of one who has himself been close to those aspects of life of which he speaks, who has looked at them with his own eyes, who by the keenness of his vision has seen more deeply into things and by the strength of his genius has apprehended their meaning more prowerfully than the common race of men, and who in addition has the artist's wonderful faculty of making us see and feel with them" — Quote - "An Introduction to the study of Literature" by Hudson.

తానొక కథ చెప్పినా, ఒక సన్నివేశాన్ని కల్పించినా, పాత్రను పరిచయం చేసినా, సంభాషణలు పెంచినా, బహు విషయముల అనుశీలన అందులో వుంటుంది.

"చిన్న కథఁజెప్పి నీకు నీచేతనొక్క
యే మహాకార్య మేనుజేయింతు"- కథ చెప్పటంకాదు, దాని ప్రయోజనం ప్రధానం - వ్రాసిన రామచంద్రు కథనే వ్రాయుట - మరల రామాయణమే వ్రాయుట వాల్మీకికోసం కాదు - మనకోసం - మానవులకోసం. సమాజ శ్రేయస్సు అన్నది మానవుడి వివేకంపైన ఆధారపడి ఉన్నది. "It is the utterance of one who has himself been close to those aspects of life of which he speaks'' - నిశితమైన ఆలోచనలో నుండి కవి వాక్కు ఆవిర్భవిస్తుంది. అదే ఋషి లక్షణము. ''నా నృషిః కురుతే కావ్యమ్" - అన్న దానిలో నెంత సత్యమున్నదో దాని వివరణమే Hudson చెప్పింది పలుమార్లు విశ్వనాథ మనకు గుర్తుచేసినదీ అదే—

''ఈ ఋషులెవ్వరు చెప్పిన
సారకథా కథన యొక్క ఛాయనె నడచున్.
వీ రంతర్ద్రష్టలు బహు
దారూపిత సూక్ష్మతర కథాంశులు సుమ్మీ''— (బాల - ధనుస్సు 273)

Who has looked at them with his own eyes, who by the keenness of his vision has seen more deeply into things.... ఈ మొదలైన లక్షణాలన్నీ కవి భావక భావ్యమానమైన వస్తువునందు సిద్ధించే రమణీయతకు మూలములు-అందుచేత ముహుర్ముహుర్భావితమైనప్పుడు చర్వణచేత క్షణక్షణ వినూతనంగా కనిపించే భావన విశ్వనాథ కవిత యొక్క రమణీయతను తఱుగుపోనీయదు 'సకలార్థ ప్రవిభాగ దీపరిణత స్వద్భాత్మకా!' అని మునులు రాముని ఆలోచనా సరణిని అభినందించినప్పుడు మనకు పాత కాలపు రామకథ కాదు, నేటి మన కథలోనిదిమర్మం మనసుకు పట్టుంది. ఉపన్యాసాల వల్ల తేలే విషయం కాదిది. అసలు కవి ఏమి చెప్పాడు అని చూడాలి. ఆయన సాహిత్యం క్షుణ్ణంగా అనుశీలించాలి. సమర్థులు ఆ పని చేయాలి. ఆయన జీవితాన్ని విశ్లేషించిన తీరు అవగాహన చేసుకోవాలి.

"విద్యకుఁ బరమ ప్రయోజనమైనది విస్పష్టమై స్వచ్ఛమైన భావోదయము గలుగఁజేయుటే. చదువునకు ప్రధానమైనది స్వచ్ఛమైన భావము నెఱుగుట. అట్టి భావము ఇంద్రియముల యొక్క చక్కని శిక్ష చేతగాని యుత్పన్నముకాదు. ఇది సంస్కారము పొందుటకు చెప్పబడుచున్న విద్యగాన శ్రవణనేత్రేంద్రియ ముల ద్వారా మనస్సును బరిపక్వదశకుఁ దెచ్చుటయే దీని విషయము"........ "ఇంద్రియములకుఁ జక్కని శిక్ష కలుగవలయునన్నచో భావానుగుణమైన సంగీతము, భావాభిరామమైన కవిత్వము నేర్వవలయును. లేదా తెలిసికొనవలయును" ...."నిర్బంధ విధానమని యక్షరములు నేర్పుటకన్న ప్రస్తుతమున్న యధోగతి నాటకములు, దౌర్భాగ్యపు సినిమాలు మానివేసి వాని స్థానమున నర్థవంతము లైన నాటకములు, సినిమాలను జూపించు మనుము" (వేయి పడగలు - 17వ అధ్యా.-544 పే - 12th edition - 1976)

విశ్వనాథ ఆధునికీకరణమునకు వ్యతిరేకి అని, మానవ పురోగమనాన్ని ఆయన సహించలేదని, క్రొత్త వికాసమును యంత్రనాగరికతను ఆయన తిరస్కరించినాడని ఒక అప్రతిష్ఠ ఆయనకు ఉంది. ఆయన కాదన్నది దేనిని? సినిమాను కాదు, దానిలోని భ్రష్టతను, ప్రగతిని కాదు, ప్రగతిలోని తొట్రుపాటును. ఆయన భావనలో ఆయనకు పట్టినది ఒక్క భారతీయుల భ్రష్టతేకాదు — ప్రపంచములోనే నాగరకతా విజృంభణతో వచ్చిన భ్రష్టత ఆయనకు గిట్టలేదు. సుసానీ రంగారావుకు సన్నిహితురాలగుటలో ఆయన సమర్థించిన విషయం మనం పట్టించుకోము. ఆయన స్త్రీలోని ఆర్ద్రతను గుర్తించినంతగా జాతిని గూర్చి పట్టించుకోలేదు. "సుసానీ యధునాతన నాగరకత సంపూర్ణముగా వికసించని ఇంగ్లీషు పల్లెటూరిపిల్ల. ఈ నాగరికత విజృంభింపక మునుపు ఆంగిలేయ స్త్రీలును గొంత వఱకు భారతదేశపు స్త్రీలవలెనే ముగ్ధలు, వినయవతులు కాబోలు! రంగారావు జేన్ ఆస్టెన్ వ్రాసిన 'పెర్సుయేషన్' అన్న నవల చదివెను. అందులోని కథా నాయికయే భారతదేశములోని యొక మహాకావ్య నాయికకుఁ దత్త్వములో నేమి భేదమున్నది? రంగారావునకు సుసానీ యెడల సమాదరణ కలిగెను." (వేయి పడగలు - 32 వ అ.334 పేజీ)

మనుష్యులను గూర్చి జాతులను గూర్చి దేనిని గూర్చిగాని ఆయన భావనలో ఒక తాత్త్వికతా లక్షణం మనం గమనించగలము.

ఆయన రచనలు చదువుతున్నప్పుడు మనలోనుండి మనం ఏదో భావిస్తున్నట్లుంటుంది ఎవరో ఋషి మనలో చేరి లోపలినుండి మనతో మాట్లాడుతున్నట్లు ఉంటుంది మన అంటే అందఱూ ఒప్పుకుంటారో లేదో! నాకు అలా అనిపిస్తుందన్నది సత్యము. వచనమైనా అంతే, పద్యమైనా అంతే. భావన అన్నది కవి భావనగానే ఉంటే మనం ఆ భావాన్ని పట్టించుకోలేము. కాని విశ్వనాథ ఆ విషయాన్ని భావించిన క్షణాల్లో ఎలా వుండి వుంటాడో అలాంటి స్థితిలో ఆయన చెప్పిన మాటలు చదువుతున్న క్షణాల్లో మనం అట్లా అయిపోతున్నామా? అనిపిస్తుంది. వేయిపడగలులో ఒక సాయం వర్ణన :

''అనాడు ప్రొద్దుకుంకెను. యుగయుగమ్ముల నుండి క్రుంకిన యాప్రొద్దు తానేమి క్రుంకినట్టు? ప్రాతఃకాలములో సాయంవేళ యున్నది. ఉదయములో నస్తమయమున్నది. అస్తమయములో నుదయమున్నది. ఉదయాస్తమయములు రెండును ద్వంద్వము. ఆ యస్తమయమును తాత్కాలికమే; నిత్యమైనదికాదు. అది శోచనీయము" (వే ప. 13 అ. 375 పే )

"ప్రేమ చాల విచిత్రమైనది దానికన్న మక్కువలేదు; నీళ్ళలక్కఱలేదు. ఎడారిలోఁ దిండిలేక యొంటరిగా చచ్చుచున్న రెండు పక్షులు కూడఁ క్రమక్రమముగా మేనులయందు శక్తి క్షీణించుచు చావు నిశ్చయమైన వేళయందు నేత్రములలో ప్రేమతోనే చచ్చును" (వే.ప. 8 అ. 205 పే.)

నిజానికి విశ్వనాథకు తన దేశం మీద అంత ప్రేమ ఉన్నది. తన జాతి అంటే అంత అభిమానమున్నది. ఆయనకు భావనకు ఒక వస్తువని నిర్దిష్టముగా ఏదీ అక్కరలేదు. ఆయన భావనలోనికి వచ్చిన ఏ వస్తువైనా దానికి వైశ్వనాథీయమైన ఒక నిర్దిష్టత సంపన్నమౌతుంది.

"కిన్నెరసాని" అందుకు ప్రత్యక్ష నిదర్శనం, ప్రపంచములో ఒక వాగు ఇంత చరితార్థతను పొందినదా అనిపిస్తుంది. Shelly కి ఉన్న Myth making faculty ని తలదన్నిన విశ్వనాథ ప్రజ్ఞానిష్యందంలోనే 'కిన్నెరసాని' రూపొందింది. ఒక మేఘసందేశమును కూడ మించిపోయినదంటే అతిశయోక్తి కాదు. పచ్చి తెలుగుదనం విచ్చుకొన్న కవి భావం ఒక పూలతీవె అయితే దాని పాదులో పరవళ్ళు త్రొక్కిన రసనిర్ఝరి కిన్నెర. "The old man and the sea" అన్న హెమ్మింగ్టన్ రచన నోబెల్ బహుమతి పొందినదంటే అది ఇంగ్లీషు మహిమ. తెలుగు భాష తెలియని వారి నిర్ణయంలో వారిదోషం లేదు. అంత

గొప్ప రచన. హెమ్మింగ్టన్ తెలుగువాడై పుట్టివుంటే, ఆ రచన తెలుగులో వుంటే ఆ గుర్తింపు ఉండేదా? దానికేమిగాని! భావుకతయొక్క పరాకాష్ఠ కిన్నెరసాని కల్పనలో ఉన్నది. కిన్నెర రూపభావనలో ఉన్నది. లయలో ఉన్నది. గతిలో ఉన్నది. శ్రుతి కలిసిన మతిలోని రతి అది. రసమునకు రసత్వము కల్పించిన రచన అది.

"తెలితారకల వెంట వెలుగులా తోచింది -
తలిరుపూవుల వెంట తావిలా తోచింది -
తెలుగు పాటల వెంట తీపిలా తోచింది."

హృదయమున్న కవికి ఏది కవితా వస్తువు కాదు! ఆ మధ్య నేను ఒక చమత్కారమైన మినీకవిత హిందూ పత్రికలో 11-7-93 న చదివాను. "Wanted Theme" అని దాని శీర్షిక. రచయిత R.W. Gilbert - Hindu - Sunday Magazine.

"Give me a theme" the little poet cried.
"And I will do my part"
"It's not a theme you need" the world replied.
"You need a heart."

నిజమే! కథా వస్తువు కాదు కవికి కావలసింది - హృదయము! హృదయము!!

ఆ హృదయమే విశ్వనాథుని విశ్వనాథునిగా చేసింది. ఏ ఒక్క రచనలోనో కాదు, పద్యములోనో కాదు - అక్షరాక్షరములో విశ్వనాథ హృదయ స్పందన మన అనుభవ విషయంగా ప్రతిస్పందిస్తుంది. "అర్ధనిమ్నగు చిత్తవృత్తుల పురాభవ సంస్కృతి" అది. "ఆత్మ సాహిత్య పరమ సూక్ష్మ రస బిందురూప!" అని పరమేశ్వరుని కనుగొన్న హృదయమది.

"ప్రాణముల్ బయటికి వచ్చి ముగ్ధాకార
మెనయించి దర్శన మిచ్చినట్లు,
తన సృష్టిలోని యుత్తమభావ మానంద
ముగఁ బొంగి బింబమై పొడిచినట్టు"లు - బాల-ధనుస్సు - 299.

ఇది సీతాముఖచంద్రుని పొడగన్న రాముని తొట్టతొలుతటి అనుభవము. భావమును రూపు కట్టించుకొనుటలో విశ్వనాథ అనుభవమే యిది

దశరథునికి తన నలుగురు బిడ్డలలో రాముడే ప్రాణము. ఇది ఏ కవి యైనా అనగలడు. కాని విశ్వనాథ ''ధాత్రీధవు నాత్మవృక్ష మిగురించిన నల్వురి లోన స్వామి శోభాధుని'' అంటాడు ఇది కవితా భాషకాదు - హృదయ భాష. సీత ''ధాత్రీద్రవ్య మహా పరీమళసనాథ'' అంటాడు - బాలకాండలోనే. ఇదే భావము సీతను గుర్తుపట్టుటలో హనుమ హృదయాన్ని విచిత్రమైన అనుభూతిలో ఆనందింప చేస్తుంది—

''ఈ యమ భూమిసంభవ మహీగత సర్వపరీమళమ్ము ఈ
తోయజలోచనా పఘన తూర్ణ చరాణు వితాన సంభృతం
బై యెసలారు నీమెకనులందున పార్థివ వృత్తి మాని యం
భోయుతవృత్తికా విరియబూచిన మల్లియతావి యొప్పెడున్.''

ఈ ఒక్క పద్యము చాలు - భావుక పరమేశ్వరుడైన విశ్వనాథ రామ కథా భావనలో ఎన్ని రహస్యాలు నిక్షేపించాడో తెలుసుకోడానికి. పరమేశ్వర ధ్యానములోని అనుభవ పారమ్యమే రామకథకు వలసిన సర్వకవితా సంభారాన్ని విశ్వనాథలో ఆవిష్కరించినది.

కాననములో పారిజాత తరురాజి ''మనోజ్ఞభావనా విలసితయౌ ననుగు ప్రేయసివోలె" ఉన్నదిట. అందుకు కారణము - ప్రొద్దుటింతల, దిననాథుడు నడిమింటనున్న వేళ; ప్రొద్దుకుంకిన వేళయని లేక ఎప్పుడూ పూలతో పక పక లాడుతూనే వుంటుందిట పారిజాత తరురాజి. ఇందులో సుందరమైన భావన ఉంది. విరహియైన వాని మనసులోని రసమయ లక్షణం ఉంది. అసలు ఆ చెట్లకు ఆ పూవులకు అంత అందమెక్కడిది? ''కనంబడని స్వర్గమునందలి సౌఖ్యము ఊహ సుందరము''ట ఎంత సుఖంగా ఉన్నదంటే - అది స్వర్గమంటే అంటాం. స్వర్గం చూచినవాడెవడు? ఆ సుఖం అనుభవించివచ్చి చెప్పిన వాడెవడు? అంతా ఊహలోనే వుంది. ప్రకృతిలోని ఏ సౌందర్యమైనా ఊహించిన వానికి ఊహించి నంత. ఆ పూవుల తావియూ అంతే. ఊహకొలంది స్వాదు సుందరము. ఊహిం చిన కొలది అందులో కమ్మదనముంది. ఇంతకూ ఆ పారిజాతాలు అవి ''తెలి రేకులు ఎఱ్ఱ తొడిమల్ నున్నుమల్లెల కంటె నందముల్'' కల పారిజాతాలు.

ఈ సుందరత అంతా కవి వూహలోని మృదువైన రీతిలో ఉన్నది దీనికి మూల మైనది ఏమిటి? "అకృత్రిమంబయిన నాస ప్రధాన గుణంబు చుట్టమై" - నాస అంటే నాసిక - దాని ప్రధానగుణము గంధము - పృథివి గంధవతి-పృథివీతనయ సీత - ఈ వాసనలకు తనకూ నింత చుట్టరికమున్నది. తనయందు పృథ్వీజము లనుగూర్చిన ఈయనుబంధము సహజము. ఇంత భావనలోనుండి పుట్టినపద్యము లు పద్యములా? రాముడు సీతా విరహములో పద్యములు పాడుకొన్నాడా? హృదయ గతమైన విరహవేదన వినోదనము ఆయనలో ఎలా వుంటుంది? ఊహించిన కొలది అందులో రుచి వుంది. "ఊహకొలంది స్వాదుసుందరము" రామకథను ఆ విధముగా సుందరముగా ఊహించిన వానికి ఊహించినంతగా ఆనందాన్ని యిచ్చేదిగా మలచుకొన్నాడు. "తనదైన అనుభూతి తనది"గా. అది మనదిగా కావలెనంటే కావలసినంత ఆధారమక్కడ ఉంది. ఆయన పద్యాన్ని మనం punctuate చేసి చదువుకోవాలి. ఆ విరుపులు, ఆ ఒదుపులు కనిపెట్టి పద్యమును ఊహ మార్గములో విప్పుకోవాలి అప్పుడు ఉత్పలమాలలు, చంపకమాలలు విడి విడి ముక్కలుగా సొగసుగా పరిమళిస్తాయి. పై ఊహ చెప్పిన పద్యాలు:

"అలఘులు పారిజాతములు - అనార్తవమీతరురాజి - ప్రొద్దుటిం
తలనుచులేదు - కాదు, దిననాథుడు తానదిమింటనుండెనం
వలయదు - ప్రొద్దుక్రుంకిన దటంచును లేదు - మనోజ్ఞ భావనా
విలసిత హేలయౌ ననుఁగు ప్రేయసివోలె సదా సుమాకృతిన్."

(—కిష్కింధ - నూపుర - 14.)

ఇందులో తెలియని పదములేమీ లేవు. ఇక్కడ అర్థము కానిది లేదు. కాని ఊహ అందుకోవడానికి - ఆయన వాక్యవిన్యాస వైఖరి మనం గమనించాలి అంతే!

"మరి తెలిరేకులు - ఎఱ్ఱతొడిమల్ - నునుముల్లెలకంటె నందముల్
పరువములై - కనంబడని స్వర్గమునందలి సౌఖ్యము - ఊహసుం
దరమయినట్టులు - ఈ పువులతావియు - నూహకొలంది స్వాదుసుం
దరము - నకృతిమంబయిన - నాస - ప్రధాన గుణంబు చుట్టమై."

ఇక్కడ నాస ప్రధాన గుణంబు - ఘ్రాణేంద్రియమునకు గుణము గంధము అన్నది తెలియక రామకథ చదువునంతటి వారు సామాన్యముగా ఉండరుకదా?

అయితే "నాస ప్రధాన గుణంబు చుట్టమై" వంటిది అర్థం కావడానికి వైశ్వానరీయమైన ఊహాసరణి పనిగట్టే లక్షణం ఒకటి పాఠకునిలో ఉండాలి. ఏ పూర్వ కవియైనా ఊహలు పెనవేసి పద్యమును ఆలోచనా ధారువుగా చేసినప్పుడు ఇట్టి రచన చేయకపోలేదు అది విశ్వనాథలో పద్య పద్యంలోనూ కనిపిస్తుంది. శ్రీకృష్ణదేవరాయల వారి పద్యంలో ఇట్టి ధోరణి ఉంది. తెనాలి రామకృష్ణునిలో ఉంది. నాచన సోమన్నలో మరొక విలక్షణత అయితే వారి కాలమునందువలె నేటి పాఠకుడు ఓపినవాడు కాడు, ఓపిక కలవాడు కాడు. అనేకమైన కావ్య సిద్ధాంతాలలో పద్యము రుచి తెలిసికోవడానికి ఈనాడు ఆ ఓపికకు అవకాశం తగ్గించుకుంటున్నాము ఈ స్థితి తెలిసిన విశ్వనాథ - కాలానుగుణంగా తన భావ సరణిలో ఆలోచనను ప్రేరకమైన దినుసులు పెట్టి ఆధునిక భావుకులను ఆకట్టుకొనే మార్గము ఒకటి తన శైలిలో సమకూర్చాడు. అందువల్ల thought provacation నచ్చిన వారికి విశ్వనాథ రామకథ చాల ఆనందాన్నిస్తున్నది. రాముని గూర్చి, సీతను గూర్చి వినూత్నమైన మార్గంలో వేదనిష్ఠమైన భావాన్ని అందించారు విశ్వనాథ.

"ఏపుగమంటి నుండి యుదయించిన మైథిలి మింటినుండి యా
వావముగన్న రాఘవుడు వచ్చి యుగద్వ్యములందునుండి ద్యా
వా పృథువుల్ సమాహరణభావము పొందినరీతి సంగమ
వ్యాపృతిఁ బండువెన్నెల మయంబుగఁ జేయుదు రాత్మ రోదసిన్."

(బాల. కల్యాణ - 180 ప.)

కావ్య పరమార్థ భావననుండి రూపొందిన భావమిది. రామాయణ కావ్య కథానాయకుడు రాముఁడు - ఆకాశ స్వరూపుడు సీత పృథివీ స్వరూపిణి. వీరి కలయికలో ద్యావాపృథువుల "సమాహరణ భావము" ఈ భావమును చర్వణ చేసికొంటే "ఆత్మరోదసి" "పండువెన్నెల మయ"మ్మే! విశ్వామిత్రాదులు పొందిన ఆ వెన్నెల మనం పొందగలమా? అంతదాకా పోనక్కరలేదు. మనము ఎప్పుడూ అనుభవించే వెన్నెలను గూర్చి ఏమైనా భావన చేయగలిగితే విశ్వనాథ రచన మరికొంత విపులమైన మార్గాన్ని చూపుతుంది. ఆ మార్గంలో మనకు "ఎడద విప్పు" కలుగుతుంది. ఆ విచ్చుకొనే ఎడద మనకు కలిగించే సుఖానుభూతి అది వెన్నెల అని మనకు చెబుతుండ. తాను భావించటం కాదు - మనలను భావింపచేసే మార్గములో తన మాటలు మనకందిస్తాడు. తన భావమును మన అనుభవములోని విషయముగా మలచి చెప్పటమే విశ్వనాథ కవితలోని మర్మము.

తాను చూడని సీతను తాను లంకలో హనుమ - ఎలా గుర్తుపట్టగలడు? ఆమె గుణములు తాను విన్నాడు. ''గుణములకున్ దొలగక యనుగుణమగు రూపంబు పొల్చుకొంచబు దివ్యద్గుణులకు''—

''వారిని గాంచినప్పటికి వారిని జూచినయట్లె యొప్పెడిన్''.

''కొందఱు మృణ్మయాకృతులు కొందఱు భావమయాకృతుల్ పరి
స్పందిత జీవలక్షణమె వచ్చి శరీరము దాల్చి పొల్చెడున్.
కొందఱు వారిఁ జూచుటయె గుర్తునుపట్టుట వారి సద్గుణా
లిందని వొందు భావ విమలీకృత చిత్రము తోడఁబోల్చినన్.''

.సుందర - పూర్వంత - 292.

వస్తుగతమైన గుణము - గుణమునుబట్టి రూపము - అవ్యక్తమైన రూపము వ్యక్తమగుటకు గుణవిభావన.

కవి భావము మనకు అవగతము కావనెనన్న మనము కవి భావనామార్గము తెలిసికొనవలసిన ఆవసరమున్నది - హృదయంలోని భావానికి మాటలతో రూపము కట్టించుటలో విశ్వనాథ శబ్దములు ఏరియేరి కూర్చినట్లే ఉండును.

''నిత్యవేగి నా చేతము శబ్దమేరుటకు చిన్నము నిల్వదు భావతీవ్రతన్''. అన్నదీ సత్యమే ఆయన శబ్దమేరడు - ఆయన భావతీవ్రతయే ఆ శబ్దములను నెట్టుకొని వస్తుంది. ఏ భావము యొక్క ఆవిష్కారము ఏ విధంగా ఉండాలి అన్నది - కవి హృదయైకవేద్యము - దానిని కూడ వివరించి మనకు మానవ స్వభావానుగుణమైన భావ సరణిని అక్కడక్కడ విశ్లేషించి చెప్తూనే వచ్చాడు.

రాక్షస స్త్రీల మధ్యనున్న సీతకు మొట్టమొదటగా తనమాట వినిపింప జేయుటకు ఆంజనేయుని ప్రయత్నము గమనించితే ఈ విషయము విశదమవు తుంది. తన మాటలు, తన ఉనికి రాక్షస స్త్రీలకు తెలియరాదు. సీతా హృదయ స్పృశములుగా ఉండాలి కోకిల కూజితము వలె ఆమె గ్రహించాలి ''రసవిహీన ప్రకృతులకు నిద్రామాంద్యంబ సంఘటించునదియు, రసారామవిహరణశీలురకు నధిక జాగ్రదవస్థా సంధాయకంబునునగు కంఠస్వరంబును గూడ జోడించి వృక్షశాఖాంతక్లినుండె సవ్వడి యేదో దూరము నుండి మరుత్తరంగముల పైఁ బయనించుచున్నట్లుగా నిట్లు వచించె". ఆ వచించినది 'మత్తకోకిల' వృత్తాలలో నిబంధించాడు.

"తమ్మి చుట్టపు వంగసంబున ధారుణీశుల శీలముల్
పమ్మి ధర్మపు బొడ్డులుందురు భావవేదులు సంయముల్........"

ఇత్యాదిగా పలికాడు వాక్ప్రయోగంలో విశ్వనాథ ఇంత విచక్షణుడు. శబ్దమేరుటకే కాదు- ఆ శబ్దమును శబ్దించుటలోని కంఠస్వర ప్రమాణమునుకూడ ఎరిఁయెరి - పలుకు- లక్షణమున్నవాడు ఇది గమనించి మనము ఆయన పద్యాల వ్యక్తీకరణలో అక్షరాల సవ్వడినుండి, పదాల పొందికనుండి భావన చేయాలి.

తన కావ్య పాత్రల ఆకృతులను భావింపజేయుటలో కూడ విశ్వనాథ రచన చిత్రకారుని కుంచెవలె పనిచేస్తుంది. "నీవు నిజంబుగ కపివేనా? వంచన కొలది వచ్చినావా?" అని ప్రశ్నించిన సీతతో ఆంజనేయుడు—

"నేను నిజంబుగా కపినె - నిర్భర దుఃఖపయోధిమగ్న! నా
యానన మింత భీకరము నౌటకు నా కపిజాతి లక్షణంబు''

ఇత్యాది పలికిన పలుకలు విన్న సీత - తీరును వచనంలో చెప్తాడు విశ్వనాథ. "అనిన హృదయగతాధిక ప్రశ్రయయు, ముఖప్రకటితాల్ప విశ్వాసయునై కించిదధరవక్రభావద్యోతకంబుగా నూచీ దృశాకాంతి ప్రసారంబతని కన్నులలో బొడుచుచున్నట్లతని యాత్మలోతులను త్రవ్వుచున్నట్లుగా నిట్లనియె" అంటాడు. ఇలా ఆకృతుల అనుశీలనలో మన మా కథాదృశ్యాలను చూస్తాము.

అసలు రామాయణ కథ అంతా తాను చూస్తున్న దృశ్యాలకు వాగ్రూప చిత్రాలు గీసినట్లు చేస్తాడాయన

"తానై చూచిన నేదికల్గునో హృదంతః ప్రీతి తత్ప్రీతి న
ట్లై నీకున్ ఘటియిల్లఁ జేయుటకునై యత్నంబు గావించు వాక్
స్థానం బావచియింపగాఁబడిన దాధారంబుగా నీవు చి
త్తానం జూచిన మాయలేడి దగు సౌందర్యంబు సువ్యక్తమౌ.''

—మారీచ. 257.

ఈ ''మాయలేడి'' - పైనబెట్టి భావుకతను గూర్చి చెప్పినవి విశ్వ వాఙ్మయమున కంతకూ వర్తించునవే ''బహిస్సౌందర్య దఘ్న రసికత సూక్ష్మ పరిశీలనా నిరాదరయని'' ఒక సిద్ధాంతం మన అవగాహనకు అందించాడు ఈ ఘట్టంలో.

ఒక భావమును రూపు కట్టించుటలో ఆయన పరిశీలన ఆయన మాటల లోనే మనం గమనించవచ్చు-

''ఆ పరిశీలనా మతియు అంతటి సూక్ష్మతమాభి దర్శన
వ్యాపృత బుద్ధి యట్టి విషయాభిముఖీనము హేతుకల్పనంబు
ఆ పదముందు లక్ష్మణుని యందున దక్కమటెందులేవు నా
హా పదివందలైన తలలైనను గల్గున వాని కెందునున్.''

లక్ష్మణుని గూర్చి యీ విషయము ఎంత యథార్థమో, రామాయణ భావనలో విశ్వనాథను గూర్చి అంత సత్యము.

"మౌని వాల్మీకి భాషా సంక్రాంత ఋణమ్ము" తీర్చుటకు ఆయన ఎంత సమర్థుడో ఆయనకే తెలుసు. "సత్కావ్య నిర్మాణరేఖా సామగ్రి"ని ఎలా స్వతంత్రముగా తీర్చుకొనవలెనో ఆయన కల్పవృక్షములో నిరూపించాడు.

"ఎంతటివాడు కావలయు నెప్పుడు యత్ప్రతిభావిశిష్టుడై
యంతటివాడు నేనగుదునప్పుడు తత్ప్రతిభావిశిష్టుడై"

అని అంజనానందనుడు చెప్పిన దానిలోని వ్యంజన విశ్వనాథ ప్రతిభా విశిష్టత.

"అలఘు స్వాదురసావతార ధిషణాహంకార సంభార దో
హల బ్రాహ్మీమయ మూర్తి"గా తన్నుతాను చెప్పుకొన్న కవి తన శక్తి తానెఱిగినవాడు. "చెలపి పదిసార్లు తిరుగ వ్రాసినను మొక్కవోని యీ కవిలోక మూర్ధమణుల మద్దురు స్థానములుగ నమస్కరించి" అని తాను చెప్పిన కవులందరి కన్న మిన్నగా తనయందు ప్రకృతి సహజముగా సిద్ధించిన "సకలోహ వైభవము" "సర్వ కవితా సంభారము" రామకథ ఎంత ఉదాత్తమో అంత ఉదాత్తమైనదన్న ఆత్మవిశ్వాసము కల కవి. "కనులకు పసి రాముండును మనసున కాకాశమంత మహనీయుండున్" అట్టివాడు కావ్య నాయకుడుగా తీర్చబడుటలో కవి ఎంత బ్రాహ్మమయుడు కావలెనో అంతగా తపించిన కవి.

"కవి మహర్షి తపోఽగ్నిచే క్రాగి క్రాగి
సర్వతేజః ఫలంబు రసంబు తుదకుఁ
జూచినట్లుగఁ జూచితిఁ శోణి జాతఁ
జారితార్థ్యంబు జన్మకు సంఘటింప" - (సుందర - ఉష- 52 ప) అన్న ఆంజనేయునివంటి తృప్తి పొందిన కవి విశ్వనాథ.

"ఈ కథాత్తానుత విజ్ఞానమే విశ్వంబుల్ వెలిగించు"- అన్న అవగాహనతో వాల్మీకి రామకథకు రసవద్వ్యాఖ్యానంగా రామాయణ కల్పవృక్షము తెలుగు హృదయాలలో నాటిన మహనీయుడు విశ్వనాథ. రామకథను తన సమకాలీన సమాజ సమీక్షతో దీర్చిదిద్ది ఇరవయ్యవ శతాబ్దపు ఇతిహాసంగా రామాయణమును మఱల వ్రాసిన కవి ఆయన. 20వ శతాబ్దములో కావ్య ప్రక్రియ; పద్య విద్య, పదవాక్య విన్యాసము; సాహిత్య లక్షణము ఎన్ని క్రొత్త పుంతలు పోయినవో, ఎన్ని ఎన్ని వినూతన విధాల ఆధునికములుగా వన్నెకెక్కినవో అవి అన్నీ తన కావ్య సృష్టిలో మేళవింపచేశాడాయన.

ప్రకృతిలో అంతర్లీనమై ఉన్న సృష్టి విలాసమంతా బహు విధమైన చైతన్య వైభవమంతా తన వాగ్రూపాన పండించుకొన్నవాడాయన. రామదర్శనములో సృష్టి రహస్యాలను సమీక్షించిన వాఙ్మయ బ్రహ్మ ఆయన. రమ్యమైన దృశ్యాలను మధురములైన శబ్దాలనూ పరమాత్మ రూపాంతరములుగా భావించిన తాత్త్విక రసదార్శనికుడాయన "The beauties of nature and there forms of human and celestial beings are but pertial revelations of the unsurpassed beauty of Brahman" (Philosophy of Visishtadwaita p. 116).

ఇటువంటి అనుశీలనలలోని సత్యము ఆయన కావ్య పరామర్శలో మనం అనుభవించగలము.

—తానుభావించిన మహా విషయాలను సామాన్యుడికి తేటతెల్లంగా అందించటములో భాషను వ్యవహార సుందరముగా తీర్చినవాడాయన.

మిల్టన్ గురించి సామ్యూల్ జాన్సన్ చెప్పిన అన్ని లక్షణాలూ విశ్వనాథకు అక్షరాక్షరమూ అన్వయిస్తాయి.

"He seems to have been well acquainted with his own genius, and to know what it was that Nature had bestowed upon him more bountifully than upon others; the power of displaying the vast illuminating the splendid, enforcing the owful darkening the gloomy, and aggravating the dreadful; he therefore chose a subject on which too much could not be said, on which he might have his fancy without the censure of extavagance.

"The characteristic quality of his poems is sublimity. He sometimes descends to the elegant, but his element is the great. He can occasionally invest himself with grace, but his natural post is gigantie loftiness" (Johnson's life of Milton).

"రమ్యం జుగుప్సిత ముదారమథాపి నీచం
ఉగ్రం ప్రసాది గహనం వికృతం చవస్తు
యద్వ్యప్యవస్తు కవి భావక భావ్యమానం
తన్నాస్తి యన్నరసభావముపైతి లోకే" - దశరూపకం. శ్లో. 85 *

# బాల రాముడు : వాల్మీకి-విశ్వనాథలు

డా॥ బి. జయరాములు

రామాయణం అనగానే రాముని కథ అని తెలుస్తూనే ఉంది. ఈ రామ కథలో ప్రతిపాదింపబడబోయే అంశాలు రాముని బాల్యదశలోనే అంకురావస్థలో ఉండి ఉండాలి. ధర్మార్థ కామ మోక్షాలనే పురుషార్థ చతుష్టయంతో సమగ్ర మానవ జీవితాన్ని చిత్రించిన కావ్యం రామాయణం. ఈ చిత్రణంలో వాల్మీకి తర్వాతి రామాయణ కావ్యకర్తలకు ఆదర్శం. అయితే కాల పరిణామ క్రమంలో తర్వాతి తర్వాతి కవులు మూల కథకు మెఱుగులు దిద్దుతూ రచనలు చేయడం జరుగుతుంది. భారత, భాగవత, రామాయణాలు మూడూ భారతీయ సంస్కృతీ సంప్రదాయాలకు నిలయాలు. తెలుగులో ఈ మూడింటిలో రామాయణం రచింపబడినన్నిసార్లు భారత, భాగవతాలు రచింపబడలేదు. అందుకే 'మరల నిదేల రామాయణంబు' అనే ప్రశ్న ఉదయించడం సహజం. దానికి 'రామాయణ కల్పవృక్ష' కర్త చక్కటి సమాధానం చెప్పారు. ఆ సమాధానంలో భాగంగా తన రామాయణంలోని కొన్ని లక్షణాలను ప్రాసంగికంగా చెప్పారు. వాల్మీకి, విశ్వనాథల రామాయణాలను తులనాత్మకంగా పరిశీలిస్తే, ఆ రెండు రచనలలోని కాలభేద ప్రభావాన్ని, రచనలోని లోచూపును, శిల్పాన్ని, కవుల ఆలోచనా విధానాన్ని విశ్లేషణాత్మకంగా అనుశీలించవచ్చు. ఆ విధంగా చేస్తే ఒక గొప్ప పరిశోధనా గ్రంథం వెలువడుతుంది. కాని ప్రస్తుతం బాలరాముని వృత్తాంతాన్ని తీర్చిదిద్దడంలో వాల్మీకి, విశ్వనాథలు అనుసరించిన మార్గాన్ని పరిశీలిస్తూ, బాల రాముని వృత్తాంత చిత్రణంలో (అంకురావస్థలో ఉండేట్లుగానైనా) ప్రతిపాదింపబడిన అంశాలను అనుశీలించడం నా వ్యాస పరిధి

వాల్మీకి మహర్షి తన రామాయణ కథను.

కోన్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్ కశ్చ వీర్యవాన్
ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ సత్యవాక్యో దృఢ వ్రతః॥ (బాల-౧-౨)

అనే ప్రశ్నతో ప్రారంభించాడు నగర వర్ణనతోనో, నాయక వర్ణనతోనో కావ్యాన్ని ప్రారంభించడం సంప్రదాయం. కాని రామాయణ కల్పవృక్ష ప్రారంభం ఈ పద్ధతిలో కాలేదు. విశ్వనాథవారు-

ఆత్మ నిత్య మ్మకాలా ద్యవచ్ఛిన్న మ్ము
సచ్చిదానంద సంపచ్చయమ్ము
అద్వితీయమ్మేక మపరిణామ ప్రాప్త
మపరిమేయమ్మది యచ్చతెలివి... (ఇష్టి-౨)

అని ఆత్మలక్షణ వర్ణనతో రామాయణాన్ని ఆరంభించారు. కావ్యారంభంలో ఆత్మ నిత్యత్వ ప్రతిపాదన చేసి విశ్వనాథ ఒక కొత్త సంప్రదాయాన్ని నెలకొల్పారు. మూలకథ వాల్మీకిదే అయినా దాన్ని **Present** చేయడంలో విశ్వనాథ కొత్త విధానాన్ని అనుసరిస్తున్నాడని ఆదిలోనే మనం గ్రహిస్తాం. బాలరాముని చిత్రణంలో కూడా విశ్వనాథ ఈ నవ్యత్వాన్ని తీసికొని వచ్చారు.

రామజననం, జాతకర్మ, నామకరణం, అతని గుణగణాలు, ఉపనయనం, విద్యాభ్యాసం మొదలైనవాటి నన్నిటినీ బాలకాండ పద్దెనిమిదవ సర్గలో సుమారు పది శ్లోకాలలో చిత్రించాడు. ఈ ఘట్టాలను ఆధారంగా గ్రహించి విశ్వనాథ శతాధిక పద్యాలలో బాలరాముని వృత్తాంతాన్ని తీర్చిదిద్దారు. తన రచనా విధానాన్ని, శిల్ప నిర్మాణచాతుర్యాన్ని రస ప్రపంచన రీతిని, తదితరాంశాలను ఈ బాలరాముని వృత్తాంత చిత్రణంలో విశ్వనాథ స్ఫురింపజేశారు.

''సమాజం చైతన్యాగ్ని వంటిది. సాహిత్యానుభవం కోసం పంచ జిహ్వలతో అర్రులు చాస్తూ ఉంటుంది. వాస్తవ, కాల్పనిక, వైజ్ఞానిక, జీవ చైతన్య, ఆధ్యాత్మికానుభూతుల కొరకై సమాజం తన కామనను వ్యక్తం చేయటమే ఆ పంచ జిహ్వల ప్రవృత్తి. ఆ పంచ జిహ్వలతో ఆస్వాదించే కళానుభవమే పరిపూర్ణం, సమగ్రం.'' (నవ్య సంప్రదాయ కవితోద్యమం : విశ్వనాథ-పుట - 4) అన్నారు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు. వారు చెప్పిన ఆ కళానుభవం బాలరాముని వృత్తాంతంలో విశ్వనాథ (స్ఫురణ మాత్రంగా) నిక్షిప్తం చేశారు.

వాల్మీకి రామజననాన్ని ఇలా వర్ణించాడు:
తతశ్చ ద్వాదశే మాసే చైత్రే నావమికే తిథౌ
కౌసల్యాఽ జనయద్రామం సర్వలక్షణ సంయుతమ్
విష్ణోరర్ధం మహాభాగం పుత్ర మైక్ష్వాకు వర్ధనమ్

ఇదే రామ జననాన్ని విశ్వనాథ 15, 16 పద్యాలలో సవిస్తరంగా వర్ణించారు. 'కనె కౌసల్య శౌరిన్' అని చెప్పి, పుట్టిన శిశువుపై మంత్రసాని కలినీళ్ళు చల్లి కుదిలించిందనీ ఆ శిశువు ఏడ్చాడనీ, మంత్రసాని ఆ శిశువు బొడ్డు కోసిందనీ, ధాన్యం (గోధుమలు) పోసి దానిపై చీరపఱచి శిశువును పండబెట్టిందని వర్ణించి, శిశు జనన సమయంలో చేసే కార్యకలాపాలన్నీ వాస్తవికంగా విశ్వనాథ వర్ణించారు.

ఆ శిశువును రాజు ఎత్తుకోగా ఏడ్చాడు. మళ్ళీ తల్లి తీసుకోగానే ఏడ్పు మానాడు. పుట్టిన ఆరు గడియలలో శిశువుకు తల్లి తెలుస్తుందనీ, ఆరునెలల తర్వాత గాని తండ్రి తెలియదనీ లోకంలో చెప్పుకొనే విషయాల్ని విశ్వనాథ ఈ సందర్భంలో పొందుపరచారు

తర్వాత నామకరణం జరిగింది. శిశువు పుట్టిన పన్నెండవ నాడు నామకరణం జరిగినట్లు వాల్మీకి వర్ణించాడు.

అతీత్యై కాదశాహంతు నామకర్మ తథాఽకరోత్
జ్యేష్ఠం రామం మహాత్మానం భరతం కైకయీ సుతమ్॥

విశ్వనాథ నామకరణ ఘట్టాన్ని వైదిక తంత్రపు వాస్తవికతతో రసరమ్యంగా చిత్రించారు. పురోహితుడైన వశిష్ఠులవారు దశరథ పుత్రులకు నామకరణం చేస్తున్నప్పుడు "వశిష్ఠులు రామచంద్రుం డనకముందు దశరథుండు రామచంద్రుండని వ్రాసె దశరథుండు వ్రాయకమున్న వశిష్ఠుల నోటినుండి రామచంద్రుండని వచ్చె. ఆలస్యముగ వచ్చిన సుమంత్రుండు బియ్యములో జూచి యక్షరమ్ములు సరిగా గన్పింపక రామభద్రుండని చదివె" (176). పురోహితుడు పలకడం రాజు వ్రాయడం అవ్యవహితంగా జరిగాయి. మంత్రి రాజ్యభద్రత కోరువాడు గాన రామభద్రుడని పలికాడు. ఆ శిశువు ఊరందరికీ రామభద్రుడు; తల్లికి, తండ్రికి, పురోహితునికి మాత్రం రామచంద్రుడయ్యాడట!

శిశువుకు నామకరణం చేసిన రోజున శిశువును ఊయలలో వేసి పాటలు పాడడం, బాలెంతరాలు బావిలో చేదవేయడం అనే ఆచారాలున్నాయి. వీటిని విశ్వనాథ రమ్యంగా వర్ణించారు. సంధ్యా సమయంలో చంటిపిల్లలను వెలుపలకు తీసికొని పోనీయరు. 'వెలికి గొనిపోకుండీబిడ్డఁ బిట్టలారు సంజవేళలనంచుఁ గౌసల్య పలికి'ంది (303).

నడకనేర్చిన పిల్లలు మనకళ్ళముందు ఉన్నట్టే ఉండి మాయమౌతారు. అపుడు ఆ శిశువు తల్లి ఆందోళనతో అతనిని వెదుకుతుంది. అలాగే బాలరాముడు కూడా కనిపించకపోయేసరికి కౌసల్య నలుమూలలవెదకి చివరకు దేవుని ఇంటిలో విగ్రహాలను అటు ఇటు పడేస్తున్న రాముని చూసింది.

నీళ్ళంటే చంటిపిల్లలకెందుకో ప్రీతి! పిల్లలు నీటితొట్లవద్దకు పరిగెత్తడం, వాటిని చిమ్మడం, చిలకడం, తల్లులు వెళ్ళి వాళ్ళను లాక్కొచ్చి తడిసిన పిల్లలను తుడవడం చేస్తుంటారు. వాస్తవమైన ఈ విషయాన్ని విశ్వనాథ ఇలా చిత్రించారు:

తూనీగంబలెబోయి నీళ్ళలన్ జిందున్ జిమ్ము జిల్కున్ శిర
స్స్నానంబున్ బుడిసిళ్ళుగా గొను రఘుస్వామిన్ విలోకించి తం
డ్రీ! నారాయణ! యేమి మీ వని యటంచేకారి కౌసల్య ర
త్నానూనంబగు పయ్యెదన్ దుడుచు యత్నానూన సాధ్యున్ శిశున్''

(333)

చిన్నపిల్లలు తొక్కుపలుకులు పలకడం, ముద్దుగా నడవడం, బాల క్రీడలు మొదలైనవాటిని అత్యంత మనోహరంగా విశ్వనాథ పోతన మహాకవిని తలపింపజేస్తూ చిత్రించారు.

బాలరాముని ఉపనయనం, విద్యాభ్యాసాన్ని 3, 4 శ్లోకాలలో వాల్మీకి సంక్షిప్తంగా వ్రాశాడు.

తేషాం జన్మక్రియాదీని సర్వకర్మాణ్య కారయత్
తేషాం కేతురివ జ్యేష్ఠో రామోరతికరః పితుః॥

బభూవ భూయో భూతానాం స్వయంభూరివ సమ్మతః
సర్వేవేద విదః శూరాః సర్వేలోక హితేరతాః॥

సర్వే జ్ఞానోప సంపన్నాః సర్వే సముదితాగుణైః
తేషామపి మహారాజా రామస్సత్య పరాక్రమః॥

గజస్కంధేఽశ్వ పృష్ఠేచ రథచర్యాసు సమ్మతంః
ధనుర్వేదేచ నిరతః పితృ శుశ్రూషణే రతః॥

ఈ అంశాలను విశ్వనాథ తన కల్పవృక్షంలో బ్రహ్మాండంగా పెంచి రసోదంచితంగా చిత్రించారు.

రామాదులకు వశిష్ఠులవారు ఉపనయనం గావించారు. 'భిక్ష' అడగడం విద్యాభ్యాసానికి మూలం. ఆ ఘట్టాన్ని విశ్వనాథవారు అతిరమ్యంగా, భావబంధురంగా చిత్రించారు తర్వాత రాముడు వేదాలు, శాస్త్రాలు, ధనుర్వేదం అధ్యయనం చేశాడు. బాణ ప్రయోగం, ఖడ్గ చాలనం, పరశువు, భిండి, ముద్గరం మొదలైన వివిధ ఆయుధాలను ప్రయోగించడం, ధర్మ, అర్థ, కామ శాస్త్రాలు, ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు, చిత్రలేఖనం అభ్యసించాడు.

ఈ విధంగా బాలరాముని చిత్రించిన విశ్వనాథ బాలరాముని చిత్రణలో రాముని మరచిపోయి మన ఇంట్లో పిల్లల చేష్టలు గుర్తుకు వచ్చి తన్మయం చెందేటట్లుగా సాధారణీకరణం పొంది ఆనందించే పద్ధతిలో వాస్తవ విషయాలను చిత్రించి మనకు వాస్తవికానుభవాన్ని కలిగించారు.

వాల్మీకి చిత్రించిన బాలరాముని వృత్తాంతంలో కాల్పనిక విషయాలేవీ లేవు. అతని గుణగణాలను, విద్యాభ్యాసాన్ని వాస్తవికంగా చెప్పడం మాత్రమే జరిగింది. విశ్వనాథ మాత్రం రాముని బాల్యక్రీడలను వర్ణించుపట్ల కల్పనా మహనీయ విశేషాలతో చక్కటి పద్యాలు వ్రాశారు.

బోర్లపడి తల ఎత్తి, కాళ్ళు చేతులు కదిలించే శిశువును తాబేలుతో పోల్చి కూర్మావతారాన్ని, నడక నేరుస్తున్న రాముడు మూడడుగులు వేసి కిందబడడంలో వామనావతారాన్ని, దారుమయాల్ప ఖడ్గాలను కోరలుగా ధరించి బెదిరించడంలో వరాహావతారాన్ని స్ఫురింపజేశారు. చంటిపిల్లవాడైన రాముడు నిలుచున్న తీరు కాల్పనికంగా కవి ఎలా ఊహించారో చూడండి:

అపురా! శ్రీ రఘురామచంద్రుడు ప్రభుండై విద్దెముల్ సేయుచో
హవణించున్ నిలుచున్న వైఖరిని ప్రత్యాలీఢ పాదంబుతో
శ్రవణాంతానత ముష్టియై త్రిజగతీ రక్షాపతాకంబుగా
బువు పుట్టంగనె దిక్కులం బరిమళింపుల్ పిక్కటిల్లుంగదా! (309)

బాలక్రీడలలో కూడ రాముని త్రిజగద్రక్షా తత్త్వాన్ని భావించిన విశ్వనాథవారు ధన్యులు.

రామలక్ష్మణులను మగవారు, ఆడవారు ఎత్తుకున్నప్పుడు వారెలా ప్రవర్తించారో విశ్వనాథ చక్కగా ఊహించారు. ఈ కల్పన కమనీయంగా ఉండి భావి కథను స్ఫురింపజేస్తోంది.

రామచంద్రుండు సర్వమూర్ధంబు, చేతులొత్తి చూచును బూరుమలెత్తికొనిన
లక్ష్మణుడు ముక్కులున్ జెవుల్, తడిమి చూచు నెవ్వరే నంగనలు దన్ను
నెత్తికొనిన - (317).

ఎంత చక్కటి కల్పన! మగవారు తన్నెత్తుకుంటే రాముడువారి తలను, చేతులను నొక్కి చూస్తున్నాడట. తన్నెత్తుకున్నవాడికి ఎన్ని తలలున్నాయి? ఎన్ని చేతులున్నాయి? అని పరిశీలిస్తున్నట్లు చిత్రించడంలో రామజననం రావణ వధార్థమే యని ధ్వనించినట్లైంది. అలాగే లక్ష్మణుడు తన్నెత్తుకున్న ఆడవారి ముక్కు చెవులు తడిమి చూడడంలో లక్ష్మణుడు శూర్పణఖ ముక్కు చెవులు కోసే భావి కథ దీనిలో ధ్వనింపబడింది.

అలాగే బలరాముడు నడుస్తుంటే పని కకుత్స్థ, మాంధాతలు; పని దిలీప, రఘుమహారాజుల తీవి దశరథునకు కనబడిందట. రాజ దర్శనం కోసం వచ్చిన సామంతుల చేతులలోని విండ్లు తీసికొని రాముడెక్కుపెడితే 'ఫెళ్ళు'మని విరుగుతున్నాయట. దీనిలో భావి శివధనుర్భంగం స్ఫురిస్తుంది. ఈ విధంగా బాల రాముని వృత్తాంతంలో కాల్పనిక చైతన్యం, కల్పనా మహనీయ విశేషాలు మనను రమింపజేస్తూ కాల్పనికానుభవాన్ని కలుగజేస్తున్నాయి.

సంక్షిప్తంగా బాలరాముని చిత్రించిన వాల్మీకి ఇతర అంశాల జోలికి పోలేదు. విశ్వనాథ మాత్రం అభినవ సంప్రదాయ మార్గాన్ని నెలకొల్పి నవ్య సంప్రదాయోద్యమ నాయకుడుగా కీర్తింపబడ్డాడు. భారతీయ తత్త్వశాస్త్ర మర్యాద ననుసరించి అద్వైత మత దృష్టితో రామకథా తత్త్వాన్ని వ్యాఖ్యానించాడు. ఈ వ్యాఖ్యానం బాలరాముని వృత్తాంతంలో కూడా ఒకటి రెండుచోట్ల స్పష్టంగా కనిపిస్తుంది.

దశరథుడు రాత్రివేళ పురుటింటి కెళ్ళాడు. మేడమీద నిండు చందమామ ప్రకాశిస్తూ ఉంది. కౌసల్య పక్కన శిశువు నిద్రిస్తున్నాడు. రాజు ఇద్దరినీ చూసి ఇరువురిలో భేదాన్ని గ్రహించలేకపోయాడు. చంద్రుడస్తమిస్తేగాని చంద్రునికీ రామచంద్రునికీ గల భేదాన్ని రాజు గ్రహించలేదు.

రాజు పురుటింటిలోన నిద్రా సమాధిగతుని హరిజూచు, సౌధశేఖర నితంబగతుని హరిణాంకు జూచు, నాకాంతి గోళముల వివేదంబు దెలియక మోసపోవు - (241).

రువ్వ నయనాభి రామచంద్రుండు వీడు, రువ్వ నయనాభి రామ చంద్రుడు వాడు మింట నితడు రేచన నస్తమించిగాని, యిరువురి విభేద మెఱుగడు ధరణి పతియు - (242)

చంద్రుడు జ్యోతి. పరమాత్మకు సంకేతం. బాలరాముడు పరమాత్మ జీవాత్మగా అవతరించినవాడు. అతడొక జ్యోతి. ఈ రెండింటికి అనగా పర మాత్మ, జీవాత్మల కభేదం చెప్పడంవల్ల ఇచట అద్వైతం స్థాపింపబడింది.

బీజంలో వృక్షం ఉంది. అది కనిపించదు. దాన్నుండి మొలకెత్తినపుడే అది కనిపిస్తుంది. అలాగే బ్రహ్మాండమంతా భగవంతునిలో ఉంది (విశ్వ రూపం). అంటే విశ్వమంతా భగవంతుడు వ్యాపించి ఉన్నాడు. 'సహస్ర శీర్షా పురుషః, సహస్రాక్షస్సహస్రపాత్' అని వేదం ఈ విషయాన్నే తెలుపుతుంది. దానినుండే జీవాత్మగా అతడు అవతరిస్తాడు. ఆ జీవాత్మ (చేయాల్సిన పని చేసిన తర్వాత) మళ్ళీ పరమాత్మలో లయమౌతుంది. ఇది అద్వైతం. జీవుడే దేవుడు. 'సోఽహం బ్రహ్మ' అనే తత్త్వాన్ని 'బీజమే చెట్టు' అనే దానిలో విశ్వనాథ ప్రపంచించారు.

వృక్షమా మున్నె యున్నది బీజనిర్గతంబయై గోచరించు నేత్రములకెందు అసలె రామమయంబయినట్టి జగమునప్పుడే రామమయమయినట్లు తోచె (283).

విశ్వనాథ సామాన్యుడు కాడు - మాన్యుడు. ఆయన గొప్ప భావుకుడు, యోగి. చర్మచక్షువుతో చూసేవారు సామాన్యులు. మనోనేత్రంతో చూసేవారు భావుకులు. ఆత్మదర్శనం చేసుకునేవారు యోగులు. (శివం ఆత్మని పశ్యంతి యోగినః.)

ఈ విధంగా బాలరాముని వృత్తాంతంలో అద్వైత భావనతో రామకథా తత్త్వాన్ని వ్యాఖ్యానిస్తూ విశ్వనాథ పఠితలకు జ్ఞానానుభవాన్ని కలిగించారు.

విశ్వనాథ తమ కల్పవృక్షం 'అవతారిక'లో కొన్ని విషయాలు చెప్పారు. "రసము వేయిరెట్లు గొప్పది నవ కథా దృతిని మించి" అన్నారు. పైన చెప్పిన వాస్తవిక, కాల్పనిక, జ్ఞానానుభవాలు సాధారణీకరణం పొంది రసానుభవాన్ని కలిగిస్తాయి. అలాగే తర్వాత చెప్పబోయే ఆధ్యాత్మికానుభవం కూడా రస పర్యవసాయి అవుతుంది. అందువల్లనే రసము వేయిరెట్లు గొప్పదని వారు చెప్పారు. 'జీవుని వేదన' అనే కొత్త పదబంధాన్ని విశ్వనాథవారు ప్రయోగించ

దమే గాక, రసానుభవానికి ఆ జీవచైతన్య ప్రవృత్తి మూలమని భావించి, చిత్రించారు. అలాగే ఆయన భాషగురించి చెబుతూ—

"నాది వ్యవహార భాష...........

......................................

రసము పుట్టింపగ వ్యవహారము నెఱుంగ
జనును లోకమ్ము వీడి రసమ్ములేదు" అన్నారు. అన్నట్లుగానే వ్యవహారంలో ఉన్న వాక్యాలను, చక్కటి పదబంధాలను, పదాలను తమ కల్పవృక్షంలో వాడి రసము చిప్పిలజేశారు.

రాముడుద్భవించిన తర్వాత దశరథుడు అతనిని చూడాలని చాలా తపన పడ్డాడు. అతని తపనలో భగవంతుని కాంచాలనే జీవునివేదన కనబడుతుంది.

ఒకసారి చనుదెంచి యుర్వీశశ్రతుండు కౌసల్యపసికందు గాంచ సేయు
నొకసారి తానేగి యుర్వీశశ్రతుండు కైకయీ తనయుని గాంచి పోవు.
నొకసారికేమొ యింకొకసారి చనిరాజు సౌమిత్రులను గాంచి సంతసించు
నితరుల జూడని యెల్లవేళల దశరథరాజు నెడద నగ్రసుతుజూచు
గోసలాత్మజాత కొడుకు రాజునెడంద వదలిపోదుచూపు ప్రిదిలిపోదు
ఉఱక ప్రిదిలిపోవునో యశుభాశంకి రాజు ప్రేమగదలి రవ్వపొందు (264)

ఒక్క దశరథుడేకాడు - ఆయనతోపాటు శాంత, ఋషులు, కౌసల్య, సుమంత్రుడు బాలరాముని చూడాలనే తపనతో ఎలా చూస్తున్నారో విశ్వనాథ బ్రహ్మాండంగా వర్ణించారు.

జననాయకుండు కౌసల్యా సుతుంగాంచు బ్రాణమ్ములన్నియు బహిర పెట్టి
శాంతా పురంధ్రి కౌసల్యా సుతుంజూచు బ్రాణమ్ములను లోన భద్రపఱచి
సత్తపోనిధులు కౌసల్యా సుతుంగాంత్రు ప్రాణమ్ములో బిడ్డపాళ్ళు వెట్టి
కౌసల్య తనయునిగాంచు బ్రేమ కొలంది ప్రాణమ్ములను బిడ్డలోనబెట్టి
యొక సుమంత్రుండు కనుదేవయుగమునాటి వార్త కన్నుల యెదుటన
మూర్తిగట్ట
నవని పతికిని గగనమైకట్టి బిడ్డ యఖిల జనముల కనులకు
నమృతవర్తి. (268)

దశరథుడు బాలరాముని దర్శించడంతో తృప్తి పడడంలేదు. అతనిని స్పృశించి, పరవశించాలని, పురుడు వెళ్ళకమునుపే శిశువును చేతులలోకి తీసికొని దర్శన, స్పర్శనాలచే ఆనందాంబుధిలో తేలాడు. బాలుని దర్శనం కోసం, స్పర్శ కోసం పరితపించే రాజులో జీవునివేదన రూపుకట్టి భాసిస్తుంది

దశరథుడు తన నలుగురు పిల్లలనూ 'రామచంద్రుడ'నే పిలిచేవాడట. రాముడు ఆ పిలుపునకు ప్రీతిగా చూడగా, తక్కిన పిల్లలు కిలకిల నవ్వేవారట. 'రామ' నామ స్మరణంలో రాజువేదన, ఆర్తి కనిపిస్తున్నాయి.

బాలరాముని ఊయలలో వేసి జోల పాడునపుడు ముత్తైదువలు మాట్లాడు కున్న మాటలలో చక్కటి వ్యవహారభాష ప్రయోగింపబడింది. ''అనరమ్మ యొక్క పాటను, తాళాలు పడెనటే నోళులకున్, వెలికిగొని పోకుండీ బిడ్డ"లాంటి మాటలు నిత్య వ్యవహారం లోనివే. విశ్వనాథ చక్కటి బాల వ్యవహార భాషను ప్రయోగించారు. తల్లో, తండ్రో, ఇతరులో బాలుని నీ పేరేమని, నీ తండ్రి పేరే మని, నీ తల్లి పేరేమని అడగడం, ఆ బాలుడు వారి పేర్లు తప్పుగా పలికితే నవ్వి ఆనందించడం లోకంలో సహజంగా జరిగే విషయం. కౌసల్య బాలరాముని అలా ప్రశ్నించి తన్మయత్వాన్ని భజించింది.

"తానో'లాములు', తండ్రి పేరెవరయా? 'దాదాత మాలాలు' నౌ
లే నాపేరన 'నమ్మగాల'నగ నోలిందల్లి 'కౌసల్య తం
డ్రి'నాగా ననబోయి రాక కనులన్ నీర్వెట్ట 'గౌసల్య నౌ
గానే కానులె' 'యమ్మనే'యని ప్రభున్ గౌసల్య ముద్దాడెడిన్". (334)

ఈ విధంగా జీవుని వేదనతో నిండి బాలరాముని వృత్తాంతం జీవచైతన్య ప్రవృత్తిభరితమై ఉండడం చేతను, తాను చెప్పుకున్నట్లుగా విశ్వనాథవారు వ్యవహారంలోని భాషతో కూడిన పద్యాలు వ్రాయడంవల్లనూ పఠితకు రసాను భవాన్ని కలిగించారు.

భక్తి, కర్మ, జ్ఞాన మార్గాల సమన్వయంతో జీవన పరమార్థం బాలరాముని వృత్తాంతంలో వ్యంజింపబడి ఆధ్యాత్మికానుభవాన్ని కలిగిస్తుంది. రామునియెడ అందరికీ భక్తి, భగవంతుడైన రామునికి ఇష్టమైన కర్మలు చేయడం, రాముడు దేవుడనే జ్ఞానం బాలరాముని వృత్తాంతంలో కనిపిస్తాయి. విశ్వనాథవారే 'వఱల నిద్రేల రామాయణంబ'ని ప్రశ్నించుకొని- భోజనం చేయడం, సంసారం చేయడం

ఎంత సహజమో నాకు భక్తి అంత సహజం అని చెప్పుకున్నారు 'తలచిన రామునే తలచెద నేనును నా భక్తి రచనలు నావిగాన' అనీ, 'జాగ్రదవస్థనేమి యన స్వప్న సుషుప్తుల కూడ రామనామ గ్రహణంబె నావయిన మానస జిహ్వలు సేయు' నన్నారు. 'కట్టుకత లైహికమా? పరమా?' అని ప్రశ్నించారు. భక్తితో రామ కథను రచించి ఇహపరాలను సాధించారు.

రాముడు జన్మించిన తర్వాత (నామకరణం అయ్యాక) అయోధ్య ప్రజ లంతా మాటి మాటికి 'రామ రామ' అంటున్నారట. ఆ ధ్వని భూనభోంతరాలు వ్యాపించి క్షుద్ర ధ్వనులన్నీ తొలగిపోయినవట. ఆ పట్టణంలోని ప్రజలు ప్రశ్న అడగబోయి రామచంద్రుడని, బదులు చెప్పబోయి రామభద్రుడని అంటారట. ఎక్కడికెళ్తున్నావంటే రామభద్రుని చూడడానికని చెబుతారట. తమ మాట లన్నిటికీ మొదట రామనామాన్ని ముద్రగా వాడతారట. లోకులకందరికీ సర్వ కాల సర్వావస్థలలో 'తండ్రీ! రామచంద్రా!' అన్న వాక్యమే గోచరిస్తుందట.

> శ్రమ పొందన్ క్షుధయున్ బిపాసయును దీరన్ గ్లిష్ట కార్యాంత వి
> శ్రమ మొందన్ నిదురింప బండుకొన నిద్రన్ మేలుకొన్నన్ వచో
> గ్రిమ భాగంబుల సర్వభూప్రజకు 'దండ్రీ! రామచంద్రా!' యట
> న్న మహావాక్యమె గోచరించె సుమహానందంబు సంధించుచున్. (282)

ఈ స్మరణ భక్తి పోతన్నగారి 'పానీయంబులు ద్రావుచున్ గుడుచు చున్....' అనే పద్యాన్ని స్మరణకు దెస్తుంది.

రాముడుద్భవించడం వల్ల, అంతా రామనామ స్మరణం చేయడం వల్ల జగమంతా రామమయమయినట్లు తోచిందట.

ఉపనీతుడైన బాలరాముడు మాతృభిక్షకోసం కౌసల్య వద్దకు వచ్చి "భిక్షాం భవతి దేహి" అని అన్నాడు. ఆ భిక్ష అడిగింది ''దేవుడు రాముడు" అన్నారు విశ్వనాథ. "కౌసల్యాముక్తికాంతాసమానాకార'' అని విశ్వనాథ ఇష్టి ఖండంలో వర్ణించారు. ఆమెకు ఇపుడు మంచి అవకాశం లభించింది. దాన్ని ఉప యోగించుకొని "త్వంచ మమదేహి'' అని భిక్ష అడిగి అతన్ని ముద్దాడింది. ఆమె అడిగింది ముద్దునా? కాదు.... తనకు ముద్దైన మోక్షాన్ని. బాలరాముని కళ్ళల్లో తన కోరిక నెరవేరిన భావాన్ని గమనించి కౌసల్య అతన్ని ముద్దాడింది.

రాముడు జననమొందినది మొదలు విశ్వనాథ అతనిని దేవుడుగనే, విష్ణువుకు సంబంధించిన విశేషణాలతోనే వర్ణించారు. శౌరిన్, దళిత దైత్య మహోఘున్, దైత్య విదళనోగ్రాంశుమూర్తి, జగదీశు, గంగా సరిదంబు పాదయుగు, కంధిసుతాహృదయేశు, స్వామి, క్షీరసముద్రశాయి, ముక్తీశుడు, లోకనాథు, హరి మొదలైన విశేషణాలను రాముడు దేవుడనే జ్ఞానాన్ని కలిగిస్తున్నాయి. రాముని తనకిమ్మని అడిగిన శాంత కొడుకుతో మంత్రసానికూడ-వద్దు 'దేవుడు' అంది జోల పాటల్లో, ఇతర బాల్యక్రీడల్లో రాముడు దేవుడనే జ్ఞానం కనబడుతూనే వుంది. అతనికి బాల్యోపచారాలు చేసిన స్త్రీలు, కౌసల్య మొదలైనవారు కర్మపూర్వకంగా బాలరాముని సేవించారు. ఈ విధంగా బాలరాముని వృత్తాంతం ఆధ్యాత్మికానుభవాన్ని పరిపూర్ణంగా కలిగిస్తుందనడంలో సందేహంలేదు.

వాల్మీకి బాలరాముని వృత్తాంతంలోనే కాదు - రామాయణంలో కూడా మాట మాత్రంగానైనా తలవనిదీ, విశ్వనాథ తన కావ్యరచనా విధానంలో భాగంగా విశిష్టప్రాయంగా చిత్రించినదీ కైకేయీ రాముల సంబంధ చిత్రణం.

''మనిషిలోని మంచితనం పట్ల ఈయనకు గల నమ్మకానికి కైకమ్మనీయన తీర్చిన తీరు మంచి తార్కాణం. పూర్తిగా అప్రతిష్టపాలైన ఈ పాత్ర విశ్వనాథ చేతిలోని లోక కల్యాణానికి మోహాన్ని కోసివేసుకొన్న త్యాగమూర్తిగా పునర్జన్మను పొందింది." (విశ్వనాథ సాహిత్య యాత్ర - P.57) అంటారు శ్రీ వడలి మందేశ్వరరావుగారు ఇది అక్షరాలా సత్యం బాలరాముని వృత్తాంతంలో రామునితో ఈమెకు గల సంబంధాన్ని, రాముని జీవితంలో ఈమె స్థానాన్ని, ఆమెకు రామునిపై గల మోహాన్ని విశ్వనాథ చక్కగా చిత్రించారు.

దశరథుని ముగ్గురు భార్యలలో రాముని తత్త్వం కైకేయికే బాగా తెలుసు. ఆమె తత్త్వం రామునికి తెలుసు. రామునికోసం ఆమె ఎంతటి దుఃఖాన్నైనా, బాధనైనా దిగమ్రింగి, ఎలాంటి నిందనైనా భరించగలిగిన సహనశీలి. రాముడు ఆమెకోసంపడే తపన, ఆమె రామునికోసం అంగలార్చడం విశ్వనాథ రసరమ్యంగా చిత్రించారు.

"కాళ్ళు వచ్చిన దాదిగాఁగైక కొఱకుఁ బరువు లెత్తును శ్రీరామభద్రమూర్తి
న్నిద మేల్కొన్నదిగ రామభద్రుకొఱకు నంగలార్చుచు
జనుఁగేకయాత్మజాత" - (338)

వ. శ్రీరామచంద్రుని వదలి కౌసల్య యుండలేదు. శ్రీరామభద్రుని వదలి కైకేయి యుండలేదు ... .......(340)

కౌసల్యకు రామచంద్రుడు - (ఆనందాన్ని, జ్ఞానాన్ని ఇచ్చేవాడు); కైకేయికి రామభద్రుడు - (లోక రక్షణద్వారా ఆనందాన్నిచ్చేవాడు). ఆ లోక కల్యాణం కోసమే రామున్ని అడవులకు పంపవలసివచ్చింది.

శ్రీరాముడు ఏదైనా ఒక లోకాద్భుత కార్యాన్ని చేసి కైకేయికి చూపిస్తాడు. ఆమె చాలా ఆనందిస్తుంది అతని సాహసకార్యాలకు సంతోషపడినా, అతనికి ఏ అపాయం జరుగుతుందోనని అతన్ని రక్షించమని రంగనాథుని, సకల దేవతలను ఆమె ప్రార్థిస్తుంది. బాల్యంలోనే మంథర మందర పర్వతంలా ఇరువురి మధ్య కనబడుతుంది. రామ కైకల మోహపాశాన్ని తెగగోసే వాడియైన ఉపకరణంలా మంథర ఉన్నట్లు విశ్వనాథ స్ఫురింపజేశారు. ఆమెను చూస్తే రామునికి, కైకకు-ఇద్దరికీ భయమే. మంథర చూస్తూ ఉంటే రాముని కైకేయి ఊరకే పలకరిస్తుంది. ఆమె లేనప్పుడు రాముని ముద్దులాడుతుంది. రాముడుకూడ మంథర ఉందేమోనని అటుయిటు చూసి, ఆమె లేనప్పుడు కైకను చేరతాడు.

ఉపనయన సందర్భంలో బాలరాముడు కైకకు నమస్కరించి 'భిక్ష' అడిగాడు. ఆమె 'వజ్ర పుంఖితమైన వాలుటమ్ము'ను భిక్షగా పెట్టింది. అపుడు రాముని స్పందన, కైక ఆనందాన్ని విశ్వనాథ బ్రహ్మాండంగా వర్ణించారు.

'మొగమున నింతయై మురిసిపోయెను రాముడు, కైక కన్నులం
దిగము మరింత యింత యయి యేళ్ళులువారె దదంతరంతర
స్థగిత రఘూద్వహ ప్రవిలసచ్ఛిశు మూర్తి మఱింత యింతయై
జగములు పట్టరాని యొక సాహస దీర్ఘ తనుత్వమొప్పగన్.' - (391)

ఈ పద్యంలో ఇంతయై, ఇగము, మఱింత యింతయయి - అనే పదాల ద్వారా అవధులు లేని వారి ఆనందాన్ని వర్ణించారు విశ్వనాథ. జగములు పట్టరాని యొక సాహస దీర్ఘ తనుత్వ మొప్పగా ఆ శిశుమూర్తి మురిసిపోయాడట. ఈ భావాన్ని ఇంతకన్న రమ్యంగా ఏ కవి చిత్రించగలడు? 'అమ్ము'ను భిక్షగా పెడితే ఎందుకీ ఆనందం? కైకకు భిక్ష పెట్టడానికి బాణమే దొరికిందా? అనే ప్రశ్నలుదయిస్తాయి. రామాయణ కథా పరమార్థాన్ని సూచించడం ఈ సన్నివేశంలోని మాధుర్యం. భవిష్యత్తులో రాముడు రాక్షస సంహారం చేయాలనే

భావనతో ఆమె 'అమ్ము'ను భిక్షగా పెట్టింది ఆ పని చేయడానికే అవతరించిన రాముడు కైక తన హృదయాన్ని గ్రహించి ఆపనికి ప్రోత్సహిస్తున్నందుకు మిక్కిలి ఆనందించాడు ఆయన కర్త. ఆమె ప్రేరణకర్త (కారయిత).

కైకేయీ రాములకు మాతాపుత్ర సంబంధమే కాదు. గురుశిష్య సంబంధం చిత్రింపబడింది. కైకేయి రామునకు శస్త్రవిద్యా గురువు. విశ్వామిత్రుడు అస్త్ర విద్యా గురువు కైక రామునికి 'చాప' విద్యలో అనేక మెళకువలను తెలిపింది. దగ్గరుండి విల్లమ్ములను ఎలా పట్టుకోవాలో నేర్పింది. లక్ష్యాన్ని ఛేదించడం నేర్పింది. వేళాపాళాలేకుండా రాముడు కైక యింటికి పరుగెత్తేవాడు. కైకేయి గురువు పాత్రను విశ్వనాథ ఎలా చిత్రించారో చూడండి :

"పటు బాహాపటుమూర్తి స్వామి ధనురభ్యాసంబు నిత్యంబు సే
యుటయున్ గైకయి వచ్చి చూచుటయు 'నోహో తండ్రి! యా బాణమి
ట్టటు నట్టిట్ల'ని చిత్ర దూరములు లక్ష్యముల్ విదారింపఁజె
ప్పుట చేయుటయున్ ముదంపడుటయున్ బొల్చున్ వనీవీథికన్ - (417)

ఈ విధంగా బాలరాముని వృత్తాంతం వాస్తవ, కాల్పనిక, జ్ఞాన, రస, ఆధ్యాత్మికానుభూతులను కలిగిస్తూ రామాయణ కల్పవృక్షం 'సమాజ సమగ్రానుభవ సంసిద్ధికి అందించే శక్తిమంతమైన కావ్యంగా రూపొందిందనే విషయాన్ని సమర్థిస్తూ ఉంది. బాలరాముని వృత్తాంతాన్ని ఆధారంగా చేసుకొని చూస్తే "పరిపూర్ణ కావ్య రసానుభూతి కోసం పరితపించే సాహితీ జగత్తుకు ఉపాయనంగా అందించిన కావ్యం నవ్యసంప్రదాయ కవితా ప్రవృత్తికి పతాక - శ్రీమద్రామాయణ కల్పవృక్షం" అని గురువర్యులు ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం గారన్నమాట అక్షరసత్యంగా భాసిస్తుంది. అంతేకాక, బాలరాముని వృత్తాంతంలో కైకేయి పాత్రచిత్రణ రామాయణ కల్పవృక్ష రచనా విధానాన్ని ధ్వనింపజేస్తుంది. విశ్వనాథ వారి రచనా విధానం, సాధారణీకరణం ద్వారా పంచప్రవృత్తుల అనుభూతులు రసపర్యవసాయులు గావడం, పద్యరచనాశిల్పం, భాషా ప్రయోగం, పాత్ర చిత్రణం మొదలైనవన్నీ అనుభవైక వేద్యాలేగాని విశ్లేషించి వివరించడానికి నావంటివానికి అలవికాని పని.

*

# విశ్వనాథ శబరీ వృత్తాంతం- అలంకార ప్రయోగం

—డా॥ అట్లా వెంకటరామిరెడ్డి

శ్రీమద్రామాయణ కల్పవృక్షం అనే పేరులోనే రూపకాలంకారం ఉంది. భారత, భాగవతాల్ని కూడ కల్పవృక్షాలుగా నన్నయ్య, పోతన్నలు సావయవ రూపకాలంకారం ద్వారా అభివర్ణించారు. కల్పవృక్షం అడిగిన కోర్కెల్ని తీరుస్తుంది. రామాయణ కల్పవృక్షం రకరకాల పాఠకుల రకరకాల అభిరుచుల్ని నెరవేరుస్తుందని విశ్వనాథవారి విశ్వాసం. కొందరికి రసం-ధ్వని అంటే ఇష్టం. కొందరికి రీతి-వక్రోక్తి-అలంకారం అంటే ఇష్టం. మరికొందరికి పాత్రచిత్రణ-నాటకీయత; ఇంకొందరికి భక్తిప్రపత్తి కథ అందరికీ తెలిసిందే! కాని, విశ్వనాథవారి చూపులో పాత్రల గుణశీలాలు ఆధునికంగా మారాయి. అతడు ఒక్కొక్క పాత్రలో ఉండే ప్రధాన గుణాన్ని మార్చకుండానే, ఆధునికమైన గుణాలను కొన్నింటిని కొన్ని పాత్రలకు ఆపాదించాడు. మేలైన కవితాగుణాల నన్నింటినీ ఇందులో ప్రోది చేశాడు. అందుకే విభిన్న అభిరుచులు కలిగిన పాఠకులకు విశ్వనాథ రామాయణం కల్పవృక్షం అని అనడానికి యోగ్యమయింది.

ఈ నవీన దృక్పథంతోనే విశ్వనాథవారు శబరీ వృత్తాంతంలో కూడ కొత్త గుణాల్ని ప్రవేశపెట్టారు. వృద్ధ అయిన శబరిలో ప్రధానమైన సేవారూప భక్తినేకాక, మధురభక్తిని కూడ ప్రవేశపెట్టారు. విశ్వనాథవారు భక్తిభావాల్ని, మధుర భక్తిభావాల్ని, ఒకేసారి ప్రకృతశ్లేష ద్వారా ఎట్లా సమన్వయం చేశారో; ఉపమ, రూపకం, ఉత్ప్రేక్షలద్వారా, సమాలంకారం ద్వారా వస్తుభావరమ్యతల్ని, ధ్వనుల్ని, సంభాషణల్లోని అంతరార్థాల్ని ఎట్లా విశదం చేశారో శబరీ వృత్తాంతాన్ని పరిశీలిస్తే చాలు తెలుస్తుంది. దేవుణ్ణి భర్తగా భావించే ఏ వ్యక్తి అయినా స్త్రీగాని, పురుషుడుగాని, యువతిగాని, వృద్ధురాలుగాని అతనిలో కలిసిపోవడానికి చేసే శృంగారరూప ప్రయత్నాలన్నీ శృంగారభక్తికి లేదా మధురభక్తికి సంబంధించినవే అవుతాయి. శృంగారానికీ, మధురభక్తికీ, భక్తికీ స్థాయిభావం రతి మాత్రమే.

సీతా వియోగ దుఃఖంతో, జడ స్థితిలో ఉన్న రామునిలో, శబరి పట్ల 'రతి' భావం కలగడానికి, మన్మథుడు చేసే ప్రయత్నాన్ని గమనించండి

## రతిభావ ప్రేరేపణ - స్వభావోక్తి ఉపమల ప్రయోగం :

మధ్యాక్కఱ :

మెడలోన తులసి పేరొకటి, మెత్తనిమేని విభూతి
వడి తియ్య విల్లూని కుసుమబాణుండు, బాణంబు చివర
సడలు రేకుల తమ్మిపూవు సంధించి, క్ష్మాసుతా విరహ
జడు మీద, రాముని మీద జ్యావల్లి సారించి విడిచె. (331)

వ॥ అంత శ్రీరామచంద్రుండు సౌమిత్రితో నిట్లనియె : (332)

క॥ తెలి తమ్మిపూవు, బాణము
వలెనయి నాయాత్మలోన బడినట్లయ్యెన్,
వలిమేని, ప్రసన్ననగు, ముదు
తల శబరినిచూచు కోర్కె తారాడుమదిన్. (333)

తులసి పేరూ విభూతీ కల్గిన మన్మథుడు, అంటే, కొంత వైరాగ్యం కల్గిన మన్మథుడు, రెక్కలు సడలిన తెల్లని పద్మాన్ని, ముదుతల శబరికి తగినట్లుగా, రాముని ఆత్మలోనికి ప్రవేశ పెట్టాడు. మన్మథుడు శబరిపట్ల దయతో, రామునిలో ఆమెపై అనురక్తిని కలిగించడానికి స్వాభావికమైన చిన్న ప్రయత్నం చేశాడు. రామునిలో సీతా వియోగం వల్ల కలిగిన జడత్వాన్ని తాత్కాలికంగా వదిలించాడు. రాముని ఆత్మలో శబరి దర్శనాభిలాష ప్రవేశించింది. ఆ తెల్ల తామరపువ్వు, బాణంవలె ఆత్మలోనికి ప్రవేశించిందన్న ఉపమానం, శృంగార భావానికీ, ఆధ్యాత్మికభావానికీ మేలుకొలుపుగా భాసిస్తున్నది. మన్మథుని బాణం, మామూలుగానైతే అరవిందం- కొంచెం ఎఱుపు గలిగిన తెలుపుగలది. ఈ ఎఱుపు రజోగుణానికి ప్రతీక. రామునిలో ప్రవేశించిన తెల్లదామరపువ్వు ఆధ్యాత్మికరతికి, శబరిపై అభిమానం కలగడానికి ప్రతీకగా కనిపిస్తున్నది. వృద్ధురాలైన శబరిని చూడాలనే కోరికను రామునికి కలిగించింది. ఇందులో కామపరమైన రతిభావం లేదు. ఇది అమలిన శృంగారం; కేవలం స్నేహపూర్వకమైన అనురక్తి మాత్రమే. 'రతి' శబ్దానికి అనురక్తి, అభిమానం, స్నేహం వంటి అర్థాలు ఉన్నాయి. ఇవి కలగడానికి మనస్సును మథించే మన్మథుడు కారకుడు ఇతడు వేసిన బాణం

రాముని మనస్సులోపడి ఉంటే. అది కామరతిని మేల్కొల్పేదే! అట్లాకాక రాముని ఆత్మలో పడింది. అది ఆధ్యాత్మిక రతిని మేల్కొల్పింది. ఇది బ్రహ్మ సంకల్పం. ఈ విషయాన్ని చివరలో, శబరి కృతార్థత చెందినప్పుడు శబరి యొక్క- "నతనేత్రాంభోజమ్ముల అతను విధాతృలు పలించి రాయన నుండెన్" (353) అని విశ్వనాథ రాముని పలకుక్షణ సన్నివేశాన్ని వ్యాఖ్యానించాడు. దీన్ని బట్టి మన్మథ బ్రహ్మల ప్రయత్నాల వల్ల శబరీ రాముల ఆత్మ సంగమానికి దారి ఏర్పడిందని తెలుసుకోవచ్చు.

## శబరి తెచ్చిన పూలూ పండ్లూ - ఉత్ప్రేక్ష, ఉపమ :

శబరి రాముని దగ్గరికి 'పూలూ పండ్లూ' తీసుకొని 'సంబంధం' కలుపుకోవాలని వస్తోంది. చూడండి:

సీ॥ కడుపులో మెఱుపులు కలపరించిన నిట్ట
మొయిలు వెల్గులు వోని పూలుకొన్ని
బంగారమును రాగి పాళ్ళుగా కరగించు
వన్నెయై యున్నట్టి పండ్లుకొన్ని
కొన్ని పూవులు, లేత జన్నియావు పొదుగు
వలె గర్భమంథరోజ్జ్వల మధువులు
కొన్ని పండ్లు, రసానుకూల వాంఛా వరీ
పాక ముగ్ధాకార వర్తులములు
విడివిడిగ మెట్ట వళ్ళిక చేర్చి, శిరసు
పైన నిడుకొని, మెల్లగా వచ్చె శబరి,
పుట్టతుదదాక ఎండిన చెట్టుకొమ్మ,
శేఖరంబున యందు పుష్పించినట్లు. (334)

సీస పాదాల్లోని ఉపమానాలు వస్తురమ్యతను, ఎత్తుగీతిలోని ఉపమానం భావధ్వనిని కలిగిస్తున్నాయి. వస్తువర్ణనలో ఉత్ప్రేక్షను ప్రయోగించడం ప్రబంధ కవుల ప్రౌఢ పద్ధతి.

మేఘం కడుపులో మెఱుపులు కలపరించడం, అంటే మిశ్రితం కావడం వల్ల, అవి పువ్వుల ఆకారంతో వెలుగులను వెదజల్లుతున్నాయి అటువంటి పూలు కొన్ని. ఇది ఉత్ప్రేక్ష. బంగారాన్ని రాగినీ సమపాళ్ళలో కరిగించినప్పు

డుండే వసుపు ఎఱుపు రంగు మిశ్రమాన్ని, కొన్ని పండ్లు కలిగి ఉన్నాయి. ఇది కూడ ఉత్ప్రేక్షయే. తొలిమూరు హోమధేనువుయొక్క ఎక్కువ పాలతో నిండిన పొదుగువలె విరివియైన తేనెలతో నిండి మరికొన్ని పూలు ఉన్నాయట! ఇది ఉపమ ఇక్కడ కవి వాడిన 'మధువులు' అన్న శబ్దంలో శ్లేషవల్ల పాలూ తేనె అనే రెండు పదార్థాలు పొదుగునకూ, పూలకూ అన్వయిస్తున్నాయి రుచి చూడాలనే కోరిక ముదిరిపోవడానికి తగిన హేతువుగా, అందాన్ని, గుండ్రని ఆకారాన్ని కొన్ని పండ్లు కలిగి ఉన్నాయట! ఇది హేతువు అనే మరో అలంకారం. అట్లాంటి పూలూ పండ్లూ ఉన్న తట్టను తలపై పెట్టుకొని వచ్చిన వృద్ధశబరి, చివరగా పుష్పించిన, ఎండిన చెట్టు, కొమ్మలాగా ఉందట, ఎండి పోయే చెట్టు, చిట్టచివరగా దాపు కాపు కాస్తుంది. ఈ పోలిక, శబరి చివరిదశను ధ్వనింపజేస్తోంది. రామునికి ఆతిథ్యం ఇచ్చిన తర్వాత, తన శరీరాన్ని అగ్నికి ఆహుతి చేసి, శబరి ముక్తిని పొందబోతున్నది. ఎండిన కొమ్మ అయిన శబరి, అగ్నికి ఆహుతి కావడానికి యోగ్యమైందే కదా! ఈ భావధ్వనికి కారణం ఉపమయే. శబరి తెచ్చిన పూలూ పండ్లూ, అంత ఆకర్షణీయంగా, రుచికరంగా ఉన్నట్లు వర్ణించడానికి కారణం రాముడు వాటిని చూచిన వెంటనే స్వీకరించి, ఆరగిస్తాడనే శబరి ఆకాంక్షకు ప్రతిబింబంగా చేయడమే. ఈ వస్తురమ్యతకు ఉత్ప్రేక్ష, ఉపమ, హేతువు అనే అలంకారాలు ఉపయోగపడ్డాయి.

కొందరు ప్రబంధ కవులు వర్ణన వర్ణన కోసమే అన్నట్టు, రాయలు, రామరాజ భూషణుడు వంటివారు వస్తు రమ్యత, భావ రమ్యతల కోసం అలంకారాల్ని అధికంగా వినియోగించారు అల్లసాని పెద్దన లాంటివాళ్ళు వస్తుధ్వని భావధ్వనులకోసం అలంకారాల్ని వినియోగించారు. విశ్వనాథ సత్యనారాయణ గారు ఆ రెండు మార్గాల్ని ఈ పద్యంలో ప్రదర్శించారు. తీర్థానికి తీర్థం, ప్రసాదానికి ప్రసాదం అన్నట్టుగా కాకుండా వర్ణనల్ని, కథను అలంకారం ద్వారా మిశితం చేసి తద్వారా సిద్ధించే వస్తు భావ రమ్యతల్నీ, ధ్వనుల్నీ విశ్వనాథవారు ఇక్కడ సుష్ఠుగా ఉపయోగించుకున్నారు. అలంకారం కారణంగా ఈ పద్యం అర్థగౌరవంతో తొణికిసలాడుతోంది.

## కర్మయోగినీ లక్షణాలు, వందనభక్తి - ప్రకృతశ్లేష, రూపకం, ఉత్ప్రేక్ష, పరికరం :

శబరి కర్మయోగిని. ఆమె కర్మ(చేష్ట)ల్లో, మాటల్లో, దైవసంబోధనల్లో మధురభక్తిపరంగా, ఆధ్యాత్మికపరంగా అర్థాలన్నీ సమన్వయపడుతున్నాయి.

ఇవి ప్రకృతశ్లేష, పరికరం, ఉపమ, ఉత్ప్రేక్ష అనే అలంకారాలద్వారా ఎట్లా వ్యక్తమయ్యాయో గమనిద్దాం:-

తే॥గీ॥ చేతులునికిని పూలు తెచ్చితిని స్వామి!
చెట్లు కలవని పండ్లు తెచ్చితిని స్వామి!
సతను వగుటను నేను వచ్చితిని స్వామి!
చిత్తముండుట నూహ చేసితిని, కాని

సీ॥ నేపూలు తేలేదు, నేపండ్లు తేలేదు,
లీలామనోజ! రాలేదు నేను;
క్రొత్తగా నీవు మాకొండిక చోటికి
రాలేదు; బుద్ధిధారా ప్రసన్న
పరిచారికా స్వభావకు నాకు, మరియాద
చేయనక్కరలేదు చిత్తజన్మ!
అల అగస్త్యాది మహర్షుల వనముల
ఫలము లీరుచికావు; ప్రాణనాథ!
నాదు ప్రాణములను నీకు మీదుకట్టి
నాను, నీవయి యిట వచ్చినావు స్వామి!
మ్రొక్కు చెల్లింతు, స్వీకరింపుము ప్రియాంగ
నా మహాయల్లకానల ధూమదేహ! (343)

ఈ పద్యాల్లోని సంబోధనలన్నీ శృంగారపరంగా, ఆధ్యాత్మికపరంగా రెండేసి అర్థాలను కలిగి ఉన్నాయి. 'స్వామీ' అంటే భర్త అనీ, దైవం అనీ; 'లీలామనోజ!' అంటే లీలకోసం రామునిగా అవతరించిన మన్మథా! అనీ, లీలగా నా మనస్సునందు జన్మించినవాడా!, అంటే నా భక్తికి మెచ్చి నా మనస్సులో నిల్చినవాడా! అనీ; 'ప్రాణనాథ!' అంటే, పతి దేవా అని, నా ప్రాణాలకు అధిపతివైన ఓ దైవమా! అనీ; 'ప్రియాంగనా మహా + అయల్లక + అనలధూమ దేహ! అంటే ప్రియురాలి విరహాగ్నినుండి పుట్టిన ధూమమే దేహముగా కలిగిన వాడా! అనీ; నీకిష్టమైన భక్తురాలి వియోగాగ్నినుండి పుట్టిన ధూమమే దేహముగా కలిగినవాడా అనీ రెండేసి అర్థాలు వస్తున్నాయి. ఈ రెండర్థాలు ప్రస్తుత సందర్భానికి సరిపడి ఉండడం వల్ల, ఇది ప్రకృతశ్లేష అవుతున్నది. "లీలా

మనోజ!' 'చిత్తజన్మ!' అనే సంబోధనల్లో శృంగారపరంగా రూపకాలంకారం ఉంది. 'ప్రియాంగనా మహాయల్లకానల ధూమదేహ!' అనే దీర్ఘసంబోధన రూప కోత్ప్రేక్ష అవుతున్నది. మిగిలిన పదాల భావాలన్నీ ఈ సంబోధనల కన్నింటికీ ఉన్న రెండేసి అర్థాలతోను సమానంగా, అర్థభేదం లేకుండానే అర్థాన్వయాన్ని కలిగి ఉన్నాయి. దీన్నే అర్థాన్వయ భేదశ్లేష అంటారు. ఈ పద్ధతి రాఘవ పాండవీయం వంటి ద్వ్యర్థి కావ్యాల్లో తరుచుగా వినియోగింపబడి ఉంది.

శబరి తాను 'బుద్ధిధారాప్రసన్న పరిచారికా స్వభావ'ను అని చెప్పుకున్నది. అంటే-తన ఆలోచన ఇతరులకు పరిచర్య చేయడమనే స్వభావాన్ని కలిగిఉందని చెప్పడం. పూలూ పండ్లూ, తనను అభిసరించి వచ్చిన, 'లీలామనోజు'డైన రామునికి, ఆతిథ్యమివ్వడానికి తెచ్చాననడం శృంగారపరమైన భావన. నువ్వు నా మనసులో పుట్టినవాడివి (మనోజుడవు) కాబట్టి నేను ఇప్పుడు నీకు కొత్తగా పూలూపండ్లూ తీసుకురావడమనేదేముంది? పరిచర్యాబుద్ధితో ఈ సేవ (కర్మ) చేస్తున్నానే కాని, కర్మఫలాన్ని ఆశించికాదు - అనే భావన కర్మయోగానికి సంబంధించి ఉంది. ఓ రామా! నువ్వు కొత్తగా ఈ ప్రదేశానికి వచ్చిందేమున్నది? నువ్వు నా చిత్తమందే జన్మించి (చిత్తజన్మ!) ఎప్పటినుంచో ఉన్నావు కదా!

ఈ ఫలాలు, అగస్త్యుడు నీకు ఆతిథ్యంలో ఇచ్చిన ఫలాల వంటివికావు. నా ఫలాలు కర్మఫలాలు. నా ఫలాల్లో నా సేవాభక్తి ఇమిడి ఉంది. ఇవి అన్నింటికంటె మధురమైన ఫలాలు సుమా! అని శబరి హెచ్చరిక చేస్తున్నట్లుగా ఉంది.

ఓ 'ప్రాణనాథ!' నా ప్రాణాలను నీకై 'మీదుకట్టినాను.' ఈ ప్రాణాలపై అధికారం నీదే. నెయ్యి (మీదు) రూపంగా ఉన్న నా ప్రాణాలను ముడుపుగా స్వీకరించడానికి నువ్వు వచ్చావు. నెయ్యిగా కూడ బెట్టిన నా ప్రాణాలు నీ విర హాగ్నిలో కరిగిపోవడానికి వీలుగా సిద్ధంగా ఉన్నాయి - అన్నది శృంగార పరమైన భావం. తన ప్రాణాలు అనే నెయ్యిని రాముని విరహాగ్నిలో దగ్ధంచేసి, పునర్జన్మ లేకుండా ముక్తిని పొందడానికి సిద్ధంగా ఉన్నాననేది ఆధ్యాత్మిక పరమైన భావం. ఇది శబరి ఆత్మార్పణ రూపభక్తికి ప్రతీకగా కనిపిస్తున్నది. రామునిపట్ల వాడిన సంబోధనలన్నీ సార్థకంగా ఉండడంచేత, ఇక్కడ పరికరా లంకారం కూడ చోటు చేసుకున్నది.

## శబరి ఆనంద నేత్రముద్ర - ఉపమ, ఉత్ప్రేక్ష :

రాముడు, శబరి సమర్పించిన సంపూర్ణ కర్మఫలాలను ఆరగిస్తూ ఉంటే-

"శబరీనత నేత్రాంభోజమ్ముల
నతను విధాత్రులో ఫలించిరాయన నుండెన్" (353)

అని విశ్వనాథ శబరి ఆనంద ముద్రను వర్ణించాడు. శబరి, మూసిన తన పద్మాల్లాంటి కన్నుల్లో మన్మథుడు, బ్రహ్మ - తమ తమ కర్తవ్యాల్లో ఫలవంతులయ్యారు అన్నట్లుగా ఉన్నాయని, ఆమె నేత్రాల్ని, కవి ఉత్ప్రేక్షించాడు. అంటే, మధురభక్తి పరంగా మన్మథుడు విజయం సాధించాడని, తత్ఫలితంగా ఆనందముద్రలో శబరి కనులు మూసుకుని ఉన్నదని ఒక భావన. శబరి తన సేవాభక్తి పరిపూర్తి అయిందనీ, తన కర్మఫలానుభవం ఏదీ మిగలలేదనీ, తనను రామదైవం కరుణించిందనీ, ఆ ఆనందంతో, ఆమె తన పద్మాల్లాంటి కన్నులు మూసుకుని ఉన్నదనీ, అది బ్రహ్మకు లభించిన విజయమని ఆధ్యాత్మిక పరమైన భావన. ఈ విధంగా మధురభక్తిపరమైన, భక్తిపరమైన భావనలు శబరీరాములపరంగా నడిచాయనడానికి ఈ ఉత్ప్రేక్షాలంకారం సాక్ష్యంగా నిలుస్తున్నది. ఇక్కడి శృంగారం అమలినమైందే కాని శారీరకమైంది కాదు. ఇది శబరి పాత్రలో విశ్వనాథ కల్పించిన నూతన గుణం.

## శబరీరామ ఆధ్యాత్మిక చమత్కార సంభాషణం - సమం, ఉపమ, రూపకం, వస్తుధ్వని :

తే॥గీ॥ అవ్వ! నివ్వరి వెన్నుల యట్లు, ముగ్గు
బుట్టవలెనయ్యె నీ శిరంబునునసంగ;
ప్రభువ! నీ ఆత్మవాకిట రంగవల్లి
నినుచుటకును ఇంతగాగ పండినదటంచు. (355)

తే॥గీ॥ అవ్వ! యెంతో తపించి నీ ఆయువెల్ల
నార్చి నీవిట్టు లెండి యేకైతివనగ;
ప్రభువ! స్నేహంబుచేత అర్ద్రంబు చేసి
యింత దివ్వెగా వెలిగించవేయటంచు (356)

తే॥గీ॥ అవ్వ! నీకిట్లు తీవ్రవ్రతాభిషంగ
మునను, ప్రాణాలు గూళ్ళు వట్టినవనంగ;
ప్రభువ! నీ యింత తీవ్రదయాభిషంగ
మునను ప్రాణమ్ము గూట జేరినదటంచు. (357)

రాముని సానుభూతిరూప ప్రశ్నకు, సమానమైన అనురూపతను కలిగిన శబరి సమాధానం, సమాలంకార ప్రయోగంద్వారా సమకూర్చడం, విశ్వనాథ అలంకారలక్షణ విజ్ఞతకు నిదర్శనంగా ఉంది. మొదటి రెండు పద్యాల్లో సమాలంకారం అంగిగాను, ఉపమారూపకాలు అంగంగాను ఉన్నాయి. 'స్నేహం', 'ఆర్ద్రం' అనే మాటల్లో శ్లేష ఉంది. మూడవ పద్యంలో, అమె ప్రాణాలు చివరి పరిణామదశకు చేరినాయనీ, ఇక వాటికి విశ్రాంతి అవసరమనీ చెప్పడానికి విశ్వనాథవారు పరిణామాలంకారాన్ని ధ్వనింపజేశారు.

ముగ్గుబుట్టవలె ఉన్న శబరి తల, పరమాత్మ ఇంటి ముంగిట ముగ్గులు వేయడానికి పిలుగా ఉన్నదట! తల బుద్ధికి ప్రతీక. ఆ బుద్ధికి సంబంధించిన ఊహలను, ఆధ్యాత్మిక భావాలను, దైవ సేవాంకితం చేశానని శబరి అభిప్రాయ పడుతున్నది. ముగ్గువేయడమంటే సేవాభక్తితో పూజచేయడమని అర్థం. 'ఆత్మ వాకిట' నిలిచి ఉండడమంటే దైవ సాక్షాత్కారంకోసం వేచి ఉందని చెప్పడం. శబరి ముగ్గువేసి దైవదర్శనం కోసం పిలుపుగంటను కొట్టింది. అతడు సంతోషంతో తన నిలయంలోకి రానిస్తాడని శబరి ఆశ.

శబరి శరీరం, పరిచర్యలు చేసి చేసీ, ఏకబడిన, నిస్సారమైన ఏకుగా తయారయింది. ఆ ఏకును, స్నేహమనే నూనెతో తడిపి, తన్నాక దివ్యదీపికగా వెలిగించమని, రామునికి శబరి నివేదన. అంతేగాక, తన శరీరం అగ్నికి ఆహుతి కావడానికి తగినవిధంగా, నిస్సారమైపోయిందనీ, తన ఆత్మ, శరీరాన్ని వదలి వెళ్ళడానికి సిద్ధంగా ఉందనీ, శబరి సూచన. ఇక్కడొక సమకాలీన సామాజికాంశం కూడ ధ్వనిస్తోంది. వెట్టిచాకిరీ చేసేవాళ్ళు పనిచేసి చేసీ, శబరిలాగే, ఎండి, ఏకవుతారనీ, వారికి సాటిమానవుని స్నేహం, సానుభూతి, దైవసహాయం

ఉంటే, తద్వారా వారికి వెట్టినుండి విముక్తి కలిగి వారి జీవితాల్లో వెలుగు నిండుతుందని, విశ్వనాథవారు వ్యంగ్యంగా సూచిస్తున్నారు. దీన్నే అలంకారకృత వస్తుధ్వని అంటారు.

పరిచర్యావ్రతం కారణంగా, శబరి పంచప్రాణాలూ గూళ్ళుపట్టినాయని రాముడంటే; నీ దయ కారణంగా నా ప్రాణం అంటే జీవాత్మ పక్షివలె, గూడు అంటే పరమాత్మ నిలయం చేరబోతున్నదని శబరి సమాధానం చెప్పింది. పంచప్రాణాలూ తమ కర్తవ్యాల్ని మానేసి, విశ్రాంతిని కోరుకుంటున్నాయనీ, తాను ఈ జన్మలో చేయవలసిన పనులన్నీ (కర్మలన్నీ), రాముని ఆతిథ్యంతో అయిపోవడం చేత, జీవాత్మ పరమాత్మను చేరడానికి సిద్ధంగా ఉందని శబరి వ్యంగ్య భావన. రాముని పలకరింపుతో తన కర్మ ఫలానుభవం పూర్తి అయిందని, తాను సేవించిన మతంగాది గురువులు వెళ్ళిన లోకాలకు, తాను రాముని దయతో, శరీర త్యాగం చేసి వెళ్ళనున్నానని శబరి సూచన దీని కనుగుణంగానే సేవా పరాయణమైన శబరి, రామలక్ష్మణులకు మతంగాశ్రమ మహిమల్ని చూపించి, అగ్నిప్రవేశం చేసి, గురువులు వెళ్ళిన లోకాలకు సేవార్థమై వెళ్ళింది.

విశ్వనాథ శబరికి ఇంత పేరు రావడానికి, శబరీ రామ సంభాషణలే ప్రధాన కారణమంటే, అతిశయోక్తి కాదు. ఇందులో శృంగారపరంగా, ఆధ్యాత్మిక పరంగా చెప్పిన భావాలకు, ప్రకృత శ్లేష, ఉపమ, రూపకం, ఉత్ప్రేక్ష, సమాలంకారాలు బాగా ఉపయోగించాయి. వీటిద్వారా విశ్వనాథవారు వ్యంగ్యాన్ని, వస్తుభావ రామణీయకాల్ని, అర్థాంతరాల్ని సాధించి, శబరికి ఆత్మసౌందర్యాన్ని, తన రసకవితకు వలెనే, నిష్కళంకంగా సమకూర్చారు. *

# శ్రీమద్రామాయణ కల్పవృక్షము-
# సమకాలీనత

—ఆచార్య కోవెల సుప్రసన్నాచార్య

అన్ని సాహిత్య ప్రక్రియలకంటే, వస్తువిస్తారవైఖరిలో, విశ్వవికాస దర్శనంలో ఇతిహాసం ప్రముఖమైంది. ఇతిహాసం మానవుని కేంద్ర బిందువుగా- అతని అనుభవ ప్రపంచాన్ని సర్వతోముఖంగా వ్యాపించి ఉంటుంది. కొన్నితరాల జీవన పరిణామాల చిత్రణతో ఈ రచనా విశేషం నిలిచివున్న ఇంద్రధనువులాగా ఆశ్చర్యం కలిగించే బహువర్ణశబల రూపవిశేషంతో అద్భుతాన్ని కలిగిస్తుంది.

అయితే వ్యక్తజగత్తు ఎప్పుడూ నియతమైన కాలబిందువుమీదనే సాక్షాత్కరిస్తుంది. దాని ఆవిర్భావం ఎల్లాంటిదో, కాలనియతి దాని అంతర్ధానాన్ని కూడ నిరూపిస్తుంది. కాని, ఇతిహాసం నియత కాలబిందువుమీద గోచరించినా అనంతమైనకాలం దాన్ని ఆలింగనం చేసుకుంటుంది. వర్తమానపు పాదులోనుండి ఎదిగి వచ్చే ఇతిహాసరూపమైన మహావృక్షం వేళ్ళతో భూతకాలపు పొరలను చీలుస్తూనే కొమ్మలతో భవిష్యత్తుకు విశ్రామస్థానంగా రూపొందుతుంది. ఖండమైన కాలం అఖండమైన కాలచైతన్యంలో సంలీనం అవుతుంది.

'మరల నిదేల రామాయణం బన్నచో' అని వర్తమాన ఘట్టంలో నిలబడి భూతకాలంతో తనను తాను పోల్చి చూచుకున్న కవి-జగత్తుయొక్క నిత్యజీవన వ్యవహారంలోకి తాను ప్రవేశించి క్రమంగా అనంతకాలమువైపు పరిక్రమిస్తున్నాడు. ఈ జగత్తు వ్యవహారానికి మూలభూతములైన అర్థకామాలు రెండూ దాని నిత్యానుభవంలో భాగాలే. 'తినుచున్న యన్నమే తినుచున్నది', 'చేసిన సంసారమే చేయుచున్నది' తొలి అంశం జీవితంలోని అన్నమయ ప్రాణమయ శక్తులను ప్రకటింపగా - రెండవ అంశం ప్రాణమయ మనోమయ శక్తులను జమిలిగా వ్యక్తీకరిస్తున్నవి. బ్రతుకు-రుచి-అనుభూతి ఈ మూడూ మూడు స్వరాలను వ్యక్తీకరిస్తున్నవి. ఈ పరిధిలోనే మానవుని జీవితం కథగా రూపుకట్టుకొంటు

న్నది. అంటే 'కట్టుకథ' అవుతున్నది. దీనిని మించిన ఈశ్వరచైతన్యస్పర్శ 'భక్తిరచన'లో ఉన్నది. దానికి హేతువు జీవుని వేదన. అందుకే తండ్రి యాజ్ఞ కట్టుకథను కాదని రామచంద్రుడు కథ వ్రాయమన్నది. రఘుదేవుని సాదుకథా ప్రపంచాన్ని ప్రపంచించబూనుకొన్న కవిని బ్రతుకునూ - రుచినీ - అనుభూతినీ దాటిన నాల్గవదశ వేదన చుట్టివేస్తున్నది.

రసము లోకము నాశ్రయించింది. 'లోకమ్ము వీడి రసమ్ము లేదు.' కాని రసము లోకమును దాటి ప్రవర్తిస్తున్నది. సాధారణీకరణ దశలో ఉపాధి నిర్ముక్తమైన జీవదశను పొందుతున్నది. వాసనా నిర్ముక్తమైన చైతన్య దశ కాక పోయినా ఈ దశలో జీవభావం లోకానికీ అలోకానికి నడుమ ఉంటున్నది. అక్కడ రసాస్వాద దశలో కథా శరీరము, కథాగత పాత్రలూ, కథానివిష్టమైన దేశ కాలాలూ అన్నీ కుబుసాలలాగే విడిపోతున్నాయి. అప్పటికీ జీవుడు ఏదో అవిదితమైన పిపాసలో ఉంటూ వున్నాడు. అది స్వచ్ఛమైన ఆనందానుభవాన్ని స్మరించుకొని అక్కడనుంచి జ్యోతి పొందిన తన చైతన్యం దానిని గురించి పొందే ఆర్తి.

'రసము వేయిరెట్లు గొప్పది నవకథాధృతిని మించి' అయినా జీవుని వేదన దీనికి కొంచెం పైమెట్టుది. దీని సాఫల్యం రసానికీ బ్రహ్మరసానికి నడుమ సరి హద్దులను చెరిపివేస్తుంది. కల్పవృక్షం సమాంతరంగా రెండు దశలలోనూ ప్రసరిస్తున్నది. ఇందుకు భావన సాధన రెండు త్రోవలు రససిద్ధి, తపస్సిద్ధి రెండు లక్ష్యాలు. ఈ స్థితి కల్పవృక్షంలోని ప్రశస్త వాగ్విలక్షణత్వంచేత సాధ్య మవుతున్నది.

## II

కల్పవృక్షారంభం ఆత్మ లక్షణ నిరూపణతో ప్రారంభమైంది 'ఆత్మలో నాదిమునులెట్టులవని తోడ నాదిన్నృపులైక కాలికులై చరింత్రు' ఇవి రెండు మార్గాలు అంతర్ముఖత్వము - బహిర్ముఖత్వము. ఈ రెండూ పరస్పర విరుద్ధాంశాలు కాకుండా పరస్పర పరిపూరకాలు, ఒకే తత్త్వం యొక్క రెండు ముఖాలు. అందుకే కల్పవృక్షంలో శారదాదేవి 'పాలితాన్యోన్య లంఘన స్పర్థనములు, దాలితాన్యోన్య సౌందర్య సరసములును నైన పలుకుల కూడిక.'

దశరథుని యజ్ఞానికి వచ్చిన నారాయణుడు 'బదరీవనిలో, ముదిచెట్టు క్రింది పచ్చని వెలుగౌచు - తాపసిరూపున వచ్చియున్న శార్ఙ్గి. ఆయన ధనుస్సు బ్రాహ్మణ క్షత్ర ధర్మ పరస్పరాశ్రయ క్రమము చెప్పె.' ఇక్కడ మళ్ళీ ఈ రెండు లక్షణాల సమన్వయమే. ఏ కాలంలోనైనా విజ్ఞానమూ-అధికారశక్తీ సమన్వితమై కొనసాగినప్పుడే లోక కల్యాణం సాధ్యమవుతుందని ఈ ధనుస్సు సూచిస్తుంది. మొత్తం కల్పవృక్షం ఈ ధనూలీలయే. విజ్ఞాన విరహితమైన అధికారము రాక్షసమవుతున్నది. అధికార సంవలితంగాని విజ్ఞానం రక్ష లేకుండా వికలములైన మున్యాశ్రమాలవలె క్షోభితమవుతుంది.

కల్పవృక్షంలోని రాజ్య వ్యవస్థా వైక్లబ్యంలో వర్తమానం పరిస్ఫురిస్తున్నది. దశరథుని రాజ్యము, స్వర్గరాజ్య సంక్షోభము, కిష్కింధలోని రాజ్యము, రావణుని రాజ్యము- ఇవి కొంతవరకు సూచికలుగా వర్తమాన ప్రపంచంలోని ప్రజాసమస్యల తోరణాలు కట్టిస్తున్నవి. రాజ్య వ్యవస్థలోని అనుకూల వ్యతిరేక ముఖాలు- వ్యక్తికీ వ్యవస్థకూ నడిమి సంఘర్షణమూ స్ఫుటంగా చిత్రింపబడ్డాయి.

బాలకాండలో చిత్రితమైన వశిష్ఠ విశ్వామిత్రుల సంఘర్షణము, చివరి సమన్వయము అద్భుతమైన ఈ లక్ష్యస్థితికి సంకేతములే. ఈ ఘర్షణలో పైకి బ్రహ్మబలము అధికమైందిగా నిరూపింపబడినట్లున్నా- ఆత్మబలము, అహింసాది సద్గుణములు లోకంలో ఎంతటి బలమైన శక్తినైనా జయించగలుగుతాయనేది ప్రధాన స్ఫురణము. వర్తమాన కాలంలో గాంధీమహాత్ముని విజయం ఈ తత్త్వాన్నే ప్రస్ఫుటంగా వ్యక్తం చేస్తున్నది.

రాజునకు సంతతి లేకపోవటానికి తమ పరిపాలనలో దోషమున్నదేమోనని మంత్రులు సందేహిస్తారు. వారు ప్రావృత్కాల దండలు. నిష్కలుమని రిపుడైనా నొవ్వగజేయడు. శౌచవంతులన్ తలపఱు పెట్టుకొందురు. ఇలా దశరథుని మంత్రుల గుణాలను చదివేప్పుడు మనకు మంత్రులెలా ఉండవలెనో ఉండగూడదో తెలియవస్తుంది.

దశరథుడు అయోధ్యా దర్శనము చేస్తాడు. అంతా సక్రమంగా సుష్ఠుగా ఉన్నట్లుగా కానవచ్చింది. కాని, అదంతా తన రాకకోసం ఏర్పరచిన స్థితియేమోనన్న అనుమానం రాజుకు కలిగింది. రాజిలా అంటాడు.

ఉటియవు నాకుపైపయిని యొప్పులు చూపి సమస్త ధాత్రి యం
దౌఅలుట లేమి చెప్పెద వహో! జనులెంతగనున్న నంతలో
నౌఅవులు నేసికొంద్రు తిననున్నదొ లేదొ మఅప్పునప్పలో
కఅవులొ కష్టమో తెలియదుగావలె నీపయి చూపులేటికిన్.

రాజు దృష్టి ఎట్లా సామాన్యజనుల దుఃఖాలను పట్టుకొనేదిగా ఉండవలెనో ఈ పద్యం సూచిస్తున్నది. పైపై మెఱుగులు చూచి- చూపించి భ్రమసిపోయే ఈనాటి రాజ్య వ్యవస్థమీద యిది కశాఘాతం వంటి సన్నివేశం.

జమదగ్ని కథను చెప్పినప్పుడు రాజుల దౌష్ట్యం ప్రకటిస్తాడు కవి. ఆవు నిమ్మని కార్తవీర్యుడడిగితే జమదగ్ని కాదంటాడు. రాజు నీవిచ్చేదేమిటి అని బలవంతంగా కొనిపోతాడు. 'అది పిచ్చియోయి రాఘవ! మదించిన నృపాలకులకు మలినగుణ గణాస్పద మేదియైన రాజులు గద రత్నగ్రాహులంచు గణించుటలోన్!' ఇదీ రాజ్యవ్యవస్థలోని నియంతృత్వ, సంచాయక స్వసుఖ మాత్ర భావనకు ఆధారమైన విషయం. వారికి ఉన్న బలం ప్రధానంగా సైన్యబలమే. రాజు కొలువునకు వచ్చి మా యావు నిమ్మని అడిగితే రాజు చెప్పిన సమాధానం రాజుల దురహంకారానికి పరాకాష్ఠ.

'కడుకనలేచి కన్నులనుకై విలుగొడ్డలి పూనివచ్చి నీ
వడిగిన మాత్ర నిచ్చుటకె యావును దెచ్చితి పొమ్ము మూర్ఖుడా
చెడెదవనంగ వాని వెయిచేతులు గొడ్డలి గాట్లు గొట్టితిన్.'

ప్రజలు రాజుల దోపిడిని, దుర్మార్గమును ఎదిరించవలని వచ్చినపుడు పరశురామునివలె హింసాపథము స్వీకరించక తప్పదని పరశురాముని కథ వ్యక్తీకరిస్తున్నది.

అయితే పరశురాముని కోపం కార్తవీర్యుని వంశ నిర్మూలనతోనైనా ఆగిపోవలసింది. ఆ పని చేసినందుకు కారణమైన రాజ దుష్కృత్యం ఉండనే ఉన్నది. కాని యిరవైయొక్కసారి రాజవంశాల నిర్మూలన నిష్కారణమైన హింసావాదమైంది.

'పొదివి పొదివి నృపుల తలలు పుణికి పుణికి నఱికి స
మ్మదము ముదము నెడద గదుర మలగి మలగి గురునకున్
కుదురు కలుగ జలము వదలి కొసకు కినుక తొలగితిన్.'

ఈ ఘట్టంలో హింసాయుతమైన పోరాటం అవసరమే అయినా నిష్కారణమైన, నిర్దోషులను హింసచేసే లక్షణం నిరాకరింపబడింది. వర్తమానకాలంలో ఉగ్రవాదం ప్రారంభం కావటం ఎంత ఉన్నత లక్ష్యంతో జరిగినా తుదకు అది పతనం కావటానికి, నిర్హేతుకమైన విచక్షణారహితమైన హింస ఎలా లోకక్షోభకు హేతువవుతుందో నిరూపితమవుతున్నది.

అయోధ్యకాండలో దశరథుని మరణం తరువాత అరాజకత్వ వేళలో కలి విజృంభించినాడట ఆ కలి విజృంభణ లక్షణ వర్ణనలో సమకాలీన వ్యవస్థలోని దోషాలను కవి స్పష్టంగా చిత్రిస్తున్నాడు. ఆ కలి స్వరూపం వర్ణనలోని కొన్ని అంశాలు యివి. 'తండ్రినిపుత్రుచే, తరుణిచే భర్తను సిగ్గఱ నెదిరింపజేయువాడు.' 'అయదార్థతకును పట్టాభిషేకము చేసి ఋజునగణంబు నధఃకరించువాడు' - 'నిష్ప్రయోజనముగ నిందోలగంబులు తీర్చువాడు సిలుగు కూర్చువాడు'. 'వృత్తి విద్యలు నాట్య విద్యలు కుల కర్మ లగుట హాస్యంబున నెగచువాడు' - 'పదుగు రొక్కట గూడి పలికిన ననుమానవడి శిక్ష పరిహార పరచువాడు'-'ధనవంతులను దోచుకొను పేదవారికి కుటియు వెన్నంటుకొనును'-'కామమ్ము దేవతాకారమ్ముగా గొల్వజేయువాడు తపస్సు మాయువాడు' - 'నదులలో నీరు వనంబున గడ్డియు నెమ్మించి భయము చేయంగలాడు' - 'అమృత మాహేయీ పయఃశ్యామ మేర్పడ గోవుల పొదుగులు కోయువాడు' - 'ఇది నాదియని యెవ్వరేనియు ననుకోను వీలులేకుండ కల్పించువాడు - 'చేపలనుబోలె నొక్కరిచేత నొకరి నుర్విజనులకు దినిపించు నుక్కలుండు '

ఈ కాలంలో అనేక రకాల పేర్లతో వాదాలతో తత్త్వాలతో సిద్ధాంతాలతో నడిచే రాజ్యవ్యవస్థలలోని లోపాలను కవి విశదంగా చిత్రించినాడు. సమాజంలో ప్రాథమికమైన కుటుంబవ్యవస్థను పెరకివేయుటం తొలి కార్యక్రమం. ప్రచార యంత్రాంగం ద్వారా అసత్యానికి ప్రాచుర్యాన్ని కలిగించి సత్యాన్ని అణగ ద్రొక్కటం ఆధునిక రాజ్యవ్యవస్థల ఒక ముఖం. అన్నం పెట్టె కులవృత్తులను కూల్చి

అందరికీ జీవనమార్గం యీ యలేని విద్యావ్యవస్థను ఏర్పరచటం మరొక లక్షణం. వాక్స్వాతంత్ర్యాన్ని తొలగించి ఆత్యయిక వ్యవస్థను ప్రవేశపెట్టడం రాజ్యవ్యవస్థల మరొక తీరు. ధనవంతులను పన్నులద్వారా, పేదలకు జీవనం కలిగించే ప్రయత్నం చేయకపోవటంవల్ల అందరికీ అసుఖాన్ని కలిగించటం - కామమే ప్రధాన ఆరాధ్యదైవంగా నిరూపించటం, ప్రజలను తప్పుదోవ పట్టించటం, ప్రకృతి సిద్ధమైన సంపదలు నీరు, గాలి మొదలైన వాటిని రాజ్యస్వంగా ప్రకటించి పేదల కడుపుకొట్టడం ఈనాటి రాజ్యాంగంలోని ప్రధానాంశాలే. ప్రకృతి సహజములైన ద్రవ్యాలను అతి వేగంగా ఖర్చుచేసి నేలను ఇసుకపఱ్ఱను చేయటం భూమిలోని సంపదలను తొలగింపజేసి తాత్కాలికంగా సుఖం పొందటం, దేని యందు ప్రజలకు స్వత్వం లేకుండా చేయటం - ఒకరి మీదకు ఒకరిని ఉసిగొలిపి వర్గాలుగా విభజించి వైరుధ్యాలను పెంచి కల్లోలాన్ని నిలువరించటం మొదలైనవీ మనం ప్రత్యక్షంగా అనుభవించే అంశాలే.

ఇలా కలి పురుషవర్ణనలో కవి తాను రాజతంత్ర వ్యవస్థల్లోని దోషాలను కన్నులకు కట్టించినాడు. విశ్వనాథ రాజ్యవ్యవస్థను గూర్చి తన గ్రంథాలలో అనేక స్థలాలలో చర్చించినా, ఆ వ్యవస్థ స్వరూపాన్ని విపులంగా చిత్రించింది 'సముద్రపు దిబ్బ' అనే ఒక నవలలో.

మరొక రాజ్యపాలనా లక్షణం రావణునితో వర్ణింపబడుతుంది. రావణునికి ముందున్న రాక్షసవీరులు మహా భుజ దర్పిత శౌర్య వృత్తులు. ఇతడు జయించుట ప్రతిష్ఠకయికాదు సంపదాప్తికి. దోచుకోవటం. దేశాలను పేదపరచి తాము వ్యాపారం పేరనో పారిశ్రామికత పేరనో నష్టపరచటం ఈ నడుమ నడుస్తూవున్న రాజనీతి.

'మయశిల్ప ఖాక్సు ధర్మా మహానట శిలాప్రతిమలు లంకకు పయనమయ్యె' మహానట శిలాప్రతిమలు లంకకు పోవటం రావణుని లంకకు పోవటమే కాదు - ఇంగ్లండుకు పోవటం. ఉత్తమ శిల్పసంపద ఇతరములైన విలువైన అంశాలు పరిపాలకులైన బ్రిటిషువారి నేలకు చేరటం ఈనాటి చరిత్రలో ప్రఖ్యాతమైన అంశమే.

'హరి నీలకృతములైనట్టి నీ ప్రతిమల చెవులును ముక్కులు చెక్క బడియె.' ఇదీ మన చరిత్రలో మధ్యయుగాలలో నాగరకతా విధ్వంస చర్యలలో మనం అనుభవించిన అంశమే. ఈనాడు చారిత్రక నిర్మాణాలలో ఎక్కడ చూచినా ఈ అంశం స్పష్టంగా కానవస్తుంది.

రాక్షసులు తాత్త్వికవివేచనలో అగ్ని వాయవ్యాది దేవతలకు 'దేవతల మనుట పోయి పదార్థత్వ ప్రథ మిగిలినాము.' పదార్థములనే భావం పెంపొం దింది. ప్రకృతిలో అంతర్లీనంగా ఉన్న చైతన్య స్ఫూర్తిని గూర్చి ఆధునిక విజ్ఞానశాస్త్రం భావన చేయలేకపోయింది. అందువల్లనే ప్రకృతితో సామరస్యమూ తొలగిపోయింది.

శాంతను పెంచుకొన్న రోమపాదుడు రాజ్యములో కరవు రాగా 'జనులు హాహారవముల రాజు మొగసాల నిలిచి మొత్తులిడినంత విభుడు నేడ్చు వారిచే విసరి పంపి' యిలా అన్నాడు. ఒకచోట కురుపు మందింకొకచోనన్నట్లు పాప మూర్వీపతి దిన్ వికృతపు బాములు ప్రజలవి! ఇదీ రాజులు లోక క్షోభకు తమ పరిపాలనే కారణమని విశ్వసించే నాటి విధము. ఈనాడు ఎన్ని సంక్షోభాలు వచ్చినా, ప్రమాదాలు సంభవించినా రాజ్య పురుషులు తమ లోపాలను అంగీకరించే ధోరణియే లేదు.

మరొకచోట విశ్వనాథ మరొక విచిత్రమైన ప్రశ్న వేస్తారు. రాజు కొరకు సైనికులు ఎందుకు యుద్ధం చేయాలి? ఎందుకు ప్రాణ త్యాగంచేయాలి? అని. హనుమంతుడు రావణుని సభలో - 'ఇంతకు యుద్ధమ్ము సంగతి విచారింపుము. నీ కొలువులోని వారిని విచారించుకొమ్మను. నీకై, వారేలచావవలయును?రాజయిన వానికొరకు బంటేల చావవలయును? నీ జీవునకు రాజాహంకారము వాని జీవు నకు సేవకాహంకారము అహంకారమునందు కూడ రాజ్యములేని యీ జీవుల స్థితియేమి?' ఇది రాజ్యము. యుద్ధము - సేవాకల్పనము మొదలైన ప్రాథమి కాంశాలలోకి జొరబారిన ప్రశ్న.

## III

కల్పవృక్షంలో చర్చించిన మరొక ప్రధానాంశం స్త్రీపురుష సంబంధాలు. ఈ అంశం వర్తమాన కాలంలో బహుధా చర్చితమైన అంశం. ఈ శతాబ్దపు తొలిరోజులలో భావ కవితాధోరణి ప్రేమకు ప్రాధాన్యమిచ్చి - స్త్రీ పురుష సంప ర్కానికి ఆధారభూతములైన నియమవిధిని, వివాహ వ్యవస్థనూ ప్రశ్నించింది.

ఈ తత్త్వాన్ని రెండంచులలో శూర్పణఖ, రావణుడు ప్రపంచిస్తారు. 'అన్యాంగ నాకర్షణ వ్యాసం గోక్షులవారు నూత్న బుధు'లైనారని కవి వ్యాఖ్యా నిస్తాడు. శూర్పణఖ సిద్ధాంతం చాలా స్పష్టమైంది.

లింగసంబంధి కామంబు లేదు దితిజ మనుజయన్న భేదంబు
యౌవనము వార్థ
కంబన దశాప్రభేదముల్ కామసహిత భావమే దివ్యమ ప్రతిబంధకంబు.

కామము జన్మలో ఏర్పడ్డ లింగభేదాన్ని ఆశ్రయించింది. దీని అనుభ వానికి బాల్య యౌవనాదులు కానీ ఇతర భేదాలు కానీ ముఖ్యములు కావట. అది దివ్యమూ అప్రతిబంధకమని శూర్పణఖ వ్యాఖ్యానించింది. కామభావాన్ని దివ్యమైందిగా నిరూపించటం దానికన్నా మించిన పరమార్థం జీవితంలో లేదని చెప్పటమే.

ధృత రతివాంఛ స్త్రీపురుష దేహ నిబద్ధము దేహధాములన్
దితిజులదైన సృష్టి గడిదేఱని మోహ నిమగ్నసృష్టి, యు
ద్ధతమగు కామతృప్తి యొకదారి తపశ్చర ణానుకూల్యప
ద్ధతికి నను గ్రహించి పరితర్పణ చేయుము కామదేవతన్.

ఇక్కడ రెండు భిన్నాంశాలు చెప్పబడ్డాయి. మొదటిది దైత్యసృష్టి. కామతృప్తి సులభంగా పొందని సృష్టి కావటం. రెండవది కామతృప్తి. ఒక తపశ్చరణ దానివల్ల కామదేవతకు పరితృప్తి కలిగించటం.

మనుచరిత్రలో వరూధిని చెప్పిన 'ఎందేదెఁదము కందళించు రహిచే నైకాగ్రతన్ నిర్వృతిన్ పొందున్' అన్న తత్త్వ విచారణ యిక్కడ స్ఫురిస్తుంది.

కామంద్వారా మోక్షప్రాప్తి అనే ఒకానొక ఆధునిక భారతీయ తాత్త్విక వ్యాఖ్యాత ధోరణి యిక్కడ మనకు స్ఫురిస్తున్నది. ఆ ప్రతిబంధకమైన కామ దేవతారాధనాన్ని వరూధిని వేద మంత్రంతో జతచేస్తే - శూర్పణఖ దాన్ని ఒక తపో మార్గంగా చెప్పింది.

శూర్పణఖ మఱింకోమార్గంలో కూడా పై అంశాన్ని సమర్థిస్తున్నది:

'భూతముగూర్చి యద్ది అనుభూతము కాదని దుఃఖ మేటికిన్
ప్రీతిగ వర్తమానము భవిష్యము చేతికి జాఱకుండగా
జూతము - మూడు లోకములు చొచ్చిన కాలువయొద్ద నన్ సమా
నీత మహోగ్ని భూతధమని ప్రకటావ ఘనాభిలాషలన్.'

అనుభవస్థానం వర్తమానమే. భూతకాలం విస్మృతం కావలసినదే. వర్తమానము ఆగామికాలము. అనుభవ శిఖరాలు. ఈ అనుభవంలో ధమనులగ్నిశిఖలై ఒకానొక అపూర్వానందాన్ని పొందే దశ శరీరం అనుభవిస్తున్నది.

రావణుడు ప్రేమ సిద్ధాంతాన్ని చెప్పేప్పుడు మరింత తాత్త్వికంగా, హేతుబద్ధంగా చెప్పతాడు.

'తీరముగాగ చూడ సుఖ దుఃఖములన్నవి రెండె. యింత సంసారము నందు తక్కిన వసహ్యా వృధా పరి జల్పితంబులు' సృష్టితత్త్వం యింతే. దుఃఖాన్ని పరిహరించటం, సుఖాన్ని ఏ పద్ధతిలోనైనా స్వాయత్తం చేసికోవటం ఇదీ అతని సిద్ధాంతము పాతివ్రత్యమంటే, వివాహమంటే రావణునికి విశ్వాసం లేనేలేదు. 'ఏ సన్నాసియొ పెండ్లియాడ నిక వాడేయంచు కూర్చుందు రహో సంసార పయోధి భద్రతరుతా నంభోజ నేత్రల్' ఈ జీవితమంతా ఉత్తమ స్త్రీలు పాతివ్రత్యంపేరున వ్యర్థం చేస్తున్నారని అతని భావన. మనోరక్షణ వేత్తవలె రావణుడు పాతివ్రత్య భావాన్ని వెక్కిరిస్తున్నాడు.

లోపల దాచి పెట్టెదరు లోకమునందున కోర్కెలెల్ల స్త్రీ
లీ వరమంపు గోపమ మొకించుక నింద్రియనిగ్రహంబు కా
దీ పగిదిన్ లతాంగులు మహేశ్వర! యిచ్చటనుల బర్త్ర హ
స్తా పతితంబు సౌఖ్యమునయందు స్వవంచితలై మెలంగుభున్.

తన దృష్టిలో వివాహ వ్యవస్థ, పాతివ్రత్యమూ రెండూ ఆత్మవంచనలే. తమ కోర్కెలను బలవంతంగా అణచివేస్తారు అది ఇంద్రియ నిగ్రహం కాదు. దానివల్ల యిహపరాలలోనూ సౌఖ్యము పొందలేక పోతున్నారని అతని సిద్ధాంతం.

చివరకు రావణుడు కామ తత్త్వాన్ని ఏకైక పరతత్త్వ సాధనంగా తదనుభవాన్ని పరమార్థానుభవంగా స్థాపిస్తాడు. దానికన్న మించిన ఆనందానుభవం లోకంలో లేదు.

'కడకున్ సర్వజనుష్పలాభిముఖ రేఖావచ్ఛివానంద మొ
క్కడె యీ తక్కినవెల్ల కల్పనలహో కామంబు తన్మార్గ మె
వ్వదనిశ్చయకమైన స్త్రీ పురుష సంబంధంబు ధర్మంబుతో
గెడ నార్పం దలపోసె నూరక మృషా కృత్యున్నమ దుర్బుద్ధియై'

స్త్రీ పురుష సంబంధం అనిశ్చయమైంది దీనివెనుక ఏ నియతీ సృష్టిలో సహజంగా లేదు. ఈ పరమమైన 'శివానందం' నామమువల్లనే సిద్ధిస్తున్నది. దీనికి అనవసరంగా ధర్మంతో సంబంధించటం మృషాకార్యం. ప్రాచీన తాంత్రికులలో కొందరీ మార్గానికి చెందినవారే.

విశ్వనాథ సాహిత్యరంగంలో ప్రవేశించే నాటికి ప్రబలంగా వున్న సిద్ధాంతం ఈ కామ సిద్ధాంతమే. అదే ప్రేమ పేర వ్యవహృతమైంది. స్త్రీ పురుష వ్యవస్థను గూర్చిన మౌలికాంశాలను చర్చిస్తున్నది నాటి సమాజం. చలం రచనలు భావకవుల కొన్ని గ్రంథాలు ఈ తత్త్వానికి మూలగ్రంథాలుగా వెలువడ్డాయి. ఉన్నవ లక్ష్మీనారాయణ, విశ్వనాథ సత్యనారాయణ, అడవి బాపిరాజు ముగ్గురూ తమ తమ నవలలలో ఈ సిద్ధాంతాన్ని ఖండించి సుష్ఠువ్యవస్థను నిర్దేశించినారు ఇరవైలలో విశ్వనాథ ఏకవీర, నర్తనశాల మొదలైన రచనలు ఈ సమస్యను చిత్రించేవే. 'చెలియలి కట్ట' 'వేయి పడగలు' ఈ లక్షణాన్ని ధర్మానుబంధంగా వ్యవస్థ ఉండవలసిన అవసరాన్ని వ్యాఖ్యానించాయి.

కల్పవృక్షము రచనలో సామాజిక స్తరంలో ఈ కామ సిద్ధాంత నిరసము ప్రధానాంశముగా స్వీకరింపబడింది. దీనిలో రావణాదులు చేసే చర్చలు అన్నీ సమకాలీనాంశాలను ప్రకాశింపజేసేవే. సుందరకాండ పరరాత్ర ఖండంలో సీతతో

రావణుడాడిన ప్రేమ సిద్ధాంత వాక్యాలన్నీ భావకవిత్వంలో మనకు కనిపించే అంశాలే.

'ప్రేమయె సృష్టికంతకును పెద్ద, సరోజ భవాది దేవతల్
ప్రేమకు లోకువద్ది ప్రభవిష్ణువు, విష్ణువు ప్రేమ సీపయిన్
ప్రేమ యఖండమైన యది'.
'నను ప్రేమించుట ప్రేమ భావమున కెన్నన్ శేఖరీభూతము'

'ఒక నెలయేబు వంటిది సితోత్పలలోచన యౌవనంబు టో
లు కలుగవచ్చి పోసికొను రూక్ష తరంగ తురంగ పంక్తి ఆ
గక యును సొమ్ము జేసికొని గావలె మన్మథ రాజ్యలక్ష్మి యెం
తకు దెగకుండ నోములు వ్రతంబులు పట్టిన వట్టి పోయెడున్.'

ఇలా చెప్పిన సిద్ధాంతాన్ని సీతాదేవి ఎక్కడికక్కడ తిరస్కరిస్తూ ధర్మానుబంధమైన కామతత్త్వాన్ని వ్యాఖ్యానిస్తుంది. భార్యా భర్తృ సంబంధం కేవలం లోకానుభవ పరిమితమే కాక పరమార్థ సాధనకు దోహదం చేస్తున్నదని ఆమె ప్రతిపాదిస్తుంది. 'ధర్మ మహిమచేత ఆత్మనియతి బుద్ధి మహితస్థితిని' తెస్తుంది.

సీతాపహరణ వేళలో త్రయీదేవతల విచారణ కథా మూలబిందువును స్పృశిస్తున్నది. అక్కడ సృష్టి అంతా తనలోనికి కుంచించుకుని, స్వస్థితిని గూర్చి విచారణ చేస్తున్నది.

'ఈ పురుషుండు ఈ స్త్రీయు నిద్దరే నింతియు పతియు
ఏ పురుషుండు ఏ స్త్రీయు నెందుకో ఏల కారాదు?'

ఇదీ ప్రధాన ప్రశ్న. ఆ పురుషుడు - ఆ స్త్రీ - ఆ దేశము - ఆ కాలము - ఆ పరిస్థితులు ఇవన్నీ ఈ సంధానం కూర్చే అంశాలు ఈ స్త్రీ పురుషుల సంగతి యాదృచ్ఛికము హఠాత్పతితమైందేమీ కాదు.

అయితే ఆధునిక వాదులు ఐహికమే యదార్థమనే దృష్టి ఉన్నవారు 'అకట స్వభావాదులకు ఐహికమే పరమంబు - దాన వారికి పరమంబు లేదు.'

సీతాదేవి దృష్టిలో దాంపత్యము ఒక యోగము. అది మనస్సులోని మోహ ప్రవాహాన్ని దాంపత్యమన్న రెండు ఒడ్ల నడుమ నియతంగా ప్రవహింప జేసే తీరు. అది పురుష సంపర్కం మాత్రమే కాదు.

'భార్యాత్వం బన ఊరకే పురుష సంపర్కంబుగా నెంతురో
ధార్యంబై చను భర్తృ నిష్ఠముగ చేతోమోహకుల్యానదీ
మర్యాదాకృతి తీర్చు యోగమిది అమ్లానైకరోధస్కృతన్
నిర్యత్ ప్రాణము వేళ జీవుడుచనన్ నిశ్శ్రేయసాధ్వంబునన్.'

## IV

ఇంకా విశ్వనాథను కలవర పరచిన సమకాలీనాంశాలు చాలా ఉన్నవి. భౌతికవాదం వల్ల జీవులు కేవలం దేహనివిష్టులుగా మిగిలిపోవటం, ఆత్మ గుణాలకు దూరం కావటం ఇది ఒక ప్రధానాంశం. దీనివల్ల సమాజం యెడల వ్యక్తి బాధ్యత ఏమీ ఉండదు. తన సౌఖ్యం, దానికోసం మిగిలిన వ్యవహారం ఉంటుంది. ఒక్కొక్క సందర్భంలో తన వర్గం సృష్టిలోనే అధికమైన దనే అహం భావ ప్రాధాన్యం కూడా ఏర్పడుతుంది.

ఈ దశలో దేనిలోనూ వారికి తృప్తి ఉండదు. 'ఈ జగదధిష్ఠాతృత్వమే కావలెన్' మొత్తం జగత్తు తమ అధీనంగా ఉండవలెనని వారి సిద్ధాంతం. ఈ శతాబ్దంలో జరిగిన రెండు మహా యుద్ధాలకూ ఈ సిద్ధాంతమే ఆధారం. తాము జగత్తులో అన్ని జాతులకంటే ఉన్నతులమనీ, అందరిని పరిపాలించటం తమకు జన్మసిద్ధమైన అధికారమనీ వారి సిద్ధాంతం. మరొక పద్ధతి ఉంది లోకంలో అందరూ తమ సిద్ధాంతాన్నీ, తమ మతాన్నీ అంగీకరించవలెనని. మిగిలినవారు నాగరకులు కాదనీ, వారిని ఉద్ధరించటమే తమ జీవన పరమార్థమనీ వారి విశ్వాసం.

అయయో! మకుటాయమానమైనట్టి గుణ మ
తీతమున్నది యొకడు సర్వాతిశాయి
మఱియును త్రిలోకి రాక్షసమయము సేయు
యత్నమున నీతి జాతి హద్దులేదు.

వీరి ఈ లక్షణం లోకాన్ని క్షోభింపజేయటం మిగిలిన మతవిశ్వాసాలను వ్యవస్థలను నిలువనీయకపోవటం మనం ఈ కాలంలో చూచిన లక్షణమే. వీరి క్రౌర్యానికి హద్దులేదు

అక్కట యూళ్ళపైనబడి అందిన స్త్రీలను దొంగిలించుచున్
చిక్కిన యట్టి మానవుల జీవితవధంబొనరించుచున్ మరిన్
బెక్కువ పిల్లపాప యను భేదము లేక చరించుచుండు—

అయినా ఇంతటి రాక్షసులలోనూ ఉన్న దైవలక్షణాన్ని వెలికితీసిన లక్షణం వారిలోనూ ఆత్మాన్వేషణబుద్ధిని ప్రకాశింపజేయటం కల్పవృక్షం ఆధునిక కాలంలో ఆవిష్కరించిన వినూత్నాంశం. మానవుని చైతన్య పరిధిలో భిన్న భిన్నస్వరాలను ఆవిష్కరించిన ఆధునిక మనస్తత్వశాస్త్రం ఎంతగా దీనికి ఆధారమో, ప్రాచీనమైన మాండూక్య ఉపనిషత్తులోని అవస్థాత్రయ విచారణం కూడా అంతే ఆధారం. ఈ విధంగా అంతశ్చైతన్యావిష్కారం ద్వారా కల్పవృక్షం సృష్టిలో అత్యంత దుష్టమైన వ్యక్తులు లేరనీ, ఎవరైనా సాధనవల్ల, భావనవల్ల ఉదాత్తస్థితికి చేరుకోవచ్చునన్నతత్త్వాన్ని ప్రతిపాదించింది. అంత రాక్షసులూ క్రమంగా కరగిపోయిన తమస్సులో - సాత్త్వికులై దేవతలుగా పరివర్తన పొందగలుగటం.సృష్టిలో గర్భితంగా ఉన్న ఈశ్వరీయతత్త్వావిష్కారముఖంగా ఈ ప్రయత్నాలు సాగవలసిన అవసరాన్ని తెలియజేస్తుంది.

అందుకే రామునికి ఏ రాక్షసుణ్ణి చంపేప్పుడైనా మనస్సులో జాలి ఉంటుంది అందుకే 'ఏ దనుజాన్ వధించినను నిట్టి విషాదము నొందు స్వామి' ఈ విషాదం వెనుక అందరు జీవులలోనూ సాధారణమైన ఏకాత్మభావంతోడి తనకు కలిగిన అనుసంధానం వ్యక్తమవుతుంది. రావణుడు ఒకసారి అంటాడు- ఖరాదులను అంతమొందనీ శస్త్ర బలంచేత సంహరించటం కాల తత్త్వం ఎఱిగిన

వాడు చేయదగిన పనికాదు. 'మందింపందగునెల్ల లోకములు బ్రహ్మాస్త్రంబుచే కాలతాజ్ఞం దెవ్వాడును సేయునే' అంటాడు.

రాముడు కూడా తప్పని సరియైన దైత్యసంహారాన్ని గూర్చి మనస్సులో మధనపడుతూ వుంటాడు. 'ధర్మరక్షకై దానవసంహారము పున్నెము - దానవ హింసచే పాపము' ఈ రెండూ తనను సుఖ దుఃఖహేతువులు అవుతూ వున్నవి. అందుకే 'అనవసరమైన దైత్య సంహారమింత నాకసువులపై కూరుచున్నయది' అని ఒకానొక మనోదశలో విసుగును పొందుతాడు.

కల్పవృక్షంలో అహల్యకు కౌసల్యతో, అరుంధతితో సమానమైన స్థానాన్ని కలిపిస్తాడు. పతితల యెడ రచయిత సానుభూతి దీనివలన వ్యక్తమవుతుంది.

ఆధునిక పాశ్చాత్య సాహిత్య ప్రపంచంలో ఏర్పడ్డ 'అస్మిత'ను గూర్చిన సంక్షోభం రచయితకు కల్పవృక్షంలో సమస్య కాలేదు. దానికి కారణం కవికి తొలినుండీ ఉన్న తాత్త్విక సంపద ఆత్మతత్త్వ నిరూపణలో ప్రారంభమయిన కల్పవృక్షం రావణునిలో 'ఇది నారాయణమూలమౌ తరువు' అన్న ప్రత్యభిజ్ఞ కలిగించడంతో పూర్తయింది. 'అయోధ్యలో ప్రజలు శ్రీపతి రాముని బ్రహ్మ వస్తువున్ పురాత్త సుకృతంబున బొంది సధర్ములై యిహాముత్ర ఫలంబులం గనిరి ' ఇది ఈశ్వర చైతన్యం భూమిమీదకు దిగిరావటం వలన సంభవించింది. అందరూ బ్రహ్మానుభవంచేత దివ్యత్వమును పొందినారు.

శ్రీ అరవిందులు ఆధునిక కాలంలో ఈ దివ్య జీవనారోహణ అవరోహణ సిద్ధాంతాన్ని ప్రాచుర్యంలోకి తెచ్చారు. అందుకే అరణ్యకాండలో 'రావణుని దేవబోధ భావావృతునిగ' చేయటానికి 'దైత్యధాత్రిని పెకలించి దైవగుణమును' ఉద్భిన్నం జేయటానికీ, దైత్యభావ సమృద్ధిని మొత్తం నశింపజేసి దైవగుణ ప్రతిష్ఠ చేయటానికి సీతాదేవి లంకకు వచ్చిందని ప్రపంచించటం జరిగింది.

కల్పవృక్షం నిండా అనేకములైన వర్తమాన యుగ సమస్యలు - వాటి తాత్త్విక మూలాల విచారణమూ వ్యాపించి ఉన్నాయి. *

# రామాయణ కల్పవృక్షం-భాష

—డా॥ ఆర్. శ్రీహరి

విశ్వనాథ సత్యనారాయణ గారు అసాధారణ ప్రతిభా సంపన్నులు. అపూర్వ ప్రజ్ఞాధురీణులు. తన రచనల్లో అనేక రచనా శిల్ప రహస్యాలను ప్రతిభావంతంగా పొదగిన మహాశిల్పి.

తెలుగుసాహిత్యంలో విశ్వనాథవారి రామాయణ కల్పవృక్షానికి ఒక విశిష్ట మైన స్థానం ఉంది. ఇందులోని ఇతివృత్తం పురాతనమే ఐనా కథా నిర్వహ ణంలో కొత్తదనం కనిపిస్తుంది. అట్లే స్వీకరించిన ఛందస్సుకూడా ప్రాచీనమే ఐనా భాషా ప్రయోగంలో నూతనత్వం భాసిస్తుంది. "ఒక మహాశిల్పి యగుటకు నౌక్క-వేయి లక్షణములుండు" - అని ఒక సందర్భంలో అంటారు విశ్వనాథ. కవితాశిల్పానికి సంబంధించిన అంశాలలో భాషా శిల్పంకూడా ఒకటి. రామాయణ కల్పవృక్షంలో ఈ భాషా శిల్పాన్ని విశ్వనాథ ఏవిధంగా నిర్వహించినారో పరిశీలిద్దాం.

రామాయణ కల్పవృక్షంలోని భాషలో విశ్వనాథవారు వ్యావహారికతా లక్షణాన్ని ప్రవేశపెట్టినట్లుగా కనిపిస్తుంది. ప్రాచీన పద్ధతిలో రచింపబడిన రచనలో వ్యావహారికతా లక్షణాన్ని ప్రవేశపెట్టడం విశ్వనాథవారి భాషా ప్రయోగ శీలతకు ఉదాహరణంగా చెప్పవచ్చు.

భాషలో వ్యావహారికత అంటే కేవలం 'ము'కు బదులుగా సున్నవాడడం, చేయుచున్నాను మొదలైన పదాలను చేస్తున్నాను ఇత్యాదిగా వాడడం మాత్రమే కాదు - వ్యవహారంలో ఉన్న విశిష్టమైన పలుకుబళ్ళను, వాక్యవిన్యాసరీతులను ప్రవేశపెట్టినపుడే భాష వ్యావహారికమౌతుంది.

విశ్వనాథవారు ఈ విధమైన వ్యావహారికతాలక్షణాన్ని తన రామాయణ కల్పవృక్షంలో ప్రవేశపెట్టి రచనకు సహజత్వాన్ని తెచ్చినారని చెప్పవచ్చు.

ఆంధ్రప్రశస్తి కావ్యాన్ని మిత్రులు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ గారికి అంకితం చేస్తూ చెప్పిన ఈ పద్యం గమనించండి:

"నీవనుకోనులేదు మఱి నేనది చెప్పనులేదు కాని అ
న్నా వినవయ్య నేటికిది నా చిఱుపొత్తము నీకు నంకితం
బై వెలయింపఁజేతు''

ఇందులో అలంకారాలేమీ ప్రయోగించకుండానే కేవలం భాషా ప్రయోగ వైచిత్రితో తమ యిద్దరి మధ్యనున్న చనువును అందంగా వ్యక్తీకరించినారు. 'నీవనుకోనూలేదు, మరి నేనిది చెప్పనూ లేదు. అన్నా విను' - అనే వ్యావహారిక శైలి ఇందులో కనిపిస్తుంది.

శృంగారవీథిలోని మేలుకొలుపు అనే ఖండకావ్యంలో మరో పద్యం గమనించండి:

"పక్కయంతయుఁ జిమ్మితి పద్మనాభ
అన్న చూడుము పుస్తకమ్మట్లు పండు
కొనును, నీవేమొ పక్కంత కుమ్మి కుమ్మి
పక్క యటులుండ నీ విట్లు పండుకొందు."

యశోద శ్రీకృష్ణుణ్ని నిద్రలేపుతూ పలికిన పలుకులు ఈ పద్యం. 'పక్కంతా చిమ్మేసినావు. అన్న చూడు. పుస్తకమ్మాదిరిగా పండుకున్నాడు. నువ్వేమో పక్కంతా కుమ్మి కుమ్మి పక్క అక్కడ ఉంటే నువ్వు ఇక్కడ వచ్చి పడుకున్నావు' అన్న వ్యావహారిక వాక్యానికి ఈ పద్యభాష ఎంతో సన్నిహితంగా ఉంది. అన్న చూడు, నువ్వేమొ, పక్క అటులుండ అనేవి చక్కని వ్యావహారిక ప్రయోగాలు. వాక్య విన్యాసం కూడా పూర్తిగా వ్యావహారికమే.

దూరాన్వయం లేకుండా పరస్పరం అన్వయించే పదాలు ఒకదాని వెంట ఒకటి క్రమంగా ఉండడం వ్యావహారిక భాషా లక్షణం. ఈ లక్షణం రామాయణ కల్పవృక్షంలో పెక్కుచోట్ల కనిపిస్తుంది. ఒక్క ఉదాహరణం -

మనమిట్టిలేడిఁగనినా
మని చెప్పిన నమ్మరెవ్వ రసలీ లేడిం
గొని చని కనక మృగంబం
చును చెప్పుచు నమ్మనపుడు చూపించవలెన్.

వ్యావహారిక వాక్యంలోని పదాలక్రమమే ఈ పద్యంలో కనిపిస్తుంది. ఇందులోని 'అసలు' అనేది ఎంతో శక్తిమంతమైన వ్యావహారిక ప్రయోగం. వాక్యవిన్యాసంలోనూ, పదక్రమంలోనూ మాత్రమేకాక ఈ విధంగా శక్తిమంత మైన వ్యావహారికపదాల ప్రయోగం కూడా వ్యావహారిక ప్రయోగ లక్షణంగానే చెప్పుకోవచ్చు. ఇలాంటి వ్యావహారిక ప్రయోగాలు కల్పవృక్షంలో ఎన్నో కాన వస్తాయి.

మా బాబునకు ధర్మమహిమలు రక్ష
మా బుజ్జికిని మౌనిమహసులు రక్ష
చిట్టితల్లితోడ సీతమ్మతోడ (అభిషేక 67)
బాబు! ఇది శత్రులకుఁ గూడ వలదటన్న (పరరాత్ర 294)
వట్టి వెఱ్ఱిపప్ప క్రిందం గట్టిరి (నూపుర 266)

బాబు, బుజ్జి, చిట్టితల్లి, వెఱ్ఱిపప్ప మొదలైన పదాలు నిత్యవ్యవహార సాధారణాలు. ఇలా వ్యావహారికభాషా పదజాలాన్నే కాకుండా తెలుగుదనం ఉట్టి పడే చక్కని తెలుగు పలుకుబళ్ళను, జాతీయాలను అసంఖ్యాకంగా వాడి రచ నకు ఎంతో సహజత్వాన్ని తెచ్చినారు. ఈ ప్రయోగాలు ప్రాచీన కావ్యపద్ధతిలో రచింపబడ్డ కల్పవృక్షంలో ఉండడం విశేషం.

ఆ మాంస మీ మాంసమని లేక క్షుద్వార
కమ్ముగా సర్వభక్షణము సేఁత (పరరాత్ర 83)
ఐనదానికి మఱియును గానిదాని
కేలికతనానఁ జిల్ల కజ్జాలు పెంచ (కల్యాణ 262)
కుబేరునకున్ మొదల్ దిక్కులేదు
ఇంక మా మాట యనవలెనే ముకుంద! (బాలకాండ)
చచ్చినవారితో మనము చత్తుమె చచ్చిననైన వారలున్
వచ్చెడి వారటే ధరణిపైఁ దిన గింజలు నేరికుండునో
యచ్చట వారలుండెద రవెన్ని దినాలుగ వ్రాసియుండెనో
చచ్చినయట్టులుండవలె సర్వముగావలె మత్తకాశిని!
బ్రతుకఁగఁదప్పని యప్పుడు
బ్రతుకుట లోపలను చచ్చు బ్రతుకేలా!
తానదేమో పిచ్చితల్లియే ప్రేమ బోయిన నదే ప్రేమబోవు

**చిలుకకుఁజెప్పినట్లు** పదిచెప్పి, **శతంబు** వచించి వేయి యా
డి, లలన! **సుంతలాభము** గడింపము
తన యానంబడి యగ్నిలో దుముకనే' **తానింత 'ఊఁ'** అన్నచో
వనధిం దూకనె (అభిషేక 314)
**స్త్రీయన్న తరువాత సిగ్గుండవలెనరే** (పరరాత్ర 237)
**మొద్దు విధంబునన్** నిదురపోవుచు నుండగ
నీవు **లతీ చెప్పు** నిజముగా సుగ్రీవు
నందు శౌచభావమాన్యశంస్య
మధికమైన యట్టి యార్జవంబును లేవు (అన్వేషణ 151)
ఎన్నాళ్ళు **సీత** కన్నద
దన్నాళ్ళును **పోనెపోను** (అన్వేషణ 135)
పోనే పోనిక నేనయోధ్యకు వనీ భూముల్ మరిచ్చే చనంగానౌ నాకును (మునిశాప. 486)

**అని లతీ తిట్టితినయ్య** కొడుకు
వీథిలో పురమందున **నొక్కపురుగులేదు** (సుందర)
అదియేమి పోవుకాలమో (ధనుస్సు. 451)

వాక్య విన్యాసంలోనూ, పదప్రయోగంలోనూ పలుకుబళ్ళను గుప్పించ డంలో మాత్రమేకాక సంభాషణల్లో కూడా చక్కని వ్యావహారికతా లక్షణం కల్పవృక్ష భాషలో కనిపిస్తుంది.

తిమ్మిరి వాయఁగోనికొని తిందుమె నిన్నిపుడోసి యోసి నీ
యమ్మమగండొ. నీ మగడొ యద్దము వచ్చెదువాడు చూతుమా (పరరాత్ర. 333)

స్వామి నిన్ను తర్జన భర్జనలతో లొంగదీయుమన్నాడు గాని లేనిచో నీవు వినుటయేమి? ని తలలో జేజెమ్మ వినును. (అపరాత్ర. 289)

వ్యక్తులను సంబోధించేప్పుడు సంబోధింపబడే వ్యక్తులు మనకు సన్నిహితులూ, ఆప్తులూ ఐనప్పుడు వారి పేర్లను కొంత మార్చి, క్లుప్తపరచి సంబోధించడం కనిపిస్తుంది. ఉదా:- పద్మ>పద్దు; రామారావు>రాము, కృష్ణ>; కిట్టు మొ॥ సంబోధనల్లో ఇలాంటి వ్యావహారికతా లక్షణం రామాయణ కల్పవృక్షంలో కనిపిస్తుంది. కొన్ని ఉదాహరణలు :

అన రాముడు లక్ష్మణుఁజే
కౌని కౌగిలిగాఁగ నెదురుకొని లచ్చిరా
జని రాముఁడైన యెడ రా
జని లక్ష్మణుఁడేల కాడురా యని యొత్తెన్. (అభిషేక 78)

లక్ష్మణుణ్ని ఆప్యాయంతో సంబోధించేటప్పుడు 'లచ్చి' అని అంటాడు. ఇది సంబోధనలో వ్యావహారికత. ఆప్యాయంతో కాక కోపంతో సంబోధించే ప్పుడు కూడా ఈ వ్యావహారికతా లక్షణం కనిపిస్తుంది. నిత్యవ్యవహారంలో మనం తిట్టుకునే పద్ధతే కల్పవృక్షంలో కూడా చోటు చేసుకొని, రచనకు సహజత్వాన్ని ఆపాదించింది. కొన్ని ఉదాహరణలు:

అవునె దౌర్భాగ్యమాకారమైనదాన
నీకు నిదురయెటు పట్టనె దరిద్రు
రాల! యొకవంక నింటి చూరంటుకొనిన
సొగసుగా చలిగ్రాగెదు పగిది దోప (అభిషేక. 105)

నీ పాడుముండ వచ్చెదవా! పా
పపు శకునపక్షి యని ప్రతిహారుల్
దీవింప ... .... .... .... (మునిశాప. 496)

ముసలిమొగముది యొక కొండముచ్చు ముండ
పసితనంబున రాముని పరిహాస్య
మునకుఁ బగబూని కైకతో పుల్లవిఱుపు
లాడి రాముని వనమేగు టాచరించె (మారీచ. 192)

విశ్వనాథ ఆయా సందర్భాలలో పాత్రల శీలాన్ని ప్రతిబింబింపజేసే విధంగా విశేషణాలు వాడడం కనిపిస్తుంది. పరిశీలనాత్మక దృష్టితో చూసినపుడే వీటిలోని విశేషం తెలుస్తుంది. సీతారామలక్ష్మణులు గుహుడు తెచ్చిన పడవపై గంగానది దాటేప్పుడు "ఆరోపింపఁగజేయు మీ వదినె ముందా పైని నీ నావ నీవారోహింపుము - నేను వచ్చెదను తర్వాతన్" అని రాముడు ఆజ్ఞాపిస్తాడు. అప్పుడు లక్ష్మణుడు సీతాదేవిని పడవ నెక్కిస్తాడు. ఈ సందర్భంలో విశ్వనాథ "లక్ష్మణుడు తల్లినెక్కించి పక్ష్మచలనమ్ముదుదృగంతములన్ రామునెగచి చూచి తాను నావపై నెక్కె యుంజానమూర్తి" — అంటూ లక్ష్మణునికి 'యుంజాన మూర్తి' అనే విశేషణం వాడతాడు యుంజానమూర్తి అంటే 'ఇంద్రియ విషయా లలో శబ్ద స్పర్శాదులనుండి మరల్పబడిన నిర్మలమైన మనస్సుతో సమాధి యందుండువాడు' అని అర్థం. ఈ విశేషణం లక్ష్మణుని శీలాన్ని ఎంతో సమర్థంగా వ్యక్తం చేస్తుంది.

చెప్పవలసిన భావాన్ని నేరుగా, వాచ్యంగా కాక వక్రంగా చెప్పడం ఉక్తి వక్రత. ఒక్క ఉదాహరణ గమనించండి:

చిటికెనవ్రేలితో శివుని విల్విఱిచిన ఘోరబాహుని నెత్తికోనునగునె
యనుభూత దనుజమర్దన కాలవికటత్వ మీతని బుగ్గ ముద్దిడగనగునె
కోసలరాజ్య సింహాసనాధ్యసన తర్కింతుఁదొడ నితని నెక్కింపనగునె
తనకాలి చెప్పు రామునికాల సరిపోవు వయసులోఁ గౌగిలింపంగఁదగునె
రామచంద్రుని వయసు కారణముగాఁగ
నవనిపతి పొంగులగు ప్రేమ వ్యర్థమైన
నతడు పూనిన యంజలి నంజలించి
యతని యంజలిలో ముద్దులాడె నృపతి. (అభిషేక. 48)

రాముని వయసును వాచ్యంగా చెప్పక "తన కాలిచెప్పు రామునికాల సరిపోవు వయసు" అని చెప్పడంలో ఉక్తి వక్రత కనిపిస్తుంది.

విశ్వనాథవారి కవితలో సంఖ్యావాచక పదాలకుముందు 'ఒక' శబ్దాన్ని వాడడం చాలా ఎక్కువగా కనిపిస్తుంది. ఇది వ్యవహారభాషలో కనిపించే లక్షణమే. ఒక యాభై రూపాయలు, ఒక డెబ్భై రూపాయలు మొ॥ ఈ విధంగా సంఖ్యావాచకాలకు ముందు ఒక శబ్దాన్ని వాడడం తెలుగునుడికారం. రామాయణ కల్పవృక్షంలో ఈ నుడికారం వాడబడిన ప్రయోగాలు గమనించండి:

ఒక పదివేల యేనుగుల కుండిన యంత బలంబు గల్గున
ప్రకట మహేంద్ర పర్వతము (సుందర; పూర్వయాత్ర. 10)
ఒక యేబది మంది (అయోధ్య)

ఒక మూన్నాళ్ళకు ముందు సర్వము సుఖజ్యోత్స్నామయంబైన జేనికి నీలోపున నెట్టి చీకటులు నిండెన్

ఒక యేమియు చేయకూరకుందురె ధాత్రిన్
ఒక వేయి రూపములతో
నొక వేయి విధాల వచ్చియుండినచో నుం
డక మండినచో మండక
యొక వేయివిధాల నిలచె నుగ్రత వారిన్
ఒక వంద యంగదులు మామక దుఃఖము బాపలేరు (కిష్కింధ)

వేర్వేరు ప్రాంతాల భాషల్లో, వేర్వేరు వర్గాల భాషల్లో పరస్పరం భేదం ఉన్నట్లుగానే వేర్వేరు వయస్సుగల వారి భాషలో కూడా భేదం కనిపిస్తుంది. ఉదాహరణకు పిల్లల భాషను తీసుకోవచ్చు. 'ర'ను 'ల'గా ఉచ్చరించడం మొదలైనవి బాలభాషలో కనిపించే లక్షణాలు. బాల్యంలో ఉన్న శ్రీరాముడు పలికే మాటలను విశ్వనాథ ఎంత సహజంగా వర్ణించినారో గమనించండి.

తానో లాములు తండ్రి పేరెవరయా దాదాతమాలాలు నౌ
లే నా పేరన నమ్మగా లనఁగ నోలిందల్లి కౌసల్య తం
డ్రీ నాగా ననబోయి రాక కనులన్ నీర్వెట్టి కౌసల్య నౌ
గానే కానులె యమ్మనే యని ప్రభున్ గౌసల్య ముద్దాడెడిన్.

రాములు అనడానికి లాములు అనీ, దశరథ మహారాజులు అనడానికి దాదాతమాలాలు అనీ, అమ్మగారు అనడానికి అమ్మగాలు అనీ రామునిచే పలికించడం ఎంతో సహజంగా ఉంది పాత్రోచితంగా బాలభాషను శ్రవ్య కావ్యంలో ప్రవేశపెట్టిన ఘనత విశ్వనాథకే దక్కుతుంది.

రామాయణ కల్పవృక్షంలో మనకు అడుగడుగునా సూక్తులు కనిపిస్తాయి. ఈ సూక్తులు ఆయా ఘట్టాలకు ఒక విశిష్టతను ఆపాదించడమే కాక భిన్న సందర్భాల్లో వాడుకోడానికి ఎంతగానో ఉపయోగపడతాయి. ప్రజల నాలుకల్లో చిరస్థాయిత్వం పొందగలిగిన శక్తి వీటికుంటుంది. రామాయణ కల్పవృక్షంలోని కొన్ని సూక్తులను పరిశీలించండి:

''అడదానికి గలుగు ధనాశయెంతొ
యవని మగవానికుండు కీర్త్యాశయంత"
వలయు విద్య కైకాగ్ర్య మభ్యసనవేళ
చనును బహుముఖత్వము ప్రదర్శనవేళ
తెచ్చిన వేపమొక్కకును తేనియపోయుము చేదు మానునా
అల్పుడైన వాని కాపత్తి కలిగిన
గుండె నీరసించి కూలిపోవు
మన బంగారము మంచిదైనయెడఁ గంసాలిన్ మఱేలా యనన్
జీవి లక్షణము చిత్రమైనది కదా
బుద్ధి వచ్చి మఱల బుద్ధిరాదు

సత్యనారాయణగారు సంస్కృతంలో గొప్ప విద్వాంసులు. సంస్కృతం లోని విలక్షణమైన ప్రయోగాల నెన్నింటినో రామాయణ కల్పవృక్షంలో వాడి తమ సంస్కృతభాషా వైదుష్యాన్ని చాటుకున్నారు. నైచికులు, మౌకలికులము, పురస్తాద్యాతు సౌమిత్రి, భారతమోదతామతము, అటట్యావృత్తి, మాహేయి, మృధము మొదలైన ప్రయోగాలనెన్నింటినో ఉదాహరించవచ్చు.

'తద్ధితమూఢో (2) వైయాకరణః' అని సంస్కృత సూక్తి తద్ధితాలు తెలియనివాడు వైయాకరణుడుకాడనీ, తద్ధితాలు తెలిసినవాడే వైయాకరణుడని దీనికర్థం. తద్ధితరూపాల ప్రయోగంవల్ల రచనకు ఒక గాంభీర్యం వస్తుంది. సత్యనారాయణగారు ప్రయోగదక్షులైన వైయాకరణులు కనుక విలక్షణమైన ఎన్నో తద్ధితాంత రూపాలను వాడి రచనకు ఎంతో గాంభీర్యాన్ని చేకూర్చినారు. కొన్ని ఉదాహృతులు—

ఆగ్నాయీ ప్రియతమున్
పైనాకశరములు
ఐరమ్మదీయసరని
నైగనిగ్యము
కార్తికికమాసము
కార్ష్ణాయస పీఠికాగతుడు
త్రైదశజగత్సౌఖ్యంబు
మాఘవతాశ్మము
సామీచీన్యము
సౌరాపగ
వార్షుకాభ్రము

అనేక తద్ధితాంతరూపాలను ఒకే పద్యంలో ఎంత ఔచితీమంతంగా కూర్చి 'ప్రియతద్ధితా దాక్షిణాత్యాః' అన్న సూక్తిని సార్థకం చేసినారు.

ప్రేష్ఠంబుల్ ప్రజమోములం గనుచుఁ దత్త్రేమన్ గుబాళింప బృం
దిష్ఠమ్ముల్ పౌలముల్ గనుంగొనుచు సాధిష్ఠంబులై యుంట బం
హిష్ఠమ్మౌ చనుత్రోవ వేగిరముగా నేగన్ సుమంత్రుండు క్షే
పిష్ఠాశ్వంబుల దోలఁ గోసలములున్ వెన్కై ప్రయాణించుచున్

(బాల; ఇష్టి. 216)

ఈ పద్యంలోని ప్రేష్ఠ, బృందిష్ఠ, సాధిష్ఠ, బంహిష్ఠ, క్షేపిష్ఠ అనే శబ్దాలు క్రమంగా ప్రియ, బృందారక, సాదు, బహు, క్షిప్ర అనే శబ్దాలకు అతిశయార్థక తద్ధితాంతరూపాలు.

ఈ విధంగా రామాయణ కల్పవృక్షాన్ని పరిశీలించినప్పుడు భాషావిషయకమైన అనేక విశేషాలు మనకు తెలియవస్తాయి. కొన్నింటిని మాత్రమే ఈ వ్యాసంలో పరిశీలించడం జరిగింది.

*

# విశ్వనాథ మధ్యాక్కఱలు

## —శ్రీ ముళ్ళపూడి సచ్చిదానందమూర్తి

ఏ కావ్యములోనైననూ ఆ కృతికర్త వ్యక్తిత్వము ప్రస్ఫుటంగా కాకున్నా రేఖామాత్రంగానైనా కవిత్వాన్ని కొంతలో కొంతగానైనా అంచనా వేయవచ్చు. అందునా ఆత్మాశ్రయకవిత్వంలో ఇది సులభసాధ్యం. ఇది తెలుగు కావ్యాలలో ఏదో రూపేణా అన్నింటిలో కనపడుతూనే వుంది వ్యక్తిత్వముద్ర వాంఛనీయమా కాదా అన్నది వేరే ప్రశ్న. విశ్వనాథ వారే అన్నట్లు 'తెలుగు కవిత్వం వృద్ధి పొందిన తీరు వేరు. ఇందులో కవి వ్యక్తిత్వమే ప్రధానం. అది లేకపోతే చప్పగా తయారయి ఊరుకుంటుంది. తెలుగులో ఒక్కొక్క కవి వాడి మార్గం వాడిదేనన్నట్లుగా పరాకాష్ఠను పొందిన రచనను చేసినవాళ్ళే నిలిచారు. అట్లాంటి విశిష్టమైన మార్గం ప్రత్యేకంగా ఒకటి వుంటే తప్ప ఎవరూ నిలవలేరు అందు చేత inpersonalise చేయడమనేది వాల్మీకిని, కాళిదాసుని తెలుగులో నన్నయ గారిని వదిలిపెడితే ఇంకొకరికి సాధ్యమయ్యేదికాదు" (చూ॥ వి శా. 90 వ జయంతి సంచిక, దూళిపాళ శ్రీరామమూర్తిగారి వ్యాసం).

విశ్వనాథ మధ్యాక్కఱలలో కూడా వారి వ్యక్తిత్వం కొట్టవచ్చినట్లు కన పడుతుంది. వారు పరిపక్వదశకు చేరుకున్న మనస్సుతో, పరిణతి చెందిన వయ స్సులో వ్రాసినవి ఇవి. సాహిత్యాన్ని గురించి వారికొక నిర్దిష్టమైన, నిర్దుష్టమైన ఉద్దేశములున్నవి. కావ్యలక్షణ గ్రంథాలలో విపులంగా చర్చించబడ్డవి రెండు విషయాలు 1. శబ్దం, 2. అర్థం. శబ్దమును గురించికంటే అర్థమును గురించి ఎక్కువగా చెప్పారు. రసచర్చ కూడా రసచర్చ కూడా రసవత్తరంగా సాగినది. కొంతమంది రసములు ఎనిమిదన్నారు, మరికొంతమంది తొమ్మిదన్నారు. భక్తి రసమే కాదన్నవారు ఉన్నారు, ఔనన్నవారూ ఉన్నారు. ఈ లక్షణగ్రంథాలు చెప్పని విషయమున్నది. అది "జీవుడు - తత్పరిణితి - సంస్కారం.'' ఇది విశ్వనాథవారి అభిప్రాయం. ఏ కావ్యమైనా బాగున్నదనిపిస్తోందంటే ఇదిగో ఈ జీవుడు - ఆ లక్షణాలు, ఆ పరిణతిని గూర్చిన విషయం అంతర్వాహినిగా

ఉండటమే ప్రధాన కారణం. శబ్దాన్ని దాటి, అర్థాన్ని దాటి ఛందోలంకారాలన్నింటినీ దాటి ఒకానొక విచిత్రమైన నిత్యపరిచితమైన భావం సహృదయుని హృదయానికి తాకుతుంది. అది కవి అనుభవించిన సాక్ష్యం కనపడుతుంది. అందుకే సహృదయులను తన దారిలోనికి నడిపించి, తనివిదీరా ఆనందింపజేయ గలుగుతున్నాడు కవి.

తాత్త్వికచింతన కవిత్వానికి భూమిక. విశ్వనాథ మధ్యాక్కరలు ఈ చింతన ప్రాతిపదికగా ఏర్పడిన ఒక మాణిక్య సౌధం. వారు సనాతన ధర్మ నిష్ఠా గరిష్ఠులు. "విశ్వనాథ ఒక హిమవన్నగ సమానుడు. సంస్కృతాంధ్రాంగ్ల సాహిత్య సముద్రాన్ని ఆపోశన పట్టిన అగస్త్యుడు, భక్తుడూ" అని పొగడిన వారున్నారు. "ఆయన అహంకారి, పరమ కోపిష్టి, వట్టి మొండిఘటం. విశ్వనాథ అగ్గిమీద గుగ్గిలం, ఆధునికులలో ప్రాచీనుడు. అంత భక్తుడే అయితే రామకోటి వ్రాసుకోవచ్చును గదా" అని శ్రీశ్రీ. "విశ్వనాథవారు వెనక్కి నడవగా నడవగా వేదకాలం ఇంకా వెనక్కు నడిచిందట, మావాడే మహా గట్టివాడు, మకుటంలేని మహారాజయ్యేవాడు, కానీ ముసలిదాన్ని మూల మూలాన ముడుచుకుని కూర్చున్న దాన్ని మనువు చేసుకోవాలన్న ఉబలాటంతో మర్యాదల్ని అతిక్రమించాడు, మరి పనికిరాడు. విశ్వనాథ వైశ్వానర కీలార్చికి వాగీశ్వరి సగం మెరిసె, సగం వడలె, ఆయన వేషంలో ఆధునికుడు. భాషలో గ్రాంథికుడు, భావంలో సనాతనుడు" (తిలక్) అని తెగడిన వారూ ఉన్నారు. కాకపోతే ఒక్కటి నిజం - విశ్వనాథ వారిని అందరూ చదివారు. చదువుతున్నారు. "శాశ్వతస్తు ధ్రువో నిత్యస్సదాతన, సనాతనాః" అనిగదా! సనాతనుడంటే ప్రాచీనుడు కాదు. గురజాడ వారన్నట్లు "పూర్ణ స్పర్థను విద్యలందే" - ఆయనకు స్పర్థ ఎక్కువ. ఈ పోటీ పడే మనస్తత్వంతోనే సాహిత్యంలో ఏ వీధిలోనైనా ఇదిగో నేనున్నానని నిటారుగా నిలబడిన వ్యక్తి.

తత్త్వచింతన అన్నది ఆర్ష సాహిత్యంలో ప్రధానంగా మూడు అంశాలపై ఆధారపడి ఉన్నది. అవి ప్రకృతి-జీవుడు-దేవుడు. శ్వేతాశ్వతరోపనిషత్తులో—

"అజామేకాం లోహిత శుక్లకృష్ణాం
బహ్వీఃప్రజాః సృజమానాం సరూపా!
అజో హ్యేకో జుషమాణోన్యశేతే
జహాత్యేనాం భుక్త భోగామజోన్యః."

ఈ మూడునూ అజములు. పుట్టినవి కావు. గీతలో కూడా క్షరుడు, అక్షరుడు, పరమాత్మ అని చెప్పబడింది. ఈ జీవుదెవరు? తత్పరిణతి ఏమిటి? ఇచ్ఛా, ద్వేషం, ప్రయత్నం, సుఖం, దుఃఖం, జ్ఞానం - ఇవి జీవలక్షణాలు. ఈ జీవుని వేదన మధ్యాక్కఱలలోనూ కన్పిస్తుంది జీవుడు దేవునివైపు ప్రయాణించడంలో గల కష్టనిష్ఠురాలను దేవునికి నివేదించుకుంటున్నట్లుగా చిన్నచిన్న పదాలతో మహార్థాన్ని నింపుకున్నవి విశ్వనాథ మధ్యాక్కఱలు. విశ్వనాథకు పద్యం రాయడం రాదన్నవారున్నారు. మరి ఆయన వేల పద్యాలు రాశారు. వెయ్యి మధ్యాక్కఱలు వ్రాశారు. ఇవి 1958-59 సంవత్సరాలలో భారతి, నవభారతి పత్రికలలో ప్రచురించబడ్డాయి ఇది పదిశతకాల సంపుటి. సాధారణంగా శతక పద్యాలన్నీ ముక్తకాలే. ఈ మధ్యాక్కఱలలో అక్కడక్కడా Continuity కూడా కనపడుతుంది. తెలుగుదేశంలో వున్న పది దేవతామూర్తుల పేర్లను మకుటాలుగా చేసి చెప్పిన కావ్యం. అన్ని శతకాలలో 101 పద్యాలుంటే, ఒక మున్నంగి వేణుగోపాల శతకంలో 108 ఉన్నాయి.

ఒక కావ్యం వెలువడటానికి కారణంగా బయటనుండి కూడా ప్రేరణ ఉంటుంది. విశ్వనాథ మధ్యాక్కఱ రచనకు- తెనాలి తాలుకా మున్నంగి గ్రామస్థులు తమ గ్రామంలో వేంచేసి ఉన్న వేణుగోపాలస్వామిపై ఒక శతకం వ్రాసి ఇమ్మనమని కవిగారిని అడిగితే వారు సరేనన్నారు. మామూలుగా వేణుగోపాలా! అన్న మకుటంతో చెప్తే మున్నంగికి గుర్తింపురాదు.

కనుక "మున్నంగి వేణుగోపాల" అని రావాలి. అది మధ్యాక్కఱ లక్షణానికి సరిగ్గా సరిపోతుంది. అలా మున్నంగి వేణుగోపాల శతకం వ్రాశారు. 'మున్నంగి వేణుగోపాలదేవ,' అనిగాని, 'ప్రభువ! మున్నంగి వేణుగోపాలదేవ! అనిగానీ తేటగీతులలో వ్రాయవచ్చు. విశ్వనాథకు సౌకర్యం, సౌలభ్యం ముఖ్యమైనవి కావు. వారికి కార్కరిలతలలో పయనించడమిష్టం. తరువాత వారి స్వగ్రామమైన నందమూరులో కూడా సంతాన వేణుగోపాలస్వామి ఉన్నాడు. వెంటనే 'నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల! మా స్వామి!' వ్రాశారు. 'తేనెల్ద్రావిన నోటికిం జలములందింపాయె విశ్వేశ్వరా!' అని అసంతృప్తితో ఉన్నారు వారి కులస్వామి విశ్వేశ్వరుడు. అంతకుముం దెప్పుడూ మున్నంగిని గాని, ఆ వేణుగోపాలస్వామిని గాని కవి చూడనేలేదు. 'మీ యూరు వినలేదు మున్ను, కనలేదు మీ మూర్తి మున్ను' అయినా ఈ మాదిరి శతకం వ్రాయిస్తు

న్నావు. మాయురే! నా మీద ఎంత ప్రేమ' అంటారు. విశ్వనాథ మధ్యాక్కరలు వెలువడటానికి మరో ప్రోత్సాహం ఉన్నది. ప్రకాశం జిల్లా కారంచేడు వాస్తవ్యులు శ్రీ ధర్మవరపు సీతారామాంజనేయులుగారు తన పేర ఒక సత్కృతిని పొంద వలెనన్న సంకల్పమును విశ్వనాథవారికి విన్నవించగా "మధ్యాక్కర అన్న ఛందస్సు క్లిష్టమైనది, విశిష్టమైనది. పది వందల పద్యములు వ్రాసి 'విశ్వనాథ మధ్యాక్కరలు' అని పేరిడిన వది కాలములపాటు నిలిచే కావ్యము ఇస్తాను తీసుకో" అన్నారు. ఈ కావ్యమునకే కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం లభించినది. విశ్వనాథకు భాష మీదా, ఛందశ్శాస్త్రం మీదా కావలసినంత అధికార మున్నది. మొత్తానికి మధ్యాక్కరకు వృత్త ప్రతిపత్తి కల్పించి ఒక వరవడి పెట్టింది విశ్వనాథ వారే! మరి వారన్న క్లిష్టత, విశిష్టత ఏమిటి? నన్నయ దేశికవిత యందు అభిమానం గలవాడు కనుక మధ్యాక్కరను వ్రాసినాడు. మధ్యాక్కరకు రెండింద్రగణములు, ఒక సూర్యగణం; మరల రెండింద్రగణములు, ఒక సూర్యగణం ఉంటాయి. నాల్గవ గణం తరువాత యతి నియతి చేశాడు నన్నయ. ఎర్రన మధ్యాక్కరలు వ్రాశాడు గానీ అదీ నన్నయ రచనయే అని స్ఫురింపజేయుటకు అన్నట్లు. కాని, ఎర్రన మూడో గణం తరువాత యతిని పాటించాడు. అప్పకవి మొదలైన లాక్షణికులు ఈ పద్ధతినే చెప్పారు. నన్నెచోడుడు కానీ, తిక్కనగాని మధ్యాక్కరలు వ్రాయలేదు. ఈ విషయం శ్రీ గిడుగు సీతాపతిగారు 'తెలుగులో ఛందోరీతులు' అన్న గ్రంథంలో విపులంగా చర్చించారు. ముఖ్యంగా అక్కరలను గూర్చి. ఈ లక్షణము క్లిష్టము కనుకనే తరువాతి కవులు మధ్యాక్కరలను వాడలేదా?

నాల్గవ గణంమీద యతిని ఉంచడంలో ఒక అందమున్నది. మధ్యాక్కర రెండు సమపాదాలుగా విడివడి పాడుటకు యోగ్యంగా వుంటుంది. అయిదవ గణంమీద యతిని పాటించటం క్లిష్టమే.ఆ వృత్త లక్షణంమీద పట్టు సాధించాలి. నన్నయ మధ్యాక్కరలన్నీ యతి విషయంలో ఒకటిగానే ఉన్నాయి. గణాల రీత్యా మాత్రం ఒక విధంగా లేవు.

ఉదా: "తన దివ్య/శక్తిన/ప్పాశముల/విడిచి/తన్ముని/నాదు" (ఆది పర్వం) పాశముల అన్నది భలం ఇంద్రగణములలో భలం లేదు. ఉదా: 'పదుంద్ర/బోలెడు/సుతుల/నూర్వుర/బడయంగ/వలతా/' జగణం ఇంద్రగణం కాదు దేశి ఛందస్సుకి మాత్రాగణ ఛందస్సే అనుగుణమైనదని గిడుగు

వారన్నారు. పాదానికి 22 మాత్రలు గాని, 26 మాత్రలు గాని ఉంటాయి. నగ, సల, త గణాలకి ఐదు మాత్రలుంటాయి కాని ఇక్కడ 23 మాత్రలున్నాయి. ఇట్టి క్లిష్ట దశనుండి ఎర్రన మధ్యాక్కఱకు ఒక మెత్తని త్రోవ వేశాడు. శ్రీ విశ్వనాథ నన్నయ, ఎర్రనలను సమన్వయించి పద్య పాదానికి రెండింద్ర గణములు, ఒక సూర్యగణము, మరల రెండింద్ర గణములు, ఒక సూర్యగణం వేసుకుంటూ నన్నయ మార్గాన ఐదో గణంమీదే యతిని వేశారు. వేయి మధ్యాక్కఱలను రచించి ఆ వృత్తానికి వైశిష్ట్యం కల్పించారు. సాధారణంగా మామూలు కవి కలానికి మధ్యాక్కఱ లొంగదని విజ్ఞుల అభిప్రాయం. విశ్వనాథ కృతి భర్త నుద్దేశించి చెప్పిన ఆశీః పద్యాలలో మాత్రం నాల్గవ గణంమీదే యతిని పాటించారు. "నా పేరు శాశ్వతంబగు నాల్గు కాలాలపాటొప్ప, దీపింపజేయవే యనిన దీని నీపేర పెట్టిన, ఈ పుస్తకము నిల్వవచ్చు వృత్త వైశిష్ట్యంబు మహిమ"....

మధ్యాక్కర రచన విశ్వనాథకి క్రొత్తది కాదు. 'కల్పవృక్షం'లో మధ్యాక్కఱలున్నాయి విశేషమేమంటే-ఆ పద్యాలలో నాల్గవ, ఐదవ గణాలపై కూడా యతిని పాటించారు. "సువశా కాళిదాసస్య మందా క్రాంతా ప్రవల్గతి" అన్నట్లు విశ్వనాథకు మధ్యాక్కఱ వశమైనది. ఈ కావ్యంలోని రసం శాంతం. పది శతకాలు దేనికవే కన్పించినా భక్తిసూత్ర బంధితాలు. ''ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ ' అని భక్తులను నాలుగు రకాలుగా చెప్పాడు 'గీత'లో. నాల్గు రకాలు తానేఐ విశ్వనాథ మధ్యాక్కఱలో సాక్షాత్కరిస్తారు. ఆయన కవిత్వం లోని వస్తువును గురించి చెప్పుచూ మొదటిదైన శ్రీగిరి శతకంలో ''వేదాంత ములలోని, వేదములలోని విమలార్థచయము వాదించు నా కైత'' కాని ఈ జగత్తు వాని శత్రువైవరలు. 'అనాదిబంధుడ వీవు' ఇద్దరు కూడా కారంటే 'ప్రోది నాకెచట' అని వాపోతారు కవిగారి భావాలను హేతువాద జగత్తు ఒప్పుకొనదు. భగవంతుడు కూడా కాదంటే తానెటు బోవాలిమరి! స్నానంబు చేయుచున్, తుడుచుకొంచును జపము నేయుచును ప్రాణాలు తేలిపో నీవు కనిపించు భాగ్య మున్నదియే! ఈనాకటంచు నేనెంతగా తపియింతు నీవెరుగుచో నాకు జాలు'' - ఈ జగత్తు ఏమైనా అనుకోని అని తన ఆర్తిని ప్రకటించారు.

శ్రీకాళహస్తి శతకంలో జనుల మనఃప్రవృత్తిని గురించి చెపుతూ ''తిరుపతికింబోయి మొదలి నగలెల్ల దీసి యిచ్చెదరు, హర! వచ్చి నిను జూచి

యొక్క నమస్కారమాచరించెదరు. వెరపించుటకు, మరపించుటకు గల భేద మిద్ది హరా!'' అంటారు. ఔనుమరి, గద్దెమీద ఉన్నవాడికి గద్దించినవాడికి కట్నాలూ, కానుకలునూ. కొండమీద నిలువుదోపిడి జరిగిపోగా భక్తునివద్ద ఇంకేమున్నది. కనుక నమస్కారం చేస్తారు. శివుడు భక్తసులభుడని వ్యంగ్యం.

తైత్తిరేయంలో "ఓం బ్రహ్మ విదాప్నోతి పరం" అన్న మంత్రార్థాన్ని పొడిపొడి మాటలతో చెప్తారు విశ్వనాథ "కొన్ని జన్మలు దాటితిని, మనోమయ కోశంబునందునున్న జన్మమిది" అన్న పద్యంలో అన్నమయ కోశం, ప్రాణమయ కోశం దాటి ప్రస్తుతం మనోమయ కోశంలో నున్నదట. మరి విజ్ఞానమయ కోశం దాటి ఆనందమయ కోశంలోకి వస్తేతప్ప బ్రహ్మమదేననీ, అది అంతటా నిండివున్నదని తెలియదు. అది తెలియాలంటే ఎన్ని జన్మలెత్తాలో కదా అని కవి వేదన.

"బియ్యంబులో రాళ్ళులేరనగునవి వెసరాళ్ళలోన బియ్యమేరి ప్రయోజ నంబు సుంత కన్పడదు స్వామి, అయ్యయ్యో! పాపపు టూహాలందు పుణ్యపు టూహ లేరుటయ్యె నా బ్రతుకు" అని తన ప్రయత్నాన్ని, జిజ్ఞాసను చక్కటి లోకోక్తిలో చెప్తారు. విశ్వనాథవారికి ఒక పుత్రుడు నష్టమయినాడు. శ్రీరాముని ఉద్దేశించి—

"కొడుకు కాంతారమ్ము చనిన నసువుల గ్రుంకె నీ తండ్రి
కొడుకు తా నసువుల గ్రుంక నేనింత గ్రుంక నీపేరు
కొడుకుకు బెట్టితి వాని బ్రతికించుకొనను నిన్గాద
నెడు తీవ్రతయు లేదు భద్రగిరి పుణ్యనిలయ! శ్రీరామ!" అంటారు.

ఇక్కడ ఆర్తారిగా కన్పించిన కవి తరువాత క్రమంగా విరాగిలా తోస్తాడు. ఇక్కడ మరొక పద్యాన్ని ఉదాహరిస్తాను. ఆయనకి సతీసుత వియోగం కల్గింది.

''నీ దయ నీదయ నీదయ మరొండు నేలను త్రోవ
కాదని జన్మలెత్తింపు చంపెదు కాంతా సుతులను
వే దరిద్రుని రోగిజేతు చేసికోవే రమారమణ
నీ దయ కానిమ్ము."

అంతటి ధిషణాహంకార బ్రహ్మమయ మూర్తి పిట్టవలె ఒదిగి సర్వము భగవంతునిపైబెట్టి నిశ్చలుడై నిలబడతాడు.

విశ్వనాథవా రద్వైతి 'యథా శివమయో విష్ణుః ఏవం విష్ణు మయశ్శివః' అని నమ్మినవారు. ఒకసారి శివుడంటాను. మరొకసారి విష్ణువంటాను.మరి నన్ను చేరికోవడంలో మీరూ మీరూ వక్కాండాలు పోకండి' అని వేడుకుంటారు. శివ కేశవులు వేరువేరంటే తన పాపాన తాను పోతానటారు.

విశ్వనాథవారి బయటి వ్యవహారనిష్ఠత వట్టి పొగరుబోతుతనంగా కన్పిస్తుంది. నలుగురిచేత 'అయ్యో! పాప'మని అనిపించుకోలేనట్టివారు. తాను కృతయుగనుతినని, తన వ్యవహారం తాటివట్టెకు ఎదురీదటం వంటిదని అంటారు. కృతయుగంలో ధర్మం నాలుగు పాదాలా నడిచిందనీ, తాను ధర్మాభిముఖంగా నడుస్తానని, ఎవరినీ లెక్కచేయనని, ఎవరేమనుకున్నా సరేననేకదా దీని ఉద్దేశ్యం?

ఆయన రసవాది. 'రసేనైవ జీవతి కావ్యమ్మ'ని గదా! అందుకే రసము వేయి రెట్లు గొప్పదన్నారు. విప్రలంబశృంగారం వారి కెక్కువ ఇష్టం. తాను నాయికగా, స్వామి నాయకునిగా భావించిన తీరు. అదే మధురభక్తి. ఆ తీరే వేరు.

చిక్కన తనుయష్టి పాలిపోయిన చెక్కిళ్ళు దవ్వు
నెక్కొన్న చూపులు గలిగిన విరహిణీ జనులంద
మెక్కడో చూచితి నుండవలయు నదెల్ల నాయందు
నక్కరై నందమూరి నిలయ! విశ్వేశ్వర! కులస్వామి!

ఇది కులస్వామి శతకంలోనిది. ఆయన మాట దురుసు. మనసు మెత్తన. ఈ విషయమే విశ్వేశ్వరునితో మొరపెట్టుకొనుచు "పుట్టెడు ప్రతిభ నిచ్చితివి, కోటి శత్రువుల గూర్చినావు" అని. స్వామి ఆయన గుండెలో కూర్చున్నాడు, మరెంతమంది శత్రువులుంటే మాత్రం అయ్యేదేమున్నది కనుక!

'బొట్టు కాటుక పెట్టి పిలుచుట'
'ఎవనికి పుట్టిన బిడ్డరా వెక్కి వెక్కి ఏడుస్తాడు'
'ఏది ఎట్లైన కాని'
'కనిబట్టిన ఏడేండ్లు తను బట్టిన పద్మాలుగేండ్లు'
'లక్ష చెప్పు వేయి చెప్పు'
'నాలుగు వేళ్ళు లోనికిపోవుట'
'పిచ్చి కుదిరినకాని పెండ్లి కాదు. పెండ్లియైనకాని పిచ్చి కుదరదు'
'కాలికి వేసిన వ్రేలికి వేచుట'
'ఎగదీసిన గోహత్య, దిగదీసిన బ్రహ్మహత్య'

తెలుగు పలుకుబడులు, జాతీయములు, నానుడులు, సామెతలు ఈ మధ్యాక్కరలలో పుష్కలం. అది తెలుగుదనం. ఛందస్సుకు తగినట్టు ఒదిగించుకున్నారు. ఒక తెలుగువాడు మరొక తెలుగువాడితో మనస్సువిప్పి మాట్లాడుతున్నట్లుంటాయి. విశ్వనాథ హాస్యం కూడా కనపడుతుంది.

శేషాద్రినిలయుడు, వేంకటేశ్వరుడు చిరుకోర్కెలను తీర్చు దైవమట. ఏది కోరుకుంటే అది తీరుస్తాడుగదా దేవుడు? కోరుకునే వారి యోగ్యతను బట్టి కోర్కెలుంటాయి. విశ్వనాథలో మరో ప్రత్యేక గుణముంది. ఒక విషయాన్ని పురస్కరించుకుని వర్ణనాత్మకంగా, సుదీర్ఘంగా వ్రాయడం అందులో తర్క ముంటుంది. శేషాద్రి శతకంలో దశావతారాల వర్ణన ఉంది. కవిసమ్రాట్టు యాభై పద్యాలు వ్రాశారు. దాదాపు సగం శతకం అవతార వర్ణనలకు కేటా యించారు. ఆయనకున్న సహజ హాస్యధోరణి (వెటకారం అనవచ్చు) ఇక్కడ కన్పిస్తుంది. కృష్ణావతార సందర్భంగా—

"నూరు తప్పులు సైచవచ్చును నూటిపై నొకటి
యోర్వరాకేమి? యోర్చుకొన్నచో యోర్వనువచ్చు
నూరేమి! పదివేలు, అందులోన నను గు మేనమరిది
శ్రీ రమాపతి కృష్ణ! వేంకటేశ్వరా శేషాద్రినిలయ!"

ఇది నేడు రాజకీయవాదులలో కన్పిస్తున్న బంధుప్రీతి. కల్క్యవతారం పురస్కరించుకుని—

"అప్పుదెవ్వడొ బ్రాహ్మణునకు జన్మింతువని వ్రాసినారు

అప్పటికైనను బ్రాహ్మణులటంచు నవని నుందురటె!' అని కవిగారి అనుమానం. వామనావతారం -

"ముల్లోకముల లోన నిండియుండి ఎప్పుడు తృప్తిలేక
ముల్లోకముల బయట కూడ మరి నిండిపోవు పేరాశ
చెల్లించుకొనగాక, ఏమి బలిచేసె? చేసినదీవు
చిల్లర యూహలు...."

ఇది వ్యాజ స్తుతి. ఏ ఊహ చేసినను పరమేశ్వరుడే చేయాలి కదా! ఇక్కడే శ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరిగారు రచించిన పద్యం చెప్తాను.

"బలి ఏ పాపము చేసినా డతనిపై వైరంబు నాకేల తత్
బలి రాజ్యంబు హరింప వంచకుడనై" అంటాడు విష్ణువు. సందర్భం వేరు కావచ్చు. ఊహలు రెండూ ఒకటే కూర్పు నేర్పు వేరు. లోకం పోకడ విశ్వనాథవారి మధ్యాక్కఅలో విశ్వరూపం ధరించి సాక్షాత్కరిస్తుంది.

మృత్యుముఖంగా ప్రయాణిస్తున్నామని వెంపర్లాడే జనుల భోగాశను గురించి ఇలా అంటాడు:

"కోరి కబేలాకు మందగా దోలికొని పోవుచుండ
దారిప్రక్కన యున్న పచ్చగడ్డిపై తారాడు పసుల
తీరుగనున్నదీ జనుల భోగాశ తెలివి సర్వమ్ము
చూర బుచ్చెదవు శ్రీశైల మల్లికార్జున! మహాలింగ!"

ఇక్కడ పోలిక స్వచ్ఛమైనది. సుందరమైనది. అందరికీ పరిచితమైనదీనూ. ఈ భోగాలనందుకోన లేరు. మరొకటి చూడండి:

"తన యింటదా చావవలయు గొలువగా దగ్గరివారు
తన చావు సైతము భాగమన్నట్లు తలచును జనులు
జనుల భోగాశ ఎంత దవ్వగా జనినది స్వామి!
అనివృతబుద్ధి భీమేశలింగ! ద్రాక్షారామసంగా!"

నందమూరు శతకంలో—

"సర్వదా చచ్చెడివారు సర్వదా చచ్చుచున్నారు
ఉర్వియు మిగిలిన వారి దన్న యట్లున్నదిస్వామి."

''శేషాః స్థిరత్వమిచ్ఛంతి కిమాశ్చర్య మితః పరం'' అని గదా! ఈ శతకంలో మనస్సును గురించి, జీవుని గురించి విచారణ జరుగుతున్నది. ఒక్కొక్క శతకంలో ఒక్కొక్క విషయానికి ప్రాధాన్యమిచ్చారు విశ్వనాథ. మనస్సు జీవుని క్లిష్టమైన మార్గాలుపట్టి పోతుంది. ఈ ప్రాణం అంటే ఏమిటి? ఎక్కడికి పోతుంది? ఎందుకు, ఎప్పుడు పోతుంది? అన్న ప్రశ్నలకి కవి రమణీయమైన ఊహ చేస్తాడు. "గోపాల! ఈ ప్రాణతతి" ఎప్పుడో చెప్పకుండా లేచిపోతుంది కదా! ఆ వెళ్ళెడి స్థలం వ్రేపల్లె కావచ్చునని. జీవ బ్రహ్మైక్యాన్ని పతిపాదించడ మిది. హేతువాదులను ఉద్దేశించి "నా మనస్సే ప్రమాణమని

యున్నాళ్ళు నాకెదొ పొగరు" ఔనో కాదో పాలింపవలసింది శివుడు. ఇక్కడే ఆనందమును గురించి చర్చ ఉన్నది. "ఆనందమును విస్మృతింగనుట" జీవిదైన లక్షణము.

సాధారణంగా ప్రజలు లేనినాళ్ళల్లో, కానినాళ్ళల్లో దేవుని తలుస్తారు. ''నిజముగా లేనిఫో నాల్గువ్రేళ్ళు లోనికి పోవుటకు ప్రజ వారి వారివే కాళ్ళు, కడుపులు పట్టుకోవచ్చు '' నిజంగా జరిగేది అదే. జరుగుతున్నదదే. కాని ఈ పద్ధతి "అప్పుడు లేద! ఇప్పుడేటికి నది! నాకును మననిజదహనా! శివా! నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్ది హేళి!" అట్టిది వారి వ్యక్తిత్వము.

మనస్సును చిక్కపట్టుట దుష్కరము. కవి ''మననిది పాఱుబోతు గొడ్డు! శ్రీ మహిత! సహజముగనే కదలకయుంబెరుగరు, పట్టుకోగనెంతువేని పొనచి డొంకలు, బీళ్ళు కోళ్ళుతోపులు మోరెత్తి పరచు, చెనెటి ముండ్లకు నీడ్చు" పారుబోతు గొడ్డుతో మనస్సును పోల్చడం కొత్తదనం కాగా, ఆ గొడ్డు వెంట పరుగెత్తువారు చివరకు ముళ్ళల్లో పడటం- ఇది సహజమైనది. పట్నవాసులకంటే, పల్లెవాసులకు ఎక్కువ అర్థమవుతుంది.

కవి నిద్రలో యొక ధ్వని విన్నారుట. అది వేణురవము కాదు. శివుని దైన శంఖరవమునూ కాదు. అది 'తేనె విరులను వెదికెడి వేళ జీవుడు సేయు షట్పదీ స్వాన మట్టిదట.' ఇది మున్నంగి వేణుగోపాలునికి నివేదన. ఇక్కడ మేల్కొల్పులున్నవి.

దేవునికి నిద్రలేదు. ఈ జీవునికి దేవునికి కలియుట ఎప్పుడా అన్న ఆరాటంతో నిద్రలేదు. ఇక్కడున్న దశావతారాలలో వర్తమాన రాజకీయ సాంఘిక పరిస్థితులను చెపుతారు. ప్రశ్నలనేకానేకములు 'ఇంత నిరర్థకమైన జీవితమునకై ఎంతయో శ్రద్ధ, అంత సార్థకమైన నీదు భావనయందు అశ్రద్ధ' - ఈ సృష్టి లక్షణమే ఇది. మరి దోష మెవరిది?

"ఈ మేను కర్పూరమట్లుగా హరియించి పోయెడిను
స్వామి! నీకైన నీరాజనమ్ముగ వెచ్చన పొగతావి
యేమాదిరేనో? నేడు కలితిలేని దెందుండె నరకు
హేమాంగా! వేములవాడ రాజరాజేశ్వరస్వామి!''

తానుకూడా కర్తియౌనేమో! అరిషడ్వర్గం తనని కర్తివేసిందని అనేకసార్లు అనేకచోట్ల చెప్పారు. మధ్యాక్కఱల రచన వేరపనిమీద మానివేసినను ఆ ధ్యానం కొనసాగాలని తాను కృపణుడనని వేడికొంటాడు.

ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారు విశ్వనాథ మధ్యాక్కఅపైచక్కని వ్యాసం సంతరించారు. మారుమూల ఛందస్సును కవి ఏరుకొనుటకు ఆయనకు గల పౌరాతన్యం మీది అపూర్వానురాగం మాత్రమేనని అంటారు. అట్లాగయితే తరువోజను ఎందుకోవచ్చునుగదా! బెజవాడ శాసనంలో ఉన్న మధ్యాక్కఅకంటే ప్రాచీనమైన పండరంగని అద్దంకి శాసనంలో తరువోజలు కన్పిస్తున్నాయి కదా! ఈ దేశి ఛందస్సు కర్నాటక, ఆంధ్ర ప్రాంతాలకు సుపరిచితం. నన్నయ బహుశః మధ్యాక్కఅను అందుకే వాడి ఉంటాడు. ఆచార్యులవా రన్నట్లు "మాయురే! అన్నలా, ఒగి, పరగ'' మొ॥ ప్రాతపడిన మాటలను కూడా విశ్వనాథ ప్రయోగించారు. వారి పద్యాలలో లాలిత్యం కనిపించదు, అవి చదవ డానికి రావు అని ఒక మాట ఉన్నది. అవును, అవి రావు. మనమే చదువు కుంటుంటే ఆశయ్యే. ఆ పదప్రయోగం మరుగునపడిపోయి ఒక మహత్తరమైన అర్థము మనలోనికి జొరపడుతుంది. అప్పుడు శబ్దార్థాలకు వ్యవధానం లేనట్టే. కవికి పాఠకునకు అవ్యవధానం ఏర్పడుతుంది. ఆయనకొక రాగచ్ఛాయ ఉన్నది. అట్లా పాడుకుంటూ వ్రాస్తారు. శబ్దాలను ఒప్పించి, జొప్పించి వ్రాస్తారు. ఇదే విశ్వనాథ మధ్యాక్కఅలలో వున్న విషయం.

పురాతనం, ఆధునాతనం అనిగాదు, మొదట 'మున్నంగి వేణుగోపాల!' అన్న మకుటం మధ్యాక్కఅకు సరిపోతుంది. సహజంగా విశ్వనాథకు ఒక విషయ మును గురించి కాని, ఒక ఛందస్సు వ్రాయునపుడు కాని నిపులీకరించి వ్రాయుట వారికిష్టము. అది ఆయన త్రోవ. ఈ ఛందస్సులో వేయి పద్యాలు రచియించి మధ్యాక్కఅకు మనుగడ నేర్పినట్లు భావించవచ్చు. ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారన్నట్లు - ''మధ్యాక్కఅకు ప్రాణప్రతిష్ఠ చేసినవాడు నన్నయ. జీవించటం నేర్పినవాడు శ్రీ విశ్వనాథ - మధాక్కఅ ప్రస్థానంలో విశ్వనాథ ఒక పెద్ద మలుపు."

''విరులవలెన్ మృదూక్తుల కవిత్వము సెప్పిన చెళ్ళపిళ్ళ మా
గురువని చెప్పికొంట యొక గొప్ప! యొకప్పుడు నేడు నీల సుం
దర రఘురామ దేవతరుధార్తి వెలార్చిన విశ్వనాథ నే
నెరుగుదునన్న జాలు నదియే యొక గొప్ప తెలుంగునాడునన్."

(ముళ్ళపూడి సచ్చిదానందమూర్తి) *

# శ్రీకృష్ణ సంగీతం

—శ్రీ యామినీ సరస్వతి

శ్రీకృష్ణుని బాల్యక్రీడలను మధురాతిమధురంగా వర్ణించిన మహాకవి బమ్మెర పోతనామాత్యుడు గీతగోవిందం శ్రీకృష్ణుని రాసక్రీడలే! శ్రీకృష్ణుని బాల్యక్రీడలు, ఆ చిన్ని కృష్ణుని వేణుగానం చుట్టూ అల్లుకున్న మధురమైన కథలు విశ్వనాథవారి శ్రీకృష్ణ సంగీతం. పదేళ్ళు నిండీనిండకముందు వ్రేపల్లెలో శ్రీకృష్ణుడు గోపికలతో చేసిన నాట్యకథలు, పాడిన గీతకథలు, ఆడిన కొంటె కథలు అన్నీ శ్రీకృష్ణసంగీతం.

ఇది ఎలా ఉంటుందంటే- విశ్వనాథ వారి 'మాటలే' చూద్దాం:

పసి త్రాచు పిల్లలు దూకినట్లు
జల్లు పడ్డప్పు పరుపైన రాళ్ళమీద
వెండి నీళ్ళులు జలజల వెదలినట్లు
నీలమధుమూర్తి గుండెలో నిండినపుడు
యోగి చెక్కిళ్ళ కన్నీళ్ళు సాగినట్లు
నవ్వుచును పసివాడు స్తన్యంబు గ్రోలుచు
అమ్మ మొగమును జూచుచు అర
విడుచు సెలవులందున క్షీరమ్ము చిందినట్లు
ఉపనిషద్దేవి ప్రక్కల కొరిగి నవ్వి
నట్లు వేదముల్ గలగల నాడినట్లు.

ఈ 'గీతం'లోని ఉపమలు విశ్వయోగి వంటి కవి అయిన విశ్వనాథ మాత్రమే చేయగలవి. 'యోగి చెక్కిళ్ళ కన్నీళ్ళు సాగడం' ఆయన మాత్రమే చేయగల ఊహ.

శ్రీకృష్ణుని వేణుగీతి విని, ఆ వ్రేపల్లెలోని గోపికలందరూ వెర్రెత్తినట్లు బృందాటవికి వెళతారు. అలా వెళుతున్న గోపికలను చూసి ఆశ్చర్యపోయేవాళ్ళు, అసూయ చెందేవాళ్ళు, భార్యలను అదుపులో పెట్టలేక తమలో తాము కుమ్మరిల్లి

పోయే భర్తలు ఎందరో ఉంటారు. అలాటి వారిలో ఒక భర్త వేదన, ఆ భార్య సమాధానం విందాం.

నీవు నందయ్య యిల్లు పోనే వలవదు
నీవు బృందాటవికిని పోనే వలవదు
నాకు నిష్టమ్ము లే దూరి నలిననేత్ర
లెల్లరను పోయినన్ పోవనిమ్ము గ్రామ
మందు తలవంపు నున్నదకట నాకు-
.... .... .... .... ....
నీవు మాత్రము పోరాద యీవుగాని
గడప దాటిన మరల నా గడప త్రొక్క
నీను, నిజముగా చెప్పుచున్నాను, నవ్వు
లాటకా దొట్టు బాలకృష్ణయ్య మీద-

భర్త అలా నిష్ఠురంగా, తన అయిష్టం అంతా ప్రకటిస్తూ అనగానే ఆ భార్య ఏమంది?—

—అంత యెట్టెందుకయ్యా సామి?
నీవు భర్తవు, భార్యను నేను, నిన్ను
వదిలి కాపురానికి నీళ్ళు వదలు కొనుట
నేను చేయనే చేయను నిన్ను వదలి
అమ్మ బువ్వయ్య బువ్వని యడిగికోను
కేవలం బంతదాక తెగించలేదు.

అలా భర్తకు జవాబుచెప్పి యింకా ఏమందో విందాం.

ఈ వ్రేపల్లెలో ఒక న్యాయసభ వుంది. అది వృద్ధజనుల న్యాయసభ. నిన్ను అందులో చేర్చుకున్నారు. నీవు వయస్సులో ఉన్నవాడివి. అయినా ఎందుకు నిన్ను చేర్చుకున్నారు? 'న్యాయ్యము కూడి యుందువు కనుక.' అంతటి న్యాయ మూర్తివి బాగా ఆలోచించు.

చిట్టి కృష్ణమ్మపై నొట్టు పెట్టుకొంటి
వింత యవ్రతిష్ఠయు మరియింత రగడ
వేని గూరిచి? యూరిలో వాని గూర్చి
వేనిగూరిచి నీ వొట్టు పెట్టికొంటొ
వాని గూరిచి!

అయ్యా! నేను నీ భార్యను నీవే బాగా విచారించుకో - కృష్ణుని నీ మధ్య ఎవరు కావాలో కోరుకో అంటావు నాకు కృష్ణయ్య కావాలని కోరుకుంటాను. అయితే నేను నిన్ను కాదని కృష్ణుడ్ని కోరడం లేదు. నాకు నీవు కావలె, కృష్ణుడు కావలయును.

ఇక ఆ భర్త ఏం చెప్పగలడు? ఏం చెయ్యగలడు? ఇద్దరూ కావాలి అని కోరునపుడు ఎంతటి న్యాయ్యమూర్తి అయినా, న్యాయ్యవర్తనుడైనా ఏమని తీర్పు చెబుతాడు?

ఇంతకూ ఆవిడ కృష్ణుడు కావాలని కోరడం - రోజూ బృందాటవికి వెళ్ళి అక్కడ వేణుగానం వినడానికే!

ఆ వేణుగానం ఎలాటిది?

"భర్తను పరిత్యజించి రారమ్మటంచు వచించినట్లు, కాపురములోన నేమున్నదే పురంధ్రి? యడవిలో నన్ను కలిసికో నరుగుదెమ్మటంచు పిలిచిన యట్లుగా అది మోగుతుంది (వైకుంఠం శీర్షిక).

ఆ వేణుగానం

అడవిలోన, నది వద్ద, చీకటిలోన, భయములేక యూరక తిరుగుట కాక, పైన నిట్లు పిల్లనగ్రోవి వాయించువారు ఎవరబ్బా అనిపిస్తుంది (దయ్యము శీర్షిక).

అలా విని - అపై
అదుపు నాజ్ఞయు లేని వేరైన గాని
యుదరి పిల్లనగ్రోవి యూదెదరు గాక
వారితో నేమి? నే బోయి పండుకొనెద—

అని నిర్ణయించుకుని పడుకుంటుందా కొత్తకోడలు కానీ ఆమె ఆ యింటిలో నిలచి పడుకోలేక ఆ అర్ధరాత్రి ఆ కటికచీకటిలో బృందావనికి వెళుతుంది .... కానీ వెళ్ళడంలో ఆమె ప్రయత్నంలేదు. ఆమె అప్రయత్నంగా నడిచివెళ్ళింది. అదీ ఆమెకు ఆశ్చర్య కారణం!

'ఇంటిలో దీపము లేకయున్న' భయపడే ఆ ఇల్లాలు - అనుకుంటుంది:

ఇట్టి అడవిలో నడుచుటేమి ?
ఓసి స్తంభించి కదలక యుంట యెరుగ

వచ్చుగాని యీ కాళ్ళకు వచ్చినట్టి
యిట్టి విపరీతమగు వ్యాధి ఎరుగలేన

అలా లాక్కుని వెళ్ళే వేణుగానం - ఆ శ్రీకృష్ణుని సంగీతం కోసం వ్రేపల్లెలో ఉన్న వ్రజాంగనలంతా వెళుతుంటే పొరుగూరివాళ్ళు యిలా అనుకుంటారట!

చెలియ! పలుమంది పెద్దలు చెప్పినారు
తండ్రి వినలేదు సుంతయు, తల్లిగూడ
నెత్తిపై నోరు పెట్టుక మొత్తుకొనియె
ఎవడు పిల్లను వ్రేపల్లె కీయరాదు
అచట కాపురాల్ నిలిచెడు నట్లులేదు
ఒక్కపల్లెలోపలనుండు నొక్క ధనికుఁ
డతనికి సుపుత్రు డుదయించు ప్రాణహారి
అతనికిని యౌవనోదయమైన యంత
కాంత! యూరెల్ల నెంగిలి కాపురాలె. (వైకుంఠం శీర్షిక)

మగవాళ్ళు వ్రేపల్లె సంబంధం గరించి ఎలా తలపోసినా ఆ గోపికలు మాత్రం యిలా అనుకుంటారు- 'పదిమందితో చావు పెండిలి యనుకొంద్రు! పెండిలి యేమి వైకుంఠమందు.' మోక్షం సులువుగా లభించే మార్గం దొరికితే ఎవరేమనుకుంటే ఏం?

ఒక భర్తకు యీ తతంగంపై అనుమానం వచ్చింది. అక్కడ నిజంగా బృందావనిలో ఏం జరుగుతుంది? వీళ్ళు వెళ్ళేది రాసక్రీడకా? రహస్యక్రీడకా? వేణుగానం వినడానికేనా, వేణుగోపాలునితో విహరించడానికా? సందేహం అయితే వచ్చింది కానీ తీరేదెలా?

వీరలందరు బృందకు వెళ్ళుదురు మ, హార్ధరాత్రమ్ము లందున నచటనేమి, చేయుదురొ? చూడవలెనన్న చింతపొడమి, పోవలవదన్న తనుపీడి పోవునేమొ, యన్న భయముగలట్టి వాడతివ గూర్చి- మీసలను గొరిగించుక మింటి నడిమి, ప్రొద్దువేళ మాపటి దాక పొలములందు, దిరిగి గేహమ్మునకును రాత్రికిని చేరి, భార్య విడిచీర రైకలు పరిధవించి, యెత్తు జొమ్ము గలాతడు జుత్తుక్రింది, కని చెవుల వెన్కకును దువ్వి కనులయందు గాటుకయు బొట్టు వెట్టుక గాజులు కయి, సవిరి ప్రొద్దున కొని తెచ్చినవి హూటాహు, టింబరువు లెత్తి"నాడట.

అక్కడ - మురళీరవళి వినగానే గోపికలు తాదాత్మ్యం చెందుతున్నారు. కొందరికి నీవి జారిపోతున్నది. ఒకరికి రైక పిగిలిపోతున్నది. ఒకతె పగిలిన పెదవిని వ్రేళ్ళతో అదుముకుంటున్నది. ఒకతె జుట్టుముడి వూడిపోతే సవరించు కుంటున్నది - అదిచూసి యితగాడు 'యూడగొట్టినట్టి నాగటి దుంపనా నచట నిలిచె' (ఆడవేషం శీర్షిక).

అందరూ తూర్పున వేగుచుక్క తోచగానే 'మందహాసోర్మికా మహానంద కుల్య లూగులాడుచున్నట్టుగా పీదయిన రాతి నొరసుక వెళ్ళినారు'ట!

ఇలాంటి అనుమానమే కంసుని పనుపున వ్రేపల్లెలో మారురూపున జీవించే ఒక రాక్షసుడికీ వచ్చింది. వాని అనుభవమూ ఇలాగే అయ్యింది.

ఆ ఊళ్ళు ఒక గొల్లపిల్ల - శ్రీకృష్ణునితోడి బాలిక - ఒకరోజు ఆటలాడు కుంటూ శ్రీకృష్ణుని చేతికున్న ఉంగరాన్ని చూసి అందులోని రవ్వను గమనించి ఇది నాటితే రవ్వలచెట్టు మొలకెత్తి రవ్వలు కాస్తుంది అనగానే గోపాలదేవుడు ఉంగరంలోని రవ్వను తీసి పాతిపెట్టి యిద్దరూ నీరుపోసి వెళ్ళారు.

యశోదమ్మ అడిగితే పాతిపెట్టాను. రవ్వలచెట్టు మొలుస్తుంది. రవ్వలు కాస్తాయని అంటాడు. ఆమెతో 'రవ్వ' నాటినచోట తప్ప మిగతా అన్నిచోట్ల వెతికిస్తాడు. కొన్నేళ్ళకు ఆ పిల్లకు పెళ్ళవుతుంది అప్పుడు శ్రీకృష్ణుడు దోసెడు రవ్వలు తీసుకునివెళ్ళి ఆమెకు చదివించి అంటాడు- 'నీవు నే నాటలందు మున్ను రవ్వ మొలవవేసితి మది రవ్వల తరువయ్యె నివి దాని రవలు' సగం నీ భాగం నీకు యిచ్చాను అంటే ఆమె నవ్వి అంటుంది:

> రవ్వ రాయి, మొల్వదు, మొక్కరాదు, చెట్టు
> కాదు, కాయలు కాయదు కాదె కృష్ణ!
> నా వయిన నీకు కరుణ యున్నయెడ వినుము
> అవ్వ లేకుండ నా కాపురంబు నడిచి
> రవ్వగా నేను మరి నల్వురను మెలంగ
> జేయవే నాకు నదియొక్క వేయి యనుచు
> రవ్వలివి యేల గొల్లవారలకు నింత
> ధనము వలదు" (సోదరి శీర్షిక).

శ్రీకృష్ణుడు ఆమెను 'వేణుగీతం'తో 'సోదరీ భావసాగర సుందరం'గా మదిలో అనుగ్రహిస్తాడు.

ఒక గొల్ల పడుచు సంగీతం నేర్చిన వ్రజాంగన తను సంగీతం నేర్చినా ననే గర్వంతో 'పేర్మి నా తండ్రి నాకు చెప్పించినాడు చిన్నవాడు సంగీతము చెప్పికొంటి అందులో ఏడు స్వరములు అందులోన వర్ణములు మెట్లు కీర్తనల్ వరలుచుండు ఒక్క లయయుండు ఒక శ్రుతియుండు యింత అడ్డగోలుగా ఉండదు' అని శాస్త్రీయ దృక్పథంతో సంగీతంలో పండి పరిణతి చెందినట్లు మాట్లాడుతుంది.

సంగీతం అంటే సప్తస్వరాలు. వర్ణాలు, మెట్లు, కీర్తనలు, లయ, శ్రుతి మాత్రమే అనుకునే ఆ వెర్రి వ్రజాంగన శ్రీకృష్ణ సంగీతంలోని మాధుర్యం గ్రహించలేక - 'యాదవా! నీది గానంబు కాదురయ్య. గాన మెచ్చటనైనను కర్ణ రంధ్రములను చొచ్చు. గుండెకు సౌఖ్యము సమకూర్చు''తుంది. అదీ సంగీతం లక్షణం. కానీ నీ వేణుగానం వుందే అది.... 'ఇంక నీ పాట చెవులలో నెపుడు చొచ్చు, చొచ్చుచునె చొచ్చుచునె గుండె జొచ్చుగాని, యెపుడు నీ పాట యిది సుఖమిచ్చు నెదకు? ఇచ్చుచునె ఇచ్చుచునె దుఃఖమిచ్చుగాని! నేను నీ పాటకును రానె రాను పొమ్మ'' అంటుంది నిరసనగా!

అపుడు శ్రీకృష్ణుడు యిలా అంటాడు: 'గొజ్జంగి తీవవంటి మై సొగసు దాన! నీవు రావే సుమాంగి! నా వెదురు కర్రలో సన్న క్రోవులందు వెదలు నవ్వడుల్ వినగ, నీ యెదద పెన్ జడుల్ కురియు, కాపురంబు ముడుల్ విరియు' (పిలుపు శీర్షిక)

అదీ శ్రీకృష్ణ సంగీతం! అదీ విశ్వనాథ గీతం!

ఆ వెదురు గొట్టంలోంచి అంత మంచి పాట ఎలా వస్తుంది! అనే సందేహం వచ్చింది ఓ గోపవనితకు. ఓ రాత్రి వెళ్ళి పరీక్షచేసి వచ్చింది కూడా!

కొత్తగా కాపురానికి వచ్చిన ఓ గోపవనిత వనితలంతా వెన్నుని వేణు గానంకోసం పరిగెత్తడం గురించి విమర్శిస్తుంది. నిందిస్తుంది. ఇదే తమ వూళ్ళో జరిగితే 'ఏమనెదు? శవాలు వెళ్లెడివి' అంటుంది. పది రోజులు గడిచాయి. ఈ కొత్తకోడలు బృందావని వెళుతుంది. ఆనాడు తాను తిరస్కరించిన స్త్రీని చూసి క్షమాపణగా అంటుంది ''తెలియదు నాకు నాథు. నేననిన మాటలను గోప

మూనకమ్మ! యిప్పుడైనను మా వార లెరిగిరేని వెలది నా ప్రాణములు తీసివేతు రనుము, దీని నాదు పుట్టింటికి తెలియనీకు, ఇనకు డెప్పుడో చంపిన చంపవచ్చు, క్రోవి వినకుండ ఇప్పుడు చావలేను'' (శిక్షిక - సద్యోమరణ నివారణము.)

అదీ శ్రీకృష్ణ సంగీతంలోని ఆకర్షణ! విశ్వనాథ భావనలోని ఆకర్షణ.

విశ్వనాథవారి శ్రీకృష్ణుడు 'శ్రీకృష్ణ సంగీతం'లో మధుర భావనలే కాదు 'హాస్యరసాన్ని' అందించాడు.

ఒక గోపవనిత శ్రీకృష్ణుని వద్దకు వెళ్ళి 'చిన్ని మా కృష్ణ నీవు పెళ్ళి చేసుకుంటావు కదా! అప్పుడు వచ్చే స్త్రీ కోపగత్తె అనుకో - ఆమెను ఎలా బతి మాలు కోవాలో నేర్పుతాను. నేర్చుకుంటావా?' అని అడుగుతుంది. నీరజాక్షుడు 'నేర్పు' అంటాడు.

ఇద్దరి మధ్యా అలిగిన భార్యాభర్తల మధ్య జరిగే చిన్ని చిన్ని చేష్టలన్నీ జరిపింది. 'కృష్ణుడు భార్యగా' నటిస్తున్నాడు అలిగిన భార్యను ఎలా ప్రసన్నం చేసుకోవాలో 'భర్తగా నటిస్తున్న స్త్రీ' చెబుతున్నది. చివరగా ఆమె పాదాలపై పడు తుంది. "బాలకృష్ణుడు ఆదలి కాల్సాచి సతి దొక్క యందు తన్నె!" వనితయును బాధపడి 'ఓయి మోటువాడ! ప్రథమమున నాది తప్పు! నీవంటి వాని కేదో నేర్పంగ వలెనంచు నెంచుటేమిటి?' అంటుంది కొద్ది బాధతో. తిరిగివెళ్తూ శపిస్తున్నట్టుగా 'అతివ యిట్టిదే దొరికెడు మనుచు నీకు' అంటుంది. దానికి కృష్ణుడు 'ఓ నాతి! నాకు అట్టిది లభించెనా స్వర్గమంచులకును గొంచుబోయి చూపించెద' అంటాడు. ఆపై 'నొప్పి పెట్టిందా?' అని అడిగి, 'బండి రక్కసుని తన్నిన పాదమాయె' అనుచు ఆమె మేను చేతుల రాచి మర్యాద చేసినాడట.

ఇలాంటి శ్రీకృష్ణ లీలలు 108 రసవత్తరంగా కథన గానం చేశారు విశ్వనాథవారు.

పోతన అనేవారట- నేనే రామాయణం రాయవలసివస్తే గ్రంథం బళ్ళ కెత్తవలసి వస్తుంది అని. విశ్వనాథవారు భాగవతం రాసివుంటే ద్వాదశ స్కంధాలు పన్నెండు గ్రంథాలై బళ్ళకెత్తవలసి వచ్చేదనిపిస్తుంది. ఇంతట్టి

శ్రీకృష్ణహృదయవేది విశ్వనాథ రామాయణం రాసి భాగవతం రాయలేదు అని ప్రశ్నించుకుంటే 'రాముడు నాకు తండ్రి.... స్నానము, జపము.... ఆ రాము వినా క్షణ మవురా మనలేను' అని విశ్వనాథ దశరథుడన్నట్టుగా విశ్వనాథవారు ఆ రాముడు వినా లేడు అయితే భాగవతం రాయని కొరత తీర్చడానికే శ్రీకృష్ణ సంగీతం రాశారనిపిస్తుంది

శ్రీకృష్ణ సంగీతంలో 108 ఖండికలున్నాయి. ఇవి దేనికవి పరిపూర్ణం! ఏకసూత్రం! శ్రీకృష్ణుని వేణుగానం, దానిని విని పరవశించి ప్రతిరోజూ బృందావనికి వెళ్ళే గోపికలు. ఖండకావ్య మంటే అప్పుడొకటి అప్పుడొకటి పండక్కో పబ్బానికో వ్రాసి కొన్నేళ్ళ తర్వాత అన్నిటిని గుదిగుచ్చి లేదా యేర్చి కూర్చి ప్రకటించడమే కదా! కానీ యీ శ్రీకృష్ణ సంగీతం అలా కూర్చింది కాదనిపిస్తుంది. దీనిలో 108 శీర్షికలూ ఒక అంతరార్థాన్ని చెబుతాయి. జప మాలలో 108 పూసలుంటాయి. విశ్వనాథ ఒక మహాయోగి! ఆయన యోగం రచన! ఈ ఖండకావ్య జపం ద్వారా ఆయనకు మోక్షం సిద్ధించినా సిద్ధించి ఉండవచ్చు. విశ్వనాథవారు ఏ రచనా చాలా రోజులు సాగించినట్టు దాఖలాలు లేవు- ఒక్క రామాయణ కల్పవృక్షం తప్ప! వేయిపడగలు నెలలోపే రాశారట! ఏకవీర వారం రోజుల్లో చెప్పారట! వారే ఒకచోట చెప్పినట్టు ఏ నవలా నాలుగైదు రోజులకు మించి రాయలేదు. బహుశా శ్రీకృష్ణ సంగీత 'జపం' కూడా ఏ వారం రోజుల్లోనో పూర్తి చేసి వుంటారు. ఈ విషయమై ఎవరయినా పరిశోధిస్తే బావుంటుంది.

గంగాస్నానం తుంగాపానం అని సామెత! విశ్వనాథ కవిత గుణభద్ర అయిన తుంగభద్ర! దాన్ని ఎన్ని పర్యాయాలు సేవించినా తనివి వుండదు. జీవుడున్నన్నాళ్ళు నీళ్ళు తాగుతూ వుండాలి! మనలో జీవరసం వున్నన్నాళ్ళు విశ్వనాథ కవితను ఆస్వాదిస్తూ ఉండాలి- తప్పదు.

విశ్వనాథ ఒక అద్భుతమైన మాట చెప్పారిందులో! ఒక వ్రజాంగన గర్భవతి అయ్యింది! ఆమెకు తొమ్మిదవ నెల వచ్చింది. తొలికానుపు కనుక, పుట్టింటి వారు ఆమెను పురిటికి తీసుకపోవడానికి వచ్చారు. ఆమెకు బొత్తిగా యిష్టం లేదు. అందుకని కృష్ణుడికి తన మనస్సులోని మాట చెబుతుంది.

ప్రసవ సమయాన వేణు రవంబు వచ్చు
దాన! సులముగా ప్రసవంబు జరుగునంచు
పెట్టుకొన్న సర్వాశలు పెట్టు దప్పి
పోయె నీవు నా బదులుగా పోయి స్వామి
కడకు నా విన్నవము చేసి వడిగరమ్మని" ఒక స్త్రీని పంపుతుంది.

ఆమె శ్రీకృష్ణుని వద్దకు వస్తుంది 'సంధ్యా సరోజ వదన! నీ వేది చెప్పిన వనిత తోడ అది చెప్తా' అని అడుగుతుంది. అలా అడిగితే 'బాలకృష్ణమ్మ నవ్వుల వదన మొప్ప' యిలా అంటాడు: 'ఓసి నే నెవ్వర ఇందు వనిత గాని నా తోడ చెప్పి యక్కట వివాహమాడెనా? గర్భము దాల్చెనా? యిదేల నెత్తి పైకి వచ్చిన యప్డు నేను - మొక్కుకొనుట - ముడుపులు కట్టుట - వినతి సేత -

ఏమి నను చేయు మనునె యీ యింతి నేను
మీకు మంత్రసాని తనమ్ముగా మెలగవలెనె
వేణు వొక్క ప్రేవల్లనే విన్వదదు, వినం
గలుగు నేని పుట్టింటి నైనన్ వినబడు'' (పురిటి ప్రయాణం)

'శ్రీకృష్ణ సంగీతం' ఇంటింటా వినబడాలి! ఊరూరా పల్లెపల్లెలో వినబడాలి! రాష్ట్రమంతటా దేశమంతటా విశ్వమంతా వేణురవ శ్రీకృష్ణ సంగీతం వినబడాలి! ప్రపంచమంతా సుఖశాంతులతో జీవించాలి! విశ్వమంతా ప్రాణవిభుని మందిరమైతే - వీధివాకిలి ఏది చెల్లెలా అన్నట్టుగా వేణుగీతికలు విశ్వమంతటా వినబడాలి! శ్రీకృష్ణ సంగీతం చదువనేర్చిన ప్రతివారూ చదవాలి! వినగలిగిన ప్రతివారూ వినాలి!

*

---

జన్మలింకెన్ని నాచేత నెత్తింప సంకల్పమయ్య!
జన్మలెన్నైన నాకేమి? - వైరాగ్యసంపద తోడ
మన్మనో విహరణమీవు వదలకు, మదనగోపాల!
విన్మ నా యీమాట యొకటి! మున్నంగి వేణుగోపాల!

—విశ్వనాథ

# విశ్వనాథవారి కృష్ణకావ్యాలు

—డా॥ టి. శ్రీరంగస్వామి

శ్రీ సత్యనారాయణగారి సాహిత్య ప్రపంచంలో అటు శ్రీమద్రామాయణ కల్పవృక్షము, ఇటు వేయిపడగలు శిఖరాయమాణంగా ప్రసిద్ధమైనవి. అయితే ఇవే కాకుండా ఆయన రచించిన కావ్యాలు, రచనలు పరిమాణంలో చిన్నవి, పెద్దవి అయినా కావ్యత్వ దృష్ట్యా అసాధారణమైనవి అనేకంగా ఉన్నాయి. గిరికుమారుని ప్రేమగీతాలు, శశిదూతము మొదలైన కావ్యాలు. ఝాన్సీరాణి, శివార్పణము వంటి కావ్యాలు; శ్రీ కుమారాభ్యుదయము, ఋతుసంహారము, కిన్నెరసాని పాటలవంటివి ఈ విధంగా వస్తురూప వైవిధ్యంగల కావ్యాలు ఎన్నో ఉన్నాయి. ఇన్నింటిలో ఒక సముచ్చయంగా గుర్తింపదగినవి కృష్ణకావ్యాలు. కృష్ణ విషయ ప్రధానమైన కావ్యాలు.

ఇవి ప్రధానంగా అయిదు - 1. శృంగారవీధి 2. భ్రమరగీతాలు 3 గోపికా గీతాలు 4. ప్రద్యుమ్నోదయం 5. శ్రీకృష్ణ సంగీతం. వీటితోపాటు చెప్పుకో దగిన మరి రెండు రచనలు - 6. నందమూరి శతకము 7. మున్నంగి శతకము.

ఈ రెండు 'విశ్వనాథ మధ్యాక్కరలు'లు అన్న శతక సముచ్చయంలో 7వ, 9వ శతకాలుగా ఉన్నాయి. వాటి విషయం వేణుగోపాలుడు.

ఈ కావ్యాలను అనుశీలిస్తే సత్యనారాయణగారి ఆధ్యాత్మిక ప్రవృత్తి వైలక్షణ్యం అనుభవ గాఢత్వాలు వ్యక్తమవుతాయి. అటు శ్రీమద్రామాయణ కల్పవృక్షము వంటి శ్రీరామచంద్ర విషయమైన మహా కావ్యము, ఇటు కృష్ణ కావ్యాలు, మరొకవైపు 'శివసాహస్రి' వంటి శివప్రాధాన్యం గల వివిధ రచనలు, "దేవి త్రిశతి" వంటి శక్తి ప్రధాన రచనలు ఆయన ఆధ్యాత్మిక ప్రవృత్తిలోని అద్భుతమైన సమన్వయ లక్షణాన్ని వ్యక్తీకరిస్తాయి. వీరందరూ ఆయన ఆధ్యాత్మిక జీవితాన్ని పరిపాలించినట్లు కనిపిస్తుంది. వీరి నామ రూప వైవిధ్యంతో సహా తాత్త్వికమైన ఏకత్వం ఆయనకు విషయం. ఆత్మనిష్ఠమైన వేయిపడగల

రచన నాటినుంచి ఆయనలోని భక్తి లక్షణం అనుస్యూతంగా ఆయన సాహిత్యంలో ప్రవహిస్తూనేవస్తున్నది. ఇది ఈ కృష్ణకావ్యాలలో విలక్షణంగా అభివ్యక్తమయింది. ఈ అభివ్యక్తికి మూలం వీటిలోని వస్తువు.

విశ్వనాథ భక్తి రచనలలో శ్రీరామచంద్ర పరమైన రచనల తర్వాత కృష్ణపరమైన రచనలే అధికంగా కనిపిస్తాయి. శ్రీరామచంద్రుని విషయంలో శ్రీమద్రామాయణ కల్పవృక్షమే ప్రముఖమైనది. కాని, కృష్ణ విషయంలో ప్రత్యేకంగా పేర్కొనబడిన కృష్ణకావ్యాలే కాక అనేక సందర్భాలలో కృష్ణ ప్రాధాన్యం ప్రముఖంగా కనిపిస్తుంది. ఆయన నవలల్లో కృష్ణ ప్రస్తావన గల సందర్భాలు అనేకం. పురాణ వైరగ్రంథమాల నవలలన్నీ కృష్ణతత్వం భూమికగా సాగినవే. నేపాళ, కాశ్మీర నవలలకు కూడా భూమికగా కృష్ణ ప్రాధాన్యం కనిపిస్తుంది గుప్త పాశుపతమ్; తెలుగులో, సంస్కృతంలోనూ ఆయన రచించిన ఆ నాటకానికి మూలం కృష్ణతత్వమే. "దిండు కింద పోక చెక్క" అన్న నవలలో "బాలాయ నీలవపుషే...." అన్న కృష్ణ కర్ణామృత పద్య భావాన్ని సాక్షాత్కరించుకున్న తీరు ఇందుకు ఒక చిన్న ఉదాహరణ. ఆ నవల లోనే ఒక ప్రధాన పాత్ర అయిన గోస్వామి మాటలుగా —

"నే నుపనిషద్వాదిని. కాని ఆ ఉపనిషదర్థమంతయు నా మనస్సుతో, నా ఆత్మలో శ్రీకృష్ణ దేవుడుగా తాండవించుచున్నాడు. భగవంతుడైన శ్రీకృష్ణుడు నాకు బహు విషయములను స్ఫురింప చేయుచున్నాడు." అని అంటారు.

గోపికా గీతాలు, భ్రమర గీతాలు దగ్గరకు వచ్చేసరికి ఒక గోదాదేవివలె, ఒక మీరాదేవివలె తానే ఒక గోపికగా మారిపోతారు సత్యనారాయణగారు. శ్రీకృష్ణ తత్త్వము అది విచిత్రమైనది; జ్ఞాన భక్తులు రెండింటికి అది స్థానము. శ్రీరామచంద్రుని గూర్చి "పుంసాంమోహనరూపాయ" అని చెప్పబడుతున్నదీ కాని, శ్రీకృష్ణుని మోహన తత్త్వము మిక్కిలి విలక్షణమైనది. సృష్టిలోని సౌందర్యాని కంతటికీ శ్రీకృష్ణుడు ప్రతీక. కావ్యం రససౌందర్యమయమైనట్లు శ్రీకృష్ణ తత్వం జ్ఞాన సౌందర్యమయమైనది. సగుణ, నిర్గుణ తత్వాలు రెండూ ఆయనలో భక్తులకు సమన్వయం సాధించినాయి.

కృష్ణ కావ్యాలలో మొదటిదైన శృంగార వీథి ఒక సంకలనం. ఇందులో శృంగారవీథి, శ్రీకృష్ణదేవుని నిర్వేదము స్వభావరీత్యా రెండు కావ్యాలు. ఇవి రెండు విలక్షణమైనవి. శృంగారవీథికి సంబంధించి గీత గోవిందాదుల ప్రభావం, శ్రీకృష్ణదేవుని నిర్వేదమునకు సంబంధించి మాయాతత్వ భూమికత్వం ప్రదర్శించ బడింది. ప్రాతఃస్తవములోనూ, వాత్సల్యభావం దానితోపాటే మిగతా ఖండికలలో వేణువు, యమున, రాధాది విషయములు విశ్లేషించబడినవి. కృష్ణ కావ్యాలు కృష్ణతత్వ ప్రధానమైనవి కృష్ణతత్వమే గొప్ప సౌందర్యనిదానము. ఈ కావ్యాల లోని కృష్ణపరమైన వస్తువులలోనే, దానిని విశ్వసింపచేయటంలోనే వస్తు సౌందర్యం అభివ్యక్తమవుతుంది. ''మధురం రసనర్యాబి వస్తున్యపిరసస్థితి" అని దండి అన్నాడు.

ఇక్కడ రసమన్నది మాధుర్య పర్యాయమైనది. మాధుర్యం రసవత్తు. వాక్కునందు, వస్తువునందు కూడా రసము ఉంటుందని తాత్పర్యము ఈ రెండు అంశాలు విశ్వనాథ కృష్ణ కావ్యాలలో సార్థకమవుతాయి. అంటే, ఇక్కడి రచనా విషయములోను, ఉక్తిలోను, వస్తువులోను మాధుర్యం వ్యాపించి ఉన్నది. మాధుర్యమనగానే కేవలం సుకుమారమైన శబ్దాలు భావాన్ని సుకుమారంగా చెప్పడం లేదా సుకుమారమైన భావాన్ని వ్యక్తం చేయటమనిమాత్రమే కాదు. ప్రధానంగా భావానికి అనుగుణమైన శబ్దరచన ద్వారా మాధుర్యం కలుగుతుంది. మాధుర్యం శైలీభేదాన్ని గూర్చి కూడా మారిపోతుంటుంది. కుంతకుడు సుకుమార మార్గంలోను, విచిత్రమార్గంలోను మాధురీగుణం ఉంటుందంటాడు. ఆస్వాద్యత్వం మాధుర్యానికి మౌలికమైన లక్షణం ఈ స్వాద్యత్వం వస్తుపరంగా రచనాపరంగా కృష్ణ కావ్యాలన్నింట అనుభవానికి వస్తుంది.

శృంగార వీథి మొదలుకొని ప్రద్యుమ్నోదయందాకా వివిధ మార్గాలలో వివిధ రూపాలలో అభివ్యక్తమయ్యే కృష్ణతత్వము వివిధమైన మాధుర్యలక్షణాలతో ఉద్దీప్తమై కనిపిస్తుంది. శృంగారవీథిలో యౌవనోపేతమైన శృంగార మాధుర్యం. శ్రీకృష్ణ నిర్వేదములో శాంతమాధుర్యం; గోపికాభ్రమర గీతలలో విరహభక్తి మాధుర్యం; శ్రీకృష్ణసంగీతములో భక్త్యుపాసనల మాధుర్యవైవిధ్యం; ప్రద్యుమ్నో దయంలో తాత్త్వికమాధుర్యం; కృష్ణ శతకాలలో వేదనామాధుర్యం వ్యాపించి ఉన్నవి. ఈ మాధుర్యానికి అనుగుణమైన, ఉద్దీపకమైన ఊహలు అలంకారాలు, కల్పనలు, ఉక్తివైచిత్రి మొదలైన అనేకాంశాలు సహృదయుల మనస్సులను అనుక్షణం స్పందింపచేస్తుంటాయి.

శ్రీకృష్ణదేవుని నిర్వేదములో యదార్థంగా కథ అని చెప్పుకోదగిన వస్తు వేదీ లేదు. కాని ఆద్యంతము ఒక విధమైన అంతః సంఘర్షణ ఈ కావ్యంలో వ్యాపించి ఉంటుంది. ఆ ఘర్షణ యొక్క ఉపశనమే కావ్యానికి సమాప్తి. ఈ సంఘర్షణ తనకు బాహిరమైన మరొక దానితోకాక తనతో తనకే సంఘర్షణ. అంటే తనలోని ఒక తీవ్ర భావానికి, తన మౌలిక లక్షణానికి సాగిన సంఘర్షణ అభివ్యక్తం కావడానికి ఆలంబనగా ఎందరో కొందరు వ్యక్తులు బాహిరంగా కని పించవచ్చుగాని, వారికి ప్రాధాన్యం లేదు. ఈ కావ్యంలో కథా లక్షణం ఉన్నది అనుకుంటే ఉన్నట్లుగానే అనిపిస్తుంది. లేదనుకుంటే లేనట్లే అనిపిస్తుంది. ఈ వస్తు స్వభావము మీదనే కావ్యమంతా ప్రవర్తిస్తుంది. ఈ విధంగా "ఉన్నదీ, లేదు" అనే రెండు లక్షణాలు కలది కేవలం "మాయ" మాత్రమే. ఈ "మాయ" అనేది అద్వైతానికి ప్రబలమైన భూమిక. ఈ మౌలికమైన విషయాన్ని వస్తువుగా తీసుకుని ఘర్షణను, వేదనను భూమికగా చేసుకొని ఒక కావ్యాన్ని రచించడమనేది సాహిత్యంలో ఒక అపూర్వమైన విషయం. ఏ సాహిత్యంలోనైనా "శ్రీకృష్ణ దేవుని నిర్వేదం' వంటి కావ్యము అది ఒక్కటి మాత్రమే. శాస్త్రీయమైన ''మాయ'' విషయాన్ని కావ్యవస్తువుగా చేసి, శృంగారాదులను భాసింపచేస్తూ సృష్టింపబడిన ఒక అద్భుత కావ్యం 'శ్రీకృష్ణదేవుని నిర్వేదము.''

శృంగారవీధి, శ్రీకృష్ణదేవుని నిర్వేదము తర్వాత శృంగారవీధి సంకలన ములోని కావ్యం "ప్రాతఃస్తవము." ప్రాతఃకాలంలో భగవంతుని స్తోత్రం చేయడం అనగా పొగడటం ఈ కావ్యములోని విషయమని శీర్షికనుబట్టి స్ఫురి స్తుంది. ఈ దృష్టితో దానిని ఒక స్తుతికావ్య మనవచ్చును.

ప్రాతఃస్తవములో ప్రతి పద్యము వాత్సల్య భావ మాధుర్యంతో తొణికిస లాడుతూ ఉంటుంది. అక్కడి పలుకుబడి, వ్యావహారికత ఒక పల్లీయ వాతావర ణాన్ని, ప్రాభాత శోభను, పిల్లల చిలిపి, చేష్టలను ఆవిష్కరిస్తుంటాయి.

ప్రాతఃస్తవములో యశోద మేలుకొలుపే విధానం, మాట్లాడే తీరు, వ్యక్తం చేసే వివిధ భావాలు అచ్చంగా ఒక తెలుగుతల్లి తన కొడుకును మేలుకొలుపు తున్నట్టుగానే ఉంటుంది. తెలుగు దేశీయ వాతావరణం పలుకుబడి సమృద్ధిగా కనిపిస్తుంది. ఈ మేలుకొలుపు తను మాట్లాడడంతోనే శ్రీకృష్ణునికి సంబంధించిన లౌకిక, అలౌకిక విషయాలు విచిత్రంగా ఆ తల్లి వాత్సల్యంలో కలగలసి పోతాయి.

ప్రాతఃస్తవములో కనిపించే మరొక విశిష్ట లక్షణం మొత్తం స్తవము ఏక పాత్రాభినయముగానే సాగటం. అంతా యశోదాదేవి మాట్లాడటం తప్ప, శ్రీకృష్ణునికి మాటలేమీలేవు ఇట్లాంటి సందర్భంలో ఉండవు కూడా. కాని ఆయన చేష్టలన్నీ ఉద్దీపన విభావాలు.

''అంతెకావలె నిద్రమేల్కొనవు నీవన్నాయి తావచ్చి యా
యింతా మీగడపాలు వెన్నతిని యిట్టే చెప్పకుండన్ జనెన్
సంతోషించి గండ్లు చల్లపడెగన్నా! దేవరాయందు నే
నెంతేనిం బతిమాలుచుండినను నీవింతేని విన్నావురా!"

ఈ పద్యంలో వ్యావహారికత - చిన్నారి కొడుకును మేల్కొల్పడానికి ప్రయత్నించే తల్లి మాట్లాడే సహజమైన తీరు కనిపిస్తుంది.

భ్రమర గీతాలు, గోపికా గీతాలలోని భావవ్యక్తీకరణ తెలుగునుడికారాన్ని ఆశ్రయించి కావ్య సౌందర్యాన్ని మెరిపిస్తూ ఉంటాయి.

శ్రీకృష్ణ సంగీతము ఒక విచిత్రమైన రచన. ఇది 108 ఖండికల ఏకీభావం పొందిన కావ్యమిది. వివిధ గోపికలు, ఇతర వ్యక్తులు శ్రీకృష్ణ విషయంగా చేసిన భావన, పొందిన అనుభవాలవైవిధ్యం 108 ఖండికలుగా ఇందులో ప్రదర్శింపబడినవి. కావ్యంలోని వివిధ వ్యక్తులు కనిపిస్తున్నా, కూడా వారందరు కవి ప్రతిభలో నుంచి, భావన నుంచి రూపు దిద్దుకున్నవారే. మరొక విధముగా చెప్పితే శ్రీకృష్ణతత్త్వాన్ని కవి భావించటంలోని అనంతమైన వైవిధ్యం దర్శించటం ప్రధానంగా ఇందులో రూపుదిద్దుకున్నది. ఇందులో పల్లెటూళ్ళలో ముగ్ధలైన స్త్రీలు మాట్లాడుకునే తీరు తెన్నులు, ఆక్షేపాలు, అధిక్షేపాలు, వెక్కిరింపులు, మెప్పుదలలు మొదలైన తీరులెన్నో ఇందులో కనిపిస్తాయి. వెతికితే దొరికే చిన్న చిన్న సంస్కృత సమాసాలు తప్ప కావ్యం మొత్తం తెలుగు పలుకుబడి ''నుడికారం'' కుప్పలు పోసినట్లుగా కనిపిస్తుంది.

ఈ పద్యాలలో కాకువు విరివిగా ప్రయుక్తమైనది. ''ఎఱ్ఱ కిరణాలవలె, కాంద ఎక్కునాలు!'' వంటి మనోహరమైన ఉపమలకు శ్రీకృష్ణ సంగీతము ఒక

గని వంటిది. "భద్రకాళి కన్నులరాక పయిట కప్పి! కొన్ని మొగమట్లములు సంధ్య గోద పొద్దు! వాలపీపుల జెందిర మలుకుచుండ! కానబడిపోవు సెలయేరు నాకెసంగునట!" వంటి వెన్నైనా ఉదాహరించుకోవచ్చు. సంభాషణగా ఉంటుంది కాబట్టి సామెతలు అధికంగా భావోద్దీపకంగా, విరివిగా కృష్ణ సంగీతములో మనకు లభిస్తాయి. శ్రీకృష్ణ సంగీతములో సంభాషణ, ఆలోచన మొదలైన అంశాలకే ప్రాధాన్యమున్నది. అందువల్ల సత్యనారాయణగారు ఈ కావ్యాన్ని పద్య వచనముగా రచించినారు.

శ్రీకృష్ణ సంగీతములో కనిపించే వ్యక్తులు గోపికలు, వారి భర్తలు, కొందరు అసురులు. ఇక్కడ సామూహికంగా వీరందరు భాగవతంలోని వ్యక్తులే కావచ్చు. కాని ఏ ఒక్కరికి కూడా ప్రత్యేకమైన పేరు లేదు. ఈ పేరు లేకపోవడం వ్యక్తుల స్వభావానికి మాత్రమే ప్రాధాన్యం కలుగుతున్నది తప్ప ప్రత్యేక వ్యక్తికి ప్రాధాన్యము లేకుండా పోతున్నది. ఇందులో గోపికలు మాత్రమే ఉన్నారు. కవి వ్యక్తీకరించే భావాలకు వారు ఆలంబన విభావాలు. ఆ భావం ఫలానా గోపికకే చెందినదని చెప్పడానికి వీలులేదు. ఏ గోపిక అయినా కావచ్చు, ఏ గోపకుడు అయినా కావచ్చు. ఈ ఆలంబన విభావాల ద్వారా మక్తమయ్యే భావాలు, అనుభవాలు, ఆలోచనలు మొదలైనవన్నీ కృష్ణవిషయంగా గోపికా పరంగా వ్యక్తమవుతున్నాయేతప్ప వాటికి కచ్చితంగా దేశకాలవ్యక్తి పరిమితులు ఉండవు. అందువల్ల శ్రీకృష్ణ సంగీతంలో చిత్రించబడిన అంశాలు లౌకికమైన పరిమితులను ఉదయించి, పరమేశ్వరతత్త్వములో లీనమవుతాయి. ఈ కృష్ణ సంగీతములో ప్రసక్తమయ్యే గోపికలు వివిధ జీవుల భావరూపాలు, అనుభవ రూపాలు.

శ్రీకృష్ణ సంగీతంలో కృష్ణభక్తి కేంద్ర బిందువు. ఆద్యంతము అనేక విధాలుగా అనేక మార్గాలలో ఇది చిత్రింపబడినది. ఆద్యంతమూ సాగే కథా వస్తువూ ఇందులో లేదు. ఇందు కృష్ణ గీతభావన కలిగిన గోపికలు తమ అనుభూతులను భిన్నగాథల రూపమున తమ చెలులకు చెప్పుటయు, తాము స్వగతముగ భావించుటయు జరుగును. ఒక్కొక్కగాథ స్వామి ప్రణయాంశమును గాని, తాత్వికాంశమును గాని నిరూపించును. వాని సమాహార స్వరూపము గోపికా హృదయాంతర్గతమైన స్వామి తత్త్వము అది వారి హృదయములందు

చిరంతనముగ మున్ముందుంచుచున్న సంగీతస్వరూపము. నిరంతర చైతన్య స్వరూపము. అది భగవత్ విశ్వరూపంను దర్శింపచేస్తుంది. కృష్ణతత్వాన్ని భూమికగా చేసి, పరమేశ్వరప్రాప్తి మార్గములో జీవులకు సంబంధించి అనేక తాత్త్విక, ఉపాసనాపరమైన అంశాలను చిన్నచిన్న కథలుగా చిత్రించటం ద్వారా పారమార్థిక ప్రపంచాన్ని ప్రస్తుతీకరించినట్లుగా ఈ కావ్యం రూపొందింది. ప్రతి ఖండికలోను విషయం శ్రీకృష్ణుని అనుగ్రహ లక్షణాన్ని ఏదో ఒక విధముగా స్ఫురింపచేస్తూనే ఉంటుంది శ్రీకృష్ణ సంగీతములోని సంగీతము భగవదనుగ్రహానికి సంకేతము.

కృష్ణ కావ్యాలలో విలక్షణమైనది. పరమేశ్వర అవతార విధానంలో వ్యూహపద్ధతి భూమికగా రచింపబడిన తాత్త్విక కావ్యం ప్రద్యుమ్నోదయం. రామకృష్ణాదులైన విభవావతారాల కావ్యాలు సాహిత్యంలో విరివిగా లభిస్తాయి కాని, వ్యూహాన్ని భూమికగా చేసుకొన్న కావ్యం సాహిత్యంలో ఇదొక్కటే. అందుకే వ్యూహ ప్రాధాన్యంతో ప్రద్యుమ్నోదయం రచింపబడినది. రుక్మిణీ కళ్యాణగాథ పూర్వార్ధంగా, ప్రద్యుమ్నోదయ విషయం ఉత్తరార్ధంగా ఈ రెండింటి సమన్వయానికి వ్యూహనిర్మాణం ఏకసూత్రంగా ఈ కావ్యం రూపొందిదింది. తపస్సు, యోగము, కాలము, వివిధ వ్యూహాలు మొదలైనవాటిని వ్యాఖ్యానిస్తూ కథను కేవలం పైపొరగా సంధానిస్తూ రచింపబడిన సృష్టి రహస్యతత్త్వ ప్రతిపాదికమైన కావ్యము ప్రద్యుమ్నోదయము. దీనిలో లౌకిక, అలౌకిక వాస్తవికతలను అనుసంధింపచేసి కావ్య పౌరాణిక లక్షణాలను గుంఫించడంవల్ల ఇది వస్తుమయ కావ్యముగా రూపొందింది. ఇంత వ్యాఖ్యాన లక్షణమున్నా కూడా రచనావిధానంలోని కథనంలోని వైచిత్రి ద్వారా దాని కావ్యత్వము అనుభవంలోనికి వస్తూనే ఉంటుంది.

భగవంతుడికి, అర్తుడైన భక్తునికి మధ్య ఏ తెరలూ, పొరలూ లేదుండ వేదన ప్రసారం శతకాలలో సాగుతుంది. మున్నంగిలోని వేణుగోపాలస్వామిని, సత్యనారాయణగారి స్వగ్రామమైన నందమూరిలోని సంతాన వేణుగోపాలస్వామిని సంబోధించిన ఈ రెండు శతకాలు స్వభావములో ఒకేవిధమైనవి. ఈ రెండింటిలో వేదనాప్రసారం ఆర్తి లక్షణం ఇందులో ప్రదర్శింపబడింది

వేణువును గూర్చిన ప్రస్తావన ఈ రెండు శతకాలలోను అనేక సందర్భాలలో వస్తుంది.

"సృష్టిలోపలగల సర్వమాధుర్యరేఖ సంగీత
యష్టిగాఁగ హిరణ్యగర్భు నాకారమైన వేణువును
ముష్టిఁగైకొని వచ్చినావు స్వామి! నా ముంగిలిలో ప్రవి
విష్టుడై నందమూర్తి లయ! సంతాన వేణుగోపాల!"

అంతేకాదు—

"చందనాచలగంధవాహచాలక సంస్పర్శ సుఖము
పొందుచున్నది గుండె వేణుమృదురవమ్మును సంస్మరించి
నందనందన, యెప్డు విన్నదద్ది? మానసమాత్మ గడప
విందైన యపుడు విన్నదియె? మున్నంగి వేణుగోపాల!"

ఇక్కడ కృష్ణునితో సాయుజ్య లక్షణం వ్యక్తమవుతూ వేణురావాన్ని మరొక విధంగా కూడా ఆయన చిత్రించారు.

శ్రీకృష్ణభావనలో సత్యనారాయణగారు "ముక్తి త్రోవ"లందు - గోకులాంగనా శ్రీ రమణీయ మధ్యమును దర్శించారు. విశ్వనాథకు ఆత్మదర్శనోపలబ్ధికోసం కొనసాగిన "జీవుని వేదన" నిరంతరధారగా, తన ప్రపంచానికి ఆధారభూమికగా కొనసాగింది. అందువల్ల చరాచర జగత్తులో కలిగే వేదనా స్పందం సర్వమూ ఆయన సాహిత్య వస్తువైంది. అది ఒక ప్రాంతానికీ, దేశానికీ, మానవ సమష్టికీ పరిమితమైన అంశం కాదు. అది విశ్వలయను తనతోపాటు అనుసంధించుకునే అద్భుత వాగర్థ గోష్ఠి.

విశ్వనాథ వారి రామతత్వం ఎంత రమణీయమైనదో కృష్ణతత్వం అంత కమనీయమైనది. నారాయణ చైతన్యంలో జ్వలించే నరచైతన్యం విశ్వనాథవారి రాముడు; నరచైతన్యంలో ద్రవించే నారాయణ చైతన్యం శ్రీకృష్ణుడు. ఆ ఉభయానుభూతుల అభివ్యక్తులను ఆ మహాకవి ఆవిష్కరించిన కవితా ప్రక్రియలు సాహిత్యంలో శక్తిమంతమైన ప్రయోగాలుగా మనముందు నిలిచాయి.

శ్రీకృష్ణం, వన్దే జగద్గురుమ్. *

# విశ్వనాథవారి తెలుగు నాటకాలు

—డా॥ ఆర్. కమల

కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు కవిగా, నవలాకర్తగా, నాటక కర్తగా, విమర్శకునిగా, వక్తగా ఒక సాహిత్య శక్తిగా తన సాహిత్య వ్యక్తిత్వ ముద్రను తెలుగు సాహిత్య రంగంపై నిలిపారు. వీరు రచించిన నాటకాల్లో విమర్శకులచే విశేష మన్ననలొందిన నాటకాలు నాలుగు. ఆ నాలుగు నాటకాలు విషాదాంతాలే. అవి నర్తనశాల; అనార్కలీ; వేనరాజు; త్రిశూలము. వీటిలో నర్తనశాల, వేనరాజు పౌరాణికాలు; అనార్కలీ, త్రిశూలము చారిత్రకాలు.

విశ్వనాథవారు ప్రాచ్య పాశ్చాత్య రూపక మర్యాదలను సమన్వయాత్మకంగా వండించుకున్న నాటకాలను రచించి విశిష్ట ప్రయోక్తగా ప్రసిద్ధి చెందారు. వీరు రచించిన ఈ నాలుగు నాటకాలు భారతీయ దృష్టితో, పాశ్చాత్య దృష్టితో సమన్వయించుటకు వీలున్నది. వస్తుతః పాశ్చాత్య నాటకాలన్నీ విషాదాంతాలే. ఐతే ఇవి అనేక రకాలున్నా షేక్స్పియర్ నాటకాల్లో వీటికొక స్థిరమైన ఆకార మేర్పడింది. షేక్స్పియర్ నాటక రచనలో రెండు విషయాల్లో నెక్కువ శ్రద్ధ వహించారు. 1. వస్తువు, 2. పాత్ర పోషణ. వీటిలో విశ్వనాథ వారెంతవరకు కృతకృత్యులయ్యారో చూద్దాం.

నర్తనశాల : 1924లో విశ్వనాథవారి ముప్పదవయేట నిండు యౌవనమున కవి నిర్భరమైన కళాశిల్పాన్ని పుక్కిట ప్రదర్శించిన అపూర్వ కళాఖండం. నర్తనశాలలోని వస్తువు మహాభారతంలోని కీచకవధ వృత్తాంతం. వ్యాస మహాభారతంలోని కీచకుడు దుష్టపాత్ర. తిక్కనగారి కీచకుడు శృంగారాన్ని ప్రకటించి సహృదయుల సహానుభూతిని పొందాడు. విశ్వనాథవారి కీచకుడు విషాదాన్ని ప్రకటించి ప్రేక్షకుల సానుభూతిని పొందాడు. విషాదాంత నాటకాల్లో నాయకుడే ప్రధానపాత్ర. ప్రథమ వీక్షణంలోనే సైరంధ్రితో తనను గూర్చి పరిచయం చేసుకుంటాడు కీచకుడు—

"మద్భుజార్జిత ధారుణీ మండలంబు
నేలుచున్నాడు విరాట ధాత్రీశ్వరుండు
శత్రు నృపతులు మత్స్యదేశములపైని
దృష్టి పరుపరు నాకంటి యెఱుపు జూచి"....... అంటూ నేను సుదేష్ణ తమ్ముణ్ణి, సింహబలుణ్ణి అంటాడు.

ద్రౌపది:- మౌనం.

సుదేష్ణ వద్దకు వెళ్ళి కీచకుడు సైరంధ్రిని గూర్చి కుతూహలంగా అడుగుతూ—

కీ:- "ఆ మనోహర దివ్య రూపాతిశయము
మానవాంగనలందు సామాన్య మగునె
ఎచట దొరకించుకొంటివో యీవు సేవ
కప్సరః కంఠయోగ్యమౌ నాభరణము."

సుదేష్ణ దాటవేసి కుశల ప్రశ్నలు వేయును. కీచకుడు మరల సైరంధ్రి గల ప్రదేశమునకు వెళ్ళి "ముత్యాలు జారి పడునటే సకియా!" "నీదు గాఢ పరిష్వంగ నియతి కలుగు నిముసమేనియు బ్రతికితినేని జాలు. లేకున్న బ్రతుకు వ్యర్థమ"ని వగచెను

ఏ విధంగానైనా సైరంధ్రిని తన కైవసము చేయుమని అక్కతో ప్రాధేయపడెను.

విశ్వనాథ సుదేష్ణ పాత్రను పులుకడిగిన ముత్యంలా తీర్చిదిద్దినారు. ఆమె కీచకునితో "నా గొంతులో ప్రాణముండగా నీకా స్త్రీ లభింపదు. నీ అంత బాహుబలశాలులు కాకపోయినా నా భర్త, కుమారుడు తేజోదరిద్రులు కారు. మమ్మల్ని చంపి ఆమెను హరించుకు పొ"మ్మనెను. భారతంలో సుదేష్ణ కలలో కూడ అనలేదు. ఈ నాటకంలో ఉత్తర చైతన్యమూర్తి - కీచక ప్రవృత్తికి అడ్డుకట్ట. కీచకునిలోని అంతస్సంఘర్షణకు హేతువు. కీచకుడు (తనలో) "కామమెంత గర్హ్యమైంది! పసిపిల్ల, ముక్కుపచ్చలారనిది. నేనెంత హీనుడనైతిని ఆమె ముందు. "నేను రాజు కూతురునన్నది" రాజశబ్దం నన్నెంత భయపెట్టినది! ఆ పసిపిల్లలో అంత న్యాయమున్నదా? నేనెంత నీచుడనైతిని! నావంటివాడు ఒక కామినిని తరుముకొని పోయిన ప్రతిష్ఠఏమి?" అని వితర్కించుకొనెను.

Tragic drama కు కావలసిన Tragic Atmosphere ను విశ్వనాథ వారు చక్కగా పోషించినారు. నర్తనశాలకు బయలుదేరు కీచకుడు గండాలను తలచుకొనుచు ప్రణయమా? ప్రళయమా? అని ప్రశ్నించుకొనెను

విశ్వనాథవారు కల్పించిన మేఘాలు విషాద మేఘాలని ఆయనే సూచించారు. విషాదాంత నాటకాల్లో వాతావరణం భావపోషకం. వర్షర్తువును పాత్రల చుట్టూ, పాత్రల భావాల్లో, మనోగతుల్లో, సన్నివేశాల్లో చిత్రించటమేకాక కాల సూచనకూ, కథార్థ సూచనకూ వ్యంజనశక్తిగా వాడారు ఉదాహరణకు—

వలలుడు : ఇంత వానలో నీవెట్లు వచ్చివితివి?

సైరంధ్రి : పైటకొంగు నెత్తిమీద వైచుకొని.

వ : (కొంగు స్పృశించి) తడిముద్దయైనది.

సై : తడిసినదా?

వ : అవును.

సై : దేనితో?

వ : వర్షపు నీటితో

సై : వర్షపు నీరని యెట్లు తెలియును?

వ : మరి దేనితో.

సై : దుష్టుడగు కీచకుని నెత్తురుతో.

వ : వాడు చచ్చినాడు. (తెరపడును)

విశ్వనాథవారు పాత్రలనెంత చక్కగా దిద్దితీర్చినారో, సంభాషణలంత రసవత్తరంగా రూపొందించారు.

భావికథార్థ సూచన:

ద్రౌపది : నల్లని బట్టలు కట్టుకొని రావలయును.

కీచకుడు : ఎందుకు?

ద్రౌపది : చీకటిలో కలిసిపోవుటకు.

సురుచిర సంభాషణలకు :

వలలుడు : పాంచాలీ!

ద్రౌ : (ప్రవేశించి) చచ్చినాడా?

వల : ఇంకను లేదు.

ద్రౌ : ఇందాక నుండి యేమి చేసితిరి?
వ : చమత్కారము.
ద్రౌ : అవును. మీకు చమత్కారమే.
వ : దేవీ! కోపగించకుము.
ద్రౌ : వాడభినవ దుశ్శాసనుడు.
వ : కాని మిక్కిలి రసికుడు.
ద్రౌ : మీరు కొత్తగా స్త్రీ లెప్పుడయితిరి?
వ : మా తమ్ముడు అజ్ఞాతవాసమునకు మొదట. నేను చివర.

ఏ విధంగా చూచినా 'నర్తనశాల' ఉత్తమ విషాదాంత నాటకంగా భాసిస్తుంది. నాటకం చదువుచున్నంత వరకు పాశ్చాత్య విషాద రూపకంవలె పఠితల మనసు నాకర్షించి కెథార్సిస్‌ను అనుభవింప చేస్తుంది. కీచకుని పాత్ర రక్తినుండి ముక్తివరకు క్రమ పరిణామ వికాసాన్ని, సుదేష్ణ, ఉత్తర, పాండవ పాత్రల్లో కన్పించే ధార్మిక చైతన్యాన్ని పాఠకుడు చదివి; ప్రేక్షకుడు చూచి ఆనందిస్తాడు. పాశ్చాత్య శిల్పం; భారతీయ భూమిక నాశ్రయించి వెలసిన అపూర్వ కళాఖండం నర్తనశాల నాటకం.

విశ్వనాథవారి నాటకాల వరుసలో ద్వితీయం, వానిలో అద్వితీయం అనార్కలీ నాటకం 'ఇది నూత్న మార్గ విరచితమ'ని ఆరంభముననే సూత్రధారునిచే చెప్పించినారు విశ్వనాథ. అందుకు కారణము 1. నాయకుడు కీచకుని వంటివాడు కాకపోయినా నాటకం విషాదాంతమగుట, 2. అంకాలందు రంగాలను కల్పించుట; చిలుకలు, పుష్పకన్యలను సజీవంగా చిత్రించుట - నాయకుని అంతర్వ్యక్తిగా కవిని సృష్టించుట, 3. లిరిక్కులను పొందుపరుచుట.

ఇందలి నాయకుడు అక్బర్ చక్రవర్తి కుమారుడు సలీం బానిస కూతురైన అనార్కలీని ప్రేమించుట. ఇది చరిత్ర ప్రసిద్ధమైన వస్తువే. అపురూప సౌందర్యవతి, ప్రేమమయమూర్తి అనార్కలీ. అయినను మహారాజ్ఞి కాగల అర్హత ఆమెకు లేదు. కనుక సలీం ప్రేమ అస్థానపతితమైనది. విశ్వనాథవారు నాందియందే ప్రణయోపాసకులకు అనార్కలీ, సలీంలను అర్ధనారీశ్వరులుగా సంభావించారు. శశిధరుడైన శంకరునితో నెలవంక చిహ్నముగాగల మహ్మదీయ మతస్థుడగు సలీంను, పార్వతీదేవితో అపురూప లావణ్యవతియైన అనార్కలీని పోల్చి వర్ణించుట యిందలి విశేషం.

విశ్వనాథవారి రెండవ నాటకం యిది- షేక్సిపియర్ రచించిన రెండవ నాటకం రోమియో జూలియట్‌ను స్ఫురింపజేస్తుంది. సలీం రాజకుమారుడైనా 'అనార్కలీ' పేరు పెట్టుటలోనే నాటకకర్త ఆమె ప్రాధాన్యాన్ని సూచించారు. ప్రపంచ సాహిత్యంలోని ప్రణయ నాయికలలో పేర్కొనదగినది అనార్కలీ. ప్రణయాన్ని ఆరాధించు ఆమెలోని మానవీయ లక్షణమే నాటకానికి జీవలక్షణం. భావి భారత చక్రవర్తికి అర్ధాంగినగుదునను నా ఊహ సరియైనదేనా? అని ప్రశ్నించుకున్న వివేకవంతురాలు. తనవలన యువరాజునకీ విధమైన అపకీర్తి రాకూడదని తలపోసినది. తన భావి కథను గానం చేసింది. త్యాగశీలతయందు నాయకునికంటె ఒక మెట్టుపైన ఉన్నది నాయిక. తానే అతనిని కోరినట్లు బయటపడ్డది. మరణ శిక్షను మధురంగా అనుభవించింది.

**వేనరాజు :** ఇది పది యంకాల వింత నాటకం. భాగవతమునందలి చిన్న గాథను ఆధారంగా చేసుకొని విశ్వనాథవారు వేనరాజు నాటకం సృష్టించారు. వేనుడు పురాణ పురుషుడు. అంగరాజు కుమారుడు. తండ్రిని తరిమివేసి రాజ్యాన్ని స్వీకరించాడు ఇతడు చిత్రమైన వ్యక్తి. ఇతని వన్నియు స్వతంత్రాలోచనలే. ప్రత్యక్షంగా చూడని దానిని నమ్మడు. కన్నులకు కనబడడు కావున దేవుడే లేడని అతని భావన భగవంతునిపై, ఆర్యధర్మంపై కత్తిగట్టి విలక్షణమైన నూత్న శకాన్ని ప్రారంభించదల్చుకున్నాడు. నాటకారంభముననే స్నేహితుడగు గౌతమునితో తానేగాక, తన రాజ్యంలో నెవరు వివాహమాడరాదని, ఈ కృత్రిమ సంయోగంవలన జగత్తు నశిస్తుందంటాడు.

"ప్రాచ్య పాశ్చాత్య సిద్ధాంతాల కూడలిభూమి, సమన్వయ క్షేత్రం విశ్వనాథవారి శిల్ప ప్రస్థానం" అన్న ఆచార్య జి వి సుబ్రహ్మణ్యంగారి మాటలు అక్షర సత్యాలు షేక్సిపియర్ Dramaల్లో Ghosts ప్రసక్తి విరివిరిగా కన్పిస్తుంది. వేనరాజు తనకు కైవారం చేయవచ్చినవారిని చంపించుట, పిశాచాలుగా తన ముందర కన్పించుట - సంభాషించుట - నిజంగా లోకంలో పిశాచాలున్నాయా? అని ప్రశ్నించుకొనుట మొదలైన విషాదాంత నాటకానికి కావల్సిన విషాద వాతావరణాన్ని విశ్వనాథవారు విలక్షణంగా కల్పించారు.

వేనుడు మహాపురుషుడే- స్నేహశీలి, వీణావాద్య నిపుణుడు. కాని, అతనిలోని లోపం (Tragic flaw) ధర్మ వ్యతిరేకత. లోకానికి ఎదురీత. దాంతోనే

పతనమైనాడు నాటకాంతాన వేనుని పశ్చాత్తాపమే నాటకానికి విషాదచ్ఛాయలు వ్యాపింపజేసింది

ఇక చివరిది త్రిశూలం బందరు కళాశాలలో శ్రీ ప్రమోదకుమార ఛటర్జీ విశ్వనాథవారి సహాధ్యాపకుడు. చిత్రకళానిధి ఛటర్జీ వేసిన త్రిశూలం చిత్రం నాటక నామానికి ప్రేరణైంది ఈ నాటకాన్ని విశ్వదాత బిరుదాంకితులు - దేశోద్ధారకుడు కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారికి అంకితమిచ్చారు విశ్వనాథ వారు. మనిషికి తిలకం వలె నాటకానికి నామం చక్కగా కుదురుస్తాడు నాటక కర్త. 'త్రిశూలం' అట్టిదే. త్రిజిహ్వలుగా; మూడు ములుకులుగా మూడు పాత్రలు కన్పిస్తాయి రాజైన బిజ్జలుడు; మహామంత్రి బసవేశ్వరుడు; జగదేవుడనెడి దండనాయకుడు.

ప్రథమాంకారంభముననే బిజ్జలుడు విషాదాన్ని మోసుకొని రంగంపై ప్రవేశిస్తాడు.

> "కపురంపున్ దళుకుల్ వెలార్చు గిరివెన్కన్ దీప్తి మన్మూర్తియై
> విపులాకాశము నావరించుచు దిశావిర్భూతరోచిశ్ఛటా
> కృపమై సత్వరజస్తమో వివరణ క్రీడా ప్రచండంబు త్రై
> లప దేవుండెటు చూచె నేనును త్రిశూలం బట్టులే చూచితిన్."

త్రిశూల దర్శనమైనపుడెల్ల కీడు వాటిల్లునని బిజ్జలుని నమ్మకం. ఈ నాటకానికి బిజ్జలుడు నాయకుడు కర్త, కార్యనేత, ఫలభోక్త నాయకుడే. విషాదాంత నాయకునియందు సహజంగా భాసించెడి లక్షణం భావసంఘర్షణ. ఇతనిలోని లోపం (Tragic flaw) లోభం. బిజ్జలుడు విషాదాంత నాయకుడగుటకు దారి తీసిన కారణాలు మూడు. 1 రాజ్యకాంక్ష; 2. అవిశ్వాసం 3. పరాశ్రయం. నాటకారంభం నుండి నాటకాంతం వరకు బిజ్జలునకు మూడుసార్లు త్రిశూల దర్శనమయ్యెను. మొదట తాను, త్రైలపదేవుడు చూచిరి. త్రైలపదేవుని సంహరించి తాను రాజయ్యెను. రెండవసారి హనుమకొండ పైకి యుద్ధమునకు సైన్యమును పంపెను. సైన్యము నశించి ఓడిపోయివచ్చెను. ఎనిమిదవ అంకమున బిజ్జలునికి, జగదేవునికి త్రిశూల దర్శనమయ్యెను. ఈసారి నేనో, జగదేవుడో అని గండములను తన వాక్యముల ద్వారా వెల్లడించెను. తన విషాదమును తానే ధ్వనింపజేయుచు ముమ్మూర్తుల విషాద నాయకుడయ్యెను.

విశ్వనాథవారి నాలుగు విషాదనాటకాల్లోని విషాద లక్షణాలు : విశ్వనాథ వారు నాటకములందు గేయరీతికి (Lyrical element) ప్రాధ్యానం కల్పిస్తూ అందులకొక పాత్రను ప్రత్యేకించుచుందురు. నర్తనశాలలో - ఉత్తర; వేనరాజులో - అంగరాజు; త్రిశూలంలో - నీల ఇలాంటివే.

ప్రతియోగ పాత్రలు : విషాదాంత నాటకమున నాయకుని సర్వకార్యాలను ప్రతిఘటించుటకు, సంఘర్షణేర్పడుటకు ప్రతిఘటన ముఖ్యమైనది. విశ్వనాథవారి నాటకములలో నాయకుని మిత్రునివలె అతనిలో పరిణామము తెచ్చుటకు ప్రయత్నించునవి ఈ ప్రతియోగశక్తులు. మిత్రునిలోని గుణములనే కాక, దోషాలనెరిగించినవాడే ఉత్తమ స్నేహితుడు.

నర్తనశాలలో శారద్వతుడు; అనార్కలీ నాటకంలో సలీం మిత్రుడు; వేనరాజులో గౌతముడు ఈ కోవకు చెందినవారే.

అదృశ్య పాత్రలు : నాటక రంగంపై ప్రవేశం లేకనే తమ ప్రయోజనాన్నెరిగించు పాత్రల నదృశ్య పాత్రలనవచ్చును.

నర్తనశాల నాటకం విరాట్రాజు కొలువులో జరిగిన వృత్తాంతం భారతమున నీ పర్వమే విరాట పర్వం. నాటకమున రాజెక్కడను దర్శనమీయడు. కాని, అతని ప్రతిభను నాటక కర్త సుదేష్ణచేత చెప్పించెను.

సుదేష్ణ : '....ఆమె మత్స్యదేశాధీశుని యంతఃపుర పరిచారిక. ఆమెమీద నీగ్రవాలినచో విరాటనృపతికి తలచరాని తలవంపు ... నీయంత బాహుబలశాలులు కాకపోవచ్చును గాని, నా భర్తయు, పుత్రుడు నంత తేజోదరిద్రులు కారు....'అని స్వీయాభిమానాన్నెరిగించింది. అంతేకాక, ఉత్తర కీచకునితో 'రాజకూతురు'నన్నది ఆ మాటలతనిలో సంచలనాన్ని రేకెత్తించాయి.

అనార్కలీ నాటకంలో అక్బరు పాదుషా పాత్ర కన్పించదు. కాని, అతని రాజ్యాంగ వ్యవస్థ, కట్టుబాట్లు, శీఘ్రనిర్ణయాల గురించి నాటకాన ప్రాధాన్యమధికం. 'బానిసలు పెండ్లి చేసుకోవలెనన్న చక్రవర్తి యనుమతి పొందవలె'నని రుసీ పాత్ర తెలుపును. అనార్కలీ సలీంల రహస్య వివాహాన్ని గూర్చి అజీజ్‌తో, చక్రవర్తికి తెలిసిన రుసీ; 'మొదట నీకు నాకు ప్రాణదండన తప్పదు. అనార్కలీకి కూడ తప్పదేమో! సలీం రాజ్యభ్రష్టుడగునేమో!' అనుట చక్రవర్తి నిర్ణయం తమ జీవితాలపై నెంతటి ప్రభావాన్ని చూపునో తెలియజేసెను. అనార్కలీ నృత్యాన్ని చూడవచ్చిన సలీంతో సేవకుడు 'అక్బరు పాదూషా గవాక్షం గుండా చూచెదరట. నృత్యం ప్రారంభింపు'మని రాజాజ్ఞను తెలియజేసెను.

వేనరాజు నాటకంలో సునీథపాత్ర కన్పించదు కాని అమెను పూజించుట కంగరాజు పూలు కోయుచున్నాడని సూచింపబడెను.

సామాన్య గుణాలు : నాటకాంతంలో విశ్వనాథవారి ఈ నాలుగు నాటకములందు ప్రధాన పాత్రలు మరణించుట సామాన్యగుణంగా భాసిస్తున్నది.

విభిన్న గుణాలు : విశ్వనాథ సత్యనారాయణగారు రచించిన నాలుగు విషాదాంత నాటకములందలి భేదించు గుణాలు పరిశీలించదగినవి. పాశ్చాత్యులు విషాద తత్త్వాన్ని నాలుగు విధాలుగా వర్గీకరించారు. ఆ నాలుగు రకాలు విశ్వనాథవారి నాలుగు విషాదాంత నాటకాలందు పొందుపరచుటకు వీలున్నది. నాయకుడు విషాదాంత నాటకాల్లో ఏయే విధంగా పతనమగునో తెలియుచున్నది.

1. 'వధాధికమైన బాహిరాచరణము'—కీచకుడు నాటకాంతాన భీముని చేత నశింపబడుటలో నీ యంశము కలదు—నర్తనశాల.

2. 'ఒక విధమైన పరిస్థితిచే నావరింపబడి విధికెదురీదలేని వింత యవస్థ' - సలీం బానిసయైన అనార్కలీని ప్రేమించి రాజధిక్కారం చేయలేక పోవుట, అనార్కలీకి మరణశిక్ష వేయునపుడు కూడ మోసంచే కావలి వాడిచ్చిన మద్యం సేవించి స్పృహతప్పి పడియుండుటలో నీ యంగము దాగియున్నది - అనార్కలీ.

3 'అతిలోక శక్తుల ప్రభావము విరివిగా నుండుటయేకాక, అవి నాయకుని జీవితంతో సన్నిహిత సంబంధం కల్గియుండుట' - వేనరాజు నాటకంలో పిశాచాల ప్రసంగం, అవి అతనితో సంభాషించుట, సన్నిహితంగానుండి చర్చించుటలో నీ యంశముకలదు—వేనరాజు.

4. 'బుద్ధిభావ జనితమైన అంతర సంఘర్షణ' - త్రిశూలదర్శనమైనప్పుడెల్ల బిజ్జలునిలో కలుగు వింత సంఘర్షణ—త్రిశూలం.

విశ్వనాథ వారిచే రచింపబడిన ఈ నాలుగు నాటకాల్లోని నాయకులు నాటకాంతాన నశించుట నాలుగు విధాలుగా రూపొందించబడింది. కామంతో - కీచకుడు; మోహంతో - సలీం; క్రోధంతో - వేనరాజు; లోభంతో - బిజ్జలుడు వరుసగా నశించిరి.

అదేవిధంగా వీనియందు రసములును వివిధ గతుల పోషించబడినవి. నర్తనశాలయందు వీరము; అనార్కలీయందు శృంగారం; వేనరాజునందు రౌద్ర రసం; త్రిశూలంనం దద్భుత రసం.

విశ్వనాథవారి నాలుగు విషాద నాటకాలు సామాన్య లక్షణాలతో, విభిన్న లక్షణాలతో నాలుగు నాలుగుపాయలుగా సాగిన జీవవాహినులు.

*

# విశ్వనాథవారి సంస్కృత నాటకాలు

## —డా॥ కె. కోదండరామాచార్యులు

"ఆకాశాత్ ధరణీ వినిఃసృతి మహో రుంధంత ముగ్రాసురం
ద్రాక్బింబ ప్రతిబింబభావవిహృతేః శత్రుం ధరాకాశయోః
షాణ్ముఖ్యం మహ ఆజమాన దనుజం క్రూరం మహ స్తత్సృజన్
నాట్యైక ప్రభురంధకారి రవతా ద్వస్తత్కలాబిందుకాన్"
(గుప్తపాశుపతము, నాందీశ్లోకము)

"ఆకాశమునుండి ధరణికి ప్రసరించు దివ్యతేజస్సునకు భూమ్యాకాశముల బింబ ప్రతిబింబ వ్యాప్తికి అవరోధమును కల్గించిన వాడు అంధకాసురుడు. వానిని సంహరించినవాడు శంకరుడు. అంతేకాక దివ్యమైన తేజస్సును సృష్టించుచున్న వాడు. అటువంటి శంకరుడు నాట్యకళను, నాటకములను నటులను, సరస హృదయ ప్రేక్షకులను రక్షించుగాక!" ఇది శ్లోకభావము. కాని ఇందు ధ్వనించెడి విశేషాంశములెన్నో.

ధరణికి దివ్యమైన తేజస్సు ఆకాశమునుండియే ప్రసరించును. అందుకు కారణము అవి రెండు బింబ ప్రతిబింబ భావమును ఆదాన ప్రదానములను కలిగి యుండుట. పరస్పరము ఇచ్చిపుచ్చుకొనుచు స్నేహముగానున్న ఇద్దరిని చూచి ఓర్వకుండుట, వారిస్నేహమునకు ఆటంకమును కల్గించుట దుష్టుల లక్షణము. అట్టి వారిని ఖండించుట సజ్జనులయొక్క లేదా ధర్మ రక్షకుని యొక్క కర్త వ్యము. అందుకొరకు తన బహుముఖ ప్రజ్ఞను ప్రదర్శించుట లేదా ఒకరిని సృష్టించి, వారిని ఆ కార్యమునకై పురికొల్పుట - ధర్మరక్షకుడు చేయుపనులు. ఇది ప్రతియుగమునను జరుగుచుండును. ఈ విషయమే శ్లోకమున సూచితమైనది.

శ్లోకములోని "ధరాకాశయోః" అనుపదము పాణిని ప్రత్యాహార పద్ధతి ననుసరించి "పృధివ్యాపస్తేజో వాయురాకాశము" లనెడి పంచభూతములను గుర్తు చేయుచున్నది. పంచభూతముల లక్షణములకు, ధర్మములకు విఘాతము కల్గించు

వాడెవ్వడైనను లయకారకుని చేతిలో హతము కావలసినదే - అన్న విషయము కూడ తోచుచున్నది.

ఆకాశాద్వాయుః। వాయోరగ్నిః। అగ్నేరాపః। అద్భ్యఃపృథివీ। పృథివ్యా ఓషధయః। ఓషధీభ్యోన్నమ్। అన్నాత్పురుషః— ఇది తైత్తిరీయోపనిత్తులలో ఒకటైన ఆనందవల్లి యందున్న మంత్రము ఆకాశమునుండి వాయువు, వాయువు నుండి అగ్ని, అగ్నినుండి నీరు, నీటినుండి భూమి దానినుండి ఓషధులు, ఆ ఓషధులవలన అన్నము, అన్నమువలన పురుషుడు రూపొందెనని మంత్రార్థము. పురుషుని జన్మకు ఆకాశాద్యన్న పర్యంతమైన వస్తుజాతము సమస్తము కారణ మగుచున్నది. అట్టి కారణజన్ముడైన పురుషుడే దానవత్వము నవలంబించి సృష్టికి అటంకము కల్గించినచో దైవముచే హతుడగును - ఇది మరొక విధమైన భావన.

భావనా పరంపరలకు నెలవైన రచన చేయుటలో శ్రీ విశ్వనాథ సత్య నారాయణగారు సిద్ధహస్తులు. "గుప్తపాశుపతము" వారి చేతిలో రూపొందిన సంస్కృతనాటకము. అందలి మొదటి శ్లోకమే "ఆకాశాత్ ధరణీ వినిః సృతి మహారుంధంతము గ్రాసురం'' అనునది. ఆ శ్లోకమొక్కటే విశేషాంశములకు నెలవని భావించకూడదు. వారి రచనలన్నియు ప్రాచీన నవీన భావనాకుసుమము లకు నెలవైన ఉద్యాన వనములు.

విశ్వనాథవారి లేఖిని నుండి వెల్వడిన సంస్కృతాంధ్రాంగ్ల రచనలనే కములు కలవు. అందు కొన్ని పాండితీ ప్రకర్షకు, మరికొన్ని భావనూత్నతకు, ఇంకొన్ని కవితాకళకు పట్టుకొమ్మలై నిలచినవి. వారు సృష్టించిన సంస్కృత సాహిత్యమున "దేవీత్రిశతి" "శివసహస్రమ్" ''శారదాచంద్రమౌళి సుప్రభాతమ్'' "గురుప్రసాదమ్'' లనునవి స్తోత్రములు. "గుప్తపాశుపతమ్'' "అమృతశర్మిష్ఠమ్" అన్నవి నాటకములు.

## గుప్తపాశుపతము

తెలిసిన కథనుండి తెలియని అందచందములను వెలికితీసి తెలియచెప్పుట మహాకవికి ''కొట్టినపిండి, వెన్నతో బెట్టిన విద్య.'' మహాకవివరేణ్యులైన విశ్వ నాథవారు అందరికి తెలిసిన భారత కథలోని ఒక భాగమును స్వీకరించి ఆ భాగములోని విశేషాంశములను తెలియ చెప్పుటకు చేసిన ప్రయత్నమే

"గుప్తపాశుపతము" ఇందు పది అంకములు కలవు భీష్మ ద్రోణ, కర్ణ, అశ్వత్థామాది వీరులతో అర్జునుడు యుద్ధము చేయుట అభిమన్యుడు, ఉపపాండవులు మృతిచెందుట, పరీక్షిజ్జననము మొదలగు అంశములతో కూడిన మహా భారత యుద్ధపంచకములోని కథయే ఈ నాటకమున కూర్చబడినది.

"పశుపతేః ఇదం పాశుపతమ్, గుప్తంచతత్ పాశుపతం చ = గుప్తపాశుపతమ్"—అని విగ్రహవాక్యము ఒకే రీతిగా కన్పించినను అర్థమును నాలుగు విధములుగా చెప్పవచ్చును. ''పశుపతి'' అనగా శంకరుడు. అతనికి సంబంధించిన తత్త్వము ఇందు నిక్షిప్తమైనది. కాన గుప్త పాశుపతమ్. ఇక రెండవది. పశుపతికి సంబంధించిన అస్త్రము పాశుపతాస్త్రము. అది ప్రయోగింపబడక గుప్తముగా నున్నది కాన గుప్తపాశుపతము. ''పశుపతి''యను పదశ్రవణముచే అర్థసామ్యముకల గోపాలక పదము స్ఫురణకు వచ్చును. కాన గోపాలకుని తత్త్వము అనగా శ్రీకృష్ణ తత్త్వము ఇందు గోప్యముగా కలదు కాన గుప్తపాశుపతము. ఇది మూడవది ఇక నాల్గవది అర్జునుడు హరిహరుల కరుణను పొందినవాడు. అతని కథ కూడ ఇందు నిక్షిప్తమైనది. కాన గుప్తపాశుపతము.

ఈ నాటకమున తమ తమ కథాతత్త్వములను గుప్తముగా నుంచుకొన్న శ్రీకృష్ణుడు, అర్జునుడు, పాశుపతాస్త్రము, శివుడు ధర్మార్థకామమోక్షములకు ప్రతీకలని చెప్పవచ్చును.

"త్వం రథీ అహం సారథిః .... .... మమ హి మహాన్ కార్యభారోఽస్తి· అస్వాపయోగ్యా మే వృత్తిః" (3 అంకము, 26 పుట)

నీవు రథికుడవు. నేను సారథిని. నాకు చాల పనియున్నది నా వృత్తి నిద్రించుటకు వీలులేనిది - అని కృష్ణుడు అర్జునుడితో పలుకుటచే ధర్మస్థాపనకు నడుము కట్టినవానిస్థితి, అతనిపైనున్న కార్యభార మెట్టిదో స్పష్టమగుచున్నది. కావున కృష్ణుడు ధర్మమునకు ప్రతీక ఇంతేకాక పాండు నృపవంశధారా నిష్ప్రత్యూహం ప్రవహతుతరామ్ (10 అంకము, 87 పుట) అని ఆశించి రాజవంశాంకురమును రక్షించి ధర్మస్థాపనకు దోహదము చేసెను.

అర్జునుడు సంయమన శక్తి కలవాడై పాశుపతమును ప్రయోగించలేదు. దానివలన అతని వంశధార నిలచినది. ఇందుకు బాలాకి మాటలే నిదర్శనములు. అర్జున! బ్రహ్మనిష్ఠస్త్వం, జగన్నిర్మాణవేత్తాత్వం, నియమవతామగ్రేసరస్త్వమ్,

పాశుపతాస్త్రస్య అప్రయోగాత్ ధారయతిస్మ శివః తే వంశధారాం (10 అంకము 88 పుట). పాశుపతమును ప్రయోగించినచో వీరులు, సైన్యము మృతిచెందుట జరుగును. అది తాత్కాలిక ప్రయోజనము. అస్త్రమునుపయోగింపక అర్జునుడు శివుని అనుగ్రహమును పొంది తన వంశధారను నిల్పుకొనెను. ఇది శాశ్వతమైన ప్రయోజనము. కాన అర్జునుడు అర్థమునకు ప్రతీక.

పాశుపతాస్త్రము కామమునకు ప్రతీక. కామమును ప్రకటించకుండుట నిగ్రహవంతుని లక్షణము వరుగులు తీయునట్టి కోరికకు పగ్గంవేసి పట్టుట నిగ్రహమే కదా! అట్టి నిగ్రహమును చూపినవాడు అర్జునుడు. అందుచేతనే అతడు పాశుపతాస్త్రమును ప్రయోగించలేదు. మంత్ర ప్రయుక్తమై ప్రయోగోప సంహార పూర్వకమైన ఈ అస్త్రము మహా మంత్రముతో సమానము. అల్ప ప్రయోజనము నాశించి ఐహిక విషయాలలో మహామంత్రమును ప్రయోగింప రాదను భావముచేత అర్జునుడు ఆ అస్త్రమును ప్రయోగించలేదు. అదియునుగాక.

అగ్రత శ్శూలపాణిః పుమాన్ ధూర్జటిః
పార్శ్వయోశ్చక్రపాణిః పుమాన్ కేశవః
హృత్తటే ధర్మరాణ్ణో ధరానాయకః
అర్జునో జేతృతా ప్రాథమం లక్షణమ్॥ (1 అంకము 10 పుట)

యుద్ధమున - రథమునకు ముందు శూలపాణి-శివుడు, రథముపై తనముందు చక్రపాణి-శ్రీకృష్ణుడు, తానేమో రథమున, తన హృదయమునందేమో ధర్మరాజు, - ఇంతమంది తోడుండగా జయించుట యనేది అర్జునుని ప్రథమ లక్షణము - అనెడి విశ్వాసము కలవాడు అర్జునుడు. వారే సర్వమును చక్కబెట్టగలరన్న భావనతోనే పాశుపతమును పార్థుడు ప్రయోగించకుండ వచ్చునని అనగా కామమును ప్రకటించలేకపోయెనని అభిప్రాయము.

శివుడు మహాప్రళయకర్త. అతడు తనకు మారుగా భీమార్జున, అశ్వత్థామలను నిల్పి, వారిచే యుగాంత ప్రళయము జరుగునట్లు గావించినాడు. కావున అతని తత్త్వము ఈ నాటకమున ప్రత్యక్షముగా గోచరించదు.

గుప్త పాశుపతమునకు మూలము భారతమైనను పూర్తిగా దానినే అనుసరించి రచించక అచ్చటచ్చట కొన్ని మార్పులను చేర్పులను విశ్వనాథవారు చేసియుండిరి.

త్రుంచబడిన సైంధవ శిరమును అతని తండ్రి దోసిటిలో పడవేయుటకు అర్జునుడు పాశుపతమును ప్రయోగించెనని భారతమున నుండగా, ఆ సమయమున కాదుకదా మరెప్పుడును ప్రయోగించలేదని నాటకమున కలదు. దానిచే నాటకము యొక్క నామ సార్థక్యము, అర్జునుని సంయమనశక్తి స్పష్టమైనవి.

దుర్యోధనుడు ధర్మరాజుని ద్వేషించుటకు అనేకానేక కారణములున్ననూ ప్రధానమైన కారణము "ధర్మజు దేర్పరచిన రాజ్యాంగ సూత్రములను నాటి రాజులందరు అవలంబించుటయే" అని విశ్వనాథవారు వివరించిరి. దీనిచే ధర్మజుని విశిష్టత, రాజ్యాంగ సూత్రములలో మంచి లక్షణములు కలవన్న విషయము స్పష్టమైనది.

నాటకమున క్రొత్త చేర్పు "సంతాన వేణుగోపాల వ్రతము" (3 అంకము). దీనిని సుభద్రార్జునుల పేరున శ్రీకృష్ణుడే ఆచరించెను. అందుచే వారికి వ్రత ఫలము కొంత లభించినది. మరికొంత లభించలేదు - సుభద్రార్జునులకు ప్రతి ఫలము లభించలేదు అనుటకు అభిమన్యుని మృతి - వ్రతఫలము లభించినది అనుటకు సాక్ష్యము పరీక్షిత్తు ప్రాణములతోనుండుట. సుభద్రార్జునుల జీవితమున జరిగిన విషయములను హేతుబద్ధముగా నిరూపించుటకు, వ్రతములను స్వయముగా ఆచరించిన వారికే సంపూర్ణ ఫలము లభించునని సూచించుచు విశ్వనాథవారీ వ్రతమును కల్పించిరి.

భీష్మ సంహార విషయమున కలిగిన శంకను నివృత్తి చేయుట ఒక క్రొత్త విషయము - "సుదర్శనముచే సంహరింపబడిన వైకుంఠ ప్రాప్తి. అపుడు వసు సంఖ్య తక్కువగుట, లోకపాలనము కుంటుపడుట మొదలగునవి జరుగును. కాన సంహరించుటలేదు. పాశుపాతముచే సంహరింపబడినచో అతనికి పశుత్వము ప్రాప్తించును. తాతగారి విషయమున అర్జును డిట్లు చేయలేదు గదా!

యః సుదర్శనేన మృత్యు మాప్నోతి సగచ్ఛతి వైకుంఠం
భవద్విషయే తత్సంభవతి చేత్, వసూనాం సంఖ్యాపూరణం,
లోకపాలకస్య క్లేశం దదాతి పాశుపతేన హతః
పశుత్వం గచ్ఛతి ప్రియతమ పితామహ విషయే న
కరోతి తథా కపికేతనః (4 అంకము 34 పుట)

అని బాలాకిచే విశ్వనాథవారు చెప్పించి, సుదర్శన పాశుపతముల శక్తి అల్పమేమికాదు అధికమే. కాని పైన పేర్కొన్న కారణములచే ప్రయోగింపలేక పోవుచున్నట్లు, భీష్ముడు స్వచ్ఛంద మరణప్రాప్తి కలవాడన్నట్లు ధ్వనింప చేసిరి.

ఇక్కడొక సందేహము తీర్చుకోవలసిన అవసరమున్నది. భీష్మునకు వైకుంఠప్రాప్తి జరిగిన "వసు సంఖ్య తక్కువగును. లోకపాలనకు కష్టమగును" అని నష్టాలను సూచించారు. మరి పశుత్వమున అదే నష్టమా? ఇంకేమైనా జరుగునా? అది తేల్చవలసిన విషయము పశుత్వము= అంటే జీవత్వము, సామాన్య జీవ లక్షణము - అదెట్లు భీష్మునకు లభించును? ఎందుకంటే-

జీవో జన్మ పరంపరాక్రమ దశాయాత్రాగతో జంతు తాం
త్యక్త్వా మానవ జన్మ తత్ర లభతే బ్రహ్మాప్తయే తద్విధా
(8 అంకము 66 పుట)

జంతు జన్మను విడచి మానవజన్మ - దానిద్వారా బ్రహ్మ ప్రాప్తికి మార్గాన్వేషణ అని కదా కవి చెప్పిన విషయము? కావున దివ్యుడు, అష్టవసువులలో ఒకడు అయిన భీష్ముడు మరల సామాన్యజీవుడెట్లగును? అట్లగుట తీరని నష్టము. కాన వైకుంఠప్రాప్తి లేక పశుత్వప్రాప్తి జరుగక భీష్మునకు స్వచ్ఛంద మరణము ద్వారా వసుత్వప్రాప్తి జరిగితీరును అన్నవిషయమును విశ్వనాథవారు స్పష్టపరచినారు.

ద్రోణునికడకు భరద్వాజుడు, విశ్వామిత్రుడు, ఋషి మండలము ఏతెంచుట, ద్రోణునకు ప్రబోధము కావించుట ఇంకొక క్రొత్త చేర్పు. (6వ అంకము 51 పుట).

ద్రోణుని తండ్రి భరద్వాజుడు - శివకేశవులకు ప్రీతిని కల్గింపని పని నెందుకు చేసెదవు? అన్న హితమును ధ్వనింపచేయుటకు బ్రాహ్మణత్వ, బ్రహ్మజ్ఞానత్వ విశిష్టతలను చెప్పుటకు అతడు ద్రోణుని కడకు వచ్చెను. తండ్రి కుమారునకు హితవు చెప్పుట ధర్మసమ్మతమే కదా!

విశ్వామిత్రుడు క్షత్రియుడు బ్రహ్మర్షిత్వమును పొందినవాడు క్షత్రియ జాతి అభివృద్ధి నొందవలెనని, తనవారిలో బ్రహ్మర్షులను చూడవలెనని కాంక్షతో నున్నవాడు. రామావతార తత్త్వమును సంపూర్ణముగా తెలిసికొన్నవాడు. అట్టివాడు ద్రోణుని కడకు వచ్చి—

రఘుకుల రమణీయో దీపఏవోర్జిత స్తత్
త్రిజగదుదితయాత్రా మూలభూతం మహోయత్
పునరపిచ తదేవ ప్రాదురాస్ద్యదూనాం
అవని పతికులే సౌబ్రాత్రిఖండావ చూడః (6 వ అంకము 51 పుట)

నాటి రాముడే ఈనాటి కృష్ణుడు అని కృష్ణ తత్త్వమును వివరించి వెళ్ళెను.

వీరిర్వురి ప్రబోధమును విన్న ద్రోణునకు ఋషిమండలము కన్పించెను. విషయము నర్థము చేసికొన్న ద్రోణుడు వారిని చూచి—

"భోభో మహర్షయః! కల్పాదే, నిసృష్టునా, ప్రజాపతినా, పియన్మండలీ ప్రథమాంధకార నివారణాయ సమర్పితదీపాః! అల మతిశ్రమేణ! భార్గవోద్రోణ స్తత్ర భవతాం అభిలషితమవశ్యమనుసరతి" -

(6 వ అంకము 52 పుట)

"ఈ భార్గవుడు మీమీ కోరికలను తప్పక తీర్చగలడు. మీ అభిమతము ననుసరించి నడువగలడు" అని పలికెను.

ద్రోణుని అస్త్ర సన్యాసమునకు ప్రధాన కారణము అశ్వత్థామపైగల ప్రేమ కాదు. భరద్వాజ విశ్వామిత్రాదుల ప్రబోధమే - అను విషయమును సూచించుటకే కవి ఈ సన్నివేశమును కల్పించెను.

పాత్రల విషయమున చూచినచో భారతమున లేని కౌబేరి, ఘటకులను, బాలాకిని సృష్టించిన కవి విశేషమైన ప్రయోజనమును సాధించెను. కౌబేరి అర్జునుని పోలికలు కలవాడు. ఘటకుడు కొన్నిటి యందైన భీమునితో సామ్యము కలవాడు. శత్రులక్షణ లక్షితులైన వారిని తమ సేవకులుగా నుంచుకొని వారితో సేవ చేయించుకొని పగ దీర్చుకొనుట, తాము తృప్తి పొందుట యనునది రాజుల యొక్క సామాన్య లక్షణము. అట్టిదానిని అధికముగా కలవాడు రారాజు అతని అసుర ప్రవృత్తిలో నిదియొక భాగము. దానిని సూచించుటకే కౌబేరి ఘటకులను దుర్యోధనుని సేవకులుగా కవిసమ్రాట్ కల్పించియుండిరి.

విశ్వనాథవారు కౌబేరితో ఇంకొక ప్రయోజనమును కూడ సాధించి యుండిరి. ప్రయోగించిన మహాస్త్రమెపుడును వ్యర్థము కాదు. ఈ విషయమును గుర్తించిన విశ్వనాథవారు అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మశిరోనామ కాస్త్రమునకు పరీక్షిత్తు బలికాకుండా కౌబేరి బలి అయినట్లుగా కల్పించి (10 అంకము 88 పుట) ఆ పాత్రకు సార్థకతను చేకూర్చిరి.

నాటకమున ఉత్తమోత్తమమైనది, అధిక ప్రయోజనమును సాధించినది బాలాకి పాత్ర. భారత కథలో అర్జునునకు సమంత్రకముగా పాశుపతము నొసగినది బ్రహ్మచారియైన కుమారస్వామి. దీనిచే పాశుపతమునకు శివుడు అధిదైవతము కాగా, కుమారస్వామి గురువు అయ్యెను. ఆ కుమారస్వామికి ప్రతినిధిగా పాశుపతాస్త్రము కల్గించు లాభములన్నిటిని కల్గించువానిగా పాశుపతాస్త్ర ప్రభావమును సందీపింప చేయుచు ప్రతిపక్షులను చెదరగొట్టువానిగా బాలాకి ఈ నాటకమున కల్పింపబడెను.

దివ్యత్వ మనుష్యత్వ లక్షణములు కలవారు కృష్ణార్జునులు. వారి తత్త్వమును ప్రకాశింపచేయుట గూడ బాలాకిపాత్ర ప్రయోజనములలో నొకటి. అశ్వత్థామలోని యుగాంత ప్రళయ కర్తృత్వయోగ్యతను అధికము చేయుటకు అది అధికమై మానవ వికారాకులితమై అభివ్యక్త మగునప్పుడు తన రౌద్ర స్వరూపమును ప్రదర్శించి దానిని స్తంభింప చేయుటకును ఉపయోగపడినవాడు బాలాకి. ఇట్లు అనేక ప్రయోజనములను సాధించి నాటకములోని సన్నివేశములలో ఒక కొలికి పూసగా ప్రకాశించినవాడు బాలాకి.

సర్వదేవతా మూర్తులను అందున విశేషముగా హరిహరులను ఏకముగా భావించుట. మత సామరస్యమునకు మానవుని విశాల హృదయమునకు నిదర్శనము. ఇట్టి భావన ఉపనిషత్తులందు పురాణములందు తిక్కన నాచన సోమనాది కవుల భావనలందు ప్రతిఫలించుచున్నది. ప్రాచీన సంప్రదాయమును పుణికి పుచ్చుకొన్న విశ్వనాథవారు తమ గుప్త పాశుపతములో కూడ ఈ హరిహరాద్వైత భావనను అచ్చటచ్చట ప్రదర్శించియుండిరి.

రథీ కిరీటీ ధృత దేవదత్తకః
ససారథిః నీలవపుస్త్రిలోచనః. (1 అంకము 10 పుట.)

ఈ వాక్యమును వినగానే అర్జునుడు, కృష్ణుడు, త్రిలోచనుడు అనగా శివుడు- వీరు ముగ్గురు కలసియున్న మనోజ్ఞమైన చిత్రమొకటి కనుల యెదుట గోచరించును.

అర్జునుని గృహమున సహదేవుడు శ్రీకృష్ణుని కంఠ ధ్వనిని విని- మదించిన తుమ్మెదల నాదముగా, ప్రాతరాహత విపంచీ నినాదముగా, వేణువుయొక్క ధ్వనిగా భావించెను. అదే సమయమున అక్కడే ఆ కృష్ణుని కంఠ ధ్వనిని విన్న బాలాకి—

స్వాపయితుం శశిమౌళిం కుధరసుతాచాలిత మృదు
గీతిర్ను? హేరంబకరాపూరిత గంగాధారా విదీర్ణోను?
(3 అంకము 23 పుట.)

శశిశేఖరుని నిద్ర పుచ్చుటకు పార్వతి పాడిన జోలపాటగా, వినాయకుని తొండముచే నింపబడిన గంగాధారయొక్క ధ్వనిగా భావించెను. పరబ్రహ్మతత్త్వము ఒక్కటే కాని, దర్శించిన వారి దృష్టి భేదము ననుసరించి కేశవునిగాను, శివునిగాను దర్శనమిస్తుంది కంఠధ్వని ఒక్కటే కాని, దానిని విన్నవారి ఊహలు వేరు వేరుగా నున్నవి. దీనిచే నాదస్వరూప పరబ్రహ్మ తత్త్వము ఒక్కటేయన్న విషయము చక్కగా నిరూపితమైనది.

కర్ణార్జునుల యుద్ధము జరుగబోవు సమయమున బాలాకి ఒక వాక్యమును వచించెను.

''మహేంద్రసూనుః పరిణామ ధూర్జటిః
పంచాననోభూత్ పశులోక పాలకః''— (8 అంకము 71 పుట.)

అర్జునుడు రూపాంతరము నొందిన ధూర్జటియని బాలాకి వాక్యముద్వారా స్పష్టము - అర్జునుడు నరుడు। శ్రీకృష్ణుడు నారాయణుడు! నరనారాయణు లొక్కటే యన్నది లోక ప్రసిద్ధ విషయము. దానికి తోడు నరుని శివునిగా భావింపచేసి శివ కేశవాభేదమునకు స్ఫూర్తిని కల్గించినవారు సత్యనారాయణ గారు.

—"బ్రహ్మశిరోనామకమును నీవు ఉపసంహరించలేవు. శ్రీకృష్ణుని ప్రీతికై శివుడు పాండవులను విడచిపెట్టెను. వీని నన్నిటిని తెలిసికొన్న నేనెవరినో ఇటు చూడుమ"ని బాలాకి అశ్వత్థామకు తన రౌద్రస్వరూపమును ప్రదర్శించెను. అపుడశ్వత్థామ ఆ స్వరూపము నిట్లు స్తుతించెను:

అనూహితాతర్క్యనిగూఢ మూర్తయే
నిరూపణాతీత వినీతరూపిణే
స్థితేర్లయ స్యాంతర సూక్ష్మకారిణే
అఘోర ఘోరాయ నమశ్శివాయ॥ (10 అంకము 85 పుట).

"స్థితిని కల్గించువాడు విష్ణువు, లయను చేయువాడు శివుడు" అన్న విషయము పురాణప్రసిద్ధము కాని పైశ్లోకమున స్థితిలయములకు కారణభూతుడైన

వ్యక్తిగా శివుని భావించి నమస్కరించుట కనిపించుచున్నది. ఈ కల్పన హరిహర స్వరూపుడైన పరబ్రహ్మనే సూచించును

కృష్ణుడు అశ్వత్థామకు ఉత్తరాగర్భస్థ శిశురక్షణ విషయమును చెప్పుచు—

సర్వేశో మాం నజానాసి మౌళిపింఛ సదాశివం
యోజుహోతి జగత్సర్వం యోవా నిత్యహుతాశనే॥

(10 అంకము. 86 పుట)

"అగ్నియందు ఎవరు ఈ జగత్తును హవ్యముగా చేయుదురో అట్టివాడు శివుడు. మౌళియందు పింఛము గల నన్ను ఆ సదాశివునిగా నీవు గుర్తించుట లేదు" అని పల్కెను. దీనితో హరిహరాద్వైతమూర్తి ప్రతిష్ఠింపబడినాడు.

సంయోజయ పాశుపతం। బ్రహ్మశిరోస్త్రం నివారయ। కిరీటిన్। అని కృష్ణుడు ఆదేశించినపుడు అర్జునుడిట్లు పల్కెను:

కథమియం మమ తత్కృతియోగ్యతా
త్వమిహ ధూర్జటిరత్ర జగత్ప్రభూ
దురుపయుక్త శివాస్త్ర మహోఘుకృత్
న చ భవాని భవానిహ మత్ప్రభుః (10 అంకము 88 పుట)

"జగత్ప్రభువైన శివుడవే నీవు. అట్టినీవు నాకు ప్రభువగుచున్నావు. శివాస్త్రమును ప్రయోగించి నేను పాపమును మూటకట్టుకొనజాల"నని అర్జునుడు పల్కుటతో శివకేశవాభేదము సుప్రతిష్ఠితమైనది.

నాటక ప్రారంభమున నాందీసమారాధనలో శివకేశవులను రెండు శ్లోకములలో వేరువేరుగా వర్ణించి భరతవాక్యమున మాత్రము ఒకే శ్లోకమున శివకేశవుల ప్రసక్తిని విశ్వనాథవారు కల్పించిరి.

శాస్త్రైః త్వత్కృపయా యదోఃకులపతే! జ్ఞాత్వాపి నజ్ఞాయతే
గంగాజాటజూటిక! మృత్యుముపరి స్థిత్వాభవిష్యామి కిం?
దృష్ట్వాద్యాపి బిభేమి లోకమిహ త్వత్పాదాబ్జయోర్బంభరీ
భూతం, నిత్యపరిభ్రమంత మనుమాం ప్రేమ్ణాకురూమాపతే!

(10 అంకము 88 పుట)

సత్యనారాయణగారు శివుని వర్ణించునపుడు అతని యందు విష్ణులీలలను, విష్ణువును వర్ణించునపుడు ఆ మూర్తి యందు శివలీలలను ఆరోపింతురు. అది వారి హరిహరనాథ తత్త్వదర్శనమునకు నిదర్శనము.

పై శ్లోకములోని మృత్యుముపరిస్థిత్వాభవిష్యామి కిం? "సమీపమున మృత్యువునుంచుకొని నేనేమి చేయగలను?'' త్వత్పాదాబ్జయోర్చంచరీభూతం నిత్యపరిభ్రమంతమను మాం ప్రేమ్ణాకురూమావతే. ''శంకరా నీపాదాబ్జముల యందు నిత్యము పరిభ్రమించెడి తుమ్మెదగా నన్ను చేయుము'' అను వాక్యములను పరిశీలించిన మృత్యువును తొలగించి శాశ్వతముగా నీ పాద సేవ నొసగుమన్న భావము స్పష్టమగును. కాని మృత్యుంజయ మహా మంత్రార్థము ఇందు దాగియున్నదన్న విషయము చెపితేనేకాని తెలియదు.

''త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనమ్।
ఉర్వారుక మివ బంధనాన్మృత్యోర్ముక్షీ యమాఽమృతాత్''
(తైత్తిరీయోపనిషత్తు, నారాయణప్రశ్న, 56 అనువాకము)

మంచి పరిమళముతో కూడిన దేహము కలవాడు, పుష్టికరుడు అయిన త్రినేత్రుని పూజించుచున్నాము ఓ దేవా! తొడిమనుండి దోసకాయను వేరు చేసినట్లే మృత్యువునుండి నన్ను వేరుచేయుము. అమృతత్వమునుండి మాత్రము నన్ను వేరు పరచకుము దానిని దగ్గరగా నుండునట్లు చేయుము - అని మంత్రార్థము.

వేదమంత్రములన్నా, వైదికభావనలన్నా విశ్వనాథ వారికి మక్కువ ఎక్కువ. అందుచేతనే అమృత శర్మిష్ఠములోని ప్రథమాంకమును వైదిక ధర్మ ప్రతిపాదితార్థముగల శ్లోకముతోనే ప్రారంభించిరి.

## అమృత శర్మిష్ఠము

ఇయంతు వైదికీవృత్తిః ప్రజార్థం వృణుతేజనాః
స్త్రీపుమాంసౌ న నిర్వ్యాజ రస సంగమ భావుకౌ॥
(1 అంకము 5 వ పుట)

"సత్సంతానము కొరకు పురుషుడు స్త్రీని భార్యగా స్వీకరించుట వైదికమైన ధర్మము దీనిని స్త్రీ పురుషుల కలయికగా ఇంతకుముందే బ్రహ్మ కూర్చియుండెను" - ఈ శ్లోకభావము వెనక వేద మంత్రార్థ దర్శనము దాగియున్నది.

యద్వై యజ్ఞస్య బ్రహ్మణా యుజ్యతే । బ్రహ్మణా వై తస్య
విమోకః। అద్భిశ్శాన్తిః। విముక్తం వా ఏతర్హి యోక్త్రం
బ్రహ్మణా। అదాయైన తృప్ని సహాప ఉపగృహ్ణీతే శాన్త్యై

అంజలౌ పూర్ణపాత్రమానయతి। రేత ఏవాస్యాం ప్రజాం
దధాతి। ప్రజయా హి మనుష్యః పూర్ణః। ముఖం విమృష్టే।
అవభృథస్యైవ రూపం కృత్వోత్తిష్ఠతి.

(తైత్తిరీయ బ్రాహ్మణము 3.3.10-75)

ప్రజననంవై ప్రతిష్ఠాలోకే సాధు ప్రజాయాస్తన్తుం తన్వానః
పితృణా మనృణో భవతి। తదేవ తస్యా అనృణం తస్మా
త్ప్రజననం పరమంవదన్తి- (తైత్తిరీయోపనిషత్తు. నారాయణప్రశ్న-
79 అనువాకము, 8 మంత్రము)

బ్రహ్మచే ముడిపెట్టబడిన పత్నిని స్వీకరించి ఆమెయందు సంతానమును పొందుచు, సంతాన తంతువును తెంపివేయకుండ ఉన్నవాడే పూర్ణ పురుష డగును. అతడే పితృఋణము దీర్చినవాడగును. ఇదియే శ్రేష్ఠమైన ధర్మమని మంత్రముల సారాంశము.

అశాశ్వతమైన స్వరూపమును ఆధారముగా చేసికొని స్వరూపము లేని వాని విశిష్టతను చాటిచెప్పుట, వానిని శాశ్వతమొనర్చుట గొప్ప విషయము. ఇది మనకు విశ్వనాథవారి అమృత శర్మిష్ఠమున కన్పించును. రూపసియైన శర్మిష్ఠను కథానాయికగా స్వీకరించి ఆమె కథను హృదయమును, ప్రేమను, అమృతమయములుగా చేసి చూపించిన మహాశిల్పి విశ్వనాథ. శర్మిష్ఠకు భౌతిక ముగా మృతి కలదేకాని ఆమె కీర్తికి, కథకు మృతి లేదు. ఆమె హృదయము, ప్రేమ రెండు అమృతమయమైనవి" అని తెలియచెప్పుటకే కవి తమ నాటకము నకు" అమృత శర్మిష్ఠమని పేరు పెట్టిరి.

ఇందు తొమ్మిది అంకములు కలవు. యయాతి, దేవయాని, శర్మిష్ఠ, శుక్రాచార్యుడు, పూరువు మొదలగు ప్రసిద్ధ పాత్రలేకాక వైశంపాయనుడు, మహేశానుడు, అరుణవల్కాల, జఘనవాలుక అను పాత్రలు కూడ కన్పించును.

యయాతి దేవయానిని నూతినుండి ఉద్ధరించి, పాణిగ్రహణము చేసికొని, ఆమెకు వాక్కును దత్తము చేయును. దేవయాని వెంట వచ్చిన దైత్యరాజసుత యగు శర్మిష్ఠకు మనసును ధారాదత్తము చేయును. ఇట్టి విచిత్ర సంసార స్థితి లోనే యయాతివలన శర్మిష్ఠ సంతానవతి అగును.అది దేవయానికి కోపకారణమై "నీవు వృద్ధత్వము నొందెదవుగాక" అని యయాతిని శుక్రుడు శపించునట్లుగా

పరిణమించినది. కుమారుడగు పూరువుయొక్క ఉదారగుణము వలన కొంత కాలము యయాతి వృద్ధత్వమును వీడి హాయిగా నుండును. పిమ్మట యయాతికి వైరాగ్య భావము. పూరువునకు చక్రవర్తిత్వము లభించుటతో కథ పరిసమాప్తమగును.

ఒక్కొక్కమారు కవి ఆయా సందర్భములందు ఉపయోగించిన ఉపమానములు ఆయా పాత్రల వ్యక్తిత్వమును పట్టి ఇచ్చును.

యయాతికి దేవయాని "లంబమాన భోగి" వలె, కుపితయైన "జలాధి దేవత" వలె కన్పించినదట "బుస కొట్టుట" "కాటు వేయుట" భోగి లక్షణము. శర్మిష్ఠ తనను నూతిలో పడద్రోసినదని కోపగించి బుసకొట్టి ఆమెను తనకు దాసిగా చేసికొన్నది. పూరువు యయాతి వలన శర్మిష్ఠకు కల్గిన సంతానమని తెలిసినప్పుడు బుసకొట్టి యయాతికి తన తండ్రి శాపము ద్వారా వృద్ధత్వము ప్రాప్తించునట్లు చేసినది. ఇలా దేవయాని అనే భోగి శర్మిష్ఠను, యయాతిని కాటువేసి తన కసి దీర్చుకున్నది.

జలాధిదేవత సంతోషముగా నున్నప్పుడు దప్పికగొన్న వ్యక్తికి నీటి నందించి సంతోష పెట్టును. క్రోధము అధికమైనప్పుడు ఉప్పెనలా వచ్చి శాశ్వతముగా ముంచివేయును. ఇది జలాధిదేవత లక్షణము

''త్వం మే ధర్మవిషయే పాల్యా ప్రేమ విషయే భగినీ చ భవసి" (1 అంకము 8 పుట) "నీవు ధర్మ విషయమున అనగా హద్దులలో నుంచి పాలించుటకు తగిన దానివి. ప్రేమ విషయమున సోదరివి'' అని దేవయాని పల్కినపుడు జలాధి దేవత యొక్క మొదటి లక్షణమైన సంతృప్తిపరచుట కన్పించును. శర్మిష్ఠకు సంతానము కలిగినదని తెలిసినపుడు దేవయాని కోపించగా శర్మిష్ఠ యయాతిని శాశ్వతముగా విడచి వెళ్ళినది. అనగా దేవయాని కోపము ఆమెను ఉప్పెనలా ముంచినది.

ఇక యయాతి విషయమున - అతడు శాపమును అవస్థా వినిమయముచే అనుభవింపకుండునట్లు తండ్రిని ప్రార్థించి అతని నోట పలికించుట, ఆ తర్వాత యయాతి వైరాగ్యభావమునకు కారణమగుట - రెండు విషయములను చూచి నప్పుడు దేవయాని అనుగ్రహ నిగ్రహములు ఏ స్థాయిలో నున్నవో స్పష్టమగును.

శర్మిష్ఠ పూర్వజన్మమున "జ్యోతిష్మతి" అను అప్సరస. ఒకరోజున చంద్రలగ్న చిత్తయై ఇంద్రుని సభలో నాట్యము చేయుచుండ ఇంద్రుడు కోపించి భూలోకమున జన్మించుమని శపించును 20 సం॥ వయసులో చంద్రసమాగమ ముతో శాపముతీరి తన లోకము చేరును శర్మిష్ఠ శాపాంతమున స్వర్గము వెళ్ళినదే కాని మృతిచెందలేదు కావున ఆమె అమృతా - లౌకికా నామము శర్మిష్ఠా - అమృతా చ సా శర్మిష్ఠా=అమృతశర్మిష్ఠా తామధికృత్య కృతో యం గ్రంథః అమృతశర్మిష్ఠమ్ నాటకము యొక్క నామమునుబట్టి శర్మిష్ఠకే కవి అధిక ప్రాధాన్యము కల్పించినట్లు స్పష్టమగుచున్నది అందుచేతనే భారత భాగవత ములలోనున్న యయాతి చరిత్రకు సంబంధించిన కొన్ని అంశములను విడచి భర్త బహుమతమైన శర్మిష్ఠ వృత్తాంతమునే స్వీకరించెను

నవజ్యోత్స్నా బాలా తరుణ నవరూపం ధృతవతీ
సమాయాతా కిం వా నయన పరమార్థైకవిహృతిః
రహో నిద్రాణం మే కమపి హృదయాంత స్థిత రసం
సమానీత స్పందం తదను కురుతేఽనిహ్నుత కలమ్.

(1 అంకము, 9 పుట)

అని యయాతి శర్మిష్ఠ గూర్చి పల్కుటచే "ఆమె - నిద్రాణమైయున్న హృదయాంత స్థిత రసమును అభివ్యక్తీకరింపచేయు వ్యక్తి"గా గోచరించును. యయాతిలోని రసస్వరూపమును స్పష్టము చేయుటకే జనించిన రసస్వరూపిణిగా శర్మిష్ఠ" శుక్రాచార్యునిచే ప్రశంసింపబడినది.

సహతే న చ సహతేసా దృష్టిం మేసాభిలాషమావలితాం
ధాత్రీవ ప్రథమ వృష్టిం సిక్తా చ పునర్వితృషార్కాంశుః

(2 అంకము, 14 పు.)

"సాభిలాషతో కూడిన నా దృష్టిని శర్మిష్ఠ సహించుచున్నది - సహించుట లేదు. అది ఎట్లున్నదనగా, మొదటిమారు కురిసిన వర్షమునకు తడిసియు తడియ నట్లున్న నీరు లేనట్టి భూమివలె కన్పించుచున్నది" - అని యయాతి చెప్పుటచే శర్మిష్ఠలోని క్షమాగుణము పాఠకులకు స్పష్టమగుచున్నది. అది ఎట్లన, క్షమా గుణమునకు ధరిత్రి నిలయము కదా! కాన ధరిత్రితో పోల్చబడిన శర్మిష్ఠ కూడ క్షమాగుణము కలది.

గుప్తపాశుపతమునందువలె అమృత శర్మిష్ఠమునందు కూడ ఒక వ్రత మును జరిపినట్లు కవి కల్పించిరి. దేవయాని వ్రతమును ప్రారంభించినది. కంచిద్వ్రతభారం బిభ్రాణా మహాదేవీ ...(4 అంకము, 25 పుట) అన్న మంజరిక వాక్యము విని యయాతి స్మరతి చ మమ దేవ్యాః పాణి మద్యాపిచిత్తం అని పల్కను వెంటనే దేవయాని తథా వదసియథా మమ మనః వ్రతనియమప్రసంని భవతి అని వచించును. పై వాక్యములచే దేవయాని వ్రతదీక్షను వహించినదని, నియమమును భంగము చేయుస్థితిని ఆమె మనసు కలిగియున్నదని తెలియు చున్నది.

కర్పూర గుగ్గులు నవా గురునారికేల నైవేద్యధూపముఖ సాధుపరిమలశ్రీః ఆయాతి (4 అంకము, 30 పుట) అని రాజు పల్కుటచే లోన దేవయానిచే పూజ జరుపబడుచున్నది అని స్పష్టమైనది. బోధాయన! బ్రూహి మహామంత్రిణం వైశంపాయనం శ్వోమదర్థం రథః సజ్జీకర్తవ్యః అని దేవయాని బోధాయనునకు ఆజ్ఞనిచ్చి, మహారాజ అహమపి గచ్ఛామి కించిదస్తి వ్రతోద్యాపనమ్ (4 అంకము, 31 పుట) అంటూ లోనికి వెళ్ళును. ఆమె మాటలనుబట్టి వ్రతోద్యాపనము చేయ లేదని స్పష్టమైనది

పై సన్నివేశమును పరిశీలించ-వ్రతమును దేవయాని చిత్తశుద్ధితో ప్రారం భించలేదని, ఆమె మనసు స్థిరముగా లేదని, వ్రతోద్యావన చేయకుండగనే మధ్యలో వచ్చి కార్యముల నాదేశించెనని స్పష్టమగుచున్నది.

దీక్షను స్వీకరించి వ్రతము నాచరించుచున్నపుడు మధ్య మధ్య లేచి వెళ్ళుటగాని, మనసు వికలమగు పరిస్థితిని కల్పించుకొనుటగాని, వ్రతోద్యాపన చేయకుండగానే వెళ్ళుటగాని జరుగకూడదు. అట్లు జరిగినచో మహా పాపమని వ్రత విధానములు చెప్పుచున్నవి. కావున వ్రతమును దేవయాని సరిగా చేయక పోవుటచే సవతిపోరు సంభవించుట, భర్తకు దూరమగుట మున్నగు కష్టముల ననుభవించినదని చెప్పుటకే విశ్వనాథవారి వ్రతమును ప్రవేశపెట్టిరి.

భావోద్దీప్తికి - సన్నివేశము, వర్ణన రచనా శైలి మున్నగునవియేకాదు, వృత్తములు కూడ భావోద్దీప్తికి సోపానములే యని విశ్వనాథవారి భావన ఆ దృష్టితో రెండు నాటకములందును క్రొత్త క్రొత్త వృత్తముల నుపయోగించిరి. ''ప్రమితాక్షర", ''హరిణి'' ''చంద్రవర్మ'', ''వంశపత్రి పతితము'' ''పర

మాలి'' మొదలగునవి గుప్తపాశుపతములో కన్పించును ''శిఖరిణి'', ''వసంత తిలకము'' ''వంశస్థము'', ''మందాక్రాంతము'', ''పృధ్వి'', ''మాలిని'', ''తోటకము'' మొదలగునవి అమృతశర్మిష్ఠములో గోచరించును.

రసములలో శృంగార రసము శిఖరాయమానము. నాట్యములందు శివుని నాట్యము శిఖరాయమానము. ఈ విషయమును వివరించుటకై విశ్వనాథవారు ''శిఖరిణి'' వృత్తమును స్వీకరించారు అదే. క్రతుధ్వంసీ సాంధ్య ప్రణయ భర సంస్పందిచరణ - (నాందీ 2 శ్లోకము) అనెడి శ్లోకము ఋతువులలో వసంతము తిలకాయమానమైనట్లు స్త్రీమూర్తులలో శర్మిష్ఠ తిలకాయమానము. అన్న భావనలో ఆమె మూర్తిని వసంత తిలకా వృత్తములో కాంతిర్విపర్యణ మదగ్ర జటాకషాయ జూటీవ (1 అంకము 7 పుట) అంటూ కవి వర్ణించెను.

భావము నెమ్మదిగా మనసును ఆక్రమించునట్లు చేయునది మందా క్రాంత కావచ్చును. పశ్యత్వంతం సురపతి ధనుస్పీత పీతాంబరాంసం (1 అంకము 9 పుట) అన్న శ్లోకమును చదివినచో భావము మనసు నెట్లాక్రమించునో స్పష్ట మగును. పై శ్లోకమున శర్మిష్ఠకు అరుణ వల్కల చెప్పిన తీరు చూడగా మొదట యయాతి మహారాజు, ఆ తర్వాత అతనిచే భరింపబడుచున్న కాశ్యపి, పిమ్మట ఆ ధరిత్రికి సవతిగా సిద్ధమైన సురరిపు గురోఃపుత్రీ శుక్రాచార్యుని కూతురు దేవయాని - ఇలా ఒక్కరొక్కరే మనసు నాక్రమింతురు.

ఇట్లు కవి ప్రయోగించిన వృత్తములు నామ సార్థక్యమును సంపాదించు కొన్నవి.

రస విషయమున శ్రీ విశ్వనాథవారు వైశంపాయనునితో ఒక మాటను పల్కించారు. "కరచరణాద్యవయవవిశిష్టుడు అయా పేర్లతో పిలువబడే మను జుడు వేరు. అతని హృదయములో నుండే పరమాత్మ వేరు. ఈ ఇద్దరు కాక రస జనకుడు రసాస్వాదనపరుడు అయిన ఇంకొక వ్యక్తి ఉండును. అతడే సరస హృదయుడు" - అని. ఆ వైశంపాయనుని మాటకు అర్థము.

అహమహమితి పురుషః ప్రథమః । యయాతిర్ద్వితీయః ।
యధాత్వం చాహం చ । దనుజసుతాసంగమోనిషిద్ధో
భగవతా । శర్మిష్ఠా, రాజగతబుద్ధిః । రాజాతాంచింతయన్నాస్తే ।
పునస్తాం నచింతయేత్ తస్యాః అనుభవాదీన్ చింతయన్

రాజా పరవశోబభూవ । తస్మిన్ పరవశీభూతే సమయే
కంచిత్ తృతీయం పురుషం రాజా స్వస్మిన్ దదర్శ । భరత
మునేర్న్యవేదయత్ । రసః సామాజిక నిష్ఠ భరతమునిః
నిర్ణయం చకార । (9 అంకము, 59 పుట)

నేను నేను అనేవాడు మొదటివాడు. యయాతి ద్వితీయుడు. అతడే దేవయాని పతి. కాని శర్మిష్ఠను చూడగనే పరవశించువాడు, లేదా ఆమెతో గడపిన మధురక్షణములను స్మరించుకొని సంతసించువాడు అయిన పురుషుడు మూడవవాడు. అతడే రసజనకుడు, సరస హృదయుడు, రసాస్వాదనపరుడు అని. కథలోని యయాతి పాత్రద్వారా రసము సామాజిక నిష్ఠము అన్న విషయమును బలపరచినారు శ్రీ విశ్వనాథవారు.

తిక్కనకు ధర్మాద్వైతము హరిహరాద్వైతము ఎట్లు ప్రధానమో అట్లే విశ్వనాథవారికి జీవుని వేదనను వర్ణించుట ప్రధానము. అర్జునుడిలా అనుకుంటాడు: అహమేకాకీ, సర్వే జీవినః ఏకాకినః - ఇదం మమగృహమ్ అనూహమానోప్యహమిహ ప్రాప్తః. యథాపశవో గృహాన్ గచ్ఛంతి, పశుపతినాహం పశూకృతః (5 అంకము, 45 పుట).

"నేను ఒంటరివాణ్ణి. జీవులందరు ఎవరికివారే ఒంటరివారు కదా!" అని విచారించుచు అర్జునుడు గృహాన్ని చేరుకుంటాడు. "ఆశ్చర్యముగా నున్నదే! పశువులు ఇంటిని చేరుకున్నట్లే నేను చేరుకున్నాను. పశుపతిచేత నేనొక పశువుగ చేయబడినాను" అని భావిస్తాడు. పశువులు అంటే జీవులు అని అర్థము. జీవులు ఎక్కడెక్కడ తిరిగినా తుదకు పరమాత్మను చేరవలసిందేకదా! ఆ విషయమునే వివరించారు కవివర్యులు.

జీవుని స్థితిని ఈ శ్లోకమున ఎట్లు వర్ణించారో చూడండి :
జీవో జన్మపరంపరాక్రమ దశాయాతాగతో జయంతుతాం
త్యక్త్వామానవజన్మ తత్రలభతే బ్రహ్మాప్తయే తద్విధా
సోపానః ప్రథమాకృతిః కలయతే లజ్జోదయస్తత్త్రపా
వస్త్రాచ్ఛాదన రూపమేతి జననవ్యాపారకృద్దేహినామ్.
(గుప్తపాశుపతం 8 అధ్యా, 66 పుట)

జీవుడు ఈ ప్రకృతి మాయలో పడి నేనెవరిని? నేనెవరిని? అంటూ తపన పడుతుంటాడు. ఇదే భావాన్ని యయాతి పాత్రలో చూపించారు.

న త్వం యయాతిరితి మాంకథయతి చేత్ కోను వా
భవామ్యేషః (6 అంకము, 40 పుట)

యయాతి అనే జీవుడు వెళ్ళబోవు స్థానమును కవి వివరిస్తూ సర్వజీవులు పరబ్రహ్మలో లీనము కావలసినదే అను విషయమును సూచించారు.

సృష్ట్యాః యౌవనభావనాపరిణతక్రీడా చ దేద్యూత్యతే
యత్ర శ్రామ్యతి పంచభూతనిబిడం తీవ్రాణు సంస్పదనం
యత్ర స్వాదురసావతారధిషణా సంరుధ్య సంరుధ్య చ
బ్రహ్మణ్యేవ విలీయతేచ భగవన్ ప్రస్థాన మద్యావయోః.
(9 అంకము, 63 పుట)

విశ్వనాథ సత్యనారాయణగారు అలంకారాలను కూర్చటంలో ఒక ప్రత్యేకత గోచరిస్తుంది.

జగన్నేత కృష్ణః పరిహరతి చైతాన్ ప్రభుతయా
కులిందో వా ప్రోతాననభిమత తంతూనివ శుచః.
(గు పా. 5 అం. 45 పుట)

కృష్ణుడు దుఃఖములను తొలగించునని తెల్పుటేమొ కాని, నేతగాడు బట్టను నేయునపుడు ఇష్టములేని దారపుపోగులను తీసివేయును అన్న సాంఘిక విషయము అలంకారము ద్వారా వ్యక్తమైనది.

దుశ్శాసనుని రక్తపానమును చేసిన భీముడు—
రక్త ముఖ ఆంజనేయ ఇవ దృశ్యతే (8 అం, 65 పుట)

అని వర్ణించి ఆంజనేయుడు భీముడు ఇర్వురు వాయు పుత్రులే కదా సోదరులు ఒకేరూపున నుండుట, లేదా అగ్రజుని అడుగుజాడలలో అనుజుడు నడచుట - సాధారణమే అని సూచించిరి.

ఒక అలంకారముచే వ్యక్తికి సంభవించు అవస్థను వర్ణించుట నవీన విషయము. శుక్రుని శాపముచే యయాతికి వృద్ధత్వము ప్రాప్తించును. దానిని సూర్యాస్తమయానంతర స్థితిని వర్ణించుచు కవి సూచించెను.

ఇనః కమల పత్రకావలిత శేఖరే పర్యటన్
కరాన్ సముపసంహరన్ పటుజరోగ్రభావం గతః

... ..........................................................

దృష్టిర్మాంద్యముపాగతా శ్యామలీభూతా చదేహయష్టిః, స్పృశతా
అంధకారేణ వలిభ ఇవసంవృత్తోహం అహోనిరాకుర్వన్
అంధకారం వియతి సమాగచ్ఛతి వంశదీపః. (1 అంకము, 10 పుట)

సూర్యాస్తమయము, అంధకార వ్యాప్తి, చంద్రోదయము ఈ మూడింటి వర్ణనయే కదా అని అంటారేమో. "వలిభ ఇవ సంవృత్తోహం" ముడతలు పడిన చర్మముచే కప్పబడిన ముసలివానివలె, అంధకారముచే నేను ఆవరించబడితిని అనడంలోనే విశ్వనాథవారి ధ్వన్యర్థము గోచరమగుచున్నది.

చిత్రమిదం గురుతనయా హృదయే స్మిన్ రాజ్యభావమాత నుతే
అహహ! కథందైత్యసుతా హృత్పరమార్థం సమాలేభే........
యుగపద్దీప్త సూర్యచంద్రః శుక్లపక్ష దివాపరభాగ ఇవ
కల్పతే మమ హృదయాకాశః (4 అంకము, 26 పుట)

"దేవయాని రాజ్యభావమును - అనగా తనపై అధికారమును కల్గియున్న దన్న ఊహను జనింపచేయుచున్నది. కాని శర్మిష్ఠ నా మనసులోని పరమార్థమును—అనగా ఆనందభావమును విస్తరింపచేయుచున్నది" - అని యయాతి భావించుచు, తన హృదయాకాశమున సూర్య చంద్రులొక్కమారు ప్రకాశించారంటాడు. అంటే వారిర్వురు- దేవయాని రూపసూర్యబింబము వేడికి అనగా దుఃఖమునకు, శర్మిష్ఠ రూపచంద్రబింబము - శీతలత్వమునకు అనగా ఆహ్లాదకత్వమునకు ప్రతీకలు అని భావము. ఇంత చిన్న వాక్యంలో గొప్పభావాన్ని కూర్చడం విశ్వనాథకే చెల్లినది.

ప్రాణౌగృహీత్వా భృగు మౌళిపుత్రీం
తాముద్ధరావని భృత్ కృపాలుః
ప్రాణే గృహీత్వా వృషపర్వకన్యాం
త్వాముద్ధరావని భృత్తపస్వీ॥ (6 అంకము, 41 పుట).

ఇది అరుణవల్కలు శర్మిష్ఠతో అన్నమాట. దీనిని చదువగానే శబ్దాలంకార చమత్కారమున్నది అనిపించును కాని, దీని వెనక యయాతి మనోగతమైన భావన గోచరించును. యయాతి దేవయానిని చేతులు పట్టుకొని ఉద్ధరించినవాడు. ఎందుకు? దయకలవాడు కాబట్టి. అంటే దేవయాని ఎడ సామాన్యమైన

దయ - ఒక రాజునకు ఒక దీనునిపై లేదా దీనురాలిపై ఉండే దయ వంటిది - మరి శర్మిష్ఠను ప్రాణములను గ్రహించి ఉద్ధరించినాడు ఎందుకు? తపస్సు చేసినవాడు కాబట్టి. ఆమెఎడల తపన, దీక్ష కలదు కాబట్టి అతడు తపస్వి యైనాడు. లక్ష్యసిద్ధికి పాటుపడు సామాన్యుడు తపస్సుచేసి ఎట్లు తపస్సంపన్ను డగునో అట్లే శర్మిష్ఠ నుద్ధరించుటకు యయాతి అంత కఠోరమైన దీక్షను వహించి తపస్వియైనాడని కవి సూచించినారు

సత్యనారాయణగారు సందేశము నందించుటలోను సూక్తిముక్తాఫలముల నొసగుటలోను అందెవేసిన చేయి. కాన వారి సూక్తిమౌక్తికముల కొన్నిటి నేరు కొనుట ఉత్తమమేమొ?

## గుప్త పాశుపతము :

1. ఆకార సాదృశ్యేన కోహా స భవత్యాకార సదృశో మహాపురుషః
2. పాండిత్య వీరాణాం సుహృత్త్వాదికం ప్రయోగకాలే లుప్తం భవతి.
3. జీవిత రథస్య చక్రేద్వే శోకకోపౌ,
   ఆపన్న బహు వికారౌ తౌ రథం గమయతః
4. ఆశా బలవతీ సమాకర్షతి
5. స్ఫూర్తిర స్ఫూర్తిశ్చద్రై వాదీనాకృతీ, కర్మఫలానురూపేచ
6. ఉద్వేగః అనిశ్చిత వ్యాపారః
7. రాజా స్వతంత్ర ఇవ భాత్యపి నస్వతంత్రః
   జన్మాత్తబంధు జనధీ పరివృత్త చిత్తః
   తాభిః పరిస్థితిభి రర్గలితాత్మ వృత్తః
   శక్నోతినో కిమపి కర్తుమిహ స్వతంత్రమ్.

## అమృతశర్మిష్ఠము :

8. యచ్చ రహస్యం మధురం తృప్తిం నదదాతి హృదయబద్ధం చేత్
   మిత్రే నివేద్య హృదయం పరిలఘుభవతి చ స నిర్వాణమ్॥
9. కర్మద్విధా భవిష్యతి జీవః అత్ర విచిత్ర సంసారః
10. సాత్త్వికం భగవత్కృపయా లభతే
11. సత్కథా నామ మనః ప్రహ్లాదన హేతుః
12. దేవతానాం మనుష్యాణాం సమానాశ్చిత్త వృత్తయః
    అధికార వశాద్దేవాః సేవ్యంతే మానవైర్భృశమ్.

విశ్వనాథవారు సామాన్యులకే కాక కవులకు కూడ సందేశము నందించారు. అది శుక్రాచార్యుని ముఖతః - ఎట్టి లక్షణములు కల్గి ఉంటే కవీంద్రులౌతారో శ్లోకాన్ని పఠించండి తెలుస్తుంది:

మనసి విహరమాణాన్ సుష్ఠు సంగృహ్య భావాన్
మునిగత హృదయే స్వే సంచినోత్యాత్త తేజాః
హృదయకుహరమగ్నాః సంస్కృతీరున్నమయ్య
ప్రకట యతి కవీంద్రో మానసే స్ఫూర్జతీస్తాః (8 అంకము, 51 పుట)

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి రచనలు అన్నియు సముద్రములంత గంభీరములు. హిమాలయములంత ఉన్నతములు. వారు వెలయించిన సంస్కృత సాహిత్యాకాశమున గుప్తపాశుపతము, అమృతశర్మిష్ఠములను రెండు సంస్కృత నాటకములు సూర్యచంద్రుల వలె వెలుగుచుండును. గుప్తపాశుపతమునందు దుస్సహమైన ఉష్ణకిరణముల వంటి వారనేకులు గలరు కాన, అది సూర్యుని వంటిది. అమృతశర్మిష్ఠమున ఆహ్లాదకరమైన వెన్నెలను వెదజల్లు అమృతహృదయులున్నారు. కాన అది చంద్రుని వంటిది.

వారి రచనలను చదివి ''గుప్తసుధా స్వాదనము'' కావించుట అంత తేలికైన పనికాదు. వేయిపడగల స్వామిని వేయిపడగలందు చిత్రించి, విజ్ఞాన సరస్వతిని వివిధములైన రచనాప్రక్రియలలో విస్తరించి ప్రతిష్ఠించి, వెలుగొందిన శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారిని గూర్చి, వారి రచనా విశేషములను గురించి చెప్పుటకు వేయి పడగల స్వామియే సమర్థుడని నా అభిప్రాయము.

అమృత శర్మిష్ఠములోని భరత వాక్యము విశ్వనాథవారి ఆశయము. అది సదా సత్యమై వర్ధిల్లవలెనని సాహిత్యాభిమానులందరు కోరదగినది.

వాచోమహాకవీనాం జయంతు నితరాం భవంతు ఫలితార్థాః
వాగర్థమనోహృత్స్పృక్ వివర్ధతాం రసమయం చ మహః.

—ఉత్తముల మహిమ నీరుకొలది తామర సుమ్మీ— *

# విశ్వనాథ హాస్యం

—డా॥ వెలుదండ నిత్యానందరావు

విశ్వనాథవారి హాస్యం చక్కనిది. చిక్కనిది. అర్థవంతమైనది. స్ఫూర్తిమంతమైనది. పౌరుషవంతమైనది సుకుమారమైనది. గిల్లేది. గిలిగింతలు పెట్టేది. చురుక్కుమనిపించేది. చివుక్కుమనిపించేది. ఆధునిక నాగరకతలోని డొల్లతనాన్ని అవహేళన చేసేది. లోతులేని పాండిత్యాలను తూర్పారపట్టేది. తనను వెక్కిరింప ప్రయత్నించిన వారికి పెడసరంగా సమాధానమిచ్చి నోరు మూయించేది. నుడికారాలను వాచ్యార్థంలో ప్రయోగించి హాస్యసృష్టి చేసేది. తార్కిక దృష్టితో చర్చను సాగదీసి నవ్వించేది. పదాల విరుపులతో శ్లేషలతో వికటత్వాన్ని పండించేది. అమాయకత్వాన్ని, ప్రణయాన్ని విషాదాన్ని - ఒక్కటేమిటి, దేనిలో అవకాశం చిక్కితే దానిని ఆసరా చేసుకొని నవ్వుల పువ్వులను విరబూయించేది. సహృదయ పాఠక స్వాంతాలను సముల్లాసపరిచేది. సౌలభ్యం దృష్ట్యా కొన్ని భాగాలుగ విడదీసి చూపే ప్రయత్నం చేస్తాను.

## వర్ణనాత్మకహాస్యం :

విశ్వనాథ వర్ణించే విధానంలో హాస్యస్ఫోరకత ఉంటుంది. ఆ వర్ణన చదివితే ఎంతవాడైన పకాలున నవ్వుతాడు. ఉదా॥కు చూడండి. పంచతంత్రం వ్రాసి ప్రపంచ వాఙ్మయంలో పేరుపొందిన విష్ణుశర్మను 'విష్ణుశర్మ ఇంగ్లీషు చదువు' నవలలో ఎలా వర్ణిస్తాడో చూడండి. విష్ణుశర్మ వస్తున్నాడు. ఇదీ సన్నివేశం. 'ఎట్లా వస్తున్నాడో తెలుసునా! పెద్ద సంతర్పణలైతే గుండిగతో పులుసు కాస్తారనుకోండి, ఆ గుండిగంతా మసీ అవుతుంది. దాని రెండువైపులా పట్టుకొని అటూఇటూ తిప్పుతూ తోసుకువెళుతుంటారు. అట్లా వస్తున్నాడు.' ఈ రూపాన్ని కళ్ళముందు ప్రత్యక్షం చేసుకోవలసిందే తప్ప, మాటలతో చెప్పే పనికాదు. ఇంకోటి చూడండి: 'దమయంతి స్వయంవరం' నవలలో గుర్రపు బళ్ళను ఎలా వర్ణించాడో చూడండి. 'భారత యుద్ధంలో విరిగిపోయిన రథాలున్నవే - కురు

క్షేత్రంలో భూమి త్రవ్వి పరిశోధన చేస్తే బైటికి వచ్చిన చక్రాలు, పోలులూ వాటి నన్నింటినీ సంధానపరిచి చేసినట్లున్నై. వస్తుప్రదర్శనశాలలో పెట్టే బళ్ళే తప్ప అవి నడిచేవి కావు. పెట్టేవి కావు ఆ గుర్రాలు ఆ బళ్ళకీ సరిగ్గా తగినవి. అవి రామాయణ యుద్ధం నాటివి.' ఆ ఊళ్ళో తిరిగే గుర్రబ్బళ్ళు పాతవి అవడానికి భారత రామాయణాల కాలం నాటివని చమత్కరిస్తాడు.

## అజ్ఞాన ఖండనం :

కొన్ని సంప్రదాయ విశేషాలు, పదాలకు అర్థాలు ఇతరమైనవి ఎన్నెన్నో మనకు తెలియనివి ఉంటాయి. తెలియని వాటిని తెలిసినట్లుగా చెప్తే, తెలియకుండా అలవాటుగా ఆచరిస్తే తెలిసినవాళ్ళు గమనించి నవ్వుకుంటారు.

ఆంగ్లేయులకు మన సంప్రదాయాలు సరిగా తెలియవుగదా! పాపం, ఒకతను శ్రావణ శుక్రవారం సెలవిమ్మన్నాడు. ఫ్రైడే, సన్‌డే అంటే తప్ప శుక్రవారం ఆదివారం అంటే తెలియవుగా. అందునా శ్రావణ శుక్రవారం అంటే ఏమిటో దొరగారికి అసలే అర్థం కాలేదు. అతను ఎంతో సిన్సియర్‌గా శ్రావణ శుక్రవారానికి సెలవు నిరుడిచ్చామా అని సహాయకుని అడిగాడు. ఆ సహాయకుడు పక్కా భారతీయుడే అయివుంటాడు, ఆ భారతీయుడు ఎంతో నిబ్బరంగా శ్రావణ శుక్రవారం నిరుడు ఆదివారంనాడు వచ్చింది అని చెప్పాడట. ఈ హాస్యస్ఫోరక సంఘటనను విశ్వనాథ దమయంతీ స్వయంవరంలో పేర్కొన్నాడు.

వేయిపడగలులో స్నానం అని విద్యార్థిరాస్తే తప్పని కొట్టివేసి 'స్తానం' అని దిద్దుతాడు స్కూళ్ళ ఇన్‌స్పెక్టర్ రామేశ్వరం. అట్లాగే 'అన్నం' అనేమాట తెలుగా సంస్కృతమా అని సందేహం వచ్చిందట ఓ తెలుగు పంతులుకు. 'అదికూడా తెలియకుండా వాడు అన్నమెలా తింటున్నాడ్రా' అని విశ్వనాథ ఎదురు ప్రశ్నించారట.

## మనస్తత్వ ప్రదర్శకం :

ఉపాధ్యాయులు, డాక్టర్లు, ఇంజనీర్లు ఇలా ఒక్కో వర్గానికి తమ చదువు వల్ల, తాము చేసే పనివల్ల ఒక ప్రత్యేకమైన మనస్తత్వం ఏర్పడుతుంది. తెలుగు లెక్చరర్ల మనస్తత్వాన్ని విశ్వనాథ ఎంత హాస్యరసస్ఫోరకంగా వర్ణిస్తారో చూడండి:

'తెలుగు మాష్టర్లంటే వైదీకపు మూక అన్నమాట. వాళ్ళల్లో నియోగులుండవచ్చు. వెలమలుండవచ్చు. కమ్మవారుండవచ్చు. హరిజనులైనా కావచ్చు-వాడు తెలుగు మాష్టరయినాడా వైదికుడికిందే లెక్క. ఎందుచేతనంటే, వాడికి లజ్జాభిమానాలుండవు. పదిమంది కలిస్తే ఉండే పెద్దమనిషి తరహా వాడి దగ్గర తక్కువగా వుంటుంది. కారణమేమంటే, వాడు సారస్వతం చదవడం. అందునా మాతృభాషా సారస్వతం చదువుతాడు. ఒక విధమైన రసపిచ్చి వుంటుంది. వాడు జగత్కుటుంబి. వాళ్ళల్లో చాలామంది టెంక కట్టిన వాళ్ళుంటారు. వాళ్ళమాట అట్లా వుంచండి. మొత్తంమీద ఆంధ్రోపాధ్యాయుడంటే వైదీకులకింద లెక్క. వాడికి బెరుకు ఉండదు. చొరవ చేసుకొని అందరితో మాట్లాడుతాడు. ఎరుగనివాళ్ళు నలుగురు వుండి వాళ్ళల్లో వాళ్ళు మాట్లాడుకుంటూ వుంటే అందులోకి చొరబడతాడు. ప్రతివాళ్ళతో వరసలేర్పరుస్తాడు. సులభంగా అందరినీ నమ్ముతాడు. పాశ్చాత్యుల ఆచారాల్ని వెక్కిరిస్తాడు. అటువంటివాళ్ళను నిందిస్తాడు. ఎవరినీ విమర్శించేందుకు వెనక్కితియ్యడు. ఈ లక్షణాలన్నీ సామాన్యంగా వాళ్ళందరిలో వుంటాయి.' (బాణావతి.)

## ప్రణయసంజనితం:

ప్రణయాన్ని ఆలంబనగా, అంతర్వాహినిగా చేసి విశ్వనాథ రకరకాలైన హాస్యసృష్టి చేశాడు. వాటిలో అత్యంత సుకుమారమైనవి, మోటైనవి, ధ్వనిపూర్వకమైనవి, ప్రగల్భపూర్వకమైనవి, కాముకమైనవి అని ఎన్నో చెప్పుకోవచ్చు.

### ఎ. సుకుమారం :

భావకవులు సుకుమార ప్రణయానికి ప్రతీకలుగా నిలిచిన సంగతి అందరికీ తెలిసిందే. భావకవుల్లో ముఖ్యుడైన నాయని సుబ్బారావుగారు వేయిపడగల్లో కిరీటి అని అందరికీ తెలిసిందే. ధర్మారావుకు, కిరీటికి అవినాభావ సంబంధం. కిరీటి శశిరేఖా ప్రణయమత్తచిత్తుడై లోకంకానక తిరుగుతున్నవాడు. విలపిస్తున్నవాడు. కిరీటి ప్రణయప్రస్తావన వచ్చినచోటెల్లా విశ్వనాథ కలం మృద్వీకామృదువై పోతుంది. కిరీటి తన ప్రేయసికి జాబులు పంపుటెట్లా అని ఆత్రపడుతున్నాడు. అప్పుడు ధర్మారావు 'ఒక్క యేడాది యాగినచో ముందునాటికీ జాబులన్నియు నామె చెక్కిళ్ళమీదనే వ్రాయవచ్చును' అంటాడు. (వేయి పడగలు.)

బి. ధ్వనిపూర్వకం :

విద్యార్థులైన యువతీయువకు లిద్దరు అక్రమ మార్గాలు తొక్కుతున్నట్లు కళాశాల ప్రిన్సిపలు గమనించాడు. వారిరువురిని సక్రమపథంలో పెట్టదలిచాడు. ఏం చేశాడో గమనించండి:

తన గది నిద్దర చెరలో
నునిచెన యొక ప్రిన్సిపాలు యువతియు, యువకుం
డును కాలేజి చదువరు
ల నీతివర్తనము తెలిసి యది శిక్షింపన్. (పంచశతి)

ఆ ప్రేమ జంటను తన గదిలో పెట్టి బంధించి వెళ్ళిపోయాడు ఆ అమాయక కళాశాలాధ్యక్షుడు. అది వారికి శాపమే అయిందో వరమే అయిందో మీ ఊహకే వదిలి పెడుతున్నాను. అట్లాగే ఇంకో పద్యం వ్యాఖ్యా నిరపేక్షకంగా వినిపించి వదిలేస్తాను.

అతని భార్య పుట్టింటికి నరిగె - వాడు
వంటచేసికొంచుండె తా నొంటరిగను
అంత నేపున్నదే 'కూరలమ్మి' లోన
నెన్ని కూరలు కొన్నాడొ యేమొ కాని

సి. ప్రణయ ప్రాగల్భ్యం :

కల్పవృక్షంలో సీతారాముల ప్రణయ విహారాలు, లీలా విన్యాసాలు మనోహరాలు, పునఃపునఃస్మరణీయాలు. శ్రీరామచంద్రుడు తన ధర్మపత్నితో మేల మాడుతున్న పద్యద్వయం ప్రసిద్ధమే.

కోకిల దూరాన గూసిన నీవటే
    నన్ను బిల్చితి వంచు నవ్వు సామి
తుమ్మెద గూటిలో ఝుమ్మన నిదియే ర
    హస్య మూదునొయంచు నాడు సామి
గృహ శిఖావళము తీర్చిన పింఛమును నీదు
    కైశికచ్ఛవి నెరుంగ దను సామి
పెంపుడు లేడి ద్వారంపు కోసల జూడ
    నవనిజాక్షుల బొల్చియాడు సామి

సీత చెరగు గాలిచే చిందులాడిన
దాని నిగుడు వాలులోన నిలచి
పడవలోన నేను పయనించుచుంటి నం
చేలొ భయము నభినయించు సామి

తన పాద మామె పాదము జతగా బెట్టి
మస్మత్పదంబు మోటని వచించు
తన హస్త మామె హస్తముతోన జతచేసి
ముదురాకు చివురాకు పదనులనుచు
ఆమె ప్రక్కన నిల్చి యానుకొమ్మని నన్ను
విడిపోకువే యని విరిసిపోవు
చెక్కిలి చెక్కిలి చేర్చి యాప్రాతస్సు
లేవొ రహస్యంబు లెత్తిపోయు. (కళ్యాణ ఖండం)

అర్థతాత్పర్యాలు వివరించ పనిలేదు. వారి ప్రణయ పరిహాసం సుస్పష్టం. తాను సంతోషపడుతూ సీతమ్మను సంతోషపరుస్తున్నాడు శ్రీరాముడు. ఈ రెండు పద్యాలలోని హాస్య పరిమళం పఠితల హృదయాలను మత్తెక్కించడమే కాక వారిని కూడ భాగస్వాములను చేసి తమ జీవితాల్లోని ప్రణయ పరిహాస ఘటనలను స్మృతిపథంలోకి తెచ్చుకొనేలా చేస్తుంది. ఇక్కడ విశ్వనాథ ఒక అహ్లాదకరమైన ఔచిత్యాన్ని నిబంధించాడు. మామూలు భాషలో చెప్పాలంటే ఈ రెండు పద్యాలు విశ్వనాథ 'కాపీ' (copy) కొట్టిన పద్యాలు. వీటికి మూలపద్యాలు కల్పవృక్షంలోనే మేనకా విశ్వామిత్రుల ఘట్టంలో ఉన్నాయి. అక్కడ విశ్వామిత్రుడు తన ఇష్టసఖిని అలరిస్తున్న విధం గమనించండి:

కోకిల కొమ్మలో కూసిన నీవటే
నన్ను బిల్చితివంచు నవ్వు మౌని
తుమ్మెద పొదలోన ఝుమ్మన నిదియేమి
మణితమే యనిమేల మాడు మౌని
వన శిఖావళము విప్పిన పింఛమును, తడి
తుడుతునే యని కొప్పు విడుచు మౌని
యిట్టి ముంగిట నిల్వ, నేమి చూపులె యంచు
నతివకన్నులు ముద్దులాడు మౌని

...................

తన పాదమామె పాదము జతగా బెట్టి
యస్మత్పదంబు మోటనివచించు
తన హస్త మామె హస్తము మీద బోర్లించి
నీ చేయి లేదని నిహ్నవించు
నామె ప్రక్కగ నిల్చి యగు నా బుజముదాక
వచ్చితివే యని పలవరించు
చెక్కిలి చెక్కిలి చేర్చి గడ్డము గ్రుచ్చు
కొన్నదా యని గ్రుచ్చి గ్రుచ్చి యడుగు. (ధనుఃఖండం)

కొద్ది కొద్ది మార్పులతో ఇంచుమించు యథాతథంగా ఎత్తి వ్రాసిన పద్యాలేనని రెంటిని చూడగానే తెలిసిపోతుంది. ఎందుకలా రాసినట్లు? ఓపిక పోయిందా కవిగారికి. కాదు, ఈ శృంగారం, అనునయం, ప్రణయపూర్వక పరిహాసాలు- ఇవన్నీ కొత్తవి కాదు. సృష్ట్యాది నుండి జీవులకు అనుస్యూతంగా వస్తున్నవే. కానీ ఎవరికి వారే కొత్తగా కనుక్కున్నట్లుగా వ్యవహరించడం, అపూర్వమైన అనుభూతిని పొందడం అనేది అనుభవంలోని విషయం. 'చేసిన సంసారమే చేయుచున్నది తనదైన అనుభూతి తనది గాన' అన్నదానికి నిదర్శనంగా పూర్వతరంలోని మేనకా విశ్వామిత్రుల హాస్యమిశ్రిత శృంగార సన్నివేశాన్ని అర్వాచీనతరమైన సీతారాముల శృంగార సన్నివేశంలో పొందుపరిచి గొప్ప ఔచిత్యాన్ని సాధించాడు. ఆ రెండుతరాలకే కాక నిన్నటితరమైన మన తల్లిదండ్రులకు నేటితరమైన మనకు రేపటితరమైన మన వారసులకు కూడ వర్తించే సార్వజనీనమైన పద్యద్వయం ఇది.

శ్రీరామచంద్రమూర్తి చేసే చిత్ర విచిత్ర శృంగార చేష్టలకు ఆడేమాటలకు తనువెల్ల వసంతమైపోయిన మురిసిపోయిన ముద్దరాలు ఆ సీతా సాధ్వి అమాయకంగానో గడుసు తనంతోనో ఇలా ప్రశ్నించింది.

శ్రీ మనోనాథు లీలా విశేషమరసి
సీత యో స్వామి! యెందు నేర్చితని యడుగ

ఇలా జానకి అడిగితే ఒక నవ్వు నవ్వి మరో శృంగార చేష్టచేసి పులకింప చేయాల్సిన సన్నివేశంలో ఆ శ్రీరామచంద్రమూర్తి ఇచ్చిన సమాధానంలోని ప్రణయ ప్రాగల్భ్యాన్ని గుర్తించి హర్షించండి:

నేను నేర్చిన దేమున్నదే? నతాంగి
కౌశికుండుపదేష్టయు గాని యనును.

'బల' 'అతిబల' ఇత్యాది మంత్రాలతోపాటు శస్త్రాస్త్ర ప్రయోగ కౌశల్యంతో పాటు విశ్వామిత్రుడు వాత్స్యాయన కామ సూత్రాలు సైతం శిష్యుడికి నేర్పాడనడం హాస్యరసోదంచితం. పాఠకుల అధరాల మీద ముసిముసి నవ్వులు దోబూచులాడతాయి. పైగా మేనకా విశ్వామిత్రుల ప్రణయఘట్టంలోని పద్యాలనే సీతారాముల ప్రణయంలోను విశ్వనాథ వాడడం వల్ల సీతారాముల ప్రశ్నోత్తరాలకు సమర్థన లభించినట్లయింది.

## వేళాకోళాలు :

సమాన స్థాయిలో ఉండే మిత్రులు, బంధువులు వేసుకొనే జోకులకు, చేసుకొనే వేళాకోళాలకు, విసురుకొనే ఛలోక్తులకు అంతుండదు. విశ్వనాథ రచనల్లో ఎన్నోచోట్ల ఇట్లాంటివి మనకు తగుల్తాయి.

'వేయిపడగలు'లో - సుబ్బన్న పేటలో చాల ఏళ్ళ తర్వాత రకరకాల కష్టాలు కడగండ్లు అనుభవించిన బాల్య స్నేహితులందరూ ఒకసారి కలుసుకొంటారు. కిరీటి ధర్మారావును చూసిన వెంటనే బిగ్గరగా కౌగిలించుకొంటాడు. ఇది ఆత్మీయమైన హృద్యమైన సన్నివేశం, అప్పుడు ఇంకోమిత్రుడు ధర్మారావును వెనుకకు లాగి' 'చాలులే! ఎవరైన చూచిన అన్నదమ్ములనుకొనరు. భార్యాభర్తలనుకొందు'రని ఛలోక్తి విసరుతాడు. ఆ సమయంలో ఆక్కడున్న మిత్రులతోపాటు వారి పత్నులతోపాటు మనంకూడ నవ్వుతాం

'వేయిపడగలు'లో తెలుగునాటకం వేస్తూ గ్రీసుదేవత బొమ్మను తెరపై ఎందుకు చూపాలి? ఏ లక్ష్మిదో సరస్వతిదో చూపవచ్చు కదా అని ధర్మారావు విమర్శిస్తాడు. సూర్యపతి 'అవునయ్యా! వారికి తోచదు. నీవు పోయి వారితో చెప్పరాదా?' అంటాడు. అప్పుడు రాఘవరావు 'మూర్ఖులకు చెప్పుటకు మూర్ఖులే కావలయును. నీవు వెళ్ళుము' అంటాడు. దాంతో ముగ్గురు నవ్వుకొంటారు.

బాణావతి నవలలో ముగ్గురు తెలుగు లెక్చరర్లు మాట్లాడుకొంటున్న సందర్భంలో విసురుకున్న ఛలోక్తులు చూడండి. ఈ ముగ్గురు తెలుగు లెక్చరర్లు ఎవరంటే.విజయవాడలోని ఒక కళాశాలలో పనిచేసిన విశ్వనాథ, ధూళిపాళ శ్రీరామమూర్తిగారు, పేరాల భరతశర్మగారు కావచ్చు.మరింకెవరైనా కావచ్చు.

సాయంత్రం ఓ లెక్చరర్ ఇంట్లో అందరూ చేరారు ఆ లెక్చరర్ మర్యాదకోసం కాఫీ టిఫిన్లు సరఫరా చేయకతప్పదు కదా! గారెలు చేయాలని ప్రతిపాదన. ఇదీ సన్నివేశం.

'విశ్వనాథ (నేను) : గారెల్లో ఏమి వేయిద్దామా అని ఆలోచిస్తున్నాను.

మూర్తి : ఏమి వేయించినాసరే బాబా! సైనైడు మాత్రం వేయించకు.

రావు : నిజంగానే వేయించకండి మమ్మల్ని ఎట్లాగో ఒక లాగు తీసి కెళ్ళి పారవేసినా ఈ ఘటాన్ని తీసుకెళ్ళి పారవేయడం కష్టం. అందర్నీ నలుగురు మోస్తే సరిపోతుంది. ఇతన్ని అడగడుక్కూ భుజాలు మార్చుకుంటూ ఎనమండుగురు మోయాలి.

ఇక్కడ మూర్తి ఛలోక్తిగా సైనేడు ప్రస్తావన తీసుకొని వస్తే రావు దానిని మూర్తి స్థూలకాయానికి అన్వయించి గేలి చేశాడు.'బాణావతి' లోనే ఇంకో చోట: ఈ మూర్తిది కాస్త పిసినారి స్వభావం. అతనికి కొంత ముదనష్టం ఆస్తి కూడ కలిసివచ్చింది. మూర్తి వ్యవసాయం చేయిస్తాడని ప్రస్తావన వస్తుంది.

గుప్త : మావాడు వ్యవసాయం చేస్తేగా. అంతా పాలికే ఇస్తాడు. అతను చేసే వ్యవసాయమంతా ఇంటిదగ్గరే.

రావు : ఇది తెగపంట. ఆరుగురు కొడుకులూ, అయిదుగురు కూతుళ్ళూ. మళ్ళీకోత కావాలనుకుంటూ అని మూర్తిని వారి మిత్రులు ఆట పట్టిస్తుంటే మనకు నవ్వు రాకమానదు ఆ బాణావతిలోనే ఇంకోటి:

'పిశాచాలు వుంటే నాకు కనిపించవేం?' అని పంతులు సందేహం వెలిబుచ్చుతాడు. అప్పుడు రావు 'పిశాచాలకు పిశాచాలు కనిపించవు. పొరపాటు, పొరపాటు, కనిపిస్తాయి. ప్రిన్సిపాలుకు నీవూ, నీకు ప్రిన్సిపాలూ కనిపిస్తున్నారుగా' అని రావును సరదాగా పిశాచాన్ని చేసి ప్రిన్సిపలు మీద ఉన్న తన కసి అంతా తీర్చుకొంటాడు.

'విష్ణుశర్మ ఇంగ్లీషు చదువు'లో క్రోత కథ చెప్పమంటాడు. రచయిత 'తలనొప్పి వస్తే! అంటే 'రాదులే' వినిపించు అంటాడు. 'కొంపతీసి తల ఇంటి దగ్గర పెట్టి వచ్చావేమిటి? ఎప్పుడు వచ్చినా అట్లాగే వస్తావు. అసలు నీకు తలున్నదో లేదో అనేటట్లుగా వస్తా' వని విశ్వనాథ ఆట పట్టిస్తాడు.

**శాబ్దిక హాస్యం :**

సామ్యంతో నూతన శబ్దాలనుతమాషాగా పుట్టిస్తూ నుడికారాలకు వాచ్యార్థం కల్పిస్తూ శ్లేషను ఉపయోగిస్తూ, పదాలను విచిత్రంగాకూరుస్తూ మారుస్తూ మనోహరార్థ కల్పనం గావించి విశ్వనాథ అలరిస్తాడు.

'విష్ణుశర్మ ఇంగ్లీషు చదువు' నవలలో వేమన గొప్పతనాన్ని వర్ణిస్తూ 'ఆటవెలది ఆయన చేతిలో ఉందంటాడు.' అంటే ఆటవెలది ఛందస్సు వేమనకు వశమైందని ఉద్దేశం. దానికి తిక్కన 'ఔనయ్యా అందుకనే ఆయన యోగి అయినాడు. నువ్వు కూడా ఒక ఆటవెలదిని పట్టుకో. నువ్వు కూడా యోగివవుతావు' అని శ్లేషలో జవాబిస్తాడు.

తిండి లేనట్టివారికి తిండి ఇడడు
తిండి కలవారి దగ్గర తీయుపన్ను
ఉర్విపతి కంటె దంత వైద్యుండు నయము
పన్ను కట్టును లేనట్టివాడు చనిన.

పన్నులాగే ప్రభుత్వంకన్నా పన్నుకట్టే వైద్యుడు మేలని శ్లేషమూలకంగా విశ్వనాథ చమత్కరిస్తాడు.

ఇద్దరున్న సందర్భంలో ఉభయులు అనడం ఉంది. మరి ముగ్గురమున్నప్పుడే మనాలి? 'త్రిభయులు' అనాలని నూతన పదకల్పనం చేసి విశ్వనాథ నవ్విస్తాడు.

వేయిపడగలులో పశుపతి కాలు బురదలో దిగబడుతుంది. వెంటనే ధర్మారావు అది పప్పుకా'దని ఎకసెక్కమాడుతాడు. పప్పులో కాలు వేశాడన్న నుడికారాన్ని వాచ్యార్థంలో ప్రయోగించడమన్నమాట. అట్లాగే 'వంట చేయగలడు' అనే భావంలో 'చెయి కాల్చుకోవడం' అనే పదబంధం వాడడం ప్రసిద్ధం. విష్ణుశర్మను 'మీరు చెయ్యి కాల్చుకోగలరా?' అని ప్రశ్నిస్తే విష్ణుశర్మ, 'ఒక్క చెయ్యేమిటయ్యా! కావలిస్తే ఒళ్ళంతా కాల్చుకుంటా'నంటాడు.

ఆంగ్లభాషను గూర్చి మాట్లాడుతూ— ఆ భాష బలే భాషలే. నాకు యెవడో చెప్పాడు దేవుడూ కుక్కా ఒకటే అట. కుక్కని తలక్రిందులుగా నిలుచోబెడితే దేవుడౌతాడట .... అంటే DOG ని తారుమారుచేస్తే GOD గా మారుతుందన్నమాట. అదీ సంగతి.

ఓ 'జాయింట్ కలెక్టర్' ముఖ్య అతిథిగా వచ్చిన సభలో ప్రసంగిస్తూ విశ్వనాథ ఇతని ఉద్యోగంలోని జాయింటు ఊడిపోవాలన్నాడట. అది ఆశీర్వాదమా? అభిశంసనమా? ఒక్క్షణం ఎవరికీ అర్థం కాలేదు. వెంటనే తెప్పరిల్లి జాయింట్ కలెక్టర్‌లోని 'జాయింట్' పోతే కలెక్టర్ అవుతారని అర్థం చేసుకొని సభ కరతాళ ధ్వనులతో మోగిపోయింది. ఆ జాయింట్ కలెక్టర్ హృదయం ఉప్పొంగిపోయింది.

ఆచార్య గంటి జోగి సోమయాజిగారి 'ఆంధ్రభాషా వికాసాన్ని' ఆంధ్ర భాషా వికారమని విశ్వనాథ చమత్కరించినట్లు చెప్తుంటారు.

## అధిక్షేపం :

విషయాన్ని నర్మగర్భంగా సున్నితంగా తిరస్కరించడం అధిక్షేపాత్మక హాస్యం. ప్రభుత్వ వ్యవస్థ, ఉద్యోగస్థుల తీరుతెన్నులు, బాధ్యతారాహిత్యం మొ॥ వాటిని ఎంతో గడుసుగా దమయంతీ స్వయంవరం, బాణావతి లాంటి నవలల్లో విశ్వనాథ అధిక్షేపించాడు.

ఖద్దరుచొక్కా ఉత్తరీయం ధరించి రోడ్లమీదపడే రాజకీయ నాయకుని ఎలా అధిక్షేపిస్తాడో చూడండి. ''మన కుప్పడు అంచు ఉత్తరీయం వెనుక యెంత పలుకుబడివుందో యెవడికి తెలుసు? ఆ పలుకుబడి అంతా కనబడదుగా! మడతల్లో పెట్టి చాకలివాడు ఇస్త్రీ చేశాడు దాన్ని. ఆ పలుకుబడి ఎప్పుడూబైటికి రాదు. పైయంచు మాసినాసరే. పలుకుబడి బైటపడ్డానికి వీలులేదు. ఇంతకూ అది గోప్యమైన విషయం. బైటికితీస్తే యేముంది? ఏమీ లేదుగదా! అంతా గుంభన అన్నమాట."

రాజకీయ నాయకుని సాధారణ వేషం ఖద్దరు చొక్కా, వంటిమీద కండువా. తరం మారాక వేషంకూడా మారిందనడం వేరే సంగతి. కండువా మడతల్లో ఆయన పలుకుబడి ఉందనడానికి చాకలి ఇస్త్రీ చేయడానికి ఏమీ సంబంధం లేదు. కాని సంబంధాన్ని కూర్చడం; ఇంతా చేస్తే ఏ కీర్తి లేదని హేళన చేయడం విశ్వనాథ చూపిన చమత్కారం.

ఓట్లకై డబ్బు ఖర్చుపెట్టడాన్ని అధిక్షేపిస్తూ విశ్వనాథ ఒక దయ్యానికి ఎలా ముడిపెట్టాడో చూడండి. బాణావతి నవలలో ఓ దయ్యం ఓ యువకుని తనను పెళ్ళాడితే కావలసినంత డబ్బు ఇస్తానంటుంది. ఇదీ సన్నివేశం. 'ఆ గదిలో నోట్లు చూదావే, అవన్నీ నీకు ఇస్తాను. నీ ఎదుట నిలిచేవాడు లేడు. నీవు ఎన్నికలకు నిల్చుంటే నీవు గెలిచితీరుతావు. నీకు డబ్బుకు కొరత ఉండదు. నీవు కోరితే భారతదేశానికి ప్రధానమంత్రి వవుతావు. ఓటుకు లక్ష రూపాయలియ్యి. రెండు లక్షలియ్యి. నీ సొమ్మేం పోయింది?' పిశాచం ప్రేమకథ నెపంతో రాజకీయాల్లో ధనప్రభావాన్ని గర్హించడమే విశ్వనాథ ఇక్కడ చేసిన పని అని వేరేగా చెప్పవలసిన పనిలేదు.

ఈ విధంగా విశ్వనాథ లేఖిని హాస్యం ఎన్ని రకాలుగా పండించడానికి వీలవుతుందో అన్ని రకాలుగా పండించి పఠితలను అలరిస్తుంది. పరిమితమైన శ్రమతో, పరిమితమైన సమయంలో చేస్తున్న పరిమితమైన ప్రయత్నమే ఈ వ్యాసం. ఈ అంశంపై ప్రత్యేకించి ఎవరైనా పరిశోధన చేస్తే ఉత్తమ గ్రంథాన్ని వెలువరించగలరన్న విశ్వాసం నాకుంది. రాబోయే పరిశోధకులకు ఏమాత్రం ప్రేరణ కలిగించినా నా యత్నం సఫలమైనట్లే. *

"తెలుగుదేశాన యువకులు త్రిదశులైరి
మొట్టమొదట శాస్త్రపురాణముల నిరసన
పైన దేవుడు లేడన్న పట్టుదలయు
సూటిగా చిట్టచివరకు సోషలిజము."

"రాజకీయజ్ఞు లెల్ల సారస్వతమ్ము
కూడఁ దమరె యెఱింగిన గొప్పవోవ
నంద రెఱిఁగిన రాజకీయమ్ములకట!
ఒక్క కవులే యెఱుంగరా యుర్వియందు"

—విశ్వనాథ

# విశ్వనాథ కవిత – జానపదమూలాలు

—డాక్టర్ తంగిరాల వెంకటసుబ్బారావు

## జానపద విజ్ఞానం :

'జనపదం' అంటే పల్లెటూరు. జనపదంలో ఉండేవారు 'జానపదులు.' ఈ జానపదులకు సంబంధించిన సమస్త విషయాలనూ 'జానపద విజ్ఞానం' (Folklore) అంటారు. వ్రాతకోతలు లేకుండా, నోటిమాటలుగా కాని, అనుకరణవల్ల కాని, ఒక తరాన్నుండి మరొక తరానికి వ్యాపించే సమస్త విజ్ఞానమూ జానపద విజ్ఞానమే. దీనికి ఇంత విస్తృత పరిధి ఉంది కాబట్టే కొందరు దీనిని 'జానపద జీవితం' (Folk life) అనీ 'జానపద సంస్కృతి' (Folk Culture) అనీ కూడా పిలుస్తారు. దీనినే 'గ్రామీణ సంస్కృతి' (Village Culture) అని అన్నా తప్పులేదు.

జానపద విజ్ఞానంలో నాలుగు ప్రధాన శాఖలు ఉంటాయి : (1) మౌఖిక జానపద విజ్ఞానం (Oral Folklore), (2) సాంఘిక జానపద ఆచారాలు (Social Folk Customs), (3) భౌతిక సంస్కృతి (Material Culture), (4) ప్రాయోగిక జానపద కళలు (Performing Folk Arts), జానపద విజ్ఞానంలోని ఈ అన్ని శాఖల వర్ణనా విశ్వనాథ సాహిత్యంలో కనబడుతుంది.

మౌఖిక జానపద విజ్ఞానంలో 'జానపద సాహిత్యం', 'జానవద భాష' అనే రెండు అంతశ్శాఖలున్నాయి జానపదగేయాలు (Folk Songs), జానపద గేయ కథలు (Narrative Folk Songs or Ballods), పురాగాథలు (Myths), ఐతిహాసాలు (Legends), జానపద కథలు (Folk Tales), సామెతలు, పొడుపుకథలు- ఇవన్నీ కలిసి జానవద సాహిత్యం అవుతాలు. గ్రామ నామాలు, వ్యక్తి నామాలు, మాండలిక భేదాలు, తిట్లు, ఒట్లు, దీవెనలు, జాతీయాలు, నుడికారాలు, నానుళ్ళు (Idioms), పలుకుబడులు, పదప్రయోగాలు (usages) మొదలైనవి జానపద భాషకు చెందుతాయి.

## విశ్వనాథ రచించిన జానపద గేయం :

కావ్యంలో మూడు అంశాలు ఉంటాయి: ఇతివృత్తం, ఛందస్సు, భాష. విశ్వనాథ సత్యనారాయణగారి కవిత్వంలో ఈ మూడు అంశాలమీదా జానపద విజ్ఞాన ప్రభావం ఉంది ఆయన రచించిన కావ్యఖండికలు, ఖండకావ్యాలు, లఘుకావ్యాలు, మహాకావ్యమైన రామాయణ కల్పవృక్షం - ఈ అన్ని కవితా శాఖల పైనా జానపద విజ్ఞాన ప్రభావం బలంగా కనబడుతుంది. 1925 మార్చి 'భారతి' పత్రికలో 'బావకత్తె' అనే జానపద గేయం వ్రాశారు. ఇందులో ఒక జానపద యువతి వర్ణన, జానపద భాషలోనే చేశారు.

"మొల్లపూలంటేను - ముడుసుకుపోతావు
బంతిపూవులంటేను - గంతేసివత్తావు!
ఎంత సోకులాడివే - నీ కాడ - ఎంత భావమున్నదే!

సన్నీల్లు నామీద - సల్లి నవ్వితావు
సీరకొంగట్టితే - నిర్రుబుస్సంటావు
ఎంత టక్కులాడివే - నీ కాడ - ఎంత భావమున్నదే!

సామి వోరకి దణ్ణం - సాస్తూ, నాయంకేసి
సూత్తూ నవ్వుల కళ్ళు - సుళ్ళు తిప్పేస్తావు
ఎంత వింతకత్తెవే - నీ కాడ - ఎంత భావమున్నదే!

నిద్దట్లో నాకేసి - నిలిసి సూత్తుంటావు
దొంగనిద్దుర తెలిసి - నన్ను దూశిత్తావు
ఎంత చాటుకత్తెవే - నీ కాడ - ఎంత భావమున్నదే!

ఈతముల్లూ యిరిగి - యింత నడపనీక
కాలు వాసిందంటె - కంట నీరెట్టావు
ఎంత యింటిదానవే - నీ కాడ - ఎంత భావమున్నదే!

కన్నుల్లో కన్నుంచి - కదలించి యేస్తావు
నన్ను ముంచేత్తావు - నన్ను తేలుత్తావు
నీవు నాకు రాణివే! నినుగూడి
నిలువు నీరయిపోతినే!

ఇది అచ్చంగా నండూరివారి నాయుడుబావ యెంకితో చెపుతున్నట్టే ఉంది- ఈ కవిత జానపద గేయాల ప్రభావంతో వ్రాసిన కవి. ఇందులో భాష, ఛందస్సు, భావం మూడూ జానపదమే.

## విశ్వనాథలో జానపద సంస్కృతి :

పై విధంగా జానపద గృహిణీవర్ణనే కాకుండా 'భ్రష్టయోగి' అనే కావ్య ఖండికల సంపుటిలో ఏఱువాక పండుగ వర్ణన ఉంది. కిన్నెరసాని పాటలకు గ్రామీణ కుటుంబాలలో తరచుగా ప్రత్యక్షమయ్యే అత్తాకోడళ్ళ పోట్లాటను మూలంగా చేసుకున్నారు విశ్వనాథ. 'ఋతుసంహారము' లేక 'తెలుగు ఋతువులు' అనే ఖండకావ్యంలో తెలుగు గ్రామీణ ప్రకృతి, తెలుగు సంస్కృతి, తెలుగుదనం-కళ్ళకు కట్టినట్టు వర్ణించారు. 'ధర్మాంగద చరిత్ర' అనే పాము పాట స్త్రీల ప్రసిద్ధ కథాగేయం. దీనిని విశ్వనాథవారు 'పాముపాట' అనే పేరుతో సంగీతరూపకంగా వ్రాశారు. పల్నాటి వీరచరిత్ర ఆంధ్రుల ప్రసిద్ధ వీరగాథా చక్రం (Ballod - Cycle), లేక జానపదేతిహాసం (Folk epic). దీంట్లో అలరాజు దుర్మరణానికి నాయకురాలు నిమిత్త మాత్రురాలనీ, అసలు కారకుడు బ్రహ్మనాయడే అనీ, దీనికి కారణం అలరాజు తనకంఠెను తన అన్న పెద్దన్న బాదరాజు కంఠెను బలవంతుడవ గ్రహించడమే అనీ తెలియజేసే ఒక అతి ముఖ్యమైన కీలకమైన అంశాన్ని గ్రహించి విశ్వనాథవారు 'చంద్రవంక యుద్ధము' అనే కావ్యఖండికను వ్రాశారు. ఇది 'ఆంధ్ర ప్రశస్తి' అనే ఖండ కావ్యంలో ఉంది. రామాయణ కల్పవృక్షంలో అనేకములైన అవాల్మీకాంశాలు విశ్వనాథవారు ప్రవేశపెట్టారు. వీటిలో చాలా అంశాలకు జానపద సాహిత్యము, జానపద ఆచార వ్యవహారాలు మూలాలు. ఇవన్నీ వస్తువుకు సంబంధించిన జానపద మూలాలు.

జానపద గేయం వ్రాయడం, 'కిన్నెరసాని పాటలు,' 'పాము పాట' అనే గేయకావ్యాలు వ్రాయడం, దేశిచ్ఛందస్సులు, మధ్యాక్కరలు, వీరగాథల ఛందస్సులైన ద్విపద, మంజరీద్విపదలు - తన రామాయణ కల్పవృక్షం వంటి మహాకావ్యంలో కూడా ప్రవేశపెట్టడం - ఇవి ఛందస్సులో విశ్వనాథవారిపై గల జానపద ప్రభావం. అడుగడుగునా తెలుగు సామెతలు, జాతీయాలు, పలుకుబళ్ళు గుప్పిస్తూ రచన చేయడం, నాటకీయశైలితో కూడి, తెలుగుదనం ఉట్టిపడే వాక్య విన్యాసం, గ్రామీణ భాషా ప్రయోగం ఇత్యాదులు భాషా విషయంలో విశ్వనాథపై గల జానపద ప్రభావాన్ని తెలియజేస్తాయి.

విశ్వనాథ సాహిత్య సృష్టికి నేపథ్యం భారతీయ సంస్కృతి మరియు ఆంధ్ర సంస్కృతి. ఒక నాగరక జాతిలో రెండు రకాల సంస్కృతులు

ఉంటాయి: శిష్ట సంస్కృతి మరియు జానపద సంస్కృతి. వీటిలో జానపద సంస్కృతి మిక్కిలి ప్రధానమైనది. ముఖ్యంగా మనది వ్యావసాయిక దేశం కాబట్టి మన సంస్కృతిలో ఎక్కువ భాగం జానపద సంస్కృతే ఉంటుంది. విశ్వనాథ పుట్టి పెరిగింది గ్రామ సీమల్లోనే అందువల్ల గ్రామీణ సంస్కృతి ప్రభావంతోనే ఆయన ఎక్కువ రచనలు చేశారు. తెలుగు ప్రజలు, వారి ఆచారవ్యవహారాలు, వారి జీవన విధానం, వారి ధర్మనిష్ఠ, వారి చరిత్ర విశ్వనాథ సాహిత్యానికి వెన్నెముక. ఆయన ఎంత పండితుడైనా, ఎంత ప్రయత్నపూర్వక సాహిత్య శిల్పి అయినా, ఆయనలో సహజంగా ఉండేది, అప్రయత్నంగా బయటపడేది జానపద సంస్కృతి మాత్రమే. విశ్వనాథవారి పద్య సాహిత్యాన్ని పరిశీలించినా, గద్య సాహిత్యాన్ని పరిశీలించినా ఈ విషయం స్పష్టమవుతుంది.

## విశ్వనాథవారి తెలుగుదనం :

విశ్వనాథ మూర్తీభవించిన ఆంధ్రత్వం; అంటే ఆంధ్ర గ్రామీణ సంస్కృతిని ప్రతిబింబించేవాడు అని అర్థం తెలుగుదనాన్ని ప్రదర్శించడం కోసమే ఆయన కొన్ని రచనలు చేశారు. 'ఆంధ్ర పౌరుషము', 'ఆంధ్ర ప్రశస్తి' 'ఋతు సంహారము' లేక 'తెలుగు ఋతువులు', 'కిన్నెరసాని పాటలు', 'కోకిలమ్మ పెండ్లి' మొదలైనవి దీనికి ఉదాహరణాలు.

విశ్వనాథ సాహిత్య మేరువుకు రెండు సువర్ణ శిఖరాలున్నాయి. వచనంలో 'వేయి పడగలు', కవిత్వంలో 'కల్పవృక్షము.' ఈ రెండింటిలోనూ 'తెలుగుదనా'న్ని, లేక 'తెలుగు జానపద సంస్కృతి'ని పుష్కలంగా ప్రదర్శించారు విశ్వనాథ. ''నాది తెలుగు రామాయణం'' అని అందుకే అన్నారు. తన 'కల్పవృక్ష రహస్యము' అనే గ్రంథంలో ఇలా అంటారు విశ్వనాథ: ''ఈ గ్రంథమంతటను ప్రధానముగా తెలుగు జీవితము, తెలుగుల యాచారములు నుండును. అన్ని పాత్రలు తెలుగువారివలె నటింతురు" (పుట 43). బాలకాండ ఇష్టిఖండంలో తెలుగువారి ఇండ్లలోని ప్రేమలు, తల్లిదండ్రులు - పిల్లలు; వీరి మధ్య అనురాగాలు వాత్సల్యాలు, బంధువులు బండ్లలో ప్రయాణం చేయడం, ఆడబడుచు పుట్టింటికి రావడం, ముచ్చట్లు, తెలుగు సంవత్సరాది పండుగ వర్ణన - ఇత్యాది వర్ణనలు అయోధ్యానగర వర్ణనలో, రాజకుటుంబ వర్ణనవంటి నాగరక వర్ణనలో ప్రవేశపెట్టిన గ్రామీణ వర్ణనలు లేక జానపద వర్ణనలు. అవతార ఖండంలో ఆడబడుచు పుట్టింటినుండి అత్తవారింటికిపోయే సందర్భం, తల్లిదండ్రుల ప్రేమ,

దుఃఖం, ఉద్వేగం, రాణులు గర్భవతులైనప్పుడు వారి ప్రవర్తన అచ్చంగా జానపద స్త్రీల ప్రవర్తనలాగే ఉండటం, రాజప్రాసాదాలలో మట్టి దొరకదు కాబట్టి ముగ్గురు రాణులూ తమ తమ దాసీలు రహస్యంగా దొంగిలించి తెచ్చిన మట్టి బెడ్డలను తినడం-ఇత్యాది వర్ణనలో 'నగర సంస్కృతి' (Urban Culture)లో ప్రవేశించిన 'జానపద సంస్కృతి' (Folk Culture) కి ఉదాహరణాలు. విశ్వనాథవారి కల్పవృక్షంలో ప్రాణభూతమైనది తెలుగు జీవితం. దీనిని పాఠకులు గ్రహించాలని విశ్వనాథవారే స్వయంగా చెప్పుకున్నారు: "ఈ కావ్యములో రావణ వధ ఎంత ప్రధానమో, తెలుగు కుటుంబములలోని బహు సన్నివేశములను చెప్పుట అంత ప్రధానమని తెలిసికొనవలెను. తెలుగు జీవితము, తెలుగు కుటుంబములు, తెలుగు ఆచారములు, తెలుగువారల ఇండ్లు - ఈ మహా దృష్టి లేనిచో ఈ కావ్యములోని సగము సౌందర్యమును పాఠకుడు చూడలేదని అర్థము" (కల్పవృక్ష రహస్యములు, పుట 46).

ఎంత చెప్పినా, ఈ తెలుగుదనం గ్రామీణసంస్కృతే అయినా, సూక్ష్మంగా పరిశీలిస్తే ఇది గ్రామీణ సంస్కృతిలో 'మధ్యతరగతి సంస్కృతి' అనే అంతర్విభాగానికి చెందినదని స్పష్టమవుతుంది. ఇంకా క్రిందికి వెళ్ళి 'నిమ్నకులాల సంస్కృతి'ని ప్రదర్శించిన విశ్వనాథ కవిత్వాన్ని పరిశీలిద్దాం. దీనినే 'శ్రామిక సంస్కృతి' అనీ 'కర్షక సంస్కృతి' అనీ పిలువవచ్చు. ఇదే నిజమైన జానపద సంస్కృతి. కౌసల్య, సుమిత్ర, కైకేయి రాణుల దాసీలు మన్ను దొంగతనంగా రాజప్రాసాదంలో ప్రవేశపెట్టడం కాదు - తిన్నగా మనం ఆ మట్టిలోకే వెళ్ళి చూద్దాం. ఆ మట్టిలో పొర్లాడుదాం. మట్టిమనిషి అయిన రైతులాంటి 'మట్టికవి'ని దర్శిద్దాం. తొలకరి వానతో పరిమళించే తెలుగు మట్టిని పరిశీలిద్దాం. ఏరువాకతో ప్రసన్నమయ్యే తెలుగు పొలాలను చూద్దాం. ఆంధ్ర ధరిత్రికి నమస్కరిద్దాం.

## విశ్వనాథవారి కర్షక సంస్కృతి :

విశ్వనాథ వారి భాష, భావాలు, అలంకారాలు, వర్ణనలు - అన్నీ కూడా గ్రామీణ సంస్కృతికి, అందులోనూ ముఖ్యంగా కర్షక సంస్కృతికి సంబంధించినవి. వారు రచించిన ప్రతి కావ్యంలోనూ ఈ కర్షక సంస్కృతి తొంగి చూస్తూనే ఉంటుంది.

## ఏఱువాక పండుగ :

'భ్రష్టయోగి' ఖండకావ్యంలో 'ఏఱువాక' అనే కావ్యఖండిక ఉంది. ఇది కర్షకులు చేసే ఒక పండుగ - ఒక విధమైన భూమిపూజ - వ్యవసాయ ప్రారంభోత్సవం. తొలకరి వానలు పడగానే పాలేర్లు కొత్త బట్టలు కట్టుకొని, గుండెలకు గంధం రాసుకొని, నుదుట తిలకం పెట్టుకొని, ఎద్దుల్ని అలంకరించి, వాటికి గంధం పసుపు కుంకుమ పూసి, కోటేరు ఎత్తి, తూరుపు పొలాల్లో దున్నడం ఈ ఖండికలో వర్ణించారు. ఎంతో పొగరుతో అంకెలు వేసే ఎద్దులు యజమాని కూతురు వచ్చి, గంధం పసుపు కుంకుమలు పూసేసరికి శాంతించడం, పిల్లల్లా అయిపోవడం, ఆమె పెట్టిన పత్తివిత్తులు తిని అంకె వేయడం, కోటేరు ఎత్తితే చాలు- పొలాలవైపు పరుగెత్తడం ఈ కవితలో చాలా అందంగా మన మనోనేత్రాలకు ప్రత్యక్షం చేస్తారు విశ్వనాథ :

"ప్రత్తి విత్తులు తిని, నిలంబడి, జగజ్జ
యాంక రమ్యబీకరముగ అంకెవేయు
నీ వృషభములు, కోటేరు నెత్తినాము
చెలగి పరుగెత్తు తూరుపు పొలములందు."

ఇక్కడ ఒక జానపదుల నమ్మకాన్ని కూడా తెలియజేస్తున్నారు విశ్వనాథ. ఇంటి కోడలు వచ్చినవేళ, గొడ్లు వచ్చినవేళ దృష్టిలో పెట్టుకొని జానపదులు తమ అదృష్టాన్ని పరీక్షించుకుంటారు. అలాగే ఒక పాలేరు వచ్చినవేళను కూడా తమ పాడిపంటల అభివృద్ధికి కొలమానంగా పెట్టుకుంటారు. ఆ పాలేరు బుధవారంనాడు పుట్టిన వాడైతే ఆ యింట్లో పాడి ఎక్కువగా ఉంటుందని మరొక జానపద విశ్వాసం ఇవన్నీ విశ్వనాథ ఈ కవితలో చెపుతారు.

"కాలిడిన ధాన్యముబికెడు
బోలెడు, బుధవారమందు పుట్టెనితడు, మా
పాలేరు గడపత్రొక్కెను
పా లేత్తై దొడ్డిలో ప్రవాహము గట్టెన్."

ఈ చిన్న కంద పద్యంలో జానపద భాషను పొదిగారు విశ్వనాథ "కాలిడిన" అనేది పలుకుబడి (Usage); "గడప త్రొక్కు" అనేది జాతీయం (Idiom), "పాలు ఏత్తై దొడ్డిలో ప్రవాహం కట్టింది" తెలుగు వాక్యవిన్యాసం.

వ్యవసాయానికీ, కర్షక జీవితానికీ, పాడిపంటలకూ మూలభూతమైన ఎద్దుల వర్ణనమే ఈ ఖండిక అంతా వ్యాపించి ఉంది. వేదబుక్కులు కూడా ఈ వ్యవసాయం చేసే ఎద్దుల్ని స్తుతిస్తాయి అంటారు విశ్వనాథ. ఏరువాక సాగే ఎద్దుల్ని ప్రశంసిస్తూ, సంబోధిస్తూ ఇలా అంటారు మహాకవి:

"మెలపుగ మీరు మేఘముల మీదన పోదురు, కొంచె మాగుడా,
నిలిచి యొకింత పొందు ధరణీస్థలి లాంగలి పద్ధతిం బడన్,
పొలుపుగ వేదబుక్కులు మిమున్ నుతిచేయుటనమ్మ! మీ భుజా
బలమున పెళ్ళపెళ్ళలుగ వచ్చెడు ధాత్రిప్రసన్నమూర్తియై!"

దున్నిన పొలాన్ని భూమియొక్క ప్రసన్నమూర్తిగా భావించడం విశ్వనాథవారి జానపద సంస్కృతి ప్రీతికి ఎత్తిన జయపతాకం!

## ఝాన్సీరాణి - పంటలక్ష్మి:

'ఝాన్సీరాణి' అనే తొమ్మిది ఆశ్వాసాల వీరకావ్యాన్ని రచించారు విశ్వనాథ సప్తమాశ్వాసంలో కవి ఝాన్సీ లక్ష్మీబాయి శౌర్యవర్ణన చేశారు ఒక సీస పద్యంలో. ఈ వర్ణనలో ఆయన ఉపయోగించిన ఉపమానాలన్నీ కర్షక జీవితానికి సంబంధించినవి కావడం గమనించాలి:

"కరవాలమును బట్టి కంఠముల్ తఱుగుచో
    ఎడనీటి బొందంబు లెగచినట్లు
బల్లెమ్ముతో గుండె పగిలించినప్పుడు
    ధృతి గట్టునకు గడ్డ తీసినట్లు
గుఱ్ఱమ్ము దూకించి కూలించినప్పుడు
    అడవి బెట్టును పడనడచినట్లు
తలపైన డాలుతో తాడించినప్పుడు
    క్షేత్రవిప్ర హాలితో నర్దినట్లు
కెలకులకు చిత్రముగను లంఘించునప్పుడు
తూగునదకల నేతాము త్రొక్కినట్లు
విజయలక్ష్మి విధంబున వెలిగెరాణి
పంటలక్ష్మి విధంబున ప్రబలెరాణి!"

ఝాన్సీలక్ష్మిని 'పంటలక్ష్మి'గా భావించడం విశ్వనాథవారి జానపద సంస్కృతి ప్రీతిని వేనోళ్ళ చాటుతోంది.

## దేవుణ్ణి పంటచేనుగా భావించడం :

ఒక వీరవనితను పంటలక్ష్మిగా భావించడమేకాదు; ఏకంగా భగవంతుణ్ణే ఒక పంటచేనుగా భావించే జానపద కవితాశక్తి విశ్వనాథలో ఉంది. 'మా స్వామి' శతకంలో తమ కులదైవమైన విశ్వేశ్వరుణ్ణి గురించి ఇలా అంటారు:

> ''పునుకల్ పూచిన కాజ గడ్డలు, ఫణుల్ పొల్చారు కాజాకు, లే
> మననౌ జాబిలి కాజపూ, వెరువు పెల్లై సారమౌ దుబ్బు ల
> ల్లిన ఉండల్, మెయి బూదిపూత తెలిధిల్లీభోగముల్, చేను నీ
> వనెదన్, మా పితృపాదు లమ్మని పొలం బీవౌదు, విశ్వేశ్వరా!''

(తన తండ్రి వందల ఎకరాల భూమిని అమ్మివేసినా, కులదైవాన్ని మాత్రం ఉంచారు. ఆ కులదైవం విశ్వనాథవారికి 'తండ్రి అమ్మని పొలం'గా కనబడటం కూడా విశేషమే!)

## ఋతుసంహారం - గ్రామీణ సంస్కృతి :

విశ్వనాథవారి ఋతుసంహారము'నకు పేరుతో మాత్రమే కాళిదాసు ఋతుసంహారంతో సంబంధం ఉంది ఇది కాళిదాసుకు అనువాదం కాదని చెప్పడం కోసమే కుండలీకరణంలో "తెనుగు ఋతువులు'' అని కూడా చేర్చారు. ఈ చిరు కావ్యం తెలుగు ఋతువుల వర్ణన. తెలుగు గ్రామీణ జీవితానికీ, సుందర ప్రకృతికీ అద్దం పట్టిన అద్భుత రచన ఇది. దీంట్లో కర్షక సంస్కృతి పుష్కలంగా ఆవిష్కరించబడింది. పల్లెటూరిలో ఇల్లు, ఇంటి చుట్టూ ఉన్న పెరడు, వీథి, ఊరు, ఊరచెరువు, ఊరిబయట పొలాలు, క్రిమి కీటకాదులు, పక్షులు, జంతువులు, మనుషులు - (మళ్ళీ ఈ మనుషుల్లో మధ్యతరగతి వారు, నిమ్నకులాల వారు, లంబాడీవంటి సంచార జాతులు, అందరూ వచ్చేస్తారు) - ఒక్క మాటలో చెప్పాలంటే, పల్లెటూరిలోని చరాచర జగత్తంతా ఆరు ఋతువులలో మహాద్భుతంగా వర్ణితమయింది. జానపదుల ఆచార వ్యవహారాలు, నమ్మకాలు, పెండ్లి ఊరేగింపు, బాలక్రీడలు - మొదలైనవికూడా ఈ ప్రకృతి కవితలో చోటు చేసుకున్నాయి. జానపదుల భాష - అంటే సామెతలు, నుడికారాలు, పలుకుబళ్ళు - ఈ కావ్యంలో అడుగడుగునా ప్రత్యక్షమవుతుంది. కొన్ని పద్యాలు కేవలం జానపద భాషను ప్రదర్శించటం కోసమే వ్రాయబడ్డాయా అనిపిస్తాయి. ఈ క్రింది పద్యం కేవలం సామెతలలో వర్షఋతువును వర్ణిస్తూ వ్రాయబడింది:

"వెన్నకొట్టిన వారి వెసఱాలగొట్టుమన్నట్లు మేఘుడు హేళి కడ్డువచ్చె
మున్నువచ్చు చెవులకన్న కొమ్ములు వాడియన వరికిని కలుపధికమయ్యె
మొఱిగిన కుక్క తా కఱవదన్నట్లు గర్జించి మొగిలు వర్షించకుండె
దినము మంచిదటంచు పవలె దొంగిలినట్లు కాలిబాటల కూడ గడ్డిమొలిచె

తడిసి మఱి కాని గుడిసె కట్టదును, త్రాగి
గాని మొగ్గదన్నట్లు మున్ కాంత పుట్టి
నింటి తడి యెల్లయును లాగి, ఇప్పుడినుడు
ముగుద తమ్మి కన్పడుటకే మొగమువాచె."

## నుడికారం (Idiom) - పలుకుబడి (Usage) భేదం :

సామెతల లాగే కేవలం నుడికారాలు, పలుకుబడులు గుప్పిస్తూ వ్రాసిన పద్యాలు కూడా ఈ కావ్యంలో ఉన్నాయి. (నుడికారం వేరు, పలుకుబడి వేరు. తెలుగులో చాలామంది ఈ రెండింటికి భేదం పాటింపకపోవడం విచారకరం.) ఆంగ్లంలో 'Idiom' అన్నదానికి తెలుగులో 'నుడికారం' సరిపోతుంది. దీనినే 'జాతీయం' అనీ 'నానుడి' అనీ కూడా అనవచ్చు. నుడికారంలో ఆ మాటకి ఆ అర్థం ఉండదు; వేరే అర్థం ధ్వనిస్తూ ఉంటుంది. అలంకారికంగా పదాలు కూర్చబడతాయి. ఉదా॥ నా మీద కారాలూ మిరియాలూ నూరుతున్నాడు." దీనికి 'కోప పడుతున్నాడు' అని అర్థం. ఆంగ్లంలో 'Usage' అన్నదానికి 'పలుకుబడి' సరిపోతుంది. దీనినే 'పదప్రయోగం', 'మాటలవాడుక' అనికూడా అనవచ్చు. ఈ పలుకుబడిలో ఆ మాటకు అదే అర్థం ఉంటుంది. కాని ఆ మాటల్ని ఆ రూపంలోనే ప్రయోగిస్తాం ఎందుకు? అంటే సమాధానం చెప్ప లేం. మన భాషా ప్రయోగం అలా ఉంటుంది - అని మాత్రమే చెప్పగలం.

ఉదా॥ "మా ఆవిడ"—"నా భార్య". 'ఆవిడ' అనే శబ్దానికి ముందు "మా" అని మాత్రమే వాడుతాం. సంబంధబోధకంగా చాలా చోట్ల 'మా' అనే బహువచనం మాత్రమే వాడుతాం. మా యిల్లు, మా నాన్న, మా అమ్మ, మా తమ్ముడు, మా చెల్లెలు ఇత్యాది. కాని 'భార్య' శబ్దానికి ముందు "నా" అనే ఏకవచనం వాడుతాం. ఇది తెలుగుభాషా సంస్కృతి. విశ్వనాథ ఒక్కరే ఈ భేదాన్ని గుర్తించి నుడికారాన్ని, పలుకుబడిని ప్రత్యేకంగా వాడారు. గ్రీష్మ ఋతువును వర్ణిస్తూ చెప్పిన ఈ క్రింది సీసపద్యంలో ఎన్ని నుడికారాలు, ఎన్ని పలుకుబడులు ప్రయోగించారో చూడండి:

"ఉదయ సూర్యునితోడ ఒడలెల్ల చితచితలై ఎండ కొఱకొఱ లాడదొడగె
ఇదియేమి నడుమింటి ఎండయోలే నిప్పు చేతుల తాకిన రీతినుండె
ఇనుడ స్తమించినాడని పేరు ఎదురెండ గొట్టిన వడ గూబ గుంయిమనియె
సొక్కుఉఱాబిలి వల్గ్రుక్క త్రిప్పుకొనువేళకు రేయిరెండు జాల్రాపకులాడె
ఆపసోపాలుపడి నిద్రయనుచు తెప్ప రాచునంతలో
దీర్ఘదీర్ఘమగు పగలు, గదుముకొన్న రేయి చివళ్ళ పొదిపి పొదిపి
అట్టె ధారుణి సర్వమ్ము పట్టుకొనియె."

(ఇక్కడ ఎత్తుగీతిలో ఛందస్సునుబట్టి కాకుండా భావానుగుణంగా పాదాలు విరిచి వ్రాశాను).

పైపద్యంలోని నుడికారాలు : ఎండ కొఱకొఱలాడు, నిప్పుచేతుల తాకిన రీతి, గూబగుంయిమను, గ్రుక్కత్రిప్పుకొను, ప్రాకులాడు, ఆపసోపాలుపడు, తెప్పరాచునంతలో, గదుముకొను, కారాలు మిరియాలు నూరిపోయు.

పలుకుబడులు : ఒడలెల్ల చితచితలగు, నడుమింటి ఎండ, ఎదురెండ గొట్టు, పొనపొన, పది ఉబ్బ చినుకులు పడు, మబ్బుచాటెండ, ఇదియేమి ఎండయో, అస్తమించినాడని పేరు, నిద్రయనుచు, అట్టె పట్టుకొనియె, సాగినట్టె సాగి.

శిశిరంలో పెండ్లిండ్లు జరుగుతాయి. కర్షక వర్గానికి చెందిన కమ్మవారి అమ్మాయి పెండ్లి ఊరేగింపు ఒక పద్యపాదంలో సూచించారు విశ్వనాథ. గ్రామిక వర్గానికి చెందిన "పిన్నపాలెగాని పెండ్లి ఊరేగింపు" ఒక ప్రత్యేక సీస పద్యంలో వర్ణించారు. "బాలికలు చలిమంటలో అరికాళ్ళు కాచుకుంటే పెండ్లి అయ్యాక అత్తగారు చనిపోతుంది" - ఇది ఒక జానపద నమ్మకం. ఇటువంటి నమ్మకాలు అనేకం చెప్పారు విశ్వనాథ ఋతు సంహార కావ్యంలో. జానపదుల ఆభరణాలు, పశుల కాపరుల బాలక్రీడలు, 'ఎండావానా కుక్కల నక్కలపెళ్ళి' పాటలు, తుంగకాడను రెండు వైపుల నుంచీ చీల్చి తమ చూడిగేదకు పెయ్య దూడ పుడుతుందో దున్నపిల్ల పుడుతుందో జోస్యం చెప్పడం, తాళ్ళతోపుల్లో చూలుతేళ్ళ కడుపుడిప్ప తెఱచి పిల్లల్ని బయటకు పంపడం ఇత్యాది బాల జానపద జీవన విషయాలెన్నో వర్ణించారు విశ్వనాథ. కుక్కగొడుగు నుండి 'కాచు' (కవిరి) తయారుచేసి బాలెంతరాలికి తాంబూలంలో వేయడం, బాలికలు తాకి గడ్డను గోరింటాకులో కలిపి రుబ్బుకోవడం, పెళ్ళి కూతుర్ని మేనమామ

బుట్టలో కూర్చోబెట్టి తీసుకురావడం, రైతులు ధాన్యం పాత్రల్లో విఘ్నేశ్వరుని ఉంచడం ఇత్యాది జానపద ఆచార వ్యవహారాలను వర్ణించారు. వారి వర్ణనలలో ఉపమానం, ఉపమేయం రెండూ కూడా ఎక్కువగా జానపదమే కావడం చాలా చోట్ల గమనించవచ్చు. వర్షఋతువులో ఉదయిస్తున్న సూర్యుణ్ణి పండి మగ్గిన తాటిపండుతో పోల్చడం, శరదృతువులో ఆకాశంలో ఎగురుతూ వస్తున్న కొల్లేటి కొంగల్ని - ఆకాశమనే పాములవాళ్ళ పిల్లమెడలో నత్తగుల్లల పేరుతో పోల్చడం వంటివి జానపద ఉపమానాలు. కాపుబిడతడు, పనిమాలకన్నియ, కౌనార సస్యలక్ష్మి, కొల్లేటి కొంగలు, లంబాడి పడుచు, పాలేరు దాన, మెట్ట పొలాలు, మాగాణి పల్లెటూళ్ళు సంక్రాంతి ముగ్గులు పెట్టే కన్యలు, పాడి ఆవు ఈనుతుంటే జాగారం చేసే కాపు దంపతులు - ఇవి జానపద ఉపమేయాలు.

పై పరిశీలననుబట్టి విశ్వనాథ వారిది గ్రామీణ కవిత్వం లేదా కర్షక కవిత్వం అని నిర్ధారణ చేయవచ్చును. రైతును 'మట్టిమనిషి' అంటారు. విశ్వనాథ వారిని నేను "మట్టికవి" అంటున్నాను! ఎటువంటి మట్టికవి? ''తెలుగు మట్టికవి.'' తొలకరి వానలతో గుబాళించే తెలుగు పొలాల మట్టిలాంటి కవి విశ్వనాథ!

## రామాయణ కల్పవృక్షం - జానపద మూలాలు :

'ఋతు సంహారము', 'తొలకరి' కవిత, 'చంద్రవంక యుద్ధము' కవిత ధర్మాంగద చరిత్ర - 'పాము పాట' మొదలైన ఖండకావ్యాలు, లఘుకావ్యాలలో మాత్రమే కాకుండా విశ్వనాథవారి జీవనకృతి (life work) అయిన రామాయణ కల్పవృక్షంలో కూడా జానపద మూలాలు పుష్కలంగా కనబడతాయి.

## మూలాంశాలు (Motifs) :

జానపద కథలలోను గేయ కథలలోను అతి ప్రధానమైన అంశం మూలాంశం (Motif). ఇది లేనిదే కథాకథనం ముందుకుసాగదు. ఇది మూడు రకాలుగా ఉంటుంది : 1. సంఘటన రూపమైన మూలాంశం : బాలచంద్రుని బొంగరాలాట, రామాయణంలో అయితే కైక కోరికలు, సీత బంగారు లేడిని కోరడం. 2. పాత్రరూపంలో ఉండే మూలాంశం : సవతితల్లి, మాయలఫకీరు. రామాయణంలో అయితే మంథర, శూర్పణఖ, రావణుడు, జటాయువు, సుగ్రీవుడు, విభీషణుడు. 3. వస్తురూపంలో ఉండే మూలాంశం : మంత్రదండం,

ఎగిరే కంబళి, రామాయణంలో అయితే పాదుకలు, శస్త్రములు - అస్త్రములు, రాముని ఉంగరం, సీత చూడామణి, సంజీవని పర్వతం, పుష్పక విమానం. ఈ మూలాంశాన్నే కన్నడంలో 'కథన ఘటకం' అనీ, 'ప్రేరకం' అనీ, 'ఆశయం' అనీ అంటారు. రామాయణంలో కొన్ని ప్రధానమైన మూలాంశాలు:

1. పాయసం తింటే గర్భవతి కావటం. (పండు/పువ్వు/విభూతి/చేప/జంతువు ఇత్యాద్యల్ని తింటే గర్భవతులు కావడం ప్రపంచంలో అనేక కథలలో ఉంది.)
2. పొలం దున్నుతుంటే భూమిలో నుండి పెట్టె లభించడం - అందులో శిశువు ఉండడం.
3. శాపం వల్ల మనిషి రాయిగా మారటం - వ్యభిచరించడం వల్ల ఈ శిక్ష విధింపబడటం - దివ్యపురుషుడి పాదధూళి వల్ల రాయి స్త్రీగా మారటం.
4. శివధనుస్సు ఎక్కుపెడితే సీతనిచ్చి పెండ్లి చేస్తానని జనకుడు ప్రకటించడం. (ఒక దుస్తరమైన కార్యాన్ని చేస్తే రాజకుమార్తె నిచ్చి పెండ్లి చేస్తానని రాజు ప్రకటించడం ప్రపంచంలో అనేక దేశాల కథలలో ఉంది )
5. కైకెయి రెండు వరాలు కోరడం; సీత బంగారు లేడిని కోరడం.
6. శ్రీరాముడు అరణ్యవాసానికి వెళ్ళడం (రాజకుమారుడు అరణ్యవాసానికి వెళ్ళడం ప్రపంచ కథలలో సామాన్యమైన మూలాంశం.)
7. పక్షి మనిషికి సహాయం చేయటం (జటాయువు, సంపాతి )
8. రాక్షసుడు జంతువుగా మారడం (మారీచుడు>బంగారులేడి).
9. లక్ష్మణరేఖలు.
10. జంతువులు మనిషికి సహాయం చేయడం (సుగ్రీవాది వానరులు, జాంబవంతుడు)
11. కోతులు, రాక్షసులు గాలిలో ఎగరడం.
12. పదితలల రాక్షసుడు (రావణుడు); నూరుతలల రాక్షసుడు (శతకంఠ రామాయణం), వేయితలల రాక్షసుడు (సహస్రకంఠ రామాయణం) కూడా ఉన్నారు జానపద కథలలో.

13. నరికిన తలలు మళ్ళీ మొలవడం, ప్రాణం పొట్టలో ఉన్న అమృత భాండంలో ఉండడం (రావణుడు), ప్రాణం ఏడు సముద్రాలకు అవతల, మర్రిచెట్టు తొఱ్ఱలో, కందిరీగ నడుములో ఉండడం (మైరావణుడు).

14. ఆరునెలలు నిద్రపోవడం, ఆరునెలలు మెలకువగా ఉండడం (కుంభ కర్ణుడు).

15. సీత తన పాతివ్రత్యాన్ని నిరూపించుకోవడం కోసం అగ్నిలో ప్రవేశించడం.

ఇటువంటి మూలాంశాలు ప్రపంచంలో ఉన్న అనేక దేశాల సాహిత్యాలలో ఉన్నాయి వీటినన్నింటినీ సేకరించి "Stith Thompson" అనే విద్వాంసుడు 1955-58 మధ్య "Motif-Index of Folk literature" అనే ఆరు సంపుటాల గ్రంథాన్ని ప్రచురించాడు. దీంట్లో చూస్తే మన రామాయణ కథా మూలాంశాలకు సమానమైన మూలాంశాలు కనబడతాయి దీనినిబట్టి ప్రపంచంలో ఎక్కడైనాసరే మానవుని బుద్ధిబలం, కల్పనాశక్తి ఒకేవిధంగా పని చేస్తాయని చెప్పవచ్చు. లేదా ఈ కథలు భారతదేశంనుండి ఇతర దేశాలకు వ్యాపించాయనికూడా అనుకోవచ్చు

## కార్యకారణ సంబంధం :

జానపద కథా కథనంలో మరో ముఖ్యాంశం కార్యకారణ సంబంధాలు కల్పించడం. జానపదుల దృష్టిలో ప్రతి సంఘటనకూ కార్యకారణ సంబంధం ఉండాలి. ఒకవేళ ఎక్కడైనా ఒక సంఘటనలో కార్యం చెప్పి కారణం చెప్పకపోతే - ఆ కారణాన్ని జానపదులు కల్పించి ఆ ఖాళీని పూర్తిచేస్తారు. అందువల్లనే రామాయణ మహాభారతాలకు "జానపదుల చేర్పులు" (Folk Additions) చాలా చేరాయి. రాముడు చెట్టుచాటునుండి వాలిని చంపాడు. ఎందుకు? ఎదురుగా వెళ్ళి అతనితో ఎందుకు యుద్ధంచేయలేదు? ఈ ప్రశ్నకుసమాధానం రామాయణంలో లేదు (ఉన్నా సంతృప్తిగా లేదు). అందువల్ల జానపదులు ఇలా కల్పించుకున్నారు. "వాలి మహాబలశాలి. అతని ఎదురుగా ఏ వీరుడు వచ్చి యుద్ధం చేసినా ఆ వీరుడి బలం వచ్చి వాలి శరీరంలో ప్రవేశిస్తుంది. అందువల్ల రాముడు వాలికి ఎదురుగా రాకుండా చెట్టుచాటునుండి బాణం వేశాడు." అయినా రాముడు చేసింది తప్పుపనే అని జానపదుల తీర్పు దానికి శిక్ష వేయాలి ఆ శిక్ష కృష్ణావ

తారంలో అనుభవించాడు. వాలియే కృష్ణావతారంలో కిరాతుడుగా పుట్టి, చెట్టు చాటునుండి కృష్ణుణ్ణి కొట్టాడు. దానితో కృష్ణుడు చనిపోయాడు - ఇది జానపదుల మరొక కల్పన.

## పాయస విభాగం - జానపద మూలం :

విశ్వనాథ కథా విషయంలో ఎక్కువగా వాల్మీకినే అనుసరించినా జానపదుల కల్పనలు దేశంలో బలంగా వ్యాపించి ఉండడంవల్ల కొన్నిచోట్ల వాటికి తలఒగ్గక తప్పలేదు ఉదాహరణానికి పాయస విభాగ ఘట్టం తీసుకుందాం. వాల్మీకి రామాయణంలో యజ్ఞపురుషుడిచ్చిన పాయస భాండంలో సగం ($\frac{1}{2}$ వంతు) కౌసల్యకు ఇచ్చాడు (రాముడు.) మిగిలిన సగంలో ($\frac{1}{2}$ లో) $\frac{1}{4}$వ వంతు సుమిత్రకిచ్చాడు (లక్ష్మణుడు) మిగిలిన $\frac{1}{4}$ వంతులో సగం - అంటే $\frac{1}{8}$ వ వంతు కైకేయి కిచ్చాడు (భరతుడు.) మిగిలిన $\frac{1}{8}$ వ భాగం తిరిగి సుమిత్రకు ఇచ్చాడు (శత్రుఘ్నుడు.) విశ్వనాథ సరిగ్గా ఈ విభజననే పాటించారు. అయితే లక్ష్మణుడు రామునితో ఎక్కువ సన్నిహితంగా ఉండడానికీ, శత్రుఘ్నుడు భరతుని సేవించడానికీ కారణం వాల్మీకి రామాయణంలో లేదు. ఈ కార్యానికి ఒక కారణాన్ని జానపదులు సృష్టించారు. దశరథుడు మొత్తం పాయసాన్ని రెండు భాగాలు చేసి ఒక భాగం కౌసల్యకూ మరొక భాగం కైకేయికి ఇచ్చాడు. అంతలో సుమిత్ర అక్కడికి వచ్చింది. అప్పుడు కౌసల్య తన భాగంలో సగం సుమిత్రకిచ్చింది. దీనివల్ల లక్ష్మణుడు పుట్టాడు. కైకేయి కూడా తన భాగంలో సగం సుమిత్రకు ఇచ్చింది. దీనితో శత్రుఘ్నుడు పుట్టాడు. ఇప్పుడు లక్ష్మణుడు రాముని సేవించడానికీ, శత్రుఘ్నుడు భరతుని సేవించడానికీ కారణం సరిపోయింది. ఈ జానపదుల కల్పన ప్రభావం కొంతవరకూ విశ్వనాథ మీద పడింది. సుమిత్ర తన పాయసభాగాన్ని తింటూ "కౌసల్య పుత్రుణ్ణి సేవించే కొడుకు పుట్టాలి నాకు" అని మనసులో అనుకుని పాయసం తిన్నదట. మరి శత్రుఘ్నుడికి భరతునిమీద ఉన్న భక్తికి కారణం విశ్వనాథ చెప్పలేదు. అంటే జానపద కల్పన సగంవరకే అనుసరించారు విశ్వనాథ.

కల్పవృక్షంలో ఈ క్రింది ఘట్టాలలో కూడా విశ్వనాథ మీద జానపద గ్రామాయణాల ప్రభావం ఉందని చెప్పవచ్చు.

## 1. అహల్యా శాప వృత్తాంతం :

అహల్యను రాయిగా పడి ఉండుమని గౌతముడు శపించడం. వాల్మీకి రామాయణంలో ఇలా రాయిగా మారడం లేదు. "గాలిని మాత్రం సేవిస్తూ, ఆహారం లేకుండా, తపస్సు చేసుకుంటూ, బూడిదలో దొర్లుతూ, సర్వ ప్రాణి కోటికీ అదృశ్యురాలవై ఇక్కడే ఈ ఆశ్రమంలో పడి ఉండు" అంటాడు వాల్మీకి గౌతముడు.

"వాయుభక్షా నిరాహారా తప్యంతీ భస్మశాయినీ
అదృశ్యా సర్వభూతానా మాశ్రమేస్మిన్ నివత్స్యసి"

ఇది నేటి అనుభూతి కవిత్వంలా అస్పష్టంగా ఉంది. ఈ లక్షణాలన్నీ ఒక బండరాయికి మాత్రమే సరిపోతాయి. కాబట్టి జానపదుల గౌతముడు రాయిని కమ్మని శపించాడు. పైగా ఇది ప్రపంచ వ్యాప్తమైన జానపద మూలాంశం (Motif). ఈ ఘట్టంలో విశ్వనాథ జానపదులనే అనుసరించారు.

"పేదతనమ్ములోనగల పెక్కువ సత్కులమందు గల్గు మ
ర్యాదయు నీ వెఱుంగవవురా! యొకజాతివి కమ్ము."

## 2. పరశురామ గర్వభంగం :

పరశురాముడు రాబోయేముందు శుభాశుభ శకునాలు కనపడటం వాల్మీకి లోనే ఉంది. దీన్ని విశ్వనాథ అనుసరించారు. కాని పరశురామావతారం రామావతారంగా పరిణమించడం వాల్మీకి వాచ్యంగా చెప్పలేదు. సంఘటనవల్ల సూచించాడు. జానపదులు స్పష్టంగా చెప్పారు. రాముడు పరశురాముని చేతిలోనుండి విష్ణుధనువును అందుకోగానే ఆ విల్లుతోపాటు పరశురాముని శక్తి కూడా రామునిలో ప్రవేశించిందని చెప్పారు. విశ్వనాథ ఈ జానపద భావాన్ని స్వీకరించి ఒక పద్యం వ్రాశారు:

"ధనువు గొనినంత రామున
కు ననంతానంత కల్ప ఘోర తపస్సం
జనితమగు శక్తి తనదగు
తనువున కల్గినటు దోచె తత్కాలమునన్."

## 3. సీతాదర్శనం :

ధనుర్భంగానికి ముందే రాముడు సీతను చూడాదని తమిళ కన్నడ రామాయణాలలో ఉంది. తెలుగులో 'రాఘవ కల్యాణం' అనే స్త్రీల పాటలో రాముడు ధనుర్భంగానికి ముందు సీత అందంగా ఉందో లేదో చూచిరమ్మని లక్ష్మణుని పంపినట్లుగాను, అతడు వెళ్ళి సీత పాదాలను మాత్రమే చూచివచ్చి ఆమె సౌందర్యాన్ని వర్ణించాడు (సాముద్రికశాస్త్రజ్ఞానంచేత). విశ్వనాథవారు ఈ జానపదకల్పనలు దృష్టిలో పెట్టుకుని ధనుర్భంగానికి ముందు బాల్కనీవైపు చూడటం, అక్కడ సీత ముఖం కన్పడటం అద్భుతంగా వర్ణించారు.

## 4. కైక పాత్రను ఉత్తమంగా చిత్రించడం :

జానపద సాహిత్యంలో కైక పాత్రచిత్రణ దుష్టంగానే ఎక్కువగా కొనసాగింది. కాని 'ఋషుల ఆశ్రమము', 'గుహభరతుల అగ్నిప్రవేశం' అనే స్త్రీల పాటలలో కైకకు రామునిమీదా, రామునికి కైకమీదా గొప్ప గౌరవము ఉన్నట్లు చిత్రింపబడింది. విశ్వనాథవారు కైక పాత్రను చాలా ఉన్నతంగా చిత్రించారు. రాక్షస సంహారంకోసం రాముని అరణ్యవాస విషయాన్ని కైకా,రాములు ఇద్దరూ కలిసి పన్నిన పన్నాగంగా తెలిపారు విశ్వనాథ.

## 5. ఊర్మిళపాత్ర-లక్ష్మణపాత్ర :

ఊర్మిళకు వాల్మీకి రామాయణంలో ఏమీ ప్రాధాన్యం లేదు. జానపదులలో ఈమెకు సీతతో సమప్రాధాన్యం ఉంది. "ఊర్మిళాదేవి నిద్ర" అనే స్త్రీల పాట ఎంతో జనప్రియమైన పాట (ఈ పాట కన్నడంలోనూ ఉంది). విశ్వనాథ జానపద ప్రభావానికి కొంత తలవొగ్గారు. వాల్మీకిలో అరణ్యవాసానికి వెళ్ళే ముందు రాముడు లక్ష్మణునితో ''నీ మిత్రులతో సంప్రదించి బయలుదేరు" అని మాత్రమే అంటాడు. కాని విశ్వనాథలో లక్ష్మణుడు అరణ్యవాసానికి ముందు ఊర్మిళాసౌధానికి వెళ్ళి ఆమెకు చెప్పి బయలుదేరుతాడు. ఊర్మిళను ఒక గొప్ప యోగినిగా చిత్రించారు విశ్వనాథ. జానపదులు 14 ఏళ్ల 'నిద్ర' అన్నది నిజానికి యోగనిద్రే! ఊర్మిళ మహాయోగిని కాబట్టి ఆమె సన్నిధిలో లక్ష్మణుడు యోగసమాధిలోకి వెళ్ళిపోయినట్టూ,అప్పుడు విశ్వామిత్రుడు ప్రసాదించిన బలాతిబలలు, క్షుత్పిపాసలతోపాటు నిద్రాదేవి కూడా లక్ష్మణుని బాధించకుండా శాసించినట్టు విశ్వనాథవారు చెప్పారు.

ఇక్కడ ఊర్మిళ పాత్రతోపాటు లక్ష్మణపాత్రను గురించి కూడా ఒక విషయం చెప్పాలి. వాల్మీకి లక్ష్మణుడు సీతారాములతోపాటు భోజనం చేస్తాడు, నిద్రపోతాడు. జానపదుల లక్ష్మణుడు నిద్రాహారాలు వర్జించి సీతారాముల్ని సేవిస్తాడు. తన నిద్రకూడా తన భార్యకు ఇచ్చివేస్తాడు. 'లక్ష్మణదేవర నవ్వు' అనే స్త్రీల పాట ఈ అంశాన్ని ఆధారంగా చేసికొని పుట్టింది విశ్వనాథ లక్ష్మణుడు జానపద లక్ష్మణుణ్ణే పోలి ఉన్నాడు

## 6. సీతాపహరణం :

వాల్మీకి : రావణుడు ఎడమచేత్తో సీత జుట్టుపట్టుకొని, కుడిచేత్తో తొడలు పట్టుకొని ఎత్తుకుపోయాడు.

"వామేన సీతాం పద్మాక్షీం మూర్ధజేషు కరేణ సః
ఊర్వోస్తు దక్షిణేనైవ పరిజగ్రాహ పాణినా"

జానపదులు : దుష్టుడైన రావణుడు మహాపతివ్రతయైన సీతను ముట్టుకోవడం వీరికి ఇష్టం లేదు అందువల్ల సీత నిలుచున్న భూమిని గడ్డతో సహా పెళ్ళగించుకొని తీసుకుపోతాడు.

అధ్యాత్మరామాయణం : సీతాపహరణం జానపదుల కల్పనలాగే ఉంది. ఇంకో విషయం కూడా ఉంది. నిజమైన సీత అగ్నిలో ప్రవేశించిందనీ, మాయ సీతను రావణుడు ఎత్తుకుపోయాడనీ ఉంది.

విశ్వనాథ : ఎక్కువ అధ్యాత్మ రామాయణాన్ని అనుసరించారు. కొంత వాల్మీకినీ, కొంత జానపదుల్నీ అనుసరించారు.

(i) అసలు సీత అగ్నిలో ప్రవేశించడం మాయాసీత (జగన్మాత)ను రావణుడు అపహరించడం - అధ్యాత్మ రామాయణ ప్రభావం.

(ii) మాయాసీతను రావణుడు జుట్టుపట్టుకొని పర్ణశాలలో నుండి బయటకు లాగడం - వాల్మీకి ప్రభావం.

(iii) సీత శరీరాన్ని రావణుడు స్పృశింపకపోవడం-జానపద ప్రభావం.

రావణుడు సీత చేతులు గట్టిగా పట్టుకున్నాడు, కాని ఆమె చేతులకు వది జతల గాజులున్నాయి. ఆ గాజుల మీద పట్టుకున్నాడు. అవి పగిలిపోయాయి. గీరుకుపోయాయి. రక్తం కారింది. బాధ కలిగింది. అయినా ఆ దుర్మార్గుడు తన

శరీర స్పర్శ చేయనందుకు ఆ తల్లి సంతోషించింది - అన్నారు విశ్వనాథ. ఇది నిశ్చయంగా జానపద ప్రభావమే.

## 7. శబరి వృత్తాంతం :

వాల్మీకి : చాలా సంక్షిప్తంగా చెప్పాడు. ప్రత్యేక ప్రాధాన్యం ఏమీలేదు.

జానపదులు : మహాభక్తురాలుగా తీర్చిదిద్దారు. ముగ్ధ భక్తురాలైన శబరి ముందుగా తాను రుచిచూచి, తియ్యని పండ్లు ఏరి రామునికి పెట్టింది ఆయన ఏమీ సందేహించకుండా తిన్నాడు.

విశ్వనాథ : మధుర భక్తితో కూడిన మహాభక్తురాలుగా చిత్రించారు. వాల్మీకిలో లేని ఎంగిలిపళ్ళ వృత్తాంతాన్ని జానపదులనుండి స్వీకరించారు.

## 8. సీత అగ్నిప్రవేశం (ఆధునిక దృక్పథం, స్త్రీ వాదం) :

వాల్మీకి : క్రీ.పూ. ఆరువేల సంవత్సరాల నాటికథ. పాతివ్రత్య పరీక్షకు ఆనాడు అది పరీక్ష.

జానపదులు : పాతివ్రత్యంమీదా, అద్భుత విషయాలమీదా దృష్టి కాబట్టి సీత అగ్నిప్రవేశాన్ని ఉన్నతంగా చిత్రించారు.

విశ్వనాథ : 20వ శతాబ్దిలో ఎలా చిత్రించగలడు? స్త్రీవాదం, స్త్రీలకు జరిగే అన్యాయాలూ ఎలా విస్మరించగలడు?

విశ్వనాథవారి దృష్టిలో రాముడు మహాసాధ్వియైన సీతను అనుమానించడం తప్పు. పరుషవాక్కులు పలకడం మరీతప్పు. అందుచేతనే అత్రి మహర్షి ఆశ్రమంలో సీత అనసూయతో ఫిర్యాదు చేయడం, ఆమె రాముణ్ణి శపించినంత పని చేయడం చెప్పారు. మళ్ళీ అదే సమయంలో రాముడు క్షత్రియుడనీ, క్షత్రియుడికి పౌరుషం ఉంటుందనీ, అత్రి మహర్షిచేత రాముణ్ణి కొంత సమర్థించాడు. అగ్నిప్రవేశ కారణాన్ని మార్చివేశారు. యుద్ధంలో ఇంద్రజిత్తు వల్ల మూర్ఛపోయిన రామలక్ష్మణుల్ని చూసి, భయపడి, వారు ఆ ఆపదనుండి గట్టెక్కితే అగ్నిలో ప్రవేశిస్తానని మొక్కుకుంటుంది (నిప్పులగుండం త్రొక్కుతానని మొక్కుకోవడం జానపదులలో ఉంది). ఇది జానపదులు మొక్కుకొనే ఆపద్మొక్కులాంటిది. ఈ మార్పు చేసినప్పటికీ కూడా విశ్వనాథ సంతృప్తి

చెందలేదు. రాముడు సీతచేత అగ్నిప్రవేశం చేయించడం విశ్వనాథ దృష్టిలో తప్పే. తన అభిప్రాయాన్ని రామాయణం చివరలో ధ్వనింపజేశారు. 14 ఏండ్లు దాటినాసరే రాముడు ఇంకా రాలేదని భరతుడు అగ్నిప్రవేశం చేయబోతుంటే, రాముడు పంపిన ఆంజనేయుడు వచ్చి అతనిని వారిస్తాడు. హనుమంతుడు చూచిన భరతుడు ఎలా ఉన్నడంటే - "సీతను అగ్నిప్రవేశం చేయించిన తప్పుకు ప్రాయశ్చిత్తంగా రాముడు అగ్నిప్రవేశం చేస్తున్నట్టుగా ఉన్నాడు" (రాముడు భరతుడు ఇద్దరూ కూడా నల్లగా ఒకే పోలికలో ఒకే గొంతుతో ఉంటారని భాస నాటకాలలో కూడా తెలుపబడింది). ఇక్కడ వాల్మీకినీ జానపదులనూ కూడా అతిక్రమించి, విశ్వనాథ కాలానుగుణమైన మార్పును ప్రవేశ పెట్టారు.

## 9. గుహభరతుల అగ్నిప్రవేశం - (స్త్రీలపాట) :

వాల్మీకి : అయోధ్యకాండలో భరతుడు చిత్రకూటం వెళ్ళి రాముణ్ణి దర్శించి పాదుకలు తెచ్చుకుంటూ "14 ఏండ్ల తర్వాత నువ్వు రాకపోతే నేను అగ్నిప్రవేశం చేస్తాను" అంటాడు కాని యుద్ధకాండ చివరలో భరతుడు అగ్నిప్రవేశం చేయడానికి సిద్ధంగా ఉన్నట్లు వాల్మీకి వర్ణించలేదు. సీతారామ లక్ష్మణుల ఆగమన వార్తను తెచ్చిన హనుమంతుడికి భరతుడు ఇలా కనబడ్డాడు: "కృష్ణ జినాంబర ధారియై దీనవదనంతో, జడలు కట్టిన తలతో, స్నాన సంస్కార రహితమైన శరీరంతో, కందమూల ఫలాశనంతో, ఇంద్రియ నిగ్రహంతో, బ్రహ్మర్షి తేజస్సుతో తాపసుడుగా ఉన్నాడు.''

జానపదులు : "గుహభరతుల అగ్నిప్రవేశం'' అనే ప్రసిద్ధమైన స్త్రీలపాట ఉంది. దాంట్లో ఇలా ఉంది: 14 సంవత్సరాల తర్వాత రాముడు రాలేదని శృంగిబేర పురంలో గుహుడు తన కుమారునికి రాజ్యాన్ని అప్పగించి అగ్నిప్రవేశం చేయబోతున్నాడు. అతని భార్యలు విలపిస్తున్నారు. నందిగ్రామంలో భరతుడు కూడా రాముడు రాలేదనే దుఃఖంతో, కౌసల్యాదులు ఎంత బ్రతిమాలినా వినకుండా, అగ్ని ప్రవేశం చేయబోతున్నాడు. అందరూ శోకిస్తున్నారు. ఆ సమయంలో ఆంజనేయుడు వస్తాడు. గుహుణ్ణి, భరతుణ్ణి వారిస్తాడు.

విశ్వనాథ : జానపద ప్రభావానికి కొంత లోనయ్యారు. గుహుని అగ్నిప్రవేశ యత్నం చెప్పలేదు కాని, భరతుడు అగ్నిప్రవేశం చేయబోతున్నాడని

మాత్రం వర్ణించారు (వచనంలో): "జటాభి రాముండు వల్కలధారి యొకండు రాజ పురుషధారులచే పరివేష్టింపబడి అగ్నిప్రవేశంబు సేవబోవుటఁగని...." ఆంజనేయుడు పంచ బ్రాహ్మణ రూపంలో వెళ్ళి వారించినట్లుగా చెప్పారు.

## సీతారాములలో జానపద తత్త్వం (Folkishness) :

జానపదుల లక్షణాలు గ్రామీణులైన జానపదులలోనే కాకుండా నగర వాసులైన నాగరకులలో కూడా కనబడుతూవుంటాయి రాముడు రాజపురుషుడు; సీత రాణివాసపు రాకుమారి. అయినా వీరిలో నిరక్షరకుక్షియైన జానపదులలో ఉండే అంధ విశ్వాసాలు ఒక్కొక్కసారి బయటపడడం విశ్వనాథవారు వర్ణి స్తారు. కష్టాలు వచ్చినప్పుడు అపద మొక్కులు మొక్కుకోవడం, గ్రామ దేవత లకు బలులిస్తానని మొక్కుకోవడం, కల్లూ మాంసం నైవేద్యం పెడతాననడం, నదికీ చెట్టుకీ పుట్టకీ నమస్కరించడం, వాటికి బలులిస్తాననడం జానపద తత్త్వం (**Folkishness**). రాముడు అరణ్యవాసానికి వెడుతూ సాకేతపురికి ఎదురుగానిల్చి నమస్కరిస్తాడు. సాకేతనగరశృంగాటకాలనూ, సౌధరాజ వ్రాతాలనూ, గృహ దేవతా కోటినీ, రాజ్యలక్ష్మినీ కాపాడే దేవతలకు అందరికీ తిరిగి వచ్చినప్పుడు బలులిస్తానని మొక్కుకుంటాడు.

"మఱల వత్తును వత్తును మఱల వత్తు వత్తు
మీయందఱకు బలులిత్తు మఱల"

తన వెంట వచ్చే ప్రజలకు ప్రదక్షిణించి నమస్కరిస్తాడు. గంగానదిని చూచి నమస్కరిస్తాడు. (ఇది వాల్మీకిలో లేదు.)

అలాగే సీతాదేవి కూడా కష్టాలు వచ్చినప్పుడు అచ్చంగా జానపద స్త్రీ లాగే ప్రవర్తిస్తుంది. సీతారామలక్ష్మణులు గంగానదిని దాటుతూండగా పడవ నడిమి పాయను చేరినప్పుడు సీత గంగ తల్లికి అంజలించి, ఇలా అంటుంది: "మేము ఈ అరణ్యవాసం భద్రంగా పూర్తిచేసి వస్తే నీకు పొంగళ్ళు పెడతాను. అనేక బలులిస్తాను. కల్లుపోస్తాను. నీకే కాదు- నీ తీరంలో నివసించే ఋషులకు, దేవతలకు బలులిస్తాను" (ఈ జానపద ప్రభావం విశ్వనాథ మీదే కాదు, ఆదికవి వాల్మీకిపైన కూడా ఉంది. గంగానదికి బలులిస్తాననే అంశం వాల్మీకి రామాయ ణంలో కూడా ఉంది). అలాగే యమునానదిని దాటేటప్పుడు కూడా సీత మొక్కులు మొక్కుతుంది. "నేనూ రాముడూ క్షేమంగా తిరిగివస్తే గంగకు

ఇచ్చినట్లుగానే నీకు కూడా వేయి బలులు అప్పనంగా ఇస్తాను" అంటుంది (ఇది వాల్మీకిలో లేదు.)

తరువాత సీతారామలక్ష్మణులు పెద్ద మఱ్ఱిచెట్టును చేరుకుంటారు. అప్పుడు సీత ఆ చెట్టుకు నమస్కరించి, మేము తిరిగివెళ్లేటప్పుడు "నీదు శాఖా వృతమైన నీడల సుఖంపడు ప్రాణులకున్ మహాబలుల్ పూవులు పండ్లు నిత్తు దయ[బో]వవే! మత్పతి మౌని సన్నిభున్'' అని మొక్కుకుంటుంది. వాల్మీకిలో మఱ్ఱిచెట్టుకు నమస్కరించినట్టుగా మాత్రమే ఉంది. ఆపద[మొ]క్కులు లేవు, బలుల ప్రసక్తిలేదు. ఇది జానపద ప్రభావం.

చిత్రకూట పర్వతం దగ్గర పర్ణశాలను నిర్మించినప్పుడు దానిలో ప్రవేశించే ముందు లక్ష్మణుడు లేడిమాంసంతో ఆ పర్ణశాలకు బలిపూజ నిర్వహించడం వాల్మీకి, విశ్వనాథ ఇద్దరిలోనూ ఉంది.

పీర్ల పండుగనాడు ముస్లిములతోపాటు హిందువులు కూడా ఇదివరలో భక్తితో మొక్కుకొన్న ప్రకారం నిప్పుల గుండంలో నడవడం ఉంది. దీనిని ఆధారంగా చేసికొని విశ్వనాథవారు ఒక కల్పన చేశారు. ఇంద్రజిత్తు నాగపాశంతో బద్ధులై మూర్ఛపోయిన రామలక్ష్మణులను చూచి సీత, వారు ఆ ఆపదనుండి బయటపడితే ఏ అగ్నిహోత్రుని సాక్షిగా తాను రాముని పెండ్లాడిందో ఆ అగ్నిహోత్రునికి తాను ఆహుతి అవుతానని మొక్కుకుంది.

## శ్రీరామునిలో జానపద హావభావాలు (Folk gestures)

జానపదులు సహజంగా ప్రవర్తిస్తారు. ప్రకృతికి దగ్గరగా ఉంటారు. జానపదుల హావభావాలు నాగరకుల హావభావాలకన్నా భిన్నంగా ఉంటాయి. జానపదులు మాండలిక భాషలో యాసగా మాట్లాడుతారు. మాట్లాడేటప్పుడు ఆంగికాభినయం ఎక్కువగా ఉంటుంది. గట్టిగా ఎక్కువ ధ్వనితో మాట్లాడుతారు, గట్టిగా నవ్వుతారు, అట్టహాసం చేస్తారు, విరగబడి నవ్వుతారు.

రామాయణ కల్పవృక్షంలో పట్టాభిషేకం జరుగబోయే ముందు శ్రీరాముణ్ణి గంభీరుడుగా, నాగరకుడుగా, Stiffగా చిత్రించారు విశ్వనాథ. అదే శ్రీరాముడు పట్టభంగం జరిగి అరణ్యాలకు వెళ్ళినప్పుడు అతణ్ణి పూర్తి జానపదు

డుగా వర్ణించారు విశ్వనాథ. పట్టభంగం జరిగిన రాముడు అందరినీ వేళాకోళం చేస్తాడు గట్టిగా నవ్వుతాడు. ఒక్కొక్కప్పుడు విరగబడి నవ్వుతాడు. సీతా లక్ష్మణులు అతని (జానపద) నవ్వును చూచి ఆశ్చర్యపోతారు.

సీతా రామలక్ష్మణులు యమునానదిని దాటుతూ ఉంటారు. గుహుడు పంపిన నావికుడు తెప్పకట్టి రామునితో "మీ బంగారపుబొమ్మకై ఇచట సామీ! పీటగా జేసితిన్" అంటాడు. రాముడు వానితో "తండేల! ఓయీ! బంగారపు బొమ్మగా దిదియు నా యిల్లాలు" అంటాడు. ఆటవికుడు నవ్వుతాడు. సీతకూడా నవ్వుతుంది. నదిని దాటిన తరువాత రాముడు సీతతో—

"నీవేమో దేవతని భావించెను వాడు, గుహుని పరమస్నేహ
శ్రీవైదగ్ధ్యము నేమని భావింతు విఱుగబడి నవ్వంగా"

వ. ఆయన నవ్వుగాంచి సీతాలక్ష్మణు లిట్లనుకొనిరి:

"అడవిని జొచ్చుటాది ప్రభువచ్చటిదైన ఉదాత్తతాగుణం
బుడిగెనొ? కైతవంబయిన ఊళ్ళుల నాగరకత్వ భావమన్
తొడుగును పుచ్చెనో? ప్రకృతితో నొకడై పసివానివోలె క
న్పడు కుహనా మనుష్యకృత నాగరబంధము లూడ్చినట్లుగన్!"

అయోధ్యలోవున్న రాముడు నాగరకతా కృత్రిమత్వంతో నిండిన రాముడు, అడవిలో ఉన్న రాముడు ప్రకృతికి దగ్గరగావున్న - ప్రకృతిలో ఒక భాగంగా ఉన్న-జానపద రాముడు. "మట్టికవి"యైన విశ్వనాథకు నగర సంస్కృతికన్న జానపద సంస్కృతే ఇష్టమనీ, అయోధ్యా రామునికన్న జానపద రాముడే ఇష్టమనీ పైపద్యంవల్ల స్పష్టమవుతోంది.

నాగరకత నుండి జానపదత్వానికి మారిన ఈ రాముని ప్రవర్తనను వాల్మీకి కూడా ఒకచోట ధ్వనింపజేశాడు. పట్టాభిషేకం భగ్నమయింది. సీతారాములు తమ ధనమంతా బ్రాహ్మణులకు దానం చేసివేస్తున్నారు. రాముడు వసిష్ఠ పుత్రుడైన సుయజ్ఞుణ్ణి పిలిపించాడు. సీతారాములు తమ విలువైన ఆభరణాలను అతనికి దానం చేశారు. గోవులను ఏనుగులను అతనికి సమర్పించారు. అప్పుడు 'త్రిజటుడు' అనే బీద బ్రాహ్మణుడు భార్యప్రోత్సాహంతో రాముడి దగ్గరకు వచ్చాడు. అతడు చింకిగుడ్డ కప్పుకొని ఉన్నాడు. బక్కచిక్కి ఉన్నాడు. అతన్ని చూచిన రామునికి జాలివేసింది. అది పరిహాసంగా మారింది.

అతని చేతికి చిన్నకర్ర ఇచ్చి ''ఇది నువ్వు ఎంతదూరం విసరగలిగితే అన్ని గోవులు నీకు ఇస్తాను' అన్నాడు రాముడు త్రిజటుడు నడుం బిగించి, ఓపిక అంతా కూడగట్టుకొని ఆ కర్ర విసిరాడు. అది వెళ్ళి సరయూ నదీతీరంలో పడింది. రాముడు ఆ బక్క ప్రాణిని కౌగిలించుకున్నాడు. అన్ని గోవుల్నీ అతని ఆశ్రమానికి తోలించాడు. తన పరిహాసాన్ని మన్నించమని వేడుకుని వీడ్కొలిస్తాడు. పట్టభంగం జరగగానే నాగరక రాముడు పోయి జానపద రాముడు ప్రత్యక్షమవుతాడు. గాంభీర్యం పోతుంది. ఇతరుల్ని పరిహసించడం లాంటి జానపద హావభావాలు బయటపడతాయి.

## కల్పవృక్షంలో జానపద భాష :

జీవవంతమైన తెలుగు భాష గ్రామీణులైన జానపదులలో మాత్రమే ఉంటుంది - ముఖ్యంగా స్త్రీలలో ఉంటుంది. ఇది నాలుగు విధాలుగా ప్రదర్శిత మవుతుంది. సామెతలు, నుడికారాలు (జాతీయాలు, నానుళ్ళు), పలుకుబళ్ళు, వాక్యవిన్యాసం. ఇటువంటి జీవవంతమైన జానపద భాషను ఆధునిక సాహిత్యంలో కవిత్వంలో విశ్వనాథ సత్యనారాయణగారు, కథలలో శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు మాత్రమే ప్రయోగించారంటే అతిశయోక్తి కాదు.

విశ్వనాథవారు కల్పవృక్షంలో ప్రయోగించిన జానపద భాషను గురించి చెప్పాలంటే అదే ఒక ప్రత్యేక గ్రంథం అవుతుంది అయినా స్థాలీపులాక న్యాయంగా కొంచెం చూపుతాను.

### సామెతలు : (Proverbs)

1. "వచ్చని చెట్టుపై పిడుగు పడ్డ విధంబున'' అయోధ్య
2. "తోటకూరలో పురుగును దుల్పినట్లు'' ,,
3. "పాముకు పాల్పోని పెంచు విధాన'' ,,
4. "తెచ్చిన వేప మొక్కకును తేనియ పోయుము చేదు మానునా?'' ,,
5. "తల్లి కడుపు చూచు, తరుణి వీపును జూచు పురుషుడైన నింటి కరుగుదేర'' ,,
6. "త్రాడువోలె వచ్చి దబ్బనమునువోలె తేలునట్టి యంత తెలివి గలవు'' ,,
7. "పిన్న పామునైన పెద్ద కఱ్ఱను గొట్టవలయునంద్రు'' ,,

8 "తను దాను పొగడుకొనినకంటె ఊరికి బావిని చావుమేలు" ,,

9. ''మన బంగారము మంచిదైన యెడ కంసాలిన్ మఱేలా యనన్'' ,,

10. "ఓరెమ్ముడికిన దనగా
సూరిమణీ! మెతుకు పట్టి చూచిన జాలున్ ,,

## నుడికారాలు (Idioms) :

1. కండలు చేసి కాకులకు గ్రద్దలకున్ బడవైతు — అయోధ్య
2. చించి పెనుప్రోవులు పెట్టెద ,,
3. (ఈ పదునాలుగేండ్లకే) కొంపలు మున్గెనా? ,,
4. (నెఱినెఱి) కత్తివేసినను నెత్తురు చుక్కయులేని మోముతో ,,
5. (ఏనేమో) తనచేతికందితినటం (చెంతేనియున్ తండ్రియున్) ,,
6. నాదు గీచిన గీటు దాట డొక్కరుడును — అరణ్య
7. (నీకు మఱి) నెత్తికి నేలకు చేయలేను ,,
8. (కైకొన్నచో) చేదున్ మేయవు ,,
9. సోదెలోనికి పేరుకూడ రాకుండ పోయిన ,,
10. తలప్రాణంబులు తోకకు మలగెను ,,

## పలుకుబడులు (Usages) :

1. రెప్పలమీద నిద్ర ముంచుకొస్తోంది.
2. కొడుకులూ కోమ్మలూ లేరా నీకు?
3. పైగా శత్రుత్వం కొనితెచ్చుకోవడం
4. అలా చేస్తే నాకు పుట్టగతులుంటాయా?
5. ఎంత చేతకానివాడైనా.
6. కళ్ళారా చూస్తూ.
7. అరె! ఇందాకట్నుంచీ చెపుతున్నానే! కొంచెంకూడా విన్పించుకోవడం లేదే!
8. చాలా పొద్దుపోయింది, ఇవాళ్టికి చాలు (పెద్దయు ప్రొద్దుపోయె ........ నేటికి చాలు).

9. అడుగు కదలనీయను"
"ఏం చేస్తా వేమిటి?"
"ఏం చేస్తానో చూద్దువు గాని"

10. ఏరా పక్షీ! అదేదో వాగి వాగి నువ్వే పోతావనుకుంటే నన్నే కొడతావా?

తెలుగు జానపద వ్యవహారంలో ఉండే ఇటువంటి పలుకుబళ్ళన్నీ విశ్వనాథవారు తమ పద్యాలలో అందంగా పొదిగారు.

అరణ్యకాండలో జటాయువు - రావణుల సంభాషణలో తెలుగు పలుకుబడిని విశ్వనాథవారు ఎంత పదునుగా ప్రయోగించారో చూడండి:

జటాయువు : "ఎంత చేత కాని యెవ్వండు కాల్సేతు
నాడినంతవఱకు నాత్మబంధు
గత విపత్తి యింత కనులారఁజూచుచు
నుండుయుండి ఊరకుండలేడు"

"అరె! యిందాకటి నుండి చెప్పేదను నీ కావంత విన్పించదే?"

("కాల్సేతు లాడినంతవఱకు" "అవంత" అనే పదాలు నుడికారాలు. మిగిలినవన్నీ పలుకుబడులే.)

జటాయువు × రావణుడు సంభాషించుకొనే ఈ క్రింది పద్యం పూర్తిగా పలుకుబడులతోనే నిండిపోయింది :

ఆ॥ "అడుగు కదలనీయ" నననఁగ, దానవరాజు
"నేమిచేసెద"నిన, "నేమియగునొ
చూతు" వనిన, నసుర చేతి కళాహతి
ఖరయుగంబు వెన్నుగాడ నడిచె.

రావణుడు : "ఏరాపక్షీ! అదేమొ వాగికొని నీవే పోదువన్నన్ గరుద్దారా పాతము లేచినావు...."

ఒక్కొక్కప్పుడు చిన్న చిన్న పద్యాలలోకూడా సామెతలు, నుడికారాలు, పలుకుబడులు గుప్పించి వేస్తారు విశ్వనాథ. ఒక చిన్న ఆటవెలది పద్యంలో ఒక సామెత, ఒక నుడికారం, ఒక పలుకుబడితోపాటు ఒక తిట్టు కూడా జోడించి, అన్నీ దేశిపదాలు ప్రయోగించారు విశ్వనాథ. రావణుడు సీతతో ఇలా అంటున్నాడు (అరణ్యకాండ) :

''ముద్దువచ్చినపుడు మొగి జంక కెక్కుమ
న్నారు, బిఱ్ఱబిగిసినావు, మఱియు
నెవ్వడడ్డమగునొ యేను జూతునుగదా
వాడెవండొ జిఱ్ఱ బోడిజోడి.''

## వాక్యవిన్యాసం :

తెలుగు పలుకుబడితో కూడిన వాక్యాలే తెలుగు వాక్యవిన్యాసంగా ఏర్ప డతాయి. ఈ వాక్యాలు ప్రశ్నార్థకాలతోనూ, ఆశ్చర్యార్థకాలతోనూ అంతమవు తాయి. చిన్న చిన్న వాక్యాలు కోడికత్తుల్లా పదునుగా ఉంటాయి. నాటకీయ శైలిలో కొనసాగుతాయి. సరస సంభాషణగా భాసిస్తూ ఉంటాయి.

పరశురాముడు రాముడితో ఇలా అంటాడు (బాలకాండ - ధనుఃఖండం) :

సీ. "నీవటోయి! ఓయినెట్టికనీల!
నీవా? శివధనుస్సును వంచినావు?
నీ తాకినంతనా? నిగుడు రుద్రధనుస్సు
వెదురు బద్దయుఁ బోలె విఱిగిపోయె!
ఏలాగు విఱిగెనో నీలకంధరు మహాధనువు చెప్పుము?
నేను వినవలతును;
పనిబూని విఱిచితివా? తాకినంతనే విఱిగెనా?

గీ. మంజూష వెలికి దీసి పూనితవ? ఎక్కుబెట్టితివా?
నితాంతమైన జ్యావల్లి సంధితమైనదా?
ఏది? కథారీతి చెప్పుము?
తిగిచినట్టియమ్ము ఏ లక్ష్యమును తాకి వమ్ము చేసె?"

ఇది సీసపద్యం. ఎత్తుగీతి తేటగీతి పద్యం. కాని ఛందస్సు ప్రకారం దీనిని విరిచి చదవడానికి బ్రహ్మదేవుడి తరం కూడా కాదు. ఎందువల్లనంటే, తెలుగు భాషలో సంభాషణలో, అదీ ఒక తీవ్ర సన్నివేశంలో ఒక మహావీరుడూ అవతారపురుషుడూ అయినవాడు, మరొక మహావీరుడూ నూతన అవతార పురుషుడూ అయినవాడితో మాట్లాడే సందర్భంలో, తెలుగు వాక్యవిన్యాసంలో ఉండే జిగిబిగితో నింపి పదునుగా వ్రాసిన పద్యం ఇది.

అరణ్యకాండలో పంచవటీ ఖండంలో శూర్పణఖ రాముడితో మాట్లాడే సందర్భంలో కూడా ఇటువంటి పదునైన తెలుగు వాక్యాలతో కూడిన పద్యం ఒకటి ఉంది. ''నామీద కోపం వస్తే నువ్వు నన్ను అప్పడంలా విరిచి తినేస్తావు!'' అంటాడు రాముడు వేళాకోళంగా - దీనికి రాముణ్ణి గాఢంగా ప్రేమిస్తున్న శూర్పణఖ చాలా నొచ్చుకుంటూ తెలుగు పలుకుబళ్ళతో కూడిన వాక్యాలతో ఇలా అంటుంది:

శా॥ ''నాకా? కోపము వచ్చుటా? అదియు నిన్నా? ఓరెముం జేయుటా?
ఈ కాంతాళపు మాటలేమిటికి? నాకీ యూహయే వచ్చినన్
నా కంఠంబును నేన కోసికొనెదన్, నా ప్రాణమిత్రంబు ని
న్నా కాంక్షించెద! తిండికేమి? మఱి కన్నావూహపారమ్మున్"

## ఉపసంహారం :

కాబట్టి 'కవిసమ్రాట్' విశ్వనాథ సత్యనారాయణగారు ఎంత మహాకవి అయినా, ఎంత ప్రౌఢకవి అయినా, ఎంత శిల్ప సమ్రాట్టు అయినా, ఆయన కవిత్వం ప్రధానంగా గ్రామీణ కవిత్వం లేదా కర్షక కవిత్వం! తెనుగుదనంతో తొణికిసలాడే దేశికవిత్వం! తెలుగునేలలోంచి పుట్టిన మట్టి కవిత్వం! (Telugu indiginous poetry) దీని మూలాలు తెలుగు జానపద సంస్కృతిలో గాఢంగా నాటుకొని వున్నాయి. ఏ కవిత్వంలో అయినా అతి ప్రధానమైన అంశాలు మూడు : ఇతివృత్తం, ఛందస్సు, భాష. విశ్వనాథవారి కవిత్వంలో ఈ మూడు అంశాలపైనా జానపద విజ్ఞాన ప్రభావం స్పష్టంగా కనబడుతూ వుంటుంది. *

# కవితానీరాజనం

## సాహితీ విశ్వనాథుడు

—డా॥ జె. బాపురెడ్డి ఐ.ఎ.యస్.

నన్నయనుండి నావరకు, నమ్మినదానిని నమ్మినట్లు, దే
శోన్నతి కోసమై నవరసోజ్జ్వల కావ్యములల్లినట్టి భా
వోన్నతులందు సన్నుతుడవోయి! సహస్ర ఫణాగ్రకాంతి సం
ఛన్నుడవోయి! నీ కృతులు సత్యసరిత్తులు విశ్వరాట్కవీ!

చెలియలికట్టపై కడిమిచెట్టును కిన్నెరసాని పాటతో
వెలయగ జేసినావు; అది వేదసుబోధ వసంతశోభతో
తెలుగున కల్పవృక్షమయి, దివ్యత రామకథామృతమ్ము ని
స్తులముగ పంచిపెట్టె పరిశుద్ధుల కామనలెల్ల తీర్చుచున్.

వాద వివాద నినాదాంధ్ర సాహిత్య
వనములో వల్మీక వాణివీవు
నాటి వ్యాకరణ ఛందస్స్వాతంత్ర రణభూమి
ధర్మగీతా ప్రబోధనము నీవు
ప్రాచీన దృష్టి కర్వాచీన దృష్టికి
శిష్టసమీచీన సృష్టివీవు
నిందయు స్తుతియు వెన్వెంట నీ కీర్తిని
మోసెడి అద్వైతమూర్తి వీవు
దేశకాలాలకును వేషభాషలకును
అంతుపట్టని పరమాత్మ కాంతి వీవు
గురువులకె గురుడౌ శిష్యవరుడవీవు
శిష్యులెవ్వరు సరిరాని చిద్గురుడవు!

పద్యపు కాలుచేతులను పాశవికమ్ముగ త్రుంచినట్టి, ద్వే
షోద్యమ కర్తలందరు, మహోజ్వల ఛందమునిందు సేయు, స
ద్విద్యను తూలనాడి వెలివేసిన దుర్మతులందరిప్డు, నీ
పద్యసరస్వతీ చరణ పద్మములన్కని మోకరిల్లరే!

నన్నయ్య చేతిలో వెన్న ముద్దలు తిన్న
పద్యమ్ము నీ గుండెపై స్రవించె
తిక్కన్న ఒడిలోన తేనెపలుకులు తిన్న
పద్యమ్ము నిన్నెంతొ ప్రస్తుతించె
శ్రీనాథు నింట పాకానేకములు తిన్న
పద్యమ్ము నీ నోట పరిమళించె
పోతన్న షడ్రసోపేతాన్నములు తిన్న
పద్యమ్ము నిను చూచి పరవశించె

అష్టదిగ్గజములు ప్రసిద్ధాంధ్ర కవులు
విందుచేసిన పద్యమ్ము క్రుంగినపుడు
జాషువా కృష్ణశాస్త్రి దాశరథి వంటి
సహచరులతోడ పద్యవాసంతలక్ష్మి
ప్రథిమ నిల్పిన విశ్వనాథుడవు నీవు

ఏ ప్రక్రియ చేపట్టిన
ఆ ప్రక్రియలోన సిద్ధహస్తుడ వౌటన్
నీ ప్రాభవము ప్రభావము
దీ ప్రజ్ఞోపజ్ఞ తెలుగు తేజంబయ్యెన్.

దేహాత్మలవలె నీ స
త్సాహిత్యము భాష - భావ సంయోజన, స
మ్మోహకమౌ! అక్షర పీ
ఠా హంసక విశ్వనాథ నారాయణమై.

వేయి వాసంతముల నుండి వెదకి వెదకి
తెలుగు సాహిత్య శారద తెచ్చుకున్న
జ్ఞానపీఠ పురస్కార గౌరవమ్ము
నీవు! ఋషివి మానవతా మనీషి వీవు.

నీ సాహిత్య సమావలోకనము తండ్రీ! చేయగాబూని, వి
ద్యా సంపన్న రసజ్ఞవిజ్ఞులు, వివేకాత్ముల్ భారతీజ్ఞాన ల
క్ష్మీ సాన్నిధ్యము చేరినారు, నవసంఘీభావ సందీప్తులై
భాసిల్లన్‌వలె పూర్ణసత్య సమతా భాగ్యోదయమ్మెల్లెడన్.

# కైమోడ్పు

—శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్యులు

అలనాడే ఎలుగెత్తి చాటితివి హృద్యంబైన పద్యాలలో
ఖిలమైపోయిన నాటి వైభవము వేంగీ పీఠ సారస్వతం
బులు మిన్నంటిన కొండవీటి పొగమబ్బుల్ తళ్లికోట వ్యథల్
తెలిపెన్ నీ హృదయాంతర జ్వలిత జాతీయాభిమానోన్నతిన్

చిక్కని శైలితో రసము చిప్పిలు భావనతో రచించు నీ
చక్కని పద్యముల్ బహు రసజ్ఞుల జేర్చెను మాతృభాష పై
మక్కువగూర్చె మాదృశుల మానసముల్ పులకింపజేసి స
మ్యక్కవితామయంబులుగ మార్చెను మాన్య గురూత్తమోత్తమా!

కలిగిన విశ్వనాథు సమకాలిక భాగ్యము చేత మేము ధ
న్యులము తదీయమూర్తి గని యూహలొనర్తుము నాటి సంస్కృతో
జ్జ్వల కవితాధురీణుని సుబంధుని జూచినయట్లు - బాణుని
న్గలసినయట్లు - హర్షు గనినట్లు - మురారిని కొల్చినట్లుగన్

వీనులకున్ కనుంగవకు వ్రేగగుమూర్తివి జ్ఞానపీఠ స
న్మాన మదెంత గొప్పదయినన్ కొలువన్ భవదంఘ్రి పీఠికా
స్థానము దాటి పైకి చన జాలదు - మంటిని మింటి దిక్తటీ
స్థానము లాక్రమించిన యశస్వి ఉరుక్రమమూర్తి వీవయా!

వెనుకటివారు చెళ్లపిళ వెంకన మా గురువంచు చెప్పికో
ఘనతను గాంచిరన్నటుల గాంచెద రిప్పుడు విశ్వనాథ మా
కును గురువంచు చెప్పికొని గొప్పతనంబును - సాహితీ సభాం
గణములలోన తాము గురు గర్వ సనాథ సుధీలలాములై

మానిత సంస్కృతాంధ్ర కవి మండలిలోన జనించి అత్యనూ
చాన పవిత్రమై అకలుషంబగు నీ కవితాభిజాత్యమున్
కానక నిన్ను గర్వియనగా అది దేహ విదేహ విజ్ఞతా
హీనతయౌనొ? కాక అసహిష్ణుతయౌనొ? ఎరుంగజాలమే!

ఘన కృష్ణానది సైకతస్థలులు దుర్గాదేవి కారుణ్య దృ
ఙ్మనిత జ్యోత్స్నయు విశ్వనాథ కవి సమ్రాట్ వాక్సుధాపూర మం
దన డిండిరము మెండుగా విజయవాడన్ చేరి వేరొక్క చ
క్కని కైలాసము నీ నివాసమునకున్ కల్పించెనయ్యా శివా!

## దోయిలి

కళాప్రపూర్ణ
డాక్టరు యస్. టి. జ్ఞానానందకవి

"పుష్పకిరీటధారికి ప్రపూర్ణ యశస్వికి దివ్యసాహితీ
గీష్పతి కప్రమేయబుధ కీర్తిత కీర్తికి ధన్యమూర్తికిన్
దుష్పరిపాక సంజనిత దుష్ట కవిత్వ పథానుదర్శియై
బాష్ప నిరుద్ధదృష్టి యగు వానికి మద్గురు మూర్తి కిన్నతుల్."

"దుర్వార ప్రతిభా విభాసిత కళాధుర్యుండు సత్సాహితీ
సర్వస్వుండు యశోవిశాలుడు దయాస్వాంతుండు ధీమంతుడున్
గర్వోన్నద్ధ సమస్త కాకవిఘటాకంఠీరవంబై మహా
ప్రౌర్విన్ రాజిలు విశ్వనాథ గురువర్యున్ డెందమందెంచెదన్."

"వినయ సమన్వితాఢ్యునకు వేదవిదగ్ధు సనాతనాధునా
తన కవితా విధానముల తానొకడౌచు నెఱుంగు ప్రోడకున్
తనయుల పోల్కి శిష్యులను ధర్మము వీడక చూచువానికిన్
గుణముల ప్రోదికిన్ ప్రణతి గూర్చెద మద్గురు విశ్వనాథకున్.''

"కలమున్ గైకొని వ్రాయనెంచెదవ గంగావాహినీ ధారలు
జ్జ్వలమై పాఱువిధాన నీదు రచనాసామర్థ్య వైశద్య ప్రో
జ్జ్వల ధారా సముదాయమట్టులె గదా! పాఱున్ యథార్థంబు వ
ల్కల రాజిన్వెలపించు బ్రహ్మవు సుధోక్తుల్ నీ మహావాక్యముల్."

"కమనీయార్థ రసావతారధిషణా! గంభీరమూర్తీ! దయా
సముద్రగా! వివిధార్థ కావ్యరచనా సామ్రాజ్య పట్టాభిషి
క్తా! మహాంధ్రాభ్యుదయాభిమానీ! విలసద్బ్రాహ్మీ స్వరూపా! గుణో
త్తమ! యౌదార్య రసస్వభావ! గురునాథా! విశ్వనాథా! నమః ''

"సురుచిరానంద సుందర సుధా సుకవితా
జలధి భీషణపు లోతులను ముట్టి
అతిలోక దివ్య మోహనపుదీయని భావ
ములనెడి నింగి యంచులను దాకి

నవరసాలంకృత ప్రవణ వాఙ్మయపుటం
దాల బృందావనోద్యాన తిరిగి
సరసంపు గవనంపు చాతుర్యమున పెంపు
రానిక్యమందు మర్మాల నెఱిగి

"తెలుగు పలుకులమ్మ కలికి కంఠమునందు
వెలయు కబ్బములను విరులదండ
నోలిమైరహింప గిలించినాడవు
విశ్వనాథ వంశ విబుధవరుడ!"

## కవితా నీరాజనం

డా॥ ఉండేల మాలకొండారెడ్డి

1. పద్యమ్ము వ్రాసెనా, భావగాంభీర్యవి
స్ఫూర్తితో నవరసంబులు సృజించు
గేయమ్ము వ్రాసెనా, కిన్నెర సానియై
తరగల నురగల పరుగులెత్తు
నవలలు వ్రాసెనా, నవకల్పనాచమ
త్కృతులు సృష్టించి గిల్గింత పెట్టు
కథలు రచించెనా, కమనీయ సంఘజీ
వన చిత్ర దృశ్యాలు కనులగట్టు

కలముచేబూని, తెలుగువాఙ్మయ వధూటి
శిరముపై "వేయిపడగల" వరవినూత్న
మణి కిరీటమ్ము మలిచిన మాన్య సుకవి
విశ్వ సాహిత్యనాథుడు 'విశ్వనాథ."

2. అతని "వేయిపడగ" లాంధ్రసీమనె కాదు
నిఖిల భారతమున నిలిచి వెలుగు
భారతదేశ నేత, నరసింహరాయని
కలమువలన, కథన బలమువలన.

3. తెలుగు సాహిత్యమును, తొట్టతొలుత, మేటి
"జ్ఞానపీఠ" మెక్కించిన ఘనుడతండు
ఆంధ్రులకు చిరస్మరణీయులైనయట్టి
పూర్వకవులకు జెందు అపూర్వుడతడు.

4. చెళపిళ శాస్త్రికి శిష్యుడు
అల నన్నయ తిక్కనాది ఆది కవులకున్
సుళువుగ దొరకని భోగము
కలిగించెను గురునికతడు కవి సమ్రాట్టై.

5. తన ప్రత్యేకత, పద్యశైలి, కథనోత్సాహమ్ము మీరన్, రచిం
చెను "రామాయణ కల్పవృక్షము" జగత్ శ్రేయోభిలాషన్, సుధీ
జన వంద్యుండగు "విశ్వనాథ", అది విశ్వప్రేమ సంధాయియై
తెనుగింటన్ పఠనీయమై తరతరాల్ దీపించెడున్ గావుతన్.

## అక్షర ప్రణామము

"కవికౌస్తుభ"
డాక్టర్ ఆచార్య తిరుమల

ఓంకార స్వన చంచరీక చయ ధీరోదాత్త భావాబ్జరే
ఖాంక ప్రాభవ లబ్ధ శాబ్దిక జగత్కావ్యాత్మ సామ్రాజ్యమున్
కైంకర్య వ్రజ సంతరించుగతి నైకైకాకృతిన్ గ్రాలు దృ
క్పంకాళున్ సరసాత్మునే దలంతు వీకన్ సత్యనారాయణున్!

ప్రణవాగ్ని మండలీ ప్రజ్వలత్ సత్య హం
సీ గరుత్ప్రత, వాగ్భాగమటుల
క్షీర సాగర వీచికా రత్న సింహాస
నాధ్యక్ష వైష్ణవీ ప్రాణమటుల
కైలాస శైత్య శేఖర వేదికా వ్యాప్త
తామ్ర జటా చంద్ర తాప మటుల
అమృతాంధస గళ త్స్వరార్ణ వోల్లాస మా
హేంద్ర హృన్నృత్య సాహిత్యమటుల

ఆర్ష ధర్మానుగత భవ్య హర్షమటుల
దివ్య మౌనీంద్ర మహతీ ప్రదీప్తియటుల
వరలు విశ్వనాథ ఋషిని ప్రస్తుతింతు
మత్పురాకృత సుకృత ప్రమాణ గరిమ!

సత్యోద్యాన మనోజ్ఞ వైదిక వచశ్శాలన్ మహద్వేదిపై
సత్యంతాద్భుత సృష్టిగీతములు పిఱంబాడ మోహోద్ధృతిన్
ప్రత్యక్షంబయి నువ్వు నాథుఁగని లేవన్ వాణి చేజారి భూ
ప్రత్యంకంబున బద్ధ కచ్ఛపియె దీరుల్ సత్యనారాయణుల్!

శైవ వైష్ణవ దేవాది దేవ సేవఁ
జేయ బ్రహ్మావతారుఁడై క్షితిఁగవీంద్రుఁ
డయ్యెనో! తన యింటి పేరయ్యె విశ్వ
నాథ; సత్యనారాయణ నామమయ్యె!!

భారత భారతీ హృదయ వల్లకి మీటి, పరేహ మార్గ స
త్సారపు సంప్రదాయముల సంగతులన్ బలికించి, జీవనా
కార రసైక గానమున క్రమగతిన్ జగదంతరంగమున్
ధీరత నాక్రమించు స్వర తేజుని గొల్తును విశ్వనాథులన్!

ధర్మ మాయన పవళించు తత్త్వజలధి
అర్థ మాయన పద మొత్తు ఆదిలక్ష్మి
కామ మాయన సేవించు క్రవ విడెము
మోక్ష మాయన వాఙ్మయామోద ముద్ర!

దేవప్రాణ ఘనుండు, నైగమ బృహద్విజ్ఞాన తేజుండు, పా
రావారాయత సాహితీ విభుడు, ధాత్రి స్వాంత బింబీకృత
ప్రావీణ్యుండు, ప్రపుల్ల పుణ్య కథ నోద్భాసాది శేముండు, ఆం
ధ్రీ విద్వన్నిధి విశ్వనాథ ధర తోర్వీజ్ఞాన పీఠంబగున్!

శౌర్య పరాక్రమ స్ఫురణ సంపద - భావ పరంపరన్, మహౌ
దార్యము చేతలన్ , విబుధ దర్శిత దర్ప దవాగ్ని మౌర్ఖ్య దు
ష్కార్య జనాటవిన్, పరమ సాత్త్విక వర్తన సాధుమండలిన్
పర్యవళించు 'సత్య' కవి వర్యులకున్ బ్రణమిల్లు దెల్లెడన్!

నవలల్ నాటకముల్ కథల్ విపుల విజ్ఞాన ప్రభా వ్యాసముల్
కవనంబుల్ ప్రియగీతముల్ నిశిత వాగ్వైమర్శిక గ్రంథముల్
స్తవనీయంబుగ సృష్టిఁజేసి తెలుగున్ స్వర్గీకరించెన్ గదా!
''కవి సమ్రాట్'' రసమూర్తి; తద్యశము శ్రీకర్పూర ఖండంబగున్!

భువిని రామాయణ మహద్విభూతి యెంత
వెలుఁగు వెలుఁగు నంత వెలుఁగు విశ్వనాథ
సత్యనారాయణ వెలుఁగు - శారదా క
టాక్ష వీక్షణ చాంద్రీ మయాగ్ని సాక్షి!

## సత్కవిత్వ త్రివిక్రముడు

—శ్రీ కనమలూరి వెంకట శివయ్య I.A.S.

తెలుగుల గర్వకారణము; దివ్యదఖండ మహాంధ్ర భారతీ
కలన రుచిచ్ఛటా ప్రబల కారణ మప్రతిమాన పాండితీ
జ్వలిత కవిత్వ సౌధముఖ శాశ్వత మౌక్తిక తోరణమ్మునాన్
వెలసిన విశ్వనాథ కవి ప్రీతి మనమ్మున సంస్తుతించెదన్.

మందార మధుతుల్య మధ్యాక్కరలు వ్రాసి, తెనుగువారల నీవు తనిపినావు;
వేయితంత్రుల వీణ వేడ్క మీటిన రీతి, వేయి పడగలను విప్పినావు
కల్పవృక్షమువ్రాసి, కల్పవృక్షము పోల్కి, పఠితకానందమ్ము పంచినావు
కులుకు కిన్నెరసాని పలుకుల వినిపించి, శృంగార వీథుల చేర్చినావు.
ఆంధ్ర ప్రశస్తిని అక్షరరూపాన, నింగి నల్గడలలో నిలిపినావు
క్రొత్త నాగరికత పెత్తనమ్మును గాంచి, చక్కని మార్గమ్ము చెక్కినావు
కడిమిచెట్టును పెంచి, కథకలోకమ్మున, అతులిత ఖ్యాతిని అందినావు
గాంధి నేతృత మెచ్చి కైమోడ్పు లర్పించి జాతీయ భావాల చాటినావు
గిరికుమారుని ప్రేమ గీతాల, కేదార గౌళలో, గళమెత్తి కలిపినావు
బద్దన్న సేనాని ప్రఖ్యాతి కీర్తించి చారిత్రికాంశాల మీటినావు

కొండవీటిపై పొగమబ్బు కులుకుగాంచి
రంగు రంగుల చిత్రమ్ము వ్రాసినావు
ఒకటి యననేల సర్వమ్ము నొదిగెనయ్య
త్వత్కవిత్వ త్రివిక్రమ తనువునందు

ఒకచో మైహిక శైల శృంగ సరదుద్యోగాత్తవాః పాతమున్
ఒకచో పున్నమిరేల పాల్కడలి తాలోత్తాల భంగమ్ములన్
ఒకచో నెమ్మిలి నెమ్మి ఆట ఒకచో ఉయ్యాల జంపాలలన్
సుకవీ పోలును నీ కవిత్వనటనల్ సొంపారి పెంపారుచున్.

నీకైత ఒకమారు నీరంధ్ర నీరద వర్షణ స్ఫూర్తితో వరలుచుండు
నీకైత ఒకమారు నిర్మల మల్లికా హారసౌరభలీల నలరుచుండు
నీకైత ఒకమారు నిస్తుల పాథోధి వీచీ విలాసాల వెలయుచుండు
నీకైత ఒకమారు నృత్తకళా స్రష్ట నీలకంఠఖ్యాతి నెగడుచుండు
నీకైత ఒకమారు పైక మంజుల పంచమ శ్రుతి ఇంపుగా మలయుచుండు
నీకైత ఒకమారు, నెఱజాణ ప్రియుగాంచి, కనుగీటినట్టుల క్రాలుచుండు
నీకైత ఒకమారు నిర్భీక సైనిక బాహు దండము పోల్కి ప్రబలుచుండు
నీకైత ఒకమారు నిర్ఝరీ నిర్భర భూధ్రశృంగమ్ముల పోలుచుండు
నీకైత ఒకమారు నీరజాసవమత్త మధు పరాగము పోల్కి మలయుచుండు
నీకైత ఒకమారు పాకారి మత్తేభ ఘీంకారమును బోలి కెరలుచుండు

ఒక్క వైఖరి యననేల? ఒరవులన్ని
పిండుగట్టి నీ కైతలో నిండెనయ్య
జ్ఞాన పీఠమ్ము నెక్కిన సత్కవీంద్ర
సత్కవిత్వ త్రివిక్రమ స్వామి నీవు.

కాయము వీడినావు భువి; కాని తెలుంగుల గుండెలం గడుం
దీయని భావనాకృతిని దీప్తి వసించెదు శాశ్వతమ్ముగన్
నీ యసమాన పాండితికి నిస్తుల కవిత్వ ధాటికిన్
తోయజగర్భురాణి పదనూపురముల్ కదలంగ మెచ్చెలో!

## సత్కవీంద్ర నమోస్తుతే

ఇచ్ఛత్ సంచరితుం వాణీ
భూమ్యామాంధ్ర్యాం తు ధీమతీ
ఇచ్ఛన్నిత్యం తథాస్నాతుం
కృష్ణాగోదావరీ జలే

కవిత్వమాంధ్ర భాషాయాం
తథావై గ్రథితుం భృశం
తస్మాత్ సా పురుషాకారం
ధరతిస్మ కుతూహలాత్.

త్వంత్వ మేవతు సాదేవీ
విశ్వనాథ కవీంద్ర భోః
సత్యం పుంభావ వాణీత్వం
విశ్వనాథ! నమోస్తుతే!

ఆంధ్రావళి హృదయారామే
నిత్యం త్వం నవ మల్లికా
ఆంధ్ర సత్కవితా మార్గే
సత్యం త్వం కరదీపికా.

వయం నవిస్మరామస్త్వాం విశ్వనాథ మహాకవే!
సత్యనారాయణ! ప్రాజ్ఞ! సత్కవీంద్ర నమోస్తుతే!

## విశ్వనాథ రసాకృతి

'శతావధాని చూడామణి'

—శ్రీ మాడుగుల నాగఫణిశర్మ

నీ వోలెన్ పరమేశ్వరేశ్వరునితో నిర్భీక సంపాకమై
భావావేశ విలాస దీ ప్రతిభ సంభాషించు వాడేడి! వి
ద్యా వాఃపూర తరంగ సారనిలయా! ద్యావా పృథి వ్యంతరిన్
మీ వైదగ్ధ్యమునేన జూతునిట స్వామీ! వైశ్వనాథా న్వయా!

శతజయంతికి శతనమస్కృతి
జయము కవితా సంస్కృతి
విశ్వనాథ రసాకృతీ!
విశ్వమే నీ ఆకృతీ!

కల్పవృక్షపు కలికి వెన్నెల
కలువు జగతిని నాటినావు
వేయి పడగల వేదసంస్కృతి
విశ్వ మెల్లెడ చాటినావు
కోటి భాషా హృదయ తంత్రుల
గోటి కొసలను మీటినావు

మాటలకు మనసులకు ఆత్మకు
ఆవలితీరం దాటినావు
విశ్వనాథ రసాకృతి!
విశ్వమే నీ ఆకృతి!

## వేయిపడగల విశ్వనాథుడు

—'కవి పితామహ' శ్రీ ఈట్ల కొండయ్య

నృత్య మొనర్చు నొక్కతటి, నృత్త మొనర్చు మఱొక్కవేళ, సం
స్తుత్య మృదూక్తి లాస్య పరిశోభితమై చను నొక్కెడన్ మహా
ద్ధత్య కరాళ తాండవ విధాయియగున్ మఱియొండుచోట
నిత్యుడ! విశ్వనాథ రమణీయ భవత్కవితా విలాసముల్.

విశ్వనాథ! యనుచుఁ బిలిచినఁ జాలును
మా త్రిలింగ పుణ్య ధాత్రిలోన
బ్రన్ననంపు బాట కిన్నెరయై పాఱు
ఐద్యకోటి వేయి పడగలెత్తు

నీ కవితామృతోదధి యనిద్ర గతిన్ పెనుగొండ లట్టలల్
జేకొని యాకసమ్మునకు లేచిపడున్ పృథుఘోష నల్దిశల్
బ్రాకి ప్రతిధ్వనింపగ ప్రపంచము, మాదృశ కావ్య బాలకుల్
నీ కవనాంతికమ్మున జరింపగ నోచరు మందభాగ్యులై

చెలియలికట్ట యోచు వలచెం, గయిదోయి జగమ్ము నిండగా
నిలిపి కవుంగిలించె నిను, నిర్భర దుర్భర కాంక్ష దీర్పగా
దలచి కవిత్వమయ్యనుగు దన్వి ముహూర్ముహు రూర్మికావళీ
విలసిత చుంబన క్రియల వేడుకదీర్తువు కావ్య సాగరా!

నీమతి కల్పవృక్షమయి నేల జనించి దివమ్ముదాకెఁ ద
ద్రాముడు దత్ప్రియానుజుడు లక్ష్మణుడున్ ప్రియభామ సీతయున్
భూమికి డిగ్గి, దాన నిలబ్రోచి విపత్పరి హర్తలై పరం
ధామము జేరరే మరలి త్వత్కృతి మెక్కి కవి ప్రకాండుడా!

అప్పుడాంధ్ర ప్రశస్తియై యవతరించి
సాహితీ విశ్వనాథ విజయపతాక
మిపుడు రామబాణాగ్రాన నెగిరె కావ్య
కల్పవృక్షమ్మగుచు నిర్వి కల్పమగుచు

సత్యమునకు నీకు సాంగత్య మెట్టిదో
పేరగలదు కలసి నోర గలదు
మనమునందు గలదు పనుల యందును గల
దెఱుక లేనివారు గరువమనిరి

నిర్భయ భావాభివచో
నిర్భరుడవు వీరవరుల నిలయమ్మగు నీ
నిర్భాగ్య కాలమున నా
గర్భ సమరశీల శాంత గంభీరమతీ!

తలచి నిను, నీ పలుకుఁజెఱు
కుల తీయదనాలు గ్రోలి, కుందనపుం బొ
మ్మలు త్వత్కల్పిత పాత్ర
మ్ముల గలలంగని మహాంధ్ర ధారుణి మురియున్

భాష నీకు గోవు భావమ్ము దుగ్ధమ్ము
గీత సంతతి నవనీత మగును
కావ్య నవ్య సృష్టి కమనీయ ఘృతమాయె
తెలుగు నీ కతమున వెలిగెనయ్య!

ఓ భావనార్షి! యార్ష
ప్రాభవ సాహస్ర శీర్ష! వాగర్థశ్రీ
శోభావృతా ఘమర్షణ
వైభవ కవితా ప్రకర్ష! వందన మయ్యా!

# శ్రీ విశ్వనాథ నవకము

—శ్రీ అయాచితుల హనుమచ్ఛాస్త్రి

తెలుగు సాహితీవేత్తలఁ బలుకు విలువ
గలుగు, పలుకు పూబోటిరా చిలుక యితఁడు!
దంబుమీఱ, ఘనాఘన డంబరంబుఁ
బలుచఁ జేయు వాగ్ధాటి సంభ్రమ మితండు

వివిధ సాహితీ ప్రక్రియా విరచనైక
కావ్య నవలాకచాస్త్రృతి గమ్య పుష్ప
వాటికా పరిమళ లుబ్ధ వన్నగుడు! స
హ్రాస ఫణిఫణా విష్కార హసిత ముఖుడు!

తెలుగు నిగారవుం హొయలు
తేర్చిన, పల్కుపసందు తేద, నీ
చలువను, తెల్గు భారతికి, జవ్వన సోయగముల్ వెలార్చె నాం
ధ్రుల కవి మార్గమార్గమున నూత్నములన్
మురియించి, సర్వ కా
వ్యలహరులందు, డోలికల నాదగఁజేసితి సత్య సత్కవీ!

ఆయత దీర్ఘ బాహుడు మహాప్రతిభా
విభవాభి రాముడా
శాయత కీర్తిశాలి, కవిశౌండుడు
పండిత శేఖరుండు రా
గాయత కావ్య పాఠకుడు, కావ్యవనీ
మృగరాజు, సత్యనా
రాయణ విశ్వనాథుడు, మదర్చిత
కావ్య గురుండు - మ్రొక్కెదన్-

మద్గురువులు శ్రీపాదులు
సద్గీర్వాణాంధ్ర కృతి రచన, లబ్ధప్రతి
ష్ఠోద్గాతలు సత్యకవులు
ప్రోద్గీరిత భావపూరపులకిత రసికుల్!

వాని కళివందన సహస్ర వర్షమెల్ల
యెడల గురిసె, నాంధ్ర జననీ హృదయహర్ష
కారకముగ, నాంధ్ర సరస్వతీ రదచ్ఛ
దస్ఫుటిత మందహాసముల్, తళుకులీన

డిగ్రీల - లేని పాండిత్యమ్ము వన్నెకు
రాగనీ మంచికాలమ్ము పుట్టె;
నీ సాహితీజ్ఞాన నిర్మలాంబః పూర
మూసరక్షేత్ర వర్షోదకమయ్యె!
ఎటనొ, యే చోటనో, యేటికో కోటికో
సత్కావ్య పఠనాభిషక్త చిత్త
పండిత పాఠకుల్, పరిధవిల్లినచోట్ల
జిహ్వా హృదయముల్, విశిష్ట తృప్తి
కావ్య మధువాని, వహ్వాల కరగి మరగి
హృదయ ముప్పొంగ, శిరము కంపింపజేసి
మెత్తురు, నిను వారెంత ఉదాత్తమతులు!

'వేయి పడగల'వి, విప్పారికొనివచ్చి
తెలుగు సౌభాగ్యమ్ము వెలుగు లీన,
'చెలియలికట్ట' విశృంఖల వృత్తిప్రవ
వృత్తుల, లక్ష్మణ రేఖ గీయ,
'మా బాబు' భిన్న సామాజికులందు సౌ
భ్రాత్ర సంపత్తిని వదిలపఱుప
'బద్దన్న సేనాని' బాహావిహార పా
టవము, నేల వలపు ఢంక మ్రోయ
నవలలు రచించి, నూత్నంపు జవుల జూపి
తెలుగునాటి, నాటి ప్రతిభలకు వెల
నాటి, సమ్మోహపఱచె, సత్యకవి, రసిక
పఠితృహృదయ మాధుర్యముల్ పరవశింప!

రామాయణ కృతి రచనా
ప్రామాణికత, తెలుగులకు, రసవాహినులన్
సీమాబాహిర సుందర
తామాకందము లొసగిన, ధన్యుడవోహో!

## కవితా నీరాజనం

అవధాన విద్యావాచస్పతి
—రాళ్ళబండి కవితాప్రసాద్

**మేఘవిస్ఫూర్జిత వృత్తం :** 19 - అతిధృతి - 75458 వృత్త -
విశాలమ్మౌ ధాత్రిన్ కవికులమునన్ విశ్వనాథా మహాత్మా
ప్రశస్తమ్మౌ కావ్యాల్ జగతిగతినే ప్రస్తరించే విధానన్
ప్రసాదించే నీ శక్తి గతి పరికింపన్ విధాతా సతీ ది
వ్య శక్తిన్ నీయందా వరణ మగుచున్ వ్యక్తిగా రూపమందెన్

**కవిరాజ విరాజిత వృత్తం :** 23 - వికృతి
విజయుడవై సుకవిత్వ చరిత్రను విస్తృతి జేసితి వీవుగదా
ప్రజలకు ధర్మ పరాక్రమ శక్తిని భావములందున వ్రాసియు నీ
వు జడుల గుండెల స్ఫూర్తులు పొంగగ నోజను నింపితివోయి కవీ
అజుని సతీమణి ఆత్మను గాంచిన అద్భుత వ్యక్తివి నీవు ఋషీ!

**క్రౌంచ పదవృత్తం :** 24 - సంకృతి
సుందరమైధబంధుర మౌచున్ సురుచిరసురభిళ సుకవిత లెల్లన్
సంధిలుచున్ సౌగంధికమౌ పుష్ప సుపరిమళముల సరముల నల్లెన్
వందనమే నీ వందుకొనంగన్ ప్రణతుల గొనుమిదె వర సుకవీంద్రా
వందిత మౌచున్ మీకవిసమ్రాడ్త్వము అతులితమయి ధరపయి నిల్చున్

**భ్రమరకూజిత వృత్తము** 21-ప్రకృతి - వృత్తసంఖ్య 765617
వేద ధర్మముల విశ్వనాథకవి విజ్ఞతాగరిమ వార్ధియే
సాధుమార్గమున సత్యసత్కవిడి సాగుమార్గమది నవ్యమౌ
శోధనల్ వెలసి చోద్యమైచురస సుందరమైచు ప్రశస్తమౌ
గాథలన్ జదివి జ్ఞానులై ప్రగతి కారులై భువిని వెల్గుడీ

**మధ్యాక్కర**

ఓంకార మనుశబ్ద మక్షరాత్మతో మొదలగును
హ్రీంకార నాదమై పదమై రవళించు నయ్యదియె
క్లీంకార సుందర కావ్యమై రసలీల యౌనదియె
ఐంకార శక్తియై నిలచి రక్షించు నందరి నిలను.

**విశ్వనాథవృత్తం** (ధృతి-18) 46826 వృత్తసంఖ్య

ఘనమై నవద్య కవితన్ శమనీ యగతిన్ రచింపన్
తనజీ వితమ్మునసదా తపియిం చియుధర్మసంస్థా
పనకై వ్యయించి కవితన్ ప్రగతిన్ గనెస త్యనారా
యణసత్కవీంద్రు డనుసాహసిభారతదేశమందున్.

## సుమాంజలిః

—శ్రీ సుధీంద్ర ప్రహ్లాద

శ్రీ విశ్వనాథ కవి పండిత సార్వభౌమ
సుజ్ఞానపీఠల సదామృత కావ్యశిల్పాత్।
ఐధిష్యదాంధ్ర సురభారత భానుదీప్తిః
విశ్వాఢ్య వాఙ్మయనభస్య ప్రభాంగణేషు॥

రమణీయ మహాద్భుతశైలి హితమ్
వివిధం, విమలం, విపులం, బహుచి।
త్రపథాగమసారసుధా కలితమ్
ఖలుసత్యసు విశ్వకవిత్వ మిదమ్॥

రసమయ శుభ విశ్వశ్రేయ కావ్యానవేకాన్
సరల తరల సత్ప్రౌఢీ ప్రసాదానుసారాత్।
సకల సుగుణ సంపూర్ణాను మోద ప్రభావాత్
దశది శిషు సుధాధావల్య కాంతే రతన్వన్॥

హాహాహూహూ తతోఽపిలందను ట్రపవారేతి చాతుష్పథే
స్థిత్వాం గ్లేనసు భారతీయ బలధీ సామర్థ్యమేధిష్యతే।
ఆంగ్లాభ్యాస మహోపత న్నిత్రికవేభ్యో విష్ణుశర్మాత్పురా
తానష్టాదశ సైంధవాంకిత పురాణద్వేష కావ్యాదినా॥

తవకిన్నెరసానిగైః స్రవన్తి
మృదు మాధుర్య పదాంధ్రదేశే।
ప్రణయామృత పాన సత్సుమత్స్యా
ద్భుత హిందోల సుఖమ్ పునాతి నిత్యమ్॥

తవఖావామృత సించితాక్షరములై తత్తద్రసాలంకృతీ
కవితాశైలి సువ్యాకృతీ ధ్వనులునై గంబీర సత్కయ్యలై
చవులూరించెడు నారికేళకదళీ సద్ద్రాక్ష పాకమ్ములై
రవిచంద్ర గ్రహతారకాభ్రగతులై రాజించు విశ్వోక్తులై.

తవగీర్వాణకృతేందిరాంధ్రనుతి సంస్తవ్యప్రబంధాలతో
నవరామాయణ కల్పవృక్ష విపులామ్నా యార్థభాష్యాల, నా
హవబద్ధన్నను, విశ్వనాథుననులన్ ఆయేక వీరాంగనా
రవకావ్యాలిడ విశ్వనాథ సుకవీంద్రాసాధ్యమా, యేరికిన్.

నీకేబల్లగు జ్ఞానపీఠల సదానేకాలు, విజ్ఞానది
వ్యాకాశంబున, కర్మసాక్షి కిరణా భాయుక్త సన్మానముల్
సాకారంబగు విశ్వనాథ కవితా స్స్రమాట్ సభా శోభలున్
సాకల్యంబగు విశ్వశ్రేయ కవితా సామ్రాజ్య వైదుష్యముల్.

తిరుపతి వేంకట గురువుల
గరిమము బహుబాగబెంచు ఘనశిష్యుడ, నీ
నిరుపమ స్వర్ణ కిరీటము
మెరసెడు సుజ్ఞానపీఠి - మిహిరాభములన్.

వేనకు వేలు పద్యములు, విజ్ఞవిమర్శలు నాటకమ్ములున్
జ్ఞానవికాసబోధనల జక్కని కావ్యకథా మనోజ్ఞ వి
జ్ఞానసుధాలయాల బహు ఛాత్రకులమ్ముల నుద్ధరించు, స
న్మానిత నాకలోక కవి నాథుడు సత్యము విశ్వనాథుడే.

## "విశ్వనాథ స్తవనవమాలికా మాలిక"

—శ్రీ జి. సుబ్రహ్మణ్యశాస్త్రి

శ్రీమ త్తిర్పతి వేంకటేశ్వర గురుశ్రీ పేటికాంతర్మహా
హేమస్థండిల శిష్యరత్నమవు, స్వామీ! ఆంధ్ర సాహిత్య స్వ
ర్భూమీ మండల మందు మీకు సరిగా పోల్పంగనేరీ? సదా
సామంతంబె కవీంద్ర చంద్రులకు; భాస్వద్విశ్వనాథా! నమో!

పాండిత్య ప్రతిభా విశేష సుషమా పాథోధి సంభూత బ్ర
హ్మాండ జ్ఞానపిచంగ బాడబ మహా హవ్యాశనా! భారతీ
గండూషీ పదశబ్దవైభవ లసద్గాండీవ! చండాంశువ
త్ఖండాంతర్విలసద్యశోద్యుతి సమేతా! విశ్వనాథా! నమో!

ఆధునికాంధ్ర వాఙ్మయ విహాయస మార్గచరన్మరాళ రా
జా! ధరణీకవీంద్ర సురసంఘ గురూత్తమ! రామకావ్య దీ
క్షాధుని నిత్యసిక్త వికచన్నవపద్మ మరందపాయి! శ్రీ
మాధవగీతికా కవన మాధురిదేలెడి విశ్వనాథ! జే!

కిన్నెరసానికుల్కు తిలకించి మనంబున పుల్కరించి; ఆ
సన్నరసానుభూతి నటు జాగ్రదనేక విభావ సుందరీ
సన్నవలాస్యభంగిమలు సర్వము సుందర శబ్దభావ సం
పన్నత జేర్చి తెల్గులకు మాన్యత దెచ్చిన విశ్వనాథ! జే!

'మాస్వామీ!' భవదాంధ్రజాతిగత సమ్మాన్యాభిమానమ్ము తా
నిశ్వాసించె 'సహస్రభోగముల' సందీప్త ప్రభాపూర్ణమై
విశ్వాస ప్రకటీ కృతాఖిల మహావేలావృతాంభోధిగా
నాశ్వాసమ్ముల నిండి 'వెల్గెను' పురాణారాతి గ్రంథావళుల్!

బద్ధన్నల్ తెలుగన్నలై వెలుగ సంభావించి; వల్లన్నలన్
వద్దన్నన్ సరవుజ్జి నిల్పి; ఘనవేనాధీశు నూకొల్పి; మా
యొద్దన్ శంభు ప్రదిశూలమున్ బనిపి, మాయోపాయ బాణామతిన్
సద్దుంజేయక మాన్పి; వానిగొనితో స్వామీ! నమస్తే! నమః!

చెలియలికట్ట దాటని విశేషగతుల్ నియమించి, భారతీ
యుల కతులాభిమాన సగుణోజ్జ్వల భావనమద్ది నాక భూ
ములకును నిచ్చెనల్ నిలిపి; ముద్దుగ సుద్దిగ మాదుబాబులన్
కిలకిల కోకిలాలపన గీతుల ముంచిన విశ్వనాథ! జే!

మనసులదోచు నాగిరి కుమారుని చక్కని ప్రేమగీతికా
ధునుల సరింపజేసి రసదుందుభి మెరిసి తెలుంగు బావుటా
లను దిశలెల్ల నెత్తి; భవలంపటులై చనువారికింపుగా
వినబడ బ్రహ్మగీతికల వేమరు బాడిన విశ్వనాథ! జే!

నేపాళమ్మున దృష్టి సాచి, అటుపై నింపార కాశ్మీరమున్
భూపాలావళి నట్టె చూచి, హహహా! భో! విష్ణుశర్మా! యటం
చాపాండిత్య విశేషముల్ జదివి; శంసారీతి సారంగ స
ల్లాపమ్ముల్ పలికించి మించిన కలాపా! విశ్వనాథా! నమో!

భ్రమరీసుందరి కంజలించి ఘనగర్జారావ పాథోధి తే
రమునన్నిల్చి విశిష్ట వేదవతి నర్చారీతి మన్నించి భా
వమునన్ అక్కఱదీరు కైతలను సంభావించి వేమన్ననల్
క్రమరీతిన్ గయికొన్న ధీరమతి! సత్కావ్యాబ్ధిస్రష్టా! నమో!

భవదతి గాఢనిష్ఠ, రసవన్మృదు దీర్ఘ సమాసబంధవై
భవ, మెదదాకి పూర్వభవబంధములన్ గిలికించు భావనా
చ్ఛవి; అళిపాళి ఝుంకృతుల సందడి మించిన శబ్దనాదదు
శ్చ్యవన విమోహజాలమది! దాంగురె! అన్యుల కీసునింపులో!

పాషాణమ్మట మీదు శైలి! అవురా! ప్రాగ్భాను రక్తాంశు స్ర
గ్భూషాలంకృత పార్వతీయ పులకోత్ఫుల్లాభిరామాత్మలన్
'వేషామాయిక' జంతుజాలముగ సంవీక్షించుటెట్లో? అదే
దోషారోపణ సేతయిద్ది! కనవద్దో? అన్యసత్కావ్యముల్!

యుష్మదతీంద్రియార్ణవ నయోజ్జ్వల భారత భావమాలికా
ర్చిష్మదనూహ్య ఖేలన విశిష్ట విశాల పరిప్రభాతతుల్
ఊష్మ మొనర్చె గాదె! అరి యూధ వృథాకువిమర్శ కందులన్!
గ్రీష్మనిదాఘ భారవివి! కీర్తిపయోనిధి పూర్ణచంద్రమా!

భవదీయంబగు పాముపాట వినినన్; బ్రహ్మాఖ్య గీతావళీ
శ్రవణంబందున మున్గినన్; గిరికుమారాలాపనల్ విన్ననున్;
చెవులన్ కోకిల పెళ్ళి పాటల ప్రశస్తిన్నిల్పి సంతృప్తిమై
నవదృక్కోణమునందు జూచినను మిన్నందున్ భవత్కావ్యముల్!

అద్యత నాంధ్రభారతికనంత యశఃప్రభలీను పద్యగ
ద్యాద్యతి ముగ్ధభూషణ విధాన మలంకృతి సేయనేర్చు త
ద్విద్య నెరింగినట్టి జగదేక కళామతి యెవ్వరన్నచో
తద్యశమన్యధా చనక, దక్కును మీకె కవీంద్రచంద్రమా!

'మధురమురా మురాసుర విమర్దన' యంచటు తీయనైన ప
ద్య ధునుల నెన్నియో ప్రణయదర్శన దర్పణరీతి వ్రాసినా
రధిగత కీర్తి శృంగగిరి రాజిలినారదికాంచలేని వా
రధమ విమర్శ శస్త్రముల రాశుల మీపయి గుప్పినారుపో!

తెలుగున నెన్నిలేవు తరితీపుల నించెడి రామకావ్య రా
శులు? ఎవరేవిధమ్ము నను జొక్కనగాని భవద్రసానుభూ
తుల కదయంచులైన; నవతోయదమండల మెత్తునైన, లో
తులచివరైన దాకిరె? విదూషకపాళి యెఱుంగునేమి? గా
థల తలమానికమ్ము గద! ధన్య భవద్రఘు కల్పవృక్షమే!

రసమయ శబ్దనాద మధురామృత
సాగర సన్నిభాంధ్ర సా
రసతతి కావ్యలోక విహరద్భవ
వర్షములెన్ని నాళ్ళో? ఆ
కసమున చంద్రతారకల క్రమ
పరిభ్రమ మెన్నినాళ్ళో? మీ
రసపదనేక కావ్యములు రంజిలు
నన్నియుగాలు నిత్యమై!

## కుసుమాంజలి

—శ్రీ మహాకాళి వేంకట్రావు

చం॥ కవియననీవెగా, కవులకాంతి కిరీట స్వరాట్టువీవె, మా
నవతర కావ్యదీధితికి నాణ్యత పంచిన కావ్యభాస్కరా
కవనము ఆత్మద్రష్టము, ప్రకాశము పెంచునటంచు, భారతీ
రవమును నీదు కావ్యముల రంజిలజేసితి విశ్వనాథరో.

ఉ॥ జ్యోతులకెల్ల జ్యోతియయి, యోగులగుండెల నిండియున్న, శ్రీ
మాతయు దివ్యసీమ పరమాకృతి, పూర్వజ, మాతృమాలికా
పూతసువర్ణరాజ్ఞి, పరిపూత వికాస విశేష శేముషీ
వ్రాతము నీ కొసంగిన నివాసమెకాదొకొ కల్పవృక్షమున్.

కం॥ పలుకులు విరుపులు పటికపు
పలుకులవలె తియ్యనగుచు పరువముతోడన్
కులుకుచు కవనము పేర్మిని
సులువుగ రచియించు గురుని స్తోత్రముజేతున్.

మ॥ ఒకచో చందురు బోలియుండు నొకచో నుష్ణాతపజ్వాలతో
ఒకచో శర్కర క్షీరభాండ మొకచో నుత్కృష్ట గంగోదకం
బొకచో మెత్తని దూదిపింజలొకచో నోరూరు ఐస్క్రీము, పో
లిక సమ్రాట్టు కవిత్వమున్ పరగుగా లీలావిశేషంబుగాన్.

ఉ॥ మంగళమయ్య నీవిబుధమానిత దివ్యకవిత్వ శక్తికిన్
మంగళమయ్య నీవిమలమండిత భవ్య సుదీర్ఘ కీర్తికిన్
మంగళమయ్య నీదుమహిమాన్విత పాండితివిశ్వమైత్రికిన్
మంజుల కల్పవృక్ష కుసుమాంజలి పర్వసుగంధ శ్రీలకున్.

## "విశ్వనాథ!"

—డా॥ తిరుమల శ్రీనివాసాచార్య

వాల్మీకిఋషి దివ్య భాసురరూపమ్ము
        నవలోకనము సేయు నాశ కలిగె
కాళిదాస కవీంద్ర కమనీయరూపమ్ము
        కలనైన గాంచక గాయమయ్యె
నన్నయ్య నొక్కక్షణమ్మైన జూడలే
        దను విచారమున నాయాస మొదవె
తిక్కనగారితో నొక్క మాటైనను
        పలుకలేదని లోన బాధ పెరిగె
అల్లసాని కవీశు నలనాటి సభలోన
        కలసికొనగలేక కలత హెచ్చె
కాని - ఈనాడు వారె నా కనులముందు
విశ్వనాథ! నీ రూపాన వెలసి దివ్య
లలిత కవితల నొక్కచో నొలకబోయు
చుండ నా గుండె పొంగె; ధన్యుండ నేను.

ఈనాటి రాకెట్టు లానాటి బాణాలు
        నీ పద్యవేగాన నిలిచిపోవ
మల్లికా మందార మకరందవాహినుల్
        భవదీయ కవితలో పరుగులెత్త
స్వర్గాధిపతిచేతి వజ్రాయుధము నీదు
        సన్నిధి పరిచర్య సల్పుచుండ
శాస్త్రయోధులు భిన్న శస్త్రాస్త్రముల బూని
        నీ కనుజాడల నీడనుండ
కారణమ్మేమి? తెలిసె నీ క్షణమె - కవన
మనెడు విశ్వానికంతటి కధిపతివని
లేకయున్నచో శారదా లీలలన్ని
విశ్వనాథ! నీ ముఖమున వెడలు టెట్లు?

శ్రావ్యములై రసానుభవరమ్యములై భవదీయ ప్రక్రియల్
నవ్యలలోన నవ్యలను నవ్వల పువ్వలదేల్చు నీ మహా
కావ్యగతార్థముల్ జలధిగర్భ గతాఖిల రత్నకాంతులై
దివ్యపునీత మార్గమును తెల్లమొనర్చుగదా, మహాకవీ!

సూటి మాటల ఈటెలన్ పోటు పొడుచు
గుణము నీదని కొందరు గొణుగుచుంద్రు
కమ్మగా పల్కి వెన్క విషమ్ము జిమ్ము
వారికన్న నీ మాటలే బాగుబాగు.

ఇమ్మహిని నీవె జ్ఞానపీఠమ్ము విశ్వ
నాథ సత్యనారాయణ! నవయుగమ్ము
నీదు పేరున వెలయుచు నిలచునట్టి
మహితశక్తి నీది ఇదె నమస్కృతమ్ము.

గంగ ఈ భారతమ్మున కదలుదాక
కల్పవృక్షమ్ము వెలుగు ననల్ప మహిమ
వే వెలుంగుల దొర నింగి వెలుగుదాక
వెలిగెదవు నీవు తెలుగులో విశ్వనాథ!

*

విశ్వనాథ! నీ జయంతి తెలుగుభాష కొక పర్వం
మహాకవీ! నీ మనుగడ భారత సంస్కృతి సర్వం
సారస్వత విశ్వనాథ! సత్కవితాశ్రీసనాథ!
నీ పేరూ నీ తీరూ తెలుగుజాతి కొక గర్వం.

*

మాటల్లో జ్వాలిక రేగె
మాన సాన మాలిక లూగె
సత్కవిరాట్! నీ బ్రతుకంతా
సంప్రదాయ గీతిక మోగె

*

పూయించిన ప్రతి పుష్పం ఇచ్చేశావు
వెలిగించిన ప్రతి దీపం ఇచ్చేశావు
విశ్వనాథ! నీతో రవి చంద్రుల నింపి
పండించిన ప్రతి పుణ్యం ఇచ్చేశావు

*

తెలుసునా, కృష్ణానది జలమెంతటిదో?
తెలుసునా, కనకదుర్గ మహిమెంతటిదో?
శివకేశవు లిద్ద రతని పేర నాదిగినారు
తెలుసునా, విశ్వనాథ విలువెంతటిదో!

*

ప్రతిభయె రూపం ధరించివస్తే - విశ్వనాథుడే
హిమగిరి శిఖరం చలించి వస్తే - విశ్వనాథుడే
వర్షామేఘం కవనం వ్రాస్తే - విశ్వనాథుడే
వాణి ఆంధ్రుడై వసుధ జనిస్తే - విశ్వనాథుడే!

# విశ్వనాథ సాహితీ సమాలోచనం - నివేదిక

డా॥ బి. జయరాములు
కార్యదర్శి, యువభారతి.

మూడు దశాబ్దాలుగా నిరంతర సాహిత్యసేవలో యువభారతి అగ్రస్థానంలో ఉన్న విషయం సాహితీలోకానికి సువిదితమే. అపూర్వమైన, అరుదైన అనేక కార్యక్రమాలను నిర్వహించి రసజ్ఞుల ప్రశంసలందుకుంటున్న యువభారతి ది. 4-9-1994 నుండి 3-9-1995 వరకు ఒక సంవత్సరం పాటు మహాకవి, నాటకకర్త, నవలాకర్త, విమర్శకుడు, నవ్యసంప్రదాయ సాహిత్యోద్యమ నాయకుడు, యుగకర్త, దార్శనికుడు, మేధావి, కళాపూర్ణుడు, జ్ఞానపీఠ పురస్కార గ్రహీత అయిన విశ్వనాథ సత్యనారాయణగారి శతజయంతి ఉత్సవాలను జరపాలని నిశ్చయించి, ఈ సంవత్సరోత్సవాలకు నాందిగా సెప్టెంబరు మొదటి ఆదివారంనాడు అత్యంతవైభవంగా మొదటి సమావేశం జరుపుకుంది.

మొదటి సమావేశంలో యువభారతి అధ్యక్షులు ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యంగారు అతిథులను, విశ్వనాథను పరిచయం చేశారు.

"అల నన్నయ్యకులేదు తిక్కనకు లేదా భోగ మస్మాదృశుం
డలఘుస్వాదు రసావతార ధిషణాహంకార సంభారదో
హల బ్రాహ్మీమయమూర్తి శిష్యుడయినాడన్నట్టి దావ్యోమపే
శల చాంద్రీ మృదుకీర్తి చెళ్ళపిళ వంశస్వామి కున్నట్లుగన్."

ఆంధ్ర పౌరుషానికున్న వినయాహంకారాల విశేష ప్రతిభ,వింతసోయగం విశ్వనాథగా అవతరించింది - అంటూ విశ్వనాథ గురించి పరిచయంచేసి అధ్యక్షులను, ముఖ్యఅతిథిని, వక్తలను పరిచయం చేస్తూ స్వాగతం పలికారు.

సభకు అధ్యక్షత వహించిన తెలుగు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు ఆచార్య పేర్వారం జగన్నాథంగారు "ప్రథమ జ్ఞానపీఠ అవార్డు గ్రహీత విశ్వనాథలాగా అన్ని ప్రక్రియలను సృష్టించినరచయిత నభూతో నభవిష్యతి. త్రిశూలం,

వేనరాజులాంటి గ్రంథాలను ఆయనే సృష్టించగలడు. ఆయన పురాణాలను, చరిత్రలను తనదైన దృష్టితో వ్యాఖ్యానించారు'' అని విశ్వనాథ సాహిత్య ప్రస్థానాన్ని వివేచించారు.

ఆనాటి సభకు ముఖ్య అతిథిగా విచ్చేసిన జ్ఞానపీఠ పురస్కార గ్రహీత, పద్మభూషణ్ ఆచార్య సి నారాయణరెడ్డిగారు ఉత్సవాలు నిర్వహిస్తున్న యువభారతిని, విశ్వనాథను ప్రశంసించారు. విశ్వనాథ ప్రతిభను కొనియాడుతూ, "నన్నయ్య, తిక్కన, శ్రీనాథుడు, రాయలు, పెద్దన, తెనాలి రామకృష్ణుడు మొదలగు ఆరుగురు కవులు 19 వ శతాబ్ది చివర విశ్వనాథగా అవతరించారు. ఆ ఆరు ముఖాలు కలిసి ఏర్పడ్డ షణ్ముఖుడు విశ్వనాథ. పద్యం చదవడంలో ప్రత్యేక బాణి విశ్వనాథది. కర్ణాటక సంగీతం నేర్చుకున్నారు. ఆయన పద్యంతో పాటు వచనం కలిపి చదివేవారు'' అన్నారు.

ఈ సమావేశానికి సత్యనారాయణగారి చిన్న కొడుకు పావనిశాస్త్రిగారు వక్తగా విచ్చేసి - విశ్వనాథ వారి జీవితం గురించి, సాహితీ జీవితం గురించి ఆర్ద్రంగా, విశ్లేషణతో వివరించారు. పావనిశాస్త్రిగారు ప్రసంగిస్తూ "విశ్వనాథ వ్రాసిన 'వీరవల్లడు' మా కుటుంబగాథ ఒక బ్రాహ్మణ కుటుంబాన్ని దాయాదులు నాశనం చేస్తుంటే ఒక హరిజనుడు నిలబడి దాన్ని రక్షించినగాథ దీనిలో ఉంది. తాను భుజించకుండా ఇంటికి వచ్చిన అతిథులకు భోజనం పెట్టించేవాడు. విద్యార్థులకు భోజనంపెట్టి జీతంకట్టి చదువు చెప్పేవాడు. తేనె అమ్మే దంపతులు మా ఇంటికి వచ్చేవారు. వారు అమ్మే తేనెకు వారి హృదయ మాధుర్యానికి ఏదో సంబంధం ఉంది ఉంటుందనేవాడు విశ్వనాథ. ఆయన గొప్ప లోక పరిశీలనం గలవాడు. తన 70 వ జన్మదినోత్సవ వేడుకల్లో పక్కింటి సుబ్బయ్యగారు 70 మామిడి ఆకులతో కుట్టిన విస్తరిని ప్రజెంట్ చేస్తే దాని శోభ చూసి వారు ముగ్ధులయ్యా"రని చెప్పారు.

మరోవక్త శ్రీ ఏలూరిపాటి అనంత రామయ్యగారు ప్రసంగిస్తూ "వేద వ్యాసుడు అష్టాదశ పురాణాలు ఎందుకు వ్రాశాడో విశ్వనాథ తన గ్రంథాలు అందుకు రాశారు. విశ్వము పట్టని మహాకవి విశ్వనాథ. 'వేయిపడగలు' నవలలోని ప్రతి పదాన్ని అర్థం చేసుకొని చదివితే విశ్వనాథ వారికి ఎన్ని విషయాలు తెలుసో అన్ని విషయాలు చదివినవారికి తెలుస్తాయి. విశ్వనాథ ప్రతి రచనలో జీనియస్సు ఉంది అన్నారు శ్రీ పి. వి. నరసింహారావుగారు. ఆయన రచన ఏ

భాషలో ఒదుగుతుందో దానిలోకి అనువదిస్తే అది ఆ భాషలో గొప్ప రచన అవుతుంది. 'కడిమిచెట్టు'ను మహారాష్ట్రిలోకి అనువదిస్తే అది ఆ భాషలో గొప్ప గ్రంథమైంది. విశ్వనాథ శబ్ద బ్రహ్మవేత్త" అన్నారు.

ఈ సభలో ఊట్ల కొండయ్యగారు విశ్వనాథ వారికి కవితానీరాజనం సమర్పించారు. సంస్థ కార్యదర్శి డా॥ బి. జయరాములు స్వాగతంపలుకగా శ్రీమతి కె.బి. లక్ష్మి వందన సమర్పణ చేశారు.

## రెండవ సమావేశం :

మహాత్మా గాంధి 125వ జయంతి ది. 2.10.1994 ఆదివారం నాడు విశ్వనాథ శత జయంతి రెండవ సమావేశం జరిగింది. ఆనాటి కార్యక్రమంలో విశ్వనాథ సాహిత్యంలో గాంధీయవాదం, జాతీయతా దృష్టి గురించి ప్రసంగాలు ఏర్పాటు చేయడంలో యువభారతి ఔచిత్యవంతంగా వ్యవహరించింది. ఆనాటి కార్యక్రమానికి ప్రముఖ పాత్రికేయులు, గాంధీయవాది శ్రీ పొత్తూరి వెంకటేశ్వర రావుగారు అధ్యక్షత వహించారు. వారు సభను ప్రారంభిస్తూ, "విశ్వనాథవారు తాను నమ్మిన దాన్ని ప్రజలకు నమ్మకం కలిగేట్లుగా చెప్పేవారు. ఆయన గ్రంథాలలో గాంధీ ప్రభావం కనిపిస్తుంది. ఏది మంచి సంప్రదాయమో దానికి గౌరవం కలిగే విధంగా ఆయన రచనలు చేశారు" అన్నారు.

రెండవ సమావేశానికి ముఖ్య అతిథిగా విచ్చేసిన కవిసేన నాయకుడు, సుప్రసిద్ధ కవి శ్రీ గుంటూరు శేషేంద్రశర్మగారు విశ్వనాథ గురించి వివరిస్తూ, "గాంధీగారు కవి కాదు. పండితుడు కాదు. కేవలం కర్మయోగి అయిన తేజస్వి! విశ్వనాథ సరస్వతీమూర్తి. విశ్వనాథ సాహిత్యాన్నే శ్వాసగా పీల్చాడు, శ్వాసగా వదిలాడు. ఆయన శివభక్తుడు. శివస్వరూపుడు. చాలా నిరాడంబరుడు. సత్యనారాయణగారి కళాత్మక స్వభావం పూర్వాంధ్ర కవులందరికీ విడిది స్థానం. ఆయన జిహ్వ పూర్వాంధ్ర కవుల కాలనీ. దానిలో తెనాలిది ఒక పెద్ద మహల్. రాయలది మరొకటి. 'నా మనసుకు నచ్చిన ఆయన కావ్యం ఋతుసంహారం. ఆయన వ్యక్తిత్వం, ఆయన సృష్టి బ్రహ్మకు కూడా సాధ్యం కాదు" అన్నారు.

వక్తగా విచ్చేసిన శ్రీ పాతూరి నాగరాజుగారు మాట్లాడుతూ, "గాంధీయ వాదం విశ్వనాథవారి వేయి పడగలు మొదలైన నవలల్లో, కుమారాభ్యుదయం మొదలైన కావ్యాల్లో ఉంది. సంప్రదాయ కవులలో విశ్వనాథ చివరివాడని, ఆయనతో సంప్రదాయం నశిస్తుందని భావించేవారి గురించి నేను చింతిస్తున్నాను. గ్రామీణ ఆర్థిక వ్యవస్థ నశిస్తూ ఉండడంపట్ల ఆయన ఆవేదన వేయి పడగలులో కనిపిస్తుంది. గాంధీజీ గ్రామ రాజ్యం గురించి చెప్పిన విషయాన్ని విశ్వనాథ తన రచనల్లో చూపించారు" అన్నారు.

డా. వి. వి. యల్. నరసింహారావుగారు ప్రసంగిస్తూ, "గాంధీగారు అస్త మించిన రోజు మూడు పద్యాల్లో విశ్వనాథవారు దుఃఖించారు. వాటిలో జాతీయత ప్రతిఫలించింది. స్వాతంత్ర్యం వచ్చిననాడే ఆయన వ్రాసిన పద్యాలలో జాతీయత కనిపిస్తుంది. శిల్పంకాని, సాహిత్యంకాని జాతీయతను తనలో ప్రతి బింబించకపోతే అది శిల్పంకాని, సాహిత్యంకాని కాదని విశ్వనాథ అభిప్రాయం" అన్నారు.

ఆ సభలో మధుర కవి శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్యులుగారు రమణీయమైన పద్యాలతో విశ్వనాథకు కవితా నీరాజనం సమర్పించారు.

యువభారతి అధ్యక్షులు ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యంగారు యువ భారతి సేవలను వివరించి, వేదికమీద ఆసీనులైన పెద్దలను పరిచయం చేశారు.

ఆ సభలో జి. జె. ఆర్. కుమార్ అనే అబ్బాయి కూడా పద్యాలను చదివాడు.

ఆనాటి సభకు యువభారతి కార్యదర్శి డా॥ బి. జయరాములు స్వాగతం పలుకగా, ఉపాధ్యక్షురాలు శ్రీమతి కె. బి. లక్ష్మి కృతజ్ఞతలు తెలిపారు.

మధ్య మధ్య శ్రీ అయ్యదేవర పురుషోత్తమరావుగారు విశ్వనాథ వారి పద్యాలను చదివి వినిపించి శ్రోతలను రంజింపజేశారు.

## మూడవ సమావేశం :

విశ్వనాథ సాహితీ సమాలోచనం సంవత్సరోత్సవాల పరంపరలో భాగంగా 1994 నవంబరు 6 వ తేదీ ఆదివారం నాడు కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారి శత జయంతి మూడవ సమావేశం జరిగింది. ఈ సమావేశానికి ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావు గారు అధ్యక్ష్యం వహించారు. వారు విశ్వనాథ వారిని గురించి మాట్లాడుతూ —

"ఆయన Progressive కాదు అని నేడంటున్నారు. సంప్రదాయం అనే దాని గురించి తెలుసుకుంటే ఆయన మీదున్న అపవాదుసు తొలగించవచ్చు. సంప్రదాయం (tradition) గురించి చెప్పిన T.S. Eliot ను కూడా సంప్ర దాయవాది అన్నారు. ఆయన సంప్రదాయంలో మంచిని గూర్చి వివరించారు. సంప్రదాయంలో మంచి, చెడు - రెండూ ఉన్నాయని విశ్వనాథ గ్రహించారు. "My idealism is Socialism + God + Religion'' అనేది ఆయన సిద్ధాంత వాక్యం. ఆర్థిక సమతతోపాటు నైతికత లేకపోతే సమాజం అభివృద్ధి కాదు. నైతిక విలువలకు ప్రాముఖ్యం ఇవ్వాలని విశ్వనాథవారు చెప్పారు. సంప్ర దాయవాది అనే నెపంవేసి వారిని దూషించడం సమంజసం కాదు" అన్నారు.

విశ్వనాథవారి ప్రియశిష్యులు శ్రీ జువ్వాడి గౌతమరావుగారు రామాయణ కల్పవృక్షంలోని బాలకాండలో ఒక ఘట్టాన్ని గానం చేసి శ్రోతల్ని మంత్ర ముగ్ధుల్ని చేశారు.

కళాప్రపూర్ణ ఎస్.టి. జ్ఞానానందకవిగారు విశ్వనాథవారికి తమ కవితా నీరాజనం సమర్పించారు.

శ్రీ జి. పుల్లారెడ్డిగారు వేదికమీదనున్న పెద్దలను సన్మానించి, మిఠా యిలు పంచారు.

ఈనాటి కార్యక్రమంలో ప్రసంగించిన శ్రీ కె. కోటీశ్వరరావుగారు 'ఆంధ్రప్రశస్తి'ని గురించి మాట్లాడుతూ, "రాయప్రోలు ద్వారా స్ఫూర్తినిపొంది విశ్వనాథవారు ఆంధ్రప్రశస్తి రచనకు ఉద్యుక్తులయ్యారు ఆంధ్రరాష్ట్రోద్యమానికి ఉద్యుక్తులవుతున్న ఆంధ్రులకు ఇది ఊపునిచ్చింది'' అన్నారు

ఆచార్య తంగిరాల సుబ్బారావుగారు ప్రసంగిస్తూ, "విశ్వనాథ మట్టికవి. ఆయన ఋతుసంహారంలో గ్రామీణ సంస్కృతి ఉంది. తన రామాయణంలో తెలుగుతనం ఉందనీ, ఆ దృష్టితో చదవకపోతే సగం సౌందర్యం అర్థంకాదని ఆయనే చెప్పుకున్నారు. పద్యంలో వీరగాథను వ్రాసి మెప్పించినవారు తెలుగు సాహిత్యంలో ఇద్దరే ఉన్నారు. ఒకరు తిక్కన, రెండవవారు విశ్వనాథ" అని విశ్వనాథ కవితలోని జానపద మూలాలను వివరించారు.

విశ్వనాథ పావని శాస్త్రిగారు ఒక పద్యం చదివి వినిపించారు. సభకు యువభారతి అధ్యక్షులు ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యంగారు స్వాగతం పలికారు.

## నాలుగవ సమావేశం :

శ్రీ వడలి మందేశ్వరరావుగారి ఆధ్యక్ష్యంలో డిసెంబరు మొదటి ఆదివారం నాడు నాలుగవ సమావేశం జరిగింది. వారు ప్రసంగిస్తూ, 'తాత్విక, ధార్మిక, ఆధ్యాత్మికాది అనేక విషయాలు చెప్పడానికి అనేక గ్రంథాలను సృష్టించాడు విశ్వనాథ. రేడియో నాటికలు, గేయ కావ్యాలు, ఎల్జీలు, విమర్శలు నవలలు, నవలికలు, మహాకావ్యాలు మొ॥ అనేక ప్రక్రియలకు ఆయన స్రష్ట. విశ్వనాథ సంపూర్ణ సాహితీమూర్తి. తాను బతికివున్న కాలపు చైతన్యాన్ని విశ్లేషించడానికి విశ్వనాథ కృషి చేశాడు. వెయ్యేండ్ల సాహిత్య చరిత్రలో విశ్వనాథ స్థానం విశిష్ట మైంది' అన్నారు.

ఆనాటి కార్యక్రమానికి ముఖ్య అతిథిగా విచ్చేసిన జస్టిస్ శ్రీ పి. కోదండ రామయ్యగారు మాట్లాడుతూ, 'విశ్వనాథకు ఆర్ష ధర్మమునందు భక్తి విశ్వాసాలు మెండు. ఆయన మాట్లాడేటప్పుడు ఇతరులేమనుకున్నా నిర్భయంగా మాట్లాడే వారు. సత్యనారాయణగారి గురించి చదివితే సంప్రదాయం తెలుస్తుంది. ధర్మం తెలుస్తుంది. తెలుగు గురించి తెలుస్తుంది. నువ్వేమిటో తెలుస్తుంది' అన్నారు.

డాక్టర్ జె. బాపురెడ్డి I. A. S. గారు తమ మధురమైన పద్యాలతో విశ్వ నాథ వారికి కవితా నీరాజనం సమర్పించారు.

శ్రీ బచ్చు సుబ్బారావుగారు (అశ్విని హోమియో హేర్ ఆయిల్ అధిపతి) వేదిక మీది పెద్దలకు సన్మానం చేశారు.

డాక్టర్ ముక్తేవి భారతిగారు విశ్వనాథవారి చిన్న కథలను గురించి ప్రసంగిస్తూ, 'విశ్వనాథ విప్లవ రచయిత, అభ్యుదయవాది, సంస్కర్త. వితంతు వివాహం జరిపించిన విశ్వనాథ, వేశ్య కూతురును పెళ్ళి చేసుకున్నట్లు కథలు వ్రాసిన విశ్వనాథ మానవతావాది కాడా? 'ఉరి' అనే కథలో విప్లవం ఉంది. బానిసత్వపు నిరాసం 'నీగ్రో నాయకుని కథ'లో ఉంది. సంప్రదాయంలో ఉన్న మూఢత్వాన్ని నిరసించడం, ఆధునికతలో ఉన్న వెర్రితనాన్ని వెక్కిరించడం విశ్వనాథతత్వం. బిచ్చగాళ్ళ గురించి వ్రాసిన కథలో రాజకీయ నాయకుల గురించి వివరించాడు. 'ఇంకొక విధము' అనే కథలో Homo Sexuality గురించి వ్రాశారు. ఇలా సమాజంలోని అనేక విషయాలను గ్రహించి తన కలంతో శిల్పించిన మహాశిల్పి విశ్వనాథ' అన్నారు.

శ్రీ వాకాటి పాండురంగరావుగారు మాట్లాడుతూ, 'ఈ శతాబ్దపు తెలుగు జీనియస్ విశ్వనాథ. 'ఈ జాతి చావదు. ఈ జాతి సంస్కృతికి గ్రహణం ఉంటుంది కాని మరణం ఉండదు' అనే అంశాన్ని చాటడానికే విశ్వనాథ అనేక రచనలు చేశారు. విశ్వనాథ వ్యవస్థను గురించి, వ్యక్తి గురించి బాధపడ్డాడు' అని వివరించారు.

ఆనాటి సభకు డాక్టర్ ముదిగొండ వీరభద్రయ్యగారు స్వాగతం పలికారు. శ్రీ అయ్యదేవర పురుషోత్తమరావుగారు విశ్వనాథ వారి పద్యాలను వినిపించారు.

## ఐదవ సమావేశం :

1995 జనవరి ఒకటవతేదీనాడు ఈ సమావేశం జరిగింది. ఈ సమావేశానికి సాంస్కృతిక వ్యవహారాలశాఖ సంచాలకులు శ్రీ కె. వి. రమణ IAS గారు అధ్యక్షత వహించారు. వారు సభను ప్రారంభిస్తూ, "విశ్వనాథ సాహితీ సమాలోచనం అనే సత్కార్యానికి రావడం సంతోషంగా ఉంది. ప్రతిభ కలిగిన సాహితీమూర్తుల వ్యక్తిత్వాన్ని నేటి యువతరానికి అందించవలసిన అవసరం ఉంది. యువభారతీయులు ఆ మార్గంలో పయనిస్తూ యువతరాన్ని ఉత్తేజితులను చేస్తున్నందుకు వారిని అభినందిస్తున్నాను'' అన్నారు.

ఈ సమావేశానికి శ్రీ పి రాంనారాయణ్ IPS గారు ముఖ్యఅతిథిగా వచ్చారు. వారు ప్రసంగిస్తూ, ''మా నాన్నగారు సంగీతం వినిపించినప్పుడు

విశ్వనాథవారు తన్మయులై తర్వాత తేరుకొని ఆ రాగాన్ని గురించి తెలుసుకునే వారు. ఏ రాగం ఎప్పుడు పాడాలి మొదలైన విషయాల గురించి మా నాన్నగారు వారికి విశ్లేషించి చెప్పేవారు. ఇలా సంగీతాధ్యయనం చేసిన విశ్వనాథవారు 'మ్రోయుతుమ్మెద' అనే గేయకావ్యం వ్రాశారు. విశ్వనాథ వారికి 'వసంత విహార్' రాగం చాలా ఇష్టం. ఈ హిందూస్తానీరాగాన్ని మా నాన్నగారు సంస్కృతంలోనికి మార్చి వినిపించేవారు'' అని వారి తండ్రికి, విశ్వనాథవారికి గల సంబంధాన్ని వివరించారు.

ఈనాటి కార్యక్రమంలో డాక్టర్ ఉండేల మాలకొండారెడ్డిగారు తమకు విశ్వనాథవారితో ఉన్న అనుబంధాన్ని వివరించి, వారి వ్యక్తిత్వం గురించి, సాహిత్యం గురించి మనోహరమైన పద్యాలను వినిపించి శ్రోతల్ని మంత్రముగ్ధులను చేశారు. వారు కవితా నీరాజనం సమర్పించిన తర్వాత ఉపన్యాసాలు ప్రారంభమైనాయి.

ఉపన్యాసాలకంటె ముందు ప్రముఖ కవి, వాస్తు శిల్పి శ్రీ బి. యన్. రెడ్డి గారు వేదిక మీది పెద్దలకు సన్మానం చేశారు. ఈ సందర్భంగా వారు మాట్లాడుతూ—

"ఒక మేధావితో ఒక గంట కాలక్షేపం
వంద పుస్తకాలు చదవడంతో సమానం
ఒక సత్పురుషునితో ఓ గంట కాలక్షేపం
వంద క్షేత్రాలు చూసిన దానితో సమానం

1968 లో విశ్వనాథవారిని మా స్వస్థలానికి తీసుకొని వెళ్ళి సన్మానం చేసే భాగ్యం నాకు లభించిం"దని చెప్పారు.

శ్రీ యామినీ సరస్వతిగారు విశ్వనాథవారి శ్రీకృష్ణ సంగీతం గురించి ప్రసంగిస్తూ, "శ్రీకృష్ణుని వేణుగానం చుట్టూ అల్లుకున్న విషయం శ్రీకృష్ణ సంగీతంలో ఉంది. దీన్ని ఆయన 108 ఖండికలుగా వ్రాశారు. 'వేయిపడగలు' 28 రోజులలో వ్రాశారు. ఆయన ఏ నవలైనా 5, 6 రోజులను మించి వ్రాయ లేదు. విశ్వనాథవారు 3, 4 రోజులలో చెప్పిందే శ్రీకృష్ణ సంగీతం. విశ్వనాథ సాహిత్యాన్ని చదివితే వేరే సాహిత్యాన్ని చదవాల్సిన అవసరం లేదు. తన భార్యలో పదహారు కళలు ఎవరైతే చూస్తారో వారు సన్యాసి అవుతారు. పదహారు

వేలమంది గోపికలు కృష్ణ సంగీతానికి బానిసలయ్యారు. ఆయన వేణునాదం జీవనాదం" అన్నారు.

ఆచార్య తుమ్మపూడి కోటేశ్వరరావుగారు "రామాయణ కల్పవృక్షం - జీవుని వేదన" అనే అంశం గురించి ఉపన్యసిస్తూ, "రామాయణ కల్పవృక్షం బాలకాండలో 'జీవుని వేదన' అనే పదం వాడారు. దీనికి అర్థం పూర్వ పండితులు వివిధాలుగా చెప్పారు. 'అన్వేషణ' ఖండికనుండి రామాయణ కల్పవృక్షం పూర్తయ్యేవరకు ఆయన జీవుని వేదనను అన్వయించుకోవచ్చు. 'వేదన' అంటే ఫీలింగు (feeling). 'సంవేదన' అనే మాటను ఆలంకారిక శాస్త్రాల్లో వాడారు. నిత్య జీవిత కర్మ చేయడానికి ప్రేరేపించేది మనస్సు. మనస్సుకంటే అడుగున ఉన్న జీవుడు వాసనలతో (పొరలలో) ఇంద్రియాలద్వారా బయటికివచ్చి ప్రవృత్తి మార్గంలో సంచరిస్తాడు.

"జీవుడు అంతర్ముఖుడై లోపలికివెళ్ళి నివృత్తి మార్గంలో పయనిస్తూ ఉంటాడు. ఈ ప్రవృత్తి, నివృత్తి మార్గాలమధ్య జీవుడు వేదన పొందుతూ ఉంటాడు. ఆధ్యాత్మిక భీతితో కావ్యసృష్టి చేస్తారని పాశ్చాత్యులంటారు. కారణం ఉన్న భయం Physical fear, కారణం లేనిది Meta Physical fear, దీని నుండి తప్పుకోవడానికి కావ్యసృష్టి చేస్తారని తత్త్వశాస్త్రవేత్తలు చెప్పారు. విశ్వనాథ వేదన వ్యష్టియా? సమష్టియా? సంఘాన్ని గురించి పడ్డ వేదన భారతం అయితే గృహ వ్యవస్థకు సంబంధించిన వేదన రామాయణం. విశ్వనాథ సాహిత్యాన్ని అవలోకనం చేస్తే పాజిటివ్‌గానన్నా రామాయణం చెబుతారు, నెగెటివ్‌గానన్నా రామాయణం చెబుతారు. (కల్పవృక్షం పాజిటివ్, చెలియలికట్ట నెగెటివ్.) రామాయణ కల్పవృక్షం, వేయిపడగలు ఒకేసారి వ్రాశారు. బీజంలోని ఒక దళం అది, ఒక దళం ఇది. కాంపిటీటివ్ స్పిరిట్, సెల్ఫ్ డిసిప్లిన్ లేని సంఘం గురించి విశ్వనాథ వేదన పడ్డాడు. కవి పొందే వేదన కావ్యంగా వస్తుంది. రామాయణ కల్పవృక్షంలోని ఖండాంతాలన్నీ ఆయన జీవుని వేదనకు ప్రతిఫలనాలు" అన్నారు.

ఈ కార్యక్రమంలో యువభారతి అధ్యక్షులు ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యంగారు వేదికమీది పెద్దలగురించి ఆయా సందర్భాలలో సమయోచితంగా, సరసంగా, చమత్కారవంతంగా ప్రశంసల కుసుమవర్షాన్ని కురిపించారు. సంస్థ కార్యదర్శి డా. బి. జయరాములు వందన సమర్పణ చేశారు. శ్రీ అయ్యదేవర పురుషోత్తమరావుగారు విశ్వనాథ పద్యాలను వినిపించారు.

## ఆరవ సమావేశం

1995 ఫిబ్రవరి 5వ తేదీ ఆదివారంనాడు 'విశ్వనాథ సాహితీ సమాలోచనం' ఆరవ సమావేశం అతివైభవంగా జరిగింది. ఈ సమావేశానికి ఆచార్య ఎస్. వి. రామారావుగారు అధ్యక్షత వహించారు. వారు మాట్లాడుతూ, ''ఋషి వంటి విశ్వనాథ అనిగాని, ఆయన వ్యాసుడు అనికాని అనవచ్చు. విశ్వనాథ ప్రతి గ్రంథం ఒక విజ్ఞాన సర్వస్వమే. కాని. వేయిపడగలు, రామాయణ కల్పవృక్షం - రెండు మాత్రం తప్పకుండా విజ్ఞాన సర్వస్వాలే. విశ్వనాథ గురించి అనేక మంది పరిశోధనలు, విమర్శలు చేశారు. అనేక సంస్థలు వారి గురించి ఉపన్యాసాలు ఇప్పించాయి. అధునికయుగాన్ని ప్రభావితం చేసిన వారిలో విశ్వనాథ, చలం, శ్రీశ్రీ మొదలగువారున్నారు. చలంకన్నా, శ్రీశ్రీ కన్నా చిత్తశుద్ధితో. సామాజిక వాస్తవికతతో విశ్వనాథ రచనలు చేశారు. ఆయన చిత్తశుద్ధి గరీయమైనది. శ్రీశ్రీ, చలంలు భౌతికమైన విలువలను దృష్టిలో పెట్టుకొని రచనలు చేస్తే విశ్వనాథ ఆధ్యాత్మిక దృష్టితో రచనలు చేశారు. శ్రీశ్రీ భౌతికత, చలం కామంల గురించి పట్టించుకొని రచనలు చేశారు. విశ్వనాథ ఈ శతాబ్ది జీనియస్సేకాదు - రానున్న శతాబ్దిని నడిపించేవాడు. విశ్వనాథ గురించి శ్రీశ్రీ 'తెలుగువాడి గోల్డ్‌స్మిత్' అన్నాడు. విశ్వనాథ సమాజ దృక్పథంమీద ఎంత విమర్శ వస్తే అంత మంచిది. విశ్వనాథవారి ప్రక్రియలన్నింటిపైనా పరిశోధన సాగితే అనేక మాణిక్యాలు లభిస్తాయి'' అన్నారు.

ఆనాటి సమావేశానికి ఆచార్య I. V. చలపతిరావుగారు ముఖ్యఅతిథిగా విచ్చేశారు. వారు ఆ సభలో మాట్లాడుతూ, ''త్రివేణి పత్రికా సంపాదకుడుగా ఉండడంవల్ల నాకు విశ్వనాథ వారితో సంబంధం ఏర్పడింది. త్రివేణి పత్రిక మొదటిసంచికలో విశ్వనాథవాపరిద్యాన్ని అంగ్లంలోకి అనువాదంచేసి ప్రచురించాం సారస్వతజ్యోతి మిత్రమండలి తరపున విశ్వనాథ వారిని ఘనంగా సన్మానించి, వారికి 'విమర్శక చక్రవర్తి'అనే బిరుదు ఇచ్చాం. విశ్వనాథవారు విశ్వకవి అని చెప్పదగినవారు. వారు మనోహరంగా పద్యాలు చదివేవారు. 20 వేల పద్యాలు. 70 నవలలు, వందలాది గ్రంథాలు వ్రాశారు. తెలుగులో విమర్శ చాలా తక్కువగా ఉంది విశ్వనాథ దానికి బీజాలు వేసి, అల్లసానివాని అల్లిక జిగిబిగి, ఒకడు నాచన సోమన్న, నన్నయ ప్రసన్న కథాకలితార్థయుక్తి అనే గ్రంథాలను వ్రాశారు. వారిలో యూనివర్సాలిటీ (Universality) ఉంది'' అన్నారు.

డా॥ తిరుమల శ్రీనివాసాచార్యులుగారు విశ్వనాథవారి వ్యక్తిత్వం, సాహిత్యాల గురించి చక్కని పద్యాలను చదివి వినిపించారు. యువభారతి ఉపాధ్యక్షులు శ్రీ కె వి కామేశ్వరరావుగారు వేదికమీది పెద్దలను సమ్మానించారు. ఆనాటి కార్యక్రమంలో డా॥ ఆర్. కమలగారు విశ్వనాథవారి తెలుగు నాటకాల గురించి ప్రసంగించారు. విశ్వనాథవారి నర్తనశాల, అనార్కలి, వేనరాజు, త్రిశూలం నాటకాలలోని ఇతివృత్తాన్ని చక్కగా విశ్లేషించారు. వారు ప్రసంగిస్తూ "విశ్వనాథ వివిధ ప్రక్రియలు సృష్టించిన మహాకవి. ఆయన నాటకాలు విషాదాంతాలు. షేక్స్పియర్ ప్రభావం వాటిపై ఉంది. చిన్న చిన్న సంభాషణలతో ఉత్కంఠత కలిగిస్తూ నాటకాన్ని సాగిస్తారు విశ్వనాథ. నర్తనశాలలో భారత కథను గ్రహిస్తే అనార్కలితో ఒక మహమ్మదీయ చారిత్రక ఇతివృత్తాన్ని గ్రహించి మనోహరంగా చిత్రించారు. వేనరాజు నవలలో భాగవతంలోని ఒక చిన్న పురాణ గాథను గ్రహించి అద్భుతంగా చిత్రించారు" అని వివరించారు.

డాక్టర్ ముదిగొండ వీరభద్రయ్యగారు ''వేయి పడగలు - ధర్మదృష్టి'' అనే అంశం గురించి ప్రసంగిస్తూ, "వేయిపడగలు నవలను ధర్మేతిహాసం అనవచ్చు. దీనిలో హీరో ధర్మారావు. సత్యనారాయణగారి నవలలన్నింటిలో డామినెంట్ గుణం కృతజ్ఞత. కుటుంబ వ్యవస్థ ఛిన్నాభిన్నం కాకూడదు. కులపాలికా ప్రణయాన్ని ఆయన ఏ గ్రంథంలోను వదలలేదు. విశ్వనాథవారు వేయి పడగలులో పొందుపరచిన ధర్మం కులపాలికా ప్రణయం. వాస్తవికతను చూపడంలో విశ్వనాథను మించిన కవి ఎవరూ లేరు. మంగమ్మ అనే నీచపాత్ర ఏకాదశి మరణాన్ని పొందేట్లు చేయడం ధర్మారావు ధర్మ దృష్టివల్ల సాధ్యమైంది. విశ్వనాథ బాల్య వివాహాలు, వితంతు వివాహ వ్యతిరేకతను మనం మోయలేం గాని, గార్హస్థ్య ధర్మాన్ని ఈ దేశంలో ఎవరైనా వ్యతిరేకిస్తే దానిలో ఏదో కుట్ర ఉందని అర్థం. 'ఏ మార్గమైనా ఇంద్రియ నిగ్రహానికి, భక్తికి దారి తీయాలి" అంటారు విశ్వనాథ. ధర్మారావు నవలలో ఓడిపోయాడు కాని, జీవితంలో గెలిచాడు" అన్నారు.

విశ్వనాథవారి శిష్యులు శ్రీ దిట్టకవి వెంకటేశ్వర్లుగారు విశ్వనాథ జీవితంలోని కొన్ని ఘట్టాలను వివరించారు.

ఆనాటి కార్యక్రమంలో డా॥ బి. జయరాములు స్వాగతం పలుకగా, శ్రీమతి చిల్లర భవానీదేవిగారు వందన సమర్పణ చేశారు.

## సప్తమ సమావేశం :

1995 మార్చి మూడవతేదీనాడు ఈ సమావేశం జరిగింది. యువభారతి అధ్యక్షులు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు మొదట సంస్థ కార్యక్రమాలను సంక్షిప్తంగా వివరించి, "విశ్వనాథ సాహిత్యాన్ని సమాలోచించడానికి నిజానికి పన్నెండు సమావేశాలు సరిపోవు. అయినా ఉడుతాభక్తిగా వారిని గౌరవించ డానికి ఈ సమావేశాలు ఏర్పాటు చేశాం" అన్నారు.

డాక్టర్ వెలిచాల కొండలరావుగారు ఈనాటి సమావేశానికి అధ్యక్షత వహించారు. వారు మాట్లాడుతూ, "నేను ఎప్పుడో ఇంటర్ చదివినపుడు వేయిపడగలు చదివాను. విశ్వనాథవారి సాహిత్యం ఎక్కువ లోతుగా తెలియక పోయినా వారితో నాకు (కరీంనగర్‌లో ప్రిన్సిపాల్‌గా ఉన్నప్పుడు) బాగా పరిచయం ఉంది. సంపత్కుమార, సుప్రసన్న, రామకోటిశాస్త్రి, నారాయణరావు గార్లను పాత్రలుగా గ్రహించి 'మ్రోయుతుమ్మెద' అనే నవలను వ్రాశారు. ఆయన ప్రిన్సిపాల్‌గా ఉన్నపుడు మేమంతా సహాధ్యాపకులుగా పనిచేసినా వారిని బాగా గౌరవించేవాళ్ళం. మేము పిలిస్తే విశ్వనాథవారు సమావేశాలకు రాకుండా ఉండేవారుకారు. భావావేశంతో ప్రసంగించేవారు విశ్వనాథ. ఉపన్యాసం ఎంతసేపు ఇచ్చేవారో ఇంటికి వచ్చిన తర్వాత ఆ ఉపన్యాసంలోని లోతులను అంతసేపు వివరించేవారు. అవగాహన లేనివారు విమర్శించడం తప్పని విశ్వనాథ భావించేవారు'' అన్నారు.

ఆనాటి కార్యక్రమానికి ముఖ్య అతిథిగా విచ్చేసిన ఆచార్య పి. యశోదా రెడ్డిగారు ప్రసంగిస్తూ, ''మేధావి అయిన విశ్వనాథ వారి సాహితీ దర్శనం విచిత్రమైనది. ఆదిశేషుని మహిమ్ములా అనంతమైనది, విశ్వనాథ సాహితీ భారతి సమ్మోహన శక్తిగలది వారి సాహిత్యం ఆనంద నిష్యందిని. వారు కరుణా మూర్తి. నవనీత హృదయులు. క్షమామూర్తులు. వాదకాఠిన్యం మాత్రం వారిలో ఉండేది. వారిలో తాంత్రిక, మాంత్రిక విజ్ఞానమంతా కనిపిస్తుంది. ఆయన మనస్తత్వవేత్త. ఈయన శైలి పరమ రమణీయమైనది, పటిష్ఠమైనది. విశ్వనాథ అత్యంత ఆత్మవిశ్వాసం గలవారు. విశ్వనాథ లేనిదే నన్నయాది ప్రాచీన కవులు లేరని చెప్పవలసి ఉంటుంది. నిత్య సాధనచేత, పరిణత బుద్ధిచేత, ఆస్తిక్య బుద్ధిచేత వారికి ఇంత గొప్పశక్తి అలవడింది. విశ్వనాథ పేరు వింటేనే పాపవిమోచన మౌతుంది. విశ్వనాథ జీవగతమైన ధార్మిక శక్తివల్ల వైవిధ్యం

కలిగిన సాహిత్యం సృష్టించగలిగారు. వారి సాహిత్యంలో అంతస్సూత్రంగా జాతీయత ఉంటుంది. వారి నాటకాలలో బాహ్య సౌందర్యంకన్నా ఆత్మ సౌందర్యం ఉన్నతమైందని ప్రతిపాదించారు. ఆయన రచనలన్నీ విశిష్టమైనవి" అన్నారు.

డాక్టర్ కె కోదండరామాచార్యులుగారు 'విశ్వనాథవారి సంస్కృత నాటకాలు' అనే అంశం గురించి వివరంగా మాట్లాడారు. ముక్తాయింపుగా "మనకు తెలిసిన కథలో తెలియని విషయా లనేకం చెప్పడం విశ్వనాథ రచనలోని విశిష్టత" అన్నారు.

"విశ్వనాథవారి నవలలు : సామాజిక దృక్పథం" అనే అంశం గురించి ఆచార్య కోవెల సంపత్కుమారాచార్యులుగారు ప్రసంగిస్తూ, "విశ్వనాథను సర్వ సాహిత్య చైతన్యమూర్తి అనాలి. జీవితంలోని అన్ని రకాల దశలను, అనేక మంది వ్యక్తులను తరచి తన నవలల్లో పాత్రీకరించారు. మన భారతీయ సమాజానికి పాశ్చాత్య సమాజానికి చాలా వ్యత్యాసం ఉంది. మన భారతదేశంలో స్త్రీకి శీలం ముఖ్యం. ఈ ప్రధాన వ్యత్యాసాన్ని విశ్వనాథ తన నవలల్లో ప్రతిబింబించారు. విశ్వనాథ సామాజిక దృక్పథం తెల్పేవి ఆయన నవలలే. మిగతా రచయితలలాగా కాకుండా విశ్వనాథ తన సాహిత్యానికి ప్రత్యేక పాఠకులను కూడా సృష్టించుకున్నాడు. సాహిత్యం కేవలం ఆనందంకోసం కాదనీ, దానికి ఒక ప్రయోజనం తప్పక ఉంటుందనీ ఆయన తన రచనలద్వారా నిరూపించారు. చాలా చిన్న చిన్న విషయాలను కూడా జీవితంలో నుంచి గ్రహించి ఏకవీర మొదలుకొని అనేక నవలల్లో చిత్రించారు" అని చెప్పారు.

అనాటి కార్యక్రమంలో 'కవి కౌస్తుభ' డాక్టర్ ఆచార్య తిరుమలగారు తమ కమ్మని కవిత్వంతో విశ్వనాథ వారికి నీరాజనం సమర్పించారు.

డాక్టర్ మాడభూషి రంగాచార్యులుగారు సభకు స్వాగతం పలుకగా, సంస్థ కార్యదర్శి డాక్టర్ బి. జయరాములు వందన సమర్పణ చేశారు.

## ఎనిమిదవ సమావేశం :

1995 ఏప్రిల్ రెండవ తేది ఆదివారం సాయంకాలం నగర కేంద్ర గ్రంథాలయంలో 'విశ్వనాథ సాహితీ సమాలోచం' అష్టమ సమావేశం అత్యంత వైభవంగా జరిగింది. ఈ సమావేశానికి ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ సర్వీస్ కమీషన్ మాజీ సభ్యులు డాక్టర్ టి. వి. నారాయణగారు అధ్యక్షత వహించారు. వారి అధ్యక్షోపన్యాసంలో విశ్వనాథ వారి గురించి అనేక అంశాలను సాకల్యంగా వివరించారు. వారికి, తమకు గల అనుబంధం గురించి ఆర్ద్రంగా విశదీకరించారు. విశ్వనాథ వారి బహుముఖ ప్రజ్ఞను, వారి మానవతా దృక్పథాన్ని, తమకు విశ్వనాథపై గల అభిమానాన్ని చక్కగా వివరించారు.

ఆచార్య ఎస్. లక్ష్మణమూర్తిగారు ముఖ్య అతిథిగా రావలసి ఉండగా వైయక్తిక కారణాలవల్ల సభకు హాజరు కాలేకపోయారు.

ఈనాటి కార్యక్రమంలో ''బద్దన్న సేనాని: సామాజిక దృక్పథం" అనే అంశం గురించి డాక్టర్ కసిరెడ్డి వెంకటరెడ్డిగారు ప్రసంగించారు. వారు మాట్లాడుతూ—

''కాలం, దేశం, తత్కాల పరిస్థితుల గురించి తెలుసుకుంటే బద్దన్న సేనానిలోని సామాజిక దృక్పథం తెలుస్తుంది. స్వాతంత్ర్య పోరాటదశలో నవల వ్రాసిన విశ్వనాథవారు ఆ సమాజం ప్రభావాన్ని పొంది ఉంటారు. మను ధర్మశాస్త్రంలో "నా స్తీతి పంచమః...." అని ఉంది. కాని, బద్దన్న పంచముడని చెప్పడం, బద్దన పాత్ర తాను స్వయంగా పంచముడని చెప్పుకోవడం నాటి సామాజిక పరిస్థితులకు దర్పణ పట్టడమే. అట్టడుగున ఉన్న వ్యక్తి కూడా తన నైపుణ్యం చేత పైకి రావడాన్ని ఈ నవలలో చిత్రించాడు విశ్వనాథ నేటి సమాజంలో ఆర్థిక మానవులు, రాజకీయ మానవులు కనిపిస్తారు కాని, బద్దన్న ఒక ఆదర్శ మానవుడుగా కనిపిస్తాడు. నా జాతి కొరకు, నా సంఘం కొరకు, నా దేశం కొరకు నేను త్యాగం చేస్తానని సిద్ధమై, తన సర్వస్వాన్ని సమర్పించాడు బద్దన్న సేనాని. బద్దన్న సేనానిలోనిది ధర్మవ్యతిరేకమైన కామం కాదు. దేశం కోసం తనను తాను సమర్పించుకున్న వ్యక్తిగా బద్దన్నను ప్రేమించిన బాలమ్మ కనిపిస్తుంది. బద్దన్న సేనానిని వైయక్తిక దృక్పథంతో చూడవలసి ఉంది. పారివారికంగా, సామాజికంగా, రాష్ట్రీయంగా, జాతీయంగ కృషి చేసిన పాత్ర

బద్దన్న సేనాని. బద్దన్న, బాలమ్మల జీవితం స్వాతంత్ర్య పోరాట నేపథ్యంలో పంకంలోని కమలాలు సౌరభాన్ని వెదజల్లినట్లు గ్రహించగలం'' అన్నారు.

"రామాయణ కల్పవృక్షం - సమకాలీనత" అనే అంశం గురించి ఆచార్య కోవెల సుప్రసన్నాచార్యులుగారు సోదాహరణంగా, సుదీర్ఘంగా ఉపన్యసించారు. వారు ప్రసంగిస్తూ, ''ఈనాటి సాహిత్యానికి కేంద్ర బిందువు మానవుడు. రామాయణంలో వర్ణింపబడిన లంక లండన్; ముక్కు, చెవులు కత్తిరింపబడిన విగ్రహాలు మన దేశమంతటా కనిపిస్తాయి. ఆంగ్లేయులు రావణ సంతతి......." అంటూ రామాయణ కల్పవృక్షంలోని సమకాలీనతను వివరిస్తూ ముక్తాయింపుగా "భావకవిత్వం, స్వాతంత్ర్యోద్యమం, స్త్రీ పురుష సంబంధాలు అనే అంశాలను గురించి ఆలోచించిన విశ్వనాథ - స్త్రీ పురుష సంబంధాలను గురించి స్పష్టంగా వివరించడానికి రామాయణం వ్రాశారు. ఆ రోజుల్లో స్త్రీ గురించి విరుద్ధ కోణాల్లో ఆలోచించినవారు చలం, విశ్వనాథలు" అన్నారు.

ఆనాటి కార్యక్రమంలో శ్రీ సుధీంద్ర ప్రహ్లాదగారు విశ్వనాథ వారికి కవితానీరాజనం సమర్పింపగా, యువభారతి అధ్యక్షులు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారు స్వాగతం పలుకగా, కార్యదర్శి డా. బి. జయరాములు వందన సమర్పణ చేశారు.

## తొమ్మిదవ సమావేశం:

ఈనాటి సమావేశానికి ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగు శాఖాధ్యక్షులు ఆచార్య ఎన్.గోపిగారు అధ్యక్షత వహించారు. వారు సభను ప్రారంభిస్తూ ''విశ్వనాథ బ్రిటిష్‌వారి విలువలను ఖండించి భారతీయ విలువలను స్థాపించారు. ఆయన యుగసంధి సంఘర్షణను గాఢంగా అనుభవించారు. ఆయన సృష్టించిన పాత్రలు నేటికీ సజీవంగా ఉన్నాయి విష్ణుశర్మ, ధర్మారావు మొదలైన పాత్రలు ఇందుకు నిదర్శనాలు. ఈనాటి పరిస్థితులలో విశ్వనాథ ఏ స్థానంలో ఉంటాడో ఆలోచించాలి. ఆయన 'జీవుని వేదన' అనే గొప్ప మాటను సృష్టించారు. నేడు మారుతున్న విలువల నేపథ్యంలో విశ్వనాథ అవసరం వుంది. విశ్వనాథ వారిని గురించిన ఇమేజ్ సఫరయిందని అనిపిస్తుంది. ఆయన గురించి నెగెటివ్ విషయాలు ఎక్కువగా ప్రచారం చేయడం జరిగింది. కాని, ఆయన

హృదయం, మేధస్సు మొదలైనవాటి పరిస్థితులు నేడు అంచనా వేయాలి'' అన్నారు.

ఈ సమావేశానికి ముఖ్య అతిథిగా విచ్చేసిన సుప్రసిద్ధ నవలా రచయిత శ్రీ దాశరథి రంగాచార్యగారు ప్రసంగిస్తూ, "హిమపర్వత సన్నిభులు విశ్వనాథ. వారితో సమ్మానం పొందిన అదృష్టం నాది. వారితో పరిచయం ఉండడం గొప్ప విషయం. తెలుగు సాహిత్య చరిత్రలో శ్రీనాథుని తర్వాత విశ్వనాథ వంటివారు జన్మించలేదు. ఆయన శ్రీనాథుడు, ఈయన విశ్వనాథుడు. శ్రీనాథునిలో 'మస్కా' గొట్టడం ఉంది. విశ్వనాథలో అది లేదు. విశ్వనాథకు జ్ఞానపీఠ అవార్డు, కవి సమ్రాట్ లేకుంటే ఏమవుతుంది? వీటివల్ల ఆయన గొప్పవాడు కాలేదు. ఆయన ప్రతిభకు ఇవి అలంకారాలు కావు. 'భారతదేశంలో ఏమీలేదు చెత్తయే' అంటున్న రోజులలో విశ్వనాథ పర్వతంలా నిలబడ్డాడు. వారు 'సాహిత్యంతో మనం సాధించాల్సింది ఉంది' అని భావించారు. తన సిద్ధాంతం కోసం ఆయన అచలంగా నిలబడ్డాడు. విశ్వనాథ రాక్షసులందరిని రామభక్తులను చేశాడు. 'తనను రాముడు చంపుతున్నాడనే సంతోషంతో రావణుడు మరణించాడు' అని కల్పవృక్షంలో వర్ణించాడు విశ్వనాథ. కృష్ణాజిల్లాను విశ్వనాథ జిల్లాగా కాని, విజయవాడను విశ్వనాథపురంగా గాని మార్చవచ్చు. విశ్వనాథవారు భారతదేశానికి చాలా చేశారు. మన దేశం వారికేం చేయలేదు. వారికేం చేయాలో మనం ఆలోచించాలి" అన్నారు.

ఈ కార్యక్రమంలో 'ఆంధ్రప్రభ' సచిత్ర వారపత్రిక సహాయ సంపాదకులు శ్రీ ఫణిహారం వల్లభాచార్యగారు 'విశ్వనాథ వారి దమయంతీ స్వయంవరం' గురించి మాట్లాడారు. వారు మాట్లాడుతూ ''నేను 20 సంవత్సరాల క్రితం తెలుగు పుస్తకాలు చదవడం మొదలెట్టినప్పటినుంచి నాకు విశ్వనాథ వారంటే అసహ్యం. నాలాంటి వాడికి ఆ రోజున ఇలాంటి అన్యాయం చేసిన వారు ఆనాటి ఒక వర్గం. దమయంతీ స్వయంవరాన్ని ఒక నవల అనవచ్చునా? అనకూడదా? విశ్వనాథ భాషలో 'అనవచ్చును, అనకూడదు.' ఈ నవలలో ఈ వ్యవస్థలోని అనేక సిద్ధాంతాలు రాద్ధాంతాలూ ఉన్నాయి. దీనిలో వ్యావహారిక భాషే ఉంది. విశ్వనాథ వారిని కవిగా మాత్రమే పరిచయం చేస్తూ రావడం, ఆయన కథా సాహిత్యానికి వ్యామోహితులు కాకపోవడంతో మా తరం వారికి అన్యాయం జరిగింది. ఈ నవలలో విశ్వనాథ ఈ వ్యవస్థ నిర్మాణం గురించి

చెబుతూ ఆఫీసుల్లో జరిగే అన్యాయాల గురించి చక్కగా వివరించారు. ఇంటి పన్ను గురించి, విద్యుద్దీపాల గురించి ఈ నవలలో ఆయన చక్కగా వివరించారు. ఈ నవల విశ్వనాథ వ్రాశారని నాకు తెలియదు. కొందరు తెలియకుండా చేశారు. (వారు కమ్యూనిస్టులు.) ఇప్పుడు ఈ నవలను దృష్టిలో పెట్టుకొని చూస్తే విశ్వనాథ ఎంత గొప్పవారో తెలుస్తుంది. మా తరం పోగొట్టుకున్నదేమిటో ఇపుడు మాకర్థమౌతుంది'' అన్నారు.

హైదరాబాదు విశ్వవిద్యాలయ తెలుగు శాఖాధిపతులు ఆచార్య రవ్వా శ్రీహరిగారు 'రామాయణ కల్పవృక్షం భాష' అనే అంశం గురించి ప్రసంగిస్తూ, ''విశ్వనాథ వారిమీద ఒక అభియోగం వుంది-కఠినంగా వ్రాస్తారని. పాషాణపాక ప్రభువని ఒకరన్నారు. కాని, అది అసత్యం. రామాయణ కల్పవృక్షంలో కాఠిన్యం కనిపించదు. ఆయన 'నాది వ్యవహారభాష' అని చెప్పుకున్నారు. రామాయణ కల్పవృక్షంలో ఆయన వ్యవహారభాషను ప్రవేశ పెట్టారు. వ్యవహారంలో విశిష్టమైన పలుకుబడిని గ్రహించి వ్రాస్తే వ్యావహారికభాష అవుతుంది. దూరాన్వయం లేకుండా ఒకదానితో ఒకటి పరస్పరాన్వయం కలిగి ఉండడం వ్యావహారిక భాషాలక్షణం. మా బాబు, బుచ్చి, వట్టివెట్టి, అసలుకథ మొదలగు వ్యావహారిక పదాలు విశ్వనాథ వాడారు. తెలుగు ఉట్టిపడే జాతీయాలను వాడారు. 'అయినదానికి కానిదానికి', 'చచ్చినట్లుండాలి', 'ఊఁఅనడం' - ఇలాంటివి వాడి రసాన్ని పోషించారు. 'ఊఁఅన్నచో వనధిం దూకనె!' లక్షలిట్టితినయ్యా, ఒక్క పురుగులేదు' లాంటి చక్కటి జాతీయాలను వాడారు. 'ఔనె! దౌర్భాగ్య మాకారమైనదాన....; సీ పాడుముండ, పాపపు శకునపక్షి, కొండముచ్చుముండ' లాంటి చక్కటి తిట్లను ప్రయోగించారు. 'ఒక మున్నూరు కదల్చితెచ్చిన' అని అల్పత్వ సూచకమైన 'ఒక'ను ప్రయోగించారు. వారి పదప్రయోగంలో విశిష్టత ఉంటుంది. 'యుంజానమూర్తి'లాంటి పదాలు వారు ప్రయోగించారు. వారు ఉక్తి వక్రతను, బాలభాషను, సూక్తులను చాలా చక్కగా ప్రయోగించారు" అని సోదాహరణంగా వివరించారు.

అవధాన సహస్రఫణి శ్రీ మాడుగుల నాగఫణి శర్మగారు కవితా నీరాజనం సమర్పించారు. శ్రీమతి కె. బి. లక్ష్మిగారు స్వాగతం పలికారు. డా. తిరుమల శ్రీనివాసాచార్యులు మొదట సంస్థను పరిచయం చేశారు. శ్రీ డి. ఎల్. ఎన్. ప్రసాద్‌గారు వందన సమర్పణ చేశారు.

## పదియవ సమావేశం :

ది. 4.6.1995 నాడు ఈ సమావేశం జరిగింది. ఈ కార్యక్రమానికి ఆచార్య ఎల్లూరి శివారెడ్డిగారు అధ్యక్షత వహించారు. వారు సభను ప్రారంభిస్తూ, "విశ్వనాథ అనేక ప్రక్రియలు సృష్టించారు. ఆయన విజ్ఞానపాథోనిధి. నా దృష్టి సుకుమారమైన శబ్దం మీద నిలవదని విశ్వనాథ చెప్పుకున్నారు. ఆయన కథలలో ప్రగతిశీల దృక్పథం ఉంది. ఆయన శైలి ప్రత్యేకమైనది. అది అనితర సాధ్యం" అన్నారు.

ఆనాటి సమావేశానికి ముఖ్యఅతిథిగా విచ్చేసిన కృష్ణా పత్రిక సంపాదకులు శ్రీ పిరాట్ల వెంకటేశ్వర్లుగారు మాట్లాడుతూ, "విశ్వనాథకు గర్వం ఉంది అనుకుంటారు కాని, అది సత్యం కాదు. ఆయన ఏ విలువలకోసం తపించారో వాటిని గురించిన కృషి జరగవలసినంత జరగలేదు. తెలుగువారికి విశ్వనాథ రచనలలోని మాధుర్యం అందించవలసిన అవసరం వుంది" అన్నారు.

డాక్టర్ సి. మృణాళినిగారు 'విశ్వనాథ నవలల్లో కథకుడు' అనే అంశం గురించి ప్రసంగిస్తూ "నవలల్లో రచయిత కథకుడు కాకూడదు. 'వేయి పడగలు' నవలలో కథకుడు ధర్మారావు. విశ్వనాథ ధర్మారావులో తన సర్వజ్ఞత్వాన్ని నిక్షేపించాడు. ఇంకా అవసరమైనపుడు విశ్వనాథ వారు ప్రవేశిస్తారు. విశ్వనాథ నవలల్లో అధ్యాపక ప్రవృత్తి కనబడుతుంది. తనకు తెలిసిన విషయాన్ని ఆయన పాఠకులతో పంచుకుంటారు. ఆయన దీనికోసం కొన్నిచోట్ల కథను, పాత్రలను కూడా పక్కకు తోస్తారు. మొదట ఒక సన్నివేశం చిత్రిస్తారు. దానిలో పాత్రల ప్రవర్తన బయటపడుతుంది. రెండవ దశలో వారి ప్రవర్తనను వ్యాఖ్యానం చేయడానికి ఆయనే ప్రవేశిస్తారు. మూడవసారి రచయితగా విశ్వనాథ ప్రవేశిస్తారు. అలా ప్రవేశించి, విషయాలను సార్వజనీనం చేస్తారు. ఈ విధంగా మూడు రకాల కథకులు ఆయన నవలల్లో కనిపిస్తారు" అని వివరించారు.

'భావకవిగా విశ్వనాథ' అనే అంశం గురించి ఆచార్య నాయని కృష్ణకుమారిగారు ప్రసంగిస్తూ "భావకవికి ఆర్ద్రత ఉండాలి. సహృదయం ఉండాలి. ఈ రెండూ విశ్వనాథ వారిలో ఉన్నాయి. మనసులో ఉండే భావాలను ఉత్తమ పురుషలో చెప్పుకోవడం భావకవిత్వం. స్త్రీ పురుషుల మధ్య ఉండే సుకుమార

భావం అక్షరరూపంలో వస్తే అదే భావకవిత్వం. విశ్వనాథవారి అనేక కావ్యాలలో-ముఖ్యంగా గిరికుమారుని ప్రేమగీతాలులో ఇది కనిపిస్తుంది" అని విశ్లేషించారు.

శ్రీమతి కె. బి. లక్ష్మిగారు పెద్దలను వేదిక మీదకు ఆహ్వానించగా, డా. తిరుమల శ్రీనివాసాచార్యులుగారు పెద్దలను సదస్యులకు పరిచయం చేశారు. శ్రీ కనములూరి వెంకటశివయ్య IAS గారు సంస్కృతాంధ్రాలలో విశ్వనాథ వారికి కవితా నీరాజనం సమర్పించారు. డా. బి. జయరాములు వందన సమర్పణ చేశారు.

## పదకొండవ సమావేశం :

ఈనాటి సభకు సుప్రసిద్ధకవి, నిర్మాత, నటులు మల్లెమాల శ్రీ ఎం.ఎస్ రెడ్డిగారు అధ్యక్షత వహించారు. వారు సభను ప్రారంభిస్తూ, "నేను ప్రొడ్యూసర్ నైన తర్వాత విశ్వనాథవారి అధ్యక్షతన జరిగిన సమావేశంలో పాల్గొన్నాను. చిత్తూరు నాగయ్యగారిని గురించి పద్యం వ్రాసిచదివాను. వేమన, పోతన, త్యాగ రాజు, రామదాసులు కలిసి నాగయ్యగా జన్మించారని దానిలోని భావం.

'వేదసారము ఆటవెలది పాదములందు
సిద్ధింపజేసిన సిద్ధుడాకడు....'

ఆ తర్వాత విశ్వనాథవారు 'నేటి కవి సమ్మేళనంలో కవి కూడా పాల్గొన్నాడు' అన్నారు. నాటినుంచి నేను కవితా వ్యవసాయాన్ని విరివిగా సాగించాను. గోదావరి తెలుగుదేశంలో ప్రవహించడం ఎంత గర్వకారణమో విశ్వనాథ తెలుగుదేశంలో పుట్టడం అంత గర్వకారణం. అలా అని ఆయన తెలుగునకే పరిమితం కాలేదు. ఆయన విశ్వకవి. తెలుగులో వెలువడిన రామాయణా లన్నింటిలో కల్పవృక్షం శిరోభూషణం లాంటిది. కిన్నెరసాని చిన్నదైనా, దాన్ని ముగ్ధమోహనంగా మలచారు" అన్నారు.

ఈ సమావేశంలో ''విశ్వనాథవారిపై ఆంగ్ల ప్రభావం'' అనే అంశంమీద ప్రసంగిస్తూ శ్రీ పోలాప్రగడ సత్యనారాయణగారు "విశ్వనాథవా రప్పుడప్పుడు మాట్లాడే మాటల్నిబట్టి, నా స్వీయానుభవాన్నిబట్టి వారిమీద ఆంగ్ల ప్రభావం ఉందని నేను గ్రహించాను. విశ్వనాథవారు సెకండ్ షో ఇంగ్లీషు పిక్చర్‌కు వెళ్ళే వారు 'Death rides on a horse' అనే పిక్చర్ నేను వారితో కలిసి చూశాను.

ఆయన వేషంలో సంప్రదాయం, చూసే సినిమాలు మోడర్న్‌వి. తర్వాత ఆయన గ్రంథాలను ఉత్సుకతతో చదివాను. విశ్వనాథవారు మూలాల్ని ఎక్కడినుండి గ్రహించలేదు. ఆంగ్ల రచనలను డేగ కళ్ళతో చూసేవారు. దాన్ని తమ వైద గ్ధ్యంతో రేఖామాత్రంగా ఉన్న మెరుపుకు అందాలు సంతరింపజేసేవారు. అందు వల్ల ఆయనమీద ఆంగ్లప్రభావం ఉందని చెప్పవచ్చు. కాని, నిరూపించడం కష్టం. రామాయణంలో అడవి వర్ణన గురించి చెబుతూ, 'నేను జిమ్ కార్బెట్, ఆండర్ సన్, స్వింగ్ మొదలగువారి రచనలు చదివినపుడు వాళ్ళ అడవుల వర్ణనలలో లీనమై పోయేవాణ్ణి. ఆ అనుభూతితో అడవి వర్ణనలు చేశాను' అన్నారు విశ్వ నాథ. ఇంగ్లీషు వాళ్ళలో గొప్ప టెక్నిక్ ఉంది, దాన్ని గ్రహించాలనేవారు. అలాగే ఆయన గ్రహించారు. పిక్చర్ ఆఫ్ డోరిష్ నవలను బాగా చదివి ఆ గ్రంథంలోని అంశాన్ని విశ్వనాథ గ్రహించి, చెలియలికట్ట వ్రాశారు.

'జేబుదొంగ' నవలలో అప్పుడు, అవధాని అనే పాత్రలు చిన్న ప్పుడు దొంగతనాలు చేశారు. తర్వాత అవధాని మేజిస్ట్రేట్ అయ్యాడు. అప్పుడు మాత్రం దొంగతనాలు చేస్తూ అవధాని పనిచేసే కోర్టుకే వచ్చాడు. అతని కితడు శిక్ష వేశాడు. ఈ విషయాన్ని షేక్స్పియర్ నవలలోంచి గ్రహించారు విశ్వనాథ. జోనాథన్ స్విఫ్ట్ వ్రాసిన 'గలివర్ ట్రావెల్స్' అనే గ్రంథం ప్రేరణతో 'హాహా హూహూ' వ్రాశారు. 'జీవుని వేదన' అనే టర్మ్‌ను 'Driving Force' అనే ఆంగ్ల పదబంధం నుండి గ్రహించారు. 'వేయి పడగలు' నవలపై 'డాస్టో విస్కీ' నవల ప్రభావం ఉంది. ఇలా ఆయన సాహితీ వ్యక్తిత్వం సువిశాల మైనది. దానిలో 'ఇది ఇదీ' అని చెప్పడం కష్టం. గొప్ప సాహితీసంపన్నులైన వారి కీవిధంగా నేను నివాళు లర్పిస్తున్నాను" అన్నారు.

శ్రీ పేరాల భరతశర్మగారు 'విశ్వనాథ భావుకత' గురించి రసార్ద్రంగా ప్రసంగించారు. రామాయణ కల్పవృక్షంలోని కొన్ని పద్యాలను సుమధురంగా వినిపించి, అందలి భావుకతను విశ్లేషించారు. వారు ప్రసంగిస్తూ, "విశ్వనాథ అనేక సంస్కృతాంగ్లాంధ్ర గ్రంథాలు చదివారు. 'ఈ కథార్థానంత విజ్ఞానమే విశ్వమును వెలిగించు' నన్నారు బాలకాండలో. ఉర్విలోని మహాకవి, యోగివంటి వారు విశ్వనాథ. ఆయన మీద వచ్చే విమర్శలకు ఆయన ముందే సమాధానాలు వ్రాసిపెట్టాడు. వేయి పడగలులో ఆద్యంత సమన్వయం లేదు కాని, విశ్వనాథ జీవితంలో ఆద్యంత సమన్వయం ఉంది. ఆయనను కవిరాక్షసు డంటారు. ఇది

వాస్తవమే. 'సీతోపనిషత్తు' అని ఒకటి ఉంది. అది దేశంలోని 'ప్రతి అణువు సీతయే' అని చెబుతుంది. రామాయణ కల్పవృక్షంలో విశ్వనాథ ఆమెను అలా వర్ణించారు. తన భావంలో ఒక Consistency పెడతారాయన. విశ్వనాథవారి రసమయమైన వాక్కులో మనం ఓలలాడాలంటే రామాయణ కల్పవృక్షం చదివి తీరాలి. విశ్వనాథను కవి కాదంటే ఎవరూ కవి కాకుండాపోతారు. 'నేనుపోతే ఎవరేడుస్తారు? నేనుపోతే పేపర్లు ఎవరని ఏడుస్తాయి? నా పుస్తకాలు చదివితే నాకు తృప్తి' అన్నారు విశ్వనాథ" అని చెప్పారు.

ఈ సమావేశంలో సుప్రసిద్ధ అష్టావధాని, సోషల్‌వెల్ఫేర్ రెసిడెన్షియల్ స్కూల్ సొసైటీ డిప్యూటీసెక్రెటరీ శ్రీ రాళ్ళబండి కవితాప్రసాద్‌గారు విశ్వనాథ వారికి తమ వివిధ వృత్తాలలో వ్రాసిన పద్యాలను కవితానీరాజనంగా సమర్పించారు. మొదట డాక్టర్ ముదిగొండ వీరభద్రయ్యగారు సభకు స్వాగతం పలికారు. చివర యువభారతి ఉపాధ్యక్షురాలు శ్రీమతి కె. బి. లక్ష్మిగారు వందన సమర్పణ చేశారు.

## పన్నెండవ సమావేశం :

6-8-1995 నాడు జరిగింది. యువభారతి పన్నెండు నెలలుగా విశ్వనాథ సాహితీ సమాలోచనం కార్యక్రమాన్ని నిర్విరామంగా, నిరాటంకంగా, విజయవంతంగా నిర్వహిస్తూ వుంది. పన్నెండవ సమావేశం చివరిది కాబట్టి ఎక్కువమంది వక్తలు పాల్గొనడానికి వీలుగా రెండు భాగాలుగల సెమినారుగా నిర్వహించడం జరిగింది. దీనిలో 13 మంది వక్తలు, ముగ్గురు కవులు పాల్గొన్నారు. కార్యక్రమాన్ని యువభారతి అధ్యక్షులు ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యంగారు ప్రారంభిస్తూ "యువభారతి పన్నెండు నెలలుగా విశ్వనాథ వారి శతజయంతి ఉత్సవాలను జరుపుతూ ఉంది. ఆంధ్రదేశంలో విశ్వనాథ గురించి ఆలోచించే వారినందరినీ ఈ కార్యక్రమాల్లో పాల్గొనేట్లుగా చేయలేకపోయాం. పన్నెండు నెలలు మాకు సరిపోలేదు. వారి ఒక్కొక్క గ్రంథంమీద ఒక్కొక్క సమావేశం ఏర్పాటుచేసి ఒక పెద్ద ఉపన్యాసం ఏర్పాటు చేసినా వారి సాహిత్యానికి న్యాయం చేసినవారం కాము" అన్నారు.

సభకు అధ్యక్షత వహించిన శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులుగారు మాట్లాడుతూ, "విశ్వనాథ వారిని మాట్లాడే వెన్నెముక, పాటపాడే సుమన్న

అన్నారు శ్రీశ్రీ వెన్నెముక ధైర్య సాహసాలకు చిహ్నం. తెలుగువారిలో విశ్వనాథవారు ధైర్య సాహసాలకు ప్రతినిధి. రామాయణ కల్పవృక్షం అయోధ్య కాండలో విశ్వనాథ అతిథి మర్యాదలను చక్కగా చిత్రించారు. రామాయణ కథ మన తెలుగుదేశంలోనే జరిగిందా! అన్నట్లు వ్రాశారు. విశ్వనాథ దారిద్ర్యంతో బాధపడ్డా ఏనాడూ ఎవరికీ శిరసు వంచలేదు. ఆత్మస్థైర్యంతో ముందుకు సాగేవాడు. తానను కొన్న భావాలను విశ్వనాథ నిర్భయంగా వ్రాసేవాడు. 'కలిలో దైవము లేదు, దైవమనగా ద్వేషమైపోయె....' అని నిర్భయంగా వ్రాశారు." అన్నారు.

ఈ మొదటి సదస్సులో డా॥ కె. రుక్నుద్దీన్‌గారు ''కిన్నెరసాని తెలుగింటి దొరసాని'' అనే అంశంపై, డా॥ టి శ్రీరంగస్వామిగారు ''విశ్వనాథ వారి కృష్ణకావ్యాలు'' అనే అంశంపై, డా॥ ఎన్. నిర్మలాదేవిగారు ''విశ్వనాథ-కృష్ణశాస్త్రి'' అనే అంశంపై, డా॥ ఎం. చెన్నప్పగారు ''తెలుగు ఋతువులు'' గురించి, డా॥ జి. యస్. లక్ష్మిగారు ''కిన్నెరసాని పాటలు - వాక్యలయ'' అనే అంశంపై, డా॥ వి. నిత్యానందరావుగారు ''విశ్వనాథ హాస్యం'' అనే అంశంపై ప్రసంగించారు.

శ్రీ అయాచితుల హనుమచ్ఛాస్త్రిగారు, శ్రీ జి. సుబ్రహ్మణ్యశాస్త్రిగారు (నంద్యాల) విశ్వనాథ వారికి కవితా నీరాజనం సమర్పించారు. మొదట యువభారతి సంయుక్త కార్యదర్శి శ్రీ రెడ్డి రాఘవయ్యగారు సభకు స్వాగతం పలుకగా, మరొక సంయుక్త కార్యదర్శి శ్రీ టి. మురళీధర గౌడ్‌గారు వందన సమర్పణ చేశారు.

పన్నెండవ సమావేశంలో భాగంగా రెండవ సదస్సు తేదీ 6-8-1995 సాయంకాలం గం॥ 5.30. ని. లకు ప్రారంభమైంది. ఈ సభకు అధ్యక్షత వహించిన ఆచార్య కొండముది శ్రీరామచంద్రమూర్తిగారు సభను ప్రారంభిస్తూ "విశ్వనాథ బతికి ఉన్నప్పుడు తుఫాన్. ఇప్పుడూ ఆయన తుఫానే. వ్యక్తిగా ఎంతటి సమున్నతుడో, అంతటి సాహితీ సంస్కారాన్ని పొదవుకొన్న అద్భుతమైన, మహనీయమైన వ్యక్తి. ఆయన రచనల్లో ఉన్న విశిష్ట వ్యక్తిత్వానికి ఆంధ్రదేశం సమ్మోహితమైంది. ఒకనాడు నన్నయ, మరోనాడు శ్రీనాథుడు, ఈనాడు విశ్వనాథ - వీరంతా సంప్రదాయ యోధులు-దేశం చిరంతనంగా ఉండాలని, పచ్చగా వదికాలాలపాటు మనాలని భావించి రచనలు చేశారు. తెలుగు (కవితా)వైభవం

అనగానే విశ్వనాథను స్మరింపక తప్పదు. విశ్వనాథలా నవలలు, కావ్యాలు, విమర్శలు, గేయాలు, కథలు వ్రాసిన వారున్నారా? గొప్ప కావ్యాలు, గొప్ప నవలలు, గొప్ప విమర్శలు, గొప్ప గేయాలు, గొప్ప కథలు వ్రాసిన వారుండ వచ్చు. కాని అన్ని ప్రక్రియలను ఈ విధంగా అందించిన వారులేరు. He was a concious writer. పదం తెలిసి, దాని అర్థం తెలిసి ప్రయోగించేవారు. విశ్వనాథవారి వెనకాల ఏ రాజకీయ సంస్థగాని సాహిత్య సంస్థగాని లేదు - ఆయన స్వయంగా తన సాహిత్యాన్ని తానే వ్యాఖ్యానించుకున్నారు. యువభారతిలాగా పన్నెండు నెలలు ఆయన సాహిత్యం మీద సమావేశాలు జరిపిన వారు లేరు'' అన్నారు.

ఈ రెండవ సదస్సులో డా॥ వై. కామేశ్వరిగారు ''విశ్వనాథ కవితలో నేను" అనే అంశాన్ని గురించి, డా॥ బి. జయరాములుగారు ''బాలరాముడు - వాల్మీకి - విశ్వనాథలు" అనే అంశం గురించి, డా॥ ఎ. వెంకటరామిరెడ్డిగారు ''విశ్వనాథ శబరీ వృత్తాంతం - అలంకార ప్రయోగం" అనే అంశాన్ని గురించి, శ్రీ ముళ్ళపూడి సచ్చిదానందమూర్తిగారు ''విశ్వనాథ మధ్యాక్కఱలు'' గురించి, డా॥ ఎం. లావణ్య సరస్వతిగారు ''పురాణవైర గ్రంథమాల - చంద్రగుప్తుని స్వప్నం" అనే అంశంపై, శ్రీమతి కె.బి. లక్ష్మిగారు ''కాశ్మీర రాజవంశ నవలలు" అనే అంశం గురించి, శ్రీ భమిడిపాటి కృష్ణమూర్తిగారు "విశ్వనాథ వారిపై వచ్చే విమర్శలకు కుమారస్వామి పాత్ర సమాధానం" అనే అంశం గురించి ప్రసంగించారు.

ఈ సభలో దైవజ్ఞ శిరోమణి శ్రీ మహాకాళి వెంకటరావుగారు విశ్వనాథ వారికి కవితా నీరాజనం సమర్పించారు. సంస్థ ఉపాధ్యక్షులు డాక్టర్ తిరుమల శ్రీనివాసాచార్యులుగారు సంస్థ పరిచయం చేశారు. మొదట సంస్థ సంయుక్త కార్యదర్శి శ్రీమతి చిల్లర భవానీదేవిగారు సభకు స్వాగతం పలుకగా, కార్యవర్గ సభ్యులు శ్రీ పరవస్తు కృష్ణస్వామిగారు వందన సమర్పణ చేశారు.

## మరికొన్ని కార్యక్రమాలు :

"విశ్వనాథ సాహితీ సమాలోచనం" కార్యక్రమాలు ఉద్యమంలా నిర్వహిస్తూనే యువభారతి జనవరి 1995 లో రెండు గొప్ప కావ్యాలను ప్రచురించి ఆవిష్కరింపజేసింది. వాటిలో తేది 4-1-1995 నాడు ప్రవాసాంధ్ర ప్రౌఢ పద్య కావ్యకవి డాక్టర్ తిరుమల కృష్ణదేశికాచార్యులుగారు రచించిన "మహా శిల్పి

జక్కన చరిత్రము" అనే పద్య కావ్యాన్ని జ్ఞానపీఠ పురస్కార గ్రహీత, పద్మ భూషణ్ ఆచార్య సి. నారాయణరెడ్డిగారు ఆవిష్కరించారు. ఈ సభకు యువభారతి అధ్యక్షులు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు అధ్యక్షత వహించారు. ఈ కావ్యాన్ని శ్రీమాన్ ఉత్పల సత్యనారాయణాచార్యులుగారు, శ్రీ ఏలూరుపాటి అనంతరామయ్యగారు సమీక్షించారు. కావ్యకర్త డాక్టర్ తిరుమల కృష్ణదేశికా చార్యులుగారు తమ అనుభూతిని, స్పందనను వ్యక్తపరిచారు.

తేది 8.1.1995 నాడు యువకవి, యువభారతి సంయుక్త కార్యదర్శి అయిన శ్రీ తాళ్ళపల్లి మురళీధరగౌడుగారు రచించిన "ప్రశ్నార్థకాలు" అనే వచన కావ్యాన్ని పద్మభూషణ్ ఆచార్య సి. నారాయణరెడ్డిగారు ఆవిష్కరించి, అందులోని మెరుపులను వివరించారు. ఈ సభకు శ్రీ కె. వి. రమణ I.A.S. గారు అధ్యక్షత వహించారు. కవి కౌస్తుభ ఆచార్య తిరుమలగారు, శ్రీ వోలేటి పార్వతీశంగారు కావ్యాన్ని సమీక్షించారు. డాక్టర్ తిరుమల శ్రీనివాసాచార్యులు గారు, శ్రీ సామల వేణుగారు కావ్యకర్తకు శుభాకాంక్ష లందజేశారు. కావ్యకర్త శ్రీ టి. మురళీధరగౌడుగారు తమ అనుభూతిని వ్యక్తపరచారు.

విశ్వనాథ సాహితీ సమాలోచనం కార్యక్రమం ప్రారంభానికి ముందు యువ భారతి అనేక 'సమాలోచనం' కార్యక్రమాలను నిర్వహించింది. తేది 2.1.1994 నాడు "1993 సాహితీ సమాలోచనం" కార్యక్రమం నిర్వహించింది. ఈ సభకు ఆచార్య నాయని కృష్ణకుమారిగారు అధ్యక్షత వహించారు. 1993 లో వచ్చిన కవిత్వం గురించి డాక్టర్ కసిరెడ్డి వెంకటరెడ్డిగారు, విమర్శ గురించి డాక్టర్ ముదిగొండ వీరభద్రయ్యగారు, నవలల గురించి శ్రీమతి అడివి సూర్యకుమారి గారు ప్రసంగించారు.

యువభారతి 30 వ వార్షికోత్సవాలను ఫిబ్రవరి, మార్చి నెలలలో రెండు సమావేశాలుగా 'లహరి' కార్యక్రమాన్ని ఏర్పాటు చేయడం జరిగింది. ఈ సమా వేశాలలో వివేకానందుని జీవితం - బోధనల గురించి ఉపన్యాసా లిప్పించడం జరిగింది. మొదటి సమావేశం తేది 6.2.1994 నాడు జరిగింది. డాక్టర్ జె. బాపురెడ్డి IAS గారు ఈ సభకు అధ్యక్షత వహించారు. పూజ్యపాదులు శ్రీ పరమార్థానంద స్వామీజీ గారు "వివేకానందలహరి" ఉపన్యాస పరంపరను ప్రారంభించి, తమ సందేశాన్నందించారు. ఈ కార్యక్రమానికి ముఖ్య అతిథిగా విచ్చేసిన పద్మభూషణ్ ఆచార్య సి. నారాయణరెడ్డిగారు డాక్టర్ చల్లా రాధాకృష్ణ

శర్మగారు రచించిన "తెలుగు, తమిళ కవిత్వాలు: జాతీయవాదం" అనే గ్రంథాన్ని ఆవిష్కరించి ఉపన్యసించారు. ఈ సభలో ''వివేకానంద జీవితం: సందేశం'' అనే అంశంపై రాష్ట్రకవి డాక్టర్ ఓగేటి అచ్యుతరామశాస్త్రిగారు, ''ఆధునిక జీవితం: అనుష్ఠాన వేదాంతం'' అనే అంశంపై శ్రీ వాకాటి పాండు రంగారావుగారు ప్రసంగించారు

రెండవ సమావేశం తేది 6-3-1994 నాడు జరిగింది. ఈ కార్యక్రమానికి శ్రీ కె.వి. రమణ IAS గారు అధ్యక్షత వహించగా, శ్రీ పి. వి. రాజేశ్వరరావు గారు ముఖ్య అతిథిగా విచ్చేసి ''వివేకానందలహరి"ని ఆవిష్కరించి తమ సందేశాన్నందించారు. ఈ సభలో కుమారి డాక్టర్ కమలాజయరావుగారు ''సమాజంలో స్త్రీ: వివేకానందుని దృక్పథం" అనే అంశం గురించి, డాక్టర్ ప్రొద్దుటూరి ఎల్లారెడ్డిగారు ''వివేకానందుడు: యువత" అనే అంశం గురించి ప్రసంగించారు. ఈ కార్యక్రమంలో విశిష్ట అతిథులుగా శ్రీ కోదాటి నారాయణ రావుగారు, డాక్టర్ జె. బాపురెడ్డి IAS గారు పాల్గొన్నారు. ఈ విశిష్ట అతిథులు యువభారతి రజతోత్సవాలలో నిర్వహించిన ఉపన్యాసమంజరులు ఇతరాలు మొత్తం ఐదు పుస్తకాలుగా రాగా వాటిని ఈ సభలో ఆవిష్కరించి ప్రసంగించారు. ఈసభలో ఆవిష్కరింపబడిన పుస్తకాలు 1. కొత్త గొంతుకలు; సరికొత్త విలువలు, 2. విద్యా వైద్యశాస్త్ర కళారంగాలు : మానవతా విలువలు, 3. స్త్రీవాద ధోరణులు : సమకాలీన సాహిత్యం, 4. సాహితీ సమాలోచనం 1992 & 1993, 5. ఆధునిక సాహిత్యం : దళిత స్పృహ.

'సమాలోచనం' కార్యక్రమంలో తేది 3-4-1994 నాడు "చలం - అరుణా చలం'' అనే అంశంపై సాహితీ సదస్సు నిర్వహింపబడింది. దీనిలో ఆచార్య కోవెల సంపత్కుమారాచార్యులుగారు అధ్యక్షులుగా, శ్రీ వాకాటి పాండురంగా రావుగారు ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. ఈ సదస్సులో చలం జీవితం, సాహితీ జీవితంలోని పరిణామాల గురించి శ్రీమతి తురగా జానకీరాణిగారు, డాక్టర్ అక్కిరాజు రమాపతిరావు గారు, డాక్టర్ ముదిగొండ వీరభద్రయ్యగారు ప్రసంగించారు.

తేది 1-5-1994 నాడు యువభారతి ఉపాధ్యక్షులు డాక్టర్ తిరుమల శ్రీనివాసాచార్యులుగారి అధ్యక్షతన ''కవి సమ్మేళనం'' జరిగింది. దీనిలో యువ కవులనేకులు పాల్గొని తమ కవితలను వినిపించారు. అలాగే తేది 5-6-1994

నాడు కూడా రసజ్ఞులైన శ్రోతల కోరికలపై డా. తిరుమల శ్రీనివాసాచార్యులు గారి అధ్యక్షతన మళ్ళీ ''కవిసమ్మేళనం'' ఏర్పాటు చేయడం జరిగింది.

'సమాలోచనం'లో భాగంగా తేది 3.7.1994 నాడు ''బసవరాజు అప్పారావు సాహితీ సమాలోచనం'' ఏర్పాటు చేయబడింది.

ఈ సభకు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు అధ్యక్షత వహించగా, డాక్టర్ జె. బాపురెడ్డి IAS గారు ముఖ్య అతిథిగా విచ్చేశారు. డాక్టర్ జి. చెన్నకేశవరెడ్డిగారు, శ్రీ పాలగుమ్మి విశ్వనాథంగారు, శ్రీ ఓలేటి పార్వతీశంగారు బసవరాజుగారి జీవితం, సాహితీ జీవితాల గురించి ప్రసంగించారు.

తేది 7.8.1994 నాడు యువభారతి ఉపాధ్యక్షురాలు శ్రీమతి కె.బి. లక్ష్మి గారి అధ్యక్షతన మరొకసారి "కవి సమ్మేళనం" ఏర్పాటు చేయబడింది. ఈ సమ్మేళనంలో యువకవులు విరివిగా పాల్గొన్నారు.

తేది 17.8.1995 నాడు డాక్టర్ ముదిగొండ వీరభద్రయ్యగారు రచించిన "రావిశాస్త్రిగారి ధర్మేతిహాసం : మూడు కథల బంగారం నవల : విమర్శ'' అనే గ్రంథాన్ని పద్మభూషణ్ ఆచార్య సి. నారాయణరెడ్డిగారు ఆవిష్కరించారు. ఈ గ్రంథాన్ని రచయిత ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారి షష్టిపూర్తి కానుకగా వారికి అంకితమిచ్చారు. ఈ సభకు శ్రీవాకాటి పాండురంగారావుగారు అధ్యక్షత వహించారు. ఆచార్య రవ్వా శ్రీహరిగారు గ్రంథకర్తకు, స్వీకర్తకు శుభాకాంక్ష లందజేశారు. శ్రీ ఫణికుమార్ IAS గారు, డాక్టర్ అక్కిరాజు రమాపతిరావు గారు గ్రంథాన్ని పరిచయం చేశారు.

యువభారతి అధ్యక్షులు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారు 'ఆంధ్రభూమి' దినపత్రికలో 'జీవియస్ కాలం' గా వ్రాసిన వ్యాసాల సంపుటి ''కాలమానం'' అనే గ్రంథాన్ని తేది 27.8.1995 నాడు యువభారతి ఆవిష్కరింపజేసింది.

ఈ సభలో శ్రీ ఎస్. కొండల్‌రావుగారు ''కాలమానం'' గ్రంథాన్ని ఆవిష్కరించారు. ఈ గ్రంథాన్ని ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు పద్మభూషణ్ ఆచార్య సి. నారాయణరెడ్డిగారికి అంకితమిచ్చారు.

ఈ సభలో ఆచార్య చేకూరి రామారావుగారు, ఆచార్య ఎన్. గోపిగారు గ్రంథ పరిచయం చేశారు.

తేది 3.9.1995 నాడు "విశ్వనాథ సాహితీ సమాలోచనం" పుస్తకావిష్కరణ పద్మభూషణ్ ఆచార్య సి. నారాయణరెడ్డి గారు చేశారు - ఇది ముగింపు సమావేశం. ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారు వ్రాసిన 'విశ్వనాథ నవ్యసంప్రదాయం' అనే గ్రంథాన్ని కూడా ఈ సభలో వారు ఆవిష్కరించి ప్రసంగించారు. ఈ గ్రంథాన్ని తిరుమల - తిరుపతి దేవస్థానం బోర్డు ఛైర్మన్ శ్రీ పల్లంపాటి వెంకటేశ్వర్లు గారికి రచయిత అంకితమిచ్చారు.

'యువభారతి' తన 32వ వార్షికోత్సవాన్ని ఈ సభలో జరుపుకుంది. ఈ సభలో యువభారతి అధ్యక్షులు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు విశ్వనాథ సాహితీ మూర్తిమత్వాన్ని విశదీకరించారు. సంస్థ కార్యదర్శి డా. బి. జయరాములు గారు యువభారతి' కార్యక్రమాలను వివరిస్తూ నివేదికను సమర్పించారు. సంస్థ కోశాధికారి డా, జి. విద్యానాథ్‌గారు సంస్థకు ఆర్థిక సహాయాన్నందింకన వదాన్యులకు ధన్యవాదాలు తెలిపారు. ఈ సభలో 'విశ్వనాథ సాహితీ సమాలోచనం' గ్రంథాన్ని శ్రీ పి. నాగరాజుగారు, 'విశ్వనాథ నవ్య సంప్రదాయం' అనే గ్రంథాన్ని డా. ముదిగొండ వీరభద్రయ్యగారు పరిచయం చేశారు. ఈ సభకు శ్రీ కె.వి. రమణ ఐ.ఏ ఎస్ గారు అధ్యక్షత వహించారు. శ్రీజవ్వాది గౌతమ రావుగారు సుమారు ఒక గంటసేపు రామాయణ కల్పవృక్షంలోని శివధనుర్భంగం, పట్టాభిషేకం ఘట్టాలను పాడి శ్రోతలను ఆనంద పరవశులను జేశారు. వేదిక మీద ఆసీనులైన పెద్దలను శ్రీ పి.యస్. మూర్తిగారు (మెసర్స్ అలైడ్ అగ్రో కన్సల్‌టెన్ట్స్ ప్రైవేట్ లిమిటెడ్) సన్మానించారు. సంస్థ కార్యదర్శి డా. బి. జయరాములు మొదట సభకు స్వాగతం పలుకగా, సంస్థ ఉపాధ్యక్షురాలు శ్రీమతి కె.బి. లక్ష్మిగారు వందన సమర్పన చేశారు.

ఈవిధంగా సాహిత్య క్షేత్రంలో రాజనాలను పండించిన కవులను గురించి, రచయితలను గురించి, పండితులను గురించి, బహుముఖ ప్రజ్ఞావంతులను గురించి 'సమాలోచనం' కార్యక్రమాలను నిర్వహిస్తూ ఆ ప్రతిభామూర్తులకు యువభారతి నీరాజనాలు అందిస్తూ వున్నది.



With best compliments from :

# Sri Y. Krishna Reddy

Railway Contractor



8-3-678/31, Pragathinagar,

YUSUFGUDA,

HYDERABAD

Phone : 399286

# VISWANATHA SAHITI SAMALOCHANAM



YUVABHARATHI PUBLICATION